శ్రీ ర స్తు.

శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యకృత

# ఉపదేశసాహస్రి

బ్రహ్మశ్రీ, పండిత

పేరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే

రచియింపఁబడిన

## ఆంధ్రతాత్పర్యసహితము



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్ సన్స్ వారిచేఁ

ప్రకటితము.

1933.

శ్రీ

# ఉపదేశసాహస్రి

యను వేదాంతప్రకరణగ్రంథమునకు

## ఉపోద్ఘాతము.



'ఉపదేశసాహస్రి' యను పేరుగల ఈగ్రంథరత్నము వేదాన్తశాస్త్రమునకు చెందిన ప్రకరణగ్రంథము. ఈగ్రంథరత్నమును శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యులవారు ముముక్షుజనహితార్థము గద్యపద్యాత్మకముగ రచించిరి. ప్రకరణగ్రంథలక్షణమును విద్వాంసులీవిధముగ పేర్కొనియున్నారు:-

శ్లో. శాస్త్రైకదేశవిషయం శాస్త్రకార్యాంతరేస్థితమ్,
ఆహుః ప్రకరణం నామ గ్రంథభేదం మనీషిణః.

### శ్రీశంకరుని జన్మకాలము.

శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యులవారు వైదికమతసంరక్షణార్థము భూమియం దవతరించినకాల మెప్పు డను విషయము నిర్వివాదముగ 'ఇదమిత్థ'మని నిర్ణయింపనలవిగాకయున్నది. శృంగేరి, జగన్నాథ, ద్వారకా, కుంభకోణక్షేత్రములందుగల శంకరమఠములవారు పరస్పరవిరుద్ధముగ ఆచార్యజన్మసమయమును సూచించుచున్నారు. మాధవీయశంకర

విజయాదిగ్రంథములు శ్రీశంకరజన్మకాలమునుగూర్చి ఫలాని
శకముయొక్క ఫలానిసంవత్సరమునందు ఆచార్యులవారు
జన్మించిరని చెప్పియుండలేదు.

## వివిధ జగద్గురుపీఠములందుఁగల శ్రీ శంకరాచార్యజననకాలనిర్ణయము.

౧ శ్రీమజ్జగద్గురు శృంగేరీపీఠమునందుఁగల జగద్గురుపరం
పరయందు విక్రమశకము ౧౪-వ సంవత్సరమునకు సరి
యయిన ఈశ్వరసంవత్సరమున (క్రి - శ - బి - సి ౩౬)
ఆచార్యులవారు జన్మించిరని గలదు.

౨ శ్రీ కాంచి కామకోటి జగద్గురుపీఠమునందుగల జగ
ద్గురుపరంపరయందు యుధిష్ఠిరశకము ౨౬౬౩ (క్రి-శ-
బి-సి 503) శంకరాచార్యుఁడు జన్మించి యుధిష్ఠిర
శకము ౨౬౯౫ (క్రి-శ-బి-సి-౪౭౬) నకు సరియగు
రక్తాక్షిసంవత్సర వైశాఖశుద్ధ ఏకాదశియందు సిద్ధిపొం
దినటులఁగలదు.

౩ పూరి (జగన్నాథ) జగద్గురుపీఠపరంపరయందు యుధి
ష్ఠిరశకము ౨౬౫౫ వైశాఖశుద్ధదశమియందు శ్రీశంక
రులవారు జగన్నాథపీఠమును స్థాపించి పద్మపాదా
చార్యులవారిని తత్పీఠాధిపత్యమునందు నియమించి
నటుల గలదు

౪ ద్వారకా (శారదాపీఠ) జగద్గురుపరంపరయందు—

౧ యుధిష్ఠిరశకము ౨౬౩౩ సం॥ వైశాఖశుద్ధ పంచమి
యందు శంకరుఁడవతరించెననియు,

౨ యుధిష్ఠిరశకము ౨౬౩౬ సం॥ చైత్రశుద్ధ నవమి యందు ఉపనయనమనియు,

౩ యుధిష్ఠిరశకము ౨౬౩౯ సం॥ కార్తికశుద్ధ ఏకాదశియందు సన్న్యాసాశ్రమస్వీకారమనియు,

౪ యుధిష్ఠిరశకము ౨౬౪౦ సం॥ ఫాల్గుణశుద్ధ ద్వితీయ యందు శ్రీమద్గోవిందభగవత్పూజ్యపాదులవారికడ బ్రహ్మోపదేశమును పొందిరనియు,

౫ యుధిష్ఠిరశకము ౨౬౪౦—౨౬౪౬ సం॥ పర్యంతము బదర్యాశ్రమమునందునివసించి భాష్యములనొనర్చుట, బదరీనారాయణప్రతిష్ఠ, జ్యోతిర్మఠనిర్మాణమనియు,

౬ యుధిష్ఠిరశకము ౨౬౪౭ సం॥ కార్తికశుక్ల అష్టమి యందు శ్రీవేదవ్యాసులవారితోడ సంవాదమనియు,

౭ యుధిష్ఠిరశకము ౨౬౪౭ సం॥ మార్గశిరబహుళ తృతీయయందు మండనమిశ్రునితోడ వాదారంభమనియు,

౮ యుధిష్ఠిరశకము ౨౬౪౮ సం॥ చైత్రశుద్ధచతుర్థి యందు మండనపరాజయమనియు,

౯ యుధిష్ఠిరశకము ౨౬౪౮ సం॥ చైత్రశుద్ధషష్ఠియందు సరస్వతితోడ వాదారంభమనియు,

౧౦ యుధిష్ఠిరశకము ౨౬౪౮ సం॥ చైత్రబహుళఅష్టమియందు పరకాయప్రవేశవిద్యచేత అమరుకరాజదేహప్రవేశమనియు,

౧౧ యుధిష్ఠిరశకము ౨౬౪౮ సం॥ చైత్రబహుళత్రయోదశియందు మరల స్వదేహప్రవేశమనియు,

౧౨ యుధిష్ఠిరశకము ౨౬౪౭ సం॥ కార్తికబహుళ త్రయోదశియందు బ్రహ్మలోకమునకు పోవుచున్న సరస్వతిని చింతామణిమంత్రముచేత ద్వారకయందుండు నటుల ఆకర్షించుటయు,

౧౩ యుధిష్ఠిరశకము ౨౬౪౭ సం॥ కార్తికబహుళ పంచమియందు ద్వారకయందు సరస్వతి సంస్థాపనమనియు,

౧౪ యుధిష్ఠిరశకము ౨౬౪౭ సం॥ కార్తికబహుళ త్రయోదశి మొదలు మాఘశుద్ధ దశమీపర్యంతము ద్వారకయందు శారదాపీఠనిర్మాణము, బౌద్ధాదిపరాజయము, భగవదాలయనిర్మాణము, యాదవేంద్రప్రతిష్ఠ, సిద్ధేశ్వరమందిరనిర్మాణము, భద్రకాళీయంత్రోద్ధారము మున్నగునవి యనియు,

౧౫ యుధిష్ఠిరశకము ౨౬౪౭ సం॥ ఫాల్గుణశుద్ధనవమి మొదలుకొని శృంగేరిమఠసంస్థాపనము,

౧౬ యుధిష్ఠిరశకము ౨౬౪౮ సం॥ చైత్రశుద్ధనవమి యందు మండనమిశ్రునకు సంన్యాసాశ్రమముఇప్పించి సురేశ్వరాచార్యుఁడను యోగపట్టము నొసంగుట.

౧౭ యుధిష్ఠిరశకము ౨౬౪౮ సం॥ మార్గశీర్ష శుద్ధదశమియందు సుధన్వసార్వభౌముని శిష్యునిగా పరిగ్రహించుటయు,

౧౮ యుధిష్ఠిరశకము ౨౬౪౮ సం॥ మాఘశుద్ధ సప్తమియందు సురేశ్వరాచార్యుని ద్వారకాపీఠమునం దభిషేకమొనర్చుట.

౧౯ యుధిష్ఠిరశకము ౨౬౫౦ సం॥ వైశాఖశుద్ధద్వితీయనుండి దిగ్విజయారంభము.

౨౦ యుధిష్ఠిరశకము ౨౬౫౩ సం॥ శ్రావణశుద్ధసప్తమియందు తోటకాచార్యుని శిష్యునిగా గ్రహించుట.

౨౧ యుధిష్ఠిరశకము ౨౬౫౪ సం॥ ఆశ్వయుజశుద్ధ ఏకాదశియందుహస్తామలకాచార్యుని శిష్యునిగాగ్రహించుట.

౨౨ యుధిష్ఠిరశకము ౨౬౫౪ సం॥ పుష్యశుద్ధ పూర్ణిమయందు హస్తామలకాచార్యుని శృంగేరిపీఠమునందు అభిషేకించుట.

౨౩ యుధిష్ఠిరశకము ౨౬౫౫ సం॥ వైశాఖశుద్ధదశమియందు పురుషోత్తమక్షేత్రము (జగన్నాథము) నందు దారుమయ జగన్నాథస్వామి ప్రతిష్ఠ, మఠమర్యాదాస్థాపనము, గోవర్ధనమఠస్థాపనము, పద్మపాదాచార్యుని ఆపీఠమునం దభిషేక మొనర్చుట.

౨౪ యుధిష్ఠిరశకము ౨౬౬౨ సం॥ భాద్రపదశుద్ధ పూర్ణిమ మొదలు ౨౬౬౨-వ సం॥ పుష్యశుద్ధ పూర్ణిమవఱకు అవిచ్ఛిన్నదిగ్విజయయాత్ర, బౌద్ధాది ౧౩౨ మతముల ఖండించుట, సుధన్వాదిరాజుల శాస్త్రీయముగ ప్రజాపరిపాలన మొనర్పవలయు నని ఆజ్ఞాపించుట, తరువాత కాశ్మీరదేశమునందు శారదాపీఠము నధిష్ఠించుట.

౨౫ యుధిష్ఠిరశకము ౨౬౬౬ సం॥ కార్తికశుద్ధపూర్ణిమయందు బ్రహ్మాది దేవతాగణప్రార్థితులయి కైలాసలోకమునకు పోయిరి (సిద్ధినందిరి).

ఇటుల జగద్గురు పీఠాధిపతుల కడగల గురుపరంపర యుధిష్ఠిరశకాంత్య భాగము మొదలు విక్రమశకముయొక్క ప్రారంభములోపలనే శ్రీమచ్ఛంకరాచార్యుని అవతారకాలము ను అంగీకరించుచున్నది.

## ఆధునిక పండితులొనర్చిన కాలనిర్ణయము.

౧. కాశీనాథత్ర్యంబకతెలాంగు, హైకోర్టుజడ్జి, బొంబాయి:—

౧. బ్రహ్మసూత్ర ౨-౧-౧౭ భాష్యమునందు స్రుఘ్న పాటలీపుత్రనగరనామములను శంకరాచార్యులవారు స్మరించుటచేతను, క్రీ. శ ౭౫౦ సం॥లో ఆనగరములు నశించిపోవుటచేతను, ఆ సూత్రమునందే 'పూర్ణవర్మ'యను రాజుయొక్క నామమును శంకరాచార్యుఁడు స్మరించుటచేతను, పూర్ణవర్మయను రాజు క్రీ. శ. ౬౩౦ సం. ఉన్నటుల కన్నింగుహాముగారు నిర్ణయించి యుండుటచేతను, శంకరాచార్యులవారు ౬-వ శతాబ్దాంత్యభాగమున జన్మించియుందురు.

౨ సాంఖ్యకారికలయొక్క గౌడపాదాచార్యభాష్యము క్రీ. శ. ౫౫౭-౫౮౩-సం॥ సమీపకాలమున చైనాభాషలోనికి భాషాంతరీకరింపఁబడినటుల తెలియవచ్చుటచేత తత్ప్రశిష్యుఁడగు శంకరాచార్యుఁడు ఆకాలమునందే యుండవచ్చును.

౨ పాఠకులు. ఆర్యవిద్యాసుధాకర గ్రంథకర్తప్రభృతులమతము:—

శ్లో. నిధినాగేభవహ్న్యబ్దే విభవే మాసిమాధవే,
శుక్లే తిథౌ దశమ్యాంతు శంకరాచార్యసముద్భవః,
ఆర్యవిద్యాసుధాకరము.

శ్లో. ప్రాసూత తిష్యశరదా మతియాతవత్యా
మేకదశాధికశతోనచతుస్సహస్ర్యామ్,
సంవత్సరే విభవనామ్ని శుభేముహూర్తే
రాధే సితే శివగురోర్గృహిణీ దశమ్యామ్.
శంకరమందారసౌరభము.

తా. కలిగతాబ్దములు ౩౮౮౯ సం. (క్రీ. శ-788) విభవ సం॥ వైశాఖశుద్ధ ౧౦ తిథియందు శంకరు లవతరించిరి. రెండుశ్లోకముల అభిప్రాయ మొకటియే.

ఈమతమును మాక్సుముల్లరు ప్రభృతులగు పలువు రంగీకరింతురు.

3. టి. ఆర్. చింతామణి ప్రభృతులమతము:—

ఆచార్యులవారికంటె వయోజ్యేష్ఠులయి ఆచార్యుల వారికాలమునందున్న కుమారిలుఁడు తనశ్లోకవార్తికము నందు భర్తృహరియొక్క వాక్యపదీయమును స్మరించుట చేతను, భర్తృహరి క్రి. శ. ౬౦౦-౬౫౦ కాలమునకు చేరిన వాఁడని చీనాదేశీయుఁడగు ఇట్సింగు చెప్పియుండుటచేతను, (అతఁ డేమియు ప్రమాణముల నుదహరింపలేదు) శంకరా

చార్యుని బ్రహ్మసూత్రములమీఁద భామతియను వ్యాఖ్యను వ్రాసిన వాచస్పతిమిశ్రుఁడు 'న్యాయసూచీనిబంధనము' అను గ్రంథమును విక్రమసం॥ ౮౯౮ (క్రీ-౮౪౧) రచించినట్లు చెప్పియుండుటచేత శంకరుఁడు వాచస్పతికంటె పూర్వమునందును కుమారిలునికాలమునందును ఉండవలయును కావున క్రీ. ౬౫౫-౬౮౭ లోపల ఉండవచ్చును. క్రీ. శ. ౭౮౮-౮౨౦. అనెడి ఆర్యవిద్యాసుధాకరాదులమతము ప్రామాణికము కాజాలదు.

## ఉపదేశసాహస్రి గ్రంథవిషయము.

ఈ గ్రంథము గద్యపద్యాత్మకముగ భాగద్వయము గలది. ఇందు గద్యభాగమునందు 3 ప్రకరణములును, పద్య భాగమునందు ౧౯ ప్రకరణములును గలవు. ప్రప్రథమమున జిజ్ఞాసువులగు ముముక్షువులకు విషయము సుబోధముగ తెలియుటకుఁగాను గురుశిష్యప్రశ్నోత్తరరూపముగ కొన్ని విషయములిందు ప్రతిపాదింపఁబడినవి,

గద్యభాగమునందుఁగల 3 ప్రకరణములందు
వాక్యసంఖ్య ౧౧౬.

పద్య (శ్లోక)భాగమునందుఁగల ౧౯ ప్రకరణములందు
శ్లోకసంఖ్య ౬౭౪ గలవు.

జననమరణాదిక్లేశభూయిష్ఠమగు నీ సంసారచక్రము ఇట్టిదని తర్కింపశక్యముకానిది. ఇందు ఆధ్యాత్మికాధిదైవికాధిభౌతికతాపత్రయతప్తులగుజీవులకు అట్టితాపత్రయనివృత్తికై

ధర్మార్థకామమోక్షరూపపురుషార్థములే సమర్థములు. వీనిం జెందుటకు లోకశాస్త్రసిద్ధమయిన ఉపాయముదృష్టము,అదృష్టము ననిద్వివిధము "ఆఁకలిఁగొన్న వాఁడు భుజింపవలయును" ఈ మొదలగునవి శాస్త్రాపేక్ష లేకయే వ్యవహారసిద్ధములగును. ఏలయనఁగా, భుజించుటవలనఁ దృప్తియు, దేహపుష్టియుం గలుగునని సర్వజనులకుం దెలిసినవిషయమే. ఇత్యాదికమే దృష్టవ్యవహారము. స్వర్గమోక్షములయొక్క ఫలములు అదృష్టములగుటచేత నివి శాస్త్రాపేక్షగలవిగ నుండును. ఏలయన, నెల్లరయొక్క దృష్టి మోహముచే బద్ధమైయుండుటచేత సదసద్వివేకము లోపించియున్నది. మోహమును దొలఁగించు వివేకమునుగలిగించునది శాస్త్రముగాక వేఱొకటిలేదు. కావున సద్గురువులను ఆశ్రయించి శాస్త్రార్థరహస్యములను జనులు గ్రహింపవలసియున్నది. ఇయ్యది అదృష్టమయినది.

ఈ శాస్త్రము కర్మమును బోధించునదొకటి, బ్రహ్మమును బోధించునదొకటియు నని ద్వివిధముగనున్నది. ఈ రెండింటికినిఁ గ్రమముగ స్వర్గమును మోక్షమును ఫలములు. మహామోహముచే నంధప్రాయమగు లోకమునకు నియామకమగుశాస్త్రమే దివ్యచక్షుస్సు. ఈ శాస్త్రమునకు మూలమగు శ్రుతియే చతుర్విధపురుషార్థములను బోధించెను. గీతాదులు నీయర్థమునే వివరించెను. "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి"—(స్వర్గభోగసాధనమగు పుణ్యము క్షీణింప మఱల నరజన్మ మెత్తును) అని గీతావచనము. "న స పునరావర్తతే"—(ముక్తునకు పునర్జన్మము లేదు) అని శ్రుతి చెప్పుచున్నది. ఇట్టి మోక్షశాస్త్రమును బ్రహ్మసూత్రము లనుపేర వేదవ్యాసుల

వారచించిరి. శ్రీమద్వేదవ్యాసులురచియించిన బ్రహ్మసూత్ర జాతమునకు, భగవద్గీతలకు, ఉపనిషదాదులకు శ్రీమచ్ఛంకర భగవత్పాదులు భాష్యమును రచియించి మందాధికారు లందు దయతో మఱల వివిధములగు వేదాంతప్రకరణగ్రంథ ములను రచియించిరి. ఈ వేదాంతప్రకరణగ్రంథాభ్యాస ముచేత సుకుమారమతులుసయితము అద్వైతసిద్ధాంతము ననాయాసముగఁ దెలిసికొనఁగలరు. ఈ ప్రకరణగ్రంథములలో ప్రధానమగు నీ "యుపదేశసాహస్రి" తారామండలమున సుధాంశువువలె విలసిల్లుచున్నది. ఎట్లన, ప్రతిపక్షులు కనప ఱ్చెడి పలువిధములగునాక్షేపములన్నిఁటిని శిష్యప్రశ్నపూర్వ కముగ నుపన్యసించి యాయాక్షేపములను సదుక్తిధారచే నివారించి, యనేకవిధములుగ శిష్యులకు బోధించుటచే నీ గ్రంథమునకు "ఉపదేశసాహస్రి" యను నామము సార్థక మయ్యెను అని యీ గ్రంథరాజమును ఆమూలాగ్రముగఁ బరిశీలించెడి సుజనులకు విదితమగును. కనుక నీవచనమున విశేషోక్తిగాని, అత్యుక్తిగాని లేదు

## ఇతరగ్రంథములలో ఈగ్రంథముయొక్క ప్రశస్తి.

## ఉపదేశసాహస్రి - నైష్కర్మ్యసిద్ధి, బృహదారణ్య భాష్యవార్తికము

నైష్కర్మ్యసిద్ధి, బృహదారణ్యభాష్యవార్తికగ్రంథ కర్తయగు సురేశ్వరాచార్యుఁడు తనగ్రంథములందు ఈఉప దేశసాహస్రిగ్రంథమునుండి కొన్నిశ్లోకములను ప్రమాణార్థ ముదాహరించియున్నాఁడు:—

ఉపదేశసాహస్రి ౬-వ(విశేషాపోహ)ప్రకరణమునందుగల—

శ్లో. ఛిత్త్వాత్యక్తేన హస్తేన స్వయం నాత్మా విశిష్యతే,
తథాశిష్టేన సర్వేణ యేనయేన విశేష్యతే. ౧
తస్మాత్త్యక్తేన హస్తేన తుల్యం సర్వం విశేషణమ్,
అనాత్మత్వేన తస్మాజ్జ్ఞో ముక్తస్సర్వవిశేషణైః. ౨
విశేషణ మిదం సర్వం సాధ్వలంకరణం యథా,
అవిద్యాధ్యాసత స్సర్వం జ్ఞాతఆత్మన్యసద్భవేత్. 3
జ్ఞాత్రైవాత్మా సదాగ్రాహ్యో జ్ఞేయముత్సృజ్య కేవలః,
అహమిత్యపియద్గ్రాహ్యం వ్యపేతాంగసమం హి తత్. ౪

ఉపదేశసాహస్రి, వావిళ్ల వారికూర్పు. పుటలు ౧౮౨-౧౮౪.

అనుశ్లోకములు నైష్కర్మ్యసిద్ధియను గ్రంథమునందు చతుర్థాధ్యాయమునందు ప్రామాణ్యార్థ మీావిధముగా పీఠికలో నుదహరింపఁబడినవి:—

“ఏషసంక్షేపతః పూర్వాధ్యాయత్రయస్యార్థ ఉక్తః, సోఽయం న్యాయ్యోఽపి వేదాంతార్థః శాస్త్రాచార్య ప్రసాదలభ్యోఽపి అనపేక్షితశాస్త్రాచార్యప్రసాదః అనన్యాపేక్షిత సిద్ధస్వభావత్వాత్ కైశ్చిత్ శ్రద్ధధానైః నప్రతీయతే, తేషాంసంగ్రహార్థ మభిమతప్రామాణ్యో దాహరణమ్:—

శ్లో. భగవత్పూజ్యపాదైశ్చ ఉదాహార్యేవమేవ తు,
సువిస్పష్టోఽస్మదుక్తోఽర్థః సర్వభూతహితైషిభిః. ౧౯

అని కొంతవిషయము ననువదించి ౨౬, ౨౭, ౨౭, ౨౯ శ్లోకములుగా పరిగ్రహింపఁబడినవి.

నైష్కర్మ్యసిద్ధి. వావిళ్లవారికూర్పు. ౪-అధ్యా. పుటలు ౪౬౨, ౪౬౯-౪౭౦.

ఉపదేశసాహస్రి ౧౫-వ (నాన్యదన్యత్) ప్రకరణమునందుగల:-

శ్లో. దృశ్యత్వా దహమిత్యేషోఽనాత్మధర్మో ఘటాదివత్, తథా
ఽన్యే ప్రత్యయాజ్ఞేయా దోషాశ్చాత్మాఽమలో హ్యతః.

శ్లోకము. నైష్కర్మ్యసిద్ధి ౪-వ ప్రకరణమునందు, ౩౦-వ శ్లోకముగ గైకొనబడినది.

ఉపదేశసాహస్రి ౧౮-వ (తత్త్వమసి) ప్రకరణమునందుగల ఈ క్రింది శ్లోకములు:—

౨౬, ౭౮, ౯౬, ౯౭, ౯౯, ౧౦౧, ౧౭౪, ౧౭౫, ౧౯౦, ౧౯౧, ౧౯౨, ౨౩౨ శ్లోకములు. నైష్కర్మ్యసిద్ధి ౪-వ అధ్యాయమునందు ౪౩, ౨౦, ౨౨, ౨౩, ౨౪, ౨౫, ౩౪, ౩౫, ౩౧, ౩౨, ౩౩, ౬౫, ౬౬ శ్లోకములుగ గైకొనబడినవి. విస్తరభయముచేత శ్లోకముల నిచట వ్రాయలేదు.

ఉపదేశసాహస్రియందుగల శ్లోకములయొక్క భావము నైష్కర్మ్యసిద్ధియందు ౩ అధ్యాయమునందు కొన్నితావులం గైకొనబడినది. (చూ. ఉపదేశ ౧౮-వ ప్రకరణ; శ్లో. ౧౨౧, ౧౭౪, ౧౭౫, ౧౭౬ నైష్కర్మ్యసిద్ధి ౩-వ అధ్యా. శ్లో. ౨౦, ౬౪)

శ్లో. ఏవం గౌడై ర్ద్రావిడై ర్నః పూజ్యై రయమర్థః ప్రభాషితః,
అజ్ఞానమాత్రోపాధి స్సన్నహమాది దృగీశ్వరః. ౪౪

(నైష్కర్మ్యసిద్ధి. ౪ అధ్యా. వావిళ్ల ప్రతి. పుట ౪౭౯)

ఇట్లే బృహదారణ్యభాష్యవార్తికమునందుకూడ ఒక్క శ్లోకము గైకొనబడినది.

పై ప్రమాణములవలన ఈ యుపదేశసాహస్రి విద్వ ద్గౌరవమును గడించినగ్రంథరాజమని ఎఱుంగునది.

## ఉపదేశసాహస్రి - వేదాంతదేశికుని శతదూషణి.

విశిష్టాద్వైతమత ప్రవర్తకులలో పండితసార్వభౌము లగు వేదాంత దేశికులవారు అద్వైతమత ఖండనార్థమొనర్చిన శతదూషిణియను గ్రంథమునందు ౫౯-వ వాదమునందు ఈ యుపదేశసాహస్రి గ్రంథమునుండి కొంతభాగమును పూర్వ పక్షముగా పరిగ్రహించి ఖండించియున్నటుల తెలియవచ్చు చున్నదిగాని ఆ 'శతదూషిణి' యను గ్రంథము కొంతవఱకు మాత్రమే ముద్రితమయినది లభించుచున్నది కాని సమగ్ర ముగ లభింపకపోవుటచేత ఆ విషయమునుగూర్చి విశేషించి ఏమియు నిట వ్రాయ వలనుపడలేదు.

పైనచెప్పిన విషయములవలన ఈ 'యుపదేశసాహస్రి' యనుగ్రంథము అద్వైతులకును తత్ప్రతిపక్షులకును గణ నీయమయిన గ్రంథముగా నున్నటుల గ్రహింపవచ్చును.

## శ్రీమచ్ఛంకరాచార్యకృతగ్రంథములు.

### ౧ భాష్యగ్రంథములు. ౧౯.

౧-౧౦ *ఈశాదిదశోపనిషత్తులకుభాష్యము; ౧౧ నృ సింహతాపిన్యుపనిషత్ భాష్యము, ౧౨ శ్వేతాశ్వతరోపనిష ద్భాష్యము, ౧౩ *సనత్సుజాతీయభాష్యము, ౧౪ అధ్యాత్మ పటలభాష్యము, ౧౫ హస్తామలకీయభాష్యము, ౧౬, *విష్ణు సహస్రనామభాష్యము, ౧౭ *లలితాత్రిశతిభాష్యము, ౧౮ *బ్రహ్మసూత్రశారీరకభాష్యము, ౧౯*గీతాభాష్యము.

## ప్రకరణగ్రంథములు.

౧ *ఉపదేశసాహస్రి (గద్యపద్యాత్మకము), ౨*వివేక చూడామణి, 3 ప్రపంచసారము, ౪*మహావాక్యదర్పణము, ౫*అపరోక్షానుభూతి, ౬ శతశ్లోకి, ౭ ప్రబోధసుధాకరము, ౮ వేదాంతసారము, ౯*వేదాంతడిండిమము, ౧౦ సదాచారము, ౧౧ వాక్యవృత్తి, ౧౨*ఆత్మబోధ, ౧3*ఆత్మానాత్మవివేకము, ౧౪ ఆత్మచింతనము, ౧౫*హరిమీడేస్తుతి, ౧౬ విజ్ఞాననౌక, ౧౭ యోగతారావళి, ౧౮ స్వాత్మానందప్రకాశము, ౧౯ జీవన్ముక్తానందలహరి, ౨౦*శివానందలహరి, ౨౧*సౌందర్యలహరి, ౨౨*ప్రశ్నోత్తరరత్నమాల, ౨3*పంచీకరణము, ౨౪ రాజయోగము, ౨౫ పంచదశీవ్యాఖ్యానము (బ్రహ్మవిద్యావిలాసము), ౨౬*సిద్ధాంతబిందువు(దశశ్లోకి), ౨౭ అద్వైతానుభూతి, ౨౮ అనాత్మశ్రీనిగర్హణము, ౨౯ స్వరూపానుసంధానము, 3౦ ప్రౌఢానుభూతి, 3౧ బ్రహ్మజ్ఞానావళీమాల, 3౨ లఘువాక్యవృత్తి, 33 నిర్వాణమంజరి, 3౪ బ్రహ్మానుచింతనము, 3౫ తత్త్వోపదేశము, 3౬ మాయాపంచకము, 3౭*ఏకశ్లోకి, 3౮*రామకర్ణామృతము, 3౯ గాయత్రీభాష్యము, ౪౦*సర్వవేదాంతసిద్ధాంతసారసంగ్రహము, ౪౧ దేవీపూజావిధానము.

## స్తోత్రాదులు—లఘుగ్రంథములు. ౭౪

౧—౧౦ భజగోవిందస్తుతి, లక్ష్మీనృసింహస్తోత్రము, కనకధారాస్తుతి, కాశీసారము, కృష్ణాష్టకము, గోవిందాష్టకము, కాలభైరవాష్టకము, దశావతారస్తుతి, పంచమహాయుధ

స్తోత్రము, త్రిపురసుందరీమానసపూజ, ౧౧-౨౦ త్రిపుర సుందరీచతుష్షష్ట్యుపచారపూజ, ఆత్మానందాష్టకము, నవరత్న మాలికాస్తోత్రము, మహావాక్యస్తోత్రము, శివపంచాక్షరపంచ కము, ఆర్తత్రాణ గంగాధరాష్టకము, బ్రహ్మనామావళి, స్వరూపానుసంధానస్తోత్రము, యతిపంచకము, జీవబ్రహ్మైక్య స్తోత్రము, ౨౧-౩౦ దక్షిణామూర్త్యష్టకము, శివమానస పూజ, మానసపూజాప్రకారాష్టకము, విశ్వనాథనగర్యష్ట కము, అన్నపూర్ణాష్టకము, మణికర్ణికాష్టకము, నిర్వాణషట్క ము, కృష్ణాష్టకము, శ్రీరామభుజంగస్తోత్రము, శివభుజంగ స్తోత్రము, ౩౧-౪౦ సుబ్రహ్మణ్యభుజంగస్తోత్రము, అంబాష్ట కము, విష్ణుపాదాదిస్తుతి, భవానిస్తోత్రము, పాండురంగాష్ట కము, అచ్యుతాష్టకము, షట్పది, ఆత్మపంచకము, కౌపీనపంచ కము, వైరాగ్యపంచకము, ౪౧-౫౦ *మనీషాపంచకము, *సాధనపంచకము, దత్తాత్రేయసహస్రనామావళి, జగన్నా థాష్టకము, యమునాష్టకము, ౨; నర్మదాష్టకము, గంగాష్ట కము, శారదాస్తుతి,౫౧-౬౦ విఠ్ఠలస్తోత్రము, త్రివేణీస్తవము, యమునాభుజంగస్తోత్రము, మీనాక్షీపంచరత్నము, హనూమ త్పంచరత్నము, లక్ష్మీనృసింహపంచరత్నము, విష్ణుభుజంగ స్తోత్రము, మీనాక్ష్యష్టకము, నిర్గుణమానసపూజ, భ్రమరాం బాష్టకము, ౬౧-౭ శివపంచాక్షరనక్షత్రమాల, ద్వాదశలింగ స్తోత్రము, అర్ధనారీశ్వరస్తోత్రము, శారదాభుజంగప్రయా తము, కాశీపంచకము, గణేశపంచరత్నము, గణేశభుజంగ స్తోత్రము, శివపాదాదిస్తుతి, వేదసారశివస్తోత్రము, సువర్ణ

మాలాస్తుతి, భగవన్మానసపూజ, మృత్యుంజయమానసిక పూజ.

జ్ఞాపిక:— తెలిసినంతవఱకు గ్రంథనామములను ఇందు చేర్చి యున్నాఁడను. లఘుగ్రంథములందును, ప్రకరణగ్రంథములందును, మఱి కొన్ని గ్రంథములు ఆచార్యకృతములు గలవని కొందఱు తలంచుచున్నారు. ఈ సూచియందు లేని గ్రంథనామములను తెలిపెదరుగాక.

* ఈగుర్తుగల గ్రంథములు ఆంధ్రాక్షరములందు ముద్రింపఁబడియున్నవని గ్రహించవలయును. స్తోత్రాదిలఘుగ్రంథములకీవిషయమును గ్రహింపవలదు.

ఈ 'ఉపదేశసాహస్రి' అతిసులభశైలిగల వేదాంత గ్రంథరాజమయినప్పటికిన్నీ, ఆంధ్రాక్షరములయం దింతవఱకు ముద్రింపఁబడియుండ లేదు. వేదాంతశాస్త్రపఠనమునందును, స్వాత్మానుభవమునందును వన్నెకెక్కినవారును, ఆంధ్రబ్రాహ్మణులును, ఆంధ్రభీష్ములనదగినవారును, మహర్షికల్పులును, గోదావరిజిల్లా మోడేకుఱ్ఱుగ్రామవాస్తవ్యులును అగు శ్రీనిమిషకవి వెంకయ్యపంతులవారి యభిమతానుసారము బ్రహ్మశ్రీ, పేరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే ఆంధ్రతాత్పర్యసహితముగ వ్రాయఁబడి శ్రీ కామర్షి వెంకటసుబ్బయ్యగారిచేత సంపాదితమయిన యీగ్రంథరత్నమును వావిళ్లరామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌సంస్థకు అధిపతులును, కీర్తిశేషులయిన శ్రీరామస్వామిశాస్త్రులవారి పుత్త్రరత్నములును, ప్రాచీనవిద్యాప్రచారైకతాన మనస్కులును అగు శ్రీయుత వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు ముద్రించి ప్రకటించిరి. శ్రీమచ్ఛంకరభగవత్పా

దాచార్యులవా రొనర్చిన భాష్యగ్రంథములు, ప్రకరణగ్రంథములన్నియు మూలగ్రంథములయినను ఆంధ్రాక్షరములందు ఇంతదనుక ముద్రింపఁబడియుండలేదు. ఇయ్యది ఆంధ్రదేశీయులకు తమ దేశమునందును భాషయందునుగల అభిమానాభావమును సూచించును. ఆచార్యులవా రొనర్చిన గ్రంథములన్నియు వావిళ్లవారు త్వరలో ప్రకటించునటుల ఆంధ్రులు ప్రోత్సాహమునొనర్తురనుతలంపుతోడనే పీఠికయందాచార్యకృతగ్రంథముల పట్టికను చేర్చితిని. విద్యాప్రచారదీక్షాపరాయణులును, సంస్కృతాంధ్రగ్రంథముద్రణసమధిగతకీర్తిశోభితులును అగు శ్రీ వేంకటేశ్వరశాస్త్రులవారు శ్రీమచ్ఛంకరాచార్యులవారి గ్రంథముల నన్నిఁటిని ప్రకటించి ఆంధ్రులకు జ్ఞానామృతమును పంచిపెట్టెదరు గాక! ఆంధ్రదేశీయులగుపండితోత్తములు ఇంతవఱకు ప్రకటింపఁబడని శ్రీశంకరాచార్యగ్రంథములకు ఆంధ్రటీకాతాత్పర్యాదులను అధునాతనులగు సదాచారపరాయణులు గ్రహించువిధమున సులభశైలిలో ముద్రణానుకూలముగ వ్రాసిపంపి ప్రకాశకులగు శ్రీ వేంకటేశ్వరశాస్త్రులవారికి ప్రోత్సాహము నొనర్తురుగాక!

| చెన్నపట్టణము.<br>శ్రీముఖ మార్గశిర బహుళసప్తమి. | } | ఇట్లు,<br>కనుపర్తి మార్కండేయశర్మ. |
|---|---|---|

శ్రీగురుభ్యోనమః.

# ఉపదేశసాహస్రి — విషయసూచిక.

## గద్యప్రబంధము—ప్రథమభాగము (పుటలు ౧—౧౨౬)

---

### ౧. శిష్యానుశాసనప్రకరణము.

(వాక్యసంఖ్య ౧-౪౫; పుటసంఖ్య ౧-౪౯.)

## ౨. కూటస్థాద్వయాత్మబోధప్రకరణము.

(వాక్యసంఖ్య ౪౫-౧౧౧ ; పుటలు ౫౦-౧౧౭).

## 3 పరిసంఖ్యానప్రకరణము.

(వాక్యసంఖ్య ౧౧౩-౧౧౬; పుటలు ౧౧౮-౧౨౬).



గద్యప్రబంధము సమాప్తము.

# ద్వితీయభాగము, పద్య(శ్లోక)ప్రబంధము. ౧౨౯-౬.

## ౧. ఉపోద్ఘాతప్రకరణము.

(౧-౨౬ శ్లోకములు, పుటలు ౧౨౯—౧౫౫).

## ౧౩. అచక్షుష్ట్వప్రకరణము.

(శ్లో. ౧-౨౬; పుటలు ౨౫౯-౨౭౩).



## ౧౪. స్వప్నస్మృతిప్రకరణము.

(శ్లో. ౧-౫౦; పుటలు ౨౭౪-౩౦౮).

## ౧౭ సమ్యఙ్మతిప్రకరణము.

(శ్లో. ౧-౮౯; పుటలు ౩౯౬—౪౫౨).

## ౧౯. ఆత్మమనస్సంవాదప్రకరణము.

(శ్లో. ౧-౨౮; పుటలు ౫౯౭-౬౧౫).

| విషయము. | శ్లోకసంఖ్య. | పుట. |
|---|---|---|


ఉపదేశసాహస్రీ విషయసూచిక సమాప్తము.



శ్రీః

# ఉపదేశసాహస్రి

## గద్యప్రబంధము-ప్రథమభాగము.

(శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్య ప్రణీతము.)



### ౧. శిష్యానుశాసనప్రకరణము.

గద్య. అథ మోక్షసాధనోపదేశవిధిం వ్యాఖ్యాస్యామో ముముక్షూణాం శ్రద్ధధానానా మర్థినా మర్థాయ. ౧

శ్లో. ప్రణమ్య రామాభిధమాత్మధీపదం
జగత్ప్రసూతి స్థితి సంయమాయనమ్,
తదాత్మ కాన్ శంకరపూర్వకా న్గురూన్
మయోపదేశార్థ విభాగ ఉచ్యతే.

తాత్పర్యము:— అథశబ్దము, ఓంకారము అను నీరెండును పూర్వ కాలమునందు బ్రహ్మకంఠమునుండి వెలువడుటవలన మంగళప్రదములు. లేక, విస్తారముగ ననేకశాస్త్రములను వివరించిన పిమ్మట యనియు అథశబ్ద మున కర్థము చెప్పనగును. మోక్షమనఁగా ప్రపంచరహిత బ్రహ్మాత్మత్వస్ఫుర ణము. దీనికి సాధనము ఉపనిషత్ప్రతిపాద్యమగు ఆత్మజ్ఞానము. దీనిని బోధించురీతిని వివరింతుము. మోక్షమనుపదముచేత నీశాస్త్రమందు ప్రత్య క్తత్త్వమగు బ్రహ్మము విషయము. ప్రత్యక్తత్త్వమనఁగా నామరూపములు

కాక తద్విలక్షణమగు సద్వస్తువు. దానికి తత్త్వజ్ఞానమే సాధనము. సాధన సాధ్యమగు అజ్ఞాననివృత్తియే ఫలము. ఏలయన సిద్ధమగు బ్రహ్మ మెపుడును సాధ్యముకానందున, నా సిద్ధవస్తువును ఆవరించిన యజ్ఞానము తొలఁగుటయే ప్రయోజనము. ఇచట సాధనమువలన సాధింపఁదగినదని తెలియవలెను. బోధ్యబోధకభావము సంబంధము. శ్రద్ధగలిగి తత్త్వార్థమును దెలియఁగోరు ముముక్షువు అధికారి. ముముక్షువనఁగా ధర్మార్థకామమోక్షములనెడి పురుషార్థములలో మోక్షమునే కోరువాఁడు. శ్రద్ధగల వారనఁగా కర్మములు చేయుటయందుగాని, యితరశాస్త్రములను చదువుటయందుగాని శ్రద్ధలేక తత్త్వశాస్త్రమునందే మిగుల రుచిగలవారలు. అర్థినాం అనఁగా నీశాస్త్రార్థజ్ఞానమును గోరువారలు. అనఁగా పాండిత్యమువలనఁ గీర్తినిఁగోరువారలకీతత్త్వశాస్త్రమునం దధికారము లేదని భావము. ఇట్లు అనుబంధచతుష్టయము సూచింపఁబడినది.ఇట్టి అధికారముగల వారల కుపకారము గలుగుటకై దీనిని వివరించెదము. ౧

అవతారిక:—సంగ్రహముగఁ జెప్పినయర్థమును స్పష్టపఱుచు చున్నాఁడు:—

మూలము:—తదిదం మోక్షసాధనం జ్ఞానం సాధనసాధ్యాదనిత్యాత్సర్వస్మా ద్విరక్తాయ త్యక్తపుత్రవిత్తలోకైషణాయ ప్రతిపన్నపరమహంస పారివ్రాజ్యాయ శమదమదయాదియుక్తాయ శాస్త్రప్రసిద్ధశిష్యగుణసంపన్నాయ శుచయే బ్రాహ్మణాయ విధివ దుపసన్నాయ శిష్యాయ జాతికర్మవృత్తవిద్యాభిజనైః పరీక్షితాయ బ్రూయా త్పునఃపునః యావద్గ్రహణం దృఢీభవతి. ౨

తా. మోక్షసాధనమగు ఈజ్ఞానశాస్త్రము, ఈక్రింది గుణములుగల శిష్యునకుపదేశింపవలెను. తత్=గ్రంథాంతరమునం దధికముగఁ జెప్పఁబడినది. ఇదం=ఇపు డిచటఁ జెప్పఁబోవునది. ఈ చెప్పఁబోవుజ్ఞానము కారణసమేతమగు బంధమును దొలఁగించుటవలన బ్రహ్మాత్మభావమును గలిగించును. ముముక్షువు ఈశాస్త్రమునం దధికారి యని చెప్పఁబడెను. ఆయధికారి గుణములెవ్వియన, కృషివలనఁ గలిగిన సస్యాదులును, యాగమువలన గలిగిన స్వర్గాదులును సాధనసాధ్యములు. ఇవి సాధనములచేఁ బుట్టింపఁబడినందున అనిత్యములు. వీనియందు వాంఛలేనివాఁడును; అనఁగా పుత్రార్థము వివాహమందు వాంఛ పుత్రేషణ, యాగాది కార్యములను జేయుటకు గోవులు మొదలగు ధనమందును అపరవిద్యయందునుగల కోరిక విత్తేషణ; పుత్రులచేతను, యాగాదిహేతువగు అపరవిద్యచేతను సాధ్యములగు నీలోకమును పితృలోకమును దేవలోకమును గోరుట లోకైషణ, వీనిని వదలినవాఁడును, సాధనములను వదలుటచేత సాధ్యాభిలాష లేదని తెలియఁబడును. ఇందుకు - "న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వ మానశుః." అను శ్రుతిప్రమాణము. 'సంన్యాసమును గ్రహించినవాఁడు' అను విశేషణముచే ద్వైతవాదులకు అద్వితీయాత్మ తత్త్వోపదేశగ్రహణమం దధికారము లేదని తెలియవలెను. శమమనఁగ అంతరింద్రియనిగ్రహము (మనస్సును నిలుపుట). దమమనఁగా బాహ్యేంద్రియనిగ్రహము. దయయనఁగా నేప్రాణికిని ద్రోహముకోరకుండుట. ఆది పదముచేత ఉపరతి తితిక్షా సమాధాన శ్రద్ధలు గ్రహింపవలెను. ఇవిగలవాఁడును అభిమానము అసూయ మొదలగు దుర్గుణములను విడిచి శుచిత్వము, సామర్థ్యము, స్నేహము, జిజ్ఞాస, నిర్మమత్వము మొదలగు శాస్త్రప్రసిద్ధ శిష్యగుణములు గలిగి యథాశాస్త్రముగ శరణుపొందిన బ్రాహ్మణకుమారునకుపదేశింపవలెను. జనకాదులకు పూర్ణజ్ఞానమున్నను సంన్యాసధర్మమం దధికారము లేదని బ్రాహ్మణపదమువలనఁ దెలియవలెను. కుండుఁడు, గోళకుఁడు.

క్షత్రియుఁడు కాకుండ, జాతిని పరీక్షించి, పతితుఁడు శప్తుఁడు కాకుండ కర్మమును పరీక్షించి, విద్యను గ్రహించినతరువాత దానిని రక్షించుటకై ఆచారస్వభావములను బరీక్షించి, ఉపదేశమును వ్యర్థము సేయకుండుటకై యింతకుముందు నేర్చిన విద్యను మంత్రములను బరీక్షించి, (ఇందుకుఁ బ్రమాణము—"నాప్రశాంతాయ దాతవ్యం నాపుత్రాయాఽశిష్యాయవా పునః.") కులమును జన్మస్థానమునుకూడ పరీక్షించి, యిట్టి శిష్యునకు దృఢజ్ఞానము గలుగు పర్యంతము మాటిమాటికి బోధింపవలెను. ౨

అవ. ఇట్టి శిష్యునకే బోధింపవలెననుటయందును, ఈ శిష్యుఁడు గురువును [1]బ్రసాదింపఁజేయవలయు ననుటయందును ప్రమాణమగు శ్రుతినిఁ జెప్పుచున్నారు:—

శ్రుతిశ్చ:— 'పరీక్ష్యలోకాన్...తత్త్వతో బ్రహ్మవిద్యామ్' ఇతి, దృఢగృహీతా హి విద్యా ఆత్మనః శ్రేయసే సంతత్యై చ భవతి, విద్యాసంతతిశ్చ ప్రాణ్యనుగ్రహాయ భవతి, నౌరివ నదీం తితీర్షోః, శాస్త్రం చ—'యద్యప్యస్మా ఇమాం మద్భిః పరిగృహీతాం ధనస్య పూర్ణాం దద్యాదేతదేవ తతో భూయః' ఇతి అన్యథా చ జ్ఞానప్రాప్త్యభావాత్ 'ఆచార్యవాన్ పురుషో వేద' 'ఆచార్యాద్ధైవ విద్యా విదితా' 'ఆచార్యః ప్లావయితా తస్య సమ్యగ్జ్ఞానం ప్లవ ఇహోచ్యతే'ఇత్యాదిశ్రుతిభ్యః, 'ఉపదేక్ష్యన్తి తే జ్ఞానమ్' ఇత్యాది స్మృతిభ్యశ్చ. 3

---

1 తనయందు గురువునకుఁ దయగలుగునటుల ప్రవర్తించుట.

తా. 'పరీక్ష్యలోకాన్' అనునది మొదలుకొని 'తత్త్వతో బ్రహ్మ విద్యాం' అనువఱకునుండు గ్రంథముచేత పైనిచెప్పిన యర్థము చెప్పఁబడెను. దృఢముగ గ్రహింపఁబడిన విద్య తనకు శ్రేయస్సుకొఱకును శిష్యపరంప రోపయోగముకొఱకును నుపయోగించును. శిష్యపరంపర కిచ్చినవిద్య తాను నదిని దాటుట కుపయోగించుకొను నావ సముద్రములో మునిఁగి పోవు నితరులనుగూడ నుద్ధరించునటుల ఇతరులనుకూడ పరమపదమును పొందించుటకై యుపయోగించును. ఇదియే విద్యాసంతతి. ఇట్లు పరీక్షితుఁడగు శిష్యునకు విద్యనియ్యవలెనుగాని ధనలోభాదికముచేత నెవని కోయొకనికి నియ్యఁగూడదు. ఇందుల కీదిగువ శ్రుతిస్మృతులు ప్రమాణములు. ఎవరైనను సముద్రపర్యంతమును ధనపూర్ణమునగు భూమి నిచ్చి రేని యట్టివారలకైనను నీబ్రహ్మవిద్య నియ్యరాదు. ఏలయనఁగా నీబ్రహ్మ విద్య విత్తపూర్ణ భూదానముకంటె నధికము. ఆకాశాది పంచభూతములకును భౌతికములకును ఆధారమగు బ్రహ్మమును బోధించుటకు నీభూమాత్రదానము సమానముకాదని భావము.

"పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతందివి" యను శ్రుతి సకలప్రపంచముకంటె బ్రహ్మ మతీతమని చెప్పుచున్నది. గురువుకృపచే విద్య నుపదేశింపనేల? శాస్త్రప్రమాణమువలన నేర్చుకొనరాదా? అనిన నట్లు స్వయముగ నేర్చుకొనిన విద్య జారగర్భమువలె వన్నెకెక్కదనియు, ఆచార్యునివలన నేర్చుకొనినవిద్యయే స్థిరమగునదనియు శ్రుతులు చెప్పు చున్నవి. నమస్కరించి వినయపూర్వకముగ ప్రార్థించినయెడల సద్గురువులు నీకు తత్త్వము నుపదేశింతురని యీగీతావాక్యము సయితము చెప్పు చున్నది:—"తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా, ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః."

అవ. ఒకసారి వినుటచేతనే విద్యకలుగఁగా మాటి మాటికి నేల యుపదేశింపవలె నను శంక కుత్తరము చెప్పు చున్నాఁడు:—

మూ. శిష్యస్య జ్ఞానాగ్రహణం చ లింగై ర్బుద్ధ్వా తదగ్రహణ హేతూన్ అధర్మలౌకిక ప్రమాదనిత్యానిత్యవస్తువివేక విషయాసంజాత దృఢపూర్వశ్రుతత్వలోక చిన్తావేక్షణ జాత్యాద్యభిమానాదీన్ తత్ప్రతిపక్షైః శ్రుతిస్మృతి విహితైః అపనయేత్ అక్రోధాదిభిః అహింసాదిభిశ్చ యమైః, జ్ఞానావిరుద్ధైశ్చ నియమైః. ౪

తా. సద్గురువు శిష్యునియొక్క ముఖవికారములచేతను, అతని వాక్యములచేతను, చేష్టలచేతను, శిష్యుఁడు జ్ఞానమును చక్కఁగ గ్రహింప లేదనియు, విరుద్ధముగ గ్రహించెననియుఁ దెలిసికొని, గ్రహింపమికిఁ గల హేతువులను తన్నివర్తక శ్రుతిస్మృతివాక్యములను బోధించుటచేత తొలఁ గింపవలయును. పూర్వజన్మమునందును, ఈజన్మమునందును సంపాదింపఁబడి నట్టి అధర్మము, స్వేచ్ఛాచారము, స్వేచ్ఛాసంభాషణము, స్వేచ్ఛాభక్షణ రూపమగు ప్రమాదమువలనను, నిత్యము చైతన్యము, అనిత్యము జడము ననెడి వివేకము లేకపోవుటవలనను గలిగిన యే [1]శ్రవణానిశ్చయముగలదో దానిని మంచియుక్తులచేఁ దొలఁగించి వివేకమును గలిగింపవలయును. మఱియు, తనను లోకులు పూజించుటచేనగు ఆనందము, నిందించుటచేనగు దుఃఖము ననెడి దేహాభిమానమును, అమానిత్వము అదాంభికత్వము మున్నగు ముందు చెప్పఁబడు సుగుణములచేఁ దొలఁగింపవలయును. త్వంపదమునకుఁగల లక్ష్యార్థమును బోధించుటచేత జాతికులాభిమానములను విడిపింపవలెను.

1 గురుప్రోక్తవాక్యమందు నమ్మికలేకుండుట.

ఇతరులను ధిక్కరింపకుండుట ఆదిపదముచే గ్రహింపవలెను. క్రోధమును, కామమును, హింసను, చౌర్యమును మాని సత్యమును బ్రహ్మచర్యమును గ్రహించవలెను. శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వరునియందు చిత్తము నిల్పుట యను నియమములు నను సుగుణములు స్వీకరింపఁబడెనేని జ్ఞానమునకు విరుద్ధములగు విక్షేపములు తొలఁగునని భావము. తీర్థయాత్రాచాంద్రాయణాదికములును, ఉపవాసాదికములును, దేహాభిమానము ప్రధానముగ గలుగుటవలన కర్మమునే పెంచుచు జ్ఞానమున కవరోధముగ నుండును గనుక జ్ఞాని వీని నాదరింపరాదు. ४

అవ. ఇట్లు జ్ఞానమునకు ప్రతిబంధకము లగువానినిఁ దొలఁగించు నుపాయములను జెప్పి, యిపుడు జ్ఞానసాధనములను జెప్పుచున్నారు:—

మూ. అమానిత్వాదిగుణాం చ జ్ఞానోపాయం సమ్యగ్గ్రాహయేత్. ౫

తా. అహంకారము, దంభము, ద్వేషము, అసూయ మొదలగు జ్ఞానవిరుద్ధగుణములను వదిలిన శిష్యునకు దృఢముగ జ్ఞానము గలుగునట్లు మాటిమాటికి బోధింపవలెను. ౫

అవ. ఇట్లు ఆచార్యవృత్తమును జెప్పి, ఆచార్యుని లక్షణములను జెప్పుచున్నాఁడు:—

మూ. ఆచార్యస్తు ఊహాపోహగ్రహణధారణశమదమదయానుగ్రహాదిసంపన్నో లబ్ధాగమో దృష్టాదృష్టభోగేష్వనాసక్తః త్యక్తసర్వకర్మసాధనో బ్రహ్మవిత్ బ్రహ్మణి స్థితః అభిన్నవృత్తో దంభదర్పకుహకశాఠ్యమాయా

మాత్సర్యానృతాహంకారమమత్వాది దోషవివర్జితః కేవల పరానుగ్రహప్రయోజనో విద్యోపయోగార్థి పూర్వముపదిశేత్ -'సదేవ సోమ్యేదమగ్ర ఆసీ, దేకమేవాద్వితీయమ్' 'యత్ర నాన్యత్పశ్యతి' 'ఆత్మైవేదం సర్వమ్,' 'ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీత్' 'సర్వం ఖల్విదం బ్రహ్మ' ఇత్యాద్యాః ఆత్మైక్యప్రతిపాదనపరాః శ్రుతీః. ౬

తా. తత్త్వజ్ఞానమును దెలియఁగోరినవార లిటువంటి గురువును ఆశ్రయింపవలెనని యిచట నియమింపఁబడుచున్నది. కాని, యింతకు మునుపే కృతార్థుఁడగు గురువున కీనియమములతోఁ బనియే లేదు. ఆయాచార్యగుణము లెవ్వియనఁగా—ఊహః = శిష్యుఁడు చెప్పలేనిదానినికూడ తా నూహించుట; లేక, ఉపదేశించునపుడు శిష్యునకు బోధానుకూలములగు యుక్తులను గల్పించుట; అపోహః=శిష్యుఁడు గ్రహించిన మిథ్యాగ్రహణము దొలఁగించుట; లేక, సిద్ధాంతప్రతికూలవాక్యములను నిరాకరించు శక్తి. గ్రహణం=శిష్యుఁడు చేయు ప్రశ్నములను, ఆక్షేపములను వెంటనే నిశ్చయించు శక్తి. ధారణం=శిష్యుఁ డడిగిన ప్రశ్నకు సమాధానము చెప్పునట్టిసమయమునందు శిష్యుఁ డడిగిన ప్రశ్నార్థము మఱువకుండుట. దయా = దుఃఖముగలవారలయం దనుగ్రహబుద్ధి. అనుగ్రహః = ఆదుఃఖమును దొలఁగింపఁ బూనుట. ఆదిపదముచేత శరణుపొంది నమ్రుఁడైన శిష్యునిఁ గరుణతో విడువకుండుట యని తెలియవలెను. ఈదృశగుణగరిష్ఠుఁ డగు సద్గురువు శిష్యుని సంసారసాగరమునుండి ఉద్ధరింపఁగలఁడు. మఱియు, గురువు గురుసంప్రదాయాగతవిద్య కలిగియుండవలెను. ఐహికాముష్మికసుఖములం దాదరములేనివాఁడును, సాధనపరిగ్రహమందు పరాఙ్ముఖుఁడగుట వలన సాధ్యభోగముల నపేక్షింపనివాఁడును అని తెలియవలెను. మహా

వాక్యార్థశ్రవణమువలన ప్రత్యగాత్మ తత్త్వము నెఱిఁగినవాఁడును, పరమాత్మ యొకఁడు కలఁడని పరోక్షజ్ఞానముమాత్రమే కాక నిత్యాపరోక్షముగ "బ్రహ్మైవాహమస్మి" యని స్ఫుటమైన అపరోక్షాత్మానుభవముగలవాఁడును గురువనఁబడునని తాత్పర్యము. స్వేచ్ఛాచారము లేక సదాచారసంపన్నుఁడును, డంబము, వంచన, నైష్ఠుర్యము, మాత్సర్యము, పుత్రాదులయందు మమకారము మొదలగు దుర్గుణములు లేనివాఁడును, నిర్వేదముగల సచ్ఛిష్యునకు బోధించుటకంటె నన్యమగు కర్తవ్యాంశమేమియు లేనివాఁడును, విద్యను నశింపఁజేయక కాపాడువాఁడునై యుండవలెనని భావము. ఏజ్ఞానమువలన సర్వమును విడిచెనో ఆజ్ఞానమునుకూడ విడువవలెనని "త్యజధర్మ మధర్మం చ ఉభే సత్యానృతే త్యజ, ఉభేసత్యానృతే త్యక్త్వా యేన త్యజసి తత్త్యజ." అని శాస్త్రము చెప్పుచున్నను మూర్తిమంతము కానిజ్ఞానము నెట్లు విడువఁదగునని యాక్షేపింపరాదు. ఏలయనఁగా—వినయవైరాగ్యాది సద్గుణశాలియగు శిష్యున కావిద్య నుపదేశించుటయే జ్ఞానత్యాగమనఁబడును. తరువాత ఉపదేశవాక్యములను జెప్పుచున్నాఁడు. ఈ మహావాక్యములు జీవాత్మ పరమాత్మలకు ఐక్యమును బోధించును. 'సత్, బ్రహ్మ, భూమా' అనునవి బ్రహ్మనామములు. విరోధములేక ఆత్మపరములని చెప్పుటకే బహుశాఖా వాక్యముల నుదాహరించిరి. ౬

అవ. ఆ బ్రహ్మ మొదలగు శబ్దములచేఁ జెప్పఁబడు వస్తువు ఏది? అది అద్వితీయ మెట్లగునను శంకకు ఉత్తరముఁ జెప్పుచున్నాఁడు:—

మూ. ఉపదిశ్య చ గ్రాహయేత్ బ్రహ్మణో లక్షణమ్:—
'య ఆత్మా ఽపహతపాప్మా' 'యత్సాక్షా దపరోక్షా ద్బ్రహ్మ' 'యో ఽశనాయాపిపాసే' 'నేతి నేతి' 'అస్థూలమనణు' 'స ఏష నేతి నేతి' 'అదృష్టం ద్రష్టృ' 'విజ్ఞాన

మానందం బ్రహ్మ' 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' 'అ
దృశ్యే ఽనాత్మ్యే ఽనిరుక్తే' 'స వా ఏష మహా నజ
ఆత్మా' అప్రాణో హ్యమనాః' 'సబాహ్యాభ్యన్తరో హ్య
జః' 'విజ్ఞానఘన ఏవ' 'అనన్తర మబాహ్యమ్' 'అన్య
దేవ తద్విదితా దథో అవిదితా దధి' 'ఆకాశో వై నా
మ' ఇత్యాది శ్రుతిభిః. ౭

తా. సద్గురువు వినీతుఁడగుశిష్యున కుపదేశముచే నీబ్రహ్మలక్షణములను తెలుపవలెను.—

బ్రహ్మము జాగ్రదాద్యవస్థలను తద్ధర్మములను కనిపెట్టుచు నంతట నిండియుండునది. ఒక యవస్థయందుండి మఱియొక యవస్థయందుండనిది కాదు. హారమందలి దారము అన్నిపూసలయందును నుండును గాని యొక పూసయందుండి మఱియొకపూసయం దుండనిది కాదు. ప్రియాప్రియముల నంటని పరంజ్యోతియగు పరబ్రహ్మమును దెలిసి ఉపాసింపవలెను; అనఁగా బ్రహ్మము తానేయని భావింపవలెను. ఉపాధులు భిన్నములైనను చైతన్య మేకమే. అంతఃకరణము జీవునకు ఉపాధి. అంతఃకరణాభావము బ్రహ్మము నకు ఉపాధి. సర్వాంతరమగు ఆత్మ బుద్ధివృత్తిరూపమగు దృష్టికి సాక్షి; క్షుత్పిపాసలనెడి ప్రాణధర్మములు లేనివాఁడు. శోకమోహాదులగు అంతః కరణధర్మములు లేనివాఁడు. సాక్షాదపరోక్షమగువాఁడును, దృశ్యములన్ని యు ఆత్మకాదనియు, ఆయాత్మ అన్నిటినిఁ జూచునదికాని చూడఁబడు నది కాదనియు, అపూర్వము అనఁగా కారణములేనిది కనుక కార్యము కాదనియు, అపరమనఁగా కార్యములేనిది కనుక కారణము కాదనియు 'తత్' పదమున కర్థము చెప్పఁబడెను. మనఃప్రాణాదులను స్వస్వకార్యము లందు ప్రేరేపించుచు వానినిఁ బ్రకాశింపఁజేయు ఆత్మతత్త్వము కార్య

కారణములకంటె వేఱైనదియు, నామరూపములను ప్రకాశింపఁజేయుచు స్వయముగఁ బ్రకాశించునదియును. ఈ మొదలగు శ్రుతివాక్యములు ప్రసిద్ధములు.

అవ. ఇట్లే స్మృతియందును గలదు-స్మృతియనఁగా వేదాంతశాస్త్రమున భగవద్గీతయనియే యర్థముఁ జెప్పుచున్నాఁడు:-

మూ. స్మృతిభిశ్చ—'న జాయతే మ్రియతే' 'నాదత్తే కస్యచిత్పాపమ్' 'యథాఽఽకాశస్థితో నిత్యమ్' 'క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి' 'న సత్తన్నాసదుచ్యతే' 'అనాదిత్వాన్నిర్గుణత్వాత్' 'సమం సర్వేషు భూతేషు' 'ఉత్తమః పురుషస్త్వన్యః' ఇత్యాదిభిః శ్రుత్యుక్తలక్షణావిరుద్ధాభిః పరమాత్మాసంసారిత్వప్రతిపాదనపరాభిః తస్య సర్వేణానన్యత్వప్రతిపాదనపరాభిశ్చ.      ౮

తా. ఆ శ్రుత్యుక్తబ్రహ్మలక్షణమునే స్మృతులును జెప్పుచున్నవి. 'విజ్ఞానమానందం బ్రహ్మేతి, కోన్వేనం జనయేత్పునః, మర్త్యః స్విన్మృత్యునా వృక్ణః కస్మాన్మూలాత్ప్రరోహతి' ఇతి పృష్టస్య స్వరూపం విజ్ఞానానందలక్షణమితి తత్పదార్థతత్త్వముపలక్షితం = మృత్యుగ్రస్తమగు ఈ ప్రపంచము తిరిగి ఆనందమువలనఁ బుట్టునని తాత్పర్యము. ఇట్లు "బ్రహ్మవిదాప్నోతిపరం" అని బ్రహ్మవేత్తపరమానందమును బొందునని యుపక్రమింపఁబడిన బ్రహ్మమునకు "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అని సత్యజ్ఞానానంతములు లక్షణములుగఁ జెప్పి పిదప "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః" అను నీమొదలగు శ్రుతులచేత మాయాశబలితమగు ఆబ్రహ్మమునుండి ఆకాశాది భూతోత్పత్తినిఁ జెప్పి, ఆ భూతములందును, ఆభూతకార్యములందును "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్" అని ప్రవేశమును జెప్పి తరువాత అధ్యారోపితవస్తుజాత

మునకు లేదులేదని అపవాదమును జెప్పి పరమాత్మనుమాత్ర మీశ్రుతులు శేషించుచున్నవి. "అదృశ్యే ఽనాత్మ్యేఽనిరుక్తే" "బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా, అథ సో ఽభయంగతో భవతి, స య శ్చాయం పురుషే, యశ్చాసా వాదిత్యే స ఏకః." ఈమొదలగు శ్రుతులు ఆత్మకు జాగ్రదాద్యవస్థాధర్మములు లేవనియు, కామమువలన సంసారి, నిష్కామమువలన ముక్తుఁడు నగుననియు, బుద్ధివృత్తులు కలుగుచు పోవుచుండఁగా ఆత్మ వానికి సాక్షియనియు, ఆ పరతత్త్వము దృక్కుగాని దృశ్యముకాదనియు, గ్రహించువాఁడు గ్రహింపఁబడునది యను నుపాధులు మాయాకల్పితములని వానిని కడకుఁద్రోయఁగా నంతటను చైతన్యమాత్రమే, గృహమందలి వస్తువులనన్నిటినిఁ దీసివేయఁగా, తీయుట కనువుగాని గగనమువలె మిగులుననియు, సకలభూతములకుఁ గారణమగు ఆ పరబ్రహ్మముయొక్కయంశములే యగ్నికణములవలె నంతట జీవరూపముగ నుండుటచేత నుపాధికృతపరిచ్ఛేదము వాస్తవముగాక అఖండాకారమనియు బోధించును. 'బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠం', 'ఇదం సర్వం యదయమాత్మా' ఈ మొదలగు శ్రుతులు సర్వజగత్తు ఆత్మకంటె భిన్నముగ లేదని చెప్పి, ఆయాత్మ అనంతము, అపారము, విజ్ఞానఘనము, కార్యకారణములకంటె భిన్నము అనియును బోధించినవి. ఈ స్మృతులు శ్రుత్యర్థమును దృఢపఱుచుటకై ప్రవర్తించినవేకాని వానికి ప్రామాణ్యమును సంపాదించుటకుఁగాదు. సాంఖ్యస్మృతులను నివారించుటకై "అవిరుద్ధాభిః" అని స్మృతులకు విశేషణముంచఁబడెను. పరమాత్మ అవిద్యాతత్కార్యసంబంధములు లేనివాఁడు. నిరంతరప్రకాశస్వరూపుఁడు. ఇట్టి పరమాత్మ అవస్థాత్రయముకంటెను నుపాధిత్రయముకంటెను వేఱు అని చెప్పుటయే పరమాత్మ అసంసారి యని చెప్పుట. సర్వాధిష్ఠానమనఁగా, అనేకవిధచిత్రకల్పనమునకు నధిష్ఠానము గోడవలె, (గోడగాని బట్టగాని కాగితముగాని లేనిది చిత్తరువులేవియు నుండనట్లు)

పరమాత్మసత్తలేనిది దృశ్యవస్తు వెద్దియు నుండఁజాలదు. కనుక ఆత్మసర్వాధిష్ఠానము. ఇట్టి యాత్మతత్త్వమును బోధించుటకై తల్లివలె దయగల శ్రుతులు ప్రవర్తించినవి. స్మృతులును ఈయర్థమునే దృఢపఱిచినవి. ౭

అవ. ఇట్లు వాక్య ముపదేశించి శ్రుతిస్మృతివ్యాఖ్యానముచే బోధింపఁబడిన శిష్యునియొక్క అజ్ఞానసంశయవిపరీతాపోహాభావములను బోఁగొట్టి, బోధితార్థమందు బుద్ధిని స్థిరపఱుచుటకై మాటిమాటికి ఆచార్యుఁ డతని నడుగవలెనని ఆచార్యకృత్యము నిపుడు చెప్పుచున్నారు:—

మూ. ఏవం శ్రుతిస్మృతిభిః గృహీతపరమాత్మలక్షణం శిష్యం సంసారసాగరాదుత్తితీర్షుం పృచ్ఛేత్ — కస్త్వమసి సోమ్య! ఇతి. ౮

తా. శిష్యుని జ్ఞానమును బరీక్షించు నీశ్రుతి తెలిసినది యని చెప్పువానికిఁ గొంచెమే తెలిసెను అని చెప్పుచున్నది. "యది మన్యసే సువేదేతి దభ్రమేవాపి నూనం త్వం వేత్థ బ్రహ్మణోరూపం"—(వత్సా! నీస్వరూపమెట్టిది?) ౯

మూ. స యది బ్రూయాత్—బ్రాహ్మణపుత్రః అదో ఉన్వయః బ్రహ్మచార్యాసమ్, గృహస్థో వా, ఇదానీమస్మి పరమహంస పరివ్రాట్ సంసారసాగరాత్, జన్మమృత్యుమహాగ్రాహాత్ ఉత్తితీర్షురితి. ౧౦

తా. గురు వట్లడుగఁగా శిష్యుఁడు "స్వామీ! నేను బ్రాహ్మణుఁడను. మాది యీగోత్రము. బ్రహ్మచారిని (లేక) గృహస్థును. కాని యిపుడు

సంన్యాసినై జననమరణరూప మకరములయొక్క పీడతోఁగూడిన సంసార సాగరమును దాటి, పారము చేరఁగోరుచున్నాను'' అని చెప్పెనేని. ౧౦

అవ. ఆచార్యుఁ డపుడు 'అహహా! వీనికి ఇప్పటికిని దేహాభిమానము జ్ఞానమునకు ప్రతిబంధకముగ నున్నది' యని దేహమే నేననెడి యీ దురాగ్రహమును నిరాకరించుటకై మఱల బోధించుచున్నాఁడు:—

మూ. ఆచార్యో బ్రూయాత్—ఇహైవ తవ సోమ్య! మృతస్య శరీరం వయోభి రద్యతే, మృద్భావం వాఽఽపద్యతే, తత్ర కథం సంసారసాగరా దుద్ధర్తు మిచ్ఛసీతి, న హి నద్యాః అపరే కూలే భస్మీభూతే నద్యాః పారం తరిష్యసీతి. ౧౧

తా. వత్సా! మృతినొందినపుడు నీదేహము గ్రద్దలచేత తినఁబడును. లేదా, కాల్పఁబడి మట్టి యగునుగద; ఈదేహము లేదేని సంసారమునుండి దాటవలెనను కోరిక యెట్లు పొసఁగును? ఇవతలి యొడ్డున్నపుడేకద యవతలియొడ్డునకుఁ బోఁగలవు. అట్లే బుద్ధియుక్తమగు నీదేహము లేదేని సంసార సాగరమును దాటలేవు. ౧౧

అవ. ఇట్లు స్థూలదేహము నేనను నభిమానమును బోఁగొట్టఁగా శిష్యుఁడు తాను దేహము కానని దేహముకంటె నన్యుఁడ నని తలంచుచు 'నేను దేహముకాను దేహముకంటె నన్యుఁడ' నని చెప్పునేని ఆచార్యుఁడు ౧౩-వ సూత్రమును జెప్పవలయునని చెప్పుచున్నారు:—

మూ. స చి యద్బ్రూయాత్-"అన్యోఽహం శరీరాత్, శరీరం తు జాయతే మ్రియతే వయోభిరద్యతే మృద్భావమాపద్యతే శస్త్రాగ్న్యాదిభిశ్చ వినాశ్యతే వ్యాధ్యాదిభిశ్చ ప్రయుజ్యతే, తస్మిన్ అహం స్వకృతధర్మాధర్మవశాత్ పక్షీ నీడమివ ప్రవిష్టః పునః పునః శరీరవినాశే ధర్మాధర్మవశాత్ శరీరాన్తరం యాస్యామి, పూర్వనీడవినాశే పక్షీవ నీడాన్తరమ్, ఏవమేవాహ మనాదౌ సంసారే దేవమనుష్యతిర్యఙ్నిరయస్థానేషు స్వకర్మవశాదుపాత్తముపాత్తం శరీరం త్యజన్ నవం నవం చాన్యదుపాదదానో జన్మమరణప్రబంధచక్రే ఘటీయంత్రవత్ స్వకర్మణా భ్రామ్యమాణః క్రమేణేదం శరీరమాసాద్య సంసారచక్రభ్రమణా దస్మా న్నిర్విణ్ణో భగవన్త ముపసన్నోఽస్మి సంసారచక్రభ్రమణప్రశమనాయ, తస్మాన్నిత్య ఏవాహం శరీరా దన్యః, శరీరాణి ఆగచ్ఛన్త్యపగచ్ఛంతి చ వాసాంసీవ పురుషస్యేతి." ౧౨

తా. గురువర్యా! నేను శరీరముకాను. శరీరము పుట్టును, నశించును, గ్రద్దలచే తినఁబడును, శస్త్రములచే ఖండింపఁబడును, అగ్నిచే కాల్పఁబడును, రోగములచే పీడింపఁబడును. ఇట్టి దేహములందు పుణ్యపాప సంబంధమున, పక్షి గూటియందు నివసించి యాగూడు చెడఁగానే మఱియొకగూటియందు చేరునట్లు, ఆగూడువంటి దేహము చెడఁగానే పుణ్యపాప సంబంధమువలన ఉత్తమాధమ దేహములందు ప్రవేశించుచుండును. ఇట్లనాదియగు సంసారమందు పుణ్యాతిరేకమున మనుష్యముని దేవదేహములందును, పాపాతిరేకమున పశుపక్షికీటాది దేహములందును ప్రవేశించి, యాభోగానంతరము

గ్రహించినదానిని వదలి క్రొత్తదేహమును గ్రహించుచు ఏతాముచక్రము వలె జననమరణములఁబొంది తిరుగుచు, క్రమముగ నీదేహమును బొంది, యీసంసారచక్రభ్రమణమునుండి విసివి, యీ భ్రమణము నివారించుకొనుటకై తమ చరణములను శరణుపొందితిని. కనుక నేను నిత్యుఁడను. శరీరము కంటె భిన్నుఁడను. పురుషునకు జీర్ణవస్త్రమువలె జీర్ణశరీరముపోయి క్రొత్తవి వచ్చుచుండును. 'కాని నేను నిత్యుఁడనే' యని భావము. ౧౨

అవ. ఆచార్యుఁడు శిష్యుని వివేకోక్తిని మెచ్చుచు నిట్లనుచున్నాఁడు:—

మూ. ఆచార్యో బ్రూయాత్—'సాధ్వవాదీః,సమ్య క్పశ్యసి, కథం మృషా అవాదీః బ్రాహ్మణపుత్రో ఽదోఽన్వయో బ్రహ్మచార్యాసమ్, గృహస్థో వా, ఇదానీ మస్మి పరమహంసపరివ్రా' డితి. ౧౩

తా. పైని చెప్పినవిధమున వివేకముగల నీకు భ్రాంతిచే వర్ణాశ్రమాద్యభిమానము కలుగఁదగునా? యని నుడువవలెను. ౧౩

అవ. నాకు భ్రాంతి యెట్లుకలిగెనని శిష్యుఁడు ప్రశ్నించుచున్నాఁడు:—

మూ. స యది బ్రూయాత్—భగవన్ కథ మహం మృషా ఽవాదిషమ్ ఇతి. ౧౪

తా. 'స్వామీ! నేను అసత్యము నెట్లు చెప్పితిని' అని శిష్యుఁడనును.

అవ. అట్లడిగిన శిష్యునకు ఆచార్యుఁ డిట్లు చెప్పవలె ననుచున్నాఁడు:—

మూ. తం ప్రతి బ్రూయాదాచార్యః—'యత స్త్వం భిన్నజాత్యన్వయసంస్కారం శరీరం జాత్యన్వయసంస్కార

వర్జితస్యాత్మనః ప్రత్యభ్యజ్ఞానీః బ్రాహ్మణపుత్రో౽దో౽న్వయ ఇత్యాదినా వాక్యేనేతి. ౧౫

తా. వత్సా! జన్మము, పిత్రాదికులము, జాతకర్మము, ఉపనయనము మున్నగు సంస్కారములు శరీరమునకేకలదు కాని ఆత్మకెన్నడు నివి లేవు కద. ఈదేహమునకంటె నన్యుఁడను, పక్షి యొకగూటినుండి మఱియొక గూటిలోఁ బ్రవేశించు చందమున నొక శరీరమును విడిచి మఱియొక శరీరములోనికిఁ బోవుచుందునని చెప్పితివికద. ఇపు డీశరీరధర్మములు నీకుఁ గలుగవు కనుక నీమాట సత్యముకానేరదు. ౧౫

అవ. శిష్యుఁడు గురువు నిట్లు ప్రశ్నించవలె ననుచున్నాఁడు.—

మూ. స యది పృచ్ఛేత్—కథం భిన్నజాత్యన్వయసంస్కారం శరీరమ్? కథం వా అహం జాత్యన్వయసంస్కారవర్జితః? ఇతి. ౧౬

తా. శరీరమునకు జన్మగోత్రసంస్కారములు ఎట్లు వేఱైనవి? అవి నాకేల లేవు? అని శిష్యుఁ డడుగును. ౧౬

అవ. అటులనడిగిన శిష్యునకు గురువు ఇట్లు బోధింపవలె ననుచున్నాఁడు —

మూ. ఆచార్యో బ్రూయాత్—శృణు సోమ్య తదేవ యథేదం శరీరం త్వత్తో భిన్నం భిన్నజాత్యన్వయసంస్కారం, త్వం చ జాత్యన్వయసంస్కారవర్జితః ఇత్యుక్త్వా తం స్మారయేత్—స్మర్తుమర్హసి సోమ్య పరమా

త్మానం సర్వాత్మానం యథోక్తలక్షణం శ్రావితోఽసి
'సదేవ సోమ్యేదమ్' ఇత్యాదిభిః శ్రుతిభిః స్మృతిభిశ్చ,
లక్షణం చ తస్య శ్రుతిభిః స్మృతిభిశ్చ. ౧౭

తా. కుమార! ఈ శరీరము నీకంటె భిన్నమును, వేఱగు జన్మగోత్ర సంస్కారములుగలది యెట్లయ్యెనో నీకీజాత్యాదు లెట్లులేవో చెప్పెదనని పూర్వమందు శ్రుతిస్మృతులు సర్వమున కాత్మయగు పరమాత్మస్వరూపము ను (చూ. సూ. ౮) చెప్పెనని సద్గురువు జ్ఞాపకముచేయవలెను. 'య ఆత్మా అపహత పాప్మా' ఈ మొదలగు శ్రుతులు, 'న జాయతే మ్రియతే' ఈ మొదలగు స్మృతులును. ౧౭

అవ. ఇట్లు స్వరూపమును స్మరింపఁజేసి శరీరములు భిన్నములగు జాతిగోత్రసంస్కారములు గలవని చెప్పుటకు శరీరోత్పత్తిరీతిని బోధింపవలెనని చెప్పుచున్నాఁడు.—

మూ లబ్ధపరమాత్మలక్షణస్మృతయే బ్రూయాత్—యోఽసావాకాశనామా నామరూపాభ్యా మర్థాంతరభూతః అశరీరః అస్థూలాదిలక్షణః అపహతపాప్మత్వాదిలక్షణశ్చ సర్వైః సంసారధర్మైరనాగన్ధితః యత్సాక్షా దపరోక్షా ద్బ్రహ్మ ఏష త ఆత్మా సర్వాన్తరః అదృష్టో ద్రష్టా అశ్రుతః శ్రోతా అమతో మన్తా అవిజ్ఞాతో విజ్ఞాతా నిత్యవిజ్ఞానస్వరూపః అనన్తరః అబాహ్యః విజ్ఞానఘన ఏవ పరిపూర్ణః ఆకాశవత్ అనన్తశక్తిః ఆత్మా సర్వస్య అశనాయాదివర్జితః ఆవిర్భావతిరోభావ వర్జితశ్చ స్వాత్మవిలక్షణయోః నామరూపయోః జగ

ద్బీజభూతయోః స్వాత్మస్థయోః తత్త్వాన్యత్వాభ్యామ
నిర్వచనీయయోః స్వసంవేద్యయోః సద్భావమాత్రే
ణాచింత్యశక్తిత్వా ద్వ్యాకర్తా అవ్యాకృతయోః. ౧౮

తా. పరమాత్మానుసంధానము చేయుశిష్యునకు గురువిట్లు బోధింపవల యును—నామరూపముల కంతర్భూతుఁడై, ఆకాశ[1]మనఁదగినఆత్మకు శరీరము లేదు కనుక ఆత్మస్థూలము గాదు సూక్ష్మమును గాదు. ఆకాశమునకు మాలిన్యమంటనివిధమున ఆత్మకు పుణ్యాపాపములంటవు. ఆత్మ సర్వాంతరము నిత్యాపరోక్షము. చూచునది కాని యింద్రియములచేఁ జూడఁబడదు, తెలియఁ బడదు, తానే యన్నిటినిఁ దెలిసికొనును. అంతటను నిండి పూర్ణమైనది. ఆత్మకు బాహ్యాభ్యంతరములు లేవు. ఈ బాహ్యాభ్యంతరసంజ్ఞ ఉపాధులవలనఁ గల్పింపఁబడినది. ఆత్మశక్తికి అంతు లేదు. క్షుత్పిపాసలును ఆవిర్భావతిరోభావములును లేక నిండియుండునది. తనకంటె విలక్షణమనఁగా అనృతజడదుఃఖాత్మకమై, జగత్కారణమై, ఆయాత్మయేయని కాని, తదన్యమని కాని చెప్పఁదగనిదైన నామరూపములను ప్రకటించునదియై, తాను దేనిచేతను ప్రకటింపఁబడనిదియే ఆత్మయని తల్లక్షణము. భూతాకాశము నామరూపములు కలది. ఈ యాకాశాదిభూతపంచకమునకు ఆధారమగునది పరాకాశము. ఆకాశమునకు ఏమలము నంటదు. ఇట్లే పరమాత్మకు ఏమలము నంటదు. కనుక, ఆకాశసామ్యమునుబట్టి లక్షణావృత్తిచే ఆత్మ ఆకాశనామమున శ్రుతిచేఁ జెప్పఁబడెను. కనుకనే శరీరము లేనిది. శరీరమే కాక ఇంద్రియములును లేనిదని భావము. శరీరేంద్రియమనఃప్రాణములు లేనందున పాపమును లేదు. పరమాత్మకీ లక్షణములున్నను జీవునకవి లేక పోవచ్చును. ౧౮

---

1 ఎల్లపుడుం బ్రకాశించుటచే ఆత్మ ఆకాశ మనఁబడును.

అనఁగా జీవుఁడు పరమాత్మప్రతిబింబమే కాని పరమాత్మకంటె వేఱు కాఁడు. పరమాత్మ నిత్యప్రత్యక్షమగు తానేయని శ్రుత్యర్థము. ఆకాశము వలె నంతట నిండినవాఁడు. దృశ్యవస్తువులం దంతటను అంతర్యామిగనుండెడి యీపరమాత్మకు ఉపాధులు రెండు. నామరూపములు జడములు. ఆత్మయే తనశక్తి మహిమవలన నామరూపములుగ పరిణమించెనని భావము. పూర్వము అవ్యక్తముగనున్నదానినే యిపుడు వ్యక్తముగ ప్రకటించుననని భావము.

అవ. నామరూపములను మొదట నెట్లు కల్పించె నని అడుగుచున్నాఁడు.—

మూ. తే నామరూపే అవ్యాకృతే సతీ వ్యాక్రియమాణే తస్మా దేతస్మా దాత్మన ఆకాశనామాకృతీ సంవృత్తే, తచ్చాకాశాఖ్యం భూత మనేన ప్రకారేణ పరమాత్మనః సంభూతం ప్రసన్నా దివ సలిలా న్మలమివ ఫేనమ్, న సలిలం న చ సలిలా దత్యంతం భిన్నం ఫేనమ్, సలిలవ్యతిరేకేణాదర్శనాత్; సలిలం తు స్వచ్ఛం అన్యత్ ఫేనాన్మలరూపాత్, ఏవం పరమాత్మా నామరూపాభ్యామన్యః ఫేనస్థానీయాభ్యాం శుద్ధః ప్రసన్న స్తద్విలక్షణః తే నామరూపే అవ్యాకృతే సతీ వ్యాక్రియమాణే ఫేనస్థానీయే ఆకాశనామాకృతీ సంవృత్తే. ౧౯

తా. పాపరహితుఁడును రూపరహితుఁడును నగు ఆత్మనుండి ఆకాశ మను పేరును దీనికర్థమగు ఆకృతియు వ్యవహారమునకు తగునట్టు కలిగినవి. సత్స్వరూపమగు బ్రహ్మమే, శుద్ధమగు జలము మలినమగు నురుఁగుగ వ్యవహరింపఁబడినటుల, మాయాశక్తివశమున జగదాకారముగ నామరూపములతో వర్తిల్లును. నురుఁగు జలముకాదు. జలముకంటె వేఱుకాదు. ఇట్లు కలి

గినజగత్తు ఆత్మయునుకాదు. ఆత్మసత్తకంటె భిన్నసత్తకలదియునుగాదు. కనుక నురుఁగువలె జగత్తుకూడ ఇట్టిదని చెప్పుటకు నలవికానిది. ఇందుకు— "వాచారంభణం వికారో నామధేయమ్" అను శ్రుతి ప్రమాణము. మాయావశమున ఆత్మనుండి ఆకాశమగు భూతము నామరూపములతో నేర్పడెను. ౧౯

అవ. ఆయాకాశమునుండి వాయువు మొదలగుభూతముల యుత్పత్తిని నిరూపించుచున్నారు:—

మూ. తతో౽పి స్థూలభావ మాపద్యమానే నామరూపే వ్యాక్రియమాణే వాయుభావ మాపద్యేతే, తతో౽ప్యగ్నిభావమ్, అగ్నే రబ్భావమ్, తతః పృథివీభావమ్, ఇత్యేవంక్రమేణ పూర్వపూర్వభావస్యోత్తరోత్తరానుప్రవేశేన పంచమహాభూతాని పృథివ్యంతాన్యుత్పన్నాని, తతఃపంచమహాభూతగుణవిశిష్టా పృథివీ, పృథివ్యాశ్చ పంచాత్మికా వ్రీహియవాద్యా ఓషధయో జాయన్తే, తాభ్యో భక్షితాభ్యో లోహితం శుక్రం చ స్త్రీపురుషశరీరసంబంధి జాయతే, తదుభయం ఋతుకాలే అవిద్యాప్రయుక్తకామఖజనిర్మథనోద్ధృతం మన్త్రసంస్కృతం గర్భాశయే నిషిచ్యతే, తత్స్వయోనిరసానుప్రవేశేన వివర్ధమానం గర్భీభూతం నవమే దశమే వా మాసి జాయతే. ౨౦

తా. శబ్దగుణకమగు ఆకాశమందున్న ఆత్మనుండి స్పర్శగుణముతోఁ గలిసినదగుటచేత నంతకంటె సూక్ష్మమగు వాయువు పుట్టెను. ఆకాశసహితాత్మనుండియే వాయువు పుట్టుటవలన వికారమునుండి వికారముకలుగునను శంక

కవసరము లేదు. ఇట్లే శబ్దస్పర్శసహితమగు వాయువునందున్న ఆత్మనుండియే శబ్దస్పర్శరూపములనెడి గుణత్రయముతోఁ గూడుటచేత నంతకంటె స్థూలమగు వహ్ని పుట్టెను. ఇట్టి వహ్నియందున్న యాత్మనుండి రసగుణముతోఁ గలియుటచేత స్థూలతరమగు జలమును, ఇట్టి జలమునందున్న యాత్మనుండియే గంధగుణోపేతయగు భూమి మిగుల స్థూలమై పుట్టెను. భూమినుండి ఓషధులు, ఓషధులనుండి అన్నము, అన్నమునుండి శుక్లశోణితములు, సంస్కారసహితమగు వీనినుండి గుణవంతమగు శరీరము కలుగును. పంచీకరణ మెట్లనఁగా—భూమిని రెండుపాళ్లుచేసి అరపాలును వేఱుగనుంచి, ఆ యరపాలును నాల్గుపాళ్లు చేయవలెను. ఇట్లే మిగిలిన నాలుగు భూతములను భాగింపవలెను.

$$\frac{1}{2} \div 4 = \frac{1}{2} \times \frac{1}{4} = \frac{1}{8}$$

$$\frac{1}{2}+\frac{1}{8}+\frac{1}{8}+\frac{1}{8}+\frac{1}{8} = \frac{4+1+1+1+1}{8} = \frac{8}{8} = 1.$$

ఇట్లు పంచీకృతభూమి కలిగెను. మహాభూతములనుండి మిగిలిన జలాదులును కలిగెనుగాని జలమందు గంధగుణములేక నాలుగు గుణములే కలిగెను. అగ్నియందు గంధరసములులేక మూఁడు గుణములే కలిగెను. వాయువునందు గంధరసరూపములులేక రెండే గుణములు కలిగెను. ఆకాశమందు గంధరసరూపస్పర్శములులేక శబ్దగుణమమాత్రమే పుట్టెను. ౨౦

అవ. ఇట్లు ప్రస్తావక్రమమున శరీరోత్పత్తిని వర్ణించి ఆ శరీరమునకుఁగల జన్మగోత్రసంస్కారములు వేఱ్వేఱను మాటను విశదపరుచుచున్నారు.—

మూ. తజ్జాతం లబ్ధనామాకృతికం జాతకర్మాదిభిః మన్త్రసంస్కృతం పునః ఉపనయనసంస్కారయోగేణ బ్రహ్మ

చారిసంజ్ఞం భవతి, తదేవ శరీరం పత్నీయోగసంస్కారయోగేణ గృహస్థసంజ్ఞం భవతి, తదేవ వనస్థసంస్కారేణ తాపససంజ్ఞం భవతి, తదేవ క్రియానివృత్తినిమిత్తేన సంస్కారేణ పరివ్రాట్సంజ్ఞం భవతి, ఇత్యేవం త్వత్తో భిన్నం భిన్నజాత్యన్వయసంస్కారం శరీరమ్.

తా. నామరూపములుగల శరీరము పిత్రాదిభేదమువలన దేవనరపశ్వాదిభేదము గలదియని చెప్పఁబడెను. ఇపుడు సంస్కారమువలనఁ గలిగిన భేదమును చెప్పుచున్నాఁడు.—

వర్ణాశ్రమోచితమగు జాతకర్మాదిసంస్కారములుగల యాశరీరము ఉపనయనమువలన బ్రహ్మచారియని, పత్నీగ్రహణమువలన గృహస్థని, వనమునందు నివసించుటచేత వానప్రస్థని, సంన్యాసమువలన పరివ్రాట్టని పేర్లుగలదై జననగోత్ర సంస్కారరహితమై చిద్రూపుఁడవగు నీకంటె వేఱగును. ౨౧

అవ. శిష్యుని కిట్లు స్థూలశరీరమే నేనను నభిమానమును తొలఁగించి సూక్ష్మశరీరము నేననెడి యభిమానమును బోఁగొట్టుటకై యాసూక్ష్మశరీరముకూడ భూతకార్యమేయని చెప్పుచున్నారు.—

మూ. మనశ్చేంద్రియాణి చ నామరూపాత్మకాన్యేవ, 'అన్నమయం హి సోమ్య మనః' ఇత్యాదిశ్రుతిభ్యః. ౨౨

తా. 'మనస్సు అన్నవికారము, ప్రాణము జలమయము, వాక్కు తేజోమయము' అను శ్రుతివాక్యమువలన భూతకార్యములగు మనఃప్రాణేంద్రియాదులును నామరూపాత్మకములే. కాఁబట్టి మనస్సు మొదలగు సూక్ష్మసమూహముకూడ భూతకార్యమగుటవలన స్థూలదేహమువలెనే ఆత్మ కాదు. ౨౨

అవ. ఇట్లు శరీరమునకుఁగల జన్మగోత్రసంస్కారము లు వేఱని చెప్పఁబడెను. ఇపుడు తనకు (ఆత్మకు) అవి యెట్లు లేవో ఆప్రకారమును వివరించుచున్నారు.—

మూ. కథం చాహం భిన్నజాత్యన్వయసంస్కారవర్జితః ఇత్యే తచ్ఛృణు— యోఽసౌ నామరూపయోర్వ్యాకర్తా నామరూపధర్మవిలక్షణః స ఏవ నామరూపేవ్యాకు ర్వన్ సృష్ట్వేదం శరీరం స్వయం సంస్కారధర్మవర్జితో నామరూపే ఇహ ప్రవిష్టః అన్యైరదృష్టః స్వయం పశ్యన్ తథా అశ్రుతః శృణ్వన్ అమతో మన్వానః అవిజ్ఞాతో విజానన్ 'సర్వాణి రూపాణి విచిత్య ధీరో నామాని కృత్వాఽభివదన్యదాస్తే' ఇతి అస్మిన్నర్థే శ్రు తయః సహస్రశః—'తత్సృష్ట్వా, తదేవానుప్రావిశత్' 'అన్తః ప్రవిష్టః శాస్తా జనానామ్' 'స ఏష ఇహ ప్ర విష్టః' 'ఏష త ఆత్మా' 'స ఏతమేవ సీమానం విదార్యై తయా ద్వారా ప్రాపద్యత' 'ఏష సర్వేషు భూతేషు గూఢోఽత్మా' 'సేయం దేవతైక్షతహన్తాహమిమాస్తి స్రో దేవతాః' ఇత్యాద్యాః శ్రుతయః. ౨౩

తా. నీకు నామరూపము లెట్లు లేవనఁగా వినుము—నామరూపములు సృష్టికంటె పూర్వము లేవు. సృష్టియనఁగా నామరూపములే. నామరూపధర్మ ములులేని చిదాత్మ నామరూపాత్మకమగు జగత్తును సృజించి తాను నిర్వి కారుఁడై దానియందుఁ బ్రవేశించి జీవసంజ్ఞను బొంది, జాతిగోత్రసంస్కార ములు లేకయున్నాఁడు. రూపముగలదానికే నామజాతిగోత్రసంస్కారము లుండును. రూపరహితుఁడగు చిదాత్మకివి లేవు. గూటిలో చిలుకవలె పర

మాత్మయే శరీరమందుఁ బ్రవేశించెనేని కనిపింపఁడాయని శంకింపకుము. ఆత్మ అన్నిటినిఁ జూచును, దేనిచేతను జూడఁబడడు; అన్నిటిని వినును, వినఁబడఁడు; తలచును, తలంపఁబడఁడు; ఎఱుగును, ఎఱుగఁబడఁడు; సర్వరూపములను జేసి పేర్లుపెట్టెను; అను నీ యర్థమునందు 'తత్సృష్ట్వాతదేవాను ప్రావిశత్' ఈ మొదలగు శ్రుతులు ప్రమాణము. (శ్రుత్యర్థము—జగత్తును పుట్టించి దానియందు చైతన్యముగఁ బ్రవేశించి యేలుచుండెను. తాను గూఢముగ నుండెను. అని). ౨౩

అవ. క్షేత్రమనఁగా శరీరము, 'క్షేత్రజ్ఞుఁడు పరమాత్మయే' యని చెప్పిన శ్రుతివాక్యమునకు స్మృతినిఁగూడసహాయముగఁ జెప్పుచున్నారు:—

మూ. స్మృతయోఽపి—'ఆత్మైవ దేవతాః సర్వాః' 'నవద్వారే పురే దేహీ' 'క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి' 'సమం సర్వేషు భూతేషు' 'ఉపద్రష్టాఽనుమన్తా చ' 'ఉత్తమః పురుషస్త్వన్యః' 'అశరీరం శరీరేషు' ఇత్యాద్యాః, తస్మాత్ జాత్యన్వయసంస్కారవర్జితస్త్వమితిసిద్ధమ్. ౨౪

తా. నవరంధ్రములుగల పురమందు ఆత్మ క్షేత్రజ్ఞుఁడై యున్నాఁడు. ఉపాధియగు శరీరమందున్నను శరీరధర్మము లంటవని శ్రుతి చెప్పుచున్నది. కావున నీవు దేహాదులకంటె భిన్నుఁడవు. జాతిగోత్రసంస్కారములులేనివాఁడవు. ఇట్లు నిశ్చయింపుము. ౨౪

అవ. జీవుఁడు పరమాత్మకంటె వేఱుకాఁడని జాత్యన్వయసంస్కారములు లేనివాఁడని నిశ్చయించుట అనుభవమునకు విరోధమని శిష్యుఁడు శంకించుచున్నాఁడు.—

మూ. స యది బ్రూయాత్—అన్య ఏవాహమజ్ఞః సుఖీదుఃఖీ బద్ధః సంసారీ,అన్యోఽసౌ మద్విలక్షణః అసంసారీ దేవః, తమహం బల్యుపహారనమస్కారాదిభిః వర్ణాశ్రమకర్మభిశ్చారాధ్యసంసారసాగరాదుత్తితీర్షురస్మి, కథమహం స ఏవేతి. ౨౫

తా. అయ్యా! నేను అజ్ఞుఁడను, ఒకప్పుడు సుఖవంతుఁడను, మఱి యొకప్పుడు దుఃఖముగలవాఁడను, సంసారబద్ధుఁడను, పరమాత్మ నాకంటె విలక్షణుఁడు—అనఁగా నిత్యానందనిర్మల సచ్చిత్స్వరూపుఁడు. పరమాత్మ కంటె నే నన్యుఁడనుగానని శ్రుతులు బోధించినను నమ్మఁజాలను. నాకంటె పరమాత్మ భిన్నుఁడు, పూజ్యుఁడు, నా సంసారబంధమును బోఁగొట్టువాఁడును. మహాత్ముఁడగు పరమాత్మను నికృష్టుఁడగు జీవునిగఁ జూచుటవలన పాపము కద. కనుక వానిని సేవించి ముక్తుఁడను గాఁదలఁచినాడ నని శిష్యుని యభిప్రాయము. ౨౫

అవ. వత్సా! అట్లనకుము. భేదదృష్టివలన భయము గలుగునని గురువు నివారించుచున్నాఁడు:—

మూ. ఆచార్యో బ్రూయాత్—నైవం సోమ్య ప్రతిపత్తుమర్హసి, ప్రతిషిద్ధత్వాద్భేదప్రతిపత్తేః, కథం ప్రతిషిద్ధా భేదప్రతిపత్తిరిత్యత ఆహ—'అన్యోఽసావన్యోఽహమస్మీతి న స వేద' 'బ్రహ్మ తం పరాదాద్యోఽన్యత్రాత్మనో బ్రహ్మ వేద' 'మృత్యోః స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి' ఇత్యేవమాద్యాః. ౨౬

తా. వత్సా! భేదబుద్ధిని శ్రుతి నిషేధించినందున నీవట్లనుకొనవలదు. శ్రుతి యెట్లు నిషేధించెననఁగా—'జనకంటె పరమాత్మ వేఱు' అని తలఁచు

వాఁడు అజ్ఞుఁడు. అయ్యా! కించిద్ జ్ఞుఁడగు జీవునకు సర్వజ్ఞుఁడగు ఈశ్వరునకును భేదముండదా యని శిష్యుఁడుశంక చేయఁగా,ఆచార్యుఁడు కుమారా! భేదబుద్ధివలన భయమధికము కనుక ప్రతిబింబము బింబముకంటె వేఱుకాదనే న్యాయమువలన జీవాత్మపరమాత్మలకు భేదమును భావింపరాదని బోధింపవలెను. భేదబుద్ధిగలవాఁడు పశువువలె దేవతలకు వశ్యుఁ డగును. పరాధీనవృత్తి మిగుల కష్టముకద. మఱియు, నేను బ్రాహ్మణుఁడనని దేహాభిమానము గలవానిని ఆయభిమానము తత్త్వవిముఖునిఁ జేయును. ఏకమగు బ్రహ్మమును అనేకమువలెఁ జూచువాఁడు సంసారదుఃఖములనే పొందుచుండును. ఆత్మవస్తువునందు కల్పితవస్తువులు మిథ్యయని బోధించెడి 'నేహ నానాఽస్తికించన' ఈ మొదలగు శ్రుతులును గలవు.　　౨౬

అవ. పైని శ్రుతులు భేదదర్శనమునుమాత్రమే నిషేధించుట లేదు. భేదదర్శనము గలవానికి అనర్థమునుగూడ చెప్పుచున్నవి. అని చెప్పుచున్నారు:—

మూ. ఏతా ఏవ శ్రుతయో భేదప్రతిపత్తేః సంసారగమనం దర్శయంతి.　　౨౭

తాత్పర్యము అవతారికయందే వ్రాయఁబడినది.　　౨౭

అవ. భేదదృష్టిని నిందించి అభేదదర్శనమునకు ఫలమును జూపుచు, దీనినే గ్రహింపవలెనని చెప్పుచున్నారు:—

మూ. అభేదప్రతిపత్తేశ్చ మోక్షం దర్శయంతి సహస్రశః 'స ఆత్మా తత్త్వమసి' ఇతి పరమాత్మభావం విధాయ 'ఆచార్యవాన్ పురుషో వేద' ఇత్యుక్త్వా 'తస్య తావదేవ చిరమ్' ఇతి మోక్షం దర్శయంత్యభేదవిజ్ఞానాదేవ,

సత్యాభిసంధస్యాతస్కరస్యేవ దాహాద్యభావదృష్టాంతేన సంసారభావం దర్శయంతి, భేదదర్శనాదసత్యాభిసంధస్య సంసారగమనం దర్శయంతి తస్కరస్యేవ దాహాదిదృష్టాంతేన. ౨౮

తా. ఆపరమాత్మ నీవేయనుబోధను సద్గురువువలన బోధింపఁబడఁగా, లోకములో అగ్ని దివ్యము చేయునపుడు అసత్యమును జెప్పినదొంగకు హస్తము కాలును, సత్యముచెప్పినవానిహస్తము కాలదు; ఇట్లే సదాత్మతో తనకభేదమును గ్రహించినవానికి ముక్తియు, భేదముచూచువానికి సంసారబంధమును శ్రుతులు పెక్కుమాఱులు చెప్పినయర్థమును శ్రద్ధాభక్తులతో విని శిష్యుఁడు సుఖించును. ౨౮

అవ. సుషుప్తిదశయందుఁ బరమాత్మతో నైక్యమును అందఱు పొందుచుండఁగా ముక్తి యేలఁగలుగదని శంకింపకుము. అట్లు అభేదప్రతిపత్తి, యాసుషుప్తికాలమందుఁ గలుగుటకుఁ దగిన బుద్ధ్యాదులు లేవు కనుక ముక్తి కలుగదు. తిరిగి తమతమ దేహాత్మభావనతో లేచుటవలన సంసారము తప్పదనియు, జీవాత్మకు పరమాత్మతో భేదములేదను జ్ఞానము మోక్షహేతువనియు శ్రుతి సూచించుచున్నదని చెప్పుచున్నారు.—

మూ. 'త ఇహ వ్యాఘ్రో వా' ఇత్యాదినా చ అభేదదర్శనాత్ 'స స్వరాడ్ భవతి' ఇత్యుక్త్వా తద్విపరీతేన భేదదర్శనేన సంసారగమనం దర్శయంతి 'అథ యేఽన్యథాఽతో విదురన్యేరాజానస్తే ఽక్షయ్యలోకా భవన్తి' ఇతి ప్రతిశాఖమ్, తస్మాత్ మృషైవైవ మవాదీః

బ్రాహ్మణపుత్రో ఽదోఽన్వయః సంసారీ పరమాత్మవిల
క్షణ ఇతి.    ౨౯

తా. అభేదమును జూచువాఁ డాత్మారాముఁడని చెప్పి, అణుమాత్ర మైనను భేదబుద్ధిగలవానికి సంసారదుఃఖము తప్పదని ప్రతివేదమునఁ జెప్పఁబడెను. జీవునకుఁ బరమాత్మతో అభేదము ముక్తిహేతువని భేదము సంసార కారణమని అభేదస్తుతివలనను భేదనిందవలనను పరమాత్మాభేదము నిశ్చయింపఁబడెను. కనుక నేను బ్రాహ్మణుఁడను గృహస్థుఁడను ముముక్షువునైతి నను మాటలు అజ్ఞానవిలసితములే యని విరమించుచున్నాఁడు.    ౨౯

అవ. నేను బలిపూజలచే పరమేశ్వరుని ఆరాధించి సుఖింతునను మాటకూడ అజ్ఞానమే కాని సమ్యగ్దర్శనము కాదని చెప్పుచున్నారు.—

మూ. తస్మా త్ప్రతిషిద్ధత్వాద్భేదదర్శనస్య, భేదవిషయత్వా
చ్చ కర్మోపాదానస్య, కర్మసాధనత్వాచ్చ యజ్ఞోపవీతా
దేః, కర్మసాధనోపాదానస్య పరమాత్మాభేదప్రతిపత్త్యా
ప్రతిషేధః కృతో వేదితవ్యః; కర్మణాం తత్సాధనా
నాం చ యజ్ఞోపవీతాదీనాం పరమాత్మాభేదప్రతిపత్తి
విరుద్ధత్వాత్, సంసారిణో హి కర్మాణి విధీయంతే తత్సా
ధనాని చ యజ్ఞోపవీతాదీని; న పరమాత్మనోఽభేద
దర్శినః, భేదదర్శనమాత్రేణ చ తతోఽన్యత్వమ్.  ౩౦

తా. కర్తృకర్మకరణక్రియారూపపదార్థములు పరస్పరభిన్నములు. వేదాధ్యయన యాగాదిక్రియలకు సాధనములు యజ్ఞోపవీతాదికములు. నేను నిష్క్రియబ్రహ్మమును, నేను కర్తను అనునవి రెండును ఒకనియందుండ నేరవు. ఆరూఢునకైనను వ్యాపారమాత్రము తప్పదు. ఆరూఢునకు అహం

కారము లేనందున ఆవ్యాపారమువలన ఫలము కలుగదు. ఇది ఆరురుక్షు ప్రకరణము. ఆరురుక్షువనఁగా అభ్యాసకుఁడు. ఇంతమాత్రాన కర్మకాండ వ్యర్థముకాదు. కర్మకాండమునకు దేహాభిమానముగల సంసారు లధికారులు. పరమాత్మైక్యమును భావించెడివారలకు కర్మమందు అధికారము లేదు. సంసారులు పరమాత్మకంటె వేఱగుదురా? యని శంకింపకుము. పరమాత్మ ఉపాసింపఁదగినవాఁడు. జీవాత్మ యాపరమాత్మను ఉపాసనచేయువాఁడు. అనెడి యీభేదదర్శనమువలననే సంసారులు భిన్నులనవలసి వచ్చెను. కాని జీవాత్మ పరమాత్మలకు వాస్తవముగ భేదములేదు. భేదకారణములు ఉపాధిప్రతిబింబములు. భేదదర్శికి సంసారభయము తప్పదు. 30

అవ. 'బ్రహ్మాత్మైక్యజ్ఞానము కలుగఁగా కర్మములు తత్సాధనములును వ్యర్థములని శ్రుతి నిషేధించెను' అను మాటనే వ్యతిరేకముఖముగ తిరిగి చెప్పుచున్నారు.—

మూ. యది కర్మాణి కర్తవ్యాని నని వర్తయిషితాని కర్మ సాధనాసంబంధినః కర్మనిమిత్తజాత్యాశ్రమాద్యసంబంధినశ్చ, పరమాత్మనశ్చ ఆత్మనైవాభేదప్రతిపత్తిం నావక్ష్యత్ 'స ఆత్మా తత్త్వమసి' ఇత్యేవమాదిభి ర్నిశ్చితరూపై ర్వాక్యైః; భేదప్రతిపత్తినిందాం చ నాభ్యధాస్యత్ 'ఏష నిత్యో మహిమా బ్రాహ్మణస్య' 'అనన్వాగతం పుణ్యేనానన్వాగతం పాపేన' 'అత్ర స్తేనోఽస్తేనః' ఇత్యాదినా. 31

తా. కర్మములతోను తత్సాధనములతోను సంబంధములేక కర్మహేతువులైన జాత్యాశ్రమాదులతోను సంబంధములేక అసంగుఁడగు పరమాత్మయు కర్మములను మానకఁ జేయవలసి యుండెనేని ఈ జీవాత్మ యా

పరమాత్మయే, నీవు ఆపరమాత్మవే, నేను బ్రహ్మమును, ఈమొదలగు మహా వాక్యములు 'ఆత్మకంటె పరమాత్మ వేఱుకాదు, పరమాత్మకంటె ఆత్మ వేఱు కాదు' అని అభేదమును జెప్పకపోవును; భేదదర్శికి మృత్యుభయము గలు గునని నిందింపకపోవును. పుణ్యపాపములు జ్ఞానికి అంటవు. ఈ జ్ఞానదశయం దుచోరుఁడు చోరుఁడు కాఁడనియు నుతింపఁబడెను. ౩౧

అవ. ఉదాహృతవాక్యములకుఁ గ్రమముగఁ దాత్పర్య మును జెప్పుచున్నారు:—

మూ. కర్మాసంబంధిస్వరూపత్వం కర్మనిమిత్తవర్ణాద్యసంబంధ రూపతాం చ నాభ్యథాస్యత్ కర్మాణి చ కర్మసాధ నాని చ యజ్ఞోపవీతాదీని యద్యపరితిత్యాజయిషి తాని, తస్మాత్ససాధనం కర్మ పరిత్యక్తవ్యం ముముక్షు ణా, పరమాత్మాభేదదర్శనవిరోధాత్, ఆత్మా చ పర ఏవేతి ప్రతిపత్తవ్యో యథాశ్రుత్యుక్తలక్షణః. ౩౨

తా. యజ్ఞోపవీతాదిసాధనసహితములగు కర్మలు విడువఁదగనివి కావేని ఆత్మకు కర్మసంబంధము లేదనియు కర్మహేతువులగు వర్ణాశ్రమాది సంబంధములేదనియు చెప్పకపోవును. శ్రుతి అటుల అసంబంధమును జెప్పుట చేత ముముక్షువు కర్మములను ఆదరింపరాదు. ఏలయనఁగా, 'తత్త్వమసి' మొదలగు మహావాక్యములను విమర్శింపఁగా జీవాత్మ పరమాత్మయేకాని, ఇతనికంటె భిన్నుఁడుకాఁడు. కనుక నీకర్మాచరణము పరమాత్మైక్యజ్ఞానమునకు మాత్రమే విరుద్ధము. ౩౨

అవ. పైగ్రంథమున శ్రుతిస్మృతిప్రమాణములచే జీవా త్మపరమాత్మలకు ఏకత్వము నిరూపింపఁబడెను. ఆ ఐక్యమును

యుక్తులచే నిపుడు చూపుచున్నాఁడు—అందు జీవుఁడు కించిద్జ్ఞుఁడును ఈశ్వరుఁడు సర్వజ్ఞుఁడును గనుక వీరలు తమస్తిమిరములవలెను, శీతోష్ణములవలెను పరస్పరభిన్నులు కావలెనని శిష్యుఁడు వాదించుచున్నాఁడు:—

మూ. స యది బ్రూయాత్—భగవన్, దహ్యమానే ఛిద్యమానే వా దేహే ప్రత్యక్షా వేదనా; అశనాయాదినిమిత్తం చ ప్రత్యక్షం దుఃఖం మమ, పరశ్చాయమాత్మాఽయమాత్మాఽపహతపాప్మా విరజో విమృత్యుర్విశోకో విజిఘత్సోఽపిపాసః సర్వగంధరసవర్జితః శ్రూయతే సర్వశ్రుతిషుస్మృతిషు చ, కథం తద్విలక్షణః అనేకసంసారధర్మసంయుక్తః పరమాత్మానమాత్మత్వేన మాం చ సంసారిణం పరమాత్మత్వేన అగ్నిమివ శీతత్వేన ప్రతిపద్యేయ? సంసారీ చ సన్ సర్వాభ్యుదయనిఃశ్రేయససాధనే అధికృతః అభ్యుదయ నిఃశ్రేయససాధనాని కర్మాణి తత్సాధనాని చ యజ్ఞోపవీతాదీని కథం పరిత్యజేయమితి. 33

తా. స్వామీ! శరీరమును కాల్చినను కోసినను దుఃఖము ప్రత్యక్షముగఁ గనుపించుచున్నది. క్షుత్పిపాసలు అనుదినమును బీడించుచున్నవి. ఇవి ఆత్మధర్మములు. పరమాత్మ పాపము శోకము మరణము లేనివాఁడు, క్షుత్పిపాసలు లేనివాఁడు, దుఃఖాతీతుఁడు నని శ్రుతిస్మృతులు ఘోషించుచున్నవి. పాపదుఃఖ శోకమరణక్షుత్పిపాసలు గలిగిన జీవుఁడు పరమాత్మయగునా? తాదృశపరమాత్మ సంసారియగు జీవుఁడగునా? అగ్ని యెన్నఁడైన చల్లగనుండునా? సంసారియగు నేను సకలశ్రేయఃసాధనములగు కర్మములను

కర్మసహకారులగు యజ్ఞోపవీతాదులను మానఁదగునా యని శిష్యుఁ డడిగె నేని:—

మూ. తం ప్రతి బ్రూయాద్గురుః—యదవోచో దహ్యమానే ఛిద్యమానే వా దేహే ప్రత్యక్షా వేదనోపలభ్యతే మమేతి, తదసత్, కస్మాత్? దహ్యమానే ఛిద్యమాన ఇవ వృక్షే ఉపలబ్ధు రుపలభ్యమానే కర్మణి శరీరే దాహచ్ఛేదవేదనాయా ఉపలభ్యమానత్వాత్ దాహాదిసమానాశ్రయైవ వేదనా, యత్ర హి దాహః ఛేదో వా క్రియతే తత్రైవ వ్యపదిశతి దాహాదివేదనాం లోకః; న వేదనాం దాహాద్యుపలబ్ధరీతి, కథమ్? క్వ తే వేదనేతి పృష్టః శిరసి మే వేదనా ఉరసి ఉదరే ఇతి వా యత్ర దాహాదిస్తత్రైవ వ్యపదిశతి,న తూపలబ్ధరీతి, యద్యుపలబ్ధరి వేదనా స్యాత్ వేదనానిమిత్తం వా దాహచ్ఛేదాది వేదనాశ్రయత్వేనోపదిశే ద్దాహాద్యాశ్రయవత్. ౩౪

తా. వత్సా! దేహమును కోసినను కాల్చినను దుఃఖము నాకుఁ బ్రత్యక్షముగ నున్నదని నీవు చెప్పినమాట సరికాదు. ఏలయనఁగా, చెట్టునువలె శరీరమును కాల్చినను, కోసినను గలిగెడి బాధ తెలియఁబడుచుండుటచేత కర్మమగు చెట్టునకువలె శరీరమునకే కాని యాబాధ తెలిసికొనెడి నీకు కాదు. ఆకాల్పు, కోతయు నెక్కడనుండునో బాధకూడ అక్కడనే యుండును గద. లోకములో నొకనిని నీకు నొప్పి యెక్కడనని యడిగినయెడల 'నా తలనొప్పి, నాకడుపునొప్పి, నాకాలునొప్పి' యనునే కాని, 'తెలిసికొనునట్టి నాకునొప్పి' యని చెప్పడు. తెలియువాని (జ్ఞాత)కే నొప్పియు, దీనికారణ

మగు కాల్చును, కోతయు నుండునేని 'నన్ను కాల్చినారు, నన్ను కోసినారు, నాకు బాధ' యనియే చెప్పును. ఇచట నొక రహస్యము.—

జీవాత్మ పరమాత్మ యని చెప్పెడి భేదము ఉపాధుల నిమిత్తముగఁ జెప్పఁబడెనా? ఉపాధుల నుపేక్షించి కేవల చైతన్యమాత్రమునకుఁ జెప్పఁబడెనా? యని వికల్పింతము. ఈభేదము ఉపాధినిమిత్తముననే కలిగినదనెదవా? ఘటమఠాద్యుపాధులవలనఁ గలిగిన వ్యవహారదశయందలి ఘటాకాశము, మఠాకాశము నీ మొదలగు భేదములు మహాకాశమునకు వాస్తవముగ లేవుకద. భేదమును సాధింతుమన్నను సిద్ధమైన ఉపాధిభేదమును సాధింపనవసరము లేదు.

రెండవపక్షమున కేవలచైతన్యమునకు భేదమే లేదు. అట్టి వేదనను శరీరము తెలిసికొనునందువా? జడమగు చెట్టును కోయుచుండఁగా, కాల్చుచుండఁగా తాను (ఆత్మ) చూచునట్లు కాల్పఁబడుచున్న, లేక, కోయఁబడుచున్నశరీరమును తాను (ఆత్మ)చూచుచు కర్తయగును. కాని చూడలేని శరీరము కర్తకాదు. కోయఁబడుచు, కాల్పఁబడుచు నుండుటచేత కోత కాల్పునను బాధను పొందుచున్నట్టి తెలియఁబడు దేహము కర్మమే యగును. కాని వృక్షమువలె జడమగుటచేత శరీరమెన్నడును కర్తకానేరదు. కాఁబట్టి కాల్పు, కోత యెక్కడ (శరీరమందు) నుండునో అక్కడనే (ఆశరీరమందే) బాధకలదని చెప్పవలెను. 38

అవ. దాహచ్ఛేదాదికమువలనఁ గలిగిన దుఃఖము ఆ దాహచ్ఛేదాదులకు ఆశ్రయమగు శరీరమునకేకాని ఆత్మకు కాదను విషయమునందు మఱియొక యుక్తినిఁ జూపుచున్నారు:—

మూ. స్వయం చ నోపలభ్యేత చక్షుర్గతరూపవత్, తస్మాత్ దాహచ్ఛేదాది సమానాశ్రయత్వేన ఉపలభ్యమాన

త్వాద్దాహాదివత్ కర్మభూతైవ వేదనా, భావరూప
త్వాచ్చ సాశ్రయా తండులపాకవత్, వేదనాసమానా
శ్రయ ఏవ తత్సంస్కారః, స్మృతిసమానకాల ఏవోప
లభ్యమానత్వాత్ వేదనావిషయః, తన్నిమిత్తవిష
యశ్చ ద్వేషోఽపి సంస్కారసమానాశ్రయ ఏవ, తథా
చోక్తమ్— శ్లో. రూపసంస్కారతుల్యాఽఽధీ రాగ
ద్వేషౌ భయంచ యత్, గృహ్యతే ధీశ్రయం తస్మాత్
జ్ఞాతా శుద్ధోఽభయస్సదా. 3౫

తా. ఈ దాహచ్ఛేదకృతమగు బాధ ఆత్మదే యగునేని నేత్రము యొక్క రూపమును నేత్రము గ్రహింపలేనివిధమున తన బాధను ఆత్మ గ్రహింపలేకపోవును. కనుక యీబాధ తెలియఁబడు శరీరమందుండుటవలన శరీరముదేకాని తెలిసికొనెడి ఆత్మది కాదు. అయ్యా! లోకములో సుఖ దుఃఖములు చేతనధర్మములుగాని అచేతనములగు గోడ కర్ర తాయి మొదలగువానికి సుఖదుఃఖము లుండవుకద. పోనిందు చేతనమగు ఆత్మకు దుఃఖము లేదనెదమేని దుఃఖము ననుభవించెడి శరీరము అచేతనము కాకపోవలెను. శరీరము రథమువలె అచేతనము (జడము) కద. కనుక బౌద్ధమతానుసారముగ దుఃఖమునకు ఆశ్రయమే లేకపోవలెను. అని శిష్యుఁడు శంకింపఁగా గురువు ఉత్తరమిచ్చుచున్నాఁడు—వత్సా! వినుము. భావమనఁగా ఉండుట, అనఁగా నొకపని. పనియనుక్రియ యొకవస్తువునం దుండవలెను. పచనక్రియ (వంట) బియ్యమునందేకద యున్నది. కనుక వేదన (బాధ) యేదో యొక పదార్థమందే యుండవలెను. మఱియు బాధ యొకపదార్థమును ఆశ్రయింపని యెడల కాలాంతరమందు బాధస్మరణమే లేకపోవలసివచ్చును. అనఁగా, బాధ యొకపనికాదేని మఱియొకపుడు నాకాలిలో కురుపువలన నెక్కువ

బాధ కలిగెననే తలంపు కలుగకపోవలెననుట. లేక, బాధ యొక పదార్థమం దుండవలెనుగద. ఆపదార్థము ఆత్మయేకావలెను. కాలాంతరమందు సంస్కారమువలనఁ గలిగెడి స్మరణము ఆత్మయందే కలుగుచున్నదికద, అని శంకింపవలదు. బాధ, సంస్కారము, స్మరణము ననునవి యొకపదార్థమందే యుండవలెను, అనే నియమమువలన వేదనయున్నచోటనే సంస్కారస్మరణములు కలుగవలెను. జ్ఞానమునకు కర్మము శరీరము, అనఁగా తెలియఁబడునది. జ్ఞాత ఆత్మ (తెలిసికొనునది). బాధ జ్ఞానకర్మమగు శరీరముననే కాని జ్ఞాతయగు ఆత్మదికాదు. సంస్కారస్మరణములును ఆత్మవికావు. ఎట్లనఁగా, బాధ శరీరాభిమానముగల జాగ్రత్ స్వప్నావస్థలయందే తెలియఁబడునుగాని శరీరాభిమానములేని సుషుప్త్యవస్థయందుఁ దెలియఁబడకపోవుటచేత నది శరీరముదేకాని ఆత్మది కాదు. చిక్కుట బలియుంట మొదలగునవి దేహధర్మములేకాని ఆత్మధర్మములు కావుకద.

ఇదిగాక, శరీరమును కోసినను కాల్చినను 'నన్ను కోసినారు కాల్చినారు'అని దేహమే నేనను అభిమానముగలవాఁడు తలఁచుచున్నాఁడు. ఆసంస్కారము,స్మృతి దేహాభిమానముగలవానికే కలుగుచున్నది. దేహాభిమానములేని సుషుప్త్యవస్థయందు కలుగుటలేదు, దేహము కనుబడుటలేదు. జాగ్రత్స్వప్నావస్థలయందే తెలియఁబడుదేహము జ్ఞానక్రియకు కర్మముగాని జ్ఞానాశ్రయమగు కర్తకాదు. కనుక సంస్కారస్మరణాదులతోఁ గూడుకొన్న సమూహమునకే బాధకాని సంఘాతసాక్షియగు ఆత్మకదిలేనందున ఆత్మ నిత్యశుద్ధమే, కాని బాధకలదికాదు, అను మాటయందు వృద్ధులయొక్క సమ్మతినిఁ జూపుచున్నాఁడు. 'రూపసంస్కారేతి' అను శ్లోకమున కిదియే యర్థము. రూపమనఁగా తెలుపు నలుపు మొదలగు రంగులు. సంస్కారమనఁగా వాని సూక్ష్మావస్థ, లేక కాలాంతరమందు స్మరణకారణమగు అనుభవసంస్కారము. ఈ రూపసంస్కారములకు ఏయుపాధికలదో రాగద్వేషములకు నదియే

యుపాధి. ఉపాధియగు బుద్ధినుండియే భయము కలుగును. కావున రాగ ద్వేషభయములు బుద్ధియందే కలుగుచుండును. బుద్ధిలేని సుషుప్తిదశయం దివియేవియును లేవు. ఇచట – శ్లో. రాగేచ్ఛా సుఖదుఃఖాదిబుద్ధౌ సత్యాం ప్రవర్తతే, సుషుప్తౌ నాస్తి తన్నాశా త్తస్మాద్బుద్ధేస్తు నాత్మనః." అని శంకరాచార్యవచనము ప్రమాణము. సంకల్పసంశయాదులగు వృత్తులన్నియు ధీవృత్తులేకాని ఆత్మవికావు. కాఁబట్టి ఆత్మ బాధలేనివాఁడు, నిత్యశుద్ధుఁడు, రాగద్వేషరహితుఁడు, అభయుఁడు, సంసారరహితుఁడు నని తాత్పర్యము. ౩౭

అవ. బాధాదికము ఆత్మధర్మము కాదనుమాటను యుక్తిచేతను వృద్ధసమ్మతిచేతను నిరూపించియు మఱల ప్రశ్న పూర్వకముగా శ్రుతిచేత నిరూపించుచు ఆబాధాదికమునకు ఆశ్రయవిశేషమును నిశ్చయించుచున్నారు.—

మూ. కిమాశ్రయాః పునః రూపాదిసంస్కారాదయ ఇతి ? ఉచ్యతే—యత్ర కామాదయః, క్వపునస్తే కామాద యః? 'కామః సంకల్పో విచికిత్సా' ఇత్యాదిశ్రుతేః బుద్ధావేవ, తత్రైవ రూపాదిసంస్కారాదయోఽపి, 'కస్మిన్ను రూపాణి ప్రతిష్ఠితానీతి హృదయే' ఇతి శ్రుతేః, 'కామా యేఽస్య హృది శ్రితాః' 'తీర్ణో హి యదా సర్వాన్ శోకాన్ హృదయస్య' 'అసంగో హ్యయమ్' 'తద్వా అస్యైతదతిచ్ఛందాః'ఇత్యాదిశ్రుతిభ్యః. 'అవికార్యోఽయముచ్యతే' 'అనాదిత్వాన్నిర్గుణత్వాత్' ఇత్యాదిభ్యః—ఇచ్ఛాద్వేషాది చ క్షేత్రస్యైవ విషయస్య ధర్మో నాత్మన ఇతి—స్మృతిభ్యశ్చ కర్మస్థైవా శుద్ధిః నాత్మస్థా ఇతి. ౩౮

తా. సకలకామములు, వానిసంస్కారములు బుద్ధివేకాని ఆత్మవి కావు అని నిశ్చయింపఁబడెను. 'ఏతత్సర్వం మన ఏవ' అను శ్రుతి ఇచట ప్రమాణము. ఆత్మకు వేదన(పీడ), కామము, ద్వేషము మొదలగు ధర్మములు లేవని 'అసంగోహ్యయం' అను శ్రుతియుఁ, 'నిర్గుణ' ఇత్యాది స్మృతులును ప్రమాణములు. ఇచ్ఛ, ద్వేషము, సుఖదుఃఖములు, సంఘాతము, చైతన్యము, ధర్మము ననునవియు వీని వికారములును క్షేత్రమనఁబడును. క్షేత్రజ్ఞుఁడగు ఆత్మకీధర్మములులేవు, అని పైని చెప్పిన శ్రుతిస్మృతులు ఘోషించుచున్నవి. క్షేత్రము విషయము గనుక ఆత్మ కానేరదు. ఆత్మవిషయి. క్షేత్రజ్ఞుఁడును వికారములన్నియును క్షేత్రమునకే కాని క్షేత్రజ్ఞుఁడగు ఆత్మవి కావు. 3౬

అవ. ఉపక్రమించినదానికి ఉపసంహారము చేయు చున్నారు—

మూ. అతో రూపాదిసంస్కారాద్యశుద్ధి సంబంధాభావాత్ న పరస్మాదాత్మనో విలక్షణత్వమితి ప్రత్యక్షాదివిరోధాభావాత్ యుక్తం పర ఏవాత్మాఽహమితి ప్రతిపత్తుమ్, 'తదాత్మానమేవావేదహం బ్రహ్మాస్మీతి' 'ఏకధైవాఽనుద్రష్టవ్యమ్' 'అహమేవాధస్తాత్' 'ఆత్మైవాధస్తాత్' 'సర్వమాత్మానం పశ్యేత్' 'యత్ర త్వస్య సర్వమాత్మైవ' 'ఇదం సర్వం యదయమాత్మా' 'స ఏషోఽకలః,' 'అనంతరమబాహ్యమ్' 'సబాహ్యాభ్యంతరోహ్యజః' 'బ్రహ్మైవేదమ్' 'ఏతయా ద్వారా ప్రాపద్యత' 'ప్రజ్ఞానస్య నామధేయాని' 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' 'తస్మాద్వా' 'తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్' 'ఏకో దేవః సర్వభూతేషు గూఢః సర్వవ్యాపీ'

'అశరీరం శరీరేషు' 'న జాయతే మ్రియతే' 'స్వప్నాంతం జాగరితాంతం' 'సమ ఆత్మేతి విద్యాత్' 'యస్తు సర్వాణి భూతాని' 'తదేజతి తన్నైజతి' 'యేన స్తత్పశ్యన్' 'తదేవాగ్నిః' 'అహం మనురభవం సూర్యశ్చ' 'అంతఃప్రవిష్టః శాస్తా జనానామ్' 'సదేవ సోమ్య' 'తత్సత్యం స ఆత్మా తత్త్వమసి' ఇత్యాదిశ్రుతిభ్యః.

తా. నీకు రూపాదిసంస్కారములును దోషములును లేనందున నీవు పరమాత్మకంటె భిన్నుఁడవుకావు, కనుక నేను పరమాత్మనేయని భావించి సుఖింపుము. ఈ రూపాదులు సంస్కారములు కామక్రోధాదిదోషములు జాగ్రత్స్వప్నములయందే కలుగుచు సుషుప్తియందు మనస్సు ఆత్మయందు లయించఁగా నీరూపాదులు దీనితోఁగూడ లేనందున నీ సకలము మనస్సునదేకాని ఆత్మవికావనిచెప్పిన పూర్వవాక్యమును మరువకుము. నీవు పరమాత్మకంటె వేఱుకావు అను విషయమునందు 'తదాత్మానమేవావేత్' - మున్నగు శ్రుతులు ప్రమాణము. ప్రమాణభూతశ్రుతుల తాత్పర్యము:—

ఆగుర్వనుగ్రహకాలమందు నేను బ్రహ్మమే యని దృశ్యమగు నామరూపములకంటెను, అనృతజడదుఃఖాత్మకమగు జగత్తుకంటెను తనను విలక్షణమగు ప్రత్యగాత్మగా తెలిసికొనెను. అనఁగా నామములకును, వీనిని గ్రహించుశ్రోత్రేంద్రియమునకును, రూపములకును, వీనినిఁజూచెడి నేత్రేంద్రియములకును ఆత్మ సాక్షియై జాగ్రత్స్వప్నములయందు వీని భావములను, సుషుప్తియందు వీనియభావమును కనిపెట్టుచు అనృతము జడము దుఃఖము కానిదై ప్రకాశించును. ఈధర్మములు జగత్తునవేకాని ఆత్మవికావు. సచ్చిదానందములు ఆత్మధర్మములు, అని వాక్కుతోఁ జెప్పవీలులేక జగద్ధర్మములగు అనృతముకాదు, జడముకాదు, దుఃఖముకాదు అని లక్షణావృత్తితో వేద

ము భయపడుచు చెప్పెను. మనోవాక్కులకు గోచరముకాని ఆత్మను బోధిం చునపుడు వాచ్యార్థము చెల్లదు. ఆత్మకంటె నితరముకాదని లక్షణావృత్తియే యిట్లు ప్రవర్తించును. ఆత్మ ఒకటియేకాని విషయములవలె బహురూపము లుగ చూడఁదగదు. ఆత్మ పరిపూర్ణము అనియు వ్యవహారసిద్ధికై ఆయాత్మ యందు అహంకారము ఆరోపింపఁబడినదనియు, తరువాత అహంకారకృత మైన పరిచ్ఛేదాదివికారములను దొలఁగించుటకై ఆయాత్మ ప్రత్యగేకరస మనియు, ఆరోపితసకలవికారములకు సాక్షియనియు ఛాందోగ్యశ్రుతి యిట్లు నిరూపించుచున్నది—"నేనే వ్యవహారమం దున్నానని, నేనే ఆత్మ యని, అంతయు ఆత్మయే యనియుం." ఆయాత్మకు అవయవములు లేవు. బాహ్యాంతరములూ లేవు. ఈ ధర్మములు కల్పితములగు ఉపాధులవే అని యితరశ్రుతులు. మఱియు పుట్టుట, పుట్టియుండుట, పెరుగుట, మారుట, కృశించుట, నశించుటయునను ఆరువికారములు ఉపాధులవేకాని ఆత్మధర్మ ములుం కావు. కల్పితములగు సకలోపాధులను మిథ్యయని యుపేక్షించుట వలన సకలము బ్రహ్మమే. ఏకము, ద్వితీయరహితము, సృజించిన ఉపాధుల యందు ప్రవేశించి జీవసంజ్ఞకలదై వ్యవహరించును, అని ఐతరేయశ్రుతి. ఈ జీవులు దేనిసహాయమువలన వినునో కనునో తినునో అది ప్రజ్ఞానము. అదియే బ్రహ్మము. నేత్రశ్రవణాదులు ప్రజ్ఞానముయొక్క నామధేయ ములు. రాకపోకలుగల సకలవికారములకు సాక్షి బ్రహ్మమే యని తైత్తిరీ యకశ్రుతియు, సర్వభూతములందు గూఢముగ వ్యాపించియున్నదని శ్వేతా శ్వతరోపనిషత్తు చెప్పుచున్నవి. శరీరమందున్నప్పటికి శరీరమును తద్ధర్మము లను అంటక ఆకాశమువలె పూర్ణమనియు, జననమరణములులేక జాగ రాద్యవస్థలు వచ్చుచుపోవుచుండఁగా వాని రాకపోకలకు సాక్షియైనదే బ్రహ్మమనియు కఠోపనిషత్తు చెప్పుచున్నది. దృశ్యము, దర్శనము, దృష్టి యను భేదములు కల్పితములు. ఇందు వాస్తవము బ్రహ్మమే, అదియే ఆత్మ యని కౌషీతకీశ్రుతి. సకలభూతములును ఆత్మయందేయున్నవి. ఆశరీ

నోపాధులనుబట్టి కదులుచున్నట్టు తోఁచినను ఆత్మ కదలదు. ఘటము నొక చోటునుండి మఱియొక చోటునకు తీసికొనిపోవునపుడు ఘటాకాశము జరుగునని అజ్ఞులు తలచినను పరిపూర్ణమగు ఆకాశము కదలదు. ఆకాశమునకు ఉపాధియగు ఘటమే కదలును. ఇట్లే పరిపూర్ణాత్మ ఉపాధిద్వారముననే కదులునుగాని ఆత్మ స్వతః అచలమే, నిష్క్రియమేయని ఈశావాస్యోపనిషత్తు. సర్వమునకు ఉపాదానకారణమగు ఏ బ్రహ్మమందు సకలభువనములు కలిగినవో ఆయీభువనములు ఆ బ్రహ్మముకంటె వేఱుకావు. బట్టయందు వ్రాయఁబడు స్థావరజంగమరూపకచిత్రములన్నియు బట్టకంటె వేఱుకావుకద, అని గురువు చెప్పినవాక్యమందును శ్రుతియందును విశ్వాసముతో వేసుడు (ప్రకాశస్వరూపుఁడై) దృఢజ్ఞానముగలిగియుండెను. ఇట్టి దృఢజ్ఞానముగల వామదేవుఁడు నేను మనువు అయితిని యనియు, ఆ బ్రహ్మమే అగ్నియని వాయువని మఱియొకడును జెప్పెననియు, సృజించిన భూతములయందుండి నడిపించుచు ఒకఁడైన యాత్మ ఉపాధివశమున ననేకములుగ చరించును అని చెప్పెడి తైత్తిరీయశ్రుతి జీవపరాత్మలకు అభేదమునే చెప్పుచున్నది. మఱియు, సృష్టికంటె పూర్వమందు ఆత్మ యొక్కటియే యని, అదియే సత్యమనియు, దేహేంద్రియవిలక్షణుఁడవై వీనికి సాక్షివై, త్వంపదమునకు లక్ష్యార్థమవగు నీవు శుద్ధబ్రహ్మమవేయని ఛాందోగ్యశ్రుతి చెప్పుచున్నది. ౩౭.

అవ. శ్రుత్యుక్తమగు అర్థము ననువదించెడి స్మృతులనుగూడ చూపుచున్నారు:—

మూ. స్మృతిభ్యశ్చ 'పూః ప్రాణినః సర్వ ఏవ గుహాశయస్య' 'ఆత్మైవ దేవతాః' 'నవద్వారే పురే' 'సమం సర్వేషు భూతేషు' 'విద్యావినయసంపన్నే' "అవిభక్తం విభక్తేషు'

'వాసుదేవః సర్వమ్' ఇత్యాదిభ్యః ఏక ఏవాత్మా పరం బ్రహ్మ సర్వసంసారధర్మవినిర్ముక్తస్త్వమితి సిద్ధమ్. ౩౮

తా. సకలప్రాణులయందు గుహాశయుఁడై యొక్కఁడగు ఆత్మకు శరీరములు పురములు. ఆత్మ యొక్కఁడేకాని బుద్ధ్యుపాధులవలన వ్యవహారదశయందు వేఱుగఁ దోఁచును. ఈపురములు తొమ్మిదిద్వారములు గలవి. అనఁగా ఊర్ధ్వభాగమున ముఖనాసికానేత్రశ్రోత్రరూపములగు ఏడుద్వారములును, అధోభాగమున పాయూపస్థలను రెండుద్వారములును శరీరములనే పురములకు గలవు. పండితులయందు పామరులయందు చండాలురందు కుక్కలు మొదలగు జంతువులందును సముఁడగు చైతన్యాత్మకు భేదములేదు. సర్వము వాసుదేవుఁడే. వ్యవహారదశయందలి భేదము కల్పితముగాని వాస్తవము కాదు. ౩౮

అవ. ఇట్లు శ్రుతిస్మృతులచేతను న్యాయములచేతను జీవపరమాత్మలకు అభేదము చెప్పఁబడఁగా శిష్యుఁడు లౌకికవైదికవ్యవహారములందలి విరోధమును శంకించుచున్నాఁడు—

మూ. స యది బ్రూయాత్—యది భగవన్ అనంతరః అబాహ్యః సబాహ్యాభ్యంతరో హ్యజః కృత్స్నః ప్రజ్ఞానఘనఏవ సైంధవఘనవదాత్మా సర్వమూర్తిభేదవర్జితః ఆకాశవదేకరసః, తర్హి కిమిదం దృశ్యతే శ్రూయతే వా సాధ్యం సాధనం వా సాధకశ్చేతి శ్రుతిస్మృతిలోకప్రసిద్ధం వాదిశతవిప్రతిపత్తివిషయ ఇతి. ౩౯

తా. గృహము, క్షేత్రము, ధనము ఇటువంటివి సాధ్యములు. ప్రతిగ్రహము, సేవ, యుద్ధము, జయము ఇటువంటివి సాధనములు. వానినపే

క్షించెడి బ్రాహ్మణక్షత్రియాదులు సాధకులు. ఇవి యీలోకమున నుపయోగించునవి. స్వర్గము సాధ్యము. యజ్ఞము సాధనము. స్వర్గకాముఁడు సాధకుఁడు. ఇవి పరలోకోపయోగములు. 'స్వర్గకామో యజేత' అను శ్రుతి యీ యర్థమును దెలుపుచున్నది. ఇవి శ్రుతిస్మృతిన్యాయములవలన సిద్ధములును వివాదాస్పదములునై యున్నవి. ఆత్మ బాహ్యాభ్యంతరములులేక ప్రజ్ఞానమాత్రుఁడై, మూర్తిభేదములేక ఆకాశమువలె నొక్కటియే యగునేని యపుడు పైని చెప్పిన వ్యవహారమునకు విరోధముకాదా యని శిష్యుఁడు శంకించునేని (ఆచార్యో బ్రూయాత్) ముందుగ్రంథముతో నన్వయము.

అవ. వ్యవహారము మాయాకల్పితమగుటవలన పారమార్థికమగు బ్రహ్మాత్మైక్యమునకు విరోధముండదని గురువు సమాధానము చెప్పుచున్నారు:—

మూ. ఆచార్యో బ్రూయాత్—అవిద్యాకృతమేతద్యదిదం దృశ్యతే శ్రూయతే వా సాధ్యం సాధనం సాధకశ్చేతి, పరమార్థతస్త్వేక ఏవాత్మా అవిద్యాదృష్టేః అనేకవత్ ఆభాసతే, తిమిరదృష్ట్యా అనేకచంద్రవత్, 'యత్ర వా అన్యదివ స్యాత్' 'యత్ర హి ద్వైతమివ భవతి తదితర ఇతరం పశ్యతి' 'మృత్యోః స మృత్యుమాప్నోతి' 'అథ యత్రాన్యత్పశ్యతి అన్యచ్ఛృణోతి అన్యద్విజానాతి తదల్పమ్' 'అథ యదల్పం తన్మర్త్యమితి' 'వాచారంభణం వికారో నామధేయం అనృతమ్' 'అన్యోఽసావన్యోఽహమ్'ఇతి భేదదర్శననిందోపపత్తేరవిద్యాకృతం ద్వైతమ్, 'ఏకామేవాద్వితీయమ్' 'యత్ర

త్వస్య' 'కో మోహః కః శోకః' ఇత్యాద్యేకత్వవిధి శ్రుతిభ్యశ్చేతి. ౮౦

తా. వత్సా! కనిపించెడి వినిపించెడి యీజగత్తంతయు మాయచేఁ గల్పితము కావున పరమార్థదృష్టికి ఆత్మయొక్కటే. ఏలయనఁగా సర్వము ఆత్మయందే కల్పింపఁబడ్డెను. బంగారముచేఁ జేయఁబడిననగలన్నియు బంగారము కాకపోవునా? తల తిరిగెడివానికంటికి చంద్రుఁ డొక్కఁడైనను అనేకచంద్రులుగ కనుపించునట్లు ఒక్కటియగు ఆత్మ అవిద్యవలన ననేకముగఁ దోఁచుచుండును. స్వప్నమందు రెండవవస్తువు ఉన్నట్టు తోఁచినను మెలఁకువరాఁగా తనకంటె నన్యమేదియును లేదుకద. ఇట్లు అవిద్యాదశయందు ద్వైతము వస్తుదృష్టికి లేనిదైనను చూచువాఁడు, చూడఁబడునది, చూపునను భేదము కలుగుటచేత తాను ద్రష్టయని, తనకంటె నన్యము దృశ్యమని తదితరమగు కన్ను దర్శనమనియుం దోఁచును, మఱియు భేదదృష్టితోఁ గనుపించునది అల్పము. అల్పమెల్ల నశించునదే. కావున నది సదాత్మకాదు. కాఁబట్టి పరిపూర్ణసద్వస్తు వొకటియే. ఆయాత్మయందు ద్వైతము అవిద్యచే గల్పింపఁబడును. మన నిద్రయే లేనిపోనివస్తువులను గల్పించుచుండఁగా పరమేశ్వరుని మాయ అనంతవివిధజగత్కల్పనను చేయ లేకపోవునా? ఆత్మ యొక్కటియే, జగత్తు దృశ్యమగుటచేత స్వప్నమువలె కల్పితమని యెఱిఁగిన జ్ఞానికి శోకమోహము లుండవని శ్రుతులు ఘోషించుచున్నవి. ౮౦

అవ. అయ్యా! సాధ్యము, సాధకుఁడు, సాధనము నను త్రిపుటి అవిద్యాకల్పితమగునేని శ్రుతి కర్మకాండము నేల చెప్పవలెను? ఆ శ్రుతి ప్రమాణమగునా యని శిష్యుఁడు శంకించుచున్నాఁడు:—

మూ. యద్యేవం భగవన్, కిమర్థం శ్రుత్యా సాధ్యసాధనాది భేద ఉచ్యతే ఉత్పత్తిః ప్రలయశ్చేతి?.  ౪౧

తా. ద్వైతప్రపంచము మిథ్యయగునెడల కర్మకాండ ప్రమాణము కాకపోవుటయేకాక జ్ఞానకాండమందును సృష్ట్యాదివాక్యములు ద్వితీయవస్తువు లేకపోవుటచేత ప్రమాణములు కాకపోవలయును. అట్లేని శ్రుతి సాధ్యసాధనసాధకభేదమును జెప్పినట్లు ప్రపంచముయొక్క ఉత్పత్తిస్థితుల నేల చెప్పవలెను?  ౪౧

అవ. ఓయీ! వేదాంతవాక్యశ్రవణాదికమువలన గలిగిన బ్రహ్మాత్మైక్యజ్ఞానము కలుగకమునుపా? కలిగినపిమ్మటనా? కర్మకాండము ప్రమాణము కాకపోవుట యని వికల్పించి బ్రహ్మాత్మైక్యజ్ఞానము కలుగకమునుపు కర్మకాండము ప్రమాణము కాకపోదని చెప్పుచున్నారు:—

మూ. అత్రోచ్యతే—అవిద్యావతః ఉపాత్తశరీరాదిభేదస్య ఇష్టానిష్టయోగినమాత్మానం మన్యమానస్య సాధనైరేవేష్టానిష్టప్రాప్తిపరిహారోపాయవివేకమజానతః ఇష్టప్రాప్తిం చానిష్టపరిహారం చేచ్ఛతః శనైస్తద్విషయమజ్ఞానం నివర్తయితుం శాస్త్రమ్, నసాధ్యసాధనాదిభేదం విధత్తే, అనిష్టరూపః సంసారో హి సఇతి,తద్భేదదృష్టిమేవా విద్యాం సంసారమున్మూలయతి ఉత్పత్తిప్రలయాద్యేకత్వోపపత్తి ప్రదర్శనేన.  ౪౨

తా. శాస్త్రము సిద్ధబ్రహ్మమును జెప్పలేదు. కాని తదావరకాజ్ఞానమును దొలఁగింపఁబూనును. 'అప్రాప్తేశాస్త్రమర్థవత్'='శాస్త్రము దొరకని

వస్తువును సాధించుచు సార్థకమగును, అను న్యాయముగలదు. దీనిచేత శాస్త్రజ్ఞాన మెఱుఁగనివారికిని ఇది సాధనము. వీఁడు కర్తయను జ్ఞానముకలదు గనుక శాస్త్రము సాధ్యసాధనాదిభేదము చెప్పుటకుఁ బూనుకొనలేదు. మఱే మనఁగ; ప్రసిద్ధభేదమును దీసికొని పురుషుఁ డెఱుఁగని పురుషార్థసాధనమును బోధించుటకుఁ బ్రవర్తించిన శాస్త్రము ప్రమాణము కాకపోదని తెలియవలెను. ఎట్లనఁగా—ఏదైన నొక యుపాయముచేత ఇష్టము కలుగును, బాధ తొలఁగును అని సామాన్యముగ తెలిసి, ఆ యుపాయములను చక్కఁగ నెఱుఁగనివాని అజ్ఞానమును బోఁగొట్టుటకు శాస్త్రము ప్రవర్తించెను. బాగుగ నెఱిఁగినవాఁడుగాని బొత్తిగ నెఱుఁగనివాఁడుగాని శాస్త్రము చదువతగడని "నాత్యంతమజ్ఞః నో తదజ్ఞః అస్మిన్ శాస్త్రేఽధికారవాన్" యోగవాసిష్ఠ మందుఁ జెప్పఁబడెను. కాని లోకప్రసిద్ధమగు సాధ్యసాధనాదిభేదమును తాను చెప్పఁబూనలేదని తెలియవలెను.

అనాదియగు అవిద్యచేత స్వస్వరూపమును మఱచి శరీరేంద్రియమనోబుద్ధులనే ఆత్మగాఁ దలఁచుచుఁ దనకు నితరునివలన పురుషార్థము సంభవించవలెనని యపేక్షించుచు, ఆయుపాయమును వెదుకుచు శరీరోపాధివశమున తన్ను పరిచ్ఛిన్నుఁడు (అల్పుఁడు)గా దలఁచువాఁడు మహాపురుషార్థమును దెలియఁజాలఁడు. కనుక నట్టి జిజ్ఞాసువునకు అపేక్షితమగుచు ప్రమాణాంతరమున తెలియఁబడని స్వర్గాదిసుఖసాధనములను జూపుచు నింద్యకర్మములను మాని, విహితకర్మములను జేయుటవలన చిత్తశుద్ధిగలిగి సూక్ష్మవస్తుతత్త్వమును దెలియుటకు అర్హుఁడై తెలియఁబడని, మోక్షసాధనమగు ఆత్మతత్త్వజ్ఞానమును గలిగించును. ఈప్రకారము పురుషుని అజ్ఞానమును బోఁగొట్టి, తెలియఁబడక కప్పఁబడియున్న ఆత్మస్వరూపమును బోధించును అనే యభిప్రాయముతో "శనైః" మెల్లఁగ శ్రుతి బోధించునని చెప్పఁబడెను. సంసారము బహువిధదుఃఖములు గలదగుటచేత సంసారనివృ

త్తిరూపమును మహాపురుషార్థమును నగు మోక్షమనెడి ఫలప్రయోజనము నపేక్షించి యిట్లు తాత్పర్యార్థముచు వర్ణించి వాచ్యార్థము విడువఁబడెనని తెలియవలెను. కర్మకాండముచేత, సాధ్యసాధనసాధక భేదములు, స్పష్టముగ నుండుటచేత దానిని వదలి పురుషార్థసాధనము వర్ణింపఁబడ్డెను. అద్వైతవస్తు బోధమునకై వర్ణింపఁబడు సృష్ట్యాదివాక్యములును ప్రమాణముకాకపోవు. ప్రపంచసృష్టి దేనినుండి కలిగెనో యెక్కడనుండునో యెక్కడ లయించునో, అదియే, అలంకారములు ఏబంగారమునుండి పుట్టి ఏబంగారమునందే యుండి, కరిగినపుడు తిరిగి యేబంగారమగునో ఆప్రకారముగ, బ్రహ్మమొక్కటియే యనే బోధకు సాధనముగ సృష్టిని వర్ణించుటవలన సంసారమునకు మూలమగు అవిద్యను నివారించుచున్న సృష్ట్యాదివాక్యము ప్రమాణము కాకపోదు. సంసారమునందే సాధ్యసాధనసాధక భేదదృష్టి గలదుగాని పరమార్థదశయందీభేదములేక అద్వైతమే మిగులును. ౪౨

అవ. అవిద్యను దొలఁగింప నేమిఫలమనఁగ జెప్పుచున్నారు:—

మూ. అవిద్యాయా మున్మీలితాయాం శ్రుతిస్మృతిన్యాయే
భ్యోఽనంతరోఽబాహ్యః సబాహ్యాభ్యంతరో హ్యజః,
సైంధవఘనవ త్ప్రజ్ఞానఘన ఏవైకరస ఆత్మా ఆకాశ
వత్పరిపూర్ణ ఇత్యత్రైవ ఏకా ప్రజ్ఞా ప్రతిష్ఠా పరమార్థ
దర్శినో భవతి, న సాధ్యసాధనోత్పత్తిప్రలయాది
భేదేన అశుద్ధిగంధో ఽప్యుపపద్యతే. ౪౩

తా. ఆత్మకు జననమరణములు లేవు. బాహ్యాభ్యంతరములు లేవు. ఆత్మ ప్రజ్ఞానఘనము. ఆకాశమువలె అఖండము పరిపూర్ణము సైంధవఖండమువలె కారణావస్థయందు ఏకము, యీ మొదలగు శ్రుతిస్మృతిన్యాయము

లచేత అవిద్యను నివారింపఁగా ఆత్మయందు ప్రజ్ఞ దృఢముకాఁగా సాధ్య సాధనాది భేదముగల కర్మకాండము కనిపింపక నపుడు అప్రమాణమేయగును.

అవ. ముముక్షుత్వము కలుగఁగా కర్మమును తత్సాధనములును విడువఁదగినవగుటవలన సంసారియైయుండి శ్రేయస్సాధనములగు కర్మములను మానఁదగునా యను మాట కూడ అజ్ఞానకార్యమే యని చెప్పుచున్నాఁడు:—

మూ. తచ్చైతత్ పరమార్థదర్శనం ప్రతిపత్తు మిచ్ఛతా వర్ణాశ్రమాద్యభిమానకృతపాంక్తరూప పుత్రవిత్తలోకైషణాదిభ్యోవ్యుత్థానం కర్తవ్యమ్, సమ్యక్ప్రత్యయ విరోధాత్తదభిమానస్య, భేదదర్శన ప్రతిషేధార్థోపపత్తిశ్చోపపద్యతే, న హ్యేకస్మిన్నాత్మన్యసంసారిత్వబుద్ధౌశాస్త్రన్యాయోత్పాదితాయాం తద్విపరీతా బుద్ధిర్భవతి, న హ్యగ్నౌ శీతత్వబుద్ధిః, శరీరే వా అజరామరణత్వబుద్ధిః, తస్మాదవిద్యాకార్యత్వాత్సర్వకర్మణాం తత్సాధనానాం చ యజ్ఞోపవీతాదీనాం పరమార్థదర్శననిష్ఠేనత్యాగః. ౪౪

తా. దేహాద్యభిమానము విజ్ఞానమునకు విరోధి కనుక ముముక్షువు యజమానపత్నీపుత్రవిత్తాది సాధనపంచక సాధ్యమగు యాగాదికర్మమును మానవలెను. అపరోక్షజ్ఞానమున కీయాగాదికర్మములు విరుద్ధములు. ఉపాధులన్నిటి నుపేక్షించి, అంతటనుండు సచ్చిదాత్మ యొక్కటియేయను అభేదదృష్టియే విజ్ఞానము. భేదదృష్టిగలవాఁడు సంసారమును బొందును. ఈజగత్తంతయు మనఃకల్పితమనియు, అణుమాత్రమైనను భేదమును జూచువానికి భయముకలదు అనియు చెప్పెడి "మృత్యోః స మృత్యుమాప్నోతి; య. ఉదర

మంతరం కురుతే, అథ తస్య భయం భవతి'' ఇత్యాదిశ్రుతులు బోధించుట వలన అభేదదృష్టియే పరమార్థసాధనమని తెలియవలయును. భేదము, భేద ప్రయుక్తాభిమానము నను నివి శ్రుతిచేత నిషేధింపఁబడినందున ప్రమాణ ములు కావు. ప్రమాణసిద్ధమగు అభేదమును బాధించు ప్రమాణములు లేవు. ''నేతి నేతి'' యను నిషేధవాక్యములకు అభేదదర్శనముకంటె వేఱుగతి లేదు. కనుక ప్రతిషేధవాక్యములకు అభేదము చెప్పనియెడల నవి వ్యర్థములగును. శ్రుతివాక్యము వ్యర్థముకాఁగూడదు. కర్మసహితమగు విజ్ఞానమే మోక్షసా ధనమని కర్మమును మానుట తగదందువా? కర్మజ్ఞానములు పరస్పరవిరుద్ధము లగుటచే వానికి సముచ్చయము తగదు. రెండును ఒకసారి చేయుటకు వీలుం డదు. కర్మమువలనఁ బుట్టినది నిత్యముకాదు. మోక్షము నిత్యమును పుట్టనిది యును గావున సిద్ధమగు మోక్షము కర్మము నపేక్షింపదు. మోక్షమనఁగా కల్పితకోశాదికమును నిరసించి స్వరూపావస్థితియే. ఈనిరసనమును నేతి నేతీ త్యాదిశ్రుతులు బోధించుచున్నవి. అగ్ని యెప్పుడును చల్లనిది కానివిధమున శరీర మెప్పుడును జరామరణరహితము కానేరదు. కనుక అవిద్యాకార్యమగు కర్మములు, తత్సాధనములగు యజ్ఞోపవీతాదికములు పరమార్థదర్శనరూప మగు మోక్షమునకు సహాయకారులుకావని నిశ్చయించి ముముక్షువు వీని నాదరింపక ఉపేక్షింపవలయును. ౪౪

ఇది శిష్యానుశాసనప్రకరణము.



శ్రీః

# ఉపదేశసాహస్రి

## గద్యప్రబంధము—ద్వితీయభాగము.

(శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యప్రణీతము.)

### ౧. కూటస్థాద్వయాత్మబోధప్రకరణము.

అవ. పూర్వప్రకరణమున శిష్యునకు స్థూలసూక్ష్మ దేహ ద్వయము తాననెడి అభిమానమును దొలఁగించి, బ్రహ్మరూపత్వము నుపదేశించి, ఆయవస్థలందు కర్మ తత్సాధనములును విడువవలసినవని యుక్తులచే బోధించెను. అవిద్యాకార్య మంతయు బ్రహ్మస్వరూపమునకు విరుద్ధమనియుం జెప్పఁబడెను. ఈ ప్రకరణమందు ఆత్మేతర దేహాదిసంఘాతస్వరూపము అవిద్యాకల్పితమనియు, ఆత్మయొక్క కూటస్థత్వము స్వాభావిక బ్రహ్మస్వరూపమనియుఁ జెప్పుచు సంన్యసించి వేదాంతవాక్యములను వినవలెననియు సూచింపుచు శిష్యప్రశ్నమును జూపుచున్నాఁడు:—

మూ. సుఖమాసీనం బ్రాహ్మణం బ్రహ్మనిష్ఠం కశ్చిత్ బ్రహ్మచారీ జన్మజరామరణలక్షణాత్ సంసారాత్ నిర్విణ్ణో

ముముక్షుః విధివదుపసన్నః పప్రచ్ఛ—భగవన్. కథమహం సంసారాన్మోక్ష్యే శరీరేంద్రియవిషయవేదనావాన్, జాగరితే దుఃఖమనుభవామి; తథా స్వప్నేఽనుభవామి, పునః పునః సుషుప్తిప్రతిపత్త్యా విశ్రమ్య విశ్రమ్య జాగ్రత్స్వప్నయోర్దుఃఖమనుభవామి, కిమయమేవ మమ స్వభావః? కిం వా అన్యస్వభావస్య సతో నైమిత్తికః? ఇతి, యది అయమేవ స్వభావః, న మే మోక్షాశా; స్వభావస్యావర్జనీయత్వాత్, అథ నైమిత్తికః, నిమిత్తపరిహారే స్యాన్మోక్షోపపత్తిః. ౪౫

తా. చిత్తవిక్షేపములేక బ్రహ్మనిష్ఠుఁడగు బ్రాహ్మణునిఁజేరి పూర్వోక్తగుణసంపన్నుఁడగుచు బ్రహ్మచారియగు శిష్యుఁడు దేహాభిమానమును వదిలి ప్రత్యగాత్మనిరతుఁడై నిత్యానిత్యములను విమర్శింపుచు వివేకవైరాగ్యములు గలిగి మోక్షేచ్ఛతో వినయపూర్వకముగ నడుగుచున్నాఁడు.

అయ్యా! జాగ్రత్స్వప్నములందు శరీరేంద్రియములతోఁగూడి, యిష్టమైనది దొరకలేదనియుం, అనిష్టము కలిగెననియు దుఃఖపడుచున్నాను. సుషుప్తియందు కొంతసేపు దుఃఖములేక విశ్రమించి తిరిగి సంసారదుఃఖమునే అనుభవించుచున్నాను. నాకిది సహజమా? లేక, అన్యస్వభావముగల నాకీదుఃఖము మఱియేదైన కారణమువలనఁ గలిగెనా? ఇది నాకు స్వభావమే యగునేని "స్వభావోదురతిక్రమః"=స్వభావము మాఱదు. అను న్యాయమున నాకు మోక్షాశ లేనేలేదు. ఈదుఃఖము నాకు సహజముగాక నిమిత్తాంతరమున నాస్వభావము వేఱైనచో ఈ దుఃఖమే కారణమువలనఁ గలిగెను? దీనిని మరలించు నుపాయమెద్ది? యని గురువు నడిగెను. (బ్రహ్మచారి యనఁగా ప్రత్యక్తత్త్వమునందు రమించు స్వభావముగలవాఁడని వ్యుత్పత్త్యర్థము). ౪౫

అవ. ఈదుఃఖము ఆత్మకు స్వభావము కాదనుపక్షము నవలంబించి యుత్తరము చెప్పి, గురువు భయపడకుమని శిష్యుని నోదార్చుచున్నారుః—

మూ. తం గురురువాచ—శృణు వత్స,న తవాయం స్వభావః, కింతు నైమిత్తికః. ౪౬

తా. వత్సా ! నీకు దుఃఖము సహజముకాదు. నిమిత్తమువలననే వచ్చినది. ౪౬

అవ. ఇట్లు ఓదార్పఁబడినశిష్యుఁ డడుగుచున్నాఁడుః-

మూ. ఇత్యుక్తః శిష్య ఉవాచ—కిం నిమిత్తమ్? కిం వా తస్య నివర్తకమ్? కో వా మమ స్వభావః? యస్మిన్నిమిత్తే నివర్తితే నైమిత్తికాభావః రోగనిమిత్తనివృత్తావివ రోగీ స్వభావం ప్రతిపద్యేయేతి. ౪౭

తా. స్వామీ ! ఈదుఃఖమునకుఁ గారణమెద్ది? ఈదుఃఖము దేనిచేఁ దొలఁగును ? నాస్వభావ మేది ? రోగకారణము పోఁగా రోగముపోయిన రోగి తన స్వభావమును పొంది సుఖించునట్లు నాదుఃఖమునకుఁగల హేతువును జెప్పి దానినిఁ దొలఁగించు నుపాయమునుజూపి దుఃఖమును బోఁగొట్టి సుఖమును సంపాదింపుమని శ్రీగురువును సవినయముగ శిష్యుఁ డడిగెను.౪౭

అవ. అడిగిన వస్తువులస్వరూపమును జెప్పుచు నుత్తర మిచ్చుచున్నారుః—

మూ. గురురువాచ—అవిద్యానిమిత్తమ్, విద్యా తస్యా నివర్తికా, అవిద్యాయాం నివృత్తాయాం తన్నిమిత్తాభా

వాత్ మోక్ష్యసే జన్మమరణలక్షణాత్సంసారాత్, స్వప్నజాగ్రద్దుఃఖం చ నానుభవిష్యసీతి. ४౮

తా. ఈదుఃఖమునకు అవిద్యయే కారణము. విద్యయే ఆయవిద్యను బోఁగొట్టును. అవిద్యయనఁగా దేహమందు నేననే భ్రాంతి. ఆయవిద్యవల్లనే జననమరణరూపసంసారము కలుగును. అవిద్య తొలఁగఁగనే సంసారదుఃఖముల ననుభవింపక సుఖింతువు. ४౮

అవ. శిష్యుఁడు పదార్థములను సామాన్యముగ విని వాని విశేషములను వినఁగోరి యడుగుచున్నాఁడు:—

మూ. శిష్య ఉవాచ—కా సా అవిద్యా? కిం విషయా వా? విద్యా చ కా అవిద్యానివర్తికా యయా స్వభావం ప్రతిపద్యతే? ఇతి. ४౯

తా. ఆ యవిద్య యేది? దానికి ఆశ్రయమేది? ఏ విద్యామహిమవలన సుషుప్తియందువలె జాగ్రత్స్వప్నములయందు స్వస్వరూపజ్ఞానముకలిగి దుఃఖరహితుఁడ నగుదునో యావిద్య యేది? ఆ విద్యావిద్యలస్వభావములను దయతో వివరింపుఁడు. ४౯

అవ. వత్సా! నీస్వరూపమును గప్పి మాఱుగఁ దోపించుచు నీస్వరూపమునే ఆశ్రయించియున్నది అవిద్య యని మొదటి ప్రశ్నమునకు ఉత్తర మిచ్చుచున్నారు:—

మూ. గురురువాచ—త్వం పరమాత్మానం సన్తమ్ అసంసారిణం సంసార్యహమస్మీతి విపరీతం ప్రతిపద్యసే; అకర్తా

రం సన్తం కర్తేతి; అభోక్తారం సన్తం భోక్తేతి; విద్యమానం చా విద్యమానమితి, ఇయమవిద్యా. ౫౦

తా. వత్సా! నీవు దేనిచే పరిపూర్ణుఁడవయ్యు పరిచ్ఛిన్నుఁడనని, అసంసారివయ్యు సంసారినని, అకర్తవయ్యు కర్తనని, అభోక్తవయ్యు భోక్తనని, నిత్యుఁడవయ్యు అనిత్యుఁడనని భ్రమించుచున్నావో అదియే 'అవిద్య' అది నీయందే యున్నది. నీవు చిదానందైకరసకూటస్థుఁడవని తెలియుటయే 'విద్య'. ౫౦

అవ. శిష్యుఁడు తాను నిత్యుఁడను, ముక్తుఁడను అని యంగీకరించి నేను సంసారినికానా? కర్తనుగానా? భోక్తను కానా? యని శంకించుచున్నాఁడు:—

మూ. శిష్య ఉవాచ—యద్యప్యహం విద్యమానః, తథాఽపి న పరమాత్మా, కర్తృత్వభోక్తృత్వలక్షణః సంసారో మమ స్వభావః, ప్రత్యక్షాదిభిః ప్రమాణైః అనుభూయమానత్వాత్, న అవిద్యానిమిత్తః, అవిద్యాయాశ్చాత్మవిషయత్వానుపపత్తేః,అవిద్యానామ అన్యస్మిన్ అన్యధర్మాధ్యారోపణా, యథా ప్రసిద్ధం రజతం ప్రసిద్ధాయాం శుక్తికాయామ్, యథా ప్రసిద్ధం పురుషం స్థాణావధ్యారోపయతి, ప్రసిద్ధం వా స్థాణుం పురుషే, నాప్రసిద్ధం ప్రసిద్ధే, ప్రసిద్ధం వా అప్రసిద్ధే, న చ ఆత్మన్యనాత్మానమధ్యారోపయతి, ఆత్మనః అప్రసిద్ధత్వాత్; తథా ఆత్మానమ్ అనాత్మని, ఆత్మనో ఽప్రసిద్ధత్వాదేవ. ౫౧

తా. నేను కర్తను అను మొదలగు జ్ఞానమందఱకును ప్రత్యక్షమే. కర్తృత్వాదికమునకును ధర్మమగుటవలన రూపాదికమునకువలె నొకఆశ్రయముండవలెను. ఆశ్రయమనఁగా ఆధారము. ఆయాశ్రయము చేతనమే కావలెను. అచేతనములగు పాషాణాదికమందు సుఖదుఃఖాదిజ్ఞానములు పుట్టవు కద. కనుక జ్ఞానము చేతనమందే పుట్టవలెను. అని అనుమాన మిట ప్రమాణము:—శ్లో. "గుణాన్వయో యః ఫలకర్మకర్తా కృతస్య తస్యైవ స చోపభోక్తా,"-"స ఏష సుప్తేషు జాగర్తి కామం కామం పురుషో నిర్మిమాణః" గుణములకు ఆశ్రయమై ఫలాపేక్షచేఁ గర్మములను జేయువాఁడే ఆ ఫలభోక్తయనియు, జడపదార్థము లన్నిటియందు ఈ యాత్మయే ప్రకాశకుఁడనియుఁ జెప్పు శాస్త్రము ప్రత్యక్షశబ్దముపైనియున్న ఆదిశబ్దమున కర్థము. ఈ ప్రత్యక్షాది ప్రమాణములచేత ననుభవింపఁబడెడి కర్తృత్వభోక్తృత్వాది ధర్మములు నాకు స్వభావము గనుక నేను నిత్యుఁడనయినను పరమాత్మను కాఁజాలను. స్వయంప్రకాశమైన ఆత్మయందు అవిద్య యుండదు. కావున నిది సంసారమునకు నిమిత్తముకాదు. అవిద్యయనఁగా ఒకవస్తువును మఱియొకవస్తువనుకొనుట. ఎట్లనఁగా, లోకములో వెండి, ముత్యపుచిప్ప, స్థాణువు పురుషుఁడు ఈ మొదలగు వస్తువులు ప్రసిద్ధముగఁ దెలియఁబడునవియే. వీనిలో ముత్యపుచిప్పను జూచి వెండియనియు, స్థాణువు (మోడు)ను జూచి పురుషుఁడనియు భ్రాంతి కలుగవచ్చును. కాని ప్రసిద్ధముకాని ఆత్మయందు అనాత్మను ఆరోపించుట తగదు. అట్టి ఆత్మను అనాత్మయనుకొనుటయుఁ దగదు. మఱియు, స్వయంప్రకాశమగు ఆత్మయందు అవిద్య యెట్లు కలుగును? అని శిష్యుఁడు "మిథ్యాజ్ఞానమే అవిద్య" యనఁబడెనని గ్రహించి యిట్లు ప్రశ్నించెను. అనఁగా, ఒకానొక ప్రసిద్ధవస్తువును జూచి మఱియొక ప్రసిద్ధవస్తువునుగా భ్రమపడవచ్చునుగాని ప్రసిద్ధముగాని ఆత్మవస్తువునందు అధ్యాసభ్రాంతులు తగవు. ఆత్మ ప్రసిద్ధమే యగునేని

అధ్యాసకు విరోధమైన స్వయంప్రకాశుఁడగు ఆత్మయందు ఆత్మేతరధర్మములు ఆరోపింపఁబడతగవు. లేక, ఆత్మ అప్రసిద్ధమే యైనచో విషయమే భాసింపకపోవుటచే దేనియందు తదితరధర్మము లారోపింపఁబడును. ఈరెండును సరిపడనందున ఆత్మయందు కర్తృత్వాదికము అవిద్యచేఁ గల్పింపఁబడినదియనుటకు వీలులేదుకనుక ఆత్మకు కర్తృత్వాదిధర్మములు ఆరోపింపఁబడినవి కావు. సహజధర్మములే యని శిష్యుని యాక్షేపార్థము. ౫౧

అవ. ఆయాక్షేపమును—అధిష్ఠానము ఆరోప్యమానము అను రెండును వేఱ్వేఱ ప్రసిద్ధములు కాకపోవుటచేతనా? ప్రసిద్ధిమాత్రమే లేకపోవుటచేతనా? నీవు ఆరోపణము నంగీకరింపవు? అని వికల్పించి, ప్రసిద్ధిమాత్రము నందఱు నంగీకరించుటచే రెండవపక్షమును విడిచి మొదటిపక్షమును గురువు నిరాకరించుచున్నారు:—

మూ. తం గురురువాచ—న, వ్యభిచారాత్, న హి వత్స, ప్రసిద్ధం ప్రసిద్ధ ఏవాధ్యారోపయతీతి నియన్తుం శక్యమ్, ఆత్మన్యధ్యారోపణదర్శనాత్, గౌరోఽహం కృష్ణోఽహమితి దేహధర్మస్య అహంప్రత్యయవిషయే ఆత్మని, అహంప్రత్యయవిషయస్య చ ఆత్మనః దేహే అయమహమస్మీతి. ౫౨

తా. సుషుప్తిసమాధిమూర్ఛలయందు ఆత్మయే యున్నది, కాని కర్తృత్వాదికము లేదు. అచట బుద్ధి విలీనమైనది. ప్రత్యక్షానుమానాగమములు ధీవిశిష్టాత్మకే గోచరములు. వేఱొకచోట ప్రసిద్ధమైనదే మఱియొకచోట ప్రసిద్ధమైనదానియం దారోపింపవలయుననే నియమము లేదు. ఎట్లనఁగా— గౌరత్వాదులు వేఱేఁ ప్రసిద్ధిగ లేవు. అయినను 'నేను చిక్కినాను' అఁ

అహంప్రత్యయవిషయమగు ఆత్మయందు దేహధర్మమగు కార్శ్యమును దేహముకంటె ఆత్మ వేఱనువారలును జెప్పుదురు. నరుఁడనగు నాకు తెలియును, అని ఆత్మధర్మమగు జ్ఞానమును, అనాత్మయగు దేహమందును, నేను ఎఱ్ఱనివాఁడను నల్లనివాఁడను ననెడి దేహధర్మములు ఆత్మయందును, ఆత్మధర్మమగు జ్ఞానమును 'నేనెఱుగుదు'నని దేహమందును ఆరోపింతురు. కావున శుక్తిరజతములవలె ప్రసిద్ధవస్తువులకే ఆరోపణము అను నియమములేదు. ౫౨

అవ. ప్రసిద్ధమగు స్థాణుపురుషులకు అన్యోన్యాధ్యాసము చెప్పినట్లు ఇంద్రియగోచరమగు దేహమునకును అహంప్రత్యయగోచరమగు ఆత్మకు నన్యోన్యాధ్యాసము గోచరత్వమున ప్రసిద్ధమైనవానికే కలుగుచున్నందున పూర్వోక్తనియమమునకు భంగములేదని శిష్యుఁడు తిరిగి శంకించుచున్నాఁడు:—

మూ. శిష్య ఆహ—ప్రసిద్ధ ఏవ తర్హ్యాత్మా అహంప్రత్యయవిషయతయా, దేహశ్చ అయమితి, తత్రైవం సతి, ప్రసిద్ధయో రేవ దేహాత్మనో రితరేతరాధ్యారోపణా స్థాణుపురుషయోః శుక్తికారజతయో రివ, తత్ర కం విశేషమాశ్రిత్య భగవతోక్తం ప్రసిద్ధయో రితరేతరాధ్యారోపణేతి నియన్తుం న శక్యత ఇతి. ౫౩

తా. ఆత్మ అహంప్రత్యయమునకు గోచరము. దేహము ఇదియనియింద్రియములకు గోచరము. ఈరెండును గోచరములే కనుక ప్రసిద్ధములే కాఁబట్టి స్థాణుపురుషులకువలె శుక్తికారజతములకువలె ప్రసిద్ధములగు దేహాత్మలకు అధ్యారోపణము కలుగుచుండఁగా తమరు ఏవిశేషమువలన ప్రసిద్ధములకే అధ్యారోపణ చేయవలయుననే నియమము లేదని చెప్పితిరో నాకుఁ దెలియఁ జెప్పుడు. ౫౩

అవ. దేహము ఆత్మయు ప్రసిద్ధములయినను నీవు చెప్పిన నియమము అక్కడ లేదు, అని గురువు చెప్పుచున్నారు.-

మూ. గురురువాచ—శృణు; సత్యం ప్రసిద్ధౌ దేహాత్మానౌ న తు స్థాణుపురుషావివ వివిక్తప్రత్యయవిషయతయా సర్వలోకప్రసిద్ధౌ, కథం తర్హి? నిత్యమేవ నిరన్తరా వివిక్తప్రత్యయవిషయతయా ప్రసిద్ధౌ, న హి అయం దేహః, అయమాత్మా, ఇతి వివిక్తాభ్యాం ప్రత్యయాభ్యాం దేహాత్మానౌ గృహ్ణాతి యః కశ్చిత్, అత ఏవ హి మోముహ్యతే లోకః ఆత్మానాత్మవిషయే ఏవ మాత్మా, నైవమాత్మా ఇతి, ఇమం విశేషమాశ్రిత్యావోచం నైవం నియన్తుం శక్యమితి. ౫౪

తా. వత్సా! దేహాత్మలు ప్రసిద్ధములేకాని యొకవిశేషము గలదు వినుము. ఏమన, ఇది మోడు, ఇది పురుషుఁడు, ఇది ముత్యపుచిప్ప, ఇది వెండి, యని వేర్వేఱుగఁ దెలియఁబడుచున్నట్టు; ఇది దేహము, ఇది ఆత్మ యని వేర్వేఱుగ నివి తెలియఁబడవు. కనుకనే దేహమే ఆత్మయని, ఇంద్రియములు ఆత్మయని, కర్త ఆత్మయని, అకర్త ఆత్మయని, ఆత్మ పూర్ణుఁడని, పరిచ్ఛిన్నుఁడని, సగుణుఁడని, నిర్గుణుఁడని, వేర్వేఱ వాదించుచు జనులు మోహపడుచున్నారు. దేహముకంటె వేఱుగ ఆత్మ కనుపించినయెడల నిట్లు మోహము కలుగదు. దేహాత్మలు వేర్వేఱుగఁ దెలియఁబడకున్నను, ఏకజ్ఞానములో విషయములగుటచేత నేను మనుష్యుఁడను అను అజ్ఞానమువలె, నేను కర్తను నేను భోక్తను అని అధ్యస్యమానమునకు, అధిష్ఠానమునకును ఐక్యభ్రమ కలుగవచ్చును. ౫౪

అవ. ఆత్మానాత్మలు రెండును అధ్యాసగోచరములగు నేని అధ్యస్తము మిథ్య కనుక ఆత్మయు మిథ్యయగుచు సత్తు కాకపోవలెనని శిష్యుఁడు శంకించుచున్నాఁడు:—

మూ. నను, అవిద్యాధ్యారోపితం యత్ర యత్ తదసత్ తత్ర దృష్టమ్, యథా రజతం శుక్తికాయామ్, స్థాణౌ పురుషః, రజ్జ్వాం సర్పః, ఆకాశే తలమలినత్వమిత్యాది, తథా దేహాత్మనోరపి నిత్యమేవ నిరంతరావివిక్త ప్రత్యయేన ఇతరేతరాధ్యారోపణా కృతా స్యాత్, తత్ ఇతరేతరయోః నిత్యమేవ అసత్త్వం స్యాత్, యథా శుక్తికాదిషు అవిద్యాధ్యారోపితానాం రజతాదీనాం నిత్యమేవ అత్యన్తాసత్త్వమ్, తద్విపరీతానాం చ విపరీతేషు, తద్వత్ దేహాత్మనోరవిద్యయైవ ఇతరేతరాధ్యారోపణా కృతాస్యాత్, తత్రైవం సతి దేహాత్మనోరసత్త్వం ప్రసజ్యతే, తచ్చానిష్టమ్, వైనాశికపక్షత్వాత్, అథ తద్విపర్యయేణ దేహః ఆత్మన్యవిద్యయా అధ్యారోపితః, దేహస్యాత్మని సతి అసత్త్వం ప్రసజ్యేత, తచ్చానిష్టమ్, ప్రత్యక్షాదివిరోధాత్, తస్మాద్దేహాత్మానౌ నావిద్యయా ఇతరేతరస్మిన్ అధ్యారోపితౌ, కథం తర్హి? వంశస్తంభవన్నిత్యసంయుక్తౌ. ౫౨

తా. అవిద్యచేత నారోపింపఁబడినదంతయు మిథ్యయే. ముత్యపుచిప్పనుజూచి వెండియనుకొనుట భ్రమయేకద. ఇట్లు త్రాడు పామని, మోడు నరుఁడని తలంచుట భ్రమయేకాని సత్యముకాదు. ఈప్రకారమే ఆత్మను అనాత్మగాను, అనాత్మను ఆత్మగాను తలఁచుట భ్రమయే. శుక్తికాదులయందు

భ్రమకల్పితములగు రజతాదులు సత్యములు కానట్లు అవిద్యచేఁ గల్పితమగు అనాత్మ ఆత్మ కానేరదు. ఆత్మ అనాత్మ కానేరదు. సిద్ధమగు దేహమునుగాని ఆత్మనుగాని వైనాశికమతస్థులు తక్క మఱియెవ్వరును కాదనలేరు. ఆత్మయందు అనాత్మను ఆరోపింపఁగా ముత్యపుచిప్పయందు ఆరోపింపఁబడ్డ వెండివలె అనాత్మ మిథ్యయగును. ఇట్లు అనాత్మయందు ఆరోపింపఁబడిన ఆత్మయును మిథ్యకావలెను గనుక అన్యోన్యాధ్యాసము తగదు. కనుక ఆత్మయందే అనాత్మయగు దేహముమాత్రము ఆరోపింపఁబడునందువా? ఆత్మ సత్యమైయుండఁగా దేహము మిథ్య కావలసియుండును. కనిపించుచున్న దేహమును లేదనుట ప్రత్యక్షవిరోధము గనుక ఆరోపణమే తగదు. అయితే నేను మనుష్యుఁడను అను వ్యవహార మెట్లుకలుగును? స్తంభములు వెదుళ్లుకలిసి యిల్లు అని వాడఁబడునట్లు ఆత్మయు దేహమును గలిసి మనుష్యుఁడను వ్యవహారము కలుగునుకాని అవిద్యచే నొకదానియం దొకటి ఆరోపింపఁబడదు, అని పూర్వపక్షము. ౫౫

అవ. సిద్ధాంతి అన్యోన్యాధ్యాసమును సాధించుటకొఱకు మీమాంసకాదిసమ్మతమగు సంయోగసంబంధమును నిరాకరించుచున్నాఁడు:—

మూ. న అనిత్యత్వపరార్థప్రసంగాత్, సంహతత్వాత్ పరార్థత్వమ్ అనిత్యత్వం చ వంశస్థంభాదివ దేవ, కించ— యస్తు పరైర్దేహేన సంహతః కల్పిత ఆత్మా స సంహతత్వాత్ పరార్థః, తేన అసంహతః పరో ఽన్యో నిత్యః సిద్ధస్తావత్. ౫౬

తా. వెదుళ్లతోను, స్తంభములతోను గూడిన యిట్లు వాని కూడికవలన అనిత్యమును పరోపకారమునిమిత్తమును అయినట్లు దేహాత్మసంబంధ

మువలన నేను మనుష్యుఁడను అనే వ్యవహారము కలిగేయెడల నిది పరోప కారార్థమును అనిత్యమును గావలెను. ఆత్మ పరోపకారముకొఱకునుగాదు అనిత్యమునుగాదు. ఎవరేపని చేసినది ఆత్మకే (తనకే) కాని యితరులకుఁ గాదు. ఇతరులయెడలఁ జూపెడి ప్రేమయు తనకొఱకేకాని ఆత్మయందలి ప్రేమ యితరులనిమిత్తము కాకపోవుటచేత ఆత్మ పరమానందస్వరూపమని "తత్ప్రేమాత్మార్థమన్యత్ర నైవమన్యార్థమాత్మని" అని పంచదశియందు చెప్పఁబడినది. ఆత్మ నిత్యము చేతనమునై అనిత్యమును జడమునునగు సంఘాతముకంటె విలక్షణమునయి యుండును. ౫౬.

అవ. ఆత్మ జడమగుసంఘాతమునకంటె విలక్షణమేకాని నేను మనుష్యుఁడను అనేవ్యవహారము సిద్ధించుటకై సంఘాత సంబంధము నంగీకరింపక తీరదు. కనుక సంయోగభేదమును అంగీకరింపనపుడు వాని సంబంధము తాదాత్మ్యాధ్యాసము ననే యని సిద్ధించును. అట్లైని నిరాత్మవాదము తటస్థించునని పూర్వము చెప్పిన మాటను శిష్యుఁడు జ్ఞాపకము చేయుచున్నాఁడు:—

మూ. తస్యా సంహతస్య దేహే దేహమాత్రతయా అధ్యారోపితత్వేన అసత్త్వానిత్యత్వాదిదోష ప్రసంగో భవతి, తత్ర నిరాత్మకో దేహ ఇతి వైనాశికపక్షప్రాప్తిదోషః స్యాత్. ౫౭

తా. సంఘాతమునకు సాక్షియు, నేకమునగు ఆత్మకు దేహామందధ్యాసము చెప్పినయెడల ఆత్మ అసత్తును, అనిత్యమును గావలసివచ్చును. అనిత్యమగునేని ఆత్మ లేదని వాదించెడి వైనాశికమతము కూడ సంభవించును. ౫౭

అవ. తాదాత్మ్యావభాసము అధ్యాసమువలనఁ గలుగు నేని శూన్యవాదము కలుగునని ఆక్షేపింతువా? లేక ప్రమాణాప్రసిద్ధమైన తాదాత్మ్యావభాసహేతువగు ఆధారాధేయ భావాదిసంబంధ మొకటి గలదని యాక్షేపింతువా? అని వికల్పించి అధ్యపక్షమును నిరాకరించుచున్నారు:—

మూ. న, స్వత ఏవాత్మనః ఆకాశస్యేవ అసంహతత్వాభ్యుపగమాత్, సర్వేణ అసంహతః స చ ఆత్మేతి న నిరాత్మకో దేహాదిః సర్వః స్యాత్, యథా చాకాశం సర్వేణాసంహతమితి. సర్వం న నిరాకాశం భవతి. ఏవం తస్మాన్న వైనాశికపక్షప్రాప్తిదోషః, స్యాత్. ౫౮

తా. ఘటమునకువలె రూపాదులు అవయవములును గలుగుటచే దేహాదులును జడములే. అయినను కాల్పఁబడిన యినుపకమ్మి తేజోరూపముగఁ దోఁచునట్లు జడములయినను దేహాదులు తద్విలక్షణమైన చేతనమువలె దోఁచుచుండును. కాఁబట్టి దేహేంద్రియాదులకు చైతన్యముతో సంశ్లేషము చెప్పవలయును. అవయవరహితమును, సంఘాతసాక్షియు, చైతన్యమాత్రస్వభావమునునగు ఆత్మకు ఆకాశమునకువలె స్వతః పరిచ్ఛేదము అశుద్ధ్యాది ధర్మములతో సంబంధము సంభవింపనందున, ఆయాత్మయందు పరిమితత్వమును అశుద్ధ్యాదిసంబంధమును ఆకాశమునకువలె దేహాద్యుపాధిసంశ్లేషము చేతనే కలిగినదని చెప్పఁదగును. అట్లేని దేహాత్మలకు పరస్పరధర్మసంబంధము (దేహము తెలిసికొనును. ఆత్మకు దుఃఖముగలదు మొదలగు ధర్మములతో సంబంధము) ఉండుటవలన నీయన్యోన్యధర్మసంబంధమునుబట్టి దేహాత్మలకితరేతరాధ్యాస మనుభవసిద్ధము కాఁగా అధిష్ఠానము వినాగానారోపము సంభవింపమిచే నారోపించునపుడు రెండువస్తువులలో నితరవస్తుధర్మసంబంధము లేనిది యితరస్వరూపారోపణము కలుగదనియు సిద్ధాంతము.

శుక్తియందు శుక్త్యంశమును ఇదమంశమును భాసించునపుడే యిది వెండియని భ్రాంతికలుగును. సుషుప్తియందు దేహముతో సంబంధము లేకయే ఆత్మ స్ఫురించుటచే దేహాదికమందు ధర్మసంసర్గములేకుండ ఆత్మ స్వరూపముతో అధ్యాసము చెప్పశక్యముకాదు. దేహాదికము ఆత్మకంటె విలక్షణమగుటవలన పరస్పరధర్మసంసర్గమువలననేకాని చిజ్జడములగు దేహాత్మలకు స్వరూపాధ్యాసములేదు కనుక ఆత్మ నిత్యముకాదనుటకుఁ గాని దేహాదికము ఆత్మరహితమని శూన్యవాదమునకుగాని యిచట నవకాశము లేదు. చిద్ధర్మములు కలిగియుండుటవలన చిద్ధర్మారోపణమునకు దేహము అధిష్ఠానమని లక్షణావృత్తిచేఁ జెప్పఁబడెను గనుక పరస్పరాధ్యాసపక్షమునకు బాధయులేదు. ఆకాశమువలె దేనిని నంటక స్వతః నిరవయవము పరిపూర్ణమునగు ఆత్మ అన్నికాలములలోనంతట నిండియుండుటవలన సంఘాతము నిరాత్మకము (ఆత్మసంబంధను లేనిదియు) ను గాదు. కనుక ఆత్మకు అనిత్యత్వాదిదోషములు లేవు. ఆకాశము దేనితోనంటకున్నను సర్వము ఆకాశరహితము కానేరదు. ఇట్లే ఆత్మ దేనితోనంటకున్నను దృశ్యమగు జగత్తు నిరాత్మకము కాదు. కనుక నిట వైనాశికపక్షమున కవకాశములేదు.

అవ. ఇట్లు తాదాత్మ్యవ్యవహారము పరస్పరాధ్యాసమువలనఁ గలిగెనని బోధించి, శూన్యవాదమును నిరాకరించి, ఆధారాధేయభావసంబంధరూపమువలన పరమతమును దూషించుటకై రెండవపక్షమును నిరూపించుచున్నారు:—

మూ. యత్పునరుక్తమ్— దేహస్యాత్మన్యసత్త్వే ప్రత్యక్షాది విరోధః స్యాదితి, తన్న ప్రత్యక్షాదిభిః ఆత్మని దేహస్య సత్త్వానుపలబ్ధేః, న హ్యాత్మని—కుణ్డే బదరమ్, క్షీరే సర్పిః, తిలే తైలమ్, భిత్తౌ చిత్రమివ చ—ప్రత్యక్షాదిభిః దేహ ఉపలభ్యతే, తస్మాన్న ప్రత్యక్షాదివిరోధః.

తా. కంటిచేతను, స్పర్శముచేతను దేహమిది యని తెలియఁబడుచు న్నను, నీయింద్రియములచే ఆత్మ గ్రహింపఁబడఁదగని దగుటచేత ఆత్మ యందు దేహాదికము అధ్యస్తమయినదని చెప్పుట శక్యముకాదు. కనుక ఆత్మయందు దేహమున్నదనే ప్రత్యక్షప్రమాణము సంభవింపదు. చక్షురా దీంద్రియములచేత ఆత్మ గ్రహింపఁబడదనెడి యీయర్థమున విధాత ఇంద్రి యములను విషయములనే చూచునట్లు విధించెనుగాని అంతర్ముఖులై ప్రత్య గాత్మను ఇంద్రియములు చూడలేవని బోధించెను. "పరాంచిఖాని వ్యతృణ త్స్వయం భూ స్తస్మాత్ పరాఙ్ పశ్యతినాంతరాత్మన్" అను నీశ్రుతి ప్రమాణము. కుండలో రేగుపళ్లున్నవని ఆధారాధేయములు రెండును ఇంద్రియగోచరములగునపుడుకద ప్రత్యక్షప్రమాణము సంభవించును. మాధు ర్యగుణమునుబట్టి క్షీరమందు నెయ్యి కలదని అనుమానప్రమాణముచేత నూహింపవచ్చును. లోపల నూనె లేనియెడల నువ్వులనుండి నూనెరాదుకద అనునది అర్థాపత్తిప్రమాణముచే సిద్ధించును. ఈ త్రివిధప్రమాణములవలనను ఆత్మయందు దేహమున్నదనుటనుగూర్చి యీప్రమాణము లుపయోగింపవు. రేగుపండ్లవలె దేహాత్మలు రెండు గోచరింపఁబడకున్నను గోడయందు చిత్తరు వుండునట్లు ఆధారాధేయభావసంబంధమువలన ఆత్మయందు దేహముండ వచ్చునుకదా.యని శిష్యుఁడడుగఁగా గురువుచెప్పుచున్నాఁడు. చిత్రాంకితమగు గోడ కనుపించునట్లు దేహాకారాంకితమగు ఆత్మ కనుపింపదు. అట్లే కను పించినచో నాయందు (ఆత్మయందు) యది దేహమని వీఁడు మనుష్యుఁడని వ్యవహారము గలుగవచ్చును. ఇట్లుగాక నేను మనుష్యుఁడను, నేను బలిసి యున్నాను అనెడి వ్యవహారమే కలుగుచున్నది కనుక ఆధారాధేయ భావమువలన తాదాత్మ్యాధ్యాసము కలుగుననియుఁ జెప్పరాదు. ౫౯

అవ. అయ్యా! సామాన్యముగ గ్రహింపఁబడిన యంశమందు విశేషాంతరమును గ్రహింపనపుడు అధ్యాసము

సంభవించును. ఇపుడు ఆత్మ ప్రత్యక్షాదివిషయము కానం దున ఆత్మయందు దేహాధ్యారోపమును, దేహమందు ఆత్మాధ్యా రోపమును ఎటులకలుగునని శిష్యుఁడు శంకించుచున్నాఁడు:—

మూ. కథం తర్హి ప్రత్యక్షాద్యప్రసిద్ధాత్మని దేహాధ్యారోప ణా, దేహే చాత్మారోపణా? ౬౦

తా. దీని యర్థము అవతారికయందే స్పష్టము. ౬౦

అవ. ఆత్మ స్ఫురింపనందున అధ్యాసము లేదనెదవా? ఆత్మవిషయముకా లేదని అధ్యాసము లేదనెదవా? సామా న్యాంశము తెలియఁబడినను విశేషాంశము తెలియఁబడలేదు. కనుక అధ్యాసము లేదనెదవా? అని వికల్పించి "ఆత్మ స్ఫురిం చుట లేదు" అనే మొదటిపక్షమును నిరాకరించుచున్నారు.—

మూ. నాయం దోషః, స్వభావప్రసిద్ధత్వాదాత్మనః, న హి కా దాచిత్కసిద్ధావేవ అధ్యారోపణా న నిత్యసిద్ధా ఇతి నియన్తుం శక్యమ్, ఆకాశే తలమలాద్యధ్యారోపణ దర్శనాత్. ౬౧

తా. స్వయంప్రకాశమానమగు ఆత్మ స్వమహిమచేతనే స్ఫురించుట వలన ప్రత్యక్షాదిప్రమాణములకు విషయము కాకున్నను ఆత్మయందు అధ్యా రోపణము తగదని యాక్షేపింపరాదు. నిత్యసిద్ధవస్తువునందు ఆరోపణము కూడదు. ఆగంతుకవస్తువునందే ఆరోపణము చెప్పవలయుననెడి నియమ మును లేదు. అప్రత్యక్షమును నిత్యసిద్ధమునగు ఆకాశమునందు తలమాలి న్యాదికము ఆరోపింపఁబడుచుండెనుగద? ఇంద్రియములకు గోచరముకాని యాకాశమందు ఇంద్రియభ్రమచేత నైల్యము స్ఫురించునట్లు స్వతఃస్ఫూర్తిగల

ఆత్మయందును భ్రాంతిచే విషయాధ్యాసము సంభవింపకపోదు. అధ్యాసకాలమున బాహ్యవస్తువులందు సామాన్యవిశేషములున్నను స్వరూపమాత్రమున స్ఫూర్తియు, అధ్యస్తాంశవిరుద్ధమగు ఆత్మకు అస్ఫూర్తియు నపేక్షింపవలసి యున్నది. సర్పరూపవిశేషాంశము అధ్యాసకాలమున స్ఫురించినను త్రాడు మాత్రమే స్ఫురించెడి సత్యజ్ఞానసమయమునఁ దోఁపదు. కాఁబట్టి యిట ఆత్మకు స్వతఃస్ఫూర్తియున్నను అనృత జడ దుఃఖములు, మరణము ననెడి అనాత్మధర్మములను నిరాకరించుటవలన అధ్యాసమునకు విరోధియగు వేదాంతజనితజ్ఞానము కలిగినపుడు ముందు స్ఫురించిన సామాన్యవిశేషములు స్ఫురింపవు. కావున నిట సామాన్యాంశస్ఫూర్తియున్నను విశేషాంశము స్ఫురింపనందున అధ్యాసములేదనియెడి మూఁడవపక్షము పొసఁగదు. ఈ యధ్యాసము వేదాంతజన్యజ్ఞానమువలననే నశించును. కనుక విరోధ మేమియుం లేదు. ౬౧

అవ. స్వామీ! ఈయధ్యాసజ్ఞానాకారవృత్తి ఆత్మకా? అనాత్మకా? లేక నీరెండింటికినా? అని వికల్పించి వికారము కలుగుట, అనిత్యతకలుగుట మొదలగు దోషములు ప్రాప్తించుటవలన ఆత్మకు నని చెప్పరాదు. జడమగుటవలన నిది అనాత్మకనియుం జెప్పరాదు. కనుక రెండింటికి నను మూఁడవ పక్షముకూడ తగదనెడి యభిప్రాయముతో శిష్యుఁ డడుగుచున్నాఁడు:—

మూ. కిం భగవన్, దేహాత్మనోః ఇతరేతరాధ్యారోపణా దేహాదిసంఘాతకృతా? అథవా ఆత్మకృతా? ఇతి. ౬౨

తా. ఆత్మ చేతనము, దేహాదిసంఘాతము జడము. ఆత్మకు వికారము కలుగదు. జడమునకు తెలివిలేదు. కనుక నీ యన్యోన్యాధ్యాస మెవరికని శిష్యుఁ డడుగుచున్నాఁడు.

దేహాదిసంఘాతమనఁగా—అహంకారము మొదలు దేహపర్యంతమగు జడసముదాయము.ఇందుకు "స్వప్రకాశాపరోక్షత్వమయమిత్యుక్తితో మతమ్, అహంకారాది దేహాంతాత్ప్రత్యగాత్మేతి గీయతే." అనెడి పంచదశీగ్రంథము నందలి మహావాక్యవివేకములోనిదగు "అయమాత్మా బ్రహ్మ" అను మహా వాక్యము ప్రమాణము. దీని వివరణశ్లోకమునకు అర్థము—అయమ్=అనఁగా స్వయంప్రకాశమును ప్రత్యక్షమునగు ఆత్మ 'అహంకారాదిదేహాంతాత్'= అహంకారము మొదలుగను, దేహము అంతముగను గల (సంఘాతము) కంటె, ప్రత్యక్ = అనృతజడదుఃఖాత్మకమగు నీ సంఘాతముకంటె విలక్షణ ముగ, అనఁగా సచ్చిదానందస్వరూపముగఁ బ్రకాశించుటచే 'ప్రత్యక్' అనఁబడు చైతన్యమే, ఆత్మా-ఇతి-గీయతే=ఆత్మ యనఁబడును. ౬౨

అవ. గురువు శిష్యుని యభిప్రాయమును దెలియఁగోరి దేనికైతేనేమి యని యిట్లడుగుచున్నాఁడు:—

మూ. గురురువాచ—యది దేహాదిసంఘాతకృతా, యది వా
ఆత్మకృతా, కిం తత్ర స్యాత్ ౬౩

తా. దేహాదిసంఘాతమువలన నైతేనేమి? ఆత్మవలన నైతేనేమి? ఆ భేదమువలన నీకేమి ప్రయోజనము? ౬౩

మూ. ఇత్యుక్తః శిష్య ఆహ—యద్యహం దేహాదిసంఘాత
మాత్రః, తతో మమాచేతనత్వాత్ పరార్థత్వమితి న
మత్కృతా దేహాత్మనోః ఇతరేతరాధ్యారోపణా;
అథాహమాత్మా పరోఽన్యః సంఘాతాత్, చితిమ
త్త్వాత్, స్వార్థ ఇతి మయైవ చితిమతా ఆత్మని
అధ్యారోపణా క్రియతే సర్వానర్థబీజభూతా. ౬౪

తా. అనాత్మ ఆత్మయందధ్యాసముచే నారోపింపఁబడుటవలన సత్యముకాకపోవుటచే అధ్యాసమునకుఁ గర్త కాఁజాలదు కనుక అధ్యాసకర్త ఆత్మయేయని తలఁచుచున్న శిష్యుఁడు అహమ్మనుప్రతీతి ఆత్మప్రత్యయమగుటవలనను, దేహేంద్రియాదిసంఘాతమందు అహమ్మను ప్రతీతి యుండుటవలనను, అధ్యాసకర్త ఆత్మయగునా? దేహేంద్రియాది సంఘాతమగునా? యని వికల్పించి, యీ రెండుపక్షములందును దోషమును జూపుచున్నాఁడు. ఎట్లనఁగా:—నేను దేహాదిసంఘాతమే యగుదునేని అచేతనమగుటచేత అధ్యాసకల్పనమే సంభవింపదు. లేదా, నేనీ దేహాదిసంఘాతముకంటె విలక్షణమగునట్టి ఆత్మ చైతన్యమగుదునేని చిద్రూపుఁడనగు నాచేతనే నాకు సర్వానర్థకారణమగు అధ్యారోపణము చేయఁబడునా? చేయఁబడదు కనుక నీ రెండుపక్షములును యుక్తముకావు. ౬౮

అవ. అనాదియగు అవిద్య స్వప్రకాశమగు చిత్తును ఆశ్రయించియుండుటచే చిదాత్మయే అవిద్యాసంబంధమువలన, అహంకారము మొదలు స్థూలశరీరపర్యంతమునగు సంఘాతమును ఆత్మగ భావించుచు, మిథ్యాభూతజీవసంజ్ఞకలవాఁడై అధ్యాసకర్తయని యెన్నఁబడును. కాని యిది మిథ్యయగుటచేత నతఁడు పరమార్థమునందు కూటస్థుఁడగు ఆత్మయగుటచేత నిర్వికారుఁడే. తెలివిరాఁగా స్వప్నము సర్వము మిథ్యయగువిధమున, అవిద్య తొలఁగఁగనే యితఁడు సంసారనిర్ముక్తుఁడగును. కనుక ఇచట నయుక్తమెద్దియును లేదు. అనునభిప్రాయముతో శ్రీగురువు శిష్యునకు దయతో బోధించుచున్నాఁడు:—

మూ. ఇత్యుక్తో గురు రువాచ — అనర్థబీజభూతాం చేన్మిథ్యాధ్యారోపణాం జానీషే, మా కార్షీ స్తర్హి. ౬౯

తా. వత్సా! దేహేంద్రియాది జడసంఘాతమందు ఆత్మభావన సర్వానర్థప్రదమని తెలిసితివేని ఆ దేహాత్మభావనను పొందకుము. ౬౫

అవ. కూటస్థుఁడును నిర్వికారుఁడునగు సాక్షికి అనర్థ సంబంధము అవిద్యాకల్పితమేకాని వాస్తవముకాదని బోధించిన యాచార్యుని యభిప్రాయమును శిష్యుఁడు గ్రహింపక అడుగుచున్నాఁడు:—

మూ. నైవ భగవన్ శక్నోమి న కర్తుమ్, అన్యేన కేనచిత్ప్రయుక్తో ఽహం న స్వతంత్ర ఇతి. ౬౬

తా. అన్యునిచేఁ బ్రేరేపింపఁబడెడి నేను స్వతంత్రుఁడనుకాను కనుక ఇష్టములేకున్నను అధ్యాసమును విడువలేను. ౬౬

అవ. అట్లేని "చితిమత్త్వాత్ స్వార్థః" (౬౪) చైతన్య స్వరూపుఁడనగు నేనే అధ్యారోపణమెట్లు చేతునని నీవు చెప్పినమాట సత్యము కాఁజాలదని గురువు తన యభిప్రాయమును ప్రకటించుచున్నాఁడు:—

మూ. న తర్హి అచితిమత్త్వాత్ స్వార్థః త్వమ్, యేన ప్రయుక్తః అస్వతన్త్రః ప్రవర్తసే స చితిమాన్ స్వార్థః, సంఘాత ఏవ త్వమ్. ౬౭

తా. చిద్రూపుఁడవై స్వతంత్రుఁడవైన నీవు అస్వతంత్రుఁడవై యన్యునిచేత ప్రేరేపింపఁబడుచుండుటచే చైతన్యముకాక జడమగు దేహేంద్రియాది సంఘాతమవే. ౬౭

అవ. తెలిసికొనుచు జ్ఞాతనగు నేను జడమగు దేహాది సంఘాత మెట్లగుదునని శిష్యుఁ డడుగుచున్నాఁడు:—

మూ. యద్యచేతనో ఽహమ్, కథం సుఖదుఃఖవేదనాం భవదుక్తం చ జానామి? ౬౭

తా. గురువర్యా! నేను జడమగు దేహాదిసంఘాతమనే యగుదునేని ఇది సుఖము, యిది దుఃఖము నను ధీవృత్తులనుగాని, 'నీవు దేహాదిసంఘాతమవే' యని నుడివిన తమ వచనమునుగాని నే నెట్లు తెలియఁగలను? ౬౭

అవ. ఆత్మకు కర్తృత్వాద్యవభాసము మిథ్యాఽధ్యాసమువలనఁ గల్పితము. అంతఃకరణమందు ప్రతిబింబించిన చిదాభాసుఁడు దేహేంద్రియాంతఃకరణములతో వేఱుగా గ్రహింపఁబడనందున పరతంత్రుఁడును, జడములగు నా దేహేంద్రియాదులకు సాక్షియగు చిన్మాత్రుఁడుగ గ్రహించుటవలన స్వతంత్రుఁడును నగును. కనుక అట్టి యవివేకమును నిరసించుచు చిదాభాసునకు స్వస్వరూపస్థితిని వివేకమువలన సంపాదింపవలయుననెడి యభిప్రాయముతో శ్రీగురువు శిష్యుని యడుగుచున్నాఁడు:—

మూ. గురురువాచ—కిం సుఖదుఃఖవేదనాయా మదుక్తాచ్చాన్యస్త్వమ్, కిం వా అనన్య ఏవ? ఇతి. ౬౮

తా. వత్సా! నీవు సుఖదుఃఖానుభవముకంటెను నేను చెప్పిన వాక్యముకంటెను ఇతరుఁడవా? లేక, ఆ సుఖదుఃఖాదిరూపుఁడవా? యని గురు వడిగెను. ౬౮

అవ. శిష్యుఁడు తన యనుభవమును దలఁచుచు నుత్తరమిచ్చుచున్నాఁడు:—

మూ. శిష్య ఉవాచ—నాహం తావ దనన్యః, కస్మాత్? యస్మా

త్తదుభయం కర్మభూతం ఘటాదిక మివ జానామి, యద్యనన్యోఽహమ్, తేన తదుభయం న జానీయామ్; కింతు జానామి, తస్మాదన్యః, సుఖదుఃఖవేదనావిక్రియా చ స్వార్థైవ ప్రాప్నోతి, త్వదుక్తం చ స్యాత్, అనన్యత్వే, న చ తయోః స్వార్థతా యుక్తా, న హి చందనకణ్టకకృతే సుఖదుఃఖే చందనకణ్టకార్థే, ఘటోపయోగో వా ఘటార్థః, తస్మాత్ తద్విజ్ఞాతుర్మమ చందనాదికృతః అర్థః, అహం హి తతోఽన్యః సమస్త మర్థం జానామి బుద్ధ్యారూఢమ్. ౭౦

తా. ఘటమును జూచువాఁడు తాను ఘటముగాక దానికంటె వేఱగు రీతిని దేహేంద్రియాదిసంఘాతమును జూచెడి నేను దేహేంద్రియాది సంఘాతముగాక వానికంటె నన్యుఁడనే యగుదును. నేను దర్శనక్రియకు కర్తనుగాని కర్మలగు సుఖాదులనుగాను. ఆ సుఖదుఃఖాదులే నేనగుదునేని వానిని నేను తెలిసికొనలేకపోదును. తనచేతఁ దెలియఁబడెడి వస్తువు తానెప్పుడును కాఁడుకద. ఏలయనఁగా, తెలియఁబడెడి ఘటపటాదివస్తువులు జడములు గనుక వీనికి స్వప్రకాశము లేదు. కనుక ఇవి తమకంటె నితరమగు ప్రకాశముచేతనే స్ఫురించుచుండును. పరప్రకాశము లేదేని యిది యీపదార్థమనెడి వ్యవహారమే లేకపోవును.

జడములగు దేహేంద్రియాదులను దెలిసికొనుటచేత వీనికంటె నన్యుఁడనే కాని తెలియఁబడెడి దేహేంద్రియాదులు నేను కాను. తెలియఁబడెడి విషయములు తానే యైనయెడల నివి యెవరికి విషయ (గోచర)ములగును? అట్లుకావు గనుక విషయములకంటె విషయి (తెలిసికొనెడి తాను) అన్యుఁడే యని బోధింపఁబడెను. ఇపుడు దేహేంద్రియాదిసంఘాతమునకు ద్రష్ట

(చూచువాఁడు) మఱియొకఁడు లేనియెడల నీసంఘాతమే తనను తానే చూచునది కావలయును, అనెడి మఱియొకదోషమునుగూడఁ జూపుచున్నాఁడు. ఎట్లనఁగా, సుఖదుఃఖాదులను తామే తమ్ము నెఱుఁగవలసియుండును. ఇది యసంభవము. జడములగుటచే నింద్రియములైనను తమ్ము తా మెఱుఁగలేవని యిట్లు సీతారామాంజనేయసంవాదమున 2-వ ఆ. 108 పద్యమునఁ జెప్పఁబడెను. * ఇంద్రియములైనను దెలియలేనపుడు వీనికంటె నికృష్టములగుచు నెప్పుడును దృశ్యములేయగు విషయములు తమ్మెట్లు తెలిసికొనఁగలవు. ముల్లు గ్రుచ్చుకొనునపుడు కలిగెడి నొప్పి ముల్లునకును, చందనము బూయునపుడు కలిగెడి సుఖము చందనమునకును దెలియదుకద, కావున నా సుఖదుఃఖాదులు వానికంటె నన్యమగు జ్ఞాతకే తెలియును. కాని యీదేహేంద్రియాదు లెన్నడును తమ్మెఱుంగలేవు. కనుక నేను దేహేంద్రియాదులకంటె నన్యుఁడనేకాని దెలియఁబడెడి దేహేంద్రియాదులు కాను. మఱియు, ద్రష్ట విషయములకంటె నన్యుఁడు కాఁడేని ౧౭-వ వాక్యములో తాము చూపిన "అసత్తు, అనిత్యము"నను దోషములు సయితము ఆత్మకు సంభవించును. కావున బుద్ధిస్థమగు సర్వము నెఱిఁగెడి నేను సుఖదుఃఖాదులకంటె నన్యుఁడనే. ౨౦

అవ. వత్సా! నీకిట్టిబోధ కలదేని నీవు పరప్రేరితుఁడవు కావని యాచార్యుఁడు తత్త్వమును బోధించుచున్నాఁడు:—

---

* సీతారామాంజనేయము ఆ-2, ప-108.—

ఉ. తమ్ము నెఱుంగలేవు విహితమ్ముగ దేహము ప్రాణపంక్తి చి
త్తమ్ము దశేంద్రియమ్ము లుచితమ్ముగ నన్యము గానవేమి స
త్యమ్మగు నోకపీంద్ర! సతతమ్మును వానిఁదదీయకార్యజా
తమ్మును నేను గాంతు నన్యతమ్ముగ నన్ను ఋతమ్ముగాఁ దగన్.

మూ. తం గురు రువాచ—ఏవం తర్హి స్వార్థ స్త్వం చితిమత్త్వాన్న పరేణ ప్రయుజ్యసే, నహి చితిమా న్పరతంత్రః పరేణ ప్రయుజ్యతే, చితిమత శ్చితిమదర్థత్వానుపపత్తేః సమత్వా త్ప్రదీపప్రకాశయో రివ, నాపి అచితిమదర్థత్వం చితిమతో భవతి, అచితిమతో ఽచితిమత్త్వా దేవ స్వార్థసంబంధానుపపత్తేః, నాపి అచితిమతోః అన్యోన్యార్థత్వం దృష్టమ్, న హి కాష్ఠకుడ్యే అన్యోన్యార్థం కుర్వాతే. ౭౧

తా. గురు విట్లనును:—వత్సా! అట్లేని చిద్రూపుఁడవగు నీవు స్వతంత్రుఁడవే కాని పరప్రేష్యుఁడవు కావు. స్వతః బుద్ధిమంతుఁడగు వాఁడు పరాధీనుఁడై యితరులచే నియోగింపఁబడఁడు. చిద్రూపుఁడును పరునిచే ప్రేరితుఁడు కాఁగూడదా యనెదవేని, ఆ ప్రేరకుఁడు చిద్రూపుఁడా? లేక, జడస్వభావుఁడా? ఆ ప్రేరకుఁడు చిద్రూపుఁడే యైనచో తానే తనచేఁ బ్రేరేపింపఁబడునా? లేదా, మఱియొక చిద్రూపునిచేఁ బ్రేరితుఁడగునా? ఒక్కనికే ఉపకార్యోపకారకభావము, కర్మకర్తృభావమును దగదు కనుక వేఱొకచిద్రూపునిచేఁ బ్రేరేపింపఁబడునని చెప్పవలసియున్నది. ఇదియును సంభవింపదు. ఏలయన:—తానును, పరుఁడును చితిమంతులే యగుటచే ప్రదీపప్రకాశములకువలె నొకరికొకరు సేయఁదగిన విశేష మేమియు నుండదు. రెండవపక్షమున స్వతంత్రుఁడగుటచే జడుఁడును చితిమంతునిఁ బ్రేరేపింపఁదగఁడు. జడుఁడు చిద్రూపునిఁ బ్రేరేపింపక పోయినను జడములగు రెండువస్తువులును పరస్పరము ఉపకరించుకొనవచ్చును గనుక చిద్రూపుఁడగు సంఘాతాధ్యక్షుని ఏల కల్పింపవలయుననెడి శంక రాఁగా, జడములగు గోడయు స్తంభమును బరస్పరము ఉపకరించుకొనఁజాలనందున జడసంఘాతమునంతను బ్రేరేపించెడి యధ్యక్షుఁడు చితిమంతుఁడే కాక తప్పదు. ౭౧

అవ. చితిమంతుఁడు చితిమంతునిచేఁ బ్రేరేపింపఁబడఁడు అనుమాట యుక్తము కాదని శిష్యుఁడు ఆక్షేపించుచున్నాఁడు:—

**మూ.** నను చితిమత్త్వే సమేఽపి భృత్యస్వామినోః అన్యోన్యార్థత్వం దృష్టమ్. ౭౨

తా. రాజభృత్యులకువలె చితిమంతులకు ఉభయులకును పరస్పరోపకారము సంభవింపవచ్చునని శిష్యుని శంకార్థము. ౭౨

అవ. అచేతనభాగమగు భృత్యదేహమే స్వామిచైతన్యమున కుపకరించునుగాని దేహాపేక్షలేని భృత్యుని చైతన్యమాత్రము ఉపకరింపలేదు. ఇట్లే భృత్యచైతన్యమునకు అచేతనభాగమగు స్వామిదేహమే ఉపకరించునుగాని దేహరహితమగు స్వామిచైతన్యమాత్రము ఉపకరింపదని చెప్పుచు శిష్యుని శంకను నిరాకరించుచున్నారు.—

**మూ.** నైవం, అగ్నేరుష్ణప్రకాశవత్త్వవ చితిమత్త్వస్య వివక్షితత్వాత్, ప్రదర్శితశ్చ దృష్టాంతః ప్రదీపప్రకాశయోరివేతి, తత్రైవం సతి స్వబుద్ధ్యారూఢమేవ సర్వముపలభసే అగ్న్యుష్ణప్రకాశతుల్యేన కూటస్థనిత్యచైతన్యస్వరూపేణ యదిచైవ మాత్మనః సర్వదా నిర్విశేషత్వముపగచ్ఛసి, కిమిత్యూచివాన్ 'సుషుప్తే విశ్రమ్య విశ్రమ్య జాగ్రత్స్వప్నయోః దుఃఖ మనుభవామి, కిమయమేవ మమ స్వభావః కిం వా నైమిత్తికః' ఇతి చ, కిమసౌ వ్యామోహోఽపగతః, కిం వా నేతి. ౭౩

తా. వత్సా! అగ్నికి ఉష్ణప్రకాశములు ధర్మములగునట్లు నీకు చైతన్యమే స్వభావమని చెప్పిన దృష్టాంతయుక్తమగు నీవచనమునుబట్టి నీవిట్లు శంకింపఁదగదు. ఇట్లు చిద్రూపుఁడు స్వతంత్రుఁడేకాని పరతంత్రుఁడు కానేరఁడని చెప్పుటచేత నతఁడీశ్వరుఁడే యయ్యెను గనుక,ఆత్మకూటస్థుఁడే యని నిశ్చయింపుమని బోధించెను. మఱియు, అగ్నికి ఉష్ణప్రకాశములు స్వభావమగునట్లు నీకు నిర్వికారనిత్యచైతన్యము స్వభావము. ఇటువంటి నీయందారోపితమగు ధీవృత్తియందు ప్రతిఫలించిన అధ్యాత్మాధిభూతాది విషయముల నన్నిటిని నీ వెఱుఁగువాఁడవు కావున నేను సంఘాతాధ్యాస కర్తనుగాను. మఱియు నాకు సంఘాతధర్మములతో సంబంధము లేదు. చిన్మాత్రుఁడనగు నేను నిత్యముక్తుఁడ నని తెలిసి యానందింపుము. శిష్యుఁడందుల కంగీకరించెనేని యపుడు నేను సదా నిర్వికారమగు ఆత్మనే యని తెలిసికొంటివేని సుషుప్తికాలమున సుఖముగ నిద్రించి జాగ్రత్స్వప్నావస్థలందు దుఃఖించుచున్నాను. ఈ దుఃఖము నాకు సహజమా? లేక, ఆగంతుకమా? యని (౮౫-వ) నన్నేల యడిగితివని గురువు అడిగినమీఁదట శిష్యుఁడు నేనపుడు మోహమువలన నట్లు చెప్పితిననిపలికినయెడల యిపుడా మోహము తొలఁగెనా? లేదా? యని గురువు మఱల నడుగవలయును. ౭౩

అవ. అయ్యా! సంసారదుఃఖములుగల నేను నిత్యముక్తస్వభావుఁడగు ఈశ్వరునికంటెను అన్యుఁడనేయను నీమొదలగు భ్రాంతికిఁ గారణమగు అవివేకరూపమగు మోహము మీకృపవలన నిపుడు తొలఁగినది. కాని, మీరు చెప్పిన కూటస్థుఁడననే బుద్ధియందుమాత్రము సంశయము తీరలేదు. అనేక విషయములగు జ్ఞానము కలుగుచుండుటచే నేను

కూటస్థుఁడ నెట్లగుదునో స్పష్టముగ బోధింపుఁడని శిష్యుఁ డడుగుచున్నాఁడు:—

మూ. ఇత్యుక్తః శిష్య ఆహ—భగవన్, అపగతః త్వత్ప్రసాదాత్ వ్యామోహః కింతు మమ కూటస్థతాయాం సంశయః; కథమ్? శబ్దాదీనాం స్వతః సిద్ధిర్నాస్తి, అచేతనత్వాత్; శబ్దాద్యాకారప్రత్యయోత్పత్తేస్తు తేషాం ప్రత్యయానా మితరేతరవ్యావృత్తవిశేషణానాం నీలపీతాద్యాకారవతాం స్వతః సిద్ధ్యసంభవాత్, తస్మాద్బాహ్యాకారనిమిత్తత్వం గమ్యతే ఇతి బాహ్యాకారవత్ శబ్దాద్యాకారత్వసిద్ధిః,తథా ప్రత్యయానా మపి అహం ప్రత్యయాలంబనవస్తుభేదానాం సంహతత్వాత్ అచైతన్యత్వోపపత్తేః స్వార్థత్వాసంభవాత్-స్వరూపవ్యతిరిక్తగ్రాహకగ్రాహ్యత్వేన సిద్ధిః శబ్దాదివదేవ అసంహతత్వే సతి చైతన్యాత్మకత్వాత్ స్వార్థోఽపి అహంప్రత్యయానాం నీలపీతాద్యాకారాణా ముపలబ్ధేతి విక్రియావానేవ, కథం కూటస్థ ఇతి సంశయః. ౭౪

తా. స్వామీ! మీకరుణచే నా వ్యామోహము తొలఁగెను. అని చెప్పి, శిష్యుఁడు నేను కూటస్థుఁ (నిర్వికారుఁ)డ నగుదునా? కానా? యని శంకింప గురు విట్లనియె.—వత్సా! సంఘాతసాక్షి వికారరహితుఁడని చెప్పితిమి కదా, యని శిష్యునిచేతనే కూటస్థత్వమును తెలియపరుపఁదలఁచి నీకు సంశయమేల కలుగవలయును అని యడుగుచున్నాఁడు. అనంతరము తనకుఁ దెలిసిన యర్థమును శిష్యుఁడు మనవిచేయుచున్నాఁడు. శబ్దస్పర్శరూపరసగంధములయిదును విషయ (ఇంద్రియ) గోచరములుకద. జడములగు ఆశబ్దాది విషయములకు స్వతఃస్ఫూర్తిలేదనుట నిర్వివాదమే. అయితే ఆశబ్దాదు లెట్లు

స్ఫురించునందురేని—(శబ్దాద్యాకారేతి) శబ్దాద్యాకారజ్ఞానములు గలుగుటవలననే ఆశబ్దాదులు సిద్ధించును. ఆ శబ్దాదులును ప్రత్యయరూపములై కనుక నివి స్వాతిరిక్తజ్ఞానముచేత గ్రహింపఁబడునని చెప్ప నక్కఱలేదనెడి విజ్ఞానవాదిమతమును మధ్యను శంకించి యీమతమును శంకరులు నిరాకరించుచున్నారు.

ఎట్లనఁగా—పరస్పరభిన్నములగు నీలపీతాద్యాకారములగల విషయజ్ఞానములు తమంతట సిద్ధింపలేక బాహ్యపదార్థముల నపేక్షించి తదాకారములగును. ఈజ్ఞానములు స్వప్రకాశములయినను బాహ్యపదార్థముల నపేక్షించుటచే శబ్దాదులు ప్రత్యయమాత్రస్వరూపములేయని చెప్పనొప్పదు. కనుక, ఇంద్రియములతోఁగలిసిన బాహ్యార్థములవలననే శబ్దాద్యాకారజ్ఞానములు కలుగుటవలన బాహ్యవ్యాపారార్హములగుచు చైతన్యముకంటె భిన్నమగు రూపముగల శబ్దాదులనుండియే ఆయాజ్ఞానములు కలుగునుగాని ఆశబ్దాదిజ్ఞానములు స్వయముగఁ గలుగవు.

ఈప్రకారము శబ్దాదివిషయములు స్వాతిరిక్తప్రత్యయ (జ్ఞాన)ముచేతనే తెలియఁబడునని నిశ్చయించితిరేని భేదము జ్ఞేయవస్తువులందేకాని జ్ఞానమందు లేనందున, ఆజ్ఞానము కూటస్థుఁడే కావలయుననెడి శంకపైని గురువు చెప్పుచున్నాఁడు.

'ప్రత్యయానామపీతి' విషయములతోఁ గలిసి విషయాకారముగ భాసించెడి ప్రత్యయములు ఆగమాపాయములు (ఉత్పత్తివినాశములు) గలవగుటచేత స్వప్రకాశరూప చైతన్యములుకావు. కాని స్వాతిరిక్తాద్వయాత్మచేతనే తెలియఁబడును. ఏలయన, 'అహంప్రత్యయేతి' అహంకారవృత్తులు సమూహములగుటచేత నేకమగు చిదాత్మ కానేరవు. కనుక స్వాతిరిక్తనిర్విశేషైక చైతన్యముచేతనే గ్రహింపఁబడును. కనుక నీవృత్తి జ్ఞానసాక్షియగు

నిర్విశేషాత్మయే కూటస్థుఁ డగుచుండఁగ నీకీసంశయ మేల కలిగెనందు రేని నాకుఁగల సంశయమునకుఁ గారణమును జెప్పెదను, విని దయతో నీసంశయమును నివారింపుఁడు:—

చిద్రూపుఁ డగునాత్మ సంఘాతముకంటె నన్యుఁడేయైనను నీలపీతాద్యాకారముగల అహంకారవృత్తులయొక్క ఉపలబ్ధి(జ్ఞానము)గల ఉపలబ్ధ(జ్ఞాత) వికారములు గలవాఁడగుటచేత కూటస్థుఁ (నిర్వికారుఁ) డెట్లగునని నాసంశయము. ౭౪

అవ. ధీమంతుఁడా! దృగ్దృశ్యములను రెండింటి నిట్లు విమర్శించితి వేని యపుడు నీకు సంశయము కలుగరాదని సద్గురువు ప్రత్యుత్తరమిచ్చుచున్నాఁడు:—

మూ. తం గురురువాచ—న యుక్త స్తవ సంశయః, యతః తేషాం ప్రత్యయానాం నియమేన అశేషతః ఉపలబ్ధే రేవ అపరిణామిత్వాత్ కూటస్థత్వసిద్ధౌ నిశ్చయహేతుమేవ అశేషచిత్తప్రచారోపలబ్ధిం సంశయహేతు మాత్థ, యది హి తవ పరిణామిత్వం స్యాత్, అశేషస్వవిషయచిత్తప్రచారోపలబ్ధి ర్న స్యాత్ చిత్తస్యేవ స్వవిషయే, యథా చేన్ద్రియాణాం స్వవిషయేషు, న చ తథా ఆత్మన స్తవ స్వవిషయైకదేశోపలబ్ధిః అతః కూటస్థతైవ తవేతి. ౭౫

తా. ఆ సకలప్రత్యయములను సంపూర్ణముగ నియతముగఁ దెలియుచు వికారరహితుఁ డగు ఆత్మ కూటస్థుఁడే కనుక నీకీసంశయము తగదు. మఱియు—చిత్తమును, ఇంద్రియములును తమకు గోచరించెడి వస్తువులలో నొక్కొకదానినే క్రమముగ గ్రహింపఁగలవు. ఆత్మ యిట్లుగాక సకలవిష

యములను ఒక్కసారియే గ్రహింపఁగలదు. కనుక ఆత్మవగు నీవు నిస్సంశయముగ నిర్వికారకూటస్థుఁడవే. ౭౫

అవ. అయ్యా! "ఉపలబ్ధ" యను పదమునందలి ప్రకృతిప్రత్యయములను విమర్శింపఁగా, ఈయుపలబ్ధ (గ్రహించెడివాఁడు) కూటస్థుఁడు కాఁజాలఁడు—అని శిష్యుని శంక ?

మూ. తత్రాహః—ఉపలబ్ధి ర్నామ ధాత్వర్థో విక్రియైవ,
ఉపలబ్ధుః కూటస్థాత్మతా చేతి విరుద్ధమ్. ౭౬

తా. 'లభ్' ధాతువునకుఁ బూర్వము 'ఉప' యను ఉపసర్గమును, పరము 'కర్తృవాచకతృచ్' ప్రత్యయమును విధింపఁగా "ఉపలబ్ధా"యను పదము నిష్పన్నమైనది. కావున నిట ధాత్వర్థము క్రియ. క్రియ పుట్టుచు పోవుచు నుండుటచేత నిది నిర్వికారకూటస్థుఁడు అనుమాట యుక్తముగఁ దోఁపదు. ౭౬

అవ. గురు వీవాక్యమున శిష్యుని శంకను దొలఁగించుచున్నారు:—ప్రకృతియనఁగా ధాతువు 'ఉపలభ్' అనునది ప్రత్యయము. అనఁగా'తృ'అనునది కలిసి 'ఉపలబ్ధ' యని యేర్పడెను కాని "గడివదనైకదేశే" యనుచోట ప్రకృత్యర్థము క్రియకాలేదు. "సవితా ప్రకాశతే" "సవితా ప్రకాశయతి" యనుచోట ప్రత్యయార్థము కర్తకాలేదు. కావున ప్రకృత్యర్థముక్రియయే ముఖ్యమనియు, ప్రత్యయార్థము కర్తయే ముఖ్యమనియు నియమములేదు. కనుక ఇచట క్రియావాచక ప్రకృతి(ధాతువు)కిని, కర్తృవాచకమగు ప్రత్యయమునకు

గౌణార్థమే కాని ముఖ్యార్థము గ్రహింపఁదగదని గురువు ఉత్తరమిచ్చుచున్నాఁడు:—

మూ. న, ధాత్వర్థవిక్రియాయాం ఉపలబ్ధ్యుపచారాత్, యో హి బౌద్ధః ప్రత్యయః స ధాత్వర్థో విక్రియాత్మకః ఆత్మనః ఉపలబ్ధ్యాభాసఫలావసాన ఇతి ఉపలబ్ధిశబ్దేన ఉపచర్యతే, యథా చ్ఛిదిక్రియా ద్వైధీభావఫలావసానేతి ధాత్వర్థత్వేనోపచర్యతే తద్వత్. ౭౭

తా. ముందు సంగ్రహముగఁ జెప్పినయంశము నే వివరించుచున్నాఁడు. ప్రతివిషయమునుగూర్చి పోవుటచేత ప్రత్యయ(జ్ఞాన)ము బుద్ధియొక్క పరిణామము "ప్రతివిషయం అయతి=గచ్ఛతీతి ప్రత్యయః" అని వ్యుత్పత్తి, అయ్యా! బుద్ధి [1]అంతఃకరణచతుష్టయములలో నొకటి. మృత్తికవలె మృత్పరిణామ(రూపాంతర)మగు ఘటమును ద్రవ్యమేయగునట్లు ద్రవ్యమగు అంతఃకరణముయొక్క పరిణామమను ప్రత్యయ(జ్ఞాన)ము సయితము ద్రవ్యమే యగుచుండఁగా నీ ప్రత్యయము క్రియ యెట్లగును? అని శంకింప గురు విట్లనియె. అంతఃకరణము జేలగవలెను, సూర్యప్రకాశమువలెను [2]సంకోచవికాసములను బొందునేకాని ఘటాకారముగ పరిణమించిన మృత్తికవలె మాఱదు. సంకోచవికాసాత్మకమగు ఆపరిణామము క్రియయేకాని ద్రవ్యము కాదు. ఈ బుద్ధి క్రియారూపమగు ధాత్వర్థమే. "సత్యం జ్ఞానం, విజ్ఞానఘనః" ఈమొదలగు శ్రుతులయందు ప్రసిద్ధమైన ఆత్మస్వరూపమగు ఉపలబ్ధి [3](జ్ఞానము) యొక్క ఆభాసుఁడు జీవుఁడు. వహ్నితోఁ గూడిన

1 మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము ననునవి.

2 ముణుచుట, చేఁచుట.

3 ఉపలబ్ధి, చిత్తు, సంవిత్, జ్ఞానము నను నివి కుంభ, ఘట, కలశ ములవలె పర్యాయపదములు.

యినుమునకు వహ్నిధర్మమగు ఉష్ణత్వము కలిగినట్లు చిదాభాసునితోఁగూడిన అంతఃకరణము తాను జడమైనను చైతన్యముగలదై వ్యవహరించును. ఇదియే ఫలమనఁబడును. కనుక గౌణవృత్తిచేత ఉపలబ్ధి యనఁబడును. ఎట్లనఁగా—ఉపలబ్ధి జడమగు విషయ (తెలియఁబడెడి వస్తు) ధర్మము కాదు. కరణ (సాధన) మగు అంతఃకరణధర్మమును గాదు. జడమగు అంతఃకరణమునందు చైతన్యప్రకాశము స్వాభావికము కాదు. కనుక ఉపలబ్ధియనఁగా అర్థప్రకాశమే యని చెప్పఁదగును. జడమగు నీయంతఃకరణము స్వయంప్రకాశాత్మయందు అవ్యవధానముగ నధ్యస్తమగుటవలన "అహమ్" అని తానే ప్రకాశాత్మకంటె నన్యముగఁ (వేఱుగ) దోఁపక, ఆత్మచైతన్యవ్యాప్తములగు ధీవృత్తులను గల్పించుచు "ఉపలబ్ధ, కర్త, భోక్త, జ్ఞాత" యను నీమొదలగు ధర్మములుగలదిగ భాసించును. లోకములో వహ్నితోఁగూడిన యినుపకమ్మి వహ్నివలె కాల్చుచుఁ బ్రకాశింపఁ జేయునుగద. ఇంతియేకాక వహ్నిని ఇనుపకమ్మిని వేఱ్వేఱు ధర్మములు గలవానిగ విమర్శింపనపుడుఇనుపకమ్మి గుండ్రముగఁగాని నలుచేదరముగఁగాని యుండఁగా అజ్ఞులు వహ్ని గుండ్రముగనున్నదనికాని నలుచేదరముగ నున్నదనికాని తాదాత్మ్యాధ్యాసమువలన భావింతురు. ఇట్లే ఆకాశమువలె నసంగుఁడు నిర్వికారుఁడు నగుటచేత కూటస్థుఁడగు ఆత్మ, జడమగు అంతఃకరణముతోఁ గలియుటచేత వేఱ్వేఱుగ విమర్శింపఁబడనపుడు అంతఃకరణధర్మములగు కర్తృత్వభోక్తృత్వాదిధర్మములు గలవాఁడువలె చిజ్జడములగు ఆత్మాంతఃకరణములయొక్క తాదాత్మ్యాధ్యాసమువలన అవివేకులకు భాసించును. కర్తృత్వభోక్తృత్వాదికములు, రాగేచ్ఛాసుఖదుఃఖాదులును అంతఃకరణధర్మములే. అట్లు కానిచో అంతఃకరణము విలీనమైయుండు సుషుప్త్యవస్థయందును, ఈకర్తృత్వాదికములు స్ఫురింపవలసి యుండును. అట్లు సుషుప్త్యవస్థయందు కర్తృత్వరాగేచ్ఛాదులు లేకయే అంతఃకరణవ్యాపారముతోఁ గూడియున్నట్టి జాగ్రత్స్వప్నములయందే యివి స్ఫురిం

చుటవలన నివి అంతఃకరణధర్మములేకాని ఆత్మధర్మములు కావని యాచార్యులవారిట్లు ఆత్మబోధయను గ్రంథమందు నుడివిరి—"రాగేచ్ఛా సుఖదుఃఖాది బుద్ధౌ సత్యాం ప్రవర్తతే, సుషుప్తౌ నాస్తి తన్నాశాత్తస్మాద్బుద్ధేస్తు నాత్మనః" అని. ఈబుద్ధి అంతఃకరణచతుష్టయములో నొకటి యని చెప్పఁబడెనుగద. కనుక ఉపలబ్ధి (జ్ఞాన) స్వరూపుఁడగు ఆత్మ కూటస్థుఁడనుటకు సంశయింపఁ బనిలేదు. ౨౨

అవ. ఈచెప్పిన యర్థమును విశదపఱుచుటకై [1]"స్థూణానిఖనన్యాయము"న శిష్యుని శంకను మఱలఁ జూపుచున్నారు:—

మూ. ఇత్యుక్తః శిష్య ఆహ—నను భగవన్, మమ కూటస్థత్వప్రతిపాదనం ప్రతి అసమర్థో దృష్టాంతః, కథమ్? ఛిదిః ఛేద్యవిక్రియావసానా ఉపచర్యతే యథా ధాత్వర్థత్వేన, తథా ఉపలబ్ధిశబ్దోపచరితోఽపి ధాత్వర్థో బౌద్ధప్రత్యయః ఆత్మనః ఉపలబ్ధివిక్రియావసానశ్చేత్, నాత్మనః కూటస్థతాం ప్రతిపాదయితుం సమర్థః. ౨౩

తా. అయ్యా! ఈచెప్పిన ఛేదనక్రియారూపదృష్టాంతమువలన ఆత్మ కూటస్థుఁ (నిర్వికారుఁ)డని నాకుఁ దెలియలేదని యడిగిన శిష్యునితో గురువు అదెట్లని యడిగెను. శిష్యుఁడు చెప్పుచున్నాఁడు—ముఖ్యార్థమును వదిలి గౌణార్థమును గ్రహించినను ఉపలబ్ధ (జ్ఞాత)కు వికారము కలుగకమానదు. ఛేదనక్రియచేత సాధ్యమగు ద్వైధీభావము (రెండుగ భాగింపఁబడుట) క్రియయే యగునట్లు సాధ్యమగు ఉపలబ్ధిఫలము క్రియయే కనుక క్రియావంతుఁడగు ఉపలబ్ధ కూటస్థుఁ (నిర్వికారుఁ)డు కాఁజాలఁడని శిష్యుఁడు

---

1 స్థూణానిఖనన్యాయమనఁగా కంబమును పాతఁగోరువాఁడు అది దృఢముగ నాటుటకై పైకియెత్తి కుదవేయుట.

దృష్టాంతవైషమ్యమును గనుపర్చెను. పిమ్మట గురు వావైషమ్యమును దొలఁగించుచున్నాఁడు:—

వత్సా! వినుము. ఛేదనక్రియకు ద్వైధీభావము ఫలమగునట్లు బౌద్ధప్రత్యయమగు ధాత్వర్థము గౌణమైనను ఆత్మకు ఉపలబ్ధిరూపవికారము ఫలమగునేని యీదృష్టాంతము సమముకాకపోవును. ఇచట ఛేదనక్రియకు ద్వైధీభావరూపఫలముండునట్లు ఉపలబ్ధక్రియకు ఆత్మకృతమగు ఉపలబ్ధివికార మేమియును లేదు. ౭౦

అవ. మఱియు, వత్సా! నీవు ఉలపబ్ధిస్వరూపమే ఫలమని యెంచి దృష్టాంతము విషమ మనెదవా? లేక, ఉపాధివశమున విషమమని చెప్పెదవా? యని వికల్పించి ప్రథమపక్షమును దూషించుచున్నారు:—

మూ. గురురువాచ—సత్యమేవం స్యాత్, యది ఉపలబ్ధ్యుపలబ్ధ్రోః విశేషః, నిత్యోపలబ్ధిమాత్ర ఏవ హి ఉపలబ్ధా న తు తార్కికసమయ ఇవ అన్యా ఉపలబ్ధిః అన్యః ఉపలబ్ధా చ. ౭౧

తా. తార్కికమతమునందువలె ఉపలబ్ధి (జ్ఞానము) ఉపలబ్ధ(జ్ఞాత)లకు భేదముండునా నీవు చెప్పిన దోషము కలుగును. కాని వేదాంతశాస్త్రమునందు వీనికి భేదములేదు. మఱియు, ఆత్మ నిత్యోపలబ్ధిస్వరూపము. నిత్యశబ్దముచేత బౌద్ధమతము నిరాకరింపఁబడెను. బౌద్ధప్రత్యయ (బుద్ధియందుఁ గలిగెడి వృత్తిజ్ఞాన)ములు రాకపోకలుగలవగుటచేత నిత్యములుకావు. మూలమున మాత్రశబ్దముచే భేదాభేదమతము నిరాకరింపఁబడెను. "ప్రజ్ఞానఘన" యను శ్రుతి ఆత్మ నిత్యబోధస్వరూపుఁడే యని నిరూపించెను. ౭౧

అవ. అయ్యా ! ఆత్మ నిత్యోపలబ్ధిస్వరూపము గునేని ధాత్వర్థఫలమని యేల చెప్పితిరి? అని శిష్యుఁడు శంకించుచున్నాఁడు:—

మూ. ననూపలబ్ధిఫలావసానో ధాత్వర్థః కథమితి? ౮౦

తాత్పర్యము అవతారికయందే స్పష్టము.

అవ. ఫలవచనము ఉపాధివశముననే చెప్పఁబడుటచే నిది గౌణముకాని ముఖ్యముకాదని చెప్పినమాటను మఱువకుము. ఈపక్షమున విరోధమేమియు లేదని చెప్పుచున్నారు:—

మూ. ఉచ్యతే శ్రుణు, ఉపలబ్ధ్యాభాస ఫలావసాన ఇత్యుక్తమ్, కిం న శ్రుతం తత్ త్వయా? న త్వాత్మా విక్రియోత్పాదనావసాన ఇతి మయోక్తమ్. ౮౧

తా. ధీమంతుఁడా! ఆకర్ణింపుము. చిత్తవృత్తులు ఆవిర్భావతిరోభావములుగలవి. ఆత్మ యాచిత్తవృత్తులతోఁ దాదాత్మ్యమునుబొంది ప్రమాత (జ్ఞాత) యనఁబడును.

ఈయాత్మయే క్రియావంతములగు కర్మేంద్రియములతోఁ దాదాత్మ్యమును బొంది అవివేకమువలనఁ గర్త యనఁబడును.

మఱియు, ప్రాక్తనశుభాశుభకర్మ ప్రాపితాంతఃకరణపరిణామవిశేషముతోఁ దాదాత్మ్యమును జెందుటచే భోక్త యనఁబడును.

కర్మ ధర్మ వికారరహితుఁడగు ఆత్మ యీ సకలచిత్తవిలాసములందును స్వచైతన్యానుసారమువలన వానిని స్వసన్నిధిమాత్రాన భాసింపఁజేయుచు

పూర్ణప్రకాశుఁడై సకలవిషయములయొక్క రాకపోకల నెఱుంగుచు [1]అసందిగ్ధావిపర్యస్తావిషయుఁడగుచు సాక్షియనియు, జ్ఞాతయనియు, ఉపలబ్ధయనియు వ్యవహారదశయందుఁ జెప్పఁబడును.

వృత్తులు తిరోహితములగునపుడు తద్గతచిదాభాసుఁడును లీనమగుచు సంస్కారవశమున కాలాంతరమునఁ బూర్వానుభూతవృత్తు లుదయింపఁగా ఆత్మ స్మర్తయని వ్యవహారదశయందుఁ జెప్పఁబడును.

ఆ చిదాత్మయే సమస్తకార్యకారణప్రపంచానుగతుఁడై వానిని భాసింపఁజేయుచు, ఆ భాస్యవస్తువులయందుండెడి సత్త స్వసత్తకంటె నితరముకానందున [2]సర్వాధిష్ఠాన మనఁబడును. బెల్లము కొబ్బెర మొదలగు వానియందుండు మాధుర్యము బెల్లపు మాధుర్యముకంటె నన్యము కాదుకద. ఇట్లే అన్నృతములగు సకలపదార్థములయందునుండెడి సత్త ఆత్మసత్తయే యగునుగాని అన్యముకాదు. కావున ఆత్మ సర్వాధిష్ఠానము. అనఁగా సర్వవస్తుభాసకము. దృఢబోధమునకై మఱల నాయర్థమే చెప్పఁబడినను నీ వేదాంతశాస్త్రమునఁ బునరుక్తిదోషము నెంచఁగూడదని ఆర్యుల మతము.

---

1 సందేహము భ్రాంతియు లేని.

2 ఇట అధిష్ఠానమనఁగా ఆధారమనియు, దీనియందుండునది ఆధేయమనియు లోకవ్యవహారమును గ్రహింపరాదు. అద్వైతమునకు హాని కలుగును. మఱి యేమనఁగా—

సర్వాధిష్ఠానమన సర్వప్రకాశకము. ఎట్లన సకలజగమును జడము. ఇయ్యది ఆత్మసన్నిధిలేక ప్రకాశింపనేరదు. ఆత్మ ప్రకాశస్వరూపము కావున నంతట నిండియున్న ఆత్మ సర్వాధిష్ఠాన మనఁబడును. ఇందుకు—"ఆభారూపస్య విశ్వస్య భానం భాసన్నిధే ర్వినా, కదాచి న్నావకల్ప్యేత భాచాహం తేన సర్వగః" అనెడి అద్వైతమకరందవచనము ప్రమాణము.

మఱియు, కారణోపాధితాదాత్మ్యమువలన, "నహి ద్రష్టుర్ద్రష్టేర్వి పరిలోపో విద్యతే" యనెడి శ్రుతినిఁబట్టి జ్ఞానసాధనములగు కరణ (ఇంద్రియ) ములకును విషయములకును లోపమున్నను సుషుప్తియందు వీని యభావము నకు సాక్షియగు దృక్కునకెన్నఁడును లోపములేనందున ఆత్మ అంతర్యామి యనఁబడును. ౮౧

అవ. ౮౨,౮౩ లలో, ఈచెప్పిన యంశములను ప్రశ్న పూర్వకముగ ముగించుచున్నారు:—

మూ. శిష్య ఉవాచ—కథం తర్హి కూటస్థే మయి అశేష స్వవిషయచిత్తప్రచారోపలబ్ధృత్వ మిత్యాత్థ? ౮౨

తం గురురువాచ—సత్యమేవావోచమ్, తేనైవ కూటస్థతా మబ్రువం తవ. ౮౩

తా. అయ్యా! నిర్వికారకూటస్థుఁడనగు నన్ను స్వవిషయముల నన్నిటినిఁ జూచువాఁడవని యేలఁజెప్పితిరి? యని యడిగిన శిష్యునకు గురు వి ట్లనియె— ౮౨

వత్సా! వినుము. భాస్యపదార్థములయందలి గుణదోషములు తద్భాసకుఁడగు సూర్యుని నంటనివిధమున నీవును స్వవిషయములను సకలచిత్తవికారములను నిర్వికారుఁడవై చూచుచుందువు. ఆ విషయదోషము (శోకమోహ) లను వికారరహితముగఁ జూచుచుండుటచేతనే నీవు కూటస్థచిదాత్ముఁడవని చెప్పితిమి. నీవు విమర్శించి నమ్మి సుఖింపుము. ౮౩

అవ. ఆత్మయందుఁ దోఁచెడి సకలవిశేషములు నివర్తింపఁబడుటచే నిత్యుఁడగు ఆత్మ కూటస్థస్వభావుఁడేయని గ్రహిం

చిన శిష్యుఁడు తన భ్రమయొక్క కారణమును జూడక గురువు నడుగుచున్నాఁడు:—

మూ. యద్యేవం భగవన్, కూటస్థనిత్యోపలబ్ధిస్వరూపే మయి శబ్దాద్యాకారబౌద్ధప్రత్యయేషు చ మత్స్వరూపోపలబ్ధ్యాభాసఫలావసానవత్సు ఉత్పద్యమానేషు కస్త్వపరాధో మమ? ౮౮

తా. శబ్దాద్యాకారములగు బుద్ధివృత్తులు చిదాభాసు (జీవు) నిచేఁ దెలియఁబడుచుండఁగా నిత్యోపలబ్ధి కూటస్థస్వరూపుఁడనగు నాయొక్క యపరాధమేమి? ౮౮

అవ. ప్రశ్నకుత్తరము:—

మూ. సత్యమ్, నాస్త్యపరాధః, కింతు అవిద్యామాత్రస్త్వపరాధ ఇతి ప్రాగేవావోచమ్. ౮౯

తా. నిజమే, నీ తప్పులేదు; అని గురువు నుడువఁగా శిష్యుఁ డడుగుచున్నాఁడు:—అయ్యా! అట్లేని నీవు వినలేదాయని యేల యడిగితిరి? అనిన గురు విట్లనియె. వత్సా! బుద్ధిమంతుఁడవగు నీకు నామాటయందు శ్రద్ధలేకుండుటయేకాక మఱియొక యపరాధ మేమియును లేదు. 'అవిద్యేతి' అన్యథాగ్రహణరూపమగు అవిద్యవలన నీకు మతివైషమ్యము గలిగెను.

ఈ వాక్యమునకే వేఱొక యర్థము:—

వత్సా! నీవు నీయనుభవమును వివరించి చెప్పుటచేత నపరాధమేమియును లేదు. అయ్యా! అట్లేని నీకు నమ్మకములేదా యని యేల యడిగితిరి దీనికి గురువుగారి యుత్తరము. ఆ యపరాధమెద్దియో వినుము. ఆత్మస్వరూ

పమును యథాస్థితముగఁ దెలియనీయకుండఁ గప్పుచు సంసారకారణమగు నదియే అవిద్య. ఇదియే నీకు కూటస్థాత్మను సయుక్తికముగ బోధించినను తెలియనీయక చిక్కులు పెట్టెను. ఉపాసనవలన నీయవిద్య తొలఁగును. ౧౫

అవ. ఇప్పుడు కూటస్థుఁడు జాగ్రదాద్యవస్థాత్రయ సాక్షియు, ఏతద్ధర్మసంసర్గరహితుఁడు నని నిరూపింపఁదలఁచి, దానికి మొదట శిష్యప్రశ్నను నిరూపించుచున్నారు:—

మూ. యది భగవన్, సుషుప్త ఇవ మమ విక్రియా నాస్తి,
కథం స్వప్నజాగరితే? ౧౬

తా. సుషుప్తునివలె నిర్వికారుఁడనగు నాకు స్వప్నజాగ్రదవస్థ లేల కలుగవలెను? ౧౬

అవ. ఆయవస్థాద్వయము నీచేఁ బ్రకాశింపఁజేయఁబడు నవియే కాని నీస్వభావము కావని దయాళువగు గురువు బోధించుచున్నాఁడు:—

మూ. తం గురురువాచ—కిం త్వనుభూయేతే త్వయా సంతతమ్.

తా. అవివేకమువలన ఆజాగ్రత్స్వప్నావస్థలతో తాదాత్మ్యమును బొందిన నీచే నివి యనుభవింపఁబడునట్లు తెలియఁబడవు. అనుభవించువాఁడు వేఱు, అనుభవింపఁబడునవి వేఱు ననెడి తెలివియే వివేకము. ఈ తెలివి లేకుండుటయే అవివేక మనఁబడును. ౧౭

అవ. ఇపుడు శిష్యుఁడు తా ననుభవించుట నంగీకరించి "సతతానుభవ" శబ్దముయొక్క యర్థమును దెలియఁగోరి యడుగుచున్నాఁడు:—

మూ. శిష్య ఉవాచ—బోధ మనుభవామి, కిం తు విచ్ఛిద్య విచ్ఛిద్య, న తు సతతమ్. ౮౮

తా. అయ్యా! నేను వినినప్పుడప్పు డనుభవించుచున్నాను గాని నిరంతరముగ ననుభవించుట లేదు. ౮౮

మూ. గురురువాచ—తర్హి ఆగంతుకే త్వే తే, న తవాత్మభూతే యది తవాత్మభూతే చైతన్యస్వరూపవత్. స్వతః సిద్ధే సంతతే ఏవ స్యాతామ్ కించ, స్వప్నజాగరితే న తవ ఆత్మభూతే, వ్యభిచారిత్వాత్ వస్త్రాదివత్, న హి యస్య యత్ స్వరూపం తత్ తద్వ్యభిచారి దృష్టమ్, స్వప్నజాగరితే తు చైతన్యమాత్రత్వాత్ వ్యభిచరతః, సుషుప్తే చేత్ స్వరూపం వ్యభిచరేత్ తన్నష్టం నాస్తీతి వా బాధ్యమేవ స్యాత్, ఆగంతుకానా మతద్ధర్మాణా ముభయాత్మకత్వదర్శనాత్; యథా ధనవస్త్రాదీనాం నాశో దృష్టః, స్వప్నభ్రాంతిలబ్ధానాం తు అభావో దృష్టః. ౮౯

తా. గురువాక్యము—సుషుప్తికాలమందు ఆత్మస్వరూపము భాసించుచున్నను, ఆ జాగ్రత్స్వప్నములు భాసింపనందున ఆయవస్థలు ఆత్మకు స్వరూపములు కావు. మఱియును, ఈ జాగ్రదవస్థయందు స్వప్నానుభూత పదార్థములు లేవు. స్వప్నావస్థయందు శయ్యాదిజాగ్రదవస్థానుభూతపదార్థములు లేవు. ఇట్లు అవస్థలు మాఱుచున్నను, హారమునందలి పూసలు మాఱుచున్నను దారముమాత్ర మన్నిపూసలందును మాఱుపు లేకుండునట్లు ఆత్మ యన్నియవస్థలయందును తాను మాఱక కూటస్థుడయ్యే యుండును. కూటస్థు

డనఁగా వికారరహితుఁడు. ఈయర్థమందు "బాల్యాదిష్వపి జాగ్రదాదిషు తథా సర్వాస్వవస్థాస్వపి వ్యావృత్తాస్వనువర్తమానమహ మిత్యంతఃస్ఫురంతం సదా, స్వాత్మానం ప్రకటీకరోతి భజతాం యోముద్రయా భద్రయా తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే." అను నీదక్షిణామూర్తిస్తోత్రశ్లోకతాత్పర్యము ననుసంధింపవలయును.

కావున ధనాదులవలె అనాత్మలగు ఆయవస్థలును అప్పుడప్పుడే యనుభవింపఁబడును. ఆత్మ సతతానుభవస్వరూపుఁడు. ఈచెప్పిన యర్థమునే వ్యతిరేకముఖమున విశదీకరించుచున్నాఁడు—

ఈయవస్థలు చైతన్యస్వరూపములే యగునెడల స్వతఃసిద్ధములును నీకు ఆత్మభూతములునై నిరంతరమును భాసించుచునే యుండఁదగును. అట్లు కాక నివి ధనవస్త్రాదులవలె రాకపోకలు కలిగియుండుటచే ఆత్మరూపకములు కానేరవు. లోకములో స్వరూపము ద్రవ్యము నెప్పుడును విడిచియుండదు. ప్రకాశస్వభావము ప్రతిబంధములేనపుడు అగ్నిని విడిచియుండదు. నీస్వరూపములును కావు. కనుకనే జాగ్రత్స్వప్నావస్థలు అప్పుడప్పుడు స్ఫురించును గాని నిరంతరము స్ఫురింపవు.

జడములును దృశ్యములునగు జాగ్రత్స్వప్నావస్థలు చిత్స్వభావమును విడుచుటచేతనే సుషుప్తిదశయందు స్ఫురింపవు.

ఏది యేయవస్థలోమాత్రమే కన్పించుచు, అన్యావస్థలో ననుభవింపఁబడదో, అపుడు దానికి నాశముగాని బాధగాని సంభవించును. సుషుప్తియందు విషయములును వాని గ్రహణమునకు సాధనములగు ఇంద్రియములును లేనట్లే ఆత్మస్వరూపమును మాఱెనేని ఆయాత్మకు నాశముగాని బాధగాని చెప్పఁదగియుండును.

ఈ జాగ్రత్స్వప్నావస్థలు ఆగంతుకములగుటచేత ఆత్మధర్మములు కావు. కనుకనే వస్త్రాదులకువలె వీనికిని నాశముగలదు. స్వప్నకల్పితవస్తువు

లకుఁగాని భ్రాంతిచేఁదోఁచిన వస్తువులకుఁగాని ఉత్తరక్షణమున బాధ కలుగును. ౮౯

అవ. శిష్యుఁ డావాక్యమున కతిప్రసంగమును శంకించుచున్నాఁడు:—

మూ. నను ఏవం భగవన్, చైతన్యస్వరూపమపి ఆగంతుకం ప్రాప్తమ్, స్వప్నజాగరితయోరివ సుషుప్తే అనుపలబ్ధేః అచైతన్యస్వరూపో వా స్యామహమ్. ౯౦

తా. స్వప్నజాగరితములందు దృష్టి, శ్రుతి, మతి, విజ్ఞాతులు గలవు. కనుక చైతన్యము దృష్టిశ్రవణాదిధర్మములు గలదగును. కావున సుషుప్తి యందు స్వప్నజాగ్రదవస్థలు కనుపించనందున లేనట్లుగనే చైతన్యముసయితము కనుపించనందున లేనిదై స్వప్నజాగ్రదవస్థలందుమాత్రము కనుపించుట చేత ఆగంతుకమే కావలయును. కాదేని ఆత్మ చిద్రూపుఁడయినను గావలయును. అని శిష్యుని శంకాభిప్రాయము. ౯౦

అవ. ఆశంకను గురువు పరిహరించుచున్నాఁడు:—

మూ. న, పశ్య, తదనుపపత్తేః చైతన్యస్వరూపం చేదాగంతుకం పశ్యసి, పశ్య, నైతత్ వర్షశతేనాపి ఉపపత్త్యా కలయితుం శక్నుమో వయమ్, అన్యో వా చైతన్యోఽపి తస్య సంహతత్వాత్ పారార్థ్యమ్ అనేకత్వం నాశిత్వం చ న కేన చిదుపపత్త్యా వారయితుం శక్యమ్, అస్వార్థస్య స్వతః సిద్ధ్యభావాదిత్యవోచామ. చైతన్యస్వరూపస్య తు ఆత్మనః స్వతఃసిద్ధేః అన్యానపేక్షత్వం

న కేనచిత్ వారయితుం శక్యమ్, అవ్యభిచారాత్ .౯౧

తా. వస్తుస్వభావమును పరిశీలింపఁగా చైతన్యము ఆగంతుకమని చెప్పఁదగదు. చైతన్యరూపము సయితము ఆగంతుకమని తలఁచితివేని లోకాతీతప్రజ్ఞగల నీ వట్లు తలంపుము. న్యాయప్రమాణకుశలులమగు మేముగాని మఱియొక మూఢుఁడుగాని యెప్పటికిని నేమార్పునులేని చైతన్యస్వరూపము ఆగంతుకమని చెప్పఁజాలము.

మఱియు, ఉపాధిరహితమగు శుద్ధచైతన్యము ఆగంతుక మనెదవా ? లేక అనాదిద్వారకబుద్ధ్యుపహితచైతన్యము ఆగంతుకమని చెప్పెదవా ? యని శ్రీగురుమూర్తి వికల్పించి, ప్రథమపక్షమును అశక్యమని నిరాకరించెను.

ఈ చైతన్యము ఆగంతుకమని తెలియువాఁడు చేతనుఁడా ? లేక అచేతనుఁడా ? చెప్పుము. అంగుళ్యగ్రము తనను తాఁకలేదు. కన్ను తనను జూడలేదు. ఖడ్గధార (వాయి) తనను గోయలేదు. ఇట్లే ధీవృత్తియుఁ దనను గ్రహింపనేరదు. కావున చైతన్యమే తనను దెలియఁజాలదు.

పోనిమ్ము, స్వచైతన్యము తనను దెలియఁజాలకున్నను అన్యచైతన్యము తెలిసికొనఁ దగునందువా ? ఏకమగు చైతన్యము ద్వితీయరహితమగుటచేత అన్యమనుమాట చైతన్యమున కెన్నటికినిఁ బొసఁగదు.

ఈ తెలియునది అచేతనమనుమాట బొత్తుగ సరిపడదు. అచేతనమునకు చిత్సంబంధములేనిది ప్రకాశమే లేదు. ఇట్టిది చైతన్యము నెట్లు ప్రకాశింపఁ జేయఁగలదు ?

కావున చైతన్యము స్వతఃసిద్ధమేకాని ఆగంతుకమని చెప్పనొప్పదు. ఆత్మేతరములగు జడపదార్థములు పెక్కులగుటచేత పరప్రకాశ్యములు నశ్వరములునని యొప్పకతప్పదు. చైతన్యము స్వతస్సిద్ధమగుటవలనను, నిర్వికార

మగుటవలనను పరప్రకాశమును కోరదు.

ఏది దృశ్యమగునో యది దృక్కును జూడలేదు. ఏయాత్మసన్నిధిని ద్రష్ట విషయములను జూచునో యతఁడు విషయినిఁ జూడలేదు. మార్పులేని ద్రష్టయొక్క దృష్టికి లోపములేదు. ఏది అన్యమును జూచునో యట్టి ద్వితీయచైతన్యములేదు, అని—"యద్వైత న్న పశ్యతి, పశ్య న్వైత న్న పశ్యతి, నహి ద్రష్టు ర్దృష్టే ర్విపరిలోపో విద్యతే అవినాశిత్వాత్, నతు త ద్ద్వితీయ మస్తి తతో ఽన్య ద్విభక్తం యత్పశ్యేత్," ఈమొదలగు శ్రుతులు బోధించుచున్నవి.

"నయనాదిద్వారకబుద్ధ్యుపహితచైతన్యము సమూహమగుటచే పరప్రకాశ్యము, నశ్వరమునని యిదివఱకె చెప్పఁబడెను గనుక ఉపాధ్యుపహితచైతన్యము సయితము ఆగంతుకము కాదు. ఇచటను దృష్టినిఁ జూచువానిని నీవు చూడలేవు. శ్రోత్రమును వినువానిని నీవు వినలేవు. మతిని గ్రహించువానిని నీవు తెలుపలేవు. విజ్ఞానమును దెలియువానిని నీవు తెలియలేవు." అని—"నదృష్టే ర్ద్రష్టారం పశ్యేః, న శ్రుతేః శ్రోతారం శృణుయాః, న మతే ర్మంతారం మన్వీథాః, న విజ్ఞాతే ర్విజ్ఞాతారం విజానీయాః." ఈమొదలగు శ్రుతులు ప్రమాణము.

ఈ శ్రుతివాక్యమందు "దృష్టేర్ద్రష్టారం" అని యీ మొదలగు కర్త్రర్థకషష్ఠిచేఁ జెప్పఁబడెడి దృష్ట్యాదికము అన్యగ్రాహ్యమగుటచే 'అచైతన్యస్వభావక'మని చెప్పఁబడెను గనుక దృష్టిశ్రవణాదిస్వరూపములం బ్రకాశింపఁజేయుటచేత ద్రష్టృశ్రోతృమంతృవిజ్ఞాతృశబ్దములచే నిర్దేశింపఁబడిన సాక్షి నిత్యచైతన్యస్వభావుఁడే యని సిద్ధాంతము. ౯౧

అవ. ఈయర్థమునే మఱియొక యుక్తిచే నిరూపింపఁదలఁచి శిష్యుని శంకను జూపుచున్నాఁడు:—

మూ. నను వ్యభిచారో దర్శితో మయా సుషుప్తే న పశ్యామీతి. ౯౨

తా. సుషుప్తియందు చైతన్యమును సయితము చూడలేదని చెప్పితినిగద. ౯౨

అవ. ఉత్తరమును సంగ్రహముగఁ జెప్పుచున్నాఁడు:—

మూ. న, వ్యాహతత్వాత్, కథం వ్యాఘాతః? పశ్యత స్తవ న పశ్యామీతి వ్యాహతం వచనమ్, న హి కదాచిత్ భగవన్! సుషుప్తే మయా చైతన్యమన్యద్వా కించిత్ దృష్టమ్, పశ్యన్ తర్హి సుషుప్తే త్వం; యస్మాత్ దృష్టమేవ ప్రతిషేధసి, న దృష్టిమ్, యాతవ దృష్టిః తచ్చైతన్యమితి మయోక్తమ్, యయా త్వం విద్యమానయా న కించిత్ దృష్టమితి ప్రతిషేధసి సా దృష్టిః త్వచ్చైతన్యమ్, తర్హి సర్వత్ర అవ్యభిచారాత్ కూటస్థనిత్యత్వం సిద్ధం స్వతఏవ, న ప్రమాణాపేక్షమ్, స్వతః సిద్ధస్య హి ప్రమాతుః అన్యస్యప్రమేయస్య పరిచ్ఛిత్తిం ప్రతి ప్రమాణాపేక్షా, యా తు అన్యా నిత్యా పరిచ్ఛిత్తి రపేక్ష్యతే అన్యస్య అపరిచ్ఛిత్తిరూపస్య పరిచ్ఛేదాయ, సా హి నిత్యైవ కూటస్థా స్వయంజ్యోతిఃస్వభావా, ఆత్మని ప్రమాణత్వే ప్రమాతృత్వే వా న తాం ప్రతిప్రమాణాపేక్షా, తత్స్వభావత్వాత్, యథాప్రకాశన ముష్ణత్వం వా లోహోదకాదిషు పరతః అపేక్ష్యతే అగ్న్యాదిత్యాదిభ్యః, అతత్స్వభావత్వాత్; న అగ్న్యాదిత్యాదీనాం తదపేక్షా, సదా తత్స్వభావత్వాత్. ౯౩

తా. నీమాట యుక్తియుక్తముగ లేదు. అదెట్లన వినుము. చూచుచున్న నీవు చూడలేదనుట తగునా? అనిన, శిష్యుఁడు మఱలఁ జెప్పుచున్నాఁడు:—

అయ్యా! నేనెప్పుడును సుషుప్తియందు చైతన్యమునుగాని, అన్య విషయమునుగాని చూచుటలేదని శిష్యుఁడుచెప్పఁగా గురు విట్లనియె:—

'పశ్యన్నితి' వత్సా! చూచుచున్న నీవు దేనినింజూడలేదని దృశ్యమునే నిషేధించుచున్నావు. కాని దృష్టిని నివారింపలేవు. కనుక సుషుప్తియందును జూచెడి నీవు దృగ్రూపుఁడవేయని నేఁజెప్పితిని. మఱియును వినుము:—సుషుప్తియందు నాకేమియుందెలియలేదనెడి అజ్ఞానానుభవము కలదు. అదెట్లనఁగా; సుషుప్తినుండి జాగ్రద్దశలోనికి వచ్చినవాఁడు నాకేమియుందెలియలేదని స్మరించును. అనుభవములేని స్మృతి కలుగనేరదుగనుక అజ్ఞానానుభవము కలదని యొప్పుకతప్పదు. సుషుప్తికాలమున ఇంద్రియములు మనస్సును విలీనములై నిర్వ్యాపారములగుటవలన ఆగంతుకవిషయానుభవము లేకున్నను సహజమగు స్వరూపచైతన్యము సర్వావస్థలయందును అనుగతమయియే యుండుటచేత లోపింపదు. సహజస్వరూపకూటస్థచైతన్యము స్వతఃప్రమాణమగుటచే నన్యప్రమాణము నపేక్షింపదు. ఈచైతన్యము ప్రమాణప్రవృత్తికంటెఁ బూర్వమే సిద్ధమైనది కాని యితరప్రమాణము నపేక్షించునది కాదు.

ఈ యర్థమునే శ్రీశంకరభగవత్పాదులు 'స్వాత్మనిరూపణమ్' అను గ్రంథమున "మానం ప్రబోధయంతం బోధం మానేన యే బుభుత్సంతే, ఏధోభి రేవ దహనం దగ్ధుం వాంఛంతి తే మహాత్మానః"—(సకలప్రమాణములను బోధించెడి బోధను ప్రమాణాంతరముచేఁ దెలియఁగోరువారలు సకలమును దహించెడి వహ్నినిఁ గట్టెలతోఁ గాల్పఁదలఁచువారివలె పరిహాసింపఁబడుదురు) అని వివరించిరి.

పరిమితమును జడమును నగు పదార్థమును బ్రకాశింపఁజేయుటకు స్వతఃసిద్ధము స్వయంప్రకాశము నగు యే సంవిత్తు సమర్థమో యదియే కూటస్థాద్వయాత్మచైతన్యము.

1. ప్రమాణము:—అంతఃకరణవృత్తులయందు ప్రతిఫలించిన చైతన్యము.

2. * ప్రమ:— తెలియునట్టి జ్ఞానము.

3. * ప్రమాత:—వృత్తులుకలిగిన అంతఃకరణమందు ప్రతిబింబించినచైతన్యము.

4. ప్రమేయము:—ఇంద్రియగోచరములగు సకలవస్తువులు.

ఈ ప్రమేయము (వస్తువు)లు ప్రమాతృప్రమాణముల సహాయమునసే తెలియఁబడును. స్వయంజ్యోతిఃస్వభావమగు ఆత్మ వీని యపేక్ష లేకయే స్వయముగఁ బ్రకాశించును.

ఈ యాత్మను జడపదార్థము ప్రకాశింపఁజేయఁజాలకున్నను చైతన్యాంతరముచేతఁ బ్రకాశింపఁజేయఁబడరాదా యందువేని అది మఱియొక చైతన్యముచేతను బ్రకాశించునని అనవస్థారూప (అంతములేని) దోషము సంభవించును.

స్వతఃస్ఫూర్తిగల వస్తువును దెలియునపుడు ఇతరాపేక్ష యుండదనెడి యుక్తినిఁ బూర్వమే చెప్పితిమి.

ప్రమాతృప్రమాణ ప్రమేయములను స్వయంప్రకాశమగు ఆత్మయే

---

* ఈ ప్రమప్రమాతలురెండును తార్కికమతమునందు వేర్వేఱుగనుండునుగాని, వేదాంతశాస్త్రమునందు వేఱుగాక నొక్కటియే యగును.

భాసింపఁజేయుటచే ఆత్మచైతన్యము సహజము నిత్యము స్వప్రకాశకూటస్థము ననుట నిర్వివాదము.

లోకములో ప్రకాశోష్ణత్వస్వభావములులేని లోహజలాదులకు కాంతియు వేడిమియు వహ్నిసూర్యులవలనఁ గలుగునుగాని సతతప్రకాశోష్ణతాస్వభావముగల వహ్నిసూర్యుల కీధర్మసంపాదనవిషయమై యితరాపేక్ష యుండదుకద.

ఇట్లే ప్రకాశరహితములగు జడవస్తువులకే పరప్రకాశాపేక్ష కలదు కాని స్వతఃప్రకాశమగు ఆత్మకు దేనినుండియుం బ్రకాశాపేక్ష లేదు. ౯౩

అవ. ప్రమాణసిద్ధమగు జ్ఞానము నిత్యమగుననెడి శిష్యుని శంకపైని—

మూ. అనిత్యత్వే ఏవ ప్రమాస్యాత్, న నిత్యత్వే ఇతిచేత్.

తా. అనిత్యవస్తుజ్ఞానమును గుఱించియే సత్యజ్ఞానాపేక్షకాని నిత్యవస్తువును దెలియుట కీప్రమతోఁ బనిలేదు. ౯౪

అవ. ప్రమయనఁగా వస్తుజ్ఞానము. ఆప్రమ స్వయముగ ననిత్యమని చెప్పశక్యముకాదు—అని గురువు సమాధానము చెప్పుచున్నాఁడు.—

మూ. న,అవగతే ర్నిత్యత్వానిత్యత్వయోః విశేషానుపపత్తేః,
న హి అవగతేః ప్రమాత్వే అనిత్యా అవగతిః
ప్రమా, న నిత్యా ఇతి విశేషః అవగమ్యతే. ౯౫

తా. నయనాదిద్వారకబుద్ధివృత్తిచే వ్యక్తమయ్యెడి అర్థావగతి (వస్తుజ్ఞానము) ప్రమయగునపుడు నిత్యావగతియే ప్రమయనియు, అనిత్యావగతి

ప్రమ కాదనియుఁ జెప్పెడి నియమము లేనందున వీనికి భేదములేదు. ౯౫

అవ. అట్టి నియామకము కలదని శిష్యుఁడు చెప్పుచున్నాఁడు.—

మూ. నిత్యాయాం ప్రమాతుః అపేక్షాభావః, అనిత్యాయాం తు యత్నాన్తరితత్వాత్ అవగతిః అపేక్ష్యేత ఇతి విశేషః స్యాదితి చేత్. ౯౬

తా. అవగతి (అర్థజ్ఞానము) నిత్యమగునపుడు కర్తృకర్మాదివ్యాపారముతో నవసరములేకున్నను అనిత్యమగునపుడు పురుషప్రయత్నము నపేక్షించును గనుక భేదముకలదు. అని శంకింప— ౯౬

అవ. తనను దెలియుట నిత్యమనుటను గుఱించి యా విషయములను దెలిసికొనుటను గుఱించి యా ప్రమాతకు ప్రమాణవ్యాపారముతోఁ బనిలేకుండుట యని వికల్పించి, మాకిష్టమైనదే కనుక మొదటిపక్షము సరికాదని చెప్పుచున్నారు.—

మూ. సిద్ధా తర్హి ఆత్మనః ప్రమాతుః స్వతఃసిద్ధిః ప్రమాణనిరపేక్షతయైవేతి. ౯౭

తా. ఇట్లు ప్రమాతకు స్వనిత్యావగతిని గుఱించి ప్రమాణాపేక్ష లేదని యంగీకరించితివేని ప్రమాత (ఆత్మస్వరూపమున)కు స్వతఃసిద్ధియు, స్వయంప్రకాశతయు, అన్యావగతి నపేక్షింపమియుఁ బ్రాప్తించినవే యగును. ఇది మాకు సమ్మతమే. అనిత్యమును జడమును పరప్రకాశ్యము నగునది ఆత్మ కానేరదని భావము. ౯౭

అవ. నిత్యమైనను ఆత్మబోధ ప్రమాణము నపేక్షింప రాదా యని శిష్యుఁడడుగఁగా.—

మూ. అభావేఽపి అపేక్షాభావః, నిత్యత్వాత్ ఇతి చేత్, న, అవగతేరేవ ఆత్మని సద్భావాదితి పరిహృతమేతత్.

తా. ఆత్మ బోధస్వరూపమే యని యుపపాదించి, యీ శంక పూర్వమే పరిహరింపఁబడెను. స్వతఃసిద్ధమగు ఆత్మ ప్రమాణము నపేక్షింపదు. అని ౯౩-వ వాక్యముయొక్క తాత్పర్యమున వ్రాయఁబడెను.  ౯౪

అవ. ప్రమాత యన్యప్రమాణము నపేక్షింపఁడను మాటనే ఆక్షేపములను నిరసించుచు నిత్యమగు ప్రమయు విషయద్వారముననే తెలియఁబడునని చెప్పుటకై ప్రమాణ వ్యాపారము నపేక్షించునని సూచించుచు పక్షాంతరమును నిరాకరించుచున్నారు.—

మూ. ప్రమాతుశ్చేత్ ప్రమాణాపేక్షా సిద్ధిః కస్య ప్రమిత్సాస్యాత్, యస్య ప్రమిత్సా స ఏవ ప్రమాతా అభ్యుపగమ్యతే, తదీయా చ ప్రమిత్సా ప్రమేయవిషయైవ, న ప్రమాతృవిషయా, ప్రమాతృవిషయత్వే అనవస్థాప్రసంగాత్ ప్రమాతుః తదిచ్ఛాయాశ్చ తస్యాప్యన్యః ప్రమాతా తస్యాప్యన్య ఇతి, ఏవమేవ ఇచ్ఛాయాః ప్రమాతృవిషయత్వే, ప్రమాతుః ఆత్మనః అవ్యవహితత్వాచ్చ ప్రమేయత్వానుపపత్తిః, లోకే హి ప్రమేయం నామ ప్రమాతుః ఇచ్ఛాస్మృతిప్రయత్న

ప్రమాణ జన్మవ్యవహితం సిద్ధ్యతి, నాన్యథా; అవగతిః ప్రమేయవిషయా దృష్టా, న చ ప్రమాతుః ప్రమాతాస్వస్య స్వయమేవ కేనచిత్ వ్యవహితః కల్పయితుం శక్యః ఇచ్ఛాదీనామన్యతమేనాపి, స్మృతిశ్చ స్మర్తవ్యవిషయా, న స్మర్తృవిషయా, తథాఇచ్ఛాయాః ఇష్టవిషయత్వమేవ, న ఇచ్ఛావద్విషయత్వమ్, స్మర్త్రిచ్ఛావద్విషయత్వేఽపి హి ఉభయోః అనవస్థా పూర్వవత్ అపరిహార్యాస్యాత్. ౯౯

తా. ప్రమాతయు ప్రమాణము నపేక్షించునేని యీప్రమాణాపేక్ష యెవనికిఁ గలుగును. ప్రమాణేచ్ఛగలవాఁడేకద ప్రమాత యనిపించుకొనును. ఈప్రమాణేచ్ఛయు ప్రమేయమునే గోచరించునుగాని ప్రమాతృవిషయమై ప్రవర్తింపదు. ఈప్రమాణేచ్ఛ ప్రమాతనుగుఱించి ప్రవర్తించునెడల అనవస్థాదోషము కలుగును.

లోకములో ప్రమేయము ప్రమాతయొక్క ఇచ్ఛాస్మృతిప్రయత్నప్రమాణజన్మములచే వ్యవహితమగును. అనఁగా కోరఁబడెడి వస్తువునకును, కోరువానికిని నడుమ కోరికయుండును. స్మరింపఁబడెడి వస్తువునకును స్మరించువానికిని నడుమ స్మరణముండును. ఇట్లే కార్యజాతమునకును కర్తకును నడుమ ప్రయత్నముండును. అని లోకప్రసిద్ధము. సిద్ధియన నిష్పత్తియు, ప్రకాశించుటయు; అవగతియన ప్రకాశించుట దొరకుటయు నర్థములు. కనుక సుషుప్తియందు ఆత్మావగతియన ఆత్మ ప్రకాశించునని యర్థముకాని ఆత్మ దొరకుననికాదు.

ఇట్లేని ప్రమాతయు ఇచ్ఛావ్యవధానముగ సిద్ధించునా యన నట్లు కాదని చెప్పుటకై "నచేతి" ప్రమాతయగు తాను తనయొక్క ఇచ్ఛాస్మృ

త్యాదులలో దేనిచేతను వ్యవహితుఁడు కాఁజాలఁడు. ఏలయన:—స్మృతి స్మరింపఁదగిన పదార్థమునే గోచరించునుగాని స్మర్తను గోచరింపదు గనుక స్మర్త తన స్మృతిచే వ్యాపింపఁబడఁడు. అయినను మఱియొకని స్మృతికి గోచరించునంటేని వాఁడు మఱియొకని స్మృతిని 'ఆస్మర్త మఱియొకని స్మృతిని' గోచరించుననియెడి పూర్వోక్తానవస్థాదోషము అపరిహార్యమే యగును. ౯౯

అవ. ఆత్మ ప్రమాణాంతరము నపేక్షింపదు. విషయి (ప్రమాత) యగు తాను తన ప్రమాణక్రియకు విషయము కాఁజాలదు. అన్యప్రమాతకు విషయముకాఁదగుననిన అనవస్థాదోషము తప్పదు. కనుక ఆత్మ అప్రమేయుఁడే. అనఁగా జ్ఞానవిషయము కానివాఁడే.

అజ్ఞానము బాహ్యవిషయములను గోచరించుటచేత ఆబాహ్యవిషయనివృత్తికై ఆత్మ సర్వాంతరుఁడనియు, ప్రమాణనిరపేక్షుఁడనియు తాత్పర్యము. నిత్యమగు అవగతి బాహ్యవిషయముల నెఱుఁగుటచేత వ్యర్థముకాదు. అని సాధించి, యిపుడు మఱియొకవిధమున ఆ యవగతినిత్యత్వమును సాధించుటకై శిష్యునిచేఁ జేయఁబడు శంకకు.—

మూ. నను ప్రమాతృవిషయావగత్యనుత్పత్తౌ అనవగత ఏవ ప్రమాతాస్యాదితిచేత్. ౧౦౦

తా. అయ్యా! ఏది జ్ఞానమునకు విషయమగునో అదియే తెలియఁబడును. అవగతి (జ్ఞానము) ప్రమాతను గోచరింపదేని ఆతఁడెన్నడును అవగతుఁడు (తెలియఁబడువాఁడు) కానేరఁడు-సుషుప్తుఁడే కావలెను. ౧౦౦

అవ. ఆత్మకు సుషుప్తునితో సామ్యము లేదని గురువు సమాధానము.—

మూ. న, అవగన్తుః అవగతేః అవగన్తవ్యవిషయత్వాత్, అవగంతృవిషయత్వే చానవస్థా పూర్వవత్స్యాత్, అవగతిశ్చాత్మని కూటస్థనిత్యాత్మజ్యోతిః అన్యతః అనపేక్షైవ సిద్ధా, అగ్న్యాదిత్యాద్యుష్ణప్రకాశవదితి పూర్వమేవ ప్రసాధితమ్, అవగతేః చైతన్యాత్మజ్యోతిషః స్వాత్మని అనిత్యత్వే ఆత్మనః స్వార్థతాఽనుపపత్తిః, కార్యకరణసంఘాతవత్ సంహతత్వాత్ పారార్థ్యం దోషవత్త్వం చ అవోచామ, కథమ్? చైతన్యాత్మజ్యోతిషః స్వాత్మని అనిత్యత్వే, స్మృత్యాదివ్యవధానాత్ సాన్తరత్వమ్, తతశ్చ తస్య చైతన్యజ్యోతిషః ప్రాగుత్పత్తేః ప్రధ్వంసా చ్చోర్ధ్వమాత్మన్యేవాభావాత్ చక్షురాదీనామివ సంహతత్వాత్ పారార్థ్యం స్యాత్, యదా చ తత్ ఉత్పన్నం ఆత్మని విద్యతే, న తదా ఆత్మనః స్వార్థత్వమ్, తద్భావాభావాపేక్షా హి ఆత్మానాత్మనోః స్వార్థత్వపరార్థత్వసిద్ధిః, తస్మాత్ ఆత్మనః అన్యనిరపేక్షమేవ నిత్యచైతన్యజ్యోతిష్ట్వం సిద్ధమ్. ౧౦౧

తా. అవగంత (జ్ఞాత) యొక్క అవగతి (జ్ఞానము) అవగంతవ్య (జ్ఞేయవస్తు) విషయమగునుగాని జ్ఞాతనుగుఱించి ప్రవర్తింపఁజాలదు. ఈ జ్ఞాన మట్లు జ్ఞాతనుగుఱించి ప్రవర్తించునెడల నాజ్ఞాత మఱియొక జ్ఞానములో విషయము కావలెను. అతఁడును మఱియెవని జ్ఞానములో విషయము కావలసియుండునని అనవస్థాదోషము సంభవింపక మానదు. కాఁబట్టి యీ యవగతి జ్ఞాతనుగుఱించి ప్రవర్తించునని చెప్పఁదగదు. అగ్నిసూర్యా

దులకు ప్రకాశోష్ణత్వాదిధర్మములు స్వతఃసిద్ధములే కాని యితరము నపేక్షింపవు. ఈప్రకారము కూటస్థనిత్యజ్యోతిస్స్వరూపాత్మ తన సిద్ధికై యన్యజ్ఞానము నపేక్షింపదని యింతకుముందే సాధింపఁబడెను.

చైతన్యజ్యోతిస్స్వరూపమగు ఆత్మయొక్క అవగతి అనిత్యమగునేని కార్యకరణసంఘాతమువలె పరప్రకాశ్యమగుననెడి దోషము నయితము పూర్వమే చూపఁబడెను.

చైతన్యాత్మజ్యోతిస్సునకు అనిత్యమును చెప్పేయెడల స్మృతీచ్ఛాప్రయత్నములును నడుమ నుండవలసియుండుననియు, అట్లు సంభవింపదనియు ౯౯-వ వాక్యమునందే చూపఁబడెను.

ఇచ్ఛాదులచే వ్యవధానమును, వీని విచ్ఛేదమును గలుగునేని ఆత్మకు సాంతరత్వము (మధ్యనొకటి వ్యవధానముగ నుండుటయును, ఇచ్ఛాదివృత్త్యంతరపూర్వకత్వమును) సంభవించును. అట్లేని ఘటాదివిషయములవలె చైతన్యాత్మజ్యోతిస్సునయితము ఉత్పత్తికంటెఁ బూర్వమందును, ధ్వంసానంతరమందును ఆత్మయం దుండకపోవుటవలన ఆ చైతన్యజ్యోతిస్సునయితము పరప్రకాశ్యమే కావలసియుండును.

అట్లేని, ఆత్మ స్వయంప్రకాశమని బోధించెడి యీ శ్రుతులకు భంగము కలుగును, శ్రుతిః—"అత్రాయం పురుషః స్వయం జ్యోతిః," "ఆత్మైవాస్య జ్యోతిః, ఏషోఽస్యపరమోలోకః," "న హి విజ్ఞాతుర్విజ్ఞాతేర్విపరిలోపో విద్యతే," యీ మొదలగు స్మృతులు "ఆత్మ స్వయంజ్యోతి" యని ఘోషించుచున్నవి.

కార్యకరణసంఘాతమగు అనాత్మ ఆగంతుక చిత్ప్రకాశగమ్యమగును. ఏతద్విలక్షణమును నిత్యావగతిస్వరూపమును నగు ఆత్మ సుషుప్తునివంటిది కానేరదు. మఱియు, నిత్యచైతన్యజ్యోతిస్స్వరూప మగుటచే నితరప్రకాశాపేక్ష లేనిదే యగును. ౧౦౧

అవ. నిత్యచైతన్యస్వరూపుఁడు ప్రమాత (జ్ఞాత) కాఁజాలఁడని చెప్పెడి శిష్యుని శంక.—

మూ. నను ఏవం సతి అసతి ప్రమాఽఽశ్రయత్వే, కథం ప్రమాతుః ప్రమాతృత్వమ్? ౧౦౨

తా. అయ్యా! ప్రమ(జ్ఞానమున)కు ఆశ్రయుఁ డగునపుడుకాని కానపుడుకాని ఆత్మ ప్రమాత యెట్లగును?

అవ. ఆత్మ జన్యప్రమకు ఆశ్రయుఁడు కాకున్నను ప్రమాత కాఁదగునని శ్రీగురువుల సమాధానము.—

మూ. ఉచ్యతే—ప్రమాయాః నిత్యత్వే అనిత్యత్వే చ రూపవిశేషాభావాత్, అవగతిర్హి ప్రమా, తస్యాః స్మృతీచ్ఛాదిపూర్వికాయాః అనిత్యాయాః, కూటస్థనిత్యాయా వా, న స్వరూపవిశేషో విద్యతే, యథా ధాత్వర్థస్య తిష్ఠత్యాదేః ఫలస్య గత్యాదిపూర్వకస్య అనిత్యస్య అపూర్వస్య నిత్యస్య వా రూపవిశేషో నాస్తీతి తుల్యో వ్యపదేశో దృష్టః 'తిష్ఠన్తి మనుష్యాః' 'తిష్ఠన్తి పర్వతాః' ఇత్యాది, తథా నిత్యావగతిస్వరూపేఽపి ప్రమాతరి ప్రమాతృత్వవ్యపదేశో న విరుధ్యతే ఫలసామాన్యాదితి. ౧౦౩

తా. అవగతియే ప్రమ. ఇది నిత్యమైనను అనిత్యమైనను వీనికి స్వరూపభేదము లేదు. ఎట్లన—"మనుష్యాః తిష్ఠన్తి, పర్వతాః తిష్ఠన్తి" యనెడి వాక్యములలో 'తిష్ఠంతి = కదలకుండుట' అనునట్టి ధాత్వర్థము

నందు గతిపూర్వకమగుటచేత అనిత్యమగు జంగమక్రియకును, సహజమగుట చేత నిత్యమగు స్థావరక్రియకును రూపభేదము లేదు. అయినను జంగమ ములు స్థావరములును 'తిష్ఠంతి' కదలుటలేదని సమానముగ వ్యవహరింపఁ బడుచుండును.

ఇట్లే నిత్యప్రమాశ్రయుఁడగు కూటస్థుని గుఱించిన ప్రమకుగాని ఇచ్ఛాస్మృత్యాదివ్యవహితమగుటచేత ననిత్యమగు ప్రమకుగాని ఫలసామా న్యమువలన స్వరూపభేదము లేదు. ప్రమయనఁగా ప్రమాణఫలము. ఇది చిత్ప్రకాశరూపమగు ప్రమాత నాశ్రయించియే యుండును.

అట్లుగాక యీప్రమ తెలియఁబడునట్టి విషయముల నాశ్రయించి యుండునందువేని "మయేదం విదితం" నేను దీనినిఁ దెలిసికొంటిని. యీ మొదలగు వాక్యములలో ఆత్మయందు జ్ఞానజ్ఞేయసంబంధము కలుగకపోవల యును. ఎట్లనఁగా—జడమగు అంతఃకరణాదికము వ్యాపారాశ్రయమైనను చిద్రహితమగు దీనికి ప్రమ (సత్యజ్ఞానము) కలుగదు. కూటస్థుఁడగు చిదాత్మ నిష్క్రియుఁడగుటచే ముఖ్యవృత్తిచేఁ గర్తృత్వ మితనికిఁ బొసఁగదు. కావున చిజ్జడములగు ఆత్మాంతఃకరణములు రెండింటికిం బరస్పరాధ్యాసము వలన నే కర్తృత్వాదివ్యవహారము సిద్ధించుటవలన బాహ్యవిషయములందును ఆత్మకు ప్రమాతృత్వము అధ్యాససిద్ధమేయగును. దీనిచే నీప్రమాతృత్వము (కర్తృత్వము) మిథ్యకాఁగా స్వయంప్రకాశస్వభావమగు ఆత్మ ప్రమాత యని యెట్లు చెప్పఁదగును? అట్టియాత్మ భాసింపలేదని బొత్తుగఁ జెప్పఁదగదు. కావున నిట్టి స్వయంప్రకాశాత్మ ప్రమాణాంతరము నపేక్షించునని యెంత మందమతియుఁ జెప్పలేఁడు. ౧౦౩

అవ. నిత్యజ్యోతిస్స్వరూపుఁడగు ఆత్మ అంతఃకరణో పాధివలనప్రమాత (జ్ఞాత) కాఁదగునని చెప్పి, యిపుడు దాని

వలననే కర్తయును గావచ్చునని నిరూపించుటకై శిష్యుని శంకను జూపుచున్నాఁడు.—

మూ. అత్రాపి హి శిష్యః—నిత్యావగతిస్వరూపస్య ఆత్మనః అవిక్రియత్వాత్ కార్యకరణైః అసంహత్య తక్షాదీనామివ వాస్యాదిభిః కర్తృత్వం నోపపద్యతే, అసంహతస్వభావస్య చ కార్యకరణోపాదానే అనవస్థా ప్రసజ్యేత, తక్షాదీనాం తు కార్యకరణైః నిత్యమేవ సంహతత్వమితి వాస్యాద్యుపాదానే నానవస్థా స్యాదితి. ౧౦౪

తా. ఉలి బాడిత మొదలగు సాధనములతోఁ గూడియున్నపుడు తక్ష (వడ్రంగి) కర్తకాఁదగును. నిత్యావగతిస్వరూపుఁడును నిర్వికారుఁడు నగు ఆత్మ కార్యకరణసహితుఁడు కానందున నితనికి కర్తృత్వము సంభవింపదు; అని యిచట వ్యతిరేకదృష్టాంతము చెప్పఁబడెను. అదియేల సంభవింపదన:—తక్షాదులెప్పుడును కార్యకరణములతోఁ గూడియేయుందురు కనుక నిట దోషమేమియుం గలుగదు. కాని, సంహతస్వభావములేని కూటస్థాద్వయాత్మకు కార్యకరణసంహతి చెప్పినయెడల అనవస్థాదోషము సంభవించును. ౧౦౪

అవ. సంహతత్వము—(అవయవములతోను సాధనములతోనుకూటమి) లేనివానికిఁ గర్తృత్వము సంభవింపదు కనుక ఆత్మకును నీవు అసంహతత్వమును సంపాదింపఁ దలచితివా? లేక, ఆకర్తృత్వము వాస్తవముకాదని చెప్పెదవా? యని వికల్పించి కూటస్థత్వమును సాధించుటవలననే ఆత్మకు సంహతత్వము లేదని నివారింపఁబడినందున, ఇందలి ప్రథమపక్షము

విచారణీయముకాదని తలఁచి కర్తృత్వము వాస్తవముకాదని యెడి రెండవపక్షమును నిరూపించుచున్నారు.—

మూ. ఇహ తు అసంహతస్వభావస్య కరణానుపాదానే కర్తృత్వం నోపపద్యత ఇతి కరణ ముపాదేయమ్, తదుపాదానమపి విక్రియైవేతి తత్కర్తృత్వే కరణాంతరముపాదేయమ్, తదుపాదానేఽపి అన్యదితి ప్రమాతుఃస్వాతంత్ర్యే అనవస్థా అపరిహార్యా స్యాదితి, న చ క్రియైవ ఆత్మానం కారయతి, అనిర్వర్తితాయాః స్వరూపాభావాత్, అథ అన్యత్ ఆత్మానముపేత్య క్రియాం కారయతీతి చేత్, న; అన్యస్య స్వతస్సిద్ధత్వావిషయత్వాద్యనుపపత్తేః, న హి ఆత్మనః అన్యత్ అచేతనం వస్తు స్వప్రమాణకం దృష్టమ్, శబ్దాది సర్వమేవ అవగతిఫలావసానప్రత్యయప్రమితం సిద్ధంస్యాత్! అవగతిశ్చేత్ ఆత్మనోఽన్యస్య స్యాత్ సోఽపి ఆత్మైవ అసంహతః స్వార్థః స్యాత్, న పరార్థః, న చ దేహేంద్రియవిషయాణాం స్వార్థతాం అవగంతుం శక్నుమః, అవగత్యవసానప్రత్యయాపేక్షసిద్ధిదర్శనాత్. ౧౦౫

తా. కర్తకు పరాపేక్షలేదని చెప్పునెడల నీక్రింది దోషము కలుగును:—కరణ (సాధన)ములేక యేపాటికార్యమును జరుగనేరదు. ఆత్మయును దనకుఁగర్తవ్యము సంపాదించుటకై కరణముల గ్రహింపవలయును. ఆకరణస్వీకారమును నొకక్రియయే కనుక యాక్రియానిష్పత్తికై యాకర్త మఱియొకసాధనమును దానిని గుఱించి మఱియొకసాధనమును నపే

క్షీంపవలసియుండును. ప్రమాత స్వతంత్రుఁడగునేని యీ యనవస్థారూపదోష మపరిహార్యము. అని శిష్యుని యభిప్రాయము. దానికి గురువుచెప్పు సమాధానము:—

కర్తృత్వ మొకచోట కరణసహాయమునఁ గలుగును. వేఱొకచోట స్వసన్నిధిమాత్రమున కార్యకారియగును. ఈ రెండింటిలో కరణములచేత సాధింపఁదగిన కర్తృత్వమును అంగీకరించినయెడల నిష్క్రియుఁడగు ఆత్మకు వాస్తవమగు కర్తృత్వము లేదు. అయినను, లోకములో నైంద్రజాలికుఁడు తన మాయాబలమున విచిత్రజగత్తును గల్పించునట్లును, వహ్నిసంయోగము వలన నినుము దహించునట్లును స్వీయమాయాపరికల్పితాంతఃకరణవికారములను అవివేకమువలన విమర్శింపమిచే కూటస్థాత్మకుఁ గర్తృత్వాభాసము కలుగును. అనఁగా, కర్తృత్వములేని ఆత్మ కర్తవలెఁ దోఁచును. ఇచట— జలము చలింప నందుప్రతిఫలించిన చంద్రుఁడు కదలుచున్నట్లు అజ్ఞులు తలంచునట్లు మనస్సునదియగు కర్తృత్వమును అవివేకులు నిర్వికారాత్మదిగాఁ దలంతురు "అజ్ఞానాన్మానసోపాధేః కర్తృత్వాదీని చాత్మని, కల్ప్యంతేఽంబుగతే చంద్రే చలనాదిర్యథాఽంభసః." అని శ్రీశంకరాచార్యులు ఆత్మబోధప్రకరణమున నిరూపించిరి. కావున ఆత్మకుఁ గర్తృత్వము మాయికము గాని వాస్తవము కాదు.

కరణసాధ్యమగు కర్తృత్వమునుజూపి సన్నిధిమాత్రసాధ్యమగు కర్తృత్వమునుగూర్చి చెప్పుచున్నాఁడు:—

[1] తక్షాదులు స్వసన్నిధిమాత్రాన హస్తాదులను నడిపి కర్తలగుదురు. కాని, యంతకంటె నతిరిక్తమును గోరరు. సర్వసాక్షియగు ఆత్మయు స్వసన్నిధిమాత్రాన జడములను ప్రేరేపించుచు కర్తయనఁబడును. ఇట్లైనను సకల

1 తక్ష=వడ్రంగి.

సాక్షియు నిర్వికారుఁడునగు ఆత్మకుఁ గర్తృత్వము ఉపాధితాదాత్మ్యము వలనఁ గలిగినదే కాని వాస్తవము కాదు.

ఇట్లే శ్రీవ్యాసులును సూత్రించిరి:—

| | | అ. | పా. | సూత్రం. |
|---|---|---|---|---|
| 1. | కర్తా శాస్త్రార్థవత్త్వాత్. | ౨ | 3 | 33 |
| 2. | యథా చ తక్షోభయథా. | ౨ | 3 | ౪౦ |

ఈ సూత్రముల తాత్పర్యము:—

(1) "యజేత, జుహుయాత్, దద్యాత్."
యాగమును, హోమమును, దానమును జెప్పెడి యీ క్రియలు కర్తలేనిదిఁ సంభవింపవు. కావున నీవిధి శాస్త్రముయొక్క సాఫల్యముకొఱకు జీవుఁడు కర్తయని యంగీకరింపవలయును.

(2) జీవున కీకర్తృత్వము ఔపాధికమేకాని వాస్తవముకాదని యీ సూత్రము బోధించుచున్నది. ఎట్లన:—శిల్పాగారమునందు ఉలి, బాడిసె మొదలగు పనిముట్లతోఁ గూడినపుడు వడ్రంగి కర్తయై శ్రమను జెందుచున్నాఁడు. అతఁడే స్వగృహమునందు కార్యకరణరహితుఁడగుచుఁ గర్తకాక సుఖించును. ఇట్లే జీవుఁడు జాగ్రత్స్వప్నావస్థయందు ఇంద్రియ సాన్నిధ్యమువలనఁ గర్తయై శ్రమఁజెందుచుఁ గరణోపసంహారరూపమగు సుషుప్తియందు కర్తకాక సుఖియించును. కావున జీవునకుఁ గర్తృత్వము ఔపాధికమే కాని వాస్తవము కాదు.

జీవుఁడు అస్వతంత్రుఁడై కార్యములను జేయుననెడి కర్మమీమాంసకుల మతమును శంకించి పరిహరించుచున్నాఁడు:—'నచ క్రియేతి.' క్రియ యనఁగా ప్రయత్నమా? ధాత్వర్థమా? లేక, యాగక్రియాసాధ్యమగు

[1]అపూర్వమా? అని వికల్పించి మొదటి రెండును సంభవింపవని చెప్పు చున్నాఁడు :—

తాను లేక యేపనినిం జేయఁజాలఁడను న్యాయమున నిష్పన్నము కాని క్రియస్వరూపరహితమగుటచే తాను జీవునిచేఁ గార్యమును జేయించునని చెప్పఁదగదు. మూఁడవపక్షమందు ఆయపూర్వమనఁగా నియోగమా? లేక నిష్పన్నమగు ధర్మాధర్మములా? నిష్పన్నము కానిది యేపనినిం జేయింపఁ జాలదు కనుక నియోగ మనరాదు. పూర్వసిద్ధమగు ధర్మాధర్మము లనెదవా? అవి యచేతనము లగునేని ఆత్మను ప్రేరేరింపనేరవు. చేతనమనెదవా ఆత్మ కంటె మఱియొక చేతనము లేనేలేదు. ఈమొదలగు యుక్తిధారలచేత పూర్వమీమాంసకమతమును ఖండించి "అవగతిశ్చేత్" అను దానిచే నైయాయికమతమును నిరాకరించుచున్నాఁడు:—

అవగత్యాశ్రయుఁడగు ఈశ్వరుఁడు ప్రత్యగాత్మకంటెను పరమాత్మ కంటెను అన్యుఁడుకాఁడు. ఇట, "అయమాత్మాబ్రహ్మ" యనెడి శ్రుతియును గలదు. పరమాత్మకు కర్తృత్వము ఔపాధికమేకాని వాస్తవముకాదు.

జీవుఁడు కర్త కాకున్నను జగన్నిర్మాతయగు నీశ్వరుఁడు కర్త కారాదాయని శంకింపవలదు. ఈశ్వరుఁడును మాయాసహాయమున సృజించుటచే నీశ్వరునకును కర్తృత్వము మాయికమేకాని వాస్తవముకాదు.

ఇట్లు "మాయాంతు ప్రకృతింవిద్యాత్ మాయినంతు మహేశ్వరం, సమాయీ సృజతీత్యాహుః శ్వేతాశ్వతరశాఖినః." "మాయావృత్త్యాత్మకో హీశసంకల్పః సాధనం జనౌ, మనోవృత్త్యాత్మకో జీవసంకల్పో భోగసాధనమ్."—మాయ జగన్నిర్మాణమునకుఁ బ్రకృతి, ఆమాయను వశపఱ్చుకొనిన వాఁడు మహేశ్వరుఁడు. ఇతఁడు మాయాసహాయమున జగత్తును బుట్టించు

1 ఈ యపూర్వము స్వర్గఫలనిష్పత్తివఱకు నుండునని పూర్వమీమాంసకుల మతము.

ననియు, జీవుఁడు మనస్సహాయమున జగద్వస్తువుల ననుభవించుననియు. "పంచదశీద్వైతవివేకప్రకరణ"మున శ్రీవిద్యారణ్యమునీశ్వరులు నిరూపించిరి.

సంహతములగు దేహేంద్రియాదులకును అవగతి (జ్ఞానము) కలదనెడి లోకాయతమతమున సయితము దేహేంద్రియాదులు అవగమ్యములె (తెలియఁబడునవియె)కాని అవగత్యాశ్రయములు కాకపోవుటచేత నుపేక్షణీయమే. ౧౦౫

అవ. 'నేను నరుఁడను, ఎఱుఁగుదును, చూచుచున్నాను అను నీమొదలగు వ్యవహారము కలుగుచుండఁగా దేహాదులు తెలిసికొనునవికావని యేల చెప్పవలెను' అని శిష్యుఁడు శంకించుచున్నాఁడు.—

మూ. నను దేహస్యావగతౌ న కశ్చిత్ ప్రత్యక్షాదిప్రత్యయాంతరమపేక్షతే. ౧౦౬

తాత్పర్యము. అవతారికయందే స్పష్టము. ౧౦౬

అవ. అట్టి యనుభవముమాత్రము కలదని గురువంగీకరించుచున్నాఁడు.—

మూ. బాఢమ్, జాగ్రతి ఏవం స్యాత్, మృతిసుషుప్త్యోస్తు దేహస్యాపి ప్రత్యక్షాదిప్రమాణాపేక్షైవ సిద్ధిః, తథైవ ఇంద్రియాణామ్, బాహ్యా ఏవ హి శబ్దాదయో దేహేంద్రియాకారపరిణతా ఇతి ప్రత్యక్షాదిప్రమాణాపేక్షైవ హి సిద్ధిః, సిద్ధి రితి చ ప్రమాణఫలమవగతిమవోచామ, సా చ అవగతిః కూటస్థా స్వయంసిద్ధా ఽఽత్మజ్యోతిస్స్వరూపేతి చ. ౧౦౭

తా. సత్యమే కాని యీయనుభవము దేహాత్మలకు తాదాత్మ్యాభిమాన రూపమగు అవివేకమువలనఁ గలిగినదే కాని జడమగు కేవలదేహము దేనిని నెఱుఁగనేరదు. దేహమునకు స్వయంప్రకాశము కలదేని తన సత్తనుగుఱించియు నన్యప్రమాణమును గోరదు. అట్లేని సుషుప్తిమరణావస్థలందును దేహము ప్రమాణాంతరము నపేక్షింపకపోవలయును. ఈయవస్థలయందు దేహము తననుసయితము నెఱుంగలేదు కనుక నిది అచేతనమును పరప్రకాశ్యము నగును. దేహమువలె నింద్రియాదులును పరప్రకాశ్యములే కాని చిత్స్వభావములు కావు.

జడములగు దేహేంద్రియాదులు దేనిసాన్నిధ్యమున చైతన్యవంతములై వ్యవహరించుచుండునో యది ఆత్మయని—"అజడాత్మవదాభాంతి యత్సాన్నిధ్యాత్ జడా అపి, దేహేంద్రియమనఃప్రాణాస్సోఽహ మిత్యవధారయ." యని అనుభూతిప్రకాశకయందు శ్రీవిద్యారణ్యముని నుడివెను.

ఈయర్థమందు ప్రత్యక్షప్రమాణమే కాక అనుమానప్రమాణమును గలదు. ఎట్లన:—పంచభూతకార్యములగు దేహేంద్రియాదులు బాహ్యములగు ఘటాదులవలెనే ఆత్మ కానేరవు. ఈపంచభూతములే భోగసాధనములగు ఇంద్రియములుగను, భోగ్యవస్తువులుగను, భోగాయతన (భోగస్థాన) మగు శరీరములుగను పరిణమించును, మాఱుచుండును.

అయ్యా! సిద్ధియనఁగా నిష్పత్తికద. దీనికి ప్రత్యక్షాదిప్రమాణాపేక్ష యేల? అని శిష్యుఁడు శంకింప గురువు చెప్పెను—సిద్ధియనఁగా ప్రమాణఫలమగు జ్ఞానమనియును, అది స్వతఃసిద్ధకూటస్థాత్మజ్యోతిస్స్వరూపమనియుం జెప్పితిమి.

ఇందువలన భూతములు దేహేంద్రియాద్యాకారముగ పరిణమింపఁగ మద్యపానమువలన మదశక్తి కలుగునట్లు అవగతి కలుగునని చెప్పెడి లోకాయతుల మతము నిరసింపఁబడెనని తెలియవలెను. ౧౦౭

అవ. అవగతి ప్రమాణఫలమనియు, అది కూటస్థస్వరూపమనియుం జెప్పుట పరస్పరవిరుద్ధము. ఏలయన, ప్రమాణజన్యమగునది నిత్యముకాదు. 'కూటస్థ (మార్పు లేని నిర్వికార) మగునది వేఱొకదానినుండి పుట్టదుకద' యని శిష్యుని శంకయు, గురువుల సమాధానమును.—

మూ. అత్రాహ చోదకః —అవగతిః ప్రమాణానాం ఫలం కూటస్థనిత్యాత్మజ్యోతి స్స్వరూపేతి చ విప్రతిషిద్ధమ్, ఇత్యుక్తవన్త మాహ—న విప్రతిషిద్ధమ్, కథం తర్హ్యవగతేః ఫలత్వమ్? తత్త్వోపచారాత్, కూటస్థానిత్యాఽపి సతీ ప్రత్యక్షాదిప్రత్యయాంతే లక్ష్యతే తాదర్థ్యాత్. ప్రత్యక్షాదిప్రత్యయస్య అనిత్యత్వే అనిత్యేవ భవతి, తేన ప్రమాణానాం ఫల మిత్యుపచర్యతే    ౧౦౮

తా. అవగతి ప్రత్యక్షాదిప్రమాణఫలమని చెప్పితిరి. ఇయ్యది కూటస్థనిత్యాత్మజ్యోతి స్స్వరూపమనియుం జెప్పితిరి. ఉత్పన్నమగునది నిత్యము కాదు. నిత్యనిర్వికారవస్తువు పుట్టదు. కనుక నీవిరోధము నెట్లు పరిహరింతురన గురు విట్లనియె:—

ఘటాకాశమనెడి శబ్దప్రయోగమునఁ జేయఁబడెడి ఘటమును బట్టియే యాకాశమునకుఁగూడ కార్యవ్యవహారము తోఁచునుగాని యిది వాస్తవముకాదు. కానున్నను ఘటాకాశమను వ్యవహారముకలదు. ఇట్లే కార్యముగాని కూటస్థావగతియు, బుద్ధివృత్తికి విషయసంపర్కము కలుగఁగ నిత్యావగతి అతిస్ఫుటమగుటవలన ప్రత్యక్షప్రత్యయ జన్యమగునట్లు తోఁచునేకాని ఆకాశమువంటి అవగతి కూటస్థనిత్యము కాకపోదు.

ఇట్లే కూటస్థావగతిరూపాత్మ మాయోపాధివశముననే ప్రమాత, కర్త, ప్రమాణఫలము నని వాడఁబడినను నివి వాస్తవధర్మములుగావు. అవయవయుక్తములగు దేహాదివిషయములు జడములు, పరప్రకాశ్యములు, ప్రమాణసిద్ధములును గాని కూటస్థనిత్యనిర్వికారాత్మకీలక్షణము లెవ్వియు లేనందున నిట విరోధ మేమియు లేదు. ౧౦౮

అవ. ఇట్లు ఆత్మానాత్మతత్త్వమును బోధింపఁబడిన శిష్యుఁడు తనకుఁ దెలిసినదానిని గురువులతో మనవిసేయుచుఁ దాను ద్వైతరహితుఁడ నని తెలుపుటకై ద్వైతము మిథ్య యని నిరూపించుచున్నాఁడు.—

మూ. యద్యేవం భగవన్! కూటస్థనిత్యావగతిః ఆత్మజ్యోతిః స్వరూపైవ స్వయంసిద్ధా, ఆత్మని ప్రమాణనిరపేక్షత్వాత్, తతోఽన్యత్ అచేతనం సంహత్యకారిత్వాత్ పరార్థమ్, యేన చ సుఖదుఃఖమోహహేతు ప్రత్యయావగతిరూపేణ పారార్థ్యమ్, తేనైవ స్వరూపేణ అనాత్మనః అస్తిత్వం నాన్యేన రూపాంతరేణ, అతో నాస్తిత్వమేవ పరమార్థతః, యథాహి లోకే రజ్జుసర్పమరీచ్యుదకాదీనాం తదవగతివ్యతిరేకేణ అభావో దృష్టః, ఏవం జాగ్రత్స్వప్నద్వైతభావస్యాపి తదవగతివ్యతిరేకేణ అభావో యుక్తః, ఏవమేవ పరమార్థతః భగవన్, అవగతేః ఆత్మజ్యోతిషః నైరంతర్యభావాత్ కూటస్థనిత్యతా అద్వైతభావశ్చ, సర్వప్రత్యయభేదేషు అవ్యభిచారాత్, ప్రత్యయభేదాశ్చ అవగతిం వ్యభిచరంతి, యథా స్వప్నే నీలపీతాద్యాకారభేదరూపాః ప్రత్యయాః తదవగతిం

వ్యభిచరంతః పరమార్థతో న సంతీత్యుచ్యంతే, ఏవం జాగ్రత్యపి, నీలపీతాదిప్రత్యయభేదాః తామేవావగతిం వ్యభిచరంతః అసత్యరూపాః భవితుం అర్హాన్తి, తస్యాశ్చ అవగతే రన్యః అవగంతా నాస్తీతి న స్వేన స్వరూపేణ స్వయముపాదాతుం హాతుం వా శక్యతే, అన్యస్య చ అభావాత్. ౧౦౯

తా. ఇట్లు ప్రత్యగాత్మతత్త్వము కూటస్థావగతిస్వరూపమగుటచేత ప్రమాతృప్రమాణాదిధర్మరహితమును అన్యాపేక్షారహితము నగును.

ఆత్మేతరము అచేతనము సావయవము సుఖదుఃఖమోహస్వరూపము పరప్రకాశ్యమునగుటవలన ఆత్మసత్తవలననే లబ్ధసత్తాకమై స్వతస్సత్త లేకపోవుటచే స్వప్నపదార్థమువలె దృష్టనష్టమగుచు నసత్తేయగును. ఈపదార్థములను భాసింపఁజేయు చైతన్యమే సత్యము.

త్రాటిని పామనుకొని, సూర్యకిరణములను జలమనుకొని భ్రమసినపుడు ఆసర్పజలములు అసత్యములు. ఇట్లే భ్రాంతిదృష్టములగు పదార్థములు అసత్యములును అంతటను అనుగతమగు చైతన్యముమాత్రము సత్యము నగును.

ప్రజ్ఞానము, వృత్తిజ్ఞానము నని జ్ఞానము ద్వివిధము. పరబ్రహ్మమగు ప్రజ్ఞానము సకలపదార్థములను, సకలధీవృత్తులను, ధీవృత్త్యంతరాళములను ప్రకాశింపఁజేయుటచే సర్వాధారమగును. కూటస్థచైతన్యము నిరంతరము భాసించుచుండ దానిచే భాసింపఁబడు బుద్ధియు పలువిధముల మాఱుచుండును. వృత్తిజ్ఞానము పుట్టుకకలది కనుక నశించుచుండును. ఈ ధీవృత్తియందు ప్రతిఫలించిన చైతన్యమునకే జీవుఁ డని పేరు.

గగనాదిత్యునిచే భాసింపఁబడినగోడను దర్పణమందుఁ బ్రతిఫలించిన ఆదిత్యుఁడు ద్విగుణముగఁ బ్రకాశింపఁజేయునట్లు ప్రథమమున కూటస్థబ్రహ్మముచేఁ బ్రకాశింపఁజేయఁబడు దేహాదికము ధీవృత్తిప్రతిబింబితజీవునిచే

ద్విగుణముగఁ బ్రకాశింపఁజేయఁబడును. ఇత్యాదికము పంచదశీగ్రంథము నందు కూటస్థదీపమునందును, నాటకదీపమునందును శ్రీవిద్యారణ్యమునిచే వివరింపఁబడెను. గ్రంథవిస్తరభీతిచే నింతటితో విరమింపఁబడెను.

అద్వైతము ఎట్టులన:— ధీవృత్తులు రాకపోకలఁగలిగి మాఱుచున్నను వీనియందంతటను అనుగతమై వికారములేని కూటస్థచైతన్యము సత్యము స్వయంప్రకాశము అద్వితీయమునై యుండును. వికారవంతములగుచు పలు విధములగు దృశ్యములు స్వాప్నవస్తువులవలె మిథ్యయే యగును.

ఈ యవగతినిఁ దెలిసికొనెడి అవగంత మఱియొకఁడు లేడు. కావున ఆత్మ గ్రాహ్యముకాదు, త్యాజ్యమునుగాదు. మఱియు తర్కమందు వలె అవగతికిని అవగంతకును భేదములేదు. రెండును ఒకటియే యని మునుపే చెప్పఁబడెను. ౧౦౯

అవ. ఇట్లు శిష్యుఁడు చెప్పినదానిని గురువు సమ్మతించుచున్నాఁడు.—

మూ. తథైవేతి, ఏషా అవిద్యా యన్నిమిత్తః సంసారో జాగ్రత్స్వప్నలక్షణః, తస్యాః అవిద్యాయాః విద్యా నివర్తికా, ఇత్యేవం త్వం అభయం ప్రాప్తోఽసి, నాతః పరం జాగ్రత్స్వప్నదుఃఖమనుభవిష్యసి, సంసారదుఃఖాన్ముక్తోఽసీతి. ౧౧౦

తా. జాగ్రత్స్వప్నలక్షణమగు సంసారమునకుఁ గారణము అవిద్యయే. ఈ యవిద్య విద్యచే నివర్తింపఁబడును.

స్వతస్సిద్ధమగు ఆత్మప్రకాశము వేదాంతమహావాక్యజన్యప్రత్యయములచే అవిద్యను దొలఁగించి యభివ్యక్తమగును. దీనికే విద్య యని పేరు. ఇందుకు - 'అవిద్యయా కల్పితనామరూప వ్యపోహా ఏవ ప్రయతేత

విద్వాన్, న బ్రహ్మబోధే తదపోహమాత్రా ద్ధృష్ట్వావభాతి స్వయమేవ సాక్షాత్."-"శైవాలమాత్రాపనయే పిపాసోః కార్యః ప్రయత్నో న తు తోయసిద్ధ్యై, తస్మిన్నపేతే స్వయమేవ తోయం సిద్ధం ప్రసన్నం విషయత్వమేతి." అని శ్రీమహావాక్యదర్పణము ప్రమాణము.

శ్లోకతాత్పర్యము:—చుక్కనాచుతో నిండిన నూతిలోని నీటినిఁ గోరువాఁడు నాచును దొలఁగింపఁగనే సిద్ధమైన మంచినీరు కనుపించునట్లు బ్రహ్మాత్మైక్యము నపేక్షించువాఁడు అవిద్యాపరికల్పితనామరూపములను మిథ్యయని యుపేక్షింపఁగా స్వతస్సిద్ధబ్రహ్మము సాక్షాత్కారమగును, కాని సిద్ధమగు బ్రహ్మము ప్రయత్నసాధ్యము కాకపోవుటవలన బ్రహ్మప్రాప్తికై ప్రయత్నింప నవసరములేదు. అయినను ప్రతిబంధమును మాత్రమే నివర్తింపఁజేడి శాస్త్రగురువచనములును వ్యర్థములు కావు.

వత్సా! ఈ బ్రహ్మభావమువలన ధన్యుఁడవగు నీవు సంసారభయదుఃఖములనుండి నిర్ముక్తుఁడవైతివి. స్వాప్నికదుఃఖములవలె మాయికములగు జాగ్రదవస్థాకాలిక దుఃఖములును, బ్రహ్మజ్ఞుఁడవగు నిన్నుఁ జెందవు. "యస్య బ్రహ్మణి రమతే చిత్తం నందతి నందతి నందత్యేవ" యను ఆర్యవచన మిటఁ బ్రమాణము.

మూ. ఓ మితి. ౧౧౧

తా. గురుప్రోక్తమును శిష్యుఁడు శ్రద్ధాభక్తిపూర్వకముగ అంగీకరించుచున్నాఁడు. ౧౧౧

ఇది కూటస్థాద్వయాత్మబోధకమనెడి అవగతిప్రకరణము ద్వితీయము.

ఓం తత్సత్.

ఇది కూటస్థాద్వయాత్మబోధప్రకరణము.

శ్రీః

# ఉపదేశసాహస్రి

## గద్యప్రబంధము—తృతీయప్రకరణము

(శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యప్రణీతము.)



### 3. పరిసంఖ్యానప్రకరణము.

అవ. యథోక్తవిద్యావిర్భావమువలన నితనికిఁ గర్తవ్య మేమియును లేదని నిరూపింపఁబడెను.—

ఇట్టి విజ్ఞానము కలిగినను వాసనావశమున భేదదృష్టిని విడువనివానికి జ్ఞానదార్ఢ్యమునకై యీ పరిసంఖ్యానమును ఉపదేశించుచున్నారు:—

మూ. ముముక్షూణాం ఉపాత్తపుణ్యాపుణ్యక్షపణపరాణా మపూర్వానుపచయార్థినాం పరిసంఖ్యాన మిద ముచ్యతే—అవిద్యాహేతవో దోషాః వాఙ్మనఃకాయప్రవృత్తిహేతవః, ప్రవృత్తేశ్చ ఇష్టానిష్టమిశ్రఫలాని కర్మాణి ఉపచీయన్తే ఇతి తన్మోక్షార్థమ్. ౧౧౨

తా. అవిద్యాకృతములగు పుణ్యాపాపకర్మములు బంధహేతువులని యెంచి కార్యసహితమగు అవిద్యను నిరసించుటచేత నిష్కాములయి సిద్ధబ్రహ్మనిరతులగునట్టి ముముక్షువులకు ఉపకరించెడి పరిసంఖ్యానము నిరూపింపఁబడుచున్నది. (పరిసంఖ్యానమనఁగా విమర్శనము).

సంచితకర్మక్షయము, ఆగామికర్మానుత్పత్తియును అవిద్యానివృత్తికి ఫలములు. ప్రారబ్ధకర్మము భోగమువలననే నశించును. కర్మకారణములగు రాగద్వేషములకు అవిద్యయే మూలకారణము. అవిద్య, అస్మిత, రాగ, ద్వేష, భయములు పంచక్లేశములు. ఈ కర్మములనుండి ఉత్తమమధ్యమాధమములగు దేవమనుష్యపశుపక్ష్యాదిదేహములు గలుగును. దుఃఖబహుళమగు సంసారముయొక్క నివృత్తికై పరిసంఖ్యానము చెప్పఁబడుచున్నది.

శబ్దస్పర్శాదులు విషయములును నశ్వరములు. విషయి(దీనికిసాక్షి) యగు ఆత్మమాత్రము నిత్యము. "పరాంచిఖాని వ్యతృణత్ స్వయంభూః తస్మాత్పరాఙ్ పశ్యతి నాంతరాత్మన్." అను శ్రుతినిఁబట్టి సకలేంద్రియములును బాహ్యవిషయములనే యాసించునుగాని ఆత్మారామములయి సుఖించి యుండవు.

ఇందులో విషయప్రవృత్తి సంసారహేతువగుచు ధర్మార్థకామరూప త్రివర్గఫలమునే యిచ్చును. ఆత్మారామత ముక్తికారణమగుచు పరమానందము నిచ్చును.

ఇట్లు జనసామాన్యమునకు రెండును ప్రాప్తించుచుండఁగ నిఖిలదుఃఖనివృత్తిపూర్వకపరమానంద ప్రాప్తిరూపమోక్షము చతుర్విధపురుషార్థములలో నత్యుత్తమమని పరిసంఖ్యానము చెప్పఁబడుచున్నది.

పరిసంఖ్యానమనఁగా:—దేనిచేతనుం దెలియనిదానినిం జెప్పుట:—
1. అపూర్వవిధియనియు (మఱియొకప్రకారముగను కార్యము సిద్ధించునపుడు ఈ ప్రకారముగనే చేయవలయునని చెప్పుట); 2. నియమవిధి

యనియు (రెండును నొకసారి ప్రాప్తించునపుడు రెండవదానిని నిరసించుచు దీనినే చేయుమనుట); 3. పరిసంఖ్యానవిధి యని యిట్లు కర్మవిధి త్రివిధ ముగఁ బూర్వమీమాంసాశాస్త్రమందుఁ జెప్పఁబడెను.

ఈ పరిసంఖ్యానవిధి కుదాహరణము ఆశాస్త్రముననే యిట్లు:— "పంచపంచనఖా భక్ష్యా బ్రహ్మక్షత్రేణ రాఘవ, శశకః శల్లకీ గోధా ఖడ్గీ కూర్మోఽథ పంచమః." ఇతి. అయిదుగోళ్లుగల జంతువులు బ్రాహ్మణక్షత్రియు లకు భక్షణార్హములని బోధించెడి వాక్యములో శశము, శల్లకి (ఏదుపంది), ఉడుము, ఖడ్గమృగము, తాబేలు ననెడి యీయైదుమృగములే భక్ష్యములు గాని పంచనఖములుగలవియైనను పేయైదింటికంటె నితరమృగములు భక్ష ణీయములు కావని చెప్పఁబడిన విధికి పరిసంఖ్యానవిధి యని పేరు.

ఇట్లు ప్రకృతమున ధర్మార్థకామఫలసాధనమగు విషయసుఖమును మోక్షసాధనమగు విషయనివృత్తియు నను రెండును నొకసారి ప్రాప్తించు చుండఁగా వివేకి దుఃఖసంసృష్టమగు విషయసుఖమును నిరసింపవలయు ననియు, నిత్యానందస్వరూపమగు మోక్షము నపేక్షింపవలయు ననియు బోధించుటచే దీనికి పరిసంఖ్యానప్రకరణమని పేరుగలిగెను. కర్మలు సుఖ దుఃఖకారణములు, కర్తృత్వసాపేక్షములును గనుక నిట్టి బహుళదుఃఖ సం సారనివృత్తికై యీ పరిసంఖ్యానము చెప్పఁబడెను. ౧౧౨

అవ. పరిసంఖ్యానప్రకారమును వివరింపుచున్నాఁడు:—

మూ. తత్ర శబ్దస్పర్శరూపరసగంధానాం విషయాణాం శ్రోత్రాదిగ్రాహ్యత్వాత్ స్వాత్మని పరేషు వా విజ్ఞానా భావః, తేషామేవ పరిణతానాం యథా లోష్టాదీనామ్, శ్రోత్రాదిద్వారైశ్చ జ్ఞాయంతే, యేన చ జ్ఞాయంతే సః జ్ఞాతృత్వాత్ అతజ్జాతీయః, తే హి శబ్దాదయః అన్యో

న్యసంసర్గిత్వాత్ జన్మవృద్ధివిపరిణామాపక్షయనాశసం
యోగవియోగావిర్భావతిరోభావవికారవికారి క్షేత్ర
బీజాద్యనేకధర్మాణః, సామాన్యేన చ సుఖదుఃఖాద్యనేక
కర్మాణః తద్విజ్ఞాతృత్వాదేవ తద్విజ్ఞాతా సర్వశబ్దాది
ధర్మవిలక్షణః. ౧౧౩

తా. అద్వయాత్మానుసంధానమునకై బహువిధములగు అనాత్మలనుండి వివేచనప్రకారమును మొదట నుపదేశించుచున్నాఁడు:—

శ్రోత్రాదీంద్రియగ్రాహ్యములగుటచే శబ్దాదివిషయములును లోష్ట కాష్ఠాదికములవలె జడములై తమ్ముఁగాని ఘటపటాదిబాహ్యవస్తువులనుగాని యెఱుంగలేవు. దేహాద్యాకారముగఁ బరిణమించిన శబ్దాదులు శ్రోత్రాదీంద్రియములచే గ్రహింపఁబడునవేకాని యివి యితరముల గ్రహింపనేరవు. ఈ భూతములును భూతకార్యములును జడములగుటచేత అనాత్మలేకాని ఆత్మ కానేరవు.

## ఆత్మలక్షణము

ఈ యనాత్మలను దెలియుచుఁ బ్రకాశింపఁజేయుచు నీభూతభౌతికములకు సాక్షి (వీని రాకపోకలంగాంచునది) యగునది ఆత్మ. ఎట్లన; పంచభూతకార్యములగు దేహాదులు, జన్మము పుట్టియుండుట (శరీరధారణము), వృద్ధి, పరిణామము (మార్పు), తఱుఁగుట (చిక్కుట), నాశమునను షడ్భావవికారములు గలయవి. ఆవిర్భావతిరోభావములు, పుత్రకళత్రాదిసంయోగములుం గలయవి. మఱియు జడములు, పరప్రకాశ్యములు, దృష్టనష్టములు నగు నివి స్త్రీపురుషాద్యాకారభేదములు వ్రణజ్వరాదిరోగ వికారములుం గల యవి.

## ఆత్మ సర్వవికారరహితుఁడు.

మఱియు నీదేహాదులు సామాన్యముగ శబ్దస్పర్శాద్యనుభవము గలిగి నపుడు వాని ప్రియాప్రియసంబంధమువల్ల సుఖదుఃఖమోహరాగాదుల ననుభవించును. ఆత్మ యీసకలధర్మములకును సాక్షియై తద్ధర్మములనంటక కేవలానందరూపుఁడగును.

## దేహాభిమానము దుఃఖకారణము, ఆత్మకు దుఃఖము లేదు.

జడమగుదేహము సుఖదుఃఖముల నెఱుఁగదని శ్రీరామచంద్రుఁడు తారకు బోధించెను.

అవ. వేదాంతశాస్త్రమున అన్వయమనఁగా అనువృత్తి (కలిసియుండుట), వ్యతిరేకమనఁగా వ్యావృత్తి (విడిపోవుట) యని యర్థములుగాని తార్కికసమయసిద్ధములు కావు. 'సాక్షీ' = సాక్షాత్ ద్రష్టా (స్వయముగఁ జూచువాఁడు—ఆత్మ), సాక్ష్యం = సాక్షాత్ దృశ్యం (చూడఁబడు విషయములు). సకలదృశ్యములందును ఆత్మ హారములోని పూసలయందు దారమువలె ననుసరించియుండును. విషయములు హారమునందలి పూసలవలె నొకదానినొకటి అంటక విడిచియుండును.

ఇట్లు దృశ్యములు అవస్థలు పరస్పరభిన్నములై మాఱుచున్నను, ఆత్మ వానిం బ్రకాశింపఁజేయుచు వాని కాధారమై యుండునని విమర్శించి మాయాతత్కార్యరహితమగు కేవలాత్మ తనసుగా భావించెడి యోగికి ఆత్మేతరశబ్దాద్యనుభవమూలకమగు విక్షేపము గలుగుచున్నను నిర్దయత్వనైష్ఠు

ర్యాదిరూపవికారములు ఉదయింపకుండుటకై చింతింపవలసిన యంశమును ఉపదేశించుచున్నారు:—

మూ. తత్ర శబ్దాదిభిః ఉపలభ్యమానైః పీడ్యమానో విద్వాన్ ఏవం పరిసంచక్షీత. ౧౧౪

తా. సంసారమందు అనుకూలప్రతికూలశబ్దాదులు ప్రాప్తించినప్పుడు మోదఖేదములను జెందక ఆత్మారాముఁడు కావలయును. (మూలముయొక్క తాత్పర్యము అవతారికయందు స్పష్టము.)

మూ. శబ్దస్తు ధ్వనిసామాన్యమాత్రేణ వా విశేషధర్మైర్వా షడ్జాదిభిః ప్రియైః స్తుత్యాదిభిః ఇష్టైః అనిష్టైశ్చ అసత్య బీభత్సపరిభవాక్రోశాదిభిః వచనైర్వా మాం దృక్స్వభావమసంసర్గిణమ విక్రియమచలమనిధనమభయమత్యంతసూక్ష్మమవిషయం గోచరీకృత్య స్ప్రష్టుం నైవార్హతి, అసంసర్గిత్వాదేవమామ్, అత ఏవ న శబ్దనిమిత్తా హానిః వృద్ధిశ్చ, అతో మాం కిం కరిష్యతి స్తుతినిందాదిప్రియాప్రియత్వాదిలక్షణః శబ్దః, అవివేకినం హి శబ్దమాత్మత్వేన గతం ప్రియః శబ్దో వర్ధయేత్ అప్రియశ్చ క్షపయేత్, అవివేకిత్వాత్, న తు మమ వివేకినో వాలాగ్రమాత్రమపి కర్తుముత్సహతే ఇతి, ఏవమేవ స్పర్శసామాన్యేన తద్విశేషైశ్చ శీతోష్ణమృదుకర్కశాది జ్వరోదరశూలాదిలక్షణైశ్చ అప్రియైః ప్రియైశ్చ కైశ్చిత్ శరీరసమవాయిభిః బాహ్యాగంతుకనిమిత్తైశ్చ న మమ కాచిత్ విక్రియా వృద్ధిహానిలక్షణా అస్పర్శ

త్వాత్ క్రియతేఽన్యోన్య ఇవ ముష్టిఘాతాదిభిః,తథా రూపసామాన్యేన తద్విశేషైశ్చ ప్రియాప్రియైః స్త్రీవ్యంజనాదిలక్షణైః అరూపత్వాత్ న మమ కాచిత్ హానిః వృద్ధిర్వా క్రియతే, తథా రససామాన్యేన తద్విశేషైశ్చ ప్రియాప్రియైః మధురామ్లలవణకటుతిక్తకషాయైః మూఢబుద్ధిభిః పరిగృహీతైః అరసాత్మకస్య మమ న కాచిత్ హానిః వృద్ధిర్వా క్రియతే, తథా గంధసామాన్యేన తద్విశేషైః ప్రియాప్రియైః పుష్పాద్యనులేపనాదిలక్షణైః అగంధాత్మకస్య న మమ కాచిత్ హానిః వృద్ధిర్వా క్రియతే, 'అశబ్దమస్పర్శమరూపమవ్యయం తథాఽరసం నిత్యమగంధవచ్చ యత్' ఇతి శ్రుతేః. ౧౧౫

తా. ఆత్మ శబ్దస్పర్శరూపరసగంధరహితుఁడనియు, నాశరహితుఁడనియు వేదము చెప్పుచుండుటచేత అసంగచిద్రూపుఁడనగు నాకు శబ్దస్పర్శాదులచే హానివృద్ధులు కలుగవని భావింపవలయునని చెప్పి యిపుడు శబ్దాద్యనుభవమును చింతింపవలయునని చూపుచున్నాఁడు.

మూ. కించ-యే ఏవ బాహ్యాః శబ్దాదయః తే శరీరాకారేణ సంస్థితాః, తత్పరిమాణరూపైస్తద్గ్రాహకైశ్చ శ్రోత్రాద్యాకారైః, అంతఃకరణద్వయతద్విషయాకారేణ చ, తేషామన్యోన్యసంసర్గిత్వాత్ సంహతత్వాచ్చ సర్వక్రియాసు, తత్రైవం సతి విదుషో న మమ కశ్చిత్ శత్రుః మిత్రం ఉదాసీనో వా అస్తి, తత్ర యది కశ్చిత్ మిథ్యాజ్ఞానాభిమానేన ప్రియమప్రియం వా

ప్రయుయుక్షేత క్రియాఫలలక్షణం తన్మయ్యేవ ప్రయుయుక్షతే సః, తస్యావిషయత్వాన్మమ, 'అవ్యక్తోఽయమచిన్త్యోఽయమ్' ఇతి స్మృతేః, తథా సర్వేషాం పంచానామపి భూతానామవికార్యః, అవిషయత్వాత్, 'అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమ్' ఇతి స్మృతేః, యాఽపి శరీరేంద్రియసంస్థానమాత్రముపలక్ష్య మద్భక్తానాం విపరీతానాం చ ప్రియాప్రియాది ప్రయుయుక్షా, తజ్జా చ ధర్మాధర్మాదిప్రాప్తిః, సా తేషామేవ, న తు మయి అజరే అమృతే అభయే, 'నైనం కృతాకృతే తపతః' 'న వర్ధతే కర్మణా నో కనీయాన్' 'సబాహ్యాభ్యంతరో హ్యజః' 'న లిప్యతే లోకదుఃఖేన బాహ్యః' ఇత్యాది శ్రుతిభ్యః, అనాత్మవస్తునశ్చ అసత్త్వం పరమో హేతుః, ఆత్మనశ్చ అద్వయత్వే, ద్వయస్య అసత్త్వాత్, యాని సర్వాణి ఉపనిషద్వాక్యాని విస్తరశః సమీక్షితవ్యాని సమీక్షితవ్యాని. ౧౧౬

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యస్య శ్రీగోవింద భగవత్పూజ్యపాదశిష్యస్య శ్రీమచ్ఛంకరభగవతః కృతౌ ఉపదేశసాహస్ర్యాం గద్యప్రబంధః

సమాప్తః.

తా. ఏ బాహ్యశబ్దాదులే శరీరేంద్రియములుగ పరిణమించినవో యవియే అంతఃకరణముగను, సుఖదుఃఖరూపముగను పరిణమించినవి. ఎట్లనగా; నీ పంచభూతములు పరస్పరసహాయము లేకుండ నెంతమాత్రపు పనిచిం

జేయఁజాలవు. సకలవ్యాపారములును భూతభౌతికకార్యములగుటచేత సర్వవికారసంఘాతసాక్షియు, నిర్వికారుఁడు నగు నాకు భౌతికవికారములు ఉండవని భావింపవలయును.

అట్టి భూతభౌతికవికారములతో ఆత్మయగు తనకు సంబంధము లేదనియెంచి శత్రుమిత్రభావములులేక, ప్రియాప్రియములకు మోదఖేదములను జెందక, శరీరసంబంధ సర్వక్రియలయందు ఫలాపేక్షలేనివాఁడై "అవ్యక్తోఽయమచింత్యోఽయమ్" ఇత్యాది స్మృతులయొక్కయు, "నకర్మణావర్ధతేనోకనీయాన్" ఇత్యాదిశ్రుతులయొక్కయు భావమును గ్రహించినవాఁడై, ఉపనిషద్వాక్యములను జ్ఞప్తియందుంచుకొని సర్వదా ఆత్మారాముఁడై యుండువాఁడే జ్ఞానియు మోక్షార్హుఁడు నగును. ౧౧౬

ఇది పేరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే ఆంధ్రతాత్పర్యసహితముగ రచింపఁబడిన
ఉపదేశసాహస్రి గద్యప్రబంధము
ప్రథమభాగము సమాప్తము.

ఓం తత్ సత్.



శ్రీః

# ఉపదేశసాహస్రి

(శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యప్రణీతము.)

## శ్లోకప్రబంధము - ప్రథమప్రకరణము.

---

### ౧. ఉపోద్ఘాతప్రకరణము

మూ. చైతన్యం సర్వగం సర్వం సర్వభూతగుహాశయమ్,
యత్సర్వవిషయాతీతం తస్మై సర్వవిదే నమః. ౧

తా. కాలత్రయకార్యముల నెఱుఁగుచు, సర్వావస్థలను స్వసాన్నిధ్య మాత్రమున సూర్యునివలె భాసింపఁజేయుచు, సర్వమును వ్యాపించి, వాని కంటె వేఱై యంతట తానైయుండి సకలబుద్ధివృత్తులందును నే నని స్ఫురించు పరమాత్మచైతన్యమున కైక్యరూపమగు నమస్కారము.

1 ప్ర. అందఱి బుద్ధివృత్తులందు నేను, నే నని స్ఫురించుచు ననేకు లగు జీవులకు పరమాత్మతో నైక్య మెట్లుకలుగును?

ఉ. "విజ్ఞాన మానందం బ్రహ్మ,సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" యున్నగు శ్రుతులు విజ్ఞానస్వరూపు లగుజీవులకు పరమాత్మతో నైక్యమును బోధించు

చున్నవి. మఱియు, ఉష్ణముకాని జలమునకు ఉష్ణధర్మము పొసఁగనివిధమున చిత్స్వభావములేని చిత్తాదుల కైక్యము కలుగకున్నను చిత్స్వభావులయి ప్రతిబింబములగు జీవులకు బింబభూత పరమాత్మతో నైక్యము కలుగక పోదు.

2 ప్ర. సూర్యాదితేజస్సు తన యెదుటనున్నదానినే ప్రకాశింపఁజేయునట్లు ఈచైతన్యము తన యెదుటనున్నదానినే ప్రకాశింపఁజేయును గదా! సర్వావస్థల నెట్లు ప్రకాశింపఁజేయఁదగును?

ఉ. ఆత్మచైతన్యమంతటను నిండియుండుటచేత సర్వావస్థలను ప్రకాశింపఁజేయు నీచైతన్యము లోపల, వెలుపల నిండియున్నదని "సర్వగం" అను విశేషణము బోధించుచున్నది. ఇచట "నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం" మున్నగు శ్రుతులు ప్రమాణము.

3 ప్ర. సర్వమును వ్యాపించినదని చెప్పుటచేత రెండువస్తువులు స్ఫురించుచుండఁగా నద్వైత మెట్లుసిద్ధించును?

ఉ. సకల చరాచరప్రపంచమునకు నుపాదానమగుటవలన ఘటశరావాదికమంతయు మృణ్మాత్రమగునట్లు సకలము చైతన్యమాత్రమేయని బోధించుటకై "సర్వం" అను విశేషణము. ఇచట "సర్వం ఖల్విదం బ్రహ్మ" ఈ మొదలగు శ్రుతులు ప్రమాణము.

4 ప్ర. ఆత్మ సంసారికాదు. జీవుఁడు సంసారి. ఇట్లు విరుద్ధధర్మములు గలవారి కైక్యము ఎట్లు సంభవించును? విరుద్ధధర్మములుంగల మంచునకు, వహ్నికిని ఐక్య మెన్నఁడైనను గలుగదుగదా!

ఉ. "సర్వభూతగుహాశయం" అను విశేషణము, ఆత్మ సకలభూతముల బుద్ధియం దొకటియై యున్నదని బోధించుచున్నది. కావున ఉపాధులకు భేదమున్నను వానియందలి యాత్మకు భేదములేదు.

5 ప్ర. బుద్ధిని గుహాయనఁదగునా?

ఉ. ఈ బుద్ధియందు జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయములు గూఢముగ నున్నందున నిది గుహ యనఁబడును. ఇచట "యో వేద నిహితం గుహాయాం" మున్నగు శ్రుతులు ప్రమాణము. "అయమాత్మాబ్రహ్మ" మున్నగు శ్రుతులును జీవేశ్వరుల నైక్యమునే బోధించుచున్నవి.

6 ప్ర. అట్లేని సంసారిత్వము, అసంసారిత్వము ననెడి విరుద్ధధర్మముల కేమిగతి?

ఉ. ఈధర్మవిరోధము ఉపాధివలనఁ గలిగినదికాని స్వరూపమునకు ధర్మవిరోధము లేదు. దీనిచే జీవుఁడు బ్రహ్మముయొక్క యంశమా? వికారమా? స్వతంత్రుఁడా? యని వాదించు వాదుల మతములు నిరాకరింపఁబడెను.

7 ప్ర. సర్వభూతగుహాశయమగుటచే బ్రహ్మము మనస్సుచేఁ దెలియఁబడునా?

8 ప్ర. సర్వాత్మకమగుటచే ప్రపంచరూప మగునా?

7—8 ఉ. అవిద్యను తత్కార్యములను మీఱిన సాక్షియైనదని "సర్వవిషయాతీతం" అను విశేషణము బోధించుచున్నది. సకలప్రపంచము పరమేశ్వరాధిష్ఠిత మాయావివర్తమనియు, అనిర్వచనీయము. అనఁగా ఉన్నదనికాని, లేనిదనికాని చెప్పనలవికాని మాయ బ్రహ్మముకంటె నన్యమగు పరమార్థవస్తువు కాదనియు భావము. ఇచట "మాయాం తు ప్రకృతింవిద్యాన్మాయినం తు మహేశ్వరం" మున్నగు శ్రుతులు ప్రమాణము. కావున సర్వాంతఃకరణవృత్తికి సాక్షియగు బ్రహ్మము మనసుచేఁ దెలియఁబడదు. ఎట్లనఁగా; భ్రాంతిదృష్టమగు ఎండమావులనీటిచే భూమి తడియనిచందమున

మిథ్యయగు మనసుచే బ్రహ్మము తెలియఁబడదు. జడమగుకట్టె వహ్నిని ప్రకాశింపఁజేయలేని చందమున జడమగు మనస్సు చిత్స్వరూపమగు బ్రహ్మమును ప్రకాశింపఁజేయనేరదు. ఇచట "నేహనానాస్తికించన, యతోవాచో నివర్తంతే అప్రాప్యమనసాసహ" ఈమొదలగు శ్రుతులు ప్రమాణములు. వివర్తమగుటచే నాబ్రహ్మము ప్రపంచరూపమును గాదు.

9 ప్ర. ఐక్య మెవరెవరికి ? అదెట్లు ?

ఉ. జీవేశ్వరులకు ఐక్యము. "చైతన్యం, సర్వగం, సర్వం" అను విశేషణములు జీవేశ్వరుల కిరువురకు నైక్యమును బోధించుచున్నవి. "సర్వభూతగుహాశయం" అను విశేషణము బుద్ధ్యాదికి సాక్షియగు త్వం పదార్థమును బోధించుచున్నది. "సర్వవిత్" అను విశేషణము తత్పదవాచ్యబ్రహ్మమును జెప్పుచున్నది. విరుద్ధధర్మములు ఉపాధివలన ప్రాప్తములని మునుపే చెప్పఁబడెను. "సర్వవిషయాతీతం" అను విశేషణము తత్పదలక్ష్యమును బోధించుచున్నది. ఇట్లు త్వంపదమునకు తత్పదమునకును వాచ్యార్థములగు జీవేశ్వరులకు సంసారిత్వ కించిజ్జ్ఞత్వా సంసారిత్వ సర్వజ్ఞత్వాది ధర్మసంబంధమువలన నైక్యము లేకున్నను జహదజహల్లక్షణచేత ఉపాధికృతధర్మములను పరిహరించిన చైతన్యమాత్రమున నైక్యము సంభవింపకపోదు.

10 ప్ర. జహదజహల్లక్షణ యెట్టిది ?

ఉ. విరుద్ధాంశములను వదలి యంశినిమాత్రము గ్రహించుట.

ఉదాహరణము:—"ఆదేవదత్తుఁ డితఁడే" యనుచోట ఆదేశము, ఆకాలము; ఈదేశము, ఈకాలము అనునవి (ఐక్యమునకు) పరస్పరవిరుద్ధములు గనుక ఆయంశములను వదలి అంశియైన దేవదత్తునిమాత్రమే గ్రహించుట జహదజహల్లక్షణ. దీనిని భాగలక్షణ యనియుఁ జెప్పెదరు.

11 ప్ర. ఈ మంగళశ్లోకమువలనఁ దెలియఁదగినదేది ?

ఉ. వేదాంతశాస్త్రీయమగు అనుబంధచతుష్టయము. అది యెద్దియనఁ? 1 వేదాంతవాక్యము విషయము. 2 "సర్వవిషయాతీతం" అను విశేషణ బోధితమగు అనర్థనివృత్తిపూర్వక నిరతిశయానందావిర్భావాత్మకబ్రహ్మమే ప్రయోజనము. 3 నిరతిశయానందకాముముగలవాఁ డధికారి. 4 ఈవిశేషణములు వేదాంతములందే చెప్పఁబడుటచే శాస్త్రమునకును బ్రహ్మమునకును ప్రతిపాద్య ప్రతిపాదకభావము సంబంధము. ఈనాలుగును అనుబంధచతుష్టయ మనఁబడును. ౧

అవతారిక:— మంగళశ్లోకరూపముగ ప్రతిపాద్య దేవతాతత్త్వమును వర్ణించి వేదాంతములన్నియు బ్రహ్మ బోధకములని బోధించుటకై కర్మకాండప్రసిద్ధ మగునర్థము ననువదించి దానితో జ్ఞానకాండమనియెడి వేదాంతములకుఁ గల సందర్భమును జెప్పుచు పూర్వమందుఁ జెప్పఁబడని యీ వేదాంతములు స్వతంత్రములే కాని మఱియొకదానికి అంగములు కావని నిరూపించుచున్నారు:—

మూ. సమాప్య క్రియాః సర్వా దారాగ్న్యాధానపూర్వికాః, బ్రహ్మవిద్యామథేదానీం వక్తుం వేదః ప్రచక్రమే.

తా. వేదము గృహస్థునకు అగ్న్యుపాసనాది విహితకర్మములను సంపూర్ణముగ బోధించి సాధనచతుష్టయసంపన్నుఁడగు నధికారికి బ్రహ్మవిద్య నిపుడు బోధించుచున్నది.

1 ప్ర. సాధనసంపత్తియేది? దీనికిఁ గారణమేది?

ఉ. 1. నిత్యానిత్యవస్తువివేకము, 2. ఇహాముత్రఫలభోగవిరాగము, 3. శమాదిషట్కసంపత్తి, 4. ముముక్షుత్వము. వీని వివరణము వివేకచూడా

మణియందుఁ జూడవలెను. కర్మకాండోక్తములగు కర్మల ననుష్ఠించుటచేఁ గలిగిన శుద్ధబుద్ధియే సాధనసంపత్తికిఁ గారణము.

2 ప్ర. వేదములు కర్మకాండమును బోధించునా? జ్ఞానకాండమును బోధించునా? రెండింటిని సమముగ బోధించునా?

ఉ. నిత్యనిరతిశయపురుషార్థమగు మోక్షమునుగోరి తదుపాయమును వెదకుచు సర్వోత్సాహమునఁ బ్రయత్నించుచున్నను, ఆయుపాయమును పొందలేనివానికి ప్రత్యక్షాదిప్రమాణములచే దుర్లభమగు సాధనము నుపదేశించుటకై వేదములు ప్రవర్తించినందున అవి జ్ఞానకాండమునే బోధించును. మొదటచెప్పఁబడిన కర్మకాండముకూడ చిత్తశుద్ధి సంపాదనద్వారముగ జ్ఞానకాండోపయోగియగుటచే దీనికి విరోధము కాదు. "సర్వే వేదా యత్పదమామనంతి" "సర్వే వేదా యత్రైకీభవంతి" అను శ్రుతులును, "వేదైశ్చ సర్వైరహమేవవేద్యః" అను స్మృతియు, పైయర్థమునే బోధించుచున్నవి. "తమేవ విదిత్వాఽతిమృత్యుమేతి నాన్యః పంథావిద్యతేఽయనాయ" అను శ్రుతి ఆత్మతత్త్వజ్ఞానమే సాక్షాన్మోక్షసాధనమని చెప్పుచున్నది. వేదాంతవాక్య తాత్పర్యగ్రహణమందు సామర్థ్యము లేకపోవుటచే రాగద్వేషదూషితాంతఃకరణము గలవాఁడు ఉపదేశానర్హుఁ డనియు శ్రుతి ఘోషించుచున్నది. శ్రు. "నావిరతో దుశ్చరితా న్నాశాంతో నాసమాహితః, నాశాంతమానసో వాఽపి ప్రజ్ఞానేనైనమాప్నుయాత్" కావున, జ్ఞానోత్పత్తికి ప్రతిబంధకములగు దురితములను బోఁగొట్టుటకై నిత్యకర్మముల ననుష్ఠించుట యావశ్యకము. "అవిద్యయా మృత్యుంతీర్త్వా విద్యయాఽమృతమశ్నుతే" "ధర్మేణ పాపమపనుదతి" అను శ్రుతులచేతను చిత్తశుద్ధినిఁగలిగించి మోక్షసాధనమగుటచేత ధర్మకర్మానుష్ఠానమునకు దురితక్షయమే ముఖ్యప్రయోజనము. కాని "క్షీణేపుణ్యే మర్త్యలోకం విశంతి"

అను శ్రుతివలన క్షయాదిదోషయుక్తమగుటచే, "కర్మణాపితృలోకః" అని చెప్పిన శ్రుతికి పితృలోకప్రాప్తియే ప్రధానము కాదు. ఆనుషంగికముగ పితృలోకము లభించినను అది చిత్తశుద్ధికి ప్రతిబంధకముకాదు. "నిత్యేషు శుద్ధిప్రాధాన్యాద్భోగోఽప్యప్రతిబంధకః" అని సురేశ్వరాచార్యులు వచించిరి. కావున కర్మజ్ఞానకాండములు కారణము, కార్యమునగుటచే పర్యాయముగ, అనఁగా నొకటితర్వాత నొకటి వేదమందుఁ జెప్పఁబడెను. సాక్షాత్ఫలదాయకమగు జ్ఞానకాండము కర్మాపేక్షలేనిదగుటచే గతార్థమును గాదు. అనాంగమును గాదని భావము. ౨

అవ. "కర్మములే ఫలము నవశ్య మిచ్చును. విహిత కర్మములకు ఇష్టఫలమును, నిషిద్ధకర్మములకు అనిష్టఫలమును, మిశ్రకర్మములకు ఇష్టానిష్టఫలములును గలుగును. ఇందుకు 'అనిష్ట మిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణఃఫలమ్' అను స్మృతి ప్రమాణము. కనుక మహాఫలమగు మోక్షము కర్మవిశేషముచే సాధ్యమగుచుండఁగా ముముక్షువు జ్ఞానకాండమునకై ప్రయత్నింపనవసరము లేదు. అక్షయ్యఫలప్రదములగు చాతుర్మాస్యాదికర్మములనే యాచరింపవలయు"నని అభినివేశము గల కర్మజడులు చేయు నీక్రింది ఆక్షేపణములకు రెండుశ్లోకములచే నుత్తరము:—

మూ. కర్మాణి దేహయోగార్థం దేహయోగే ప్రియాప్రియే,
ధ్రువే స్యాతాం తతో రాగో ద్వేషశ్చైవ తతః క్రియాః. 3

తా. జాత్యాయుర్భోగరూపమగు కర్మఫలము దేహసంబంధములేక కలుగనందున కర్మములు దేహప్రాప్తికే యని చెప్పనగును. దేహసంబంధము

వలన సుఖదుఃఖములును, వానివలన రాగద్వేషములు, వానివలన తిరిగి కర్మములును గలుగుచుండును.

1 ప్ర. దేహము భోగసాధనముగద. దీనివలనఁ గలిగెడి హానియెద్ది?

ఉ. దుఃఖభూయిష్ఠమగు జననమరణాదిసంసారము దేహమువలన నివర్తింపదు. ఇందుకు "న వై సశరీరస్య సతః ప్రియాప్రియయో రపహతిరస్తి" అను శ్రుతియు "పునరపిజననం పునరపిమరణం పునరపిజననీ జఠరేశయనం" ఈ మొదలగు స్మృతులును ప్రమాణములు. మఱియు సుఖదుఃఖములందును, సుఖదుఃఖసాధనములందును, బూర్వవాసనారూపములగు రాగద్వేషములును, వీనివలన మనోవాక్కాయకర్మములును, వీనివలన జననమరణ దుఃఖపరంపరయు దేహసంబంధమువలననే కలుగుచుండును. 3

మూ. ధర్మాధర్మౌ తతో ఽజ్ఞస్య దేహయోగ స్తథా పునః,
ఏవం నిత్యప్రవృత్తో ఽయం సంసార శ్చక్రవ ద్భృశమ్.

తా. తత్త్వజ్ఞానము లేనివానికి విహితకర్మముల నాచరించుటవలన ధర్మమును, నిషిద్ధకర్మముల నాచరించుటవలన నధర్మమును, వీనివలన నుత్తమమధ్యమాధమభావముచే బహువిధదేహప్రాప్తియుఁగలిగి కులాలచక్రమువలె జననమరణరూపసంసారము ఎడతెగకతిరుగుచుండును. ఇది సకలజనవిదితము. ఐహికకర్మములఫలము నిత్యము కాని తెఱఁగున కర్మములే యగుటచేత, ఆముష్మికకర్మఫలమును అనిత్యమేయని భావము. ఇందుకు "తద్యథేహ కర్మచితో లోకః క్షీయత ఏవమేవాముత్ర పుణ్యచితో లోకః క్షీయతే" అను శ్రుతిప్రమాణము.

1. ప్ర. చాతుర్మాస్యయాజికి అక్షయ్యసుకృతము గలదనిచెప్పెడి శ్రుతి నమ్మఁదగినది కాదా?

ఉ. అర్థవాదమగునాశ్రుతి యాపుణ్యము చిరకాలముండునని చెప్పె నేకాని మోక్షమువలె నిత్యమని చెప్పలేదు. కావున, కర్మఫలము లన్నియు నశ్వరములే యగును.

౪

అవ. ఓయిమందుఁడా! నీవు సంసారనిమిత్తములగు కర్మములు ఫలభోగానంతరమున నశింపఁగా "నిమిత్తాభావా న్నైమిత్తికాభావ" అను న్యాయమున నిమిత్తములగు కర్మములు నశించుటవలన కార్యమగుసంసారము లేకపోఁగా ముక్తి సులభమగునందువేని అజ్ఞానజన్యమగు కర్మము తనకుఁ గారణమగు ఆయజ్ఞానము నశింపక నశింపదని చెప్పుచున్నారు:-

మూ. అజ్ఞానం తస్య మూలం స్యాదితి తద్ధాన మిష్యతే,
బ్రహ్మవిద్యాఽత ఆరబ్ధా తతో నిశ్శ్రేయసం భవేత్.

తా. కర్మములకుఁ గారణము అజ్ఞానముగనుక అట్టి అజ్ఞాననివృత్తికై బ్రహ్మవిద్య చెప్పఁబడుచున్నది. బ్రహ్మవిద్య కలుగగనే అజ్ఞానము నశించి, స్వరూపావస్థానరూపమగు మోక్షసుఖము ప్రతిబంధరహితముగ స్ఫురించును.

1. ప్ర. మోక్షసుఖమునకు అజ్ఞానపరిహారము అవశ్యకర్తవ్యమా?

ఉ. వేఱును కొట్టనియెడల చెట్టు చిగుర్పకమాననివిధమున సంసారమునకు మూలకారణమగు అజ్ఞానము నశింపక సంసారము నివర్తింపదు. కనుక సకలఘోరకర్మముల నాచరింపఁజేయుటచే పరమశత్రువగు అజ్ఞానమును ప్రయత్నపూర్వకముగఁ బరిహరింపవలయును. ఇందుకు "ఏకశ్శత్రు ర్న ద్వితీయోఽస్తి శత్రు రజ్ఞానతుల్యః పురుషస్య రాజన్!, యేనావిష్టః కురుతే కార్యతే చ ఘోరాణి కర్మాణి సుదారుణాని." అను స్మృతిప్రమాణము.

2. ప్ర. ఆత్మజ్ఞానమువలన ఫలమేమి?

ఉ. అజ్ఞాననాశపూర్వకమగు మోక్షమే ఫలము. ఇందుకు "తరతి శోకమాత్మవిత్," అను శ్రుతియు, ఆత్మజ్ఞానములేక దుఃఖము నశింపదు. చర్మమును జుట్టినట్లు ఆకాశమును జుట్టిరేని ఆత్మజ్ఞానములేక దుఃఖము నశించునని బోధించెడి స్మృతులుం బ్రమాణము. "యదా చర్మవదాకాశం వేష్టయిష్యంతి మానవాః, తదా దేవ మవిజ్ఞాయ దుఃఖస్యాంతో భవిష్యతి." జ్ఞానేనతు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః, తేషామాదిత్యవజ్జ్ఞానం ప్రకాశయతితత్పరమ్." కావున ఆత్మజ్ఞానమే అజ్ఞాననివర్తకము. ౫

అవ. కర్మముల శక్తి విచిత్రము. సువర్ణదానము చేయువారు మోక్షమును పొందుదురు. అని "హిరణ్యదా అమృతత్వం భజంతే" అను శ్రుతి బోధించుచున్నది "కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః"అనుస్మృతి కర్మమే మోక్షసాధనమని చెప్పుచున్నది. కనుక బ్రహ్మవిద్యవలన నేమి ఫలమనెడి శంకను బోఁగొట్టుచు, బ్రహ్మవిద్యయే మోక్షసాధనమని రెండు శ్లోకములచే నిరూపించుచున్నారు:—

మూ. విద్యైవాజ్ఞానహానాయ న కర్మా ప్రతికూలతః,
నాజ్ఞానస్యాప్రహాణే హి రాగద్వేషక్షయో భవేత్. ౬
రాగద్వేషక్షయాభావే కర్మదోషోద్భవం ధ్రువమ్,
తస్మాన్నిశ్శ్రేయసార్థాయ విద్యైవాత్ర విధీయతే. ౭

తా. అజ్ఞానమును నివర్తింపఁజేయునది దీనికి విరోధియగు విద్యయే. కాని, విరోధికాని కర్మము అజ్ఞానమును నశింపఁజేయఁజాలదు. అజ్ఞానము నశించినగాని రాగద్వేషములు చెడవు. రాగద్వేషములు చెడనియెడల కర్మ

ములు కలుగకమానవు. ఇట్లు సంసారము ఎప్పటివలెనే పెరుగుచుండును. కావున, సంసారమూలమగు అజ్ఞానమును నివర్తింపఁజేయుటకై యీగ్రంథమందు బ్రహ్మవిద్య ప్రతిపాదింపఁబడుచున్నది.

1. ప్ర. విద్యకును అజ్ఞానమునకును విరోధమెట్లు?

ఉ. విద్య ప్రకాశరూపము. అవిద్యయనఁబడెడి అజ్ఞానము అప్రకాశస్వరూపము. కనుక నీరెండింటికి విరోధముగలదు. చీఁకటిలో భ్రాంతివలనఁ గలిగిన సర్పజ్ఞానమును, ప్రదీపరజ్జుజ్ఞానములు పోఁగొట్టునట్లు అప్రకాశస్వరూపావిద్యను, తత్కార్యభయమును సహజవిరోధమువలన ప్రకాశస్వరూపమగు విద్యయే తొలఁగించి, పరమానందమొసఁగఁగలదు. విరోధములేని కర్మము తనవలె జడమగు అజ్ఞానమునుఁ బోఁగొట్టనేరదు. మంచుసంఘము చీఁకటినిఁబోఁగొట్టలేదుకద. ఇచట, "నాన్యఃపంథా విద్యతేఽయనాయ" మోక్షమునకు ఆత్మజ్ఞానముదక్క వేరొకమార్గములేదని ఘోషించు శ్రుతి ప్రమాణము.

2. ప్ర. "హిరణ్యాదా అమృతత్వం భజంతే" యను శ్రుతివ్యర్థమా?

ఉ. చిరకాలము మరణములేకుండ నూర్ధ్వలోకమున జీవింతురని బోధించుటవలన నీశ్రుతియుఁ వ్యర్థముకాదు.

3. ప్ర. "కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయః" అనుస్మృతి వ్యర్థమా?

ఉ. కాదు. అవిద్యాగ్రంథినిర్మూలనమువలన దేహాభిమానములేక చేసినకర్మము ఆభాసమాత్రమై వేచినగింజలవలె నిష్ఫలమై బంధింపనేరదని యర్థముగాని అజ్ఞానమును బోఁగొట్టునని యాస్మృతికర్థముకాదు. కనుక నిదియుఁ వ్యర్థముకాదు.

4. ప్ర. విద్యలేక అజ్ఞానము పోనందున అజ్ఞానక్షయమునకై విద్య యపేక్షింపఁదగినదే. కాని ఆయవిద్యాకార్యములగు రాగద్వేషములు సత్యములగుటచే విరోధములేని విద్యవలన నశింపవుగనుక రాగద్వేషములను పరిహరించుటకుఁ దగిన కారణమేది ?

ఉ. రాగద్వేషములు అవివేకమువలనఁ గలిగినవి. ఎట్లనఁగా, వివేకము లేనపుడే రాగద్వేషములు గలుగును. వివేకముండఁగా నివి కలుఁగ జాలవు. కనుక నివి సత్యములుగావు. కారణాజ్ఞానము నశింపక రాగద్వేషములు పోవు కనుక రాగద్వేషనివృత్తికి అజ్ఞాననాశమే కారణము.

5. ప్ర. రాగాదులవలనఁ గలుగు హానియేమి?

ఉ. దీనివలన కర్మము ప్రవర్తింపకమానదు. కర్మమువలన జననమరణాదిదుఃఖపరంపరారూపసంసారము మానదు.

6. ప్ర. సంసారనివర్తకమెద్ది ?

ఉ. వేదాంతవిచారమే దుఃఖభూయిష్ఠసంసారనివర్తకము. కావున, బ్రహ్మవిద్య యిచట వివరించఁబడుచున్నది. ౬-౭

అవ ఇదివఱకు సంసారకారణమగు అజ్ఞానమును నివర్తించునది జ్ఞానమే. ఇదియే మోక్షసాధనము కాని కర్మము మోక్షసాధనముకాదని చెప్పఁబడెను. ఇపుడు కర్మము స్వతంత్రముగా మోక్షసాధనముగాదేని జ్ఞానసహితమయి మోక్షహేతువు కావచ్చుననెడి సముచ్చయవాదిమతమును విశదపఱుచుచున్నాఁడు:—

మూ. నను కర్మ తథా నిత్యం కర్తవ్యం జీవనే సతి, విద్యాయాః సహకారిత్వం మోక్షం ప్రతి హి తద్వ్రజేత్. ౮

తా. మోక్షమునుగుఱించి సాధనమగు విద్యకుఁ గర్మము సహకారి యగుటచే ముముక్షువు యావజ్జీవము వేదవిహితమగు నిత్యకర్మము చేయుచుండవలెను. అని పూర్వపక్షివాదము.

1. ప్ర. కర్మమును జేయక మానఁదగదా?

ఉ. ప్రకృతిగుణములకు వశుఁడైన నరుఁడు క్షణమాత్రమైనను కర్మము చేయక యుండలేఁడు. ఇందుకు:—"న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్" ఈ మొదలగు భగవద్గీతావాక్యము ప్రమాణము.

2. ప్ర. కర్మమువలన ప్రయోజనములేనందున ముముక్షువు కర్మమును జేయక మానఁదగునా?

ఉ. మోక్షసాధనమగు విద్యకు చిత్తశుద్ధిద్వారమున సహకారియగుటచే ముముక్షువైనను కర్మము మానరాదు.　　౭

అవ. ముముక్షువుసయితము కర్మమును మానఁగూడక పోవుటయందు కారణమును జెప్పుచున్నారు.—

మూ. యథా విద్యా తథా కర్మ చోదితత్వావిశేషతః,
ప్రత్యవాయస్మృతేశ్చైవ కార్యం కర్మ ముముక్షుభిః.

తా. వేదవిహితమగుటవలనను, చేయనియెడల ప్రత్యవాయము ఉండుటవలనను, ముముక్షువులు సయితము విహితములగు నిత్యకర్మములను మానరాదు.

1. ప్ర. కర్మము బంధకము, విద్య ముక్తికిసాధనము, కనుక యతులు కర్మమును జేయరాదు. ఇందుకు—"కర్మణా బధ్యతే జంతు ర్విద్యయా చ

విముచ్యతే, తస్మాత్కర్మ న కుర్వంతి యతయః పారదర్శినః" అనుస్మృతి చెప్పుచున్నది. కావున ముముక్షువు కర్మము నేలచేయవలెను?

ఉ. "విద్యాం చావిద్యాం చ యస్తద్వేదోభయంసహ" అని సముచ్చయముగ కర్మవిద్యలను రెండింటిని శ్రుతి విధించుటవలన కర్మమును మానరాదు. మఱియు, విహితకర్మమును మానుటవలనను, నిషిద్ధకర్మమును సేవించుటవలనను, విషయములం దతిప్రసక్తివలనను, నరుఁడు చెడునని "అకుర్వన్ విహితం కర్మ నిందితం చ సమాచరన్, ప్రసజంశ్చేంద్రియార్థేషు నరః పతనమృచ్ఛతి" అను స్మృతి బోధించుటచే కర్మము మానఁదగదు.

2. ప్ర. "యతయః కర్మ న కుర్వంతి" అనుస్మృతి వ్యర్థమగును గదా?

ఉ. జ్ఞానప్రశంసకై చెప్పఁబడిన యాస్మృతి వ్యర్థము కాదు. ౯

అవ. విద్యకు సహాయాపేక్ష లేదని సిద్ధాంతి చెప్పుచున్నాఁడు.—

మూ. నను ధ్రువఫలా విద్యా కర్మ నిత్యమపేక్షతే. ౯౪

తా. ఇది ఘటమును ప్రత్యక్షజ్ఞానమునకు అన్యసహాయములేనట్లు, నిత్యమైనఫలము గలవిద్య అన్యసహాయము నపేక్షింపదు. ౯౪

అవ. ఈహేతువు వ్యభిచరించునది గనుక విద్యకు అగ్నిష్టోమమునకువలె నన్యాపేక్షగలదని పూర్వపక్షియాక్షేపము.—

మూ. నాగ్నిష్టోమో యథైవాన్యద్ధ్రువకార్యోఽప్యపేక్షతే,
　　తథా ధ్రువఫలా విద్యా కర్మ నిత్యమపేక్షతే.　　౧౦౫

తా. అవశ్యం భావిఫలముగలిగినను, అగ్నిష్టోమమునకు ఉద్గీథ శస్త్రాదికము తద్గతజ్ఞానమును సహకారి యగునట్లు అవశ్యం భావిఫలముఁ గలిగిన విద్యకు నిత్యకర్మము సహకారికావలెనని పూర్వపక్షిమతము.　　౧౦౫

మూ. ఇత్యేవం కేచి దిచ్ఛంతి న కర్మ ప్రతికూలతః.　　౧౧

తా. ఇట్లు కొందఱు పూర్వపక్షులు చెప్పుదురుగాని విద్య స్వకార్యమందు ప్రతికూల మగుకర్మము న పేక్షింపదు. చీఁకటి తేజస్సునకు సహకారి యెన్నఁడును గాదు. ఇట్లే విరోధి తనకు సహాయము నెన్నఁడును జేయఁడు కదా.　　౧౧

అవ. విద్యకుఁ గర్మమునకుఁగల విరోధమును విశదపఱుచుచున్నారు:—

మూ. విద్యాయాః ప్రతికూలం హి కర్మస్యాత్సాభిమానతః.

తా. నేను బ్రాహ్మణుఁడను, శ్రోత్రియుఁడను, గనుక నీజ్యోతిష్టోమమును నేనే చేయవలెనను అభిమానసహితమగునది కర్మము. ఇయ్యది కూటస్థాత్మాకారమై జాత్యాద్యభిమానములేని విద్యకు విరోధికదా.　　౧౧౫

అవ. విద్యాస్వరూపనిర్ణయము.—

మూ. నిర్వికారాత్మబుద్ధిశ్చ విద్యేతీహ ప్రకీర్తితా.　　౧౨

తా. నేను కర్తనుకాను, భోక్తనుకాను, కూటస్థబ్రహ్మము నేను అనే ఆత్మాకారాంతఃకరణవృత్తి విద్యయనఁబడును. అహంకారము ప్రధానముగా

గలది కర్మమగుటచేత కర్మజ్ఞానములకు విరోధము స్పష్టము. "దేహాభిమానాదభివర్ధతే క్రియాః విద్యా గతాహంకృతితః ప్రసిధ్యతి" అని రామగీత యందు చెప్పఁబడెను. ౧౨

అవ. అంతర్ముఖత్వమువలన జ్ఞానము, బహిర్ముఖత్వము వలన కర్మము, అని జ్ఞానకర్మములకు ప్రవృత్తివలన విరోధమునుఁజెప్పి యిపుడా రెండింటికిని ఉత్పత్తివలనను విరోధము ను జెప్పుచున్నాఁడు.—

మూ. అహంకర్తా మమేదం స్యా దితి కర్మ ప్రవర్తతే,
వస్త్వధీనా భవేద్విద్యా కర్త్రధీనో భవేద్విధిః. ౧౩

తా. నేను కర్తను, నాకీఫలము కావలెను అను తలంపుతో కర్మను జేయును. విద్య వస్త్వధీనముకాని పురుషాధీనము కాదు. కర్మము చేయుటకు, మానుటకును మఱియొకవిధముగ మార్చుటకును పురుషునివశమై యుండును.

1. ప్ర. కర్మమునకును జ్ఞానమునకును సముచ్చయ మేల కలుగదు?

ఉ. కర్మము పురుషాధీనము. విద్య వస్త్వధీనముకాని పురుషాధీనముకాదు. కావున నీరెండింటికి సముచ్చయము తగదు. ౧౩

అవ. కర్మమునకాధారము అహంకారము. విద్య ఉదయింపఁగనే అహంకారము లేనందున జ్ఞానసహకారి కానేరదని మఱియొకవిధమున జ్ఞానకర్మములకు విరోధమును చెప్పుచున్నాఁడు:—

మూ. కారకాణ్యుపమృద్నాతి విద్యా బుద్ధిమివోషరే,
ఇతి తత్సత్య మాదాయ కర్మ కర్తుం వ్యవస్యతి. ౧౪

తా. మరుభూమియందు గలిగిన జలభ్రాంతిని మరుస్థలస్వభావము నెఱింగించెడి బుద్ధి బాధించునట్లు తత్త్వవిద్య ఆత్మయందు ఆరోపింపఁబడిన కర్తృత్వాదిబుద్ధిని బాధించును గనుక ఆసత్యజ్ఞానము నవలంబించిన జ్ఞాని కర్మమును ఎట్లు చేయఁబూనును? (ఎట్లు=కథం) ఈ పదాధ్యాహారముచేఁ గర్మమును జ్ఞాని చేయఁబూనఁడని భావము. ౧౪

అవ. విరోధముండుటవలన కర్మజ్ఞానములకు సముచ్చయము సంభవింపకపోవుటకు ఫలము:—

మూ. విరుద్ధత్వా దత శ్శక్యం కర్మకర్తుం న విద్యయా,
సహైవవిదుషా తస్మాత్కర్మ హేయం ముముక్షుణా.

తా. కర్మజ్ఞానములకుఁ గల పరస్పరవిరోధమువలన జ్ఞాని విద్యతోఁ గూడ కర్మను చేయలేఁడు గనుక ముముక్షువు కర్మమును మానవలెను. ౧౫

అవ. "జ్ఞాత్వా కర్మసమాచరేత్," అను న్యాయమువలనను, స్వర్గకామాదివిధులవలనను, దేహాతిరిక్తాత్మజ్ఞానము గలవారికిఁ గర్మాధికారము లేకపోవుటవలనను, జ్ఞానకర్మములకు విరోధము గలుగగా, కర్మాధికారి లేనందున కర్మకాండము ప్రమాణము కాదనెడి శంకరాఁగా, కర్మస్వరూపము, కర్మభేదము, కర్మాధికారము మొదలగు విశేషజ్ఞానమును, దేహాదివ్యతిరిక్తాత్మజ్ఞానమును, కర్మవిశేషాధికారి కపేక్షితములైనను అధికారులవిరోధమువలనను. పరమాత్మతత్త్వజ్ఞానముతోఁ గర్మమునకుఁ బనిలేనందున నీశంక కవకాశము లేదని చెప్పుచున్నారు. మఱియు ఉపనిషజ్జ్ఞానము కర్మకారకములను

బాధించేయెడల జ్ఞానకాండముచే కర్మకాండము నిరాధారమై బాధింపఁబడి అప్రమాణమగును. అట్లయ్యెనేని "స్వాధ్యాయోఽధ్యేతవ్యః" అను విధి వ్యర్థమగును. అనుశంకపైని కర్మకాండము ఆత్మజ్ఞానోత్పత్తికంటె పూర్వము వ్యర్థమా? అనంతరము వ్యర్థమా? యని వికల్పించి, ఆత్మజ్ఞానము కలుగక ముందు కర్మకాండము ప్రమాణమే యని నిరూపించుచున్నారు:—

మూ. దేహాద్యైరవిశేషేణ దేహినో గ్రహణం నిజమ్,
ప్రాణినాం తదవిద్యోత్థం తావత్కర్మవిధిర్భవేత్. ౧౬

తా. జీవునకు దేహేంద్రియమనోబుద్ధులతో తాదాత్మ్యాభిమానము అవివేకజన్యమగు నజ్ఞానమువలనఁ గలుగును. నేను బ్రాహ్మణుఁడను, గృహస్థుఁడను, ఇంద్రియపటుత్వముగలవాఁడను, బలవంతుఁడను, నాకు స్వర్గేచ్ఛగలదు. ఈ మొదలగు జ్ఞానము దృఢముగ నుండువఱకు ప్రమాణమగు కర్మవిధి వ్యర్థము గానేరదు.

1. ప్ర. ప్రమాణమన నేమి?

ఉ. సత్యజ్ఞానమును గలిగించునది.

2. ప్ర. ఆ జ్ఞానమును గలిగించునదేది?

ఉ. అధికారికి జ్ఞానమునుగలిగించునది వేదమే.

3. ప్ర. అట్లేని కర్మకాండమునకు ప్రామాణ్యమెంతవఱకుఁగలదు?

ఉ. బ్రహ్మజ్ఞానముకలుగకముందు ప్రవృత్తియుండునంతవఱకు కర్మకాండము ప్రమాణమే. కనుక అధ్యయనవిధి వ్యర్థముకాదు. ౧౬

అవ. ఆత్మజ్ఞానానంతరము కర్మకాండము ప్రమాణము కాదని చెప్పుచున్నారు:—

మూ. నేతి నేతీతి దేహాదీ నపోహ్యాత్మాఽవశేషితః,
నిర్విశేషాత్మబోధార్థం తేనాఽవిద్యా నివర్తితా. ౧౭

తా. "నేతినేతి" అను శ్రుతిచేత ఆధారాత్మబోధకై కల్పితములగు దేహేంద్రియాదులను నిషేధించి, ఆత్మ "సత్యస్య సత్యం" అను శ్రుతిచే అవధి చేయఁబడెను. దానిచే సర్వకల్పనాబీజమగు అవిద్య నివర్తింపఁబడెను.

1. ప్ర. ఆత్మావశేష మెట్లు సిద్ధించును?

ఉ. పరాగర్థములు (బాహ్యార్థములు)కాదు కాదని నిషేధింపఁబడఁగా నిషేధావధియగు ఆత్మ శేషించును.

2. ప్ర. ఇట్టి ఆత్మావబోధ కేమిఫలము?

ఉ. దేహము నేనేయనుకొను అభిమానమునకును, కర్మాధికారమునకును, గారణమగు నవిద్య బాధింపఁబడి తొలఁగును. కావున నిమిత్తము పోఁగా కార్యముకూడ నశించునను న్యాయమునను, తీవ్రకోపము తొలఁగఁగనే అభిచారవిధిశాస్త్రము వ్యర్థమగుచందమున ఆత్మతత్త్వజ్ఞానముగలవానికి కర్మకాండము (ఫలవంతమగు విజ్ఞానమును గలిగించకపోవుటచే) అప్రమాణమేయగును. కనుక కర్మకాండము తత్త్వజ్ఞానోత్పత్తికి పూర్వము ప్రమాణమైనను పరమందు ప్రమాణముకాదని భావము. ౧౭

అవ. నిర్విశేషాత్మ దర్శనముచేఁ దొలఁగినట్టి అవిద్య తిరిగిజనించి కర్మాధికారహేతువు కాఁగా శుక్తియాథార్థ్యము

తెలియఁగ ఆశుక్త్యజ్ఞానము తొలఁగినను తిరిగి మఱియొక ప్పుడు శుక్తియందు రజతమను భ్రమ తోఁచినట్లు కర్మవిధి సఫలమగునందువేని, అట్లుకాదని చెప్పుచున్నాఁడు. "నివృత్తా సా ఇతి":—

మూ. నివృత్తా సా కథం భూయః ప్రసూయేత ప్రమాణతః,
అసత్యేవా విశేషేఽపి ప్రత్యగాత్మని కేవలే. ౧౮

తా. ప్రమాణాగ్నిచే నిర్దగ్ధమగు ఆయవిద్య తిరిగి యెట్లు సంసారమును పెంచును? అనఁగా పెంచలేదు. మృతిఁజెంది దహనము చేయఁబడిన భార్య పిల్లలను గనునా? మఱియొక అవిద్య పుట్టవచ్చునందువేని ఆయవిద్య నిర్నిమిత్తముగఁ బుట్టునా? సనిమిత్తముగఁబుట్టునా? కారణములేని కార్యముగలుగదు. కనుక నిర్నిమిత్తముగఁ బుట్టుననరాదు. రెండవపక్షమున ఆయవిద్యకు నిమిత్తము ఆత్మయా? అనాత్మయా? అని వికల్పించి ఆత్మ నిమిత్తముకాదని చెప్పుచున్నాఁడు. నిర్విశేషము, కేవలమునగు ప్రత్యగాత్మ అసహాయముగ నవిద్యను పుట్టింపనేరదు. అనాత్మయగు అవిద్యాంతర సహాయమునఁ బుట్టునన్నను, అన్యోన్యాశ్రయము, అనవస్థయును దోషములు సంభవించును. అవిశద్ధమువలన కార్యమగు అనాత్మ అవిద్యకుఁ గారణము కాఁజాలనందున ఆయవిద్య అనాత్మయందును లేదని సూచింపఁబడెను.

1 ప్ర. ముత్యపుఁజిప్పను వెండియనుకొని విమర్శింపఁగా నది ముత్యపుఁజిప్పయేగాని వెండికాదని నిశ్చయించినను, కాలాంతరమందు ముత్యపుఁజిప్పను జూచి వెండియను భ్రాంతికలుగును గదా! ఇట్లు అవిద్య తిరిగి యేలపుట్టరాదు?

ఉ. అనంతశక్తిమత్తగు మూలావిద్య నిశ్శేషముగ బాధింపఁబడక నిలిచియుండుటవలన శుక్తియందు రజతమను విక్షేపము కాలాంతరమునఁ గలిగినను ప్రబలప్రమాణమగు తత్త్వజ్ఞానమువలన నిశ్శేషముగ బాధింపఁ బడిన ఆయవిద్య తిరిగి పుట్టనేరదు. కావున నిచట నీదృష్టాంతము సరి పడదు. ౧౮

అవ. అవిద్య తిరిగిపుట్టకపోవుటకుఁదగిన ఉపపత్తి (యుక్తి)ని చెప్పుచున్నారు:—

మూ. న చేదూ్భయః ప్రసూయేత కర్తా భోక్తేతి ధీః కథమ్,
సదస్మీతి చ విజ్ఞానే తస్మా ద్విద్యా ౽సహాయికా. ౧౯

తా. "బ్రహ్మైవాహమస్మి" అను విశేషజ్ఞానము అపరోక్షముగ సిద్ధింపఁగా అవిద్య తిరిగి యుదయించనియెడల కర్మాధికారమునకుఁ గారణ మగు "నేను కర్తను, భోక్తను" అను బుద్ధి యెట్లు కలుగఁగలదు? కలుగదు కావున కర్మసహాయములేని విద్యయే మోక్షసాధనమని భావము.

1 ప్ర. "సదస్మీతి చ" అనుచోట చకారమున కర్థమేమి?

ఉ. కర్తృత్వాదికము ఆరోపితమేకాని సత్యము కాదని చకారము నకు అర్థము.

2 ప్ర. కర్తృత్వాదికము సత్యమగునేని కలిగెడి హానియేమి?

ఉ. సత్యమగు కర్తృత్వాదికము విద్యచే నివర్తింపఁబడకపోవుట యేకాక మోక్షమను వార్తయే లేకపోవలసివచ్చును.

3 ప్ర. సముచ్చయవాదమునకుఁ గలిగిన ఫలితమేమి?

ఉ. విద్యకలుగఁగానే కర్మ సంభవింపదు. కర్మసహకృతము కాని కేవలవిద్యయే ముక్తికిఁ గారణము. కనుక ముక్తినిగుఱించి కర్మసముచ్చయవాదము సంభవింపదని తాత్పర్యము. ౧౯

అవ. ఇతరసహాయములేని విద్యయే ముక్తిహేతువని యుక్తిపూర్వకముగఁ జెప్పినమాటను శ్రుతిచే ధ్రువపఱుచుచున్నారు:—

మూ. అత్యరేచయ దిత్యుక్తో న్యాసః శ్రుత్యాఽత ఏవ హి,
కర్మభ్యో మానసాంతేభ్య ఏతావదితి వాజినామ్. ౨౦
అమృతత్వం శ్రుతం యస్మాత్త్యాజ్యం కర్మముముక్షుభిః,

తా. తైత్తిరీయోపనిషత్తుచేత, "సత్యం పరం పరం సత్యం" అని ఉపక్రమించి తపస్సుమొదలగు ధ్యానాదికర్మములను శ్రేయస్సాధనములుగ నిర్దేశించి, "తాని వా ఏతాన్యవరాణి" ఆకర్మములు తక్కువవి, అని వానిని నిందించి, "న్యాసఇతి బ్రహ్మ" అని తత్త్వజ్ఞానాంతరంగమగు కర్మసంన్యాసమే ఆకర్మముల నతిక్రమించెనని సంన్యాసము శ్రేష్ఠముగ పొగడఁబడెను. నిందింపఁబడినది త్యాజ్యము, పొగడఁబడినది గ్రాహ్యమును గనుకను, మోక్షము కర్మాపేక్షగలదగునేని సంన్యాసవిధి వ్యర్థమగుటచేతను సంన్యాసమే మోక్షసాధనమగును. "ని=ఆత్మయందు, న్యాసః=ఆరోపిత ప్రపంచమును లయింపఁజేయుట" అను వ్యుత్పత్తివలన సంన్యాసమనఁగా ఆత్మజ్ఞానమని భావము. కనుకనే వాజసనేయుల యుపనిషత్తులందు ఆత్మతత్త్వము నొకటి విని మననముచేసి తెలియఁబడఁగా సర్వము తెలియఁబడునని ఉపక్రమించి ఆయద్వయాత్మతత్త్వమును దుందుభ్యాదిదృష్టాంతముచేత నుపపాదించి,"ఓమైత్రేయీ! ఇంతయే అమృతత్వము. ఇది నీకుఁదెలియ

పఱచఁబడెను." అని కర్మనిరపేక్షమగు, జ్ఞానమే మోక్షసాధనమని నిశ్చయముగ బోధింపఁబడెను. "ఏతావదేవ" అనుటవలన కర్మముయొక్క అపేక్ష లేదనియే సూచింపఁబడెను. "అమృతత్త్వస్య నాశాస్తి విత్తేనేతి"అని చెప్పఁబడినమంత్రము ఆత్మజ్ఞానమునకు విత్తసాధ్యమగు కర్మముయొక్క అపేక్ష లేకపోవుటయందు ప్రమాణముగనుకను, ఉపాసనాజ్ఞానవిషయభేదముండుటచేతను "విద్యాంచావిద్యాంచ" అను సముచ్చయవిధానమునకు విరోధమేమియుంలేదు. ఇట్లు ఉపాసనాభేదము చెప్పకపోయెనేని "హిరణ్మయేన పాత్రేణ; అగ్నేనయసుపథా"అని అగ్నినిఁగూర్చి మార్గప్రార్థనము తగియుండదు గనుక కర్మసముచ్చయభేదము ఉపాసనాజ్ఞానవిషయముగ సమన్వయించుటవలన సర్వము సమంజసము. కనుక, వివిదిషువులే కర్మమును జ్ఞానబలముచే మానవలయుననినచో విద్వాంసులు కర్మమును మానవలయునని వేఱె చెప్పనక్కరలేదు. ఇందుకు—"నకర్మణా నప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వమానశుః, త్యాగ ఏవ హి సర్వేషాం మోక్షసాధనముత్తమం, త్యజతైవ హి తజ్జ్ఞేయం త్యక్తుః ప్రత్యక్పరంపదమ్." ఈమొదలగుశాస్త్రము ప్రమాణము.

1. ప్ర. దుందుభ్యాది దృష్టాంతమననెట్టిది?

ఉ. దుందుభియనఁగా భేరి. ఈభేరి వాయించునపుడు ఇతరధ్వనులు వేఱుగ వినిపించక ఈభేరీధ్వనియందే లయించును. ఇట్లే ఆత్మ భాసించునపుడు ఇతరవస్తువులేవియు స్ఫురింపవని దార్ష్టాంతికార్థము. ౨౦౪

అవ. ఇట్లు ముముక్షువు సర్వకర్మసంన్యాసపూర్వకముగ జ్ఞాననిష్ఠుఁడు కావలెనని నిరూపించి యిపుడు పరుఁడుచెప్పిన

దృష్టాంతమును అనువదించి నిరాకరించుచున్నారు:—

మూ. అగ్నిష్టోమవదిత్యుక్తం తత్రేదమభిధీయతే. ౨౧
నైకకారకసాధ్యత్వాత్ఫలాన్యత్వాచ్చకర్మణః,
విద్యా తద్విపరీతాఽతో దృష్టాంతో విషమో భవేత్.

తా. అగ్నిష్టోమాదికము నియతమగు ద్రవ్యమంత్రతంత్రప్రయోగసాధ్య మగుటవలనను ఫలభేదము కలుగుటవలనను, "యదేవవిద్యయా కరోతి శ్రద్ధయోపనిషదా తదేవ వీర్యవత్తరం భవతి," అను శ్రుతివలన విద్యాద్వారమున వీర్యవత్తరఫల విశేషముండుటచే అగ్నిష్టోమమునకు విద్యాపేక్ష తగునని దృష్టాంతతాత్పర్యము. కాని, జ్ఞానమున కెట్లు కాదని చెప్పుచున్నారు:—ఎట్లనఁగా; కర్మస్వభావముకంటె విద్య విపరీతస్వభావము గలది, కావున దృష్టాంతము సమముగ లేదు.

1. ప్ర. విద్యాస్వభావ మెట్టిది?

ఉ. విద్య వస్త్వధీనప్రమాణమును, నిరతిశయమోక్షైకఫలమును గలది.

2. ప్ర. కర్మస్వభావ మెట్టిది?

ఉ. కర్మము కర్త్రధీనము, నశ్వరఫలమును గలది.

3. ప్ర. ఈ జ్ఞానకర్మభేదమువలన నేమి ప్రయోజనము?

ఉ. అగ్నిష్టోమ దృష్టాంతము విద్యకు తగదనిభావము. ౨౧-౨౨

అవ. అగ్నిష్టోమమునకు, విద్యకుఁ గలదృష్టాంతభేదము చెప్పుచున్నారు:—

మూ. కృష్యాదివత్ఫలార్థత్వాదన్యకర్మోపబృంహణమ్,
అగ్నిష్టోమస్త్వపేక్షేత విద్యాఽన్యత్కిమపేక్షతే. ౨౩

తా. అగ్నిష్టోమమునకు స్వర్గాదికము ఫలముగనుక విహితమగు ఉద్గీథా ద్యవయవ సహితోపాసనలచే వృద్ధిని కోరఁదగును. ఎట్లనఁగా: కృషి యెరువుచే నధికఫలమును, వాణిజ్యము పారితోషికముచే నధికఫలమును సంపాదించునుగదా. ఇట్లు అగ్నిష్టోమమునకు ఉద్గీథోపాసనాది సహకార్యపేక్ష కలుగునట్లు నిత్యనిరతిశయమోక్షఫలకమగు విద్యకు సాధనాపేక్ష యేమియు లేదు. ౨౩

అవ. "అకుర్వన్విహితం కర్మ నరకంచాధిగచ్ఛతి"అని విహితకర్మము చేయకున్నను, నిషిద్ధకర్మము చేసినను నరకప్రాప్తిరూపప్రత్యవాయము గలదని శాస్త్రము ఘోషించుచుండఁగా కర్మమెట్లు మానఁదగునను శంక కుత్తరము చెప్పుచున్నారు:—

మూ. ప్రత్యవాయస్తు తస్యైవ యస్యాహంకార ఇష్యతే,
అహంకారఫలార్థిత్వే విద్యేతే నాత్మవేదినః. ౨౪

తా. నేనీకర్మముజేసి యీఫలమును బొందెద ననుఅభిమానముగలవానికే విహితకర్మమును జేయకపోవుటవలన నగు ప్రత్యవాయము సంభవించును. కాని, ఆత్మవేత్తకు దేహాభిమానమును ఫలాపేక్షయు లేమిచే కర్మములను మానుటచే ప్రత్యవాయములేదు. ౨౪

అవ. విద్యయే అజ్ఞానమును బోఁగొట్టఁగలదు కాని, విరోధము లేనికర్మము అజ్ఞానమును బోఁగొట్టనేరదని ఉపక్రమించి స్వతంత్రముగాఁగాని, జ్ఞానసహకారముగాఁగాని కర్మము మోక్షసాధన మెట్లును కాదని నిరూపించి "బ్రహ్మవిద్యామథేదానీం వక్తుం వేదః ప్రచక్రమే" అని అప్రకృతమైన కర్మవిషయము నుపసంహరించుచున్నారు.—

మూ. తస్మా దజ్ఞానహీనాయ సంసారవినివృత్తయే,
బ్రహ్మవిద్యావిధానాయ ప్రారబ్ధోపనిషత్త్వియమ్. ౨౫

తా. విద్య కర్మనిరపేక్షమగుటవలన సంసారనివర్తకమగు అజ్ఞానక్షయముకొఱకును, బ్రహ్మవిద్యాసంపాదనకొఱకును సర్వోత్తమమగు నీయుపనిషత్తు ప్రవర్తించుచున్నది. ౨౫

అవ. ఇపుడు ఉపనిషచ్ఛబ్దార్థమును నిరూపించుచు కర్మాద్యపేక్ష లేకయే బ్రహ్మవిద్య స్వతంత్రముగ మోక్షహేతువని సూచించు వ్యుత్పత్తిని జూపుచున్నారు:—

మూ. సదేరుపనిపూర్వస్య క్విపిచోపనిషద్భవేత్,
మందీకరణభావాచ్చ గర్భాదేశ్శాతనా త్తథా. ౨౬

తా. "షద్లృ విశరణగత్యవసాదనేషు" అని "సద్' ధాతువునకు, 1 శిథిలీకరణము, 2 ప్రాణము, 3 నాశనము; అని మూఁడర్థములు గలవు. ఉప+ని+సద్+క్విప్ = ఉప, ని" అను ఉపసర్గలతోఁగూడిన సద్ ధాతువుపైన "క్విప్" అను ప్రత్యయము చేర్చఁగా "ఉపనిషత్" అనుమాట నిష్పన్నమాయెను.

### ఈశబ్దమునకర్థములు.

1. నిత్యనిరంతరబ్రహ్మజ్ఞాననిష్ఠగలవారికి గర్భజన్మజరాదిదుఃఖమును బోఁగొట్టును.

2. జిజ్ఞాసువునకు బ్రహ్మమును నిశ్చయముగ సాక్షాత్కరింపఁ జేయును.

3. తత్త్వవేత్తలకు గర్భవాసాదిదుఃఖమును బోఁగొట్టును. ఇట్లుధాత్వర్థయోగమువలన ఉపనిషచ్ఛబ్దవాచ్యము విద్యయే. మఱియుఁ జీవనసాధనమగు ధాన్యోత్పత్తికి సాధనమగు లాంగలమును జీవనమని వ్యవహరించునట్లు, ఉపనిషచ్ఛబ్దవాచ్యమగు విద్యను ప్రతిపాదించుగ్రంథముకూడ ఉపనిషత్తనాఁబడును. ౨౮

ఇది ఉపోద్ఘాతప్రకరణము.

---

శ్రీః

# ఉపదేశసాహస్రి

(శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యప్రణీతము.)

## శ్లోకప్రబంధము — ద్వితీయప్రకరణము.

---

### ౧. ఆత్మజ్ఞానోత్పత్తిప్రకరణము.

అవ. ఇట్లు ముముక్షువునకు మోక్షసాధన బ్రహ్మాత్మవిద్యాప్రతిపత్తికై వేదాంతారంభము ఉపపన్నమగునని యుండఁగా మఱల పూర్వవాదిశంక:— విద్య ఉదయించునేని విద్యోదయమునకై ప్రవర్తించు వేదాంతారంభము ఉపపన్నమగును. ఆత్మయందు సంసారిత్వగ్రాహకప్రత్యక్షాదివిరోధము వలన నూరుమాటలు చెప్పినను విద్య ఉదయింపనేరదు. సంసారిత్వమునకు ప్రత్యక్షాదికము విరోధముకానందున బలవంతమగుటచేతను, ప్రత్యక్షాదికము ననుసరించి ప్రవర్తించెడి శాస్త్రము దుర్బలమగుటవలనను, ఎట్టకేలకు ఉత్పన్నమగువిద్య ప్రత్యక్షసిద్ధమగు సంసారమును బాధించునందువేని ప్రత్యక్షమగు సంసారిత్వానుభవము ప్రత్యగాత్మయొక్క—

బ్రహ్మాభావమును ఎట్లు బాధింపకపోవు ననుశంకకుత్తరము:—

మూ. ప్రతిషేద్ధు మశక్యత్వా న్నేతి నేతీతి శేషితమ్,
ఇదం నాహ మిదం నాహ మిత్యద్ధా ప్రతిపద్యతే. ౧

తా. ఇదికా దిదికా వని సకలదృశ్యమును నిషేధింపఁగా ప్రతిషేధమునకు అవధియు, ప్రతిషేద్ధ (నిషేధించుజీవున)కు స్వరూపమునగు ఆత్మస్వరూపము నిషేధింపశక్యముకానందున ఈదేహము నేఁగాను, ఈయింద్రియజాతము నేఁగాను, మనోబుద్ధిప్రాణాదికమును, ఆమనోబుద్ధ్యాదికమున కుపాదానమగు నవిద్యయు నేఁగాను. కాని, ఈదేహాదికమును బ్రకాశింపఁజేయుచు నవ్యభిచారి (అంతటనిండినది)యు, స్వయంప్రకాశము, కూటస్థము, అక్షరము, సర్వజగదాశ్రయమునగు అవ్యక్తాకాశమున కాధారమగు బ్రహ్మమే నేనని సాక్షాత్కరింపఁబడును. కనుక, విద్య ఉదయింపదను శంక తగదు. ౧

అవ. ఈప్రకారము "అహం బ్రహ్మ" అనుజ్ఞాన ముదయించినను దేహేంద్రియాదులందు నేననెడి యభిమానము నిరంతరము ననుసరించుచుండఁగా ఆజ్ఞానము స్థిరపడదని శంకించి ఆదేహాభిమానమునకు ప్రమాణము లేనందునను, బాధితానువృత్తమగు[1] నాయభిమానము ఆభాస[2]మాత్రమగుటచే నీదేహాభిమానము విద్యావిరోధి కాదను నభిప్రాయముతో మహావాక్యార్థజ్ఞానమునకు ప్రాబల్యమును నిరూపించుచున్నారు:—

---

1 బ్రహ్మాత్మసాక్షాత్కారముచే బాధింపఁబడినను ప్రారబ్ధానుసారియగును.
2 లేనిది యున్నట్టు తోఁచుట.

మూ. అహంధీ రిదమాత్మోత్థా వాచారంభణగోచరా,
నిషిద్ధాత్మోద్భవత్వాత్సా న పునర్మానతాం వ్రజేత్. ౨

తా. అనాత్మయగు దేహము నేననెడిబుద్ధి 'అహంధీ' అనఁబడును. అహంకారవాసనావాసితాంతఃకరణరూపమగు ఈయాత్మనుండి కలిగి వాచారంభణవిషయమైన ఆయహంబుద్ధి తనస్వరూపము కారణముతోఁగూడ నిషేధింపఁబడుటవలన తిరిగి ప్రమాణము కానేరదు.

1. ప్ర. ఆయహంబుద్ధి ఎప్పుడు కలుగుచుండును?

ఉ. ఎప్పుడెప్పుడు బాహ్యమగు ఇదంవృత్తి కలుగుచుండునో అప్పుడెల్లను ఇదంవృత్తికి పూర్వపూర్వమై యహంవృత్తి కలుగుచుండును. అహంవృత్తి లేక ఇదంవృత్తి యెన్నడుఁ గలుగదు.

2. ప్ర. ఈయహంబుద్ధి నిత్యమా?

ఉ. ఇది అధ్యాసరూపమైనదేకనుక నిత్యము కాదు.

3. ప్ర. అధ్యాసమననేమి?

ఉ. కానివస్తువును వస్తువనుకొనుట. ఉదా. రజ్జువును జూచి పాము కాకున్నను పామనుకొనుట మొదలగునది. విమర్శింపఁగా భ్రాంతికల్పితము. నిత్యము కానేరదు.

4 ప్ర. వాచారంభణ మననేమి?

ఉ. కారణసత్తకంటె వేరుసత్తలేకున్నను, వ్యవహారానుకూలమై ప్రత్యక్షముగ నిరూపింపఁబడు కార్యజాతమెల్లను వాచారంభణమనఁబడును. ఉదా. బాన, కుండ, మూఁకుడు మొదలగు వస్తువులకు కారణమగు మృత్సత్తకంటె వేరుసత్తలేదు. వ్యవహారదశయందు వేరువేరు పేర్లతో వ్యవహరింపఁ

బడుచున్నను కారణమాత్రమే యగును. ఈవికారవస్తువులు వాచారంభణ మనఁబడును. ఇట్లే కడియము, ఉంగరము, కంటె మొదలగువస్తువులు వాచారంభణమై విచారదశయందు కారణసువర్ణమాత్రమే యగును.

5 ప్ర. కడియము, ఉంగరము మొదలగువస్తువులు బంగారము కంటె వేఱుకావా?

ఉ. కడియము మొదలగువస్తువులు చేయకమునుపును, చేసి కరిగిన పిమ్మటను, సువర్ణమయిన కడియము మొదలగువస్తువులు మధ్యకాలమందు మాత్రము వేఱుసువర్ణముకాఁకపోవును? సువర్ణముకంటె కడియము మొదలగునవి వేఱుగ నుండవలెననియే యందువేని, ఒకతులము తూనికగల సువర్ణమిచ్చి కడియము చేయించగా వేఱైన కడియముయొక్కతూనిక తులములతోఁగలిసి రెండుతులములు తూనికకురావలెను. అట్లు కార్యమగు కడియమునకును కారణమగు సువర్ణమునకును తూనిక హెచ్చక నొకతులము మాత్రమే యగుటచేత భూతభవిష్యత్కాలములందు సువర్ణమాత్రముగ నున్న వస్తువు వర్తమానకాలికవాచారంభణాత్మకవికారస్వరూపకంకణావస్థయందును కారణమగు బంగారముకంటె వేఱుకాదు, సువర్ణమాత్రయే యగును. కావున వికారము అనృతము. కారణము సత్యము. ఇందుకు— "వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్," అనుశ్రుతి ప్రమాణము.

6. ప్ర. ఈ అహంబుద్ధి యెట్లు నిషేధింపఁబడును?

ఉ. వాచారంభణమాత్రము వికారము గనుక యథార్థమయిన ఆత్మజ్ఞానముచే నిషేధింపఁబడును.

7. ప్ర. ఇందుకు దృష్టాంతమేమి?

ఉ. ఘటకలశాది వికారములు కాలత్రయమందును కారణమృణ్మా

త్రము. కటకకుండలాద్యలంకారములు కాలత్రయమందు కారణకనక మాత్రమేయనియు నింతకుముందే దృష్టాంతము నుడువఁబడెను. ఇట్లు అహం వృత్తియు, దీనిని పురస్కరించుకొని కలిగెడు ఇదంవృత్తియు వాచారంభణ వికారములై స్వప్నపదార్థములవలె యథార్థాత్మజ్ఞానము కలుగఁగ నిషేధింపఁ బడును.

8. ప్ర. ఫలితమేమి?

ఉ. ఆద్యంతములందు లేనిజగత్తు మధ్యమునందును ఉన్నట్టుతోఁచినను లేనిదేయగును. ఉదా:—స్వప్నమందు ఉన్నట్టుతోఁచినను ఆస్వప్నముయొక్క ప్రారంభావసానములందు లేని జగత్తు స్వప్నమధ్యభాగమందును లేనిదేకదా? మఱియు ఆద్యంతములందేదియున్నదో మధ్యమందును అదియే యుండును. ఉదా:—కడియము చేయకమునుపును, చేసి కరిగినపిమ్మటను ఏసువర్ణముకలదో మధ్యను అనఁగా; కడియముగనున్నపుడును ఆసువర్ణమేకదా! ఇట్టు సృష్టికి పూర్వపరములందులేని జగత్తు స్వప్నదృష్టాంతమున అసత్యమనియు సృష్టికి పూర్వపరములందున్న ఆత్మయే మధ్యను అనఁగా సృష్టికాలమందును, సువర్ణ దృష్టాంతమున సత్యమనియుంభావము. ఇచట—"ఆదావంతే చ యన్నాస్తి మధ్యే తత్స్వప్నవన్నహి, మధ్యేఽపిచ తదేవాస్తి భూషాభావేసువర్ణవత్" అను వచనము ప్రమాణము. కావున మాయాకార్యమగు విషయము ఆభాస మాత్రము. ఏతదవభాసకమగు ప్రజ్ఞానమే పరమార్థమని తాత్పర్యము. ౨

అవ. ఇపుడు "పౌర్వాపర్యే పూర్వదౌర్బల్యం ప్రకృతివత్," అను న్యాయమున ముందుకలిగిన కర్తభోక్తయను బుద్ధి తరువాతఁ గలిగిన బ్రహ్మాత్మజ్ఞానముచే బాధింపఁబడునని నిరూపించుచున్నారు:—

మూ. పూర్వబుద్ధి మబాధిత్వా నోత్తరా జాయతే మతిః,
దృశిరేకస్స్వయం సిద్ధః ఫలత్వాత్స న బాధ్యతే. 3

తా. మొదటఁ గలిగిన బుద్ధిని బాధింపక రెండవబుద్ధి కలుగదు. శుక్తియని యెఱుఁగమిచేఁ గలిగిన రజతబుద్ధిని బాధించియే శుక్తియనుబుద్ధి కలుగును. ఇట్లుపూర్వమగు కర్త్రాదిబుద్ధిని బాధించియే ఉత్తరమగు ఆత్మతత్త్వజ్ఞానము గలుగును. స్వయముగ సిద్ధమై యేకమగువిజ్ఞానము ఫలమగుటచే దేనిచేతను బాధింపఁబడదు.

1 ప్ర. మొదటఁగలిగినబుద్ధి ఉత్తరబుద్ధిని ఏల బాధింపఁగూడదు?

ఉ. బాధయనఁగా ప్రసక్త (ప్రాప్తించినదానికి) నిషేధము. పూర్వబుద్ధి ప్రసక్తముకాఁగా దీనిని ఉత్తరబుద్ధి నిషేధించునుగాని అప్రసక్తమగు ఉత్తరబుద్ధిని పూర్వబుద్ధి బాధింపలేదు.

2. ప్ర. ఆత్మజ్ఞానమునకు బాధ కలుగదా?

ఉ. ఉపనిషజ్జన్యము, తత్త్వావేదకము, సర్వాంతరమునగు ఆత్మజ్ఞానము కాలత్రయమందును ప్రకాశించుచుండుటచే బాధింపఁబడదు.

3. ప్ర. ఆయాత్మజ్ఞానస్వరూపమెట్టిది?

ఉ. బ్రహ్మాత్మాకారాంతఃకరణవృత్తిఫలితము స్వయంసిద్ధమునగు అపరోక్షస్ఫూర్తియే ఆత్మజ్ఞానము. ఇది దృశి(దృక్కు) అనఁబడును.

4. ప్ర. స్వయంసిద్ధమననేమి?

ఉ. పరాపేక్షలేని సత్తాస్ఫూర్తులు గలుగుటయే.

5 ప్ర. పరాపేక్షగల సత్తాస్ఫూర్తులుగలదేది?

ఉ. జడము, అనిత్యమునగు బాహ్యప్రపంచమంతయు ఆత్మసత్తాస్ఫూర్తులచేతనే సత్తాస్ఫూర్తులుఁగలదిగాని జడమగు ప్రపంచమున కివిలేవు.

6. ప్ర. అదియెట్లు?

ఉ. అస్తి, భాతి, ప్రియం, రూపం, నామ; అని జగత్తునకు అయిదు అవయవములు గలవు. ఇందు మొదటిమూఁడును ఆత్మస్వరూపము. చివరవి రెండును జగద్రూపము. ఘటము కలదు. ఘటము ఇదిగో అనునపుడు 'కలదు' అను సత్తయు, 'ఇదిగో' అనే స్ఫూర్తియు ఆత్మసంబంధములై బాహ్యపదార్థములందు వ్యాపించియుండునుగాని ఘటాదివస్తువులకు స్వతః సత్తాస్ఫూర్తులు లేవు. ఎట్లన, బూరెలోని పప్పునకుఁగలతీపి బెల్లము దేకాని పప్పునకు లేదు. బెల్లమునకది సహజము. బెల్లమువలన పప్పునకు తీపికలిగెను. ఇట్లే ఆత్మయొక్కసత్తాస్ఫూర్తులు పరాపేక్షలేక సహజములు, ఘటాది బాహ్యవస్తువులయొక్క సత్తాస్ఫూర్తులు ఆత్మాపేక్షవలనఁ గలిగినవి.

7 ప్ర. ఆత్మజ్ఞానమేల బాధింపఁబడదు?

ఉ. సహజము, ఫలమునగుటచే ఆత్మజ్ఞానము బాధింపఁబడదు.

8 ప్ర. ఫలమునకు బాధ యేల లేదు?

ఉ. సర్వజ్ఞానసాధారణము, సర్వవ్యవహారహేతువునగు ప్రకాశ రూపమునకు బాధలేదు.

9 ప్ర. నిత్యసిద్ధమొకదానికి ఫలమగునా?

ఉ. కాదు=కాకున్నను ధీవృత్తిచే వ్యక్తమగుటవలన ఫలమువలె ఫలమని నిర్దేశింపఁబడెను. "ఆవరణాభిభవార్థావృత్తిః" అని వ్యాప్తి అజ్ఞాననాశమునకై యపేక్షింపఁబడును. 3

అవ. వాక్యార్థవిచారణమువలనఁ గలిగిన బ్రహ్మాత్మజ్ఞానము దృఢాభ్యాసవశమున బాధింపఁబడఁదగదని నిరూపించి యా బ్రహ్మాత్మజ్ఞానసాధనమగు వాక్యార్థవిచారము తన్మూల

మగుపదార్థవిచారమువలనఁ గలుగునని శ్రుతిసిద్ధదృష్టాంతసహితముగఁ జెప్పుచున్నారు:—

మూ. ఇదం వన మతిక్రమ్య శోకమోహాదిదూషితమ్,
వనాద్గాంధారకో యద్వత్స్వాత్మానం ప్రతిపద్యతే. ౮

తా. శోకమోహాఖ్యవ్యాఘ్రతస్కరాదికృతబాధగల యీశరీరమనెడి వనమును దాటి గంధారదేశపురుషుఁడు వనమునుండి స్వస్థానమును బొందినట్లు, ఆప్తోపదేశమువలన స్వాత్మను బొందును. అనఁగా, దేహాదికమును అనాత్మనుగా నుపేక్షించి అంతటను నిండి నిషేధానర్హమును ఆత్మను తత్త్వంపదార్థశోధనద్వారమున స్వరూపముగఁ దెలియును. ఇందుకు దృష్టాంతము:—గంధారదేశమందలిపురుషుఁ డొకఁడు దొంగలచే కన్నులకు గంతలు కట్టఁబడి కంటకవృశ్చికసర్పవ్యాఘ్రాద్యుపద్రవసంకులమగు మహారణ్యమునఁ బడవేయఁబడి ఆబాధలు పడలేక దుఃఖించుచు దయాళువగు మహామహుని కరుణ వడసి, కన్నులకుఁగట్టిన గంతను విప్పి తమదేశమునకుఁ బోవుమార్గమును జూపఁగా, మార్గమందున్నవారినడుగుచు మధ్యగ్రామములను దాటి తీవ్రమగు సద్బుద్ధితో నాప్తోపదిష్టమార్గమును విడువక స్వగ్రామమును బొంది సుఖించెను. ఈప్రకారముగ సంసారియగు నీజీవుఁడు, అవిద్యారాగాదితస్కరులచే మిథ్యాజ్ఞానమను గంత కట్టఁబడి, వివేకమను కన్ను మూతపడఁగా, తన దేశమునుండి దేహారణ్యమున (ప్రవేశించి సాంసారికదుఃఖపీడితుఁడై,) యీ బంధమునుండి మోక్షమునపేక్షించుచు నెన్నటికో నొక శ్రోత్రియుఁడును దయాళువునగు బ్రహ్మవిత్సద్గురువుచే అజ్ఞానమనెడి కనుగంత విప్పఁబడి స్వదేశబ్రహ్మమార్గము బోధింపఁబడి అన్వయవ్యతిరేకములచే విమర్శించుచు సద్గురూక్తలక్ష్యమును వదలక ఆత్మస్వరూపమును బొందును.

ప్ర. అన్వయవ్యతిరేకములననేమి?

ఉ. వేదాంతశాస్త్రమందు నివి క్రమముగ అనువృత్తి, వ్యావృత్తి యనఁబడును. ఎట్లనఁగా, ఆత్మ జాగ్రత్స్వప్నసుషుప్తులందు అనువృత్తమై యెడతెగకయున్నది. జాగ్రత్తు స్వప్నమందును, స్వప్నము సుషుప్తియందును, వ్యావృత్తమైనవి, అనఁగా తొలఁగినవనుట. ౪

ఇది ఆత్మజ్ఞానోత్పత్తిప్రకరణము.

---

శ్రీః

# ఉపదేశసాహస్రి

(శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్య ప్రణీతము.)

## శ్లోకప్రబంధము - తృతీయప్రకరణము.

### 3. ఈశ్వరాత్మప్రకరణము.

అవ. ఈ బ్రహ్మవిద్యయందు ప్రతిపాద్యమానమగు బ్రహ్మము ప్రత్యగాత్మకంటె వేఱుగఁ దెలియవలెనా? ప్రత్యగాత్మతో నభేదముగఁ దెలియవలెనా? "ద్వాసుపర్ణా" అను శ్రుతి ఆత్మ భేదమును, "అయమాత్మా బ్రహ్మ" అను శ్రుతి ఆత్మైక్యమును జెప్పుటచేఁ గలిగిన సంశయమును నివారించు శ్రుతినిఁ జెప్పుచు వాక్యార్థమును విశదపఱుచుచున్నారు:—

మూ. ఈశ్వరశ్చే దనాత్మా స్యాన్నాసావస్మీతి ధారయేత్,
ఆత్మా చేదీశ్వరోఽస్మీతి విద్యా సాఽన్యనివర్తికా. ౧

తా. సర్వజగత్కారణుఁడు సత్యజ్ఞానానంతానందస్వరూపుఁడునగు నీశ్వరుఁడు జీవాత్మకంటె వేఱయ్యెనేని మేర్వాదికమువలె విషయమును

పరోక్షమును నగును. మఱియు ముముక్షువు నేనే యీశ్వరుఁడనని తనను యథార్థముగఁ దెలియక పోవలసియుండును. అట్లేని తత్త్వమస్యాదిమహా వాక్యమునకు భంగముగలుగును. ఇంతయేకాక ఆత్మయనెడి స్వరూపమును బొందుదురు. ఈయర్థమును శిష్యులకు బోధింతురను నర్థమిచ్చు "ఆత్మేతి రూపం గచ్ఛంతి గ్రాహయంతి," అను న్యాయమును వ్యర్థమగును. ఈ ముముక్షువు ఈశ్వరుఁడ నేనే యనియు, నితరము ఆరోపితమగుటవలన బాధ్యమై సత్యముకాదనియుఁ దెలియునేని, శ్రుతిన్యాయములకు విరోధ మించుకేనియుఁ గలుగదు. వివిధభేదవిహీన ప్రత్యగ్బ్రహ్మైక్యావలంబిని యగు ఆ విద్యయే సంసారమూలకమగు నవిద్యను దొలఁగించునది.

1 ప్ర. బ్రహ్మజ్ఞానమునకు ఫలమేమి?

ఉ. బ్రహ్మభావమే (తాను బ్రహ్మమేయని భావించుట) ఫలము.

2 ప్ర. ఇందుకేమి ప్రమాణము?

ఉ. "బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి, బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి" అను శ్రుతి ప్రమాణము.

3 ప్ర. ఇట్లన్యమెఱిఁగినవాఁడు అన్యభావమును పొందునా?

ఉ. అన్యమగు దేహాదిభావమున్నను, నశించినను అన్యమగు ఆదేహాది ప్రాప్తిలేదు.

4 ప్ర. ఏల యుండదు?

ఉ. అబాధ్యమగు సత్యవస్తువు వేఱొకటి లేనేలేదు.

5 ప్ర. అట్లేని "ద్వాసుపర్ణా" అని భేదమును చెప్పెడి శ్రుతి వ్యర్థమేనా?

ఉ. ఆ భేదజ్ఞానము ఫలముకానందునను భేదదర్శికి "అన్యోఽసావన్యోఽహమస్మీతి న స వేద," అని కలిగిన ధీవృత్తి అజ్ఞానమగుటచే ఫలము

కాదని నిందింపఁబడుటవలనను "ద్వాసుపర్ణా" అను శ్రుతి అవిద్యాకల్పిత భేదమును అనువదించి చెప్పుటవలనను వ్యర్థముకాదు. కావున సకలోపనిషత్తులకునుఫలమగు ఐక్యబోధయందే ముఖ్యతాత్పర్యము. ౧

అవ. వేదాంతములకు అభేదబోధయందే తాత్పర్య మనుమాటనే ప్రకారాంతముగ దృఢపఱుచుచున్నారు:—

మూ. ఆత్మనోఽన్యస్య చేద్ధర్మా అస్థూలత్వాదయో మతాః,
అజ్ఞేయత్వేఽస్య కిం తైః స్యాదాత్మత్వేత్వన్యధీహ్నుతిః. ౨

తా. అస్థూలమనణ్వహ్రస్వము మొదలగు ధర్మములు ప్రత్యగాత్మకంటె నన్యుఁడగు ఈశ్వరునిధర్మము లయ్యెనేని, ముముక్షువున కీధర్మములు దెలియకపోవుటవలనగలిగిన నష్టమేమియులేదు. ఏలయనఁగా. ఈశ్వరుఁడు తాను కాఁడు, తనకంటె నన్యుఁడు, అని తలఁచుటచేఁ దనను జెందియున్న స్థూలత్వాదిభ్రాంతి వదలకయే యుండును. మఱియుఁ, ఎప్పుడు "అస్థూలమనణ్వహ్రస్వ"మ్మిత్యాదిశ్రౌతధర్మవంతుఁడును, పరమాత్మయఁనగు ఈశ్వరుఁడు ప్రత్యగాత్మయగు తానుగాఁ దెలియునో అపుడు ఆపరమాత్మయు తానే కనుక భ్రాంతిగృహీతము, పరాగ్దేహధర్మమునగు స్థూలత్వాదికము బాధింపఁబడును. ఇట్టిఫలము గలుగుటంబట్టి ప్రత్యగాత్మపరమాత్మల నైక్యమును బోధించుటయందే శ్రుతులకు ముఖ్యతాత్పర్యమని భావము.

1 ప్రత్యగాత్మ యననేమి?

ఉ. "ప్రాతిలోమ్యేనాంచతీతి ప్రత్యక్ స చాసావాత్మా" అను వ్యుత్పత్తివలన అనృతజడదుఃఖాత్మకమగు దేహాదికముకంటె విలక్షణమైన సచ్చిత్సుఖస్వరూపమగు ఆత్మ ప్రత్యగాత్మయనఁబడును.

అవ. "కస్మిన్నాకాశ ఓతశ్చ ప్రోతశ్చ," అని కార్య కారణాత్మకజగత్తున కాధారమేది యని యడిగిన ప్రశ్న కుత్తరముగ అక్షరమని ఉపక్రమించి మధ్యను "ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి" అని దానినే పరామర్శించి "అదృష్టం ద్రష్టృ"అని చూడఁబడక సకలమును జూచునదని ఆ అక్షరస్వభావమును వర్ణించుచు "ఏతస్మిన్ను ఖలు అక్షరే గార్గ్యాకాశ ఓతశ్చ ప్రోతశ్చ" అని ఉపసంహరించుటవలన బ్రాహ్మణవాక్యమునకంతకు ఈశ్వరుఁడే యర్థమని నిరూపింపఁ బడెను. ఆ బ్రాహ్మణమందు "నాన్యదతోఽస్తి ద్రష్టృశ్రోతృ మంతృవిజ్ఞాతృ" అని ద్రష్టృత్వాదిధర్మోపలక్షితమగు ప్రత్య గాత్మకు అక్షరబ్రహ్మముతో నభేదముకూడ నిశ్చయింపఁ బడెను. కావున జీవేశ్వరుల కభేదమే శాస్త్రసమ్మతము అని ప్రత్య గాత్మయందధ్యాసలబ్ధమగు స్థూలత్వాదిప్రతిషేధపరమగు నీవాక్యము నాదరింపవలయుననే యభిప్రాయముతోఁ జెప్పు చున్నారు.—

మూ. మిథ్యాధ్యాసనిషేధార్థంతతోఽస్థూలాదిగృహ్యతామ్,
పరత్ర చేన్నిషేధార్థం శూన్యతావర్ణనం హి తత్. 3

తా. కాఁబట్టి అస్థూలత్వాదికము మిథ్యాధ్యాసజ్ఞాననివృత్తికై ప్రత్యగాత్మకు విశేషణముగ గ్రహించవలెను. అట్లుకాదేని అస్థూలాదివర్ణ నము ప్రత్యగాత్మకంటె భిన్నము జడమునగు దేహాదికమునకు స్థౌల్యాదిసం బంధముండుటచే నిష్ఫలమే యగును. మఱియు ప్రత్యగాత్మకంటె నన్యుఁ

డగు నీశ్వరుఁడు నిషేధవర్గములోఁ జేరినేని యతనికి ఈశ్వరత్వమే సంభవింపదు. అప్పుడును అస్థూలమిత్యాదివాక్యము నిష్ఫలమే యగును. కావున అస్థూలత్వాదిధర్మములు అనాత్మయగు దేహసంబద్ధములు కావు గనుక, ప్రత్యగాత్మకు ఈశ్వరునితో నభేదమును భావింపవలెను. 3

అవ. మఱియు, ప్రత్యగాత్మకంటె భిన్నమగు దేహమందు స్థూలత్వాదిప్రతిషేధము చెప్పఁబడెనేని అప్రాప్తప్రతిషేధము నిష్ఫలప్రతిషేధము నగునని చెప్పుట:—

మూ. బుభుత్సోర్యది చాన్యత్ర ప్రత్యగాత్మన ఇష్యతే,
అప్రాణో హ్యమనా శ్శుభ్ర ఇతి చానర్థకం వచః. ౪

తా. జీవునకు దేహముతో తాదాత్మ్యములేదని చెప్పుటకై జీవుఁడు స్థూలుఁడుకాఁడని చెప్పఁబడెను. మొదట సంసారిని అనుకొని తర్వాత ఆత్మతత్త్వము నెఱుఁగఁగోరిన జీవుఁడు ప్రాణమనస్సులతోఁగూడి యుండుటచేత విమర్శింపఁగా జీవుఁడు ప్రాణమనస్సులు లేనివాఁడని చెప్పఁబడెను. కాని యెన్నఁడు ప్రాణమనస్సులులేని ఈశ్వరునిగుఱించి "అప్రాణో హ్యమనాః," అను శ్రుతి ప్రవర్తింపలేదు. ఈశ్రుతి ఈశ్వరునియందే ప్రవర్తింపఁజేసిన యెడల ప్రాప్తిలేని నిషేధము చెప్పఁగూడదు. కనుక శ్రుతినిషేధము వ్యర్థము కావలసివచ్చును. కాఁబట్టి ప్రత్యగాత్మకంటె నన్యమగు నీశ్వరునందు ప్రాణములు లేనందున 'అప్రాణః,' అను విశేషణము వ్యర్థమగును. ౪

ఇది ఈశ్వరాత్మప్రకరణము.

శ్రీః.

# ఉపదేశసాహస్రి

(శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యప్రణీతము.)

## శ్లోకప్రబంధము - చతుర్థప్రకరణము.



### ౪. తత్త్వజ్ఞానప్రకరణము.

అవ. జీవాత్మపరమాత్మల కైక్యజ్ఞానము మోక్షసాధన మని చెప్పఁబడెను. సంచితానేకకర్మములు తప్పక ఫలమిచ్చునవై ప్రతిబంధించుచుండఁగా జీవపరమాత్మలకు ఐక్యము దుర్లభమగునను శంకకుత్తరము.—

మూ. అహంప్రత్యయబీజం యదహంప్రత్యయవర్థితమ్,
నాహంప్రత్యయవహ్న్యుష్టం కథం కర్మ ప్రరోహతి.౧

తా. అహంకారమువలనఁ గలుగుచు నంతఃకరణమందు సంచితాకారముగనున్న కర్మజాతమనెడి బీజము నేను కర్తనుగాను భోక్తనుగాను బ్రహ్మమనే యగుదునను జ్ఞానాగ్నిచే వేచఁబడినదై యెట్లు మొలచును? అనఁగా జ్ఞానిచేఁ జేయఁబడిన కర్మము సంచితముతోఁగూడ వేఁచిన గింజలవలె తిరిగి

సంసారాంకురమును పుట్టింపలేదు. ఇందుకు "క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే" అను శ్రుతియు "జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా" అనుస్మృతియుం బ్రమాణములు.

1 ప్ర. అహంప్రత్యయమననేమి?

ఉ. 1 ఆత్మకాని దేహమును ఆత్మయనుకొను అహంకారము అహంప్రత్యయము.

2. చిదాభాసయుక్తమగు అంతఃకరణమునందు ఆత్మనేనని స్ఫురించుటచే అంతఃకరణము అహంప్రత్యయవత్తనఁబడును.

2 ప్ర. జ్ఞానికి కర్మమేల లేకపోవలెను?

ఉ. మూలాజ్ఞానము నశింపక జ్ఞానముదయింపదుగనుక ఆమూలాజ్ఞానకార్యమగు అంతఃకరణము నశించినందున నిరాధారమగు కర్మము నిలువదు.

3 ప్ర. జ్ఞాని కర్మమునేమియుఁ జేయక ఊరకుండునా?

ఉ. జ్ఞానిచేయుకర్మము దగ్ధపటన్యాయమున కర్మాభాసమై కార్యకారి కానేరదు. కావున మోక్షమునకు ప్రతిబంధక మనుశంక కవసరము లేదు.

4 ప్ర. దగ్ధపటన్యాయమెట్టిది?

ఉ. బట్టమడత కాల్పఁబడఁగ బట్టవలె కనుపించుచున్నను, అది చలిని తీర్పఁజాలదు. ౧

అవ. జ్ఞానికైనను భిక్షాటనాదికర్మము ఫలవంతమేకద. ఇట్లే అదృష్టఫలమగు కర్మముకూడ ఫలవంతము కావచ్చునని శంక.—

మూ. దృష్టవచ్చేత్పునరోహం స్యాన్నాన్యకర్మా స ఇష్యతే,
తన్నిరోధేకథంతత్స్యాత్పృచ్ఛామోవస్తదుచ్యతామ్.

తా. శాస్త్రవిహితమై చేయఁబడు కర్మము భిక్షాటనాదికమువలె దృష్టఫలకమేని, తిరిగి సంసారహేతువేయగునని శంకింపరాదు. ఏలయనఁగా జ్ఞానావిరోధియగు ప్రారబ్ధమువలన నాభిక్షాటనాదికము గలుగును. జ్ఞానవిరోధియగు నహంకారమును బురస్కరించుకొని చేయఁబడు కర్మము ప్రారబ్ధాధీనముకాదు; ఆశ్రయమగునంతఃకరణములేనిది కర్మమెట్లుకలుగునో నీవు చెప్పుము. అని పూర్వపక్షి అడుగుచున్నాఁడు.—

1 ప్ర. ఇచట కర్మమననేమి?

ఉ. భిక్షాటనాదికము.

2 ప్ర. జ్ఞానమువలన అజ్ఞానము నశింపఁగా తన్మూలకాహంకారము నశించును. అపుడు ప్రారబ్ధముకూడ పోఁగా భిక్షాటనాదిక మెట్లు కలుగును?

ఉ. ఉత్తరము క్రిందిశ్లోకమునఁ జెప్పఁబడును.

మూ. దేహాద్యారంభసామర్థ్యాత్ జ్ఞానం సద్విషయం త్వయి,
అభిభూయ ఫలం కుర్యాత్కర్మాంతే జ్ఞానముద్భవేత్.

తా. ప్రమాణజనితమగుటచే ప్రబలమైనను బ్రహ్మాకారజ్ఞానమున విదేహకైవల్యరూపఫలమును గలుగనీయక నిరాకరించి ప్రారబ్ధఫలాత్మకమగు కర్మము జ్ఞానివైన నీకుఁగూడ దేహాద్యారంభమందు శక్తిగలదగుటచే దేహాభాసజగదాభాసరూపమగు స్వఫలమును తప్పక కలిగించును. ప్రారబ్ధఫలభోగము ముగియఁగనే జ్ఞానము ప్రతిబంధరహితముగఁ గలిగి వర్తమానకార్య

సంపాదకమగు అవిద్యాలేశమునుగూడ బాధించి విద్వాంసుని స్వారాజ్యమందు స్థాపించును. 3

అవ. జ్ఞానికిని ప్రారబ్ధవశమున ఫలభోగము తప్పదు, కాని అనారబ్ధములగు సంచితాగామికర్మఫలములు ఉండవు, అనుమాట యెట్లు ఉపపన్నమగును? సర్వము అజ్ఞానకార్యమే కనుక ఆశ్రయమగు నజ్ఞానము నశింపఁగానే ప్రారబ్ధాగామిసంచితములు మూఁడును సమముగ నష్టమగునందువేని యిట విశేషము గలదని చెప్పుచున్నారు:—

మూ. ఆరబ్ధస్య ఫలే హ్యేతే భోగో జ్ఞానం చ కర్మణః,
అవిరోధ స్తయోర్యుక్తో వైధర్మ్యం చేతరస్య తు. ౪

తా. ఆరబ్ధకర్మమునకు భోగము జ్ఞానము నను నీరెండును ఫలములే యగుటచే భోగము జ్ఞానమునుగాని, జ్ఞానము భోగమునుగాని ప్రతిబంధింపనేరవు. ప్రారబ్ధముకంటె నన్యములగు సంచితాగామికర్మములకు జ్ఞానము విరోధియై తన్నాశకమగును. జ్ఞానము స్వకారణప్రారబ్ధజన్యమగు శరీరాదుల యపేక్ష గలిగేయుండును. వృత్తిజ్ఞానము శరీరాపేక్షలేకుండ గలుగనేరదని భావము. జ్ఞానోత్పత్తికి సాధనమగు ఉత్తమశరీరము కర్మవిశేషములచే (స్వఫలదానముకొఱకు) ఆరంభింపఁబడఁగా (ఆప్రారబ్ధవశమున) జ్ఞానహేతుకర్మములవలన జ్ఞానము కలుగునని యొప్పవలసియున్నది. కావున ఆరబ్ధదేహమందు తద్భోగము తప్పనందున భోగప్రదమగు కర్మము ఆరబ్ధశరీరమునాశ్రయించి యుండును. జ్ఞానము అజ్ఞాననివృత్తిరూపఫలమిచ్చుచున్నను సద్యోభోగైకనాశ్యము దేహారంభకమునగు కర్మముచే నూహింపఁబడునట్టి ప్రారబ్ధరూపావిద్యాలేశమును (ఉపజీవ్యవిరోధములేనందున) నివ

రింపలేదు. కనుక ప్రారబ్ధఫలమగు కర్మమునకు జ్ఞానముతో నిరోధములేదు. అనారబ్ధఫలములగు సంచితాగామికర్మములకు అకర్త్రాత్మతత్త్వజ్ఞానముతో విరోధముండుటవలన కర్తృస్వభావము నివర్తించఁగానే ఆశ్రయాభావము వలన ఆగామిసంచితకర్మములు నశించునుగాన సంచితాగాములకు జ్ఞానముతో సహస్థితి సంభవింపదు. ప్రారబ్ధభోగము జ్ఞానముతోడనే పుట్టుటచే విరోధము లేనిదై సహస్థితిని పొందియుండును. అని యీమూఁడింటికి నిట్టిభేదము కలదు.

ప్ర. ఉపజీవ్యవిరోధమననేమి?

ఉ. తాను దేని నాశ్రయించి పుట్టినదో దానినే బాధించుట. ప్రారబ్ధకర్మమువలనఁ గలిగిన జ్ఞానము భవకారణమగు ప్రారబ్ధమును బాధించుట. అది యిచట లేదు. ౪

అవ. జ్ఞానికిసయితము దేహారంభక కర్మజన్యమగు ఫలభోగముండెనేని యెన్నఁడైనను దేహాత్మాభిమానము సంభవించుటవలన దానినుండి పుట్టిన దురితప్రతిబంధవశమున మోక్షప్రతిబంధమును నుండునందు వేని అది సరికాదని నిరూపించుట.

మూ. దేహాత్మజ్ఞానవత్ జ్ఞానం దేహాత్మజ్ఞానబాధకమ్,
ఆత్మన్యేవ భవేద్యస్య స నేచ్ఛన్నపి ముచ్యతే.
తత స్సర్వమిదం సిద్ధం ప్రయోగోఽస్మాభిరీరితః. ౫౪

తా. వివేకరహితుఁడగు ప్రాకృతునకు దేహమందు నేను మనుష్యుఁడనను జ్ఞానము నిస్సంశయముగ నుండునట్లు దేహాద్యహంకారపర్యంతకూటమునకు సాక్షియగు ముఖ్యాత్మయందు "బ్రహ్మైవాహమస్మి" అనుజ్ఞానము సంశయవిపర్యయములులేక దృఢముగనుండు. వాఁడు కోరకున్నను దేహాత్మ

జ్ఞానమును బాధించెడి స్వరూపజ్ఞానమహిమవలన ననర్థరాశిని గోటమీటి ముక్తిని ముఖ్యముగ బొందును. సద్గురుప్రసాదమున ఆత్మతత్త్వసాక్షాత్కారముగలవానికి మోక్షము ప్రతిబంధరహితముగ సిద్ధించునని భావము. ఇందుకు "భిద్యతే హృదయగ్రంథిశ్ఛిద్యంతే సర్వసంశయాః, క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే" యీ మొదలగు శ్రుతులును, "బీజాన్యగ్న్యుపదగ్ధాని న రోహంతి యథా పునః, జ్ఞానదగ్ధైస్తథా క్లేశైర్నాత్మా సంబధ్యతే పునః. యథా పర్వతమాదీప్తం నాశ్రయంతి మృగద్విజాః, తద్వద్బ్రహ్మవిదో దోషా నాశ్రయంతే కదాచన. మంత్రౌషధబలైర్యద్వజ్జీర్యతే భక్షితం విషం, తద్వత్సర్వాణి కర్మాణి జీర్యంతే జ్ఞానినః క్షణాత్." అను స్మృతులును ప్రమాణములు. వీనికర్థము:—పరమాత్మసాక్షాత్కారముగలవానికి సర్వానర్థకారణమగు అహంకారచిదాత్మలకైక్యరూపమగు గ్రంథి విడిపోఁగా ఆత్మ దేహాదికములకంటె వేఱగునా కాదా? దేహముకంటె వేఱైనను కర్తృత్వాదిధర్మములు ఆత్మకుఁ గలవా లేవా? కర్తృత్వాదిధర్మములు లేకున్నను ఆత్మకు బ్రహ్మముతో భేదమున్నదా లేదా? భేదములేకున్నను కేవలజ్ఞానమే ముక్తిసాధనమా? లేక కర్మసహితజ్ఞానము ముక్తిసాధనమా? ఈ మొదలగు సంశయములు, సూర్యోదయముకాఁగా మంచువిడినట్లు విడిపోవును. స్మృ. వేచిన గింజలు మొలవనివిధమున జ్ఞానదగ్ధమగు క్లేశము లాత్మకంటవు. మెండుగ మండుచున్నకొండదరికి పక్షిమృగసంఘము చేరనట్లు బ్రహ్మవేత్తను దోషములు చేరవు. మంత్రౌషధబలముచే మ్రింగిన విషమైనను జీర్ణమగునట్లు బ్రహ్మవేత్త ఆభాసరూపముగఁజేయు కర్మములు వీనిని బాధింపక తామే క్షీణించును. జ్ఞానికి ప్రారబ్ధకర్మమువలన ప్రతిబంధము లేదనియు, ఆకర్మసంశ్లేషములేదనియు శ్రుతిస్మృతులు ఘోషించుచున్నవి. యుక్తియుం జెప్పఁబడెను.

1 ప్ర. కర్మకు ఆభాసరూపమేది?

ఉ. లోకులు "యజ్ఞాద్యధికారము నాకేకలదు, నేను శ్రోత్రియుండను, యజ్ఞము చేయుచున్నాను. నాకు స్వర్గభోగము లభించును," అను దృఢాభిమానముతోఁ గర్మమును జేయుదురు. కర్మకులమధ్యనున్నపుడు జ్ఞాని ఆశ్రమోచిత కర్మములను "నేను చేయుచున్నా"నను అహంకారగ్రంథి లేకయే చేయును. ఎట్లనఁగా వెట్టికి పెట్టిన కూలివాఁడు కర్మమందు పట్టుదలలేకయే చేయును. మఱియు, పరపురుషునిపొందు గోరెడి వనిత గృహకృత్యములను పట్టుదలలేక పరపురుషసంగసుఖమునే అభిలషించుచు చేయుచుండును. ఇట్లు పరబ్రహ్మానందసుఖరుచి యెఱిఁగినయోగి కర్మములను అహంకారరహితముగఁ జేయుచున్నను నిమిషమైనను పరబ్రహ్మానందసుఖమును మఱువఁడు. ఇందుకు "పరబ్రహ్మరతో యోగీ సంసారమనువర్తతే, పరపురుషరతా నారీ భర్తారమనువర్తతే," అను స్మృతి ప్రమాణము. కావున బ్రహ్మవేత్తచేయు కర్మము దగ్ధపటమువలె ఆభాసమాత్రమే-కాని కార్యకారి కాదు.

ఇది తత్త్వజ్ఞానప్రకరణము.

శ్రీః

# ఉపదేశసాహస్రి

(శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యప్రణీతము.)

## శ్లోకప్రబంధము — పంచమప్రకరణము.

### ౫. బుద్ధ్యపరాధప్రకరణము.

అవ. ఇదివఱకుఁ జెప్పిన శ్రుతిస్మృతియుక్తులచే బ్రహ్మాత్మైక్యజ్ఞానము మోక్షసాధనమైయుండఁగా అందఱును పరమపురుషార్థమును గోరువారైనను "అహం బ్రహ్మాస్మి" అని ఆత్మరూపమునేల గ్రహింపరు? అను శంక కుత్తరము.—

మూ. మూత్రాశంకో యథోదంకో నాగ్రహీదమృతం యథా,
కర్మనాశభయాజ్జంతో రాత్మజ్ఞానాగ్రహ స్తథా. ౧

తా. ఇచట నొకగాథ కలదు:—ఉదంకుఁడను నొకఋషి తపస్సుచే శ్రీమహావిష్ణువును భక్తితో నారాధించి సంతుష్టుఁడగు నామహావిష్ణువును దేవతలచే రక్షింపఁబడు నమృతమునిమ్మని కోరఁగా విష్ణుమూర్తి యీయుదంకున కమృతమిమ్మని దేవేంద్రునితో నుడివెను. అప్పుడింద్రుఁడు దేవతాభోజనమగునమృతము నీనరునకేల యివ్వవలెనను నసూయతో విష్ణ్వాజ్ఞాపా

లకుఁడగుచునే చండాలవేషముదాల్చి, అమృతకలశమును పాత్రికసుపుక్రింద నుంచుకొని ఉదంకునకు సత్యమైన అమృతమునే యియ్యనారంభించెను. ఉదంకుఁ డాయమృతము సత్యమైనదైనప్పటికి చండాలుని మూత్రమను శంకతోను జాతిభ్రంశభయముతోను తనకమృతమక్కరలేదని నిరాకరించెను. ఉదంకునికి అమృతమందు వాంఛలేనట్లు అజ్ఞానావృతజంతువునకు స్వాశ్రమోచితకర్మ నశించునేమోయను భయమువలన ఆత్మజ్ఞానమందు ఆదరము కలుగదు.

1 ప్ర. కర్మనాశమగు ననుభయ మెట్లు కలుగును?

ఉ. విహితకర్మముల చేయక మానినయెడల వర్ణాశ్రమోచితమగు కర్మ నశించునేమోయను భయము గలుగును.

2 ప్ర. ఆత్మస్వరూపమును గ్రహింపకపోవుటకుఁ గారణములెవ్వి?

ఉ. పదార్థస్వరూపము తెలియకపోవుటయు, విపరీతజ్ఞానమును, వేదప్రోక్తాత్మస్వరూపమును గ్రహింపకపోవుటకుఁ గారణములు. ౧

అవ. దృష్టాంతమందు దేవేంద్రుఁడు చండాలవేషముతోనుండుట, అమృతమును మూత్రాశయస్థానమందుంచుట, అనునివి జాత్యంతరము మూత్రమునను భ్రమనుబుట్టించుటచే నమృతమును గ్రహింపకపోవుటకు హేతువులుగనున్నవి. ఆప్రకారము బ్రహ్మభూతమగు ఆత్మను దెలియకపోవుటకుఁ దగిన భ్రమకారణములేదు అను శంక కుత్తరము.—

మూ. బుద్ధిస్థశ్చలతీవాత్మా ధ్యాయతీవ చ దృశ్యతే,
నౌగతస్య యథా వృక్షా స్తద్వత్సంసారవిభ్రమః. ౨

తా. అనాద్యవిద్యచే స్వాత్మయందధ్యస్తమగు లింగశరీరమందు నేనను అభిమానముతోఁ గూడిన యాత్మ లింగశరీరసంజ్ఞగల బుద్ధి చలించుచుండఁగా తాను చలించుచున్నట్లు తోఁచునుగాని నిష్క్రియమగు ఆత్మ వాస్తవముగఁ జలింపదు. ఆబుద్ధి నిశ్చలమై ధ్యానించుచుండఁగా ఆత్మ నిశ్చలమై ధ్యానించుచున్నట్లు తోఁచును, కాని వాస్తవముగ ధ్యానింపదు. చలనములేదేని తత్ప్రతియోగియగు నిశ్చలత్వముంగలుగదు. అనేకవికారములుగల బుద్ధితో ఆత్మకు తాదాత్మ్యముండుటవలన నట్టి వివేకములేని యవస్థయందు నేను సంసారినను విపరీతనిశ్చయరూపదోషముండుటవలన లోకులు శ్రుత్యుక్తమగు బ్రహ్మభావమును గ్రహింపలేరు. పడవ నడచుచుండఁగా పడవలోనున్నవానికి తీరమందుండు వృక్షములు చలించునట్లు విపరీతముగఁ దోఁచును. ఇట్లే బుద్ధిచలనాదికము ఆత్మయందు అజ్ఞానమువలన నారోపింపఁబడును. ౨

అవ. పైనిజెప్పిన దృష్టాంతయుక్తమగు నర్థమును విశదపఱుచుచున్నారు:—

మూ. నౌస్థస్య ప్రాతిలోమ్యేన నగానాం గమనం యథా,
ఆత్మన స్సంసృతి స్తద్వద్ధ్యాయతీవేతి హి శ్రుతిః. ౩

తా. నీటిలో నావ నడచుచుండఁగా పడవలోనున్నవానికి నదియొడ్డుననుండు వృక్షములు కదలుచున్నట్లు యెట్లు తోఁచునో, అట్లే ఉపాధికంటె ఆత్మవేఱనెడి వివేకము లేకపోవుటచే, నాసకలవృత్తిసాక్షియు నిర్వికారుఁడునగు ఆత్మకు సంసారమున్నట్లు తోఁచుచున్నది. ఇచట, "స సమాన స్సన్నుభౌ లోకావనుసంచరతి ధ్యాయతీవ లేలాయతీవ." అను శ్రుతి ప్రమాణము. ౩

అవ. చెప్పిన దృష్టాంతానుగుణముగ దార్ష్టాంతికమును విశదపఱుచుచు ఉదాహరింపఁబడిన శ్రుతియొక్క అర్థమును చెప్పుచున్నారు:—

మూ. చైతన్యప్రతిబింబేన వ్యాప్తో బోధో హి జాయతే,
బుద్ధేశ్శబ్దాదిభిర్భాసస్తేన మోముహ్యతే జగత్. ౪

తా. జడమగు బుద్ధియందు చైతన్యము ప్రతిబింబించుటవలన బుద్ధికి విషయస్ఫూర్తి కలుగును. చిదాభాసవిశిష్టబుద్ధికే జ్ఞానమని పేరు. "చిదాభాసాంతధీవృత్తిః జ్ఞానమ్" అని విద్యారణ్యవచనము. ఈ బుద్ధివలన దేహాది విషయములు భాసించును. ఈ బుద్ధివృత్తియందే యిట్లు చైతన్యమును, దేహాదివిషయములును భాసింపుచుండఁగా, చిజ్జడములగు నీ రెండింటికిని వాస్తవమగు సంశ్లేషము లేకున్నను ఉన్నట్లు తోఁచుటవలన, పడవలోఁ గూర్చుండినవాఁడు పడవ నడచుచున్నట్లు తెలిసికొనలేక ఒడ్డున కదలకుండ నుండు చెట్లు వెనుకకుఁ బోవుచున్నట్లు తలంచురీతిని, చిదాత్మ తనకు ఉపాధియగు బుద్ధితో తాదాత్మ్యమును బొంది వివేచనచేయమిచే నాబుద్ధివికారములను తనయందు ఆరోపించుకొన్నును. ఈ యర్థమే "ధ్యాయతీవ"యను శ్రుతియందుఁగల "ఇవ" శబ్దముచే సూచింపఁబడెను. కనుక ఆత్మకు సంసారధర్మములు ఔపాధికములేకాని వాస్తవములుకావని భావము. ౪

అవ. సంసారాధ్యాసమునకు అవివేకమే కారణమగుట వలనపదార్థవివేచనముచేయువానికి"తత్త్వమసీ"త్యాదివాక్య విచారణమువలన "అహం బ్రహ్మాస్మి" అను ధీవృత్తి కలు

గఁగా ముక్తి సులభముకనుక ముముక్షువు పదార్థవివేచనమును తప్పక చేయవలయునని చెప్పుచున్నారు:—

మూ. చైతన్యభాస్యతాఽహమస్తాదర్థ్యం చ తదస్య యత్,
ఇదమంశప్రహాణే న పరస్సోఽనుభవో భవేత్. ౫

తా. జడమగు అహంకారము చైతన్యముచేత భాసింపఁబడుచు ఆత్మకుఁ గర్తృత్వభోక్తృత్వాదివ్యవహారమును నిర్వహించుచు ఇదమనిదమాత్మకమగుచుండఁగా ఇదమంశపరిత్యాగమువలన సర్వోత్తరమగు వాక్యార్థజన్యానుభవము స్ఫురించును.

1 ప్ర. 'అహం' అని భాసించునపుడు ఇదమంశమే స్ఫురించదు. కనుక ఇదమంశపరిత్యాగమెట్లు ఉపపన్నమగును ?

ఉ. సమాధిసుషుప్తిమూర్ఛలందు ఆత్మ భాసించుచున్నను, అహంకారము భాసింపనందున అహంకారము అనాత్మయని నిశ్చయింపఁబడినందున జాగరితాదులందు ఇదిగోయని గోచరింపకున్నను ఆయహంకారము చైతన్యావభాస్యమగుటవలన ఇదమంశముకలదియే. అనాత్మలక్షణమగు నిదమంశమును విడువఁగా బ్రహ్మాత్వానుభవము సిద్ధించును. ౫

ఇతి బుద్ధ్యపరాధప్రకరణము.

శ్రీః

# ఉపదేశసాహస్రి

(శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యప్రణీతము.)

## శ్లోకప్రబంధము — షష్ఠప్రకరణము.



### ౬. విశేషాపోహప్రకరణము.

అవ. పదార్థవివేకముగలవానికి వాక్యార్థవిచారము వలన "అహం బ్రహ్మ" అనుజ్ఞానము కలుగునని చెప్పఁబడెను. అందులో "అహం" అను పదమందు ఇదమంశను వదలఁగా సాక్షితత్త్వము శోధింపనగునని సూక్ష్మముగఁ జెప్పిన యంశము నేమందాధికారులం దనుగ్రహబుద్ధితో విశదముగ పదార్థ శోధనము చేయునుపాయ మీప్రకరణమందు నిరూపింపఁ బడుచున్నది:—

మూ. ఛిత్వా త్యక్తేన హస్తేన స్వయం నాత్మా విశిష్యతే,
తథా శిష్టేన సర్వేణ యేన యేన విశేష్యతే. ౧

తా. లోకములో చేతిని నఱికివేయఁగా మునుపటివలె పురుషుఁడు హస్తవంతుఁడని పిలువఁబడఁడు. అట్లే పూర్వము చిక్కినవాఁడు,బలిసినవాఁడు,

నల్లనివాఁడు, మనుష్యుఁడు, శ్రోత్రియుఁడు, వక్త, జ్ఞాని, సుఖి, యీ మొదలగు విశేషణములుగలవాఁడైనను శ్రీసద్గురుకటాక్షమున శ్రుతియుక్త్యనుభవమువలన దేహతాదాత్మ్యాభిమానము తొలఁగఁగనే ఆ కృశత్వపీవరత్వనీలత్వ నరత్వశ్రోత్రియత్వాది విశేషణములు నఱకఁబడిన హస్తము వలె లేకున్నను, నఱకఁబడని పాదమువలె నిలిచియున్నను జ్ఞానవంతునకు సంబంధింపవు. అనఁగా చిత్స్వరూపుఁడగు జ్ఞాని నేను పాదాదులుగలవాఁడను, మనుష్యుఁడను, నల్లనివాఁడను, శ్రోత్రియుఁడను అను నీ మొదలగు అభిమానమును వదలవలెనని భావము. ౧

అవ. స్థూలదేహమందుండెడి కృశత్వనీలత్వాదిధర్మములు సూక్ష్మదేహమందుండెడి కామక్రోధజ్ఞానాదులు ఆత్మకు లేనందున ఆత్మ యాయాధర్మపురస్కారముగ భావింపఁదగదనిచెప్పిన యర్థమునే అనువదించి ఫలితమును జెప్పుచున్నారు:—

మూ. తస్మాత్త్యక్తేన హస్తేన తుల్యం సర్వం విశేషణమ్,
అనాత్మత్వేన తస్మాజ్జ్ఞో ముక్తస్స్యాద్వైర్విశేషణైః. ౨

తా. స్థూలసూక్ష్మదేహసంబద్ధములగు స్థూలనీలత్వకామక్రోధాదివిశేషణములన్నియు జడములగుటచే నఱికి విడువఁబడిన తనహస్తమువలెనే తాను తాను కాఁడు. కావున చిత్స్వరూపమును దృఢముగ అనుసంధానముచేయుచు దేహాత్మబుద్ధిలేనిజ్ఞాని పైనిచెప్పినవిధమున కృశుఁడు, నల్లనివాఁడు, జ్ఞాని, మున్నగు విశేషణరహితుఁడును, చిత్స్వరూపుఁడునై ప్రకాశించునని భావము. ౨

అవ. వియోగము సంయోగపూర్వకము. 'మాగోవునకుఁ గొమ్ములు లేవు' అనవచ్చును. కాని, 'మా కుక్కకుఁ

గొమ్ములు లేవు,' అనరాదు. కనుక అనాత్మదేహాధర్మము లగు కృశత్వాదులు ఆత్మకు లేవనుట యెట్లు? అను శంక కుత్తరము:—

మూ. విశేషణమిదం సర్వం సాధ్వలంకరణం యథా,
అవిద్యాధ్యాసత స్సర్వం జ్ఞాత ఆత్మన్యసద్భవేత్. 3

తా. స్థూలదేహమునకే శోభావహములగు కటకకంకణాదులు అలంకారములగుచు ఆత్మకు అలంకారములు కానియట్లు, స్థూలదేహధర్మములగు కృశత్వాదులు ఆత్మధర్మములని చెప్పుట దేహాత్మాభిమానమువలననే కలిగెను. ఈ యభిమానబాధకమగు చిదాత్మజ్ఞానము ఉదయింపఁగనే యీ నీలత్వాది విశేషణములు వ్యర్థములే యగును. 3

అవ. ఆత్మ తెలియఁబడఁగా అనుటచేత ఆత్మ జ్ఞేయమగును. జ్ఞేయత్వముకూడ కృశత్వాదికములవలె అనాత్మధర్మమేకనుక చైతన్యమును అనాత్మయే యగునను శంక కుత్తరము:—

మూ. జ్ఞాతైవాత్మా సదా గ్రాహ్యో జ్ఞేయముత్సృజ్య కేవలః,
అహమిత్యపి యద్గ్రాహ్యం వ్యపేతాంగసమం హి తత్.

తా. తెలియఁబడఁదగినయంశమును అహంకారమును పరిత్యజించి జ్ఞాతృత్వమను విశేషణరహితమగు జ్ఞాతయే ఆత్మయని నిశ్చయింపవలెను. వివేకముగలవాఁడు జ్ఞాతృత్వాదిధర్మోపలక్షితమగు చిన్మాత్రమును అలుప్త ప్రకాశస్వభావముగలదగుటచే సర్వానుస్యూతవస్తువైన ఆత్మనుగా నిశ్చయించును. "అహమ్" అని తెలియఁబడుటచే నీజ్ఞాత ఆత్మ యెట్లు కాఁదగు

నందువేని వినుము. దేహాదికమందు "అహమ్" అని తెలియఁబడు అహంకారము ఆత్మ కాక కోసిపారవేయఁబడిన హస్తమువంటిదే యగును.

ప్ర. అహమ్మనునది ఆత్మ యేల కానేరదు?

ఉ. అహమ్మనునది అహంకారము. ఇది జాగ్రత్స్వప్నములందే కలదుకాని సుషుప్తియందు లేనందున నిది దృశ్యమై అనాత్మయగునుగాని ఆత్మ కానేరదు. ౪

అవ. అహంప్రత్యయగోచరము కాకుండ చక్షురాదికమునకు అవిషయమగు ఆత్మ కలదా యనియెడి ముగ్ధశంకను దృష్టాంతముచే నిరాకరించుచు ఆత్మ అన్యాపేక్ష లేకయే సిద్ధించునని చెప్పుచున్నారు:—

మూ. యావాన్ స్యాదిదమంశో యస్సస్వతోఽన్యో విశేషణమ్,
విశేషప్రక్షయో యత్ర సిద్ధో జ్ఞశ్చిత్రగుర్యథా. ౫

తా. లోకములో దేవదత్తుఁడు చిత్రముగఁ బలుకువాఁడు అను వాక్యమందున్న చిత్రవచనరూపవిశేషణముకంటె భిన్నమగు దేవదత్తుఁడు విశేషణనిరపేక్షుఁడై పూర్వమందున్నవిధమున "అహమ్" అని చిత్తుచేఁ దెలియఁబడుచున్న అహంకారము 'నా యహంకారమువలన అప్పుడాపసిబిడ్డను కొట్టినాను' ఈ మొదలగు వ్యవహారహేతువగుచు (అహంకారవంతుఁడగు) ఏప్రత్యగాత్మయందు విశేషణముగ భాసించుచుండునో ఆప్రత్యగాత్మ విశేషణమగుఅహంకారాదికముకంటె నన్యుఁడును సుషుప్త్యాదికమందు అహంకారాఖ్యవిశేషణరహితుఁడునగుచు బాహ్యపదార్థజ్ఞానమునకు "అహం జానామి" అను అహంకారముయొక్క అపేక్షకలుగునట్టి అహంకారోత్పత్తికంటె పూర్వమందును నుండుటచే అహంకారాపేక్ష లేకయే స్వతస్సిద్ధుఁడగును. విశేషణముగ భాసించెడి అహంకారము అనాత్మయే. ౫

అవ. "అహమ్" అనునది అనాత్మయగునేని "అహం బ్రహ్మ" అను తాదాత్మ్యశ్రుతి యెట్లు తగియుండునను శంకను అధ్యస్తాహంకారమునకు మూలమగు అవిద్యను నిర్మూలించుటకై "అహం బ్రహ్మాస్మి" అను శ్రుతి ప్రవర్తించెనుగాని అహంకారము ఆత్మయని బోధించుటకై ప్రవర్తించలేదని పరిహరించుచున్నారు:—

మూ. ఇదమంశోఽహమిత్యత్ర త్యాజ్యో నాత్మేతి పండితైః,
అహం బ్రహ్మేతి శిష్టాంశో భూతపూర్వగతేర్భవేత్. ౬

తా. "అహం" అని అహంకారము భాసించునపుడు దృశ్యమగు 'నా యహంకారమనెడి' ఇదమంశము ఆత్మ కాదని బుద్ధిమంతులచే విడువఁబడవలెను.

ఇట్లు అహంపదము విడువఁబడఁగా "అహం బ్రహ్మ" అను శ్రుతి యెట్లు నిర్దేశింపఁబడుననఁగా అహంశబ్దమునకు వాచ్యా(ముఖ్యా)ర్థము అహంకారము, లక్ష్యార్థము ప్రత్యగాత్మ యని రెండర్థములు ముఖ్యార్థమగు అహంకారమును పరిహరించి "అహం బ్రహ్మ" అనుచోట లక్ష్యార్థమగు ప్రత్యగాత్మను గ్రహింపవలెను. అహమను ప్రత్యయము పూర్వముకలిగిన సాధారణజ్ఞానమువలె భాసించుచున్నను, విమర్శించునపుడు ముఖ్యార్థము విడువఁబడి లక్ష్యప్రత్యగాత్మనే గ్రహించవలెనని భావము. శ్రోతృహితైషిణియగు శ్రుతి, తల్లి పిల్లల క్షేమముఁగోరి చెప్పినమాటను మనస్సున నాటుటకై తిరిగితిరిగి చెప్పునట్లు చెప్పుటచే నిచట పునరుక్తిశంక కవకాశములేదు. ౬

ఇది విశేషాపోహ ప్రకరణము.



శ్రీః.

# ఉపదేశసాహస్రి

(శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యప్రణీతము.)

## శ్లోకప్రబంధము - సప్తమప్రకరణము.

---

### ౭. బుద్ధ్యారూఢప్రకరణము.

అవ. ఇట్లు అన్వయవ్యతిరేకములచే పదార్థశోధనచేసిన వానికి వాక్యార్థజ్ఞానము గలుగునని ఉపపత్తితో నిశ్చయింపఁబడిన యర్థమును స్వానుభవబలమున స్పష్టముచేయుటకై యీప్రకరణ మారంభింపఁబడుచున్నది:—

మూ. బుద్ధ్యారూఢం సదా సర్వం దృశ్యతే యత్ర తత్ర వా,
మయా తస్మాత్ పరం బ్రహ్మ సర్వజ్ఞశ్చాస్మి సర్వగః. ౧

తా. ఏఆధ్యాత్మాధిభూతాధిదైవలక్షణమగు సకలప్రపంచము జాగ్రత్స్వప్నములందైనను ఇహపరలోకములందైనను ప్రత్యక్షాదిప్రమాణముల వలనను శాస్త్రమువలనను దెలియఁబడుచున్నదో అదియంతయు నాచే నెప్పుడును బుద్ధివృత్తిసహితముగనే దెలియఁబడుచున్నది. కావున సర్వదృశ్య

విలక్షణమగు నేను సర్వార్థప్రకాశకుఁడును పరిచ్ఛేదరహితుఁడునునగు పర మాత్మను.

1. అధ్యాత్మాదులెవ్వి?

ఉ. శరీరమందుండు కామాదులు అధ్యాత్మము, భూతములందుండు శబ్దాదులు అధిభూతము, దేవతలందుండు సత్యసంకల్పాదులు అధిదైవము.

2 ప్ర. బుద్ధివృత్తిసహితమై ప్రకాశించు పదార్థములకంటె ఆత్మ విలక్షణమగుట యెట్లు?

ఉ. 'ఆ. క్షరములైన భూతసంఘంబులం దెల్ల
నక్షరస్వరూపుఁడై వెలుంగు
సకలబుద్ధివృత్తి సాక్షిసూక్ష్మాత్ము న
స్పందబోధఘను ముకుందుఁ గొలుతు.'

అను భీష్మవాక్యము ప్రమాణము.

అవ. ఆత్మ సర్వజ్ఞుఁడగు నేని యొకనికిఁ గలిగిన తలంపు మఱియొకనికిఁ దెలియవలెను. అట్లు తెలియఁబడకఁ బోవుట చేత ఆత్మ సర్వజ్ఞుఁడును సర్వప్రకాశకుఁడును గాఁజాలఁడు, అను శంక కుత్తరము:—

మూ. యథాఽఽత్మబుద్ధిచారాణాం సాక్షీ తద్వత్పరేష్వపి,
నైవాపోఢుం న వా దాతుం శక్యస్తస్మాత్పరో హ్యహమ్. ౨

తా. తనబుద్ధికి గోచరములగు ఆధ్యాత్మాధిదైవస్థూలసూక్ష్మదేహాదులకు తా సాక్షియైనట్లు పరదేహములందును అహంపదలక్ష్యార్థమగు తాను సాక్షియై భాసించుటచే ఆత్మ లేఁడని కాని, దీనిని చూడలేఁడని కాని నిరాకరించుటకు శక్యము కానందునను, జ్ఞానముచే గాని క్రియచే గాని ప్రకా

శింపఁజేయుటకును పుట్టించుటకును, పరిహరించుటకును శక్యము కానందు నను గ్రాహ్యగ్రాహకాదిప్రపంచవిలక్షణము గనుక అహమనఁగా లక్ష్యార్థమగు పరమాత్మయే యని తాత్పర్యము.

ప్ర. ప్రతిదేహమందు సాక్షి వేఱుగ లేఁడా?

ఉ. సాక్షి భేదమగుటకు ప్రమాణములేదు. ఏలయనఁగా "మయ్యేవ సకలం జాతం మయి సర్వం ప్రతిష్ఠితం, మయి సర్వం లయం యాతి తస్మాదద్వయమస్మ్యహమ్" అను శ్రుతిదృశ్యమునకు భేదమున్నను దృశ్యమంతకు సాక్షి యొక్కఁడే యని ఘోషించుచున్నది. ౨

అవ. సర్వము బుద్ధ్యారూఢమై క్షేత్రజ్ఞునిచే ప్రకాశింపఁ జేయఁబడెనేని దర్శనక్రియకు కర్తయగు ఆత్మకు వికారిత్వము మొదలగు దోషములు సంభవింపఁగా అనాత్మత్వము సంభవించునను శంకకుత్తరము:—

మూ. వికారిత్వమశుద్ధత్వం భౌతికత్వం న చాత్మనః,
అశేషబుద్ధిసాక్షిత్వాద్బుద్ధివచ్చాల్పవేదనా.    3

తా. బుద్ధివలె సావయవము కాక సర్వవికారసాక్షియగు ఆత్మకు వికారములేదు. వికారము లేనందున గుణక్రియలుగల సకలవస్తువులకు సాక్షియగు ఆత్మకు క్రియవలనఁగలుగు దోషాదిసంబంధము లేదు. రూపాదికము లేని ఆత్మ భూతకార్యమును గాదు. సకలబుద్ధివృత్తివికారసాక్షియగు ఆత్మకు బుద్ధికివలె బుద్ధితత్సంసర్గములందు గోచరించెడి అల్పవేదనయు లేదు.    3

అవ. ఇట్లు వికారరహితుఁడైన ఆత్మ సర్వార్థప్రకాశకుఁ డెట్లగును? అను శంకను నిరాకరించుచు, నిర్వికారా

త్మయే సర్వప్రకాశకుఁడగు నను లోకప్రసిద్ధ దృష్టాంతముతో నిరూపించుచున్నారు:—

మూ. మణౌ ప్రకాశ్యతే యద్వత్రక్తాద్యాకారతాఽఽతపే,
మయి సందృశ్యతే సర్వమాతపేనేవ తన్మయా. ౪

తా. ఎండ యున్నపుడే స్ఫటికమందు జపాకుసుమముయొక్క యెరుపు భాసించును. ఇట్లు సూర్యాతపమువంటి క్షేత్రజ్ఞుతేజస్సు ప్రకాశించునపుడే స్ఫటికసదృశస్వచ్ఛబుద్ధియందు జపాకుసుమారుణ్యతుల్యమగు దృశ్యప్రపంచమంతయు భాసించును. కాని, చైతన్యాభాసము లేదేని గోడవలె జడమగు బుద్ధియందు విశ్వము ప్రకాశింపదు. ఆతపమువలె నిష్క్రియమగు క్షేత్రజ్ఞునిచేతనే సర్వము ప్రకాశించును. ఈక్షేత్రజ్ఞునకు బుద్ధివలె వికారములేదు. జడమగు బుద్ధి సర్వమును దెలియలేదు. కేవలచైతన్యము విషయవిశేషాకారమును సంపాదింప లేనందున బుద్ధికల్పన వ్యర్థమునుకాదు. ౪

అవ. ఇపుడు ప్రత్యగాత్మ అద్వితీయము, శుద్ధమునని, విశదపఱుచుచున్నారు:—

మూ. బుద్ధౌ దృశ్యం భవేద్బుద్ధౌ సత్యాం నాస్తి విపర్యయే,
ద్రష్టా యస్మాత్సదా ద్రష్టా తస్మాద్ద్వైతం న విద్యతే. ౫

తా. జాగ్రదాద్యవస్థలందు స్వాఽవిద్యాధ్యస్తమగు బుద్ధి భాసించుచుండఁగా ద్వైతజగత్తు భాసించుచుండును. సుషుప్త్యాదికమందు బుద్ధి లీనమగుటచే జగత్తు భాసింపదు. జడము తెలియఁబడకయున్నదని చెప్పుటకు ప్రమాణములేదు. సాక్షియగు ఆత్మ సకలావస్థలందును చూచుచునే యుండును. దృశ్యమగు పదార్థము మఱియొకయవస్థయందులేక స్వస్వావస్థయందే

యుండును. ద్రష్టయగు ఆత్మ నియమములేక మణులందు సూత్రమువలె సర్వావస్థలందు అనుస్యూతమై యుండును. సద్వస్తువునకు ప్రకాశలోపము లేదు, ప్రకాశలోపముగలది సద్వస్తువుకాదు, కనుక ద్వైతము నిత్యసిద్ధము కాదు. ప్రత్యగాత్మకు లోపములేదు. ౫

అవ. ద్వైతము లేనిదగుటవలన చిదాత్మకు తత్సంసర్గ మువలన నగు అశుద్ధత్వము లేకున్నను విద్యావిద్యలసంబంధ మువలన నాయశుద్ధత్వము కలుగవచ్చునను శంకరాఁగా, నీవిద్యావిద్యలు బుద్ధిధర్మములేకాని యివి ఆత్మకు లేవుకనుక ఆత్మ విద్యావిద్యలవలననైనను అశుద్ధముకాదని చెప్పు చున్నారు:—

మూ. అవివేకాత్పరాభావం యథా బుద్ధిరవైత్తథా,
వివేకాత్తు పరాదన్యః స్వయం చాపి న విద్యతే. ౬

తా. బుద్ధి అవిమర్శమువలన సర్వసాక్షియు కూటస్థుఁడునగుపరమాత్మ లేదని తెలియునట్లు వివేకమువలన పరాత్మకంటె నన్యములేదనియుఁ దెలి యును, తానుకూడ లేకపోవును.

1 ప్ర అవివేకమననేమి?

ఉ. దేహమునకును ఆత్మకును భేదములేదనియు దేహమే ఆత్మయని యుఁ దలఁచుట.

2 ప్ర. పరమాత్మ యెట్టివాఁడు?

ఉ. సంసారరహితుఁడు, సర్వసాక్షి, అసంగుఁడును.

3 ప్ర. అజ్ఞానమననేమి?

ఉ. బుద్ధ్యభ్యాసమువలననే చిదాత్మకును భ్రాంతి సంభవించుటచే చిదాభాససహితమగుబుద్ధియే అజ్ఞానమనఁబడును.

4 ప్ర. వివేకమననేమి?

ఉ. ఆత్మేతరములగు దృశ్యవస్తువులను నిషేధించి ఆత్మస్వభావమును నిర్ధారణచేయుట.

5 ప్ర. పరమాత్మనిర్ధారణవలన నేమిఫలము?

ఉ. దీనివలన పరమాత్మకంటె నన్యుఁడగు జీవుఁడులేఁడు. సర్వమును ప్రత్యగాత్మయగుటవలన తనకు (బుద్ధికి) నిదానమగు అవిద్యలోఁగూడ సాభాసబుద్ధియు లేదు. కావున భ్రాంతిసమ్యగ్జ్ఞానములు విద్యావిద్యాస్వరూపములు బుద్ధ్యధీనములగుటచే ఆత్మకు అశుద్ధి లేశమును లేదు. ౬

ఇది బుద్ధ్యారూఢప్రకరణము.



శ్రీః

# ఉపదేశసాహస్రి

(శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యప్రణీతము.)

## శ్లోకప్రబంధము_పంచమప్రకరణము.

### ౫. మతివిలాపనప్రకరణము.

అవ. విద్యావిద్యలు బుద్ధిగతములైనయెడల సాంఖ్య సిద్ధాంతమగును. ఆ సాంఖ్యులు పురుషున కపవర్గమునిమిత్తము జ్ఞానాకారముగను, భోగార్థము అజ్ఞానరూపముగను పరిణమించు బుద్ధియే ప్రకృతియనియు, యిది సకలవికృతి రూపజగత్తునకుఁ గారణమనియు తలఁతురు. అది సరికాదు. అచేతనమగు బుద్ధి సంకల్పపూర్వకముగ జగత్కారణము కానేరదు. అని పూర్వము స్వానుభవానుసారముగఁ జెప్పఁబడిన బ్రహ్మాత్మజ్ఞానమునే ఆత్మబుద్ధి సంవాదరూపమగు మఱియొక ప్రకరణముచే దృఢపఱుచుచున్నారు:—

మూ. చితిస్వరూపే స్వత ఏవ మే మతే
రసాదియోగ స్తవమోహకారితః,

అతో న కించి త్తవ చేష్టితేన మే
ఫలంభ వేత్సర్వవి శేషహానతః. ౧

తా. స్వయంప్రకాశుఁడగు చిదాత్మకు కర్తృత్వాదికము అవిద్యా కల్పితరాగద్వేషాదులవలననే కలిగినది. ఈ యవిద్యాకార్యజాతమంతయు బుద్ధికార్యమే కాని, యిది ఆత్మకేమియుం లేదు. "రాగేచ్ఛాసుఖదుఃఖాది బుద్ధౌసత్యాం ప్రవర్తతే,సుషుప్తౌ నాస్తి తన్నాశాత్ తస్మాద్బుద్ధేస్తు నాత్మనః," అని ఆత్మబోధప్రకరణము. బుద్ధికల్పితములగుటచే మిథ్యయగు కర్తృత్వాదికమును బరిత్యజించి ప్రత్యగ్బ్రహ్మాకారముగ నున్నానాకు ఓ బుద్ధీ! నీ వ్యాపారమువలన పుణ్యాపాపకృత భేద మేమియును లేదు. ఉపదేశ కాలమగుటచేతఁ జెప్పఁబడిన నీవు నాకు, గురువు శిష్యుఁడు, సర్వజ్ఞుఁడు కించిద్జ్ఞుఁడు నీ మొదలగు భేదములును మాయికములే కాని వాస్తవములు కావు. ఇట్లు "మాయామయమిదమఖిలం హిత్వా బ్రహ్మపదం ప్రవిశాశు విదిత్వా" అని శ్రీశంకరాచార్యులు.

1 ప్ర. కర్తృత్వభోక్తృత్వాదికము బుద్ధికల్పితములనుటకు హేతు వేమి?

ఉ. జాగ్రత్స్వప్నావస్థలందు బుద్ధి ప్రకాశించుచుండఁగా దీనిననుసరించి నేను కర్తను భోక్తను అను అభిమానము కలుగుచున్నది, సుషుప్త్యవస్థయం దుఈబుద్ధి లయించుటచే కర్తృత్వభోక్తృత్వాదిధర్మములుకూడ లయించుచున్నవికనుక కర్తృత్వాదికము బుద్ధిధర్మము లనఁబడుచున్నవి.

2 ప్ర. జ్ఞానికి పుణ్యాపుణ్యలేపము లేదనుటకు ప్రమాణమేమి?

ఉ. "అసంగోహ్యాయమనాః శుభ్రః" అను శ్రుతి ప్రమాణము.

3 ప్ర. బ్రహ్మలక్షణములను బోధించెడి యీ శ్రుతిచేత జ్ఞానికి పుణ్యాపుణ్యసంబంధము లేదని యెట్లు చెప్పవచ్చును?

ఉ. "బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి" అను శ్రుతిప్రమాణమున ఆత్మజ్ఞాని బ్రహ్మమే యగుటచే నిది యుక్తమే.

4 ప్ర. సర్వజ్ఞుఁ డీశ్వరుఁడనియు,కించిద్జ్ఞుఁడు జీవుఁడనియుఁ బిలువఁ బడుచుండఁగదా?

ఉ. ఔను నిజమే. ఇచట కించిద్జ్ఞుఁడగు జీవుని శిష్యునిగను, సర్వజ్ఞుఁడగు ఈశ్వరుని గురువుగను భావించి ఉపదేశకాలమున చెప్పఁబడు చున్నదేకాని ఉపాధిపరిహారముచే జీవేశ్వరులకు ఐక్యమే మహావాక్యము వలనఁ దెలియనగును. ౧

అవ. ఈవ్యాపారముచే సకలవిశేషరహితుఁడనగు నాకు భిన్నఫలమేమియు లేదు, కనుక నీకు శాంతియే తగు నని బుద్ధితో ఆత్మ చెప్పుచున్నారు.—

మూ. విముచ్య మాయామయ కార్యతామిహ
ప్రశాంతి మాయాహ్యసదీహితాత్సదా,
అహం పరంబ్రహ్మ సదావిముక్తవ
త్తథాఽజమేకం ద్వయవర్జితం యతః. ౨

తా. ఓబుద్ధీ! మాయామయమగుటచే మిథ్యయగు కార్యజాతమందు ఆశను వదలి నిరర్థకప్రయాసమును మాని విరమింపుము. ఇక్కడ మాయామయము, 'అసదీహితము' అనుపదములచే సాంఖ్యమతమగు ప్రకృతి జగత్కారణమనుమాట నిరాకరింపఁబడెనని తెలియవలెను. మనస్సు ప్రత్యగాత్మ యందు లయించునని చెప్ప నేల? "పరేఽవ్యయే సర్వఏకీ భవంతి"యను

శ్రుతి ప్రకారము, పరబ్రహ్మమందే లయించునని చెప్పరాదా యను శంకకు సమాధానము:—అద్వితీయుఁడనగు నాయందు లయించునని చెప్పుటచేత బ్రహ్మమందు ఏకీభవించుటయే కనుక నీశంక కవకాశము లేదు. 'విముక్తవదితి' నేను కాలత్రయమందును పరబ్రహ్మమునే. కావున బంధమోక్షములు వాస్తవముగ నాకు లేవు. జన్మాదివికారములును లేవు. సజాతీయ విజాతీయ భేదములును లేవు. అని 'ఇవ'శబ్దముచే సూచింపఁబడెను.

దీనికే మఱియొక తాత్పర్యము—

ఓ బుద్ధీ! నీవు మాయికములగు దేహేంద్రియాదులందు వ్యాపారమును విడువుము. జాగ్రదవస్థయందయినను వానినిమిత్తము ప్రవర్తింపక శాంతినిఁ బొందుము. బుద్ధిరూపమును వదిలి మాయాం+అయ=కారణమగు మాయా స్వరూపమున నుండుము. ఇహ=నాస్వరూపమగు అంతరంగముననే, అయ= ప్రవేశించుము. మఱల బుద్ధిరూపకార్యముగ మాఱకుము. తప్తాయఃఖండమందలి జలబిందువువలె నాచే మ్రింగఁబడిన నీవు కార్యకారణభావమును వదిలి నాయందే విలీనమగుము. అనేకబ్రహ్మాండములను మ్రింగి నిన్ను నలుదిక్కులఁ ద్రిప్పునట్టి నేను నీచే మ్రింగఁబడుదునని తలంపకుము. నీకిది భ్రమ మాత్రమేకాని పరబ్రహ్మమగు నేను నీచేతఁ జలింపఁబడఁదగినవాఁడను గాను. "అయమాత్మా బ్రహ్మ"యనెడి శ్రుతి యిటఁ బ్రమాణము. "విముక్తవత్" అనుచోట వత్ ప్రత్యయము స్వార్థకము. తథా=శ్రుతిచెప్పినది సత్యమే. ౨

అవ. అజత్వాది గుణములుగల బ్రహ్మము నిర్విశేషమగుటచే నిత్యమైనను దేహాదిసంబంధముగల ఆత్మకు నిత్యముక్త బ్రహ్మత్వము ఎటుల సంభవించును? అను శంకకు సమాధానము:—

మూ. సదా చ భూతేషు సమోఽస్మి కేవలో
యథా చ ఖం సర్వగమక్షరం శివమ్,
నిరంతరం నిష్కలమక్రియం పరం
తతో న మేఽస్తీహ ఫలం తవేహితైః. 3

తా. అవిద్యా తత్కార్యరూపవిశేషములులేని నేను సమస్తభూతములందు ఉపాధికృతభేదములేక ఏకాకారముగ నుండుదును. ఆకాశమునకుపాధులవలననగు భేదము లేదుకదా. ఆకాశమువలె బ్రహ్మము అంతటను నిండి, నశింపక, నిర్బాధమై నీరంధ్రమై నిరవయవమై నిష్క్రియమై యుండును. కనుక బుద్ధివ్యాపారములచే ఆత్మకు ఫలభేదము లేదు. 3

అవ. ఓ జీవాత్మా! బ్రహ్మభూతుఁడవై యున్న నీకు నా(బుద్ధి)చేష్టలచే ఫలభేదము లేకున్నను, నీకు ముఖ్యముగఁగాని అప్రధానముగఁగాని మఱియొక వస్తువుచే నుపయోగము కలుగవచ్చునుగదా యని (ఓ బుద్ధీ!) నీతలంపెద్దియు నాయందు సంభవింపదు. అని నిరూపించుచున్నారు:—

మూ. అహం మమైకో న తదన్యదిష్యతే
తథా న కస్యాప్యహమస్మ్యసంగతః,
అసంగరూపోఽమతో న మే త్వయా
కృతేన కార్యం తవ చాద్వయత్వతః. ౪

తా. సజాతీయవిజాతీయ స్వగతభేదరహితుఁడనై చిత్స్వరూపుఁడనగు నాకు నాకంటె నితరముగనుండి, నాచే నపేక్షింపఁదగిన వేఱువస్తువొకటియు లేదు. నాకు సంపాదనీయమగు అతిశయమొకటియును లేనం

దున ప్రధానభూతుఁడగు మఱియొకనికి నేను అంగభూతుఁడను గాను. లోకములోఁ గింకరాదులు తమకు ద్రవ్యాతిశయము నపేక్షించి ప్రధానమగు నృపాదులకు అంగభూతులై వారల ననుసరింపుచుందురు. కాని పూర్ణుఁడనగు నేనొకరికి అంగభూతుఁడనుగాను. అసంగుఁడనైన నాకు ఓ బుద్ధీ, నీవు చేసినకార్యములవలనఁ బ్రయోజన మేమియును లేదు. ఏపదార్థముతోను సంబంధములేక నిస్సంగమగు నాకసమును భూతలమందలి ధూళి యంటనియట్లు బుద్ధికృతపుణ్యాపుణ్యకర్మఫలలేపము ఆత్మకు లేదని భావము. ఇందుకు "అసంగో హ్యయమనాః శుభ్రః" అను శ్రుతి ప్రమాణము. ఓమతీ! నీవు నాయందు కల్పించఁబడితివి కనుక జీవునికంటె వేఱగుబుద్ధియే కల్పితమగుచు మిథ్యకాఁగా, ఆబుద్ధివ్యాపారఫలము లెట్లు సత్యములగును? ఓబుద్ధీ! నాస్వరూపపరిజ్ఞానము లేనికాలమున కల్పింపఁబడిన నీకు అధిష్ఠానమగు నాస్వరూపముకంటె వేఱగురూపమే లేదు. నీయందుఁ గల్పితమై జీవుఁడనని పూర్వము వ్యవహరించినను, ఉపాధియగు బుద్ధివిలయమువలన ఆభాసుఁడై బ్రహ్మభూతుఁడగు జీవునకు నాతో నభేదమే కనుక రెండువస్తువు లున్నప్పుడు సిద్ధించెడి ఉపకారోపకారకభావము అభేదకాలమున సంభవింపదు. కాఁబట్టి వికల్పములను వదిలి ప్రశాంతవగుము.

1 ప్ర. ఆత్మకు సజాతీయవిజాతీయ స్వగతభేదములు లేవని చెప్పితిరి. అవి యెటువంటివి? మఱిదేనికైనను అవి కలవా?

ఉ. ఈభేదములు ఆత్మకు లేకున్నను అన్యమునకుఁ గలవు. ఎట్లన.

(1) ఒక వృక్షమునకు మఱియొకవృక్షముతోఁ గలిగినభేదము సజాతీయభేదము.

(2) వృక్షమునకు శిలతోఁ గలిగినభేదము విజాతీయభేదము.

(3) వృక్షమునకు పత్రపుష్పఫలాదులవలనఁగలిగిన భేదము స్వగత భేదము.

2 ప్ర. ఇట్టిభేద మాత్మ కేల లేదు?

ఉ. (1) సమానవస్తువు లేకపోవుటచేత సజాతీయభేదములేదు.

(2) విలక్షణవస్త్వంతరము లేకపోవుటచేత విజాతీయభేదము లేదు.

(3) అవయవరాహిత్యమువలన స్వగతభేదము లేదు.

ఈ యర్థమందు "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అను శ్రుతి ప్రమాణము. ౪

అవ. ఇప్పుడు కృతార్థులగు ఆచార్యులు, స్వానుభూత సిద్ధార్థమును బ్రకటించు నీ ప్రకరణమును, దుఃఖసాగరనిమగ్నులగు మానవులందుఁ గరుణచే వారల నుద్ధరించుటకే కాని ఖ్యాతికొఱకుఁ జెప్పుట లేదని నిరూపించుచున్నారు:—

మూ. ఫలే చ హేతౌ చ జనో విషక్తవా
నితిప్రచింత్యాహ మతో విమోక్షణే,
జనస్య సంవాదమిమం ప్రశక్తవాన్
స్వరూపతత్త్వార్థవిబోధకారణమ్. ౫

తా. జనులు కార్యకారణాత్మకమగు సంసారచక్రమందు ప్రసక్తులగుచుందురని యాలోచించి క్లేశబహుళమగు యీసంసారమునుండి జనులకు మోక్షార్థమై స్వరూపతత్త్వార్థబోధహేతువగు నీ యాత్మబుద్ధిసంవాదము నాచే రచింపఁబడెను. అని గ్రంథకర్తయగు శ్రీశంకరాచార్యులు చెప్పిరి.

అవ. ఈ సంవాదమునకు అధ్యస్తబంధమోక్షము సల మగుటచే ముముక్షువు లవశ్య మీసంవాదమును విమర్శింప వలయునని చెప్పుచున్నారు:—

మూ. సంవాదమేతం యది చింతయన్నరో
విముచ్యతే ఽజ్ఞానమహాభయాగమాత్,
విముక్తకామశ్చ తథా జన స్సదా
చరత్యశోక స్సమ ఆత్మవిత్సుఖీ. ౬

శ్రద్ధాళువీసంవాదమును విమర్శించునేని మహాభయకారణమగు అజ్ఞానమును విడిచి కామశోకరహితుఁడై ఆత్మజ్ఞానము గలిగి సుఖించును. ౬

ఇది మతివిలాపనప్రకరణము.



శ్రీః

# ఉపదేశసాహస్రి

(శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యప్రణీతము.)

## శ్లోకప్రబంధము - నవమప్రకరణము.

### ౯. సూక్ష్మతావ్యాపితా ప్రకరణము.

అవ. ప్రత్యగాత్మకు మహావాక్యశ్రవణసంజాతజ్ఞానము వలన అజ్ఞాననిరాసపూర్వకముగ ముక్తి చెప్పఁబడెను. సర్వాంతరమగు ఆ ప్రత్యగాత్మకు నిరతిశయసూక్ష్మత్వవ్యాప్తిత్వములు "యథా చ ఖం" అనుచోట సూచింపఁబడినవానినే నిరూపించుటకై యీ ప్రకరణ మారంభింపఁబడుచున్నది:—

మూ. సూక్ష్మతావ్యాపితే జ్ఞేయే గంధాదేరుత్తరోత్తరమ్,
ప్రత్యగాత్మావసానేషు పూర్వపూర్వప్రహాణతః. ౧

తా. జరాయుజములు అండజములు ఉద్భిజ్జములు స్వేదజములునను చతుర్విధకార్యజాతమందును, వీనికిఁ గారణమగునట్టి భూమి తన కార్యములను గ్రహించునపుడు తాను గ్రహింపఁబడదు. ఇట్లే భూమికిఁ గారణమగు

జలము స్వకార్యమగు భూమికంటె సూక్ష్మముగను వ్యాపకముగను నుండును. ఇట్లు జలముకంటె నగ్నియు, అగ్నికంటె వాయువును, వాయువుకంటె గగనమును సూక్ష్మము వ్యాపకమును అగును. ఈ గగనాది పంచభూతములును పరమకారణమగు సచ్చిదంశములచే వ్యాప్తమగుటచే సచ్చిత్తులును సూక్ష్మములు వ్యాపకములునై యుండును. ఈసచ్చిత్తులు మఱియొకదానిచే వ్యాప్తములు కానందున నుపాదానరహితములై నిరపేక్షవ్యాపకములై సూక్ష్మతరములై యుండును. ఎట్లనఁగా, సకలదృశ్యజాతము సత్తాస్ఫూర్తులతో నిండియున్నందునను, దీనికంటె నితరవస్తువు లేనందునను సచ్చిదాత్మకమగు ఆత్మ పరమసూక్ష్మము వ్యాపకమునని నిశ్చయించి యిట్టి లక్ష్యార్థమగు నేను అసంగకూటస్థాద్వయాత్మనని యెల్లపుడు భావింపవలెను; అని తాత్పర్యము. ఇచట "సూక్ష్మాత్సూక్ష్మతరం నిత్యం తత్త్వమేవ త్వమేవ తత్" అను శ్రుతి ప్రమాణము.

1 ప్ర. సూక్ష్మమనఁగా నేమి?

ఉ. ప్రత్యక్షాది ప్రమాణములచేఁ దెలియరానిది జ్ఞానైకలభ్యము నగునది సూక్ష్మము. ౧

అవ. అధ్యాత్మాధిదైవములు పృథివ్యాదిభూతములును వేఱువేఱుగ భాసించుచుండఁగా నింతమాత్రాన ఆత్మకు సూక్ష్మత్వవ్యాపకత్వ మెట్లు సిద్ధించును? అను శంక కుత్తరము:—

మూ. శారీరా పృథివీ తావద్యావద్బాహ్యా ప్రమాణతః,
అంబ్వాదీని చ తత్త్వాని తావద్జ్ఞేయాని కృత్స్నశః.

తా. బాహ్యభూతపంచకములో కార్యములగు భూమిజలాదులకంటె వానికిఁ గారణములగు జలాగ్న్యాదులు సూక్ష్మతరములు వ్యాపకములు నైనట్లే ఆంతరభూతములలోను మారుతపావకాదులయొక్క కార్యములగు వహ్నిజలాదులకంటె వానికిఁ గారణములగు వహ్నిమారుతాదులును కార్యభూతములకంటె సూక్ష్మతరములును వ్యాపకములునై యుండును.

1 ప్ర. పంచభూతములకు బాహ్యాభ్యంతరములందు సమపరిమాణము వలనఁగలిగెడి లాభమేమి?

ఉ. అధ్యాత్మము, అధిదైవము, అధిభూతము ననెడి భేదముగల పృథివ్యాది భూతములన్నియుం అజ్ఞానమువలననే విజృంభించినవగుటవలన ఏక ప్రయత్నముచే ప్రత్యగాత్మయందు ప్రవిలాపనము చేయఁదగును. అంతటను ప్రత్యక్త్వము అనుసరించియుండుటచే అధ్యాత్మాదిరూపమంతయు ప్రత్యగాత్మమాత్రమే. మృద్వ్యాప్తమగు ఘటశరావాదికమంతయుం మృత్తేయగునట్లు "తద్వ్యాప్తము తద్భిన్నమునుగాద"ను న్యాయమిచట గ్రహింపవలెను. ఇట్లు అంతట ప్రత్యక్త్వము నిశ్చయింపఁబడఁగా బాహ్యాధ్యాత్మికాదిభేదము స్ఫురింపకపోవుటచే ప్రత్యగాత్మ బ్రహ్మమాత్రమై శేషించును గనుక ఆత్మతత్త్వజ్ఞానము సుగమము. ౨

అవ. బాహ్యార్థములు లేవేని ఆత్మ ప్రత్యక్కని సర్వగతమని యెట్లు చెప్పనగును? [1]ప్రత్యక్కు [2]పరాగపేక్షగలదగుటచే నది దుర్వచము. పరాగర్థములు [3]ప్రత్యగాత్మావసానము లనుమాటయు తగదను శంక కుత్తరముగ

1 ప్రత్యక్కు=ఆంతరము. 2 పరాక్=బాహ్యము. 3 ప్రత్యగాత్మకంటె వేఱుకాకుండుట.

పూర్వభావములులేని చిన్మాత్రమే ప్రత్యగాది శబ్దలక్ష్యార్థ మగుటవలన లక్ష్యమాణ దశయందు ఆరోపిత బాహ్యార్థా పేక్ష కలిగినను, ఆత్మస్వరూపము అన్యాపేక్ష లేనందున సర్వము ప్రత్యగాత్మావసానమగుట యుక్తమని సదృష్టాంత ముగ నిరూపించుచున్నారు:—

మూ. వాయ్వాదీనాం యథోత్పత్తేః పూర్వం ఖం సర్వగం తథా, అహమేకః సదా శుద్ధశ్చిన్మాత్రః సర్వగోఽ ద్వయః. 3

తా. వాయ్వగ్నిజలభూములు పుట్టకమునుపు వాని కారణములగు ఆకాశవాయువహ్నిజలములు స్వస్వకారణాత్మకమున సంతట నిండియున్నట్లు జగత్సృష్టికంటె పూర్వమందు పరమకారణము చిన్మాత్రము నేకమునగు నేను సర్వమును వ్యాపించియుండుదును. 3

అవ. బ్రహ్మేంద్ర వరుణాదిభేదముచే ననేకాత్మలు భాసింపుచుండఁగా ఆత్మ యాకాశమువలె నొక్కటి యెట్లగును? మఱియు రాగాదిదోష సంసర్గముండఁగా ఆత్మ చిన్మాత్ర మెట్లగును? అను శంకల కుత్తరము:—

మూ. బ్రహ్మాద్యాః స్థావరాంతా యే ప్రాణినో మమ పూః స్మృతాః, కామక్రోధాదయో దోషా జాయేరన్మే కుతోఽన్యతః. ౪

తా. బ్రహ్మాదిస్థావరాంతజగత్తు నాకు శరీరమేయగును. ఆగమాపాయ

ములుగల కామక్రోధాదులు నిత్యమగు ఆత్మకు స్వాభావికములు కావు. బుద్ధిధర్మములగు నీకామాదులు దేహాధ్యాసమువలన ఆత్మధర్మములుగఁ దోఁచినను బుద్ధితోఁగూడ జాగ్రత్స్వప్నములందుఁ గలుగుచు సుషుప్తి యందు లయించుచుండుటచే ఆత్మకు స్వాభావికములు కానేరవు. సర్వ వ్యాపినగు నాకంటె నన్యవస్తువు లేనందున నాకీకామాదు లన్యమునుండియుఁ గలుగనేరవు. ౪

అవ. సంసారదోషము లనేకములు ప్రత్యక్షముగఁ గనుపించుచుండఁగా ప్రత్యగాత్మ నిర్దుష్టమని యెట్లు చెప్పఁదగు నను శంకరాఁగా, ఆకాశము నల్లనిదనుమాటవలెనసంగమగు ఆత్మ దోషయుక్తమగుమాట భ్రమయే. కాని వాస్తవముగ దోషయుక్తము కాదని నిరూపించుచున్నారు:—

మూ. భూతదోషైః సదాఽస్పృష్టం సర్వభూతస్థమీశ్వరమ్,
నీలం వ్యోమ యథా బాలో దుష్టం మాంవీక్షతేజనః.

తా. సకలప్రాణులందు ఆత్మగనుండి పాలించుచు ఆభూతదోషముల నంటకభాసించెడి నన్ను బాలు రాకాశము నల్లగనున్నదని చెప్పునట్లు అజ్ఞులు నన్ను దోషవంతునిగ నెన్నుదురు.

1 ప్ర. ఈశ్వరునకు దోషములెట్లు కలుగవు ?

ఉ. కార్యవికారములు కారణము నంటవు, కావున కార్యోపాధి ధర్మములగు స్థూలత్వాదిధర్మములు ఆత్మనంటక యుండును.

అవ. బ్రహ్మాది స్థావరాంత జగత్తు ఆత్మకు శరీరమను టను దృఢపఱుచుచున్నారు:—

మూ. మచ్చైతన్యావభాస్యత్వాత్సర్వప్రాణిధియాం సదా,
పూర్వమప్రాణినః సర్వే సర్వజ్ఞస్య విపాప్మనః. ౬

తా. సర్వకాలసర్వావస్థలందు సకలజంతుబుద్ధులు జడములగుచు నా చైతన్యము చేతనే భాసింపఁజేయఁబడుటవలన సర్వసాక్షియు సర్వావభాసకుఁడను గనుకనే సకలదృశ్యవస్తునిష్ఠదోషస్పర్శములేని నాకు సకలప్రాణులు శరీరములగును.

1 ప్ర. అనేకకోటి జీవరాసులం దాత్మయొకటిగ నెట్లుండును?

ఉ. బుద్ధివృత్తులకు సాక్షిగ స్వయంప్రకాశమానమగు చైతన్యజ్యోతిస్సే సర్వప్రాణినిష్ఠమగు ఆత్మగనుక, బహుధేనునిష్ఠమగు క్షీరమొకటియే యగునట్లు, అనేకకోటిప్రాణినిష్ఠమగు ఆత్మచైతన్య మొకటియే. ఇందుకు- "యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యంతర్జ్యోతిః పురుషః" అను శ్రుతిప్రమాణము.

2 ప్ర. ఆత్మ యొకటియగునేని యనేకముగ నెట్లు తోఁచును?

ఉ. బహుఘటగతజలమందు ప్రతిఫలించిన సూర్యప్రతిబింబము లనేకములయినట్లు తోఁచినను బింబభూతసూర్యుఁ డొక్కఁడై యుండఁగా ఘటజలప్రతిబింబసంఖ్యామాత్రమున నొక సూర్యున కనేకత్వసంఖ్య సంభవించునట్లు అద్వితీయబ్రహ్మమునకు దేహబుద్ధి ప్రతిబింబభేదమును బట్టియే యనేకత్వము భాసించుచున్నను, ఏకత్వమునకు హానిలేదు. కావున ఏకమగు ఆత్మకు సకలభూతములు శరీరములనుట నిర్వివాదము. ఇందుకు "యస్య

సర్వాణి భూతాని శరీరం యః సర్వాణి భూతాన్యంతరోయమయత్యేషత ఆత్మాంతర్యామ్యమృతః" అను శ్రుతి ప్రమాణము. ౬

అవ. అనేకప్రాణులును తద్బుద్ధులును ప్రకాశించుచుండఁగా, అద్వైత మెట్లు సిద్ధించుననుశంక కుత్తరమిచ్చుచున్నారు. గతార్థమైనను మందబుద్ధులుచేయు శంకలకు మాతవలె పరమ కృపాళువులగు శ్రీ శంకరభగవత్పాదులు శ్రుతియుక్తి దృష్టాంతపురస్సరముగ తత్సందేహనివృత్తికై తిరిగితిరిగి బోధించుచుండుటచే నీశాస్త్రమందు పునరుక్తిదోషము శంకింపఁదగదు.

మూ. జనిమజ్జ్ఞానవిజ్ఞేయం స్వప్నజ్ఞానవదిష్యతే,
నిత్యం నిర్విషయం జ్ఞానం తస్మాద్ద్వైతం న విద్యతే. ౭

తా. ఏయేవస్తువు పుట్టుకకలిగి జ్ఞానగోచరమై జడమగుచునుండునో యాయావస్తుజాతమంతయు స్వప్నమందలి వస్తుజాతమువలె జాగ్రదవస్థయందును మిథ్యయే. జ్ఞేయపదార్థము సత్తుకానందున జ్ఞానము విషయము కాక సకలవస్తువినాశసాక్షియై వినాశరహితమై నిత్యమగును. వినాశరహితమగు బ్రజ్ఞానమునకు స్వప్నతుల్యములగు నశ్వరపదార్థములవలన ద్వైతము సిద్ధింపదు.

1 ప్ర. భాసించెడి ద్వైతమెట్లు సిద్ధింపదు?

ఉ. ఆరోపితద్వైతముచే పరమార్థమగు నద్వైతమునకు బాధ కలుగకపోవుటచే ద్వైతము సిద్ధింపదు.

2 ప్ర. దీనికి తగినదృష్టాంతమేది?

ఉ. ఒకగదిలో గోడకు పది అద్దములు వరుసగా కట్టఁబడియున్నవి. ఆగదిలో నీవొక్కఁడవునుండిచూచునపుడు నీప్రతిబింబములు పదిగా కనుపించు నంతమాత్రాన నీవు అనేకులు కాలేక యొక్కఁడవే యగుదువుకదా. ఇట్లే ఆరోపితప్రతిబింబములు అసత్యగుటవలన వీనికి బింబమగు సత్పదార్థము ఏకమే.

3 ప్రజ్ఞానము నిత్యమెట్లగును—మునుపు నేనట్లనుకొనినాను, కాని అదిమఱచిపోయినాను. ఇప్పు డిది యిట్లుకావచ్చును. అనెడి జ్ఞానమునకు ఉత్పత్తివినాశములు కలుగుచుండఁగా నది నిత్యము కారాదుగదా?

ఉ. 'ప్రజ్ఞానము, వృత్తిజ్ఞానము,' అని జ్ఞానము ద్వివిధము. వృత్తి జ్ఞానమనఁగా ధీవృత్తి వ్యాపించఁగా గలిగెడి పదార్థజ్ఞానము. ఇది బుద్ధితోఁ గూడ కలుగుచు నశించుచునుండును. సుషుప్తియందు బుద్ధిలేనందున నీవృత్తి జ్ఞానముసయితము లేదు. ఈవృత్తిజ్ఞానము కలుగును నశించునని తెలిసెడి జ్ఞానము ప్రజ్ఞానము. ఇది అజము అమరము బ్రహ్మము. ఇందుకు-"ప్రజ్ఞానం బ్రహ్మ" అను మహావాక్యము ప్రమాణము. ౭

అవ. స్వరూపజ్ఞానమునకుఁ జెప్పిన నిత్య నిర్విషయత్వములను శ్రుతిబలముచే దృఢపఱుచు చున్నారు:—

మూ. జ్ఞాతుర్జ్ఞాతిర్హి నిత్యోక్తా సుషుప్తేత్వన్యశూన్యతః,
జాగ్రజ్జ్ఞాతిస్తు విద్యా తత్తద్గ్రాహ్యం చాసదిష్యతామ్. ౮

తా. సుషుప్తియందు ఆత్మకంటె నన్యవస్తువు లేనందున జ్ఞాతయగు ఆత్మయొక్క జ్ఞానము నిత్యమని యాశ్రుతి ప్రతిపాదించెను.

శ్రు. "యద్వై తన్న పశ్యతి పశ్యన్వై తన్న పశ్యతి న హి ద్రష్టుర్దృష్టేర్వి పరిలోపో విద్యతేఽవినాశిత్వాన్న తు తద్ద్వితీయమస్తి తతోఽన్యద్విభక్తం యత్ పశ్యేత్." సుషుప్తియందు విషయములు లేనందున జ్ఞానము నిర్విష యము, అనశ్వరము, నిత్యమును గాఁదగును. కాని మఱియొక యవస్థయందు సవిషయమగు జ్ఞానము నిత్యముకాదను శంకకు త్తరము:—జాగ్రదిత్యాది శ్రుతిసిద్ధమగు నిత్యజ్ఞానము నిర్విషయము. కావున జాగ్రదవస్థయందలి జ్ఞానము విషయమును గోచరించుచు అవిద్యాప్రాప్తమగుటచే భ్రాంతియే యగును. గ్రాహ్యమగు పదార్థము అసత్తని తెలియవలెను.

1 ప్ర. ఈజాగ్ర జ్జానము భ్రాంతి యెట్లగును?

ఉ. నిర్వికారమగు ఆత్మకు జ్ఞాతృత్వము లేదు. జడమగు నంతఃకర ణమునకు జ్ఞానములేదు. కనుక, సవిషయజ్ఞానము ఆత్మాంతఃకరణములు రెండింటికి పరస్పరాధ్యాసమువలనఁ గలుగును. ఇట్టి అధ్యస్త (ఆరోపింపఁబడిన) జ్ఞానమువలన గ్రహించెడి విషయజాతము పరమార్థముకాదు.

2 ప్ర. ఆత్మచైతన్యము నిత్యమనుట కేమి ప్రమాణము?

ఉ. జాగ్రదవస్థయందుఁగూడ విషయాకారబుద్ధివృత్తులు స్ఫురణా వృతములైయుండుటచే సకలవృత్తుల యుత్పత్తిస్థితివినాశములకు సాక్షిగ నిత్యము ఏకమునగు స్ఫురణ మవశ్య మంగీకర్తవ్యమై యుండును. కనుక ఆ స్ఫురణరూపాత్మచైతన్యము కాలత్రయాబాధ్యము నిత్యము నగును.

3 ప్ర. ఆ జ్ఞానము నిర్విషయ మెట్లు?

ఉ. ధీవృత్తి సమకాలమందే విషయములు స్ఫురించుచుండుటవలనను, సుషుప్తియందు విషయములు స్ఫురింపకున్నను స్ఫురణము నశింపనందునను, స్ఫురణము విషయములచే నిరూపింపఁదగనందునను, జ్ఞానము నిర్విషయమనఁ బడును.  ర

అవ. "ఆత్మావా ఒరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః" అను శ్రుతివలన ఆత్మ దర్శనశ్రవణాదిక్రియకుఁగర్మయని చెప్పఁబడుటవలన దృశ్యమగు ఆత్మ రజ్జ్వారోపితభుజంగమువలె ననిత్యమగు ననుశంక రాఁగా "అశబ్దమస్పర్శమరూప మవ్యయం తథాఽరసం నిత్యమగంధవచ్చ యత్."- "న చక్షుషా గృహ్యతే నాపి వాచా నాన్యైర్దేవై స్తపసా కర్మణా వా" ఈ మొదలగు శ్రుతివిరోధమువలన రూపాదివిహీనవస్తువు దర్శనాదివిషయము కాకపోవుటచే "ద్రష్టవ్య" ఇత్యాదిశ్రుతి. అర్హార్థతవ్యప్రత్యయ యోగమువలన "ద్రష్టుం+అర్హః=ద్రష్టవ్యః" అను వ్యుత్పత్తిచేత ఆత్మ దర్శనశ్రవణార్హ్యమని ఉపదేశించుచు అనాత్మను నిరాకరించుటకై ప్రవర్తించెనని చెప్పుచున్నారు:—

మూ. రూపవత్త్వాద్యసత్త్వాన్న దృష్ట్యాదేః కర్మతాయథా,
ఏవం విజ్ఞానకర్మత్వం భూమ్నో నాస్తీతి గమ్యతే. ౯

తా. ఆత్మ రూపాదులులేనిదగుటచే దర్శనాదిక్రియకుఁ గర్మము కానివిధమున విజ్ఞానక్రియకును గర్మముకాదని నిశ్చయము.

1 ప్ర. భూమశబ్దార్థ మేమి?
ఉ. భూమమనఁగా వ్యాపకమగు బ్రహ్మము.

2 ప్ర. ఈబ్రహ్మము విజ్ఞానకర్మ మెట్లు కాదు?
ఉ. "యత్ర నాన్యత్పశ్యత్యాత్మాన మేవ పశ్యతి" అను శ్రుతికి పైని

చెప్పిన శ్రుతిద్వయముతో విరోధమువలన రూపాదివిహీనమగు బ్రహ్మము చూడఁదగినది, అనెడు పైశ్రుతివలెనే ఆత్మను చూచునను శ్రుతికూడ ఆత్మేతరము చూడఁదగినదికాదను నర్థమును బోధించునదనియు ఆత్మదర్శనమును విధించునదికాదనియు భావము. కావున బ్రహ్మము విజ్ఞానకర్మమును గాదు.

ఇది సూక్ష్మతావ్యాపితా ప్రకరణము.



శ్రీః

# ఉపదేశసాహస్రి

(శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యప్రణీతము.)

## శ్లోకప్రబంధము - దశమప్రకరణము.



### ౧౦. పరమార్థదర్శన ప్రకరణము.

అవ. ఆత్మ నిర్విషయస్వభావకమని పూర్వప్రకరణమందు యుక్తులచే చెప్పఁబడెను. దాని నిపుడు స్వానుభవ ద్వారమున ప్రకటింపుచు సుషుప్తియందువలె ఆత్మజ్ఞానము విషయము లేకయే కలుగు ననుట నీప్రకరణమందు దృఢపఱుచు చున్నారు:—

మూ. దృశిస్వరూపం గగనోపమం పరం
సకృద్విభాతం త్వజమేకమక్షరమ్,
అలేపకం సర్వగతం యదద్వయం
తదేవ చాహం సతతం విముక్త ఓమ్. ౧

తా. జ్ఞానస్వరూపమును, ఆకాశమువలె నసంగమును,పరిపూర్ణమును, నొకసారి గురుప్రసాదమువలన స్ఫురించి సర్వదా భాసమానమును, జనన మరణరహితమును, ఏకము సకలవికారపదార్థగతదోషసంగరహితమును, సర్వ గతమును, ద్వైతవర్జితమునగు బ్రహ్మమే నేను. కావున నిత్యముక్తుఁడను ఓంకార లక్ష్యము నగుదును.

1 ప్ర. ఈశ్లోకాంతమున 'ఓం'కార మేల చెప్పవలెను?

ఉ. ఓంకార మనఁగా శ్లోకోక్తమగు లక్షణ లక్షితమగు బ్రహ్మము. ఓంకారముచేత ముముక్షుబుద్ధ్యభివ్యక్తమగునని సూచింపఁబడెను. (ఓం = ఔను). ౧

అవ. ఆకాశమునకువలె దృగాత్మకు అలేపకత్వము సంభవింపదు. ఆత్మకు దృశ్యసంబంధమువలన నశుద్ధివికార దోషములు సంభవించునను శంక రాఁగా, దృక్కు ఆత్మస్వరూపము గనుక ఆ యాత్మకు నిత్యత్వశుద్ధత్వాదులు శ్రుతిచేఁ జెప్పఁబడుటవలన నట్లనరాదని శ్రుతిసిద్ధార్థమును ప్రకటన చేయుచున్నారు.

మూ. దృశిస్తు శుద్ధోఽహమవిక్రియాత్మకో
న మేఽస్తి కశ్చిద్విషయః స్వభావతః,
పురస్తిరశ్చోర్ధ్వమధశ్చ సర్వతః
సంపూర్ణభూమా త్వజ ఆత్మని స్థితః. } ఓం ౨

తా. నేను జ్ఞానస్వరూపుఁడను, శుద్ధుఁడను, వికారాత్మకమగు ప్రాణాదికముకంటె వేరైనవాఁడను. ఇందుకు "శుద్ధమపాపవిద్ధం"-"అప్రాణో హ్యమనాః శుభ్రః"-"అస్థూలమనణ్వహ్రస్వమదీర్ఘం" ఈ మొదలగు శ్రుతులు ప్రమాణము.

నాకు స్వభావమువలన నేవైపునను విషయసంబంధము లేదు. జననాది వికారములు లేక పూర్ణమై భూమశబ్దార్థ బ్రహ్మమగు నేను స్వమహిమయందు భాసింతును.

1 ప్ర. ఆత్మకు విషయసంసర్గమేల లేదు?

ఉ. "న తదశ్నాతి కించన, న తదశ్నాతి కశ్చన" అను శ్రుతివలన ఆత్మ దేనిచేతను అనుభవింపఁబడదు. దేనిని అనుభవింపదు. కనుక నిర్విషయ మనఁబడును.

2 ప్ర. విషయసంబంధ మెంతమాత్రమును లేదనుట యెట్లు?

ఉ. "సః భగవః కస్మిన్ ప్రతిష్ఠితః ఇతి స్వే మహిమ్ని యదివా న మహిమ్నీతి" అను శ్రుతి ఆత్మస్వరూపము. అన్యనిష్ఠము కాదని నిరూపించెను. ఆయర్థమునే వివరించుటకు "ఇది" అని ప్రాచ్యాది దిగ్విభాగముచేతను, అధరోత్తరాది విభాగముచేతను తెలియఁబడున దంతయు "నేను" అని తెలిసికొనునట్టి అహంకారాది దేహాంతమును జూచువాఁడును సర్వమును బ్రహ్మమేకాని వేఱుకాదు. ఇది, అది, నేను అను భేదము వ్యావహారికము గాని పారమార్థికము కాదని ఛాందోగ్యశ్రుతి విశదపరుచుచున్నది.

3 ప్ర. ఆత్మ స్వమహిమయం దుండుననుట కేమి ప్రమాణము?

ఉ. జనించిన వస్తువు అన్యాధీనమగును. జననాదికము లేని ఆత్మ అన్యాధీనము కాక స్వమహిమయందు ఉన్నదని చెప్పఁబడెను. ౨

అవ.—ఆత్మ జననమరణాదివికారములు లేక కూటస్థాద్వయస్వభావము గలదని నిరూపించెడి శ్రుతులను వానియర్థమును వివరించుచున్నారు:—

మూ. అజోఽమరశ్చైవ తథాఽజరోఽమృతః
స్వయంప్రభః సర్వగతోఽహమద్వయః,

న కారణం కార్యమతీవ నిర్మలః
సద్వైకతృప్తశ్చ తతో విముక్త ఓమ్.   3

తా. స్వయంప్రకాశమానమగు ఆత్మ జననమరణ జరాదివికారములు లేక యంతట నిండి కాలత్రయమందు నద్వయమైయున్నది. ఆయాత్మ కారణము కాదు, కార్యమును గాదు. ఎప్పుడును నిర్మలము, ఆనందమాత్ర సంతృప్తము నై యుండును. అని గురూపదిష్టాంశమును విమర్శించిన శిష్యుఁడ వగు నీవు సర్వదోషరహితుఁడవనెడి గురుప్రోక్తార్థము సత్యము. అహంపద లక్ష్యార్థమగు నేను ముక్తుఁడనే యనునర్థమును అంగీకారార్థకమగు ఓంకారముచే స్వానుభవప్రకారము సూచించెను.

ఇందుకుఁ బ్రమాణమగు శ్రుతులు:—

"అజో నిత్యః శాశ్వతోఽయం పురాణః,
సవా ఏష మహానజ ఆత్మాఽజరోఽమృతోఽభయో బ్రహ్మ."

"తచ్ఛుభ్రం జ్యోతిషాం జ్యోతిః నిత్యం విభుం సర్వంగతం సుసూక్ష్మం." - "ఏకో దేవః, ఏకమేవాద్వితీయం, తదేతద్బ్రహ్మ పూర్వమనపర మనంతర మబాహ్యమ్."

"నిరంజనః పరమం సామ్యముపైతి, ఆనందం బ్రహ్మణో విద్వాన్న బిభేతి కుతశ్చన విముక్తశ్చ విముచ్యతే."   3

అవ. అవస్థాత్రయమందు వేరువేరుగ భాసించెడి యాత్మ నిర్వికారమెట్లగునను శంకకుత్తరము:—

మూ. సుషుప్తజాగ్రత్స్వపతశ్చ దర్శనం
న మేఽస్తి కించిత్సు మతేర్హి మోహనమ్,
స్వతశ్చ తేషాం పరతోఽప్యసత్వత
స్తురీయ ఏవాస్మి సదా దృగద్వయః.   ౪

తా. మాయికములగు జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలను సాక్షిమాత్రముగ ననుభవించెడి నాకు ఆత్మీయవస్తు వేదియు పారమార్థికమగునది లేదు. ఉన్నదనుట మతివిభ్రమమే. ఆయవస్థలు స్వయముగఁగాని పరాపేక్షచేఁగాని వాస్తముకానందున ఉన్నవనుట అజ్ఞానవిలసితమే. కావున నీయవస్థాత్రయ సాక్షియగు నద్వయబ్రహ్మము తురీయమనఁబడును.

1 ప్ర. జాగ్రదాద్యవస్థలకు స్వతఃస్ఫూర్తి యేల లేదు ?

ఉ. ఈయవస్థలు వచ్చుచుఁ బోవుచుండుటచే రజ్జువునం దారోపింపఁబడిన సర్పత్వమువలెనే భ్రాంతిమూలకములగుటచే స్వీయమగు సత్తాస్ఫూర్తులు వానికి లేవు.

2 ప్ర. ఈయవస్థలకు పరతః స్ఫూర్తి యేల లేదు ?

ఉ. పరము చైతన్యము, ప్రత్యక్కగు చైతన్యమునకు పరాక్కగు బాహ్యపదార్థములతో విరోధమువలన తాదాత్మ్యము సంభవింపనందున పరతః సత్తాస్ఫూర్తులు చెప్పరాదు.

3 ప్ర. ప్రత్యగాత్మకు పరాక్పదార్థములతో తాదాత్మ్యము లేదా ?

ఉ. ఈతాదాత్మ్యము భ్రాంతిమూలకము.

4 ప్ర. విశ్వతైజసప్రాజ్ఞ నామకులు ఆత్మ కారాదా ?

ఉ. ఆయా యవస్థానుసారముగ నాయా పేర్లు కలిగినవి. నామరూపరహితుఁడగు ఆత్మకు అవి సత్యములు కావు.

5 ప్ర. ఆత్మస్వరూపమేమి ?

ఉ. ఆత్మ తురీయమనఁబడును.

6 ప్ర. అద్వితీయాత్మను తురీయమనఁదగునా ?

ఉ. వ్యవహారదశయందు విశ్వతైజసప్రాజ్ఞాపేక్షచే తురీయమనఁబడును గాని, అద్వయబ్రహ్మమునకు నామరూపములు కల్పితములగుటచే నీతురీయ సంజ్ఞయు వాస్తవము కాదు.

7 ప్ర. ఆత్మ ఎద్ది?

**ఉ.** ఈసర్వావస్థల నెప్పుడును జూచుచుండుటచే దృక్కు (సర్వద్రష్ట) యనునదియే ఆత్మ.

8 ప్ర. విశ్వాదులు సర్వద్రష్టలు కారాదా?

**ఉ.** విశ్వుఁడు జాగ్రదవస్థనేకాని యితరమును జూడలేఁడు. తైజసుఁడు స్వప్నమును మాత్రమేకాని యితరమును జూడలేఁడు. ప్రాజ్ఞుఁడు సుషుప్తినేకాని యితరమును జూడలేఁడు. సర్వావస్థాసాక్షి తురీయుఁడే. స్థూలసూక్ష్మాదిక్రమమున విమర్శించి చూడఁగా విశ్వాదిస్థానత్రయాపోహముచే నిశ్చయింపఁబడునది తురీయమనఁబడును. కాని తురీయత్వము వాస్తవముకాదని అద్వయమను విశేషణము సూచించుచున్నది. అట్టి నిర్విశేషబ్రహ్మము నేనే. ౪

అవ. శరీరాదిసంబంధము ప్రత్యక్షముగఁ గనిపించుచుండఁగాఆత్మ నిర్విశేషమెట్లగునను శంకకుత్తరము:—

మూ. శరీరబుద్ధీంద్రియదుఃఖసంతతి
ర్న మే న చాహం మమ నిర్వికారతః,
అసత్త్వహేతోశ్చ తథైవ సంతతే
రసత్త్వమస్యాః స్వపతో హి దృశ్యవత్. ౫

తా. నేను నిర్వికారుఁడనగుటచే శరీరబుద్ధీంద్రియాదులగు దుఃఖసంతతి నేనుకాను. అవియును నావికావు. స్వప్నావస్థయందలి దృశ్యవర్గము మిథ్యయగునట్లు జాగ్రదవస్థయందును శరీరబుద్ధీంద్రియాది దృశ్యవర్గము మిథ్యయగుటవలన యివి నేను కాను. ఇవి నావియు కావని తాత్పర్యము.

1 ప్ర. 'శరీరాదులు ఆత్మ కావు. ఆత్మీయములును కావు' అనుచోట మఱియొక ప్రమాణము కలదా?

ఉ. ఆత్మ నిర్వికారమగుటచే ఆగమాపాయములు కలదిగాదు. కావున శరీరాదికముగను బరిణమింపదు. శరీరాదికముతోను గలియదు. పరిణమించునేని తత్స్వరూపత్వమును తద్ధర్మత్వమును ఆత్మకుఁ జెప్పఁదగి యుండును. నిర్వికారమగుటచే ననఁగా పరిణామసంయోగములలో నేదియు లేనందున, శరీరాదులు ఆత్మ కావు, ఆత్మీయమును గావని నిశ్చయము. స్వప్న పదార్థము ఆత్మ కాదు. ఆత్మీయమును గాదని సర్వవిదితమే కదా. కనుకనే "స్వపతో హి" అని మూలమందు నిశ్చయార్థకమగు 'హి' శబ్ద ముచ్చరింపఁ బడెను. ౫

అవ. దృశ్యము లగుటవలన శరీరబుద్ధీంద్రియాదులు మిథ్యయగునట్లు దృశ్యములగు శుద్ధత్వావిక్రియత్వాది ధర్మములును మిథ్య యేల కారాదను ప్రశ్నకుత్తరము:—

మూ. ఇదం తు సత్యం మమ నాస్తి విక్రియా
వికారహేతుర్నహి మేఽద్వయత్వతః,
న పుణ్యపాపే న చ మోక్షబంధనే
న చాస్తి వర్ణాశ్రమితాఽశరీరతః. ౬

తా. అద్వితీయుఁడనగు నాకు వికారములుగాని వికారహేతువులుగాని లేవు. అశరీరుఁడనగు నాకు పుణ్యపాపములు బంధమోక్షములు వర్ణాశ్రమములును లేవు. ఆత్మకు స్వయముగఁగాని పరమువలనఁగాని వికారములు లేవను మాట సత్యమని "అవిక్రియమ్" అను విశేషణము సూచించుచున్నది. అశుద్ధత్వమువలెనే శుద్ధత్వమును వికారమె. ఆగమాపాయములు

గలవగుటవలన నీద్వంద్వములు వికారములగుచు నవిక్రియాత్మను స్పృశింపవు. అశరీరత్వమనుమాట పైశ్లోకమున వివరింపఁబడెను. ౬

అవ. ఆత్మ శరీరాదికముగఁ బరిణమింపనందునను, ఆత్మకు ఆశరీరాది ధర్మసంయోగము లేనందునను శరీరి కాకపోవచ్చును. కాని, ఆత్మ శరీరమందు ఉపలభ్యుఁడగుటచే శరీరియని యేల చెప్పరాదు అని శంకింపఁగా, ఇటువంటి శరీరసంబంధమువలన కర్త్రాదియోగము లేదనునభిప్రాయముతో పూర్వోక్తమైనశరీరాభావమును పుణ్యపాపాదిధర్మసంబంధాభావమును సయుక్తికముగ నిరూపించుచున్నారు:—

మూ. అనాదితో నిర్గుణతో న కర్మ మే
ఫలం చ తస్మాత్పరమోఽహమద్వయః,
యథా నభః సర్వగతం న లిప్యతే
తథా హ్యహం దేహగతోఽపి సూక్ష్మతః. ౭

తా. అనాదియు నిర్గుణుఁడునగు నాకొక క్రియగాని క్రియాఫలముగాని లేదు. కావున సర్వవికారముకంటె నుత్తరుఁడనగు నేను అద్వయుఁడను, సర్వమును వ్యాపించియున్న యాకాశము అమూర్తమగుటచే నాయాపదార్థగతదోషముల నంటక వెలుఁగువిధమున అమూర్తమగు నేను దేహమం దుపలభ్యమానుఁడనైనను ఆయాధర్మముల నంటక భాసింపుదుడు.

1 ప్ర. ఆత్మకు పుణ్యపాపజన్యమగు సుఖదుఃఖములు ప్రత్యక్షముగఁ గనిపించుచుండఁగా నెట్లు లేదనఁదగు?

ఉ. ఆత్మకు శరీరము లేనందున నేక్రియయుకు లేదు. ఏక్రియయు లేనందున ఏతజ్జన్యసుఖదుఃఖములును లేవు. ఇవి కలవనుకొనుట, కలవలె

భ్రాంతియేయని భగవంతుఁడు అర్జునున కుపదేశించెను. "అనాదిత్వాన్నిర్గుణత్వాత్పరమాత్మాఽయమవ్యయః, శరీరస్థోఽపి కౌంతేయనకరోతి న లిప్యతే. యథా సర్వగతం సౌక్ష్మ్యాదాకాశం నోపలిప్యతే, సర్వత్రావస్థితో దేహే తథాఽఽత్మానోపలిప్యతే." గీత, అ-౧౩, శ్లో-౩౧, ౩౨. ౭

అవ. ఉపలబ్ధిస్థానమగు దేహాదులయొక్క వైషమ్యము వలన నచటఁ దెలియఁబడు ఆత్మకుఁ గూడ నా దేహాదికృత వైషమ్యము సంభవించుటవలన పరమాత్మత్వము పరిపూర్ణ మట్లగునను శంకకుత్తరముఁగ నీతారతమ్యము అవిద్యాకృతము గాని పారమార్థికము కాదని చెప్పుచున్నారు:—

మూ. సమా చ భూతేషు సమోఽహమీశ్వరః
క్షరాక్షరాభ్యాం పరమో హ్యథోత్తమః,
పరాత్మతత్త్వం చ తథాఽద్వయోఽపి సన్
విపర్యయేణాభిమతస్త్వవిద్యయా. ౮

తా. నేను వశీకృతమాయుఁడను, క్షరాక్షర విలక్షణుఁడను, పరముఁడను, ఉత్తముఁడను, సర్వభూతములందు సముఁడను, ఇట్లు పరాత్మతత్త్వుఁడను, అద్వితీయుఁడను నయ్యును అవిద్యచే వ్యతిరిక్తముగఁ దోఁచుచుండుదును. గీత (అ - ౧౫, శ్లో-౧౬, ౧౭, ౧౮) యం దీయర్థము చెప్పఁబడెను. "ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ, క్షరః సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే. ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః, యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః. యస్మాత్ క్షరమతీతోఽహమక్షరాదపి చోత్తమః, అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః." ఇతి. ౮

అవ. ఆత్మకు అవిద్యాసంబంధము కలదా యనఁగా, లేదని చెప్పుచున్నారు:—

మూ. అవిద్యయా భావనయా చ కర్మభి
ర్వివిక్త ఆత్మాఽవ్యవధిః సునిర్మలః,
దృగాదిశక్తిప్రచితోఽహమద్వయః,
స్థితః స్వరూపే గగనం యథాఽచలమ్. ౯

తా. ఆత్మకు మూలాజ్ఞానముతోఁగాని తత్కృత దేహాభిమానముతోఁ గాని, దేహాభిమానపూర్వకకర్మములతోఁ గాని సంబంధములేదు. అవిద్యాకృత వ్యవధానము లేనందున నిర్మలుఁడును అద్వయాత్ముఁడును నగునేను ద్రష్టనై స్వరూపమందె యుండి పరిపూర్ణుఁడనై ఆకాశమువలె నిశ్చలుఁడ నగుదును.

1 ప్ర. ఆత్మకు అవిద్యాసంబంధ మెట్లు లేదు ?

ఉ. చిత్ప్రకాశము ఆత్మయని శ్రుతి స్మృతి పురాణేతిహాసములు చెప్పుచున్నవి. అవిద్య అజము, అప్రకాశము ననియుఁ బ్రసిద్ధము. కనుక విరుద్ధ స్వభావముగలవగుటచే ఆత్మకును నవిద్యకును సంబంధము దుర్ఘటము గనుక ఆత్మ అవిద్యాశ్రయము కాదు. అవిద్యకుఁ బ్రకాశమించుకేనియు లేదు. ఆత్మకు అవిద్యాసంబంధమును లేదు. ఈసంబంధము ఆత్మకుఁ గలదని అజ్ఞు లనుకొనుట తమోరహితుఁడగు సూర్యునకు గుడ్లగూబలచేఁ గల్పితమగు చీకఁటివలె భ్రాంతిమూలకమేకాని వాస్తవముకాదు.

2 ప్ర. అట్లేని నేను ద్రష్టను, శ్రోతను, బోద్ధను, అనుజ్ఞాన మెట్లు కలుగును?

ఉ. అవిద్యాధ్యస్తాంతఃకరణపరిణామరూపదృక్కునకు శ్రోత్రాదిశక్తి

సంబంధమువలననే ద్రష్టృత్వాదికము భాసించినను నదియును వాస్తవము కాదు. ౯

అవ. ఇట్టి ఆత్మతత్త్వము తెలియఁబడఁగా మోక్షము సిద్ధించునని చెప్పుచున్నారు:—

మూ. అహం పరం బ్రహ్మ వినిశ్చయాత్మదృ
ఙ్న జాయతే భూయ ఇతి శ్రుతేర్వచః,
న చైవ బీజేత్వసతి ప్రజాయతే
ఫలం న జన్మాస్తి తతో హ్యమోహతా. ౧౦

తా. "బ్రహ్మైవాహ"మ్మని నిశ్చితాత్మజ్ఞానముగలవాఁడు తిరిగి జన్మింపఁడని శ్రుతి చెప్పుచున్నది, ఎట్లనఁగా "సతు తత్పదమాప్నోతి యస్మాద్భూయో న జాయతే, పురుషాన్న పరం కించిత్సా కాష్ఠా సా పరాగతిః, అథసోఽభయంగతో భవతి బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి" అనుశ్రుతులు బ్రహ్మజ్ఞానమువలన బ్రహ్మభావమును బొందినవానికి భయములేదు. బీజము లేనియెడల మొలక మొలవదుకదా? ఇట్లు అవిద్యాబీజధ్వంసమువలన జననాదికార్యములేదు. జన్మాదివికారము మోహమనెడి అవిద్యవలనఁ గలిగిన దగుటచే నవిద్య పోఁగానే తత్కార్యమగు జన్మాదికము లేదనిభావము. ౧౦

అవ. మోహకార్యమగు సంసారము మోహము తొలఁగఁగనే తొలఁగును అని చెప్పఁబడెను. అందు మోహకార్యము ఎట్టిదను శంకకుత్తరము:—

మూ. మమేదమిత్థం చ తథేదమీదృశం
తథాఽహమేవం న పరో న చాన్యథా,

విమూఢతైవం న జనస్య కల్పనా
సదా సమే బ్రహ్మణి చాద్వయే శివే.     ౧౧

తా. మొదట స్థూలసూక్ష్మదేహములందు నేననుబుద్ధియు, తరువాత నిది నాది యని బాహ్యార్థమందు మమకారమును, పిమ్మట నిది మంచి దను నధ్యాసమును, అనంతరమిది నాది, అదియు నిట్టిదేకాని, నాది దానివలె లేదనెడి కల్పనయు, నేనిట్టివాఁడను, పరుఁ డింతవాఁడు కాఁడు, మరి యొకవిధముగనున్నాఁడా లేఁడా యనియు, నాకు అజ్ఞానము వానికి జ్ఞానము కలదనియు, నీవిధముగ ననాద్యజ్ఞానతిరోహితాత్మస్వభావముగల జనునకు గలిగెడి యీకల్పనము, హెచ్చుతగ్గులులేక సదా సమమై అద్వితీయము పరమానందరూపమునగు బ్రహ్మమం దించుకేనిలేదు.     ౧౧

అవ. ఇట్లు విచిత్రమగు సంసారమునకు నివృత్తి, ఆత్మతత్త్వజ్ఞానముచే మూలాజ్ఞానము తొలఁగఁగనే కలుగునని చెప్పిన యంశమును విశదపరుచుచున్నారు:—

మూ. యదద్వయం జ్ఞానమతీవ నిర్మలం
మహాత్మనాం తత్ర న శోకమోహతా,
తయోరభావే న హి కర్మజన్మ వా
భవేదయం వేదవిదాం వినిశ్చయః.     ౧౨

తా. అద్వయాత్మాకారమును, అసంభావనా విపరీతభావనాది ప్రతిబంధరహితమునగు జ్ఞానముదయింపఁగా బ్రహ్మభూతులగు జ్ఞానులకు శోకమోహాత్మకమగు సంసారము కలుగదు. ఆ శోకమోహములు వానిచే నూహింపఁబడెడి తత్కారణాజ్ఞానము నివర్తింపఁగా వేఁచఁబడిన బీజము మొలువని తెరఁగున కారణావిద్యానాశమువలన జన్మాదికము తిరిగి సంభవింపదని వేదార్థవిదుల వినిశ్చయము. ఇందుకు—"తత్ర కో మోహః కః శోక

ఏకత్వమనుపశ్యతః" అనియు, "భిద్యతే హృదయగ్రంథిః ఛిద్యంతే సర్వ సంశయాః, క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే" అనియు శ్రుతులు క్రమముగఁ బ్రమాణములు. ౧౨

అవ. ఇట్లు చెప్పఁబడిన ఆత్మవేత్తయొక్క స్వరూపమును జెప్పుచున్నారు:—

మూ. సుషుప్తవజ్జాగ్రతి యో న పశ్యతి
ద్వయం తు పశ్యన్నపి చాద్వయత్వతః
తథా చ కుర్వన్నపి నిష్క్రియశ్చ యః
స ఆత్మవిన్నాన్య ఇతీహ నిశ్చయః. ౧౩

తా. ద్వైతము మిథ్యయని బాధింపఁబడుటవలన వాసనావశమున నజ్ఞానావస్థయందువలె భాసించెడి ద్వైతప్రపంచమును సామాన్యముగఁ జూచుచున్నను, జ్ఞాని దగ్ధపటన్యాయమున సుషుప్త్యవస్థయందు ప్రత్యగాత్మయందది ప్రతిలీనమైనట్లుగనే భావించును. మఱియుం వాసనావశమున పూర్వమువలె స్నానశౌచభిక్షాటనాదికము చేయుచున్నను, నిష్క్రియుండనని తలఁచువాఁడే ఆత్మవేత్త, ఇతరుఁ డాత్మవేత్తకాఁడు అని నిశ్చయము.

1 ప్ర. కర్మలను జేయువాఁడు నిష్క్రియుఁ డెట్లగును?

ఉ. జ్ఞాని వ్యవహారదశయందును నిష్క్రియత్వ పరిపూర్ణత్వాత్మక బ్రహ్మస్వరూపమును విడువక యేకాకారముగ నుండుటచే నిష్క్రియుఁ డగును. వేఁచిన బీజము భక్షణమాత్రోపయోగమే కాని మొలవకుండునట్లు జ్ఞాని చేయునట్టికర్మము దేహధారణ మాత్రోపయోగమగుచు జన్మాదిసాధనము కాదు. దేహాదికమందు తాదాత్మ్యాధ్యాసము లేనందున నిష్క్రియుఁ డనుటకు సంశయము లేదు.

2 ప్ర. శాస్త్రజ్ఞులందఱు నిట్టివారేనా?

ఉ. తాదాత్మ్యాధ్యాసము స్వకారణమూలాజ్ఞానముతోఁ గూడ నశించినపు డట్టిబ్రహ్మవేత్తయే నిష్క్రియుఁ డనఁబడఁదగును. కాని శాస్త్రార్థ మెఱిఁగినను వ్యవహారదశయందు నేను జ్ఞాతను, కర్తను ననెడియభిమానముగల వాఁడు నిష్క్రియుఁడు కానేరఁడు. ౧౩

అవ. శాస్త్రానుసారముగను, యుక్తిపూర్వకముగను, స్వానుభవమును జూపించి యీ దృష్టి దృఢమగువానికి కృతకృత్యత కలుగునని చూపుచు, ఇతరులయం దనుగ్రహబుద్ధితో నీప్రకరణము చెప్పఁబడెనని సూచించుచున్నారు:—

మూ. ఇతీదముక్తం పరమార్థదర్శనం
మయా హి వేదాంతవినిశ్చితం పరమ్,
విముచ్యతేఽస్మిన్యది నిశ్చితో భవే
న్న లిప్యతే వ్యోమ ఇవేహ కర్మభిః. ౧౪

తా. వేదాంతశాస్త్రమందు ధ్రువమగు నీపరమార్థదర్శన మిట్లు వర్ణింపఁబడెను. ఈయర్థమందు దృఢమగు నిశ్చయముగలవాఁడు ముక్తిని జెందును. మఱియును ఆకాశమునకు రజస్స్పర్శము లేనట్టు జ్ఞానికి కర్మలేపము కలుగదు. ౧౪

ఇది పరమార్థదర్శనప్రకరణము.



శ్రీః

# ఉపదేశసాహస్రి

(శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యప్రణీతము.)

## శ్లోకప్రబంధము-ఏకాదశ ప్రకరణము.



### ౧౧. ఈక్షితృత్వప్రకరణము.

అవ. కర్మమువలనఁగాని, కర్మసహితజ్ఞానమువలనఁగాని, అనుమానాది ప్రమాణమువలనఁగాని, ముక్తి సిద్ధించుచుండఁగా, బ్రహ్మాత్మైక్యజ్ఞానమాత్రనిష్ఠునకే ముక్తికలుగుననియు, నిది వేదాంతనిశ్చితమనియు నిటఁ జెప్పఁబడెను. వీనిలో ముక్తికిఁ గారణమేదియో తెలియక సందిగ్ధముగ నుండుటచే, దేనిని ముక్తికారణముగ నమ్ముదును? అను శంకను బరిహరించుటకు నీ ప్రకరణ మారంభింపఁబడుచున్నది:—

మూ. ఈక్షితృత్వం స్వత స్సిద్ధం
జంతూనాం చ తతోఽన్యతః,
అజ్ఞానాదిత్యతోఽన్యత్వం
సదసీతి నివర్త్యతే. ౧

తా. జ్ఞానమువలననే ముక్తి కలుగును. జ్ఞానము వేదాంతమహావాక్యములవలననేకాని అనుమానాదికముచేఁ గలుగదని సాధించుచున్నాఁడు. 'నీవు సచ్ఛబ్దలక్ష్యార్థమగు బ్రహ్మమవు. కాని సంసారివి కావు' అను "తత్త్వమసి" వాక్యోపదేశమువలననే సచ్ఛబ్దార్థ బ్రహ్మభూతునకు జీవసంజ్ఞ నివారింపఁబడుచున్నది. సంసారియుు బహువిధదుఃఖదూషితుఁడునగు జీవునకు బ్రహ్మత్వమెట్లు సంభవించు ననుశంక కుత్తరము:— 'ఈక్షితృత్వమితి' సకలప్రాణులకు నీక్షితృత్వము అనఁగా చిద్రూపత్వము. ఇది యందఱకును స్వాభావికరూపమే యగును. ఈచిద్రూపత్వముకంటె నన్యమగు జడత్వము అజ్ఞానమువలనఁ గలుగును. కాని సత్యముకాదు. కర్తృత్వభోక్తృత్వాదికము సత్యమగునేని సుషుప్తియందుకూడ కనుపించవలెను. స్వప్నమందు కనుపించు కర్తృత్వాదికముసయితము సత్యముకావలెను. ఆరెంటియందు నసత్యమగు కర్తృత్వాదికము జాగ్రదవస్థయందును అసత్యమే యగును. కనుక కర్తృత్వాదికము స్వాభావికమని చెప్పరాదు. బ్రహ్మలక్షణమునకంటె విపరీతరూపమగు కర్తృత్వాదికము అజ్ఞానకల్పితము. చిన్మాత్రస్వరూపము బ్రహ్మలక్షణము. అజ్ఞాననివృత్తియే మోక్షము. తత్త్వజ్ఞానదశయందె అజ్ఞానము తొలఁగును. తత్త్వజ్ఞానము మహావాక్యములవలననే కలుగును. కావున బ్రహ్మజ్ఞానవిషయమై ప్రమాణాంతరముగాని, సాధనాంతరముగాని అపేక్షింపఁబడదు. ౧

అవ. శ్రుతియుక్తి విరోధమువలనఁ గర్మము మోక్షోపాయమగుజ్ఞానమునకు సహాయముకాదని చెప్పుచున్నారు:—

మూ. ఏతావద్ధ్యమృతత్వం న
కించి దన్యత్సహాయకమ్,
జ్ఞానస్యేతి బ్రువచ్ఛాస్త్రం
స లింగం కర్మ బాధతే. ౨

తా "ఏతావదరే ఖల్వమృతత్వ" మ్మనుశ్రుతి మోక్షసాధనము జ్ఞానమే యని నిర్ధారణచేయుచు, జ్ఞానమునకు సహాయమేమియునక్కఱలేదని చెప్పుచు కారకసమేతమగు కర్మమును నిరాకరించుచున్నది.

1 ప్ర. జ్ఞానమునకుఁ గర్మము సహాయముకాదా?

ఉ. అద్వైతాత్మజ్ఞానము గలుగఁగా కర్మహేతువగు జాత్యాద్యభిమానము తొలఁగును. అభిమానములేక కర్మమే కలుగదు. కనుక మోక్షహేతువగు జ్ఞానమునకుఁ గర్మము సహాయముకాదు. ౨

అవ. ఇపుడు ఈక్షితృత్వమును మొదటిశ్లోకమునఁ జెప్పఁబడిన స్వాభావిక చిద్రూపత్వమును వివరించుచు జ్ఞానికిఁ గర్మము ఘటింపదని నిరూపించుచున్నారు:—

మూ. సర్వేషాం మనసో వృత్తమవిశేషేణ పశ్యతః,
తస్య మే నిర్వికారస్య విశేషః స్యాత్కథంచన. 3

తా. సకలప్రాణులయొక్క మానసికవృత్తులను సమానముగ సాక్షినై చూచుచు నిర్వికారుఁడనగు నాకుఁ గర్తృత్వాది విశేషముగాని, కర్మసాధనమగు జాత్యాద్యభిమానముగాని యెట్లును గలుగనేరదు. దేహాద్యభిమానము లేక కేవలసాక్షిగనుండు ఆత్మకు భేదదృష్టి యుండదని భావము. 3

అవ. ఆత్మ మనోవృత్తులను, అవిశేషముగ నెట్లు చూచు ననఁగా, దృష్టాంతపూర్వకదర్శనమును నిరూపించుచు ఆత్మ చిదేకరసమని ప్రారంభించి చెప్పినగ్రంథమును ముగించుచున్నారు:—

మూ. మనోవృత్తం మనశ్చైవ స్వప్నవజ్జాగ్రదీక్షితుః,
సంప్రసాదే ద్వయాసత్త్వాచ్చిన్మాత్రః సర్వగోఽవ్యయః.

తా. స్వప్నావస్థయందు వృత్తియగు మనస్సే (ఆత్మవలె) చూచును. బాహ్యవిషయములు లేనందున స్వప్నమందుఁ గనుపించెడి సర్వమును మానసికమే. జాగ్రదవస్థయందుఁ గలిగెడి మనోవృత్తమును స్వప్నవృత్తమును వలెనె మిథ్యగాఁ జూచువానికి విశేషమెట్లు కలుగునని పైశ్లోకముతో నన్వయము. జాగ్రద్దశయందును విషయాకారవృత్తిగల మనస్సంబంధము లేని ఆత్మ దేనినింజూడలేదు. అట్లేని ఇట్టిమనోదర్శనమే స్వాభావికవిశేష మగునని శంక పైనిచెప్పుచున్నారు:—సుషుప్తియందు సవృత్తికమగు మనస్సు లేనందున నామనోవృత్తమును స్వాభావికము కాదు. ఇందుకు-"నతు తద్ద్వితీయమస్తి తతోఽన్యద్విభక్తం యత్పశ్యేత్" అను శ్రుతి ప్రమాణము. కాఁబట్టి ఆత్మ చిన్మాత్రము, సర్వగము, అపరిచ్ఛిన్నము, అవ్యయము నిత్యమునని భావము.౪

అవ. అట్లేని బాహ్యాభ్యంతర ద్వైతప్రపంచము లేక పోవలసివచ్చును. ప్రత్యక్షాదిప్రమాణవిరోధమును వైదిక లౌకికవ్యవహారలోపమును గలుగును గనుక ద్వైతప్రపంచము లేదనరా దందువేని అట్లు కాదని చెప్పుచున్నారు:—

మూ. స్వప్నః సత్యో యథాఽఽబోధా
ద్దేహాత్మత్వం తథైవ చ,
ప్రత్యక్షాదేః ప్రమాణత్వం
జాగ్రత్ స్యాదాత్మవేదనాత్. ౫

తా. ప్రబోధము కలుగుపర్యంతము స్వప్నము సత్యమగునట్లు ప్రబోధపర్యంతము దేహమే యాత్మ యనుకొనుట సత్యమగును. ఆత్మజ్ఞానము గలుగువఱకును ప్రత్యక్షాదికము ప్రమాణమగునుకాని పిమ్మట ప్రమాణము కాదు.

1 ప్ర. వైదికలౌకికవ్యవహారమంతయు నసత్యమా?

ఉ. ఆత్మతత్త్వసాక్షాత్కారము గలుగకమునుపు వ్యవహారమంతయుం సత్యము. అయినను ఆత్మతత్త్వసాక్షాత్కారము గలుగఁగనే యది అసత్యమగును.

2 ప్ర. దీని కుదాహరణమేది?

ఉ. మేల్కొనకమునుపు స్వప్నవ్యవహారము సత్యము. అయినను తెలివి రాఁగానే అసత్యమగునుకదా? ౫

అవ. ఆత్మ వ్యవహారార్హము కాదని ప్రకటించుచున్నారు:—

మూ. వ్యోమవత్సర్వభూతస్థో భూతదోషైర్వివర్జితః,
సాక్షీ చేతా గుణైః శుద్ధో బ్రహ్మైవాస్మీతి కేవలః. ౬

తా. ఆకాశమువలె సర్వభూతములయందు నుండి భూతదోషముల నంటక వానికి సాక్షియుం నిర్గుణుఁడును గేవల శుద్ధమునగు ఆబ్రహ్మమే అయితిని.

1 ప్ర. ఆత్మకు భూతదోషము లంటవా?

ఉ. ఆత్మ చిద్రూపుఁడును సకలవికారసాక్షియు నగుటచే భూతదోషము లేవియు నంటవు.

2 ప్ర. ఆత్మ సర్వభూతస్థుఁ డెట్లగును?

ఉ. సర్వభూతములందును అహమాకారవృత్తిని గలిగించుటచే సర్వభూతస్థుఁ డనఁబడును. ఈవిశేషణము "అహం మనురభవం సూర్యశ్చ" అని తత్సర్వాత్మత్వాభినయాభిప్రాయకమని యెఱుఁగవలెను.

3 ప్ర. శుద్ధ కేవల శబ్దముల కర్థమేమి?

ఉ. శుద్ధ మనఁగా అజ్ఞానరహితుఁడనియు, కేవలమనఁగా నవస్థాత్రయసాక్షియునని యర్థము.

4 ప్ర. బ్రహ్మమనఁగా నేమి?

ఉ. పరిపూర్ణము "సోఽహ మస్మి"    ౬

అవ. కేవలత్వమునే వివరపఱుచుచున్నారు:—

మూ. నామరూపక్రియాభ్యోఽన్యో
నిత్యముక్తస్వరూపవాన్,
అహమాత్మా పరం బ్రహ్మ
చిన్మాత్రోఽహం సదాఽద్వయః.    ౭

తా. అస్మచ్ఛబ్దలక్ష్యార్థమగు నేను నామరూపములు లేక వానిరాకపోకలను జూచువాఁడను, పరిపూర్ణుఁడను అగుటచే నిష్క్రియుఁడను, అద్వితీయుఁడను, చిన్మాత్రుఁడను, నిత్యముక్తుఁడను, ప్రత్యగాత్మను నగునేను ఏకత్వమువలన పరబ్రహ్మమునే యని భావము.

1 ప్ర. నిత్యముక్తుఁ డెట్లు?

ఉ. అవిద్యాకార్యములగు నితరవస్తువులు వాస్తవముగ లేనందున పరమార్థమగు బంధమే లేకపోవుటచే నిత్యముక్తుఁడ నగుదును.

2 ప్ర. బంధమనఁగా నేమి?

ఉ. ఆత్మతత్త్వస్వరూపమును మఱుఁగుపఱుచు అవిద్యవలనఁ గలిగెడి దేహేంద్రియాది తాదాత్మ్యమే బంధము.

3 ప్ర. మోక్షమన నెద్ది?

ఉ. ఆరోపితవస్తువులను స్వప్నేంద్రజాలికవస్తువులవలె శ్రుతియుక్త్యనుభవములచే మిథ్యయని నిషేధింపఁగా నిషేధార్హము కాక నిషేధా

వధియగు ఆత్మస్వరూపమును తానుగా భావించుటయే మోక్షము. బంధమోక్షములు అవిద్యాపరికల్పితములగుటచే వాస్తవముకానందున ఆత్మ నిత్యముక్తస్వరూప మనఁబడును. ౭

అవ. "అహం బ్రహ్మాస్మి"అను బుద్ధివలె"అహం కర్తాఽస్మి" అను బుద్ధికూడ ప్రత్యక్షముగ కలుగుటవలన ఆత్మ అద్వయ మెట్లగును? అని భేదాభేదవాదులగు జ్ఞానకర్మ సముచ్చయవాదులమతమును నిరాకరించుచు అద్వైతాత్మతత్త్వమును దృఢపఱుచుచున్నారు:—

మూ అహం బ్రహ్మాస్మి కర్తా చ భోక్తా చాస్మీతి యే విదుః,
తే నష్టా జ్ఞానకర్మభ్యాం నాస్తికాః స్యుర్న సంశయః. ౮

తా. నేను బ్రహ్మజ్ఞానిని, బ్రాహ్మణుఁడను, కర్తను, భోక్తను, తత్త్వమెఱుఁగుదును, శిష్యులకు చక్కఁగ బోధింతును, యాగములను జేయుదును, స్వర్గాదిసుఖముల ననుభవింతును. అని యిట్లు తలఁచుచు దేహాభిమానపూర్వకముగఁ బ్రవర్తించువారలు జ్ఞానమార్గమునుండియుఁ గర్మమార్గమునుండియు భ్రష్టులై నాస్తికులై చెడుదురు.

1 ప్ర. సముచ్చయవాది యేల చెడును?

ఉ. దేహాభిమానము వలననే కర్మము కలుగును. దేహాభిమానము తొలఁగక బ్రహ్మజ్ఞానము సిద్ధింపదు. ఇచట "దేహాభిమానాదభివర్ధతే క్రియా విద్యా గతాహంకృతితః ప్రసిద్ధ్యతి" యనెడి అధ్యాత్మరామాయణ వచనము ప్రమాణము. ఇట్లు కర్మ బ్రహ్మజ్ఞానములు తేజస్తిమిరములవలె పరస్పర విరుద్ధములు కనుక సముచ్చయవాదికి సుఖములేదు.

2 ప్ర. జ్ఞాని కర్మములను జేయరాదా ?

ఉ. "న బుద్ధిభేదం జనయేత్" అను భగవద్వచనమును బట్టి జ్ఞానుల సమక్షమున జ్ఞానమును ప్రధానముగ భావించెడిజ్ఞానికర్మమును మానినను కర్మతుల నడుమ నున్నపుడు వీరి బుద్ధిని దూషింపక తానును కర్మమును చేయు చుండును. ఇట్టి జ్ఞానులు చేయుంకర్మము ఆభాసమాత్రమై వేచిన గింజలవలె ఫలింపదు.

3 ప్ర. జ్ఞాన కర్మములకు గల భేదమేమి?

ఉ. జ్ఞానము సాక్షాన్మోక్షసాధనము. కర్మము చిత్తశుద్ధిద్వారా పరంపరా మోక్షసాధనము. కనుక ఆరురుక్షువులు కర్మముల నాచరింపవచ్చును. కాని సిద్ధమగు జ్ఞానము కర్మసహాయము నపేక్షింపదు.

4 ప్ర. బ్రహ్మశబ్దమున కర్థమేమి?

ఉ. వేదము, తత్త్వము, తపస్సు నని అర్థమగునపుడు నపుంసక లింగము. బ్రహ్మదేవుఁడు, బ్రాహ్మణుఁడు నని అర్థమగునపుడు పుంలింగము. ఇట్లు "బ్రహ్మన్" శబ్దమునకు అర్థభేదము గలదు. ౮

అవ. జ్ఞానకర్మసముచ్చయ నిందామాత్రమున అద్వైతైకమత మెటుల సిద్ధించును? దీనికిఁ బ్రమాణమేమి? యను ప్రశ్నల కుత్తరము:—

మూ. ధర్మాధర్మఫలై ర్యోగ
ఇష్టోఽదృష్టో యథాఽఽత్మనః,
శాస్త్రాద్బ్రహ్మత్వమప్యస్య
మోక్షో జ్ఞానాత్తథేష్యతామ్. ౯

తా. ఆత్మకు ధర్మాధర్మఫలములతో సంబంధము అన్యప్రమాణము

లచేఁ దెలియఁబడకున్నను, శాస్త్రమువలన శాస్త్రజ్ఞులచే నంగీకరింపఁబడినట్టి, బ్రహ్మత్వముకూడ శాస్త్రమువలననే తెలియవలెను.

1. ప్ర. ధర్మాధర్మఫలములను బోధించు శాస్త్రమెద్ది?

ఉ. "పుణ్యో వై పుణ్యేన కర్మణా భవతి పాపః పాపేన" ఈమొదలగు శాస్త్రము ఫలభేదమును జెప్పుచున్నది.

2 ప్ర. ఆత్మ బ్రహ్మమే యని బోధించు శాస్త్రమేది?

ఉ. "జ్ఞానాదేవ మోక్షః", అను స్మృతియు, "బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి; తమేవ విదిత్వాఽతి మృత్యుమేతి, నాన్యః పంథా విద్యతేఽయనాయ" అను శ్రుతులును జ్ఞానమువలననే బ్రహ్మత్వమును బోధించుచున్నవి.

3 ప్ర. కర్మమును, భేదవాదమును శాస్త్రము బోధించుట లేదా?

ఉ. నిందితములగు భేదకర్మములు శాస్త్ర తాత్పర్యవిషయము కానందున వానిని శాస్త్రము బోధించినప్పటికి శాస్త్రానుసారులు యుక్తార్థమునే గ్రహింపవలయును.

అవ. ఆత్మకు శాస్త్రోక్తమగు ధర్మాధర్మఫలసంయోగము ప్రమాణాంతరబాధితము కానందున యుక్తమే. శ్రుత్యనుభవములకు విరోధము లేకపోవుటకై భేదాభేదములనంగీకరింపవలె నందువేని, కర్తృత్వాది ప్రతిభాసము మిథ్య యగుటవలనను, శ్రుత్యుక్తమగు అద్వైతమున కేప్రమాణముచేతను బరమార్థదశయందు బాధ లేనందునను భేదాభేదములు నమ్మఁదగినవి కావని దృష్టాంతయుక్తముగఁ జెప్పుచున్నారు:—

మూ. యా మహారజనాద్యాస్తా వాసనాః స్వప్నదర్శిభిః,
అనుభూయన్త ఏవేహ తతోఽన్యః కేవలో దృశిః. ౧౦

తా. జాగ్రదవస్థయందుఁ జూడఁబడిన కుసుంబారంగు బట్టలు వాసనా వాసితములై స్వప్నమందుఁ దోఁచును. కాని మిథ్యయగు దృశ్యజాతముకంటె విలక్షణమగు జ్ఞాత జాగ్రత్స్వప్నములు రెండింటిని సాక్షిగఁ జూచుటచే నొక్కఁడే.

1 ప్ర. వాసన యెటువంటిది ?

ఉ. జాగ్రదవస్థయం దనుభవింపఁబడిన పదార్థములు సంస్కారవశమున వాతపిత్తశ్లేష్మ దూషిత రసపూర్ణనాడీగతమైన మనస్సు అదృష్టాది సహితానేకవాసనలచే జాగద్దృష్ట పదార్థాకారముగఁ బరిణమించుచు కుసుంభావస్త్రాకారమై ద్రష్టృదృశ్యదర్శన తత్కారణాదిభావముచే స్వప్నదర్శిచే ననుభవింపఁ బడుచుండును. ఇదియే వాసన యనఁబడును.

2 ప్ర. స్వప్నమం దీవాసనలు చూడఁబడుటవలన ఫలమేమి ?

ఉ. చూడఁబడు వాసనారూప పదార్థములు దృశ్యములగుచు అనాత్మధర్మములగుటచే స్వప్నమం దనుభవింపఁబడుచున్నను మిథ్య యగును. ఇట్లే జాగ్రదవస్థయందును దృశ్యములగుటవలన అనాత్మధర్మములగు కర్తృత్వాదికములు మిథ్యయనియు, వీనినన్నిటిని అన్నియవస్థలందును అనుభవించెడి కేవలదృగ్రూపాత్మ నిత్యమనియు భావము.

3 ప్ర. కర్తృత్వాదిక మెవనిది ?

ఉ. మనస్సహితమగు జాగ్రత్స్వప్నములందు కర్తృత్వాదిక ముండుటవలనను, మనోరహితమగు సుషుప్తియందు నిది లేనందునను, కర్తృత్వాదికము మనస్సునదే యగును. ఇట్టు కర్తృత్వాదికముగల మనస్సుకంటె నన్యము కేవలము శుద్ధమునగు దృక్కు ఆత్మయని భావము. ౧౦

అవ. స్వప్నావస్థయందు దృశ్యపదార్థములకంటె ఆత్మ విలక్షణమైనదని సదృష్టాంతముగ స్ఫుటపఱుచుచున్నారు:—

మూ. కోశాదివ వినిష్కృష్టః
కార్యకారణవర్జితః,
యథాఽసిర్దృశ్యతే స్వప్నే
తద్వద్బోద్ధా స్వయంప్రభః. ౧౧

తా. ఒఱలోనుండి తీయఁబడిన ఖడ్గము ఒఱకంటె నన్యమై స్వస్వరూపముగఁ దెలియఁబడువిధమున, స్వప్నములో స్వప్నపదార్థబోద్ధయగు ఆత్మ కార్యకారణాకారముగఁ బరిణమించు మనస్సుకంటె వేఱుగఁ జూడఁదగును.

1 ప్ర. ఒఱనుండి లాగఁబడిన ఖడ్గమువలెనను దృష్టాంతమువలన గ్రహింపఁ దగినది యేది?

ఉ. ఒఱకంటె ఖడ్గరూపము వేఱగుపగిది, ఒఱవంటి చిత్తాద్యుపాధి కంటె ఆత్మస్వరూపము వేఱని తెలియవలెను.

2 ప్ర. ఆత్మ స్వయంప్రభ యనుటకుఁ బ్రమాణమేమి?

ఉ. "అయం పురుషః స్వయంజ్యోతిః" అను శ్రుతి ప్రమాణము. కావున ఆత్మ స్వమహిమమందే వ్యాపించియుండునుగాని ఘటాదికమువలె ధీవిషయుఁడు కాఁడు. ౧౧

అవ. ఆత్మకుఁ గర్తృత్వాదిప్రతిభాసము[1] స్వప్నప్రతిభాసమువలె మిథ్య యగుటవలన నిర్వికారాత్మ బ్రహ్మమే యగునను శాస్త్రమువలన విరోధము లేక తెలియఁదగినదగు

1 తోఁచుట.

టచే భేదాభేదములను గల్పించి మనస్సును ఖేదపెట్టఁదగదని సిద్ధమైన యర్థమందు శ్రుతివాక్యమును సప్రమాణముగ వివరించుచున్నారు:—

మూ. ఆపేషాత్ప్రతిబుద్ధస్య జ్ఞస్య స్వాభావికం పదమ్,
ఉక్తం నేత్యాదివాక్యేన కల్పితస్యాపనేతృణా. ౧౨

తా. ఇచట శ్రుత్యుక్తమగు [1]ఆఖ్యాయిక కలదు. ఎద్దియన:—నిద్రించుచున్నవానిని 'ఓ బట్టతలగలవాఁడా! ఓ సోమ రాజా!' అని బిగ్గరగఁ బిలిచినను లేవలేదు. అప్పుడు చేతితోఁ దట్టుచు చేఱువఁగా లేచెనట. జడములై ఆరోపితములగు దేహేంద్రియప్రాణాదులు ఆత్మ కావని నిషేధించెడి నేతి నేతీత్యాది శ్రుతిచేత, చేఱచి కొట్టఁగా మేల్కొన్న జ్ఞానియొక్క సహజరూపము బోధింపఁబడెను. పై ఆఖ్యాయికయందు "తం పాణినాఽఽపేషం బోధయాంచకార సహోత్తస్థౌ" అను శ్రుతి ప్రమాణము. దీనిచే స్థూలశరీరము, మనః ప్రాణాది సూక్ష్మశరీరమును ఆత్మ కావని భావము.

1 ప్ర. అట్లేని ఆత్మస్వరూపము ఎట్టిది?

ఉ. జడములగు స్థూల సూక్ష్మశరీరములకంటె విలక్షణముగనుక ఆత్మ చిత్స్వరూపము, త్వంపదలక్ష్యార్థబ్రహ్మస్వరూపమును.

2 ప్ర. నేతి నేతీతివాక్యమున కర్థమేమి?

ఉ. మూర్తిమంతములగు పృథివీ జలతేజస్సులుగాని, అమూర్తములగు వాయ్వాకాశములుగాని, వాని సంస్కారములుగాని ఆత్మ కావని తాత్పర్యము. ౧౨

---

1 వాస్తవమైన చరిత్రగ్రంథము.

అవ. నేతి నేతీతివాక్యముచే నిషిద్ధములగునవియెల్లను గల్పితములని శ్రుతిచే నుపపాదింపఁబడెనని చెప్పుచున్నారు:—

మూ. మహారాజాదయో లోకా
మయి యద్వత్ప్రకల్పితాః,
స్వప్నే తద్వద్ద్వయం విద్యా
ద్రూపం వాసనయా సహ. ౧౩

తా. స్వప్నమందు మహారాజత్వాదికమంతయు దృగ్రూపుఁడనగు నాయందుఁ గల్పింపఁబడినట్లు, మూర్తామూర్తమగు రూపము తద్వాసనలును, (దృగ్రూపుఁడనగు) నాయందే కల్పింపఁబడెనని తెలియవలెను.

1 ప్ర. వాసనయననేమి? దానికి స్థానమెద్ది ?

ఉ. వాసన యనఁగా అనుభూతార్థసంస్కారము. ఈ సంస్కారము మనోమయమగు లింగదేహమున నుండును.

2 ప్ర. మూర్తామూర్త ప్రపంచమంతయు దృగాత్మయందుఁ గల్పితమనుటకుఁ బ్రమాణమేమి?

ఉ. "యత్రైష ఏతత్సుప్తోఽభూద్య ఏష విజ్ఞానమయః పురుషః" అని ఆరంభించి "స యత్రైతత్స్వప్నమాచరతి తే హాస్య లోకాస్తదుతేవ మహారాజో భవత్యుతేవ మహాబ్రాహ్మణ ఉతేవోచ్చావచం నిగచ్ఛతి" అను శ్రుతి ప్రమాణము. స్వప్నదృశ్యమగు మహారాజత్వాదికము ఆభాసమాత్రమని శ్రుతియందుఁగల 'ఇవ' శబ్దము సూచించెను. మధ్యనిట్లు చెప్పిన శ్రుతి ఉపసంహారమందు "ఏవమేవైష ఏతత్ప్రాణాన్ గృహీత్వా స్వే శరీరే యథాకామం పరివర్తతే" యని చెప్పుచుఁ బ్రాణశబ్దవాచ్య లింగదేహము ఉపాధిగాఁగలిగి, శరీరమధ్యమమున నుండుచు మహారాజాద్యాకారముగ

గ్రహించుచు స్వప్నదృక్కయి ఆత్మయే వ్యవహరించుచున్నదని బోధించు చున్నది. ౧౩

అవ. స్వప్నప్రపంచమువలె జాగ్రత్ప్రపంచము సయితము ప్రత్యగాత్మయందుఁ గల్పింపఁబడఁగా ప్రత్యక్తత్త్వాభిజ్ఞునకుఁ గర్మము సంభవింపదని చెప్పుచున్నారు:—

మూ. దేహలింగాత్మనా కార్యా
వాసనారూపిణా క్రియాః,
నేతి నేత్యాత్మరూపత్వా
న్న మే కార్యా క్రియా క్వచిత్. ౧౪

తా. కర్మములు ఆత్మతాదాత్మ్యమును బొందిన స్థూల సూక్ష్మదేహాభిమానముచేఁ జేయఁదగినవి దేహాత్మతాదాత్మ్యము (దేహాభిమానము) లేకుండఁ గర్మమేమియుఁ సంభవింపదు. ఈ దేహాభిమానము సంసారాత్మక వాసనలను గల్పించి సంసారమును బెంచునని భావము. కర్మమువలన వాసనలు, వాసనలవలనఁ గర్మమును గలుగుచు నీవిధమున సంసారము పెరుఁగును. ఇపుడు నేతినేతీతి వాక్యములచేత దృశ్యములను నిషేధించి, స్వస్వరూపావబోధచే దేహద్వయాభిమానము లేనందున నాకు జాగరమందుఁగాని స్వప్నమందుఁగాని క్రియ యేదియును లేదు. దేహాభిమానము గలవానికిఁ గ్రియావిధి సంభవించునుగాని తత్త్వజ్ఞునకు ఈవిధి లేదు. ౧౪

అవ. అజ్ఞానకార్యమగు దేహాభిమానమువలనఁ జేయఁబడు కర్మమునకు మూలము అజ్ఞానమే కనుక కర్మమువలన మోక్షము కలుగుననుమాట కల్లయని చెప్పుచున్నారు:—

మూ. న తతోఽమృతతాఽఽశాస్తి కర్మణోఽజ్ఞానహేతుతః,
మోక్షస్య జ్ఞానహేతుత్వాన్న తదన్యదపేక్షతే. ౧౫

తా. కర్మకు అజ్ఞానము కారణము. కనుక దానివలన మోక్షాశ లేదు. జడములగుటచేత అజ్ఞానకర్మములకును బరస్పరవిరోధము లేదు. కనుక అజ్ఞాననివృత్తిరూపమగు మోక్షమునకుఁ గర్మాపేక్షలేదు. పరమానందావిర్భావరూపమును బ్రహ్మాత్మనావస్థానరూపమునగు మోక్షము చతుర్విధక్రియాఫలవిలక్షణ మగుటవలనఁ గర్మము నపేక్షింపదు.

1 ప్ర. కర్మము సాక్షాత్తు మోక్షహేతువు కాకున్నను, మోక్షహేతువగు జ్ఞానమునకు సహకారి కాదా?

ఉ. అజ్ఞాననివృత్తివిషయమై స్వతంత్రమగు జ్ఞానము ఇతరమగు కర్మము నపేక్షింపదు.

2 ప్ర. నాలుగువిధములగు క్రియ లెవ్వి?

ఉ. 1 ఆప్యము=పొందఁదగిన చోటు.
2 వికార్యము—పాలు పెరుఁగగుట.
3 ఉత్పాద్యము—పుట్టుట.
4 సంస్కార్యము—కడిగి బాగుచేయుట.

ఇట్లు క్రియలు నాల్గువిధములు. ౧౫

అవ. మోక్షము కర్మసాధ్యమగునేని స్వర్గాదులవలెను కృష్యాదిఫలమువలెను అనిత్యము భయయుతమును నగును. అట్లైని, 'అభయం ప్రతిష్ఠాం విన్దతే,' 'అతోఽన్యదార్తమ్' అనెడి శ్రుతులకు విరోధము కలుగును, కనుక నట్లనఁగూడదు అని చెప్పుచున్నారు:—

మూ. అమృతం చాభయం నార్తం
నేతీత్యాత్మా ప్రియో మమ,
విపరీతమతోఽన్యద్య
త్త్యజేత్తత్సక్రియం తతః. ౧౬

తా. బ్రహ్మస్వరూపమనఁగా అమృతము, అభయము, నార్తము. (నార్తమనఁగా పీడలేనిది, కర్మచే సాధ్యము కానిది) జీవుఁడు బ్రహ్మస్వరూపమేకనుక 'నాకుఁ బ్రియము' అనెడి జాయాదికము ఆత్మేతరము. ఇది క్రియాజన్యము. పైనిఁజెప్పిన లక్షణములకంటె విరుద్ధములగు మృతిభయార్తులు కలదియును గనుక దానియందు మమకారమును బరిహరింపవలెను.

ప్ర. జ్ఞానికి 'గ్రహింపవలెను, పరిహరింపవలెను' అనెడి విధి కలదా?

ఉ. లేదు. సాధకున కుపయోగించు నీవిధి నియోగార్హుఁడు కాని జ్ఞానికి అనువాదమాత్రమేకాని ముఖ్యవిధి కాదని తెలియవలెను. ౧౬

ఇది ఈశిత్రత్వప్రకరణము.



శ్రీః

# ఉపదేశసాహస్రి

(శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యప్రణీతము.)

## శ్లోకప్రబంధము_ద్వాదశప్రకరణము.



### ౧౨. ప్రకాశప్రకరణము.

అవ. గురూపదిష్టప్రియశబ్దశ్రవణమువలన భోక్త నిర్విశేషబ్రహ్మస్వరూప మగునేని, లోకమందఱు నేను నేనని ఆత్మానుభవముగలవారలయ్యును 'బ్రహ్మాహమ్' (నేను బ్రహ్మమునే) అని యేల తెలియఁజాలరు, అని శంక రాఁగా పదార్థతత్త్వపరిశోధన లేక పోవుటచే నట్లుఁ దెలియలేరని చెప్పి, "తత్త్వమసి" యను మహావాక్యమునందలి 'త్వం' పదార్థశోధనప్రధానమగు నీప్రకాశప్రకరణము నారంభించుచు, చిదాభాసాంతఃకరణములను రెండింటిని వివేచన చేయకపోవుటచేత జనులు ఆత్మతత్త్వమును దెలియఁజాలరని సదృష్టాంతముగఁ జెప్పుచున్నారు:—

మూ. ప్రకాశస్థం యథా దేహం సాలోకమభిమన్యతే,
ద్రష్ట్రాభాసం తథా చిత్తం ద్రష్టాఽహమితి మన్యతే. ౧

తా. లోకులు ప్రచురమగు సూర్యాదిప్రకాశమధ్యమగు దేహాదికము సూర్యప్రకాశముకంటె విలక్షణముగ నుండినను అది సూర్యప్రకాశవిశిష్టముగనే తలంచునట్లు, చైతన్యవ్యాప్తమగు చిత్తమును ఆత్మగనే తలంతురుగాని యథార్థముగఁ దెలియలేరు.

1. ప్ర. ఆత్మధర్మ మేది? చిత్తధర్మ మేది?

ఉ. ఆత్మ చిత్స్వరూపము. చిత్తము జడము. సూర్యాలోకము ప్రకాశకము. ఘటాదిపదార్థములు ప్రకాశ్యములు. అనఁగా, అవి జడములై సూర్యప్రకాశములేని చీఁకటియందు స్ఫురింపవు అని భావము.

2. ప్ర. చిత్తమును ఆత్మనుగఁ దలఁచుట యెట్లు ?

ఉ. అంతటను అఖండాకారముగ సూర్యకాంతి ప్రసరించియుండఁగా సూర్యకాంతిచే వ్యాప్తమగు దేహఘటాదిపదార్థములను దేహము ఘటము మొదలగు పేర్లతో వ్యవహరింతురు. ఇట్లు అఖండచిత్స్వరూపుఁడగు ఆత్మ అంతఃకరణసంపర్కమువలన అంతఃకరణాకారమును బొందినట్టు భాసించుచుండఁగా నేను కర్తను, భోక్తను అని అంతఃకరణస్వభావవిశిష్టునిగఁ దెలియునుగాని శుద్ధాత్మునిగఁ దెలియలేఁడు. ౧

అవ. ఇట్లు ఆత్మకు చిదాభాసవిశిష్టాంతఃకరణముతో నభేదమును జెప్పి, తన్మూలకమగు దేహద్వయముతోడి, యవివేకమును జూపుచు, లోకమునకు ఆత్మజ్ఞానము లేదనుమాటను దృఢపరుచుచున్నారు:—

మూ. యదేవ దృశ్యతే లోకే తేనాభిన్నత్వమాత్మనః,
ప్రపద్యతే తతో మూఢ స్తేనాత్మానం న విన్దతి. ౨

తా. వ్యవహారకాలమందు ప్రాణము మొదలుగ దేహపర్యంతమునుగల ఏయేపదార్థములను జూచునో ఆప్రాణాదిపదార్థములనే తానని తలంచుట వలన మూఢుండు తనను బ్రహ్మముగఁ దెలియఁజాలఁడు.

ప్ర. ఈప్రాణములు, ఈదేహమును ఆత్మకాకున్నయెడల 'నేను' అని తలంచుట యెట్లు?

ఉ. చిత్తము అద్దమువంటిది. ఆచిత్తమందు చైతన్యము ప్రతిఫలించును. ఈప్రతిబింబమునకు ఆభాసుఁడని పేరు. చిత్తము అందలి ఆభాసుఁడు అను రెండువస్తువులకును గల భేదమును విమర్శింపక ప్రాణములు నేననియు, దేహము నేననియు ద్రష్టయగు చిదాభాసుఁడు భ్రాంతినిఁ బొందుచు దృశ్యములే తాననుకొనును. ౨

అవ. ఈ చెప్పిన యంశమును దృష్టాంతపూర్వకముగ దృఢపరుచుచున్నారు:—

మూ. దశమస్య నవాత్మత్వప్రతిపత్తివదాత్మనః,
దృశ్యేషుతద్వదేవాయంమూఢోలోకో న చాన్యథా.

తా. పదిమంది బాలకులు ఒకనదిని దాటి తామెందఱో యని లెక్కపెట్టుకొనిరఁట. అందు గణకుఁడు తనునుదక్క మిగత తొమ్మండ్రనే లెక్కించి పదియవవాఁడు లేఁడు, నదిలో మునిఁగెనేమోయని శోకించెనఁట. ఇట్లే తొమ్మండ్రులో నొకఁడొకండును లెక్కించి పదియవవాఁడు లేఁడనిశోకించిరఁట. అప్పుడు ప్రాజ్ఞుఁడగు పథికుఁడొకఁడు వచ్చి పదియవవాఁడు గలఁడని

చెప్పఁగ కొంతదుఃఖ ముపశమించెనఁట. ఆపదియవవానినిఁ జూపుమని వారలు వేఁడఁగా, నాపథికుఁడు పదిమంది బాలకులను లెక్కపెట్టి మీలో లెక్కపెట్టు వానితోఁగూడ పదిమందియు నున్నారని తెల్పఁగా వారలు పరమానందభరితులయిరఁట. అని సుప్రసిద్ధమగు కథ కలదు.

ఈకథయందు లెక్కించు పదియవవాఁడు తనకు దృశ్యులగు తొమ్మండ్రను మాత్రమే లెక్కించి, తనను పదియవవానిగను, దృశ్యులగు తొమ్మండ్రకంటెను విలక్షణునిగను ద్రష్టగను దెలియలేక యెట్లు శోకించెనో, అట్లే శాస్త్రాచార్యోపదేశములేని మూఢుఁడు బుద్ధిమొదలగు దృశ్యపదార్థములనే తానుగఁ దలంచునుగాని, యీబుద్ధ్యాదిదేహపర్యంతమగు పదార్థములన్నియుఁ దనకు దృశ్యములనియుఁ, జడములనియుఁ, తాను వీనినన్నిటినిఁ దెలిసెడి ద్రష్టయగు చైతన్యమనియు తెలియలేఁడు. 3

అవ. బుద్ధ్యాదులన్నియు దృశ్యములనియు, ఆత్మ వీనినన్నిటినిఁ జూచు ద్రష్టయనియు, శాస్త్రాచార్యోపదేశము లేని మూఢుఁడు తెలియలేఁడు. అట్టివానికి పదార్థవివేకము లేనందున మోక్షమును లేదని సూచింపఁబడెను. ఆవాక్యములను విమర్శింపఁగా, ఆత్మ బ్రహ్మమని శాస్త్రమువలననే తెలియఁబడగా పదార్థవివేకముతో నవసరమేమి? 'బ్రహ్మాహమస్మి' యను జ్ఞానమువలననే ఆత్మయొక్క యాథార్థ్యమును దెలిసినయెడల మోక్షము సిద్ధించునుగదా? అని శంక రాఁగా ప్రత్యక్షానుభవమువలన శ్రుతికి నవిరోధముగ ప్రత్యగాత్మకే కర్తృత్వాదిధర్మత్వమును బ్రహ్మరూపత్వమును గలదు. అయినను అవివేకకల్పనచే మూఢత్వమున పదార్థవివేకము లేకపోవుటచే మోక్షము కలుగదని నిరూపించుచున్నారు:—

మూ. త్వం కురు త్వం తదేవేతి ప్రత్యయావైకకాలికౌ,
ఏకనీడౌ కథం స్యాతాం విరుద్ధౌ న్యాయతో వద.

తా. 'త్వం కురు'—(నీవు చేయుము) అను భేదజ్ఞానమును, 'త్వంతదేవ'—(ఆబ్రహ్మమే నీవు) అను అభేదజ్ఞానమును పరస్పరవిరుద్ధములగుటచే నేకకాలమునందే ఏకవిషయమునందే యెట్లుండునో సహేతుకముగఁ జెప్పుము. అని పూర్వపక్షి శంకించుచున్నాఁడు.

ప్ర. జ్ఞానములకుఁ గలిగిన భేదమేమి?

ఉ. 'నీవు చేయుము' అను కర్మములకు దేహాభిమానము ముఖ్యము. 'ఆబ్రహ్మమే నీవు' అను జ్ఞానమునకు దేహాభిమానాభావము ముఖ్యము. పదార్థము చల్లనిది యనుబోధ కలుగునపుడు, అది వెచ్చనిది యనుజ్ఞానము ఉండదు. పదార్థము వెచ్చనిది యనుబోధ కలుగునపుడు అది చల్లనిది యను జ్ఞానము ఉండదు. ఇట్లే కర్తృత్వము అకర్తృత్వము ననునీరెండును ఒకనియందే యెట్లు కలుగునని శంకార్థము. ౪

అవ. 'నేను దుఃఖముగలవాఁడను' అను అనుభవము ప్రత్యక్షముగ నుండఁగా 'నేను సుఖిని' యనుజ్ఞానము బాధింపఁబడును గనుక నీరెండింటికిని ఒకనియమమును జెప్పవలెనని బోధించుచున్నారు:—

మూ. దేహాభిమానినో దుఃఖం నాదేహస్య స్వభావతః,
స్వాపవత్తత్ప్రహాణాయ తత్త్వమిత్యుచ్యతే దృశేః.

తా. దేహమే నేనను అభిమానముగలవానికే దుఃఖము కలదు కాని సుషుప్తికాలమందువలె దేహాభిమానము లేనివానికి దుఃఖములేదు. దేహము

లేకపోవుటయే ఆత్మకు స్వభావముగనుక సుషుప్తియందు దేహస్ఫూర్తిలేదు. 'తత్త్వమసి'యను శ్రుతి ఆత్మకు సమూలాభిమాన నివృత్తిని బోధించు చున్నది కాని కర్మను బోధించుటలేదు.

అవ. తత్త్వమస్యాదిమహావాక్యవిమర్శనమువలన దేహాదులకంటె ఆత్మ భిన్నమని తెలిసినవాఁడుసయితము 'నా కీదుఃఖము' అని భావించునుగనుక దుఃఖమునకు దేహాభిమానము నిమిత్తము కాదని శంక రాఁగా, దేహాభిమానసహితమగు ఆత్మదర్శనము జ్ఞానాభాసమే యగుటచే నటుల భావించును. ఏలయనఁగా, జాగ్రత్స్వప్నములయందుండు దుఃఖానుభవము దేహాభిమానబుద్ధిలేని సుషుప్తియందు లేకపోవుటచే దుఃఖమునకు నిమిత్తము దేహాభిమానముకంటె నితర మెద్దియుఁ గాదని చెప్పుచున్నారు:—

మూ. వృశేశ్ఛాయా యథారూఢా ముఖచ్ఛాయేవ దర్పణే,
పశ్యంస్తం ప్రత్యయం యోగీ దృష్ట ఆత్మేతి మన్యతే.

తా. అద్దమందు ముఖము ప్రతిబింబించునట్లు, అహంకారమందు ఆత్మ ప్రతిఫలించును; అట్టి సాభాసాంతఃకరణమును జూచుయోగి, ఆత్మయే చూడఁబడె ననుకొనును. అద్ద మిట్టిది, ముఖ మిట్టిది యని యీ రెండింటి యొక్క స్వభావములను విభజింపకపోవుటచే, తన ముఖమునందు దర్పణ దోషములగు మాలిన్యాఽల్పత్వాదులను భ్రాంతిచే నారోపించునట్లు బుద్ధి యిట్టిది, ఆత్మ యిట్టిది అని రెండింటి స్వభావమును విభజింపకపోవుటచే ఉపాధియగు బుద్ధియొక్క దోషములగు కర్తృత్వ దుఃఖిత్వాదులను ఆత్మయం దారోపించును. 'అహం' అను అహంకారము కల్పితదేహవిషయ మగుటవలన దుఃఖిత్వము అవివేకాభిమానమువలననే కలుగును. కనుక మహా

వాక్యవిచారమువలన ఆత్మజ్ఞానము దృఢముగఁ గలిగినవానికి దుఃఖిత్వాను వృత్తి కలుగదు. ఒకానొకప్పుడు దుఃఖము భాసించినను బాధితమై యుండునుగాని, జ్ఞానికి నిది సహజము కాదని భావము.

ఆభాసమనఁగా లేకున్నను ఉన్నట్టులోఁచుట. ౬

అవ. ఆభాసతోఁగూడిన అహంకారమును ఆత్మ యనుకొనువాఁడు సమ్యగ్దర్శి కాఁడేని సమ్యక్ జ్ఞాని యెవఁడు? అను శంకకు త్తరము:—

మూ. తం చ మూఢం చ యద్యన్యం ప్రత్యయం వేత్తినోదృశేః,
స ఏవ యోగినాం శ్రేష్ఠో నేతరః స్యాన్న సంశయః ౭

తా. ఉపాధియగు అహంకారమును, మోహాత్మకమగు అవివేకమును, వీనికంటె నన్యమగు చిదాభాసుని, దృశ్యమగు దుఃఖాదికమును ద్రష్టయు నసంగుఁడునగు ఆత్మకు దృశ్యములగు వీనిలో దేనితోను సంబంధము లేనట్టుగ నెవఁడెఱుంగునో యతఁడే జ్ఞానవంతులకుఁ బ్రియతముఁడు. అహంకారయుతుఁడు ప్రియతముఁడు కాఁడు. ఇది నిశ్చయము. అజ్ఞానియు, విశ్వాసహీనుఁడును, సంశయాత్ముఁడును సుఖింపఁజాలఁడని గీతలందు "అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి" యను శ్లోకములో శ్రీకృష్ణుఁడు నుడివెను. ౭

అవ. సర్వజనులకు 'నేను'అని భాసించెడి అహంకారము ఆత్మ కాదని విడువఁబడఁగా, అహంకారముకంటె నన్యమగు త్వంపదార్థమేదియుఁ గనుపింపనందున 'తత్త్వమసీ'త్యాది వాక్యమునకు ఆధారమే లేకపోవును, అను శంక రాఁగా, త్వమర్థమును అహంకారాదికమునుండి వేఱుచేయవలెనని

శ్రుతి బోధించుచున్నదికనుక త్వంపదార్థమే లేదని యాక్షే
పింపఁదగదని చెప్పుచున్నారు:—

మూ. విజ్ఞాతేర్యస్తు విజ్ఞాతా స త్వమిత్యుచ్యతే యతః,
స స్యాదనుభవస్తస్య తతోఽన్యోఽనుభవో మృషా.

తా. "నహి విజ్ఞాతుర్విజ్ఞాతేర్విపరిలోపో విద్యతే; విజ్ఞాతేన ర్విజ్ఞా
తారం విజానీయాః" అను శ్రుతికి 'విజ్ఞాతేః' అనుచోట కర్త్రర్థకమగు
షష్ఠీవిభక్తి, అనిత్యమగు నీబుద్ధివృత్తికి సాక్షియగు విజ్ఞాత కెప్పుడును
లోపములేదు. సర్వసాక్షియగు నీ విజ్ఞాతను జడమగు బుద్ధివృత్తిచేఁ దెలియ
లేవు అనియు నర్థము. ఇట్లు బుద్ధివృత్తిరూపమగు విజ్ఞానము నెఱుంగుచు
సర్వావభాసకమగు విజ్ఞాతయే 'తత్త్వమసి'యను వాక్యమందలి 'త్వం'శబ్దము
నకు అర్థము. కాని, త్యాజ్యమగు అహంకారము 'త్వం'పదమున కర్థము
కాదు అని యీశ్రుత్యర్థము నవలంబించుటవలన 'తత్త్వమసి' యను
మహావాక్యార్థమందలి 'త్వం'పదార్థము నిరాధారమగునని చెప్పఁదగదు.
కనుక, 'త్వం'పదమునకు శ్రుత్యుక్తసర్వసాక్షిరూపమగు లక్ష్యార్థమే సమ్య
గనుభవము. అనఁగా, మహావాక్యమునందలి త్వంపదమునకు ధీవృత్తిసాక్షి
యగు పరమాత్మయే అర్థము. ౮

అవ. ఆత్మ విషయము కాదేని, ఆత్మను శ్రుతి యెట్లు
చెప్పఁగలదు ? అనుభవరూపమగు ఆత్మకు అనుభవాపేక్ష
యెటులనని యాక్షేపము రాఁగా లోకములో అనుభవము
వేఱు. అనుభవించెడి పదార్థము వేఱు, అని ప్రసిద్ధియు, అను
భవింపఁబడునది జడము, అనుభవించునది చైతన్యము, అను
భేదమును కలదుకాని ఇట నసుభవరూపమే యగు ఆత్మకాభే

దము లేనందున నీయాక్షేపము యుక్తముకాదని చెప్పుచు న్నారు:—

మూ. దృశిరూపే సదా నిత్యే దర్శనాదర్శనే మయి,
కథం స్యాతాం తతోనాన్య ఇష్యతేఽనుభవస్తతః. ౯

తా. జడములగు దృశ్యపదార్థములయొక్క సత్త పరప్రకాశము నపేక్షించుటవలన నొకప్పుడు స్ఫురింపవచ్చును. మఱియొకప్పుడును స్ఫురింపకపోవచ్చును. కాని, దృగ్రూపుఁడనగు నాయందు [1] స్వాన్యజ్ఞానాగమాపాయములచే దర్శనాదర్శనము లెట్లు కలుగును? ఎల్లప్పుడు నిత్యుఁడు జ్ఞానస్వరూపుఁడు నిరపేక్షసత్తాకుఁడును నగు నాయొక్క ప్రకాశము రాకపోకలులేక నిత్యసిద్ధమగుటచే నొకప్పుడు దర్శనమును మఱియొకప్పుడు అదర్శనమును గలుగనందున స్వరూపానుభవమే కాక అన్యానుభవము నాకు లేదు.

1 ప్ర. ఆత్మకు నిత్యత్వమెట్లు?

ఉ. స్వరూపము మాఱకపోవుటవలనను, జ్ఞానము మాఱకపోవుటవలనను ఆత్మ నిత్యము.

2 ప్ర. దర్శనాదర్శనము లననేమి?

ఉ. దర్శనమనఁగా జ్ఞానము. అదర్శనమనఁగా అజ్ఞానము.

3. ప్ర. జ్ఞాన మొకప్పుడు ఉండి మఱియొకప్పుడు ఉండదుకదా? ఇది యెట్లు పొసఁగును.

ఉ. నిత్యప్రకాశస్వరూపున కొకప్పుడు జ్ఞానము, మఱియొకప్పుడు అజ్ఞానమును లేదు. పర్వతమేఘాద్యావరణము గలిగెనేని యపుడు రాత్రి

---

1 తనకంటె నన్యమగు జ్ఞానముయొక్క రాకపోకలచేత.

యనియుం, ఆయావరణము తొలఁగఁగనే యది పగలనియుం లోకులకుఁ దోఁచునేకాని, అహోరాత్రవిభాగము సూర్యున కెప్పుడును లేదు. ఇట్లు నిత్యప్రకాశుఁడగు ఆత్మకు ఒకపుడు జ్ఞానము, మఱియొకపుడు అజ్ఞానమును లేదు. కాని, అవిద్యావరణము వచ్చినపుడు అజ్ఞానమనియుం, ఆయావరణము తొలఁగఁగనే జ్ఞానమనియు లోకము తలంచును. ఇందుకు-"నాహో న రాత్రిస్సవితుర్యథా భవేత్ప్రకాశరూపావ్యభిచారితః క్వచిత్, జ్ఞానం తథాఽజ్ఞానమిదం ద్వయం హరే రామే కథం స్థాస్యతి శుద్ధ చిద్ఘనే" అనునట్టి అధ్యాత్మరామాయణములో రామహృదయమందలి శ్లోకము ప్రమాణము.

౨౯. ఆత్మ దృగ్రూపమే యని ధ్రువపఱచుచున్నారు:-

మూ. యత్రస్థాస్తాపో రవేర్దేహే దృశేః స విషయో యథా,
సత్త్వస్థ స్తద్వదేవేహ దృశేః స విషయ స్తథా. ౧౦

తా. ఆత్మ సుఖదుఃఖములు గలవాఁడుగఁ దోఁచుటచే నిత్య దృగ్రూపుఁడు కాఁడని చెప్పరాదు. దేహమందుఁ గలుగు సూర్యాతపమువలని తాపము దేహాశ్రయమగు ప్రదేశమునందే యుండి, దేహమునకుఁ దాప మున్నట్లు తోఁచినను, ఆవరణముగల ప్రదేశమును జేరఁగా నా సూర్యాతపముయొక్క వేఁడిమి పూర్వప్రదేశమందే యుండునుగాని దేహమునకు లేకపోవును, అని తెలియఁబడును. ఇట్లు అంతఃకరణమందలి సుఖదుఃఖాదిక రూపతాపము అంతఃకరణోపాధికుఁడగు జీవునకుఁ దోఁచినను ఆవరకమగు అంతఃకరణోపాధి సద్గురుకటాక్షమునఁ దొలఁగఁగనే ఆ యంతఃకరణమందలి తాపము ఆత్మకు నంటదు. తాపము అంతఃకరణధర్మమగుటచే, ఆత్మ నిత్యుఁ డనియు చైతన్యమాత్రస్వరూపుఁడనియు తాత్పర్యము.

దీనికే అర్థాంతరము:—

దేహమందు సంక్రమించిన రవికృతతాపమువలన దేహముమాత్రమే తప్తమైయుండ 'నేను తప్తుఁడను' అని దేహమే నేననెడి అభిమానముగల వానికి ఏవిధమున విషయమగుచుండునో, అట్లే శబ్దస్పర్శాదివిషయ సంపర్కమువలనఁ గలిగిన సుఖదుఃఖాదితాపము అంతఃకరణమునందలిదై యుండ నాయంతఃకరణసాక్షియగు దృగాత్మకు అంతఃకరణ తాదాత్మ్యాభిమానముచే విషయమగునుగాని వివేకికి ఆతాపముండదు.

1 ప్ర. సుఖదుఃఖ ధర్మము లెవనివి?

ఉ. ఈ ధర్మములు ఆత్మకు లేవు. ఏలయన బుద్ధి ధర్మములగు నివి అధ్యాసవశమున ఆత్మకున్నట్లు మాత్రము అవివేకమువలనఁ దోఁచుచుండును.

2 ప్ర. అట్లు తోఁచుటయందు దృష్టాంతమేమి?

ఉ. ఎండలో దేహము తపించునపుడు దేహాధ్యాసమువలన 'నేను తప్తుఁడ'నని లోకులు తలంతురుగాని, విమర్శింపఁగా నా తాపము ఆత్మకు లేదు. ఇట్లే స్వదృశ్యాంతఃకరణాధ్యాసమువలనఁ గలిగిన అభిమానమువలన అవివేకి 'నేను సుఖిని దుఃఖితుఁడను' అని తలంచినను అధ్యాసములేని వివేకి యిట్లు తలంపఁడు. ఇందుకు-''అసంగో హ్యయమాత్మా శుభ్రః''యను శ్రుతియే ప్రమాణము. ౧౦

అవ. సుఖదుఃఖాదియుక్తమగు అంతఃకరణముతో ఆత్మకు సంబంధములేదను నంశమునే స్ఫుటపరుచుచు, వివిక్త స్వరూపానుసంధానమును నిరూపించుచున్నారు:—

మూ. ప్రతిషిద్ధేదమంశో జ్ఞః ఖమివైకరసోఽద్వయః,
నిత్యముక్తస్తథా శుద్ధః సోఽహం బ్రహ్మాస్మి కేవలః.

తా. అహంకారాది దేహాంతమగు దృశ్యజాతము నంతయు 'నేతి నేతీతి' యను వాక్యమననమువలన నిషేధింపఁగా, నిషేధావధియు దృగ్రూపుఁడునగు ఆత్మ ఆకాశమువలె అద్వయుఁడు, ఏకరసుఁడు, నిత్యముక్తుఁడు, నిత్యశుద్ధుఁడు, కేవలుఁడు నగు బ్రహ్మమాత్రముగ భాసించును. ౧౧.

అవ. ఇట్లు విచారింపఁగా, నేను బ్రహ్మమునే కనుక సకలదృశ్యవర్గమునకు సాక్షియగు నాకెక్కడను స్వరూపభేదము లేదని అద్వయాత్మతత్త్వమును బ్రకటించుచున్నారు:—

మూ. విజ్ఞాతుర్నైవ విజ్ఞాతా పరోఽన్యః సంభవత్యతః,
విజ్ఞాతాఽహం పరో ముక్తః సర్వభూతేషు సర్వదా.౧౨

తా. సకలదృశ్య విజ్ఞాతయగు ఆత్మకంటె నన్యుఁడగు విజ్ఞాత సంభవింపనందున నేనే పరమవిజ్ఞాతను, స్థావరజంగమాత్మక సకలభూతములందును, పూర్వోక్తప్రకారము సర్వదా సకలవిజ్ఞేయ తద్ధర్మరహితుఁడ నగుటచే ముక్తుఁడనై స్ఫురింతును. ౧౨.

అవ. ఇట్లు శ్రుత్యుపదేశమువలనను, గురూపదేశము వలనను, సదా సర్వత్ర అద్వయాత్మానుసంధానము చేయు చున్నను 'నేను బ్రహ్మవేత్తను' అనెడి అభిమానముచే నిర్విశేష బ్రహ్మభావము సిద్ధింపదు. అనెడి యాక్షేపమున కుత్తరము:—

మూ. యో వేదాలుప్తదృష్టిత్వమాత్మనోఽకర్తృతాం తథా,
బ్రహ్మవిత్త్వం తథా ముక్త్వా స ఆత్మజ్ఞో న చేతరః.

తా. బ్రహ్మవేత్తయై 'నేను బ్రహ్మజ్ఞానిని' అనెడి అభిమానమును విడిచి, శ్రుతి బోధించువిధమున అలుప్త చిన్మాత్రుఁడగుచు ద్రష్టృత్వ కర్తృత్వముల నెఱిఁగినవాఁడే ఆత్మజ్ఞుఁడు. 'నేను జ్ఞానిని' యను అభిమాన లేశమైనను గలవాఁడు జ్ఞాని కాఁడు. ౧౩

అవ. బ్రహ్మాత్మజ్ఞానముగలవానికి నేను బ్రహ్మవేత్తనను అభిమాన మెటుల లేకపోవును? అట్టి యభిమానము ఉండఁగా ఆత్మ నిర్విశేష మెట్లగును? అను శంకకుత్తరము:—

మూ. జ్ఞాత్రైవాహమవిజ్ఞేయః శుద్ధో ముక్తః సదేత్యపి,
వివేకీ ప్రత్యయో బుద్ధే ర్దృశ్యత్వాన్నాశవాన్యతః.

తా. నేను సకలజ్ఞేయమును దెలియువాఁడనే కాని దేనిచేతను దెలియఁబడను, అని వివిక్తాత్మనిష్ఠమగుచు బుద్ధియొక్క యే వృత్తిరూపజ్ఞానము కలదో ఆ జ్ఞానము దృశ్యమగుటవలన సాక్షిచైతన్యముచేఁ జూడఁబడుచు నశించునదియే. కావున బ్రహ్మవేత్తకు అభిమానము ఇంచుకైనను దగదని భావము. ఇందుకు దృష్టాంతము—చిల్లగింజగంధము బాడెనీటిలోఁ వేయఁగా నది బాడెను బోఁగొట్టి నీటిని శుద్ధపరిచి పిదప తాను నశించును. ఇట్లే పూర్వోక్తమగు వివేకబుద్ధి వృత్తియుఁ బ్రత్యగాత్మను నిరీక్షించుచు ఆత్మయందు అవివేకకల్పితాధ్యాసములను సమూలముగ నున్మూలింపఁజేసి తాను నశించి ప్రత్యగాత్మను నిరస్తసమస్తదోషవిశేషముగను నిర్మలముగను స్ఫురింపఁజేయును. ౧౪

అవ. ఆత్మచేఁ బ్రకాశింపఁజేయఁబడుటయను దృష్టాంతమువలన చైతన్యాభాసుఁడు (జీవుఁడు)ను ప్రకృతమగు బుద్ధి ప్రత్యయమువలెనే నాశార్హుఁడే యగునని ఆక్షేపము. దీనికి

సమాధానము:— ఉపాధిసాధనవ్యాపకము. ఎట్లనఁగా, పర్వతమునందు ధూమము కనుపడుచుండెనేని అందు అగ్ని కలదను అనుమానప్రమాణములో సాధనమగు ధూమము నకు ఆర్ద్రేంధనసంయోగము ఉపాధి. తడిసిన కట్టెలు లేని చోట పొగ కలుగదు గనుక సాధనమగు(హేతువగు)ధూమ మునకు వ్యాపకమగు ఆర్ద్రేంధనసంయోగము ఉపాధి యనఁబడును. వ్యాపకము అధిక దేశవర్తి, వ్యాప్యము అల్ప దేశవర్తి యని నియమము. లోకములోని వస్తుజ్ఞానమునకు ధీవృత్తి కలుగకుండ వస్తువు స్ఫురింపదు. కాని ఆత్మజ్ఞానము నకు నట్టి యుపాధ్యపేక్ష లేదని చెప్పుచున్నారు:—

మూ. అలుప్తా త్వాత్మనో దృష్టిర్నోత్పాద్యా కారకైర్యతః,
దృశ్యయాచాన్యయాదృష్ట్యాజన్యతాఽస్యాః ప్రకల్పితా.

తా. ఆత్మజ్ఞానము కర్తృకర్మకరణ కారకములచేఁ బుట్టింపఁబడని దగుటచే నశింపక సర్వదా భాసించుచుండును. అట్లేని నీనికి ఆత్మజ్ఞానము కలిగినదనుట తగునా యందువేని వినుము. ఘటము పుట్టఁగా ఘటాకాశము పుట్టినదనునట్లు ఆత్మజ్ఞానాభివ్యక్తికి ఉపాధియగు ధీవృత్తి ఉదయింపఁగా ఆత్మజ్ఞానము పుట్టెనని పామరులు తలంతురేకాని యిది సత్యముకాదు.

ప్ర. ఆత్మజ్ఞానము బుద్ధివృత్తిరూపమగు నితరజ్ఞానముచే స్పష్ట మగునా?

ఉ. సూర్యుఁడంతటను బ్రకాశించుచుండఁగా నిది సూర్యప్రకాశ మని సర్వజనులకుఁ దెలియక పోవచ్చును. అవు డొకయద్దమును సూర్యున

కెదురుగ నుంచినయెడల నా యద్దమందుఁ బ్రతిఫలించు సూర్యకాంతి తన యెదుటనున్న వస్తువును సూర్యకాంతికంటె ద్విగుణముగఁ బ్రకాశింపఁ జేయును. ఆ సమయమున ననేకదర్పణములను దెచ్చి యుంచఁగా మధ్య మధ్య సూర్యప్రకాశము మాత్రమే కలదనియు, నిట్లు దర్పణములందుఁ గల సూర్యప్రకాశము సయితము దర్పణతేజస్సహాయమున ద్విగుణమైనదనియు, దర్పణము లేనిచోటను, ఉన్నచోటను గూడ దీనికి మూలమగు సూర్యప్రకాశము అఖండమై భాసించుచున్నదనియు వివేకులు గ్రహింతురు. ఈవిధముననే అంతటను నిండియున్న అఖండాత్మచైతన్యము బుద్ధివృత్తులు ఉదయించునపుడు ద్విగుణమై పూర్ణముగ స్ఫురించుచుండును. ఆయా బుద్ధివృత్తులమధ్యను ఆత్మచైతన్యము మాత్రము స్ఫురించుచుండును. సూర్యప్రకాశము అద్దములయందు ద్విగుణమై, ఆయద్దముల మధ్యను తానుమాత్రమే యుండునట్లు, ఆత్మచైతన్యముకూడ బుద్ధివృత్తుల యందు ద్విగుణమై వాని నడుమను తానుమాత్రమే యుండును. ఇట్లు సూర్యప్రకాశమువంటి ఆత్మచైతన్యము అఖండాకారముగ నుండును. ఈ ప్రకారము బుద్ధివృత్త్యాఖ్యజ్ఞానము ఆత్మజ్ఞానమునకు అభివ్యంజకమగును. ఈ యర్థమును శ్రీవిద్యారణ్యులు తమ పంచదశీగ్రంథమున కూటస్థదీపప్రకరణమందు వివరించిరి. ౧౫

అవ. ఇట్లు ఆత్మయందు మార్పులేకుండ సదా ప్రకాశించెడి చైతన్యము నిత్యమని బోధించి (౧౩-వ శ్లోకమందుఁ జెప్పఁబడిన) నిర్వికారత్వమును అకర్తృత్వమును నిపుడు బోధించుచున్నారు:—

మూ. దేహాత్మబుద్ధ్యపేక్షత్వా దాత్మనః కర్తృతా మృషా,
నైవ కించిత్కరోమీతి సత్యా బుద్ధిః ప్రమాణజా. ౧౬

తా. దేహాత్మబుద్ధిపూర్వకముగఁ గలిగిన ఆత్మకర్తృత్వము మిథ్య యగును. "నిష్కలం నిష్క్రియం శాంతమ్" అను శ్రుతిసిద్ధమగు నిష్క్రియత్వమే సత్యము. ౧౬

అవ. ఆత్మకుఁ గర్తృత్వము పారమార్థికము కాదనుటకు మఱియొక హేతువును జెప్పుచున్నారు:—

మూ. కర్తృత్వం కారకాపేక్ష మకర్తృత్వం స్వభావతః,
కర్తా భోక్తేతి విజ్ఞానం మృషైవేతి సునిశ్చితమ్. ౧౭

తా. అసంగము నిరవయవమునగు ఆత్మకు కర్తృత్వాదికారకాపేక్ష సత్యముగ లేదు. అకర్తృత్వమే ఆత్మకు సహజధర్మము. కనుక ఆత్మ కర్త భోక్త యనుకొనుట మృషయేకాని పరమార్థముగ సత్యముకాదు. ఆత్మ నిత్యనిర్మలస్వరూపుఁడని అర్థము. ౧౭

అవ. ఇట్లు పదార్థశోధన జేసినవానికి మహావాక్యసిద్ధమగు "బ్రహ్మాస్మి" యను జ్ఞానము నిరపవాదముగఁ గలుఁగఁగా, 'నేను కర్తను' అను బుద్ధి నివారింపఁబడి, ప్రసంఖ్యాన విధికి అవకాశము ఉండదని చెప్పుచున్నారు:—

మూ. ఏవం శాస్త్రానుమానాభ్యాం
స్వరూపేఽవగతే సతి,
నియోజ్యోఽహ మితి హ్యేషా
సత్యా బుద్ధిః కథం భవేత్. ౧౮

తా. (ఈ ప్ర. శ్లో. ౮ లోఁ జెప్పఁడినట్లు) తత్త్వమసివాక్యానుభవమువలన ఆత్మజ్ఞానముగలిగి (శ్లో. ౧౦ లో వివరింపఁబడినట్లు) సూర్యాది

కృతతాపము ఆత్మకు లేదనియుఁ, ఆత్మయొక్క నిజస్వరూపమును అనుభవమువలనఁ దెలిసికొనినంతట 'నేను గురువుచే నాజ్ఞాపింపఁబడుచున్నాను.'- 'గురువులగు మీరు నన్నాజ్ఞాపించుచున్నారు' అనెడి కర్తృకారకవ్యాపారము సయితముగ, వ్యవహారమంతయుఁ మాయికమేయగుటచేత నుండదు. ౧౭

అవ. నిర్వికార పరబ్రహ్మస్వరూపుఁడగు బ్రహ్మవేత్త నియోజ్యుఁడు కాఁడని చెప్పుచు, ప్రకరణార్థమును ఉపసంహరించుచున్నారు:—

మూ. యథా సర్వాన్తరం వ్యోమ
వ్యోమ్నోఽప్యభ్యన్తరో హ్యహమ్,
నిర్వికారోఽచలః శుద్ధో
ఽజరో ముక్తః సదాఽద్వయః. ౧౮

తా. ఆకాశము సర్వాంతరమైయున్నటుల, ఆత్మ ఆకాశముకంటెను ఆంతరమగుచు; నిర్వికారము, శుద్ధము, అజరము, ముక్తము, అద్వయమునైయున్నది. ౧౮

ఇది ప్రకాశప్రకరణము.

---

శ్రీః

# ఉపదేశసాహస్రి

(శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యప్రణీతము.)

## శ్లోకప్రబంధము-త్రయోదశప్రకరణము.

### ౧౩. అచక్షుష్ట్వ ప్రకరణము.

అవ. పదార్థతత్త్వశోధనవలన వాక్యార్థజ్ఞానము కలుగును. కనుక, ప్రసంఖ్యానవిధి అనర్థకము, అయుక్తము నగును. అని నిరాకరించి పూర్వప్రకరణోక్తమగు నిర్వికార శుద్ధాచలత్వము లాత్మకుఁ గలవని స్ఫుటపరుచుటకై యీప్రకరణ మారంభింపఁబడుచున్నది:—

మూ. అచక్షుష్ట్వాన్న దృష్టిర్మే తథాఽశ్రోత్రస్య కా శ్రుతిః,
అవాక్త్వాన్న తు వక్తిః స్యాదమనస్త్వాన్మతిః కుతః. ౧
అప్రాణస్య న కర్మాస్తి బుద్ధ్యభావే న వేదితా,
విద్యావిద్యే తతో న స్తశ్చిన్మాత్రజ్యోతిషో మమ. ౨

తా. సదా ప్రకాశమానచిదేకరసుఁడనగు నాకు నేత్రేంద్రియము లేనందున చూపులేదు. శ్రోత్రేంద్రియము లేనందున శ్రవణములేదు. వాగిం

ద్రియములేనందున వచనములేదు. మనస్సులేనందున మఱియులేదు. ప్రాణములేనందున కర్మములేదు. బుద్ధిలేనందున తెలిసికొనుటయుం లేదు. జ్ఞానక్రియలులేవు. జ్ఞానాజ్ఞానములు లేవు. చక్షురాదీంద్రియములు దేహమునకే కాని నిష్క్రియాత్మకు ఇవి కరణములు కానేరవు. ౧-౨

అవ. పూర్వోక్తధర్మములు శారీరములే కాని ఆత్మకు లేనందున శరీరాభావమే శుద్ధ్యాదికి నిమిత్తమనే యభిప్రాయముతో చిన్మాత్రజ్యోతి స్స్వరూపమును వర్ణించుచున్నాఁడు:—

మూ. నిత్యముక్తస్య శుద్ధస్య కూటస్థస్యావిచాలినః,
అమృతస్యాక్షరస్యైవ మశరీరస్య సర్వదా. 3
జిఘత్సా వా పిపాసా వా శోకమోహౌ జరామృతీ,
న విద్యన్తే ఽశరీరత్వా ద్వ్యోమవ ద్వ్యాపినో మమ.౪

తా. శుద్ధుఁడగుటవలన నిత్యముక్తుఁడును, కదలనందున కూటస్థుఁడును, నశింపనందున అమృతుఁడును, స్థూలసూక్ష్మకారణశరీరరహితుఁడును, ఆకాశమువలె వ్యాపకుఁడునునగు ఆత్మకు ఆకలి, దాహము, శోకము, మోహము, జర, మరణము నను షడూర్మ్లెప్పుడును లేవు.

1 ప్ర. ఆత్మకు శుద్ధత్వాచలత్వాక్షరత్వధర్మములు కలవా?

ఉ. శరీరములేనందున శరీరసంబంధములగు అశుద్ధత్వచలనక్షరణములు ఆత్మకు లేవు. అశరీరుఁడగు ఆత్మకు మఱియేధర్మములును లేనేలేవు.

2 ప్ర. ఆత్మకు శరీరములేకున్నను ప్రాణము మనస్సును గలవా?

ఉ. ప్రాణమనస్సులును ఆత్మకు లేవు. అశరీరమని దిజ్మాత్రము (కొంచెము) ఉదాహరించుటచేత స్థూలదేహమువలెనే సూక్ష్మకారణ దేహసంపాదకములగు ప్రాణమనస్సులును ఆత్మకు లేనేలేవు.

3 ప్ర. అట్లేని ఆకలి దాహము శోకము మొదలగునవి యెవనివి?

ఉ. ఆకలి దాహమును ప్రాణధర్మములు. శోకమోహములు మనో ధర్మములు. జరామరణములు శరీరధర్మములు. కాని ఆత్మకు ఈయాఱుతరంగ ములును లేవు. ఇందుకు—"క్షుత్పిపాసే ప్రాణధర్మౌ శోకమోహౌ తు మానసౌ, జన్మమృత్యూ దేహధర్మౌ షడూర్మిరహితః శివః" అను వచనము ప్రమాణము.　　3_౪

అవ. ఆత్మకు నేత్రశ్రవణములే కాక స్పర్శజిహ్వాది సక లేంద్రియములును లేనందున స్పర్శరసజ్ఞత్వక్రియలును లేవని నిరూపించుట:—

మూ. అస్పర్శత్వా న్న మే స్పృష్టి ర్నాజిహ్వాత్వా ద్రసజ్ఞతా,
　　నిత్యవిజ్ఞానరూపస్య జ్ఞానాజ్ఞానే న మే సదా.　　౫

తా. త్వగింద్రియములేని నాకు స్పర్శములేదు. జిహ్వేంద్రియము లేని నాకు రసజ్ఞానములేదు. నిత్యజ్ఞానస్వరూపుఁడనగు నాకొకప్పుడు జ్ఞానము, మఱియొకప్పుడు అజ్ఞానము అను వికల్పమును లేదు.　　౫

అవ. ఆత్మకు దృష్ట్యాదులు లేవనుటయందు యుక్తి:—

మూ. యా తు స్యాన్మానసీ వృత్తిశ్చాక్షుషా రూపరంజనా,
　　నిత్య మేవాత్మనో దృష్ట్యా నిత్యయా దృశ్యతే హి సా.

తా. కన్నులచేఁ జూడఁబడు శుక్లకృష్ణాదిరూపభేదములును, మన స్సుచేఁ దెలియఁబడు సంకల్పవికల్పాదులును నిత్యమగు ఆత్మప్రకాశమువల ననే కలుగుచుండును.　　౬

అవ. కావున చక్షురాదీంద్రియములు ఆత్మకు లేవు.

ఆత్మయే యీయింద్రియములను జూచుచుండును. శారీరకము లగు నింద్రియములు లేమిచే నిరింద్రియుఁడగు ఆత్మ నిత్య శుద్ధమనే యభిప్రాయముతో నేత్రవృత్తివలెనే శ్రోత్రాదివృత్తి యును ఆత్మచేఁ జూడఁబడునని చెప్పుచున్నారు:—

మూ. తథాఽన్యేంద్రియయుక్తా యా
వృత్తయో విషయాంజనాః,
స్మృతీ రాగాదిరూపా చ
కేవలాంతర్మనస్యపి. ౭

తా. అట్లే శ్రోత్రాదిసకలేంద్రియములవలనఁ గలిగెడి శబ్దాదివృత్తులును, మనస్సులోనే యుదయించెడి రాగేచ్ఛాస్మరణాదివృత్తులును, ముందు చెప్పిన నిత్యాత్మప్రకాశమువలననే కలుగుచుండును. ౭

అవ. స్వప్నావస్థయందు మనఃపరిణామములగుచు విషయాకారములుగ భాసించెడి ధీవృత్తులు స్వవ్యతిరిక్తమగు ఆత్మకు దృశ్యములగునట్లు జాగ్రదవస్థయందును స్వవ్యతిరిక్త ద్రష్టచేఁ జూడఁబడు నవియే యని చెప్పుచున్నారు:—

మూ. మానస్యస్తద్వదన్యస్య దృశ్యాస్తే స్వప్నవృత్తయః,
ద్రష్టుర్దృష్టిస్తతో నిత్యా శుద్ధాఽనంతా చ కేవలా.౮

తా. కేవలమనోజన్యములగు స్వప్నవృత్తులు సాక్షియగు ఆత్మచేఁ దెలియఁబడునట్లు జాగ్రద్వృత్తులును ఆత్మచేఁ జూడఁబడును. సకలవృత్తులను గ్రహించెడి కూటస్థదృష్టి నిత్యము, శుద్ధము, కేవలము, అనంతము నని భావము. ౮

అవ. ఆత్మదృష్టి కూటస్థము శుద్ధము నగుచుండఁగా ఆత్మ వికారము గలవాఁడని యెట్లు తెలియఁబడునను శంక రాఁగా, వృత్తిమంతమగు అంతఃకరణముతో వివేచన చేసి గ్రహింపఁబడమిచేతనే యట్లు విపరీతబుద్ధి కలుగుచున్నదని చెప్పుచున్నారు:—

మూ. అనిత్యా సా విశుద్ధేతి గృహ్యతేఽత్రావివేకతః,
సుఖీ దుఃఖీ తథా చాహం దృశ్యయోపాధిభూతయా.
మూఢయా మూఢ ఇత్యేవం శుద్ధయా శుద్ధ ఇత్యపి,
మన్యతే సర్వలోకోఽయం యేన సంసారమృచ్ఛతి.౧౦

తా. ఉపాధిభూతమగుచు దృశ్యమగు దృష్టితో నభేదమువలన వ్యవహారకాలమందు బాహ్యదృష్టి నిత్యము శుద్ధము అనియు, ఆత్మదృష్టి అనిత్యము అవిశుద్ధము అనియు విపరీతముగ గ్రహింపఁబడును. అట్లే విషయముల యానుకూల్యమువలన సుఖవంతులమనియు,వాని ప్రాతికూల్యము వలన దుఃఖవంతులమనియు, మూఢబుద్ధివలన మూఢులమనియు, శుద్ధబుద్ధి వలన శుద్ధులమనియు జనులు తలఁచుచుందురు. ఈ విపరీతజ్ఞానమే సంసార కారణమగును. ౯-౧౦

అవ. ఈసంసార మెట్లు తొలఁగుననను ప్రశ్న కుత్తర మిచ్చుచు సంసారతాపతప్తుఁడై, యీసంసారబంధమునుండి ముక్తినిఁగోరువానికి శ్రీమదాచార్యులు కర్తవ్యమును బోధించుచున్నారు:—

మూ. అచక్షుష్ట్వాదిశాస్త్రోక్తం సబాహ్యాభ్యంతరం హ్యజమ్,
నిత్యముక్త మిహాత్మానం ముముక్షుశ్చేత్సదా స్మరేత్.

తా. వివేకి సంసారసంతాపదుఃఖమునుండి విడువఁబడి స్వరూప జ్ఞానము దెలియఁగోరునేని అచక్షుష్ట్వాదిశాస్త్రోక్తము నిత్యమునగు ఆత్మను గురుప్రోక్త లక్ష్యానుసారముగ బాహ్యాభ్యంతరములందు సర్వదా అనుసంధానము చేయుచుండవలెను. ౧౧

అవ. ఆత్మకు చక్షురాదీంద్రియములు లేవని సిద్ధముగఁ జెప్పిన మాటను శ్రుతివాక్యముచే దృఢపరుచుట:—

మూ. అచక్షుష్ట్వాది శాస్త్రాచ్చ నేంద్రియాణి సదా మమ,
అప్రాణో హ్యమనాః శుభ్ర ఇతి చాథర్వణం వచః. ౧౨

తా. "అచక్షుష్కమశ్రోత్రమవాగమనః" అని బృహదారణ్యక శ్రుతియు, "అప్రాణో హ్యమనాః శుభ్రః" అని ముండకోపనిషత్తును జెప్పుటవలన, ఆత్మకు ఇంద్రియములు తత్కార్యసంపర్కమును ఎప్పుడును లేదు. కనుక, ఆత్మ నిత్యశుద్ధమని భావము. ౧౨

అవ. ఆత్మ నిర్విశేషమని శ్రుత్యంతరము బోధించుచున్నది:—

మూ. శబ్దాదీనామభావశ్చ శ్రూయతే మమ కాఠకే,
అప్రాణో హ్యమనా యస్మాదవికారీ సదా హ్యహమ్.

తా. అహంపదలక్ష్యార్థమగు ఆత్మకు శబ్దస్పర్శాదులును ప్రాణమనస్సులును లేవు. కనుక ఆత్మ యెల్లప్పుడును నిర్వికారమేయని భావము. "అశబ్ద మస్పర్శమరూపమవ్యయం తథాఽరసం నిత్యమగంధవచ్చయత్, అనాద్యనంతం మహతః పరం ధ్రువం నిచాయ్యతం మృత్యుముఖాత్ప్రముచ్యతే." అని కఠవల్లి చెప్పుచున్నది. ౧3

అవ. ఆత్మ అవికారియని తెలిసినయెడల ఫలము:—

మూ. విక్షేపో నాస్తి తస్మాన్మే న సమాధి స్తతో మమ,
విక్షేపో వా సమాధిర్వా మనసః స్యాద్వికారిణః. ౧౪

తా. అవికారియగు ఆత్మకు విక్షేపములేదు. కావున సమాధియు లేదు. విక్షేపసమాధులు వికారవంతమగు మనస్సుయొక్క ధర్మములే.

1 ప్ర. విక్షేప మననేమి?

ఉ. ప్రత్యగాత్మానుసంధానముచేయక బాహ్యవస్తువులనే చింతించుట విక్షేపమనఁబడును. దీనినుండి ఆత్మదర్శనము ప్రతిబద్ధమగును.

2 ప్ర. ఇటువంటి విక్షేప మెట్లు తొలఁగును?

ఉ. నిత్యనిరంతరాత్మానుసంధానరూపమగు సమాధివలన నట్టి విక్షేపము తొలఁగును.

3 ప్ర. ఈవిక్షేపసమాధులు ఆత్మకుఁ గలవా?

ఉ. ఆత్మకివిలేవు. ఈవిక్షేపసమాధులు మనోధర్మములుగనుక మనోనిరోధమువలన నివి సాధ్యములగును. ఈమనోనిరోధము అమనస్కమనియు, రాజయోగమనియు తద్జ్ఞులచే వ్యవహరింపఁబడును. ౧౪

అవ. మనస్సువలె ఆత్మ వికారవత్త్వైనను వికారియగునామనస్సుతో తాదాత్మ్యమువలననైనను ఆత్మకు విక్షేపసమాధులు గలుగవచ్చునుగాని, వికారతాదాత్మ్యములు రెండును ఆత్మకు లేవని:—

మూ. అమనస్కస్య శుద్ధస్య కథం తత్స్యాద్ద్వయం మమ,
అమనస్త్వావికారిత్వే విదేహవ్యాపినో మమ. ౧౫

తా. నిర్వికారుఁడును, అమనస్కుఁడును, అహంశబ్దలక్ష్యార్థమునగు నాకు వికారతాదాత్మ్యము లెట్లు కలుగును? కలుగవనుట. శరీరరహితుఁడ నగు నాకు మనస్సులేదు. వ్యాపకుఁడనగు నాకు వికారములును లేవు. ౧౫

అవ. అట్లేని నీకు జిజ్ఞాసావస్థయందు సమాధ్యాదికము చేయవలెనను బుద్ధి యెట్లు కలిగెనను శంక కుత్తరము:—

మూ. ఇత్యేతద్యావదజ్ఞానం తావత్కార్యం మమాభవత్,
నిత్యముక్తస్య శుద్ధస్య బుద్ధస్య చ సదా మమ. ౧౬

తా. నిత్యముక్తుఁడను, నిర్వికారుఁడను, బోధస్వరూపుఁడను నగు నాకు నిత్యశుద్ధత్వాదికమును ప్రతిబంధించెడి అజ్ఞాన మున్నంతవఱకే నాకు సమాధిచేయవలసి యుండెను. ఇప్పుడు స్వరూపజ్ఞానముగల నాకు సమాధితో నవసరములేదు. ౧౬

అవ. సమాధితో నవసరము లేకపోవుటకుఁ గారణము:—

మూ. సమాధిర్వా ఽసమాధిర్వా
కార్యం చాన్యత్కుతోభవేత్,
మాం హి ధ్యాత్వా చ బుద్ధ్వా చ
మన్యంతే కృతకృత్యతామ్. ౧౭

తా. ముముక్షువులు ప్రత్యగేకరసమును అస్మచ్ఛబ్దలక్ష్యార్థమునగు నన్ను విమర్శించి సాక్షాత్కరించి ధన్యులై యిఁక కర్తవ్యశేషము లేదని దృఢనిశ్చయులగుదురో అట్టి నాకు విక్షేపము, సమాధి మొదలగునవి యే

మియ్యంగ గలుగవు. ఇందుకు-"ఏష నిత్యో మహిమా బ్రాహ్మణస్య న కర్మణా వర్ధతే నో కనీయాన్" అను శ్రుతియు, "యస్త్వాత్మరతిరేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః, ఆత్మన్యేవ చ సంతుష్టః తస్య కార్యం న విద్యతే" అను స్మృతియుం బ్రమాణములు. ౧౭

అవ. యథోక్తాత్మజ్ఞానికి సమాధ్యాదికముతో పనిలేకున్నను, ఆత్మ బ్రహ్మమే యని తెలియవలసిన పనియొకటి, దృశ్య ప్రపంచమును ఆత్మయందు లయింపఁజేయవలసిన పని మఱియొకటియు శేషించియుండునను శంకరాఁగా బ్రహ్మస్వరూపము నిత్యసిద్ధము గనుకను, అజ్ఞానమాత్ర విలసితమగు ప్రపంచము మూలకారణాజ్ఞానము తొలఁగఁగనే తానుగూడ అధిష్ఠానాత్మరూపమై లయించుటవలనను, బ్రహ్మజ్ఞానికిఁ గర్తవ్యశేష మేమియు లేదనియే బోధించుచున్నారు:—

మూ. అహం బ్రహ్మాఽస్మి సర్వోఽస్మి
శుద్ధో బుద్ధోఽస్మ్యతః సదా,
అజః సర్వత ఏవాహ
మజరశ్చాక్షయోఽమృతః. ౧౮

తా. అహంశబ్ద లక్ష్యార్థమగు నే నెప్పుడును బ్రహ్మమునే. సర్వోపాధిస్థుఁడనైనను ఉపాధిధర్మ సంబంధములేక పరిశుద్ధుఁడను. బోధరూపుఁడను గనుక దేనినుండియు జననమరణాదివికారములు లేనివాఁడనే. ఈ వికారములు దేహధర్మములేకాని శుద్ధబుద్ధ పరమాత్మకు లేవు. ౧౮

అవ. ప్రతిదేహమందును చేతనభేదము భాసించుచుం

డఁగా "బ్రహ్మాస్మి" అని ప్రత్యగాత్మకు పూర్ణత్వానుభవము ఎట్లు కలుగును, అను శంకకు త్తరము:—

మూ. మదన్యః సర్వభూతేషు బోద్ధా కశ్చిన్న విద్యతే,
కర్మాధ్యక్షశ్చ సాక్షీ చ చేతా నిత్యోఽగుణోఽద్వయః.

తా. సకలభూతములందును నాకంటె నన్యుఁడొకఁడు బోద్ధ లేఁడు, నే నొకఁడనే బాహ్యాభ్యంతరసాక్షి నగుదును. ఏలయనఁగా; ప్రత్యగాత్మ నగు నేను సకలకర్మములకు సాక్షిని, ఆకర్మములన్నియు చేతనమును నిత్యుఁడను, నిర్గుణుఁడను, అద్వితీయుఁడను నగు నాయందే జరుగుచుండును.

ప్ర. అట్లేని, నీవు, నేను వాఁడు నను భేదమెట్లు కలుగును ?

ఉ. ఘటమఠాద్యుపాధిభేదమాత్రమున నొకటియేయగు ఆకాశమునకు ఘటాకాశ మఠాకాశ మహాకాశాది నామములు కల్పితములగునట్లు శరీరోపాధులవలననే యద్వితీయ బ్రహ్మమునకు నీవు, నేను, వాఁడు నను భేదము కల్పితముగాని ఆత్మాంతరములేదు కనుక పూర్ణ బ్రహ్మత్వానుభవము నిష్ప్రతిబంధము. ౧౯

అవ. ఇట్లు "అహం బ్రహ్మాస్మి" యను వాక్యముచే బ్రహ్మత్వము ఆత్మకు నిరూపింపఁబడెను. "సర్వోఽస్మి" యను వాక్యమందలి సర్వత్వము సకలోపాధులను "నేతి నేతీ"తి వాక్యముచేత నిషేధింపఁగా నుపాధులయందుండు ప్రకాశాత్మక చైతన్య మొక్కటియే యనెడి అర్థమును బోధించుచున్నారు:—

మూ. న సచ్చాహం న చాసచ్చ నోభయం కేవలః శివః,
నమే సంధ్యా న రాత్రిర్వా నాహర్వా సర్వదా దృశేః.

తా. మచ్ఛబ్దలక్ష్యార్థమగు నేను మూర్తములగుచు సచ్ఛబ్దవాచ్యములగు భూజలతేజస్సులలో నేదియుంగాను. పంచభూతాత్మకమగుచు నీపంచభూతపరిణామమగు శరీరత్రయమును గాను. కాని, మచ్ఛబ్దలక్ష్యార్థమగు ఆ నేను సకలవిశేషరహితుఁడను, గుణత్రయాతీతుఁడను. సంధ్యాదికాలభేదములుండఁగా కేవలుఁడెట్లగునందువేని, ఎల్లప్పుడును దృగ్రూపుఁడను, సదా ప్రకాశమానుఁడనగు నాకు సంధ్యయు రాత్రింబగళ్లును, సంధ్యాదిశబ్దములచేతఁ జెప్పఁదగిన స్వప్నజాగరాద్యవస్థలును లేవు. సర్వదా ప్రకాశమానునకు స్వరూపావరణమును విక్షేపమును లేవు. ౨౦

అవ. కావున చిదేకరసుఁడును అగోచరుఁడును నగు ఆత్మ పరిపూర్ణబ్రహ్మమే యని:—

మూ. సర్వమూర్తివియుక్తం య
ద్యథా ఖం సూక్ష్మమద్వయమ్,
తేనాప్యస్మి వినా భూతం
బ్రహ్మైవాహం తథాఽద్వయమ్. ౨౧

తా. ఏకమగు నాకసము పరిమితములగు సకలమూర్తపదార్థములకంటె విలక్షణము సూక్ష్మమునగునట్లు బ్రహ్మము పరిపూర్ణము, అత్యంతసూక్ష్మము, ద్వైతరహితమునగును. ఉపమానమగు ఆకాశముండఁగా ద్వైతమెట్లు తగునందువేని వినుము—ఆత్మకు సమానముగ నెన్నఁబడుచుం గార్యవర్గమందున్న యాకాశమే ఉపాధిపరిహారమువలన పరిపూర్ణమును అద్వితీయమునై యుండఁగా కార్యకారణవిలక్షణమగు పరబ్రహ్మము పరిపూర్ణమును అద్వితీయమును గాకపోవునా? ౨౧

అవ. ఆకాశమువలె పరబ్రహ్మము ద్వితీయవస్తురహిత

మని చెప్పఁబడెను. ఇపుడు ఘటాకాశము మఠాకాశమును నీమొదలగు భేదములవలె నేను, నీవు, వాఁడు నీమొదలగు భేదవ్యవహార మెట్లు కలుగుననుటకు ఉత్తరము:—

మూ॥ మమాత్మా స్వత ఆత్మేతి
భేదో వ్యోమ్నో యథా భవేత్,
ఏకస్య సుషి భేదేన
తథా మమ వికల్పితః. ౨౨

తా. అద్వితీయమగు నాకాశమునకు ఛిద్రభేదమువలన ఘటాకాశము మఠాకాశము నని ఉపాధిభేదముచేఁ గల్పింపఁబడుచున్నను ద్వైతమెట్లు వాస్తవముకానేరదో యట్లే జ్ఞానియగు ఆయాత్మస్వరూపము పరబ్రహ్మమే. వ్యవహారదశయందు జీవుఁడననెడి భేదకల్పనము, పూర్ణాకాశమునకు రంధ్రోపాధినిఁబట్టి ఘటాకాశాదిభేదము ఉపాధిచేఁ గల్పింపఁబడునట్లు, అంతఃకరణోపాధిచేఁ గల్పితమేకాని వాస్తవముకాదు. "అంతఃకరణసాహిత్యరాహిత్యాభ్యాం విశిష్యతే, ఉపాధి ర్జీవభావస్య బ్రహ్మతాయాశ్చ నాన్యథేతి." అని శ్రీవిద్యారణ్యులు. ౨౨

అవ. కావున అవిద్యాదశయందు 'నేను, నాది' యను భేదము భాసించినను ఆత్మతత్త్వము నెఱింగినవానికి అవిద్యాదశయందుఁ దోఁచెడి 'నేను,నాది'యను భేదము లేదని చెప్పుచున్నారు:—

మూ॥ భేదోఽభేద స్తథా చైకో నానా చేతి వికల్పితః,
జ్ఞేయం జ్ఞాతా గతిర్గంతా మయ్యేకస్మిన్కుతో భవేత్.

తా. ఒక్కఁడనగు నాయందు అవిద్యాదశయందు నాది నేను, నను భేదమును, ఒక్కఁడను, అనేకమును అనెడి భేదాభేదములును, జ్ఞేయము (తెలియఁదగినది), జ్ఞాత(తెలియువాఁడు)యునను భేదమును, గతి (ఫలము), గంత (ఫలమును బొందువాఁడు)యునను భేదమును కల్పితములైనవి. విమర్శించినపు డివియన్నియు నేకమగు నాయందుఁ గలుగవు. ౨౩

అవ. అట్లైనను సంసారిత్వము హేయము, బ్రహ్మత్వము, గ్రాహ్యము అని సిద్ధాంతముకదా, ఇపుడు ఆత్మ నిర్విశేష మెట్లగునను శంకకుత్తరము:—

మూ. న మే హేయం న చాదేయమవికారీయతోఽహ్యాహమ్,
సదా ముక్తః సదా శుద్ధః సదా బుద్ధోఽగుణోఽద్వయః.

తా. నేను సదా వికారరహితుఁడనుగనుక నాకు హేయోపాదేయములు పారమార్థికములు కావు. "అవికార్యోఽయముచ్యతే" అను స్మృతిని "హి" శబ్దము సూచించెను. కావున నేనెల్లపుడును బంధసంసర్గరహితుఁడను. అశుద్ధిహేతువగు అవిద్యాసంబంధరహితుఁడను. సదా బోధస్వరూపుఁడను. నిర్గుణుఁడను. అద్వితీయుఁడను. ౨౪

అవ. పైనఁ జెప్పఁబడిన లక్షణములచే ఆత్మతత్త్వమును శాస్త్రాచార్యప్రసాదమువలన విని, మననముచేసి, నిదిధ్యాసననిష్ఠను బొందిన ముముక్షువు "అహం బ్రహ్మాస్మి" యని అనుసంధానపరుఁడు కావలెనని ముముక్షువును ప్రోత్సాహపరుచుచున్నారు:—

మూ. ఇత్యేవం సర్వదాఽఽత్మానం విద్వాత్సర్వం సమాహితః,
విదిత్వా మాం స్వదేహస్థమృషిర్ముక్తో ధ్రువో భవేత్.

తా. ఇట్లు సర్వదా సమాహితాంతఃకరణుఁడై సర్వమును ఆత్మగాఁ దెలియవలెను. సర్వదర్శియగు నీజ్ఞాని నన్ను స్వదేహమందును సర్వదేహములందును ఉపాధిపరిహారపూర్వకముగఁ దెలిసి, సర్వబంధరహితుఁడును నిత్యుఁడును నగును. ౨౧.

అవ. ఆత్మవేత్తకు చెప్పిన ముక్తిని విశదపఱుచుచున్నారు:—

మూ. కృతకృత్యశ్చ సిద్ధశ్చ యోగీ బ్రాహ్మణ ఏవ చ,
య ఏవం వేద తత్త్వార్థమన్యథా హ్యాత్మహా భవేత్.

తా. ఇట్లు ఆత్మతత్త్వము నెఱింగినవాఁడు ధన్యుఁడు సిద్ధుఁడు యోగి బ్రహ్మజ్ఞానియునగును. గురుప్రసాదముపొందక తత్త్వమెఱుఁగక మూఢుఁడగువాఁడు ఆత్మఘ్నుఁడగును. ఇందుకు శ్రీమద్భాగవతమందు శ్రీభగవంతునిచేఁ జెప్పఁబడిన వాక్యము ప్రమాణము. అది యెద్దియన:— "నృదేహమాద్యం సులభం సుదుర్లభం ప్లవం సుకల్పం గురుకర్ణధారమ్, మయానుకూలేన నభస్వతేరితం పుమాన్ భవాబ్ధిం న తరేత్ స ఆత్మహా"— బహుపుణ్యపుంజలభ్యమును సర్వోత్తమమును నగు నరదేహమనే మంచి కూర్పుగల నావను సర్వజనసాధారణముగాక సద్గురువు అనే నావికుఁడు నడుపఁగా భగవత్ప్రసాదమనెడి యనుకూలమారుతముచే నడుపఁబడఁగా సంసారసాగరమును దాఁటలేనివాఁడు ఆత్మఘాతకుఁ డనఁబడునని భావము.

అవ. చెప్పిన యర్థము వేదప్రమాణమని చూపుచు జ్ఞానసౌకర్యమును జెప్పుచున్నారు:—

మూ. వేదార్థో నిశ్చితో హ్యేష సమాసేన మయోదితః,
సంన్యాసిభ్యః ప్రవక్తవ్యః శాంతేభ్యః శిష్టబుద్ధినా. ౨౭

తా. నేను సంగ్రహముగఁ జెప్పిన వేదప్రమాణకమగు నీయర్థమును శాంతచిత్తులగు సంన్యాసులకు శాస్త్రాచార్యానుశిష్టబుద్ధిగల సద్గురువు బోధింపవలయును.

ఇది అచతుష్టయప్రకరణము.



శ్రీః

# ఉపదేశసాహస్రి

(శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యప్రణీతము.)

## శ్లోకప్రబంధము—చతుర్దశ ప్రకరణము.



### ౧౪. స్వప్నస్మృతిప్రకరణము.

అవ. పూర్వప్రకరణమందు ఆత్మాంతఃకరణములను వివేచనచేయకపోవుటవలన ఆత్మ సంసారి యని తోఁచునుగాని నిజముగ సంసారి కాఁడు అనియు, శాస్త్రప్రమాణమువలన అజ్ఞాన తత్కార్యములను నిషేధింపఁగా ఆత్మ బ్రహ్మమేయగు ననియు నిశ్చయింపఁబడెను. ఇపుడు అంతఃకరణము పరోక్షమును, సంసారప్రతిభాసము ప్రత్యక్షమును గనుక, ఆసంసారిత్వప్రతిభాసము బుద్ధ్యవివేకమువలనఁ జేయఁబడినది కాదనెడి శంకరాఁగా అంతఃకరణము ప్రత్యక్షమే యని నిరూపించుచు పూర్వోక్తశాస్త్రార్థమందు యుక్తిప్రదర్శనపరమగు నీ ప్రకరణము నారంభించుచున్నారు:—

మూ. స్వప్నస్మృత్యోర్ఘటాదేర్హి రూపాభాసః ప్రదృశ్యతే,
పురా నూనం తదాకారా ధీర్దృష్టేత్యనుమీయతే. ౧

తా. స్వప్నకాలమందును, పూర్వానుభూతవస్తువును తిరిగి స్మరించునపుడును ఘటాదిపదార్థములయొక్క ఆకారావభాసము అనుభవింపఁబడుచుండుటవలన, పూర్వము (పదార్థములను మొదట ననుభవించునపుడు) ఆ ఘటాదిపదార్థాకారమగు అంతఃకరణవృత్తి తప్పక అనుభవింపఁబడినదని యూహింపఁదగును. ఏలయనఁగా; స్వప్నమందును, పదార్థస్మరణము కలుగునపుడును, పూర్వ మనుభవించిన పదార్థములే స్ఫురించుచుండుననియు, పూర్వము చూడఁబడిన బాహ్యపదార్థము ఆ స్వప్నస్మృతులందు లేదనియు, స్వప్నస్మృతులందుఁ దెలియఁబడుచుండెడి పదార్థములన్నియు పదార్థాకారవృత్తితోఁగూడిన అంతఃకరణమేయని నిశ్చయింపఁబడవలసియుండుటచేత జాగ్రదవస్థయందును, పూర్వము పదార్థమును సాక్షాత్తుగ ననుభవించునపుడును, అంతఃకరణమే పదార్థాకారవృత్తితో ప్రత్యక్షముగ ననుభవింపఁబడినదని యొప్పుక తప్పదు. కావున నన్నియవస్థలందును వృత్తియుక్తమగు అంతఃకరణము ప్రత్యక్షమేయగుటవలన, ఆయంతఃకరణగతచిదాభాసుని వివేకముచే దానికంటె వేఱుగ గ్రహింపకపోవుటవలన ఆత్మ సంసారియని ప్రత్యక్షముగఁ దోఁచుచుండును. ౧

అవ. ఇట్లు అంతఃకరణము ప్రత్యక్షమని నిరూపింపఁగా ఆత్మ కేమిలాభము కలిగెననఁగా దృశ్యమగు అంతఃకరణాదిసముదాయముకంటె వీనినిఁ జూచెడి ఆత్మ వేఱగుననెడి యంశమును సదృష్టాంతముగఁ జెప్పుచున్నారు:—

మూ. భిక్షాటన్యథా స్వప్నే దృష్టో దేహో న స స్వయమ్,
జాగ్రద్దృశ్యాత్తథా దేహాద్ద్రష్టృత్వాదన్య ఏవ సః. ౨

తా. నిద్రించున్న యతికి స్వప్నమునందు బిచ్చమెత్తికొనిన దేహ మేదికలదో యాదేహము దృశ్యమేకాని ద్రష్టకాదు. ఆదేహము 'నేను' అనుకొనువాఁడును ఆదేహస్వరూపుఁడుకాఁడు. ఈ ప్రకారముగ జాగ్రదవస్థ యందు దృశ్యమగు దేహమును జూచెడి యాత్మ యాదృశ్యదేహముకంటె వేఱగును. దేహమనఁగా స్థూలదేహముమాత్రమేకాదు; ప్రాణేంద్రియాది సహితమగు సూక్ష్మదేహమును, అజ్ఞానరూప కారణదేహమును నని. కనుక దేహము ఆత్మయగునా కాదా యని విమర్శింపఁగా దేహము దృశ్యమగుటచే స్వప్నదేహమువలె ఆత్మకాదనియెడి అనుమానప్రమాణము నిచట గ్రహింప వలెను. ౨

అవ. సకలావస్థలందు బుద్ధియే అర్థాకారముగఁ జూడఁ బడుననుటకు దృష్టాంతము:—

మూ. మూషాసిక్తం యథా తామ్రం
తన్నిభం జాయతే తథా,
రూపాదీన్వ్యాప్నువచ్చిత్తం
తన్నిభం దృశ్యతే ధ్రువమ్. 3

తా. మూసలో కరిగి గాడిలోఁ బోసిన లోహము గాడియొక్క ఆకారమును బొందును. అట్లే రూపాదులను వ్యాపించు చిత్తము వాని యాకారమునే తాల్చును. 3

అవ. గాడిలోఁ బోసిన లోహమునకు కఠినమగు గాడి జాతియొక్క ఘాతమువలన చలువతగులగనే ఆగాడియొక్క యాకారము కలుగవచ్చును. అమూర్తమగు చిత్తము పదా ర్థములందు వ్యాపించినను, చిత్తము తదాకారముగ నెట్లు

భాసించును? అను శంకను దీర్చుటకు నై వేఱొక దృష్టాంతము:—

మూ. వ్యంజకో వా యథాలోకో
వ్యంగ్యస్యాకారతామియాత్,
సర్వార్థవ్యంజకత్వాద్ధీ
రర్థాకారా ప్రదృశ్యతే. ౪

తా. ప్రకాశింపఁజేయు వహ్న్యాదికము అయఃపిండముయొక్క ఆకారమును బొందినట్లును, సూర్యకాంతి ఘటాద్యాకారమును బొందినట్లును, సకలపదార్థములను బ్రకాశింపఁజేయు బుద్ధి సకలపదార్థాకారమును బొందును. ౪

అవ. స్వప్నమందును స్మృతియందును బుద్ధి ప్రత్యక్షముగ పదార్థాకారముగ భాసించునని అన్వయముఖముగఁ జెప్పిన మాటనే వ్యతిరేకముఖముగ, బుద్ధి లేనియెడల స్వప్నస్మరణములు సంభవింపవని చెప్పుచున్నారు:—

మూ. ధీరేవార్థస్వరూపా హి పుంసాం దృష్టా పురాఽపి చ,
నచేత్స్వప్నే కథంపశ్యేత్ స్మరతో వాఽఽకృతిః కుతః.

తా. స్వప్నమందును స్మృతికాలమందును బాహ్యపదార్థములు లేకయే కలిగెడి పదార్థభానము బుద్ధివిలసితమే యని యందఱు నంగీకరింపవలసినదే కదా! దీనికిఁ బూర్వము అనఁగా జాగ్రదవస్థయందును, పదార్థప్రత్యక్షానుభవకాలమందును బుద్ధియే పదార్థాకారముగ భాసించుచుఁ దెలియఁబడునని సిద్ధాంతము. బుద్ధి పదార్థాకారముగ భాసింపకపోయె నేని స్వప్నమందు పదార్థముల నెట్లు గ్రహించును? తాను పూర్వమందుఁ బ్రత్య

షముగఁ జూచిన యేపదార్థమయిననుఁ గొంతకాలమునకు నెప్పటియాకార ముతో నెట్లు స్మరింపఁబడును? కావున నీస్వప్నమువలనను, ఈస్మరణమువల నను ముందు చెప్పిన మూస, అగ్ని, సూర్యాలోకమననెడి దృష్టాంతమువల నను బుద్ధియే పదార్థాకారముగ మాఱునని బుద్ధిమంతు లంగీకరింపకతీరదు.

అవ. సూర్యాలోకమువలె పదార్థప్రకాశకమగు బుద్ధియే ప్రకాశ్యమగు పదార్థములయొక్క ఆకారముకలది యగు నను మాటను స్పష్టపరుచుచున్నారు:—

మూ. వ్యంజకత్వం తదేవాస్యా రూపాద్యాకారదృశ్యతా,
ద్రష్టృత్వం చ దృశే_స్తద్వద్వ్యాప్తిః స్యాద్ధియ ఉద్భవే.

తా. రూపాద్యాకారముగఁ గనుపించు బుద్ధి పదార్థప్రకాశక మనఁ బడును. ఉదయించిన బుద్ధియందు వ్యాపించియుండు ఆత్మ ద్రష్ట యనఁ బడును.

1 ప్ర. చైతన్యమనఁగా పదార్థవిస్ఫురణము. ధీవృత్తి వ్యాపింపక పదార్థము స్వతంత్రముగ స్ఫురింపనేరదు. కనుక విషయాకారము నొందిన బుద్ధిసహాయము లేకుండ చైతన్యము విషయాకారముగ నెట్లుభాసించును?

ఉ. బుద్ధి పదార్థములను ప్రకాశింపఁజేయుటకై పదార్థాకారముగ మూషాసిక్తలోహమువలె పరిణమించును. కావుననే బుద్ధి పదార్థవ్యంజక యనఁదగును.

2 ప్ర. ఆత్మ ద్రష్ట యెట్లగును?

ఉ. బుద్ధి రూపాద్యాకారముగ భాసించుటచే రూపాదివ్యంజకమగు నట్లు ధర్మాధర్మవశమున సుబుద్ధియు దుర్బుద్ధియు నుదయింపఁగా ఆత్మ ధీరూపముగ వ్యాపించుటవలన ద్రష్ట యనఁబడును.

3. ప్ర. బుద్ధి విషయాకారముగ పరిణమించునట్లు ఆత్మబుద్ధ్యాకారముగ పరిణమించునా?

ఉ. చిదాత్మయందే చిత్ప్రకాశసహితమగు బుద్ధి ఉదయించుచుండుటవలన బుద్ధివలె ఆత్మకు పరిణామములేదు. ౬

అవ. బుద్ధివృత్తులకు సాక్షియగు ఆత్మకు పరిణామము లేనందున ఏకత్వమున్నను ప్రతిదేహమందును ఆయాబుద్ధివృత్తిసాక్షులు వేఱుగనుండుటచేత ఆత్మలకు బ్రహ్మాకారముగ నేకత్వము సంభవింపదను శంక కుత్తరము:—

మూ. చిన్మాత్రజ్యోతిషా సర్వాః
సర్వదేహేషు బుద్ధయః,
మయా యస్మాత్ప్రకాశ్యంతే
సర్వస్యాత్మా తతో హ్యహమ్. ౭

తా. సకలదేహములందుఁ గలిగెడి సకలబుద్ధులను ప్రకాశింపఁజేయుం చిన్మాత్రజ్యోతిస్సునకు భేదములేదు. బుద్ధివృత్తులే ప్రత్యేకము వేఱుగనున్నవి కాని ప్రకాశకుఁడనగుచు ఆత్మనగు నాకు అనేకత్వములేదు. ౭

అవ. సర్వావభాసకమగు చైతన్య మొకటియైనను భాసింపఁదగు బుద్ధ్యాదిదృశ్యవర్గ మనేకమగుటచేత బ్రహ్మము ఒక్కటి కాఁజాలదను శంకరాఁగా, దృశ్యజాతమంతయును అనాద్యనిర్వాచ్యావిద్యావిలసిత బుద్ధిమాత్రమే యగుటచే చైతన్యము అద్వితీయమనుటకు సందేహములేదని చెప్పుచున్నాఁడు:—

మూ. కరణం కర్మ కర్తా చ క్రియా స్వప్నే ఫలం చ ధీః,
జాగ్రత్యేవం యతో దృష్టా ద్రష్టా తస్మాత్తతోఽన్యథా.

తా. స్వప్నమందు ఆంతరమగు మనస్సుకంటె నన్యమగు బాహ్యపదార్థములేవియు లేకపోవుటచే కర్తృకర్మకరణక్రియా ఫలాదులన్నియు మనోమాత్రములే యగును. ఇట్లే జాగ్రదవస్థయందును బుద్ధి స్ఫూర్తిచేతనే యా సకలము భాసించును. సుషుప్తియందు వ్యంజకమగు నాబుద్ధి లేకపోవుటచే నేమియు భాసింపదు. కనుక విషయసహితమగు బుద్ధి ఆత్మయందధ్యస్తమైనదని చెప్పవలెను. ఇట్టి బుద్ధి ఆద్యంతములు గలదగుటచే మిథ్యయగును. ఏతత్సాక్షియగు ఆత్మ బుద్ధికంటె విలక్షణమై చిదానందాఖండైక రసమగును. ౧

అవ. ద్రష్టయగు ఆత్మయొక్క చిదాత్మైకరసత్వమును బ్రకటించుట:—

మూ. బుద్ధ్యాదీనామనాత్మత్వం హేయోపాదేయరూపతః,
హానోపాదానకర్తాఽఽత్మా న త్యాజ్యో న చ గృహ్యతే.

తా. గ్రహించుటకును విడుచుటకును నర్హమగు బుద్ధ్యాదులు వస్త్రాదికమువలె ఆగమాపాయములు గలవగుటచే అనాత్మధర్మము లగును. గ్రహించుచు పరిహరించుచు నుండెడి ఆత్మ యితరముచే గ్రహింపఁబడుటకును విడువఁబడుటకును అర్హము కానిది. ౨

అవ ఆత్మకు స్వయముగ హేయోపాదేయత్వధర్మములు లేకున్నను, ఆత్మీయము లగుటవలన వస్త్రాభరణాది బాహ్యములును, పాపాద్యాంతరములును హేయములు

కావచ్చును. అంతరమగు యోగధ్యానాదులు ఉపాదేయము లగును. కనుక ఆత్మకు విశుద్ధిలేదను శంక కుత్తరము:—

మూ. సబాహ్యాభ్యంతరే శుద్ధే
ప్రజ్ఞానైకరసే ఘనే,
బాహ్యమాభ్యంతరం చాన్య
త్కథం హేయం ప్రకల్ప్యతే.   ౧౦

తా. లోపల వెలుపల తానై నిండి కేవలము ప్రజ్ఞానఘనము ఏకరసము శుద్ధమునగు ఆత్మయందు హేయోపాదేయత్వములు కల్పింపఁదగదని భావము.

1 ప్ర. ఆత్మ ఏకరస మెట్లగును?

ఉ. సైంధవఘనమువలె విజ్ఞానఘనమగు ఆత్మ ఏకరసమేయగును. ఉప్పుగడ్డయందు ఉప్పుదనమేకాక మఱి యేరసమును నుండదు. ఇట్లే విజ్ఞానఘనమగు ఆత్మయందు ప్రజ్ఞానైకరసమేకాని యన్యము జ్ఞేయము నగు హేయోపాదేయత్వాది ధర్మములు ఏవియునుండవు.

2 ప్ర. బాహ్యాభ్యంతరములందు రెండవవస్తువు లేదనుట యెట్లు?

ఉ. ఆత్మలక్షణములగు సత్తాస్ఫూర్తులతోఁ గలియని బాహ్యాభ్యంతర వస్తువు ఏదియు లేకపోవుటచేతను, సత్తాస్ఫూర్తులు ఆత్మధర్మములే యగుట చేతను, రెండవవస్తువు ఏదియు సత్యముకాదు. కావున ఆత్మ విశుద్ధైకరసము అని భావము.   ౧౦

అవ. వస్తుస్వభావము ననుసరించి హేయోపాదేయములు లేవని చెప్పినమాటను విద్వదనుభవముచే దృఢపఱుచుచున్నారు:—

మూ. య ఆత్మా నేతి నేతీతి పరాపోహేన శేషితః,
స చేద్బ్రహ్మవిదాత్మేష్టో యతేతాతఃపరం కథమ్. ౧౧

తా. "నేతి నేతీ"తి వాక్యములవలన ఆత్మేతరవస్తువులను నిషేధింపఁగా నిషేధమునకు అనర్హమై అవధియునగు ఏపూర్ణాత్మ మిగులునో అదియే తానని యెఱిఁగిన జ్ఞానికి తనకంటె నన్యమును ప్రాప్యమునగు ద్వితీయవస్తువు లేదు. ఇందుకు - "ఆత్మానం చేద్విజానీయాదయ మస్మీతి పూరుషః, కిమిచ్ఛన్ కస్య కామాయ శరీరమను సంజ్వరేత్" అను శ్రుతియుం బ్రమాణము. ౧౧

అవ. ఇట్టి ఆత్మతత్త్వము పరానుభవమువలనఁ దెలియఁదగదు గనుక ఆత్మవేత్త తానుగా శాస్త్రాచార్యోపదేశముల ననుసరించి విమర్శనము చేయుచుండవలయు ననిః—

మూ. అశనాయాద్యతిక్రాంతం బ్రహ్మైవాస్మి నిరంతరమ్,
కార్యవాన్స్యాం కథం చాహం విమృశేదేవమంజసా.

తా. 'నేను క్షుత్పిపాసాది షడూర్మిరహితమగు బ్రహ్మమగుదును' అని నిరంతరానుసంధానముచేయుజ్ఞానికి కర్తవ్యశేష మేమియుఁ నుండదు. కనుక నిత్యము నిరంతరముగ నిట్లు విమర్శించుచుండవలెను.

1 ప్ర. షడూర్ములనఁగా నేమి?

ఉ. క్షుత్పిపాసలు, శోకమోహములు, జరామరణములు.

2 ప్ర. ఈ యాఱును వేని ధర్మములు?

ఉ. క్షుత్పిపాసలు ప్రాణధర్మములు. శోకమోహములు మనోధర్మములు. జరామరణములు దేహధర్మములు - ఈ యాఱును ఆత్మధర్మములు కావు. ఇందుకు - "క్షుత్పిపాసే ప్రాణధర్మౌ శోకమోహౌ తు మానసౌ,

జరా మృత్యూ దేహధర్మౌ షడూర్మిరహితః శివః." అనెడి స్మృతి ప్రమాణము. ౧౨

అవ. ఇట్లు నిరంతరము విమర్శించుజ్ఞానికి ప్రాప్తవ్య వస్తువును సంపాదింపవలెననెడి బుద్ధియే కలుగదు. అని సదృష్టాంతముగఁ జెప్పుచున్నారు:—

మూ. పారగస్తు యథా నద్యాస్తత్ స్థః పారం ఇయాసతి,
ఆత్మజ్ఞశ్చేత్తథా కార్యం కర్తుమన్యదిహేచ్ఛతి. ౧౩

తా. నదినిదాఁటి యవతలియొడ్డున నున్నవాఁడు నదీపారమునకుఁ బోఁదలఁచునేని ఆత్మజ్ఞాని మఱియొకకార్యమును జేయఁగోరును. ఈ రెండును లేవని 'చేత్' పదము తెలుపును. ౧౩

అవ. ఆత్మజ్ఞానియుఁ గార్యమును జేయంబూనునేని సమ్యగ్జ్ఞానియే కాఁడని నిందించుట:—

మూ. ఆత్మజ్ఞస్యాపి యస్య స్యా
ద్ధానోపాదానతా యది,
న మోక్షార్హః స విజ్ఞేయో
వాంతోఽసౌ బ్రహ్మణా ధ్రువమ్. ౧౪

తా. ఆత్మజ్ఞానికి ఇది గ్రాహ్యము, ఇది పరిత్యాజ్యము నను భేద ముండునేని బ్రహ్మ బహిర్భూతుఁడగుటచేత మోక్షము దుర్లభమే. ౧౪

అవ. సూర్యోదయము కాకముందు ప్రాతస్సంధ్యను, నక్షత్రములు రాకముందు సాయంసంధ్యను జేయనివారలు

బ్రాహ్మణులగుదురా? అను అర్థముగల "అనాగతాం తు యే పూర్వాం మనస్తాం తు పశ్చిమాం, సంధ్యాం నోపాసతే విప్రాస్తే కథం బ్రాహ్మణాః స్మృతాః." అను స్మృతివలన బ్రహ్మవేత్తమైనను బ్రాహ్మణునకు సంధ్యావందన రూపకార్యము అవశ్యము కర్తవ్యమై యుండునను శంకను కైముతికన్యాయమున పరిహరించుచున్నారు:—

మూ. సాదిత్యం హి జగత్ప్రాణస్తస్మాన్నాహర్నిశైవ వా,
ప్రాణజ్ఞస్యాపి న స్యాతాం కుతో బ్రహ్మవిదోఽద్వయే.

తా. సూర్యసమేతమగు జగత్తంతయు ప్రాణసంజ్ఞగల హిరణ్యగర్భుఁడు. ఈ హిరణ్యగర్భుఁడను నేనని ఉపాసనచేయువానికే రాత్రింబగళ్లు లేకపోఁగా అద్వితీయబ్రహ్మభావము పొందినవానికి రాత్రింబగళ్లు లేవని వేఱుగాఁ జెప్పవలయునా? ఇందుకు-''న హవా అస్మా ఉదేతి ననిమ్లోచతి సకృద్దివా హైవాస్మై భవతి'' అను (ఛాం. 3. ౧౧. ౧) శ్రుతి ప్రమాణము. ౧౫

అవ. బ్రహ్మవేత్తకు బాహ్యవ్యాపారము లేకున్నను "సంధ్యం సమాధావాత్మన్యాచరేత్." అనెడి (ఆరుణికోపనిషత్. ౨) శ్రుతిప్రమాణముచేత ఆత్మయందు ప్రమాదము లేక సమాహితుఁడు కావలసినదను ఆంతరక్రియ కలదు కదా యను శంక కుత్తరము:—

మూ. న స్మరత్యాత్మనో హ్యాత్మా విస్మరేద్వాఽప్యలుప్తచిత్,
మనోఽపి స్మరతీత్యేత జ్ఞానమజ్ఞానహేతుజమ్. ౧౬

తా. సదా ప్రకాశమానచిద్రూపుఁడగు జ్ఞాని ఆత్మను తలవఁడు మఱువఁడు. అశక్యమగుటచే ఆత్మకు స్మృతివిస్మృతులు లేకున్నను, తత్త్వజ్ఞానము

కలిగినతరువాతనుగూడ ఆవిర్భావతిరోభావాది వికారములు తగ్గుటకై మనస్సు ఆత్మను స్మరింపవలెననువిధి కావలయునందువేని, అచేతనమగుటచే మనస్సు ఆత్మను స్మరించుననుజ్ఞానము అజ్ఞానకార్యమే కాని సత్యముకాదు. కనుక పూర్వముచెప్పిన సమాధి మనస్సును వేఱుగాఁజూచే అసమ్యగ్బ్రహ్మవేత్తకుఁ గాని సాక్షాద్బ్రహ్మవేత్తకుఁ గాదని భావము. ౧౬

అవ. అలుప్తచిద్రూపుఁడగు ఆత్మ తనను తలఁపకపోయిననుపరమాత్మను స్మరింపఁదగుననను శంకకు ఉత్తరము:—

మూ. జ్ఞాతుర్జ్ఞేయః పరో హ్యాత్మా సోఽవిద్యాకల్పితః స్మృతః,
అపోఢే విద్యయా తస్మిన్ రజ్జ్వాం సర్ప ఇవాద్వయః.

తా. పరమాత్మ విజ్ఞానాత్మకు జ్ఞేయమగునేని జ్ఞేయములగు ఘటాదికమువలెనే అవిద్యాకల్పితమయి పరమాత్మయే కాఁడని వృద్ధుల మతము. పరత్వము జ్ఞేయత్వము మొదలగు ఆ ధర్మములు విద్యచే బాధింపఁబడఁగా త్రాటియందుఁ గల్పింపఁబడిన సర్పత్వభ్రమ తత్త్వజ్ఞానముచేఁ దొలంగఁగనే రజ్జుమాత్రమగునట్లు ఆత్మ అద్వితీయమేయై శేషించును. ౧౭

అవ. ప్రత్యగాత్మ పరమార్థముగ నొక్కటియేయైనను, మాయావశమున భాసించెడి నేను నాది యనెడి సంసారిత్వనివృత్తికై యేదైనను కర్తవ్యము కలుగుననను శంక కుత్తరము:—

మూ. కర్తృకర్మఫలాభావాత్సబాహ్యాభ్యంతరం హ్యజమ్,
మమాహం వేత్తియో భావస్తస్మిన్కస్య కుతో భవేత్.

తా. కర్తృకర్మఫలభేదము లేనందున ఆత్మను బాహ్యాభ్యంతరముల

యందు సమముగను, జననమరణరహితముగను నెఱింగినవానికి నేను నాది యనెడి యభిమాన మెవనికిఁగలుగును? ఎట్లు కలుగును? ఆత్మజ్ఞానికి అహంకారమమకారములు కలుగవని భావము. కనుక జ్ఞానోత్పత్తికంటె పూర్వమందు సంభవించెడి కర్తృత్వాదికము జ్ఞానముకలిగినతరువాత నుండదని భావము. ౧౪

అవ. ఆత్మవేత్తకు దేహగేహాదికమందు అహంకారమమకారములు కలుగకపోవుటకుఁ గారణము:—

మూ. ఆత్మా హ్యాత్మీయ ఇత్యేష భావోఽవిద్యాప్రకల్పితః,
ఆత్మైకత్వే హ్యసౌ నాస్తి బీజాభావే కుతః ఫలమ్. ౧౫

తా. నేను నాది యను సంసారము అవిద్యాపరికల్పితము. ఆత్మ సకలజగద్బాధావధియై శేషించునని, ఏకమని తెలియఁగా నీయవిద్య తొలఁగిపోవును. బీజము వేఁచఁబడఁగా మొలక మొలవనియట్లు, కారణమగు అవిద్య నశింపఁగా నేను నాది యను సంసారము ఆభాసమాత్రమేకాని ఫలప్రదము కాదని భావము. ౧౫

అవ. ఆయాత్మైకత్వము ఏప్రమాణమువలనఁ దెలియఁదగుననఁగా వేదాంతవాక్యప్రమాణబలముననే (ఆత్మైకత్వము) తెలియఁదగునని చెప్పుచున్నారు:—

మూ. ద్రష్టృ శ్రోతృ తథా మంతృ విజ్ఞాత్రేవ తదక్షరమ్,
ద్రష్ట్రాద్యన్యన్న తద్యస్మాత్తస్మాద్ద్రష్టాఽహమక్షరమ్. *

తా. సకలమును జూచుచు వినుచు తలఁచుచు తెలియుచుండెడి

*పాఠాంతరము:—'ద్రష్టృ నాన్యదత స్తస్మాద్యస్మాద్ద్రష్టాహమక్షరమ్.'

ప్రత్యగాత్మ పరమాత్మయే యగును. అక్షరము నుపక్రమించి "అదృష్టం ద్రష్ట్రశ్రుతం శ్రోత్రమతం మంత్రవిజ్ఞాతం విజ్ఞాతృ" అని (బృహ. ౫. ౮. ౧౧) శ్రుతి చెప్పుచున్నది. ద్రష్టృత్వాదిధర్మములుగల ప్రత్యగ్రూపము ఆ పరమాత్మకంటె నన్యముకాదు. కనుక నేను అక్షరబ్రహ్మమునే. ఇందుకు- "నాన్యదతోఽస్తి ద్రష్టృ నాన్యదతోఽస్తి శ్రోతృ నాన్యదతోఽస్తి విజ్ఞాతృ" అను (బృహ. ౫. ౮. ౧౧) శ్రుతి ప్రమాణము. ౨౦

అవ. ప్రత్యగాత్మ పరబ్రహ్మమైనను అద్వయమెట్లగును. అను శంకరాగా "ఏతస్మిన్ను ఖల్వక్షరే గార్గ్యాకాశ ఓతశ్చ ప్రోతశ్చ" అను (బృహ. ౫. ౮. ౧౧) శ్రుతియొక్క యర్థమును చెప్పుచు అద్వయాత్మత్వమును సాధించుచున్నారు:—

మూ. స్థావరం జంగమం చైవ ద్రష్టృత్వాదిక్రియాయుతమ్,
సర్వమక్షరమేవాతః సర్వస్యాత్మాఽక్షరం త్వహమ్. ౨౧

తా. స్థావరజంగమాత్మకసకలోపాధులును, ఆయుపాధులందున్న ద్రష్టృత్వాదిక్రియాసమేతచైతన్యమును, ఈరెండింటియొక్క కల్పనకాధారమగునదియు సర్వమును అక్షరమే. కావున సర్వమునకు ఆత్మయగు అక్షరము నాకంటె వేఱుకానందున అహంపదలక్ష్యార్థమగు నేను అద్వయబ్రహ్మమగుటకు సంశయములేదు. ౨౧

అవ. స్థావరాదికమంతయు అక్షరమగునేని సప్రపంచమగు అక్షరము ఆత్మయగునా యను కుశంకను నివారించుచు శాస్త్రోక్తమగు ఆత్మజ్ఞానమును స్ఫుటపరుచుచున్నారు:—

మూ. అకార్యశేషమాత్మాన మక్రియాత్మక్రియాఫలమ్,
నిర్మమం నిరహంకారం యః పశ్యతి స పశ్యతి. ౨౨

తా. ఆత్మ కర్త కాఁడు, క్రియాస్వరూపుఁడు కాఁడు. క్రియాఫలము నుగాఁడు. అహంకారమమకారములు లేనివాఁడని యెఱిఁగి అక్షర (నశింపని) స్వరూపుఁడగు తనయందుఁ గల్పింపఁబడిన కర్తృక్రియాఫలాదులు మాయికములగుటచేత ప్రపంచముయొక్క ఉత్పత్తిస్థితిలయములకు సాక్షియగు ఆత్మకు ప్రపంచసంబంధము లేకపోవుటచే తాను అద్వితీయుఁడే యగును. ఇట్లెఱిఁగినవాఁడే జ్ఞాని. ౨౨

అవ. ఆత్మవేత్తకు అహంకారాదికము లేనందున కర్మక్రియాసంబంధము లేదనుమాటను వివరించుచు నతఁడే కృతకృత్యుఁడని:—

మూ. మమాహంకారయత్నేచ్ఛాః శూన్యా ఏవ స్వభావతః,
ఆత్మనీతి యది జ్ఞాత మాధ్వం స్వస్థాః కిమీహితైః. ౨౩

తా. అవిద్యా ప్రయుక్తములగు అహంకార మమకార ప్రయత్నములు వాంఛలును ఆత్మయందు స్వభావముగ లేవని తెలిసితిరేని, ఓ ముముక్షువులారా! మీరు క్షోభపడక సుఖింపుఁడు. వేనినిఁ గోరకుఁడు. ౨౩

ప్ర. కర్మములను ఫలములను ఏల కోరకూడదు?

ఉ. జ్ఞానముచేతనే కృతకృత్యు లగువారలకు కర్మలవలన ఫలమేమియుఁ లేదు. ఏకర్మమం దెవరికి అధికారముకలదో వారు చేసినకర్మమే ఫలవంతమగును గాని అనధికారులు చేసిన కర్మము నిష్ఫలమగును. కావున అవిద్యావినిర్ముక్తుఁడగు జ్ఞానికి కర్మవలన లాభమేమియును లేదు. ౨౩

అవ. ఆత్మ దేహాదికముకంటె వేఱని యెఱిఁగినవానికిని పరలోకప్రాపకకర్మములం దన్నింటను అధికారము కలదు గనుక ఆత్మవేత్తచేయు కర్మము సఫలమే కాని వ్యర్థముకాదు

అనెడి శంకకు నట్టివాఁడు ఆత్మవేత్తయే కాఁడని చెప్పుచున్నారు:—

మూ. యోఽహంకర్తారమాత్మానం తథా వేత్తారమేవ చ,
*వేత్త్యనాత్మజ్ఞ ఏవాసౌ యోఽన్యథాజ్ఞః సఆత్మవిత్.

తా. నేను కర్తను వేత్తను నను అహంకారయుక్తుఁడై యెఱుఁగుదు నను వాఁడు ఆత్మజ్ఞుఁడు కాఁడు. ఎవఁడు నేను కర్తనుకాను, జ్ఞాతను కాను, భోక్తను కాను అని తెలియునో వాఁడే ఆత్మతత్త్వజ్ఞుఁడని భావము. ౨౮

అవ. ఆత్మయే కర్తయు భోక్తయు నని భాసింపుచుండఁగా ఆత్మ కర్తయని యెఱుఁగువాఁడు ఆత్మవేత్తకాఁడని యేల చెప్పఁదగునను శంక రాఁగా కర్తను వేఱుగఁ దెలియనందుననే యీభ్రమ కలిగెనని చెప్పుచున్నారు:—

మూ. యథాఽన్యత్వేఽపి తాదాత్మ్యం దేహాదిష్వాత్మనోమతమ్, తథా కర్తురవిజ్ఞానాత్ఫలకర్త్రాత్మతాఽఽత్మనః. ౨౯

తా. ఆత్మ పరమార్థదశయందు దేహాదులకంటె భిన్నమైనను దేహాదులతో తాదాత్మ్యాధ్యాసమువలన నేను మనుష్యుఁడను బ్రాహ్మణుఁడను అనే యభిమానము అవివేకమువలనఁ గలిగినట్లు అహంకారప్రధానమగు లింగదేహతాదాత్మ్యాధ్యాసమువలన అకర్తయు అభోక్తయు నగు ఆత్మకు కర్తృత్వభోక్తృత్వాదికము భ్రమకల్పితమే యగును.

అవ. 'ఇది నాకుఁ దెలియును' అను వ్యవహారము అహం

---

* వేత్తి నాత్మజ్ఞ.

కాంకమునదే యై యుండఁగా, అహంకారమునకు ఆత్మకును అవివేకమని చెప్పవచ్చునాయను శంక కుత్తరము:—

మూ. దృష్టిః శ్రుతిర్మతిర్జ్ఞాతిః స్వప్నే దృష్టా జనైః సదా,
తాసామాత్మస్వరూపత్వాదతః ప్రత్యక్షతాऽऽత్మనః ౨౬

తా. స్వప్నమందు చక్షుః శ్రోత్రాదులతోఁగూడిన అంతఃకరణ వృత్తులు వేద్యాకారముగ భాసించుచున్నవి. అనఁగా అంతఃకరణమే పదార్థములుగఁ దోఁచుచున్నవి. ఇది యెల్లఱకు స్వప్నమందనుభవమే. కావున వేద్యములగు వీనికంటె వేత్త వేఱని భావము. సుషుప్తియందు అంతఃకరణము తన వృత్తులతోఁగూడ ఆత్మయం దవిద్యామాత్రముగ లయించుటవలనను, ఆత్మ యస్తమింపక తత్సాక్షిగ నుండుటవలనను, అహంకారాత్మకమగు అంతఃకరణముకంటె విలక్షణము, సాక్షి, ఏకమునై యుండును.

ప్ర. ఈ అంతఃకరణమే ఆత్మ కారాదా ?

ఉ. జాగ్రత్స్వప్నములందు సకలవృత్తిసమేతమగు అంతఃకరణము సుషుప్తికాలమున ఆత్మయందు లీనమగుటవలన ఆత్మ కాదు. ఆత్మ సకలావస్థలందును వృత్తిసాక్షిగనుండుటచేత అంతఃకరణముకంటె ఆత్మ వేఱని చెప్పకఁ దప్పదు. కావున స్వయంప్రకాశమును సకలసాక్షియునగు ఆత్మకు నిత్యాపరోక్షబ్రహ్మభావము సిద్ధము. ౨౬

అవ. ప్రత్యగాత్మ సకలబుద్ధివృత్తిసాక్షియగుటచే నతనికి బ్రహ్మాత్త్వము సిద్ధింపఁగాఁ గలిగెడి లాభమును జూపుచు "యోऽన్యథా జ్ఞః స ఆత్మవిత్." ౨౫-వ శ్లోకమందుఁ జెప్పఁబడిన ఆత్మవిత్త్వమును (ఆత్మ నెఱుఁగుట) స్ఫుటపరుచుచున్నారు:—

ఆకాశమువలె నఖండాకారమగు పరమాత్మ యొకటియే. భేదకారణముపాధి కనుక సంశయింప నవసరములేదు. ఇచట-"జీవశ్శివః శివోశివః సజీవః కేవలః శివః, తుషేణ బద్ధో వ్రీహిస్స్యాత్తుషాభావేతు తండులః, ఏవం బద్ధః స్తథా జీవః కర్మనాశే సదాశివః." (౬.౭) అను స్కందోపనిషత్తు ప్రమాణము.౪౪

అవ. దేహద్వయసాక్షియగు ఆత్మ బ్రహ్మస్వభావము గలదియగునేని కొందఱు బ్రహ్మము లేదని యేల తలఁచెదరనఁగా, ఆతలంపునకు వారల దోషమే కారణమని చెప్పుచున్నారు:—

మూ. శరీరబుద్ధ్యోర్యదిచాన్యదృశ్యతా
నిరాత్మవాదాః సునిరాకృతా మయా,
పరశ్చ శుద్ధో హ్యవిశుద్ధకర్మతః
సునిర్మలః సర్వగతో౽సితో౽ద్వయః. ౪౫

తా. ఘటద్రష్ట ఘటముగాక ఘటముకంటె వేఱగుపగిది స్థూలసూక్ష్మదేహద్వయద్రష్ట యాదేహములు గాక వానికంటె వేఱగును. ఈ న్యాయమువలన స్థూలసూక్ష్మదేహములు ఆత్మచేత దృశ్యములుగనుక శూన్యతా క్షణికత్వవాదము నిరాకరింపఁబడినవి. కావున ఆత్మ ధర్మాధర్మరూపదోషకారణమగు కర్మముకంటె నన్యుఁడు, నిర్మలుఁడు, సర్వగతుఁడు, పరిపూర్ణుఁడు, అద్వయుఁడు, బంధరహితుఁడు నగును. ౪౫

అవ. స్థూల సూక్ష్మదేహములు బుద్ధియు ఆత్మచే దృశ్యములగునేని ఆత్మ పరము శుద్ధమును గావచ్చును. ఆ శరీర బుద్ధులు ఆత్మచే దృశ్యములే కావు. అనెడి శంక రాఁగా, నా రెండును ఆత్మచే దృశ్యములు కానియెడలఁ గలుగు బాధను జూపుచున్నారు:—

1 ప్ర. కర్తృత్వాదివికారము ఆత్మకు బంధముకాదా?

మూ. ఘటాదిరూపం యది తే న గృహ్యతే
మనః ప్రవృత్తం బహుధా స్వవృత్తిభిః,
అశుద్ధ్యచిద్రూపవికారదోషతా
మతే ర్యథా వారయితుం న పార్యతే. ౪౮

తా. ఓ పూర్వపక్షీ! నీమతమందు ఘటాదిరూపమగు మనస్సు తన వృత్తులచే బహువిధములుగ పరిణమించుచు అన్యమగు ఆత్మచే గ్రహింపఁబడదుకదా! అప్పుడు మనస్సుకంటె ఆత్మ వేఱుకాదుగనుక మనస్సునకు గలిగెడి అశుద్ధ్యచిద్రూపవికారదోషములు మనస్సునకు నివారింపశక్యముకాక నిత్యధర్మములగునట్లే, అశుద్ధి, అచిద్రూపత్వము మొదలగు దోషవికారములు ఆత్మకును నిత్యములగును. నిత్యములగునేని మోక్షమున కవకాశమే లేక పోవును. ఇటువంటి బాధ కలుగుటవలన జడమగు మనస్సు తనకంటె భిన్నము ప్రకాశకమునగు ఆత్మచేఁ బ్రకాశింపఁజేయఁబడునని యొప్పక తప్పదు.

దీనికి అర్థాంతరము—

(మఱియొక అవతారిక) శరీరద్వయగ్రాహకుఁడగు ఆత్మ ఆశరీరద్వయముకంటె భిన్నుఁడైనను దృశ్యదేహసంసర్గవలనఁ గలిగిన దోషము దుర్నివార్యము. ఏలయనఁగా, దృశ్యమునకు స్వచైతన్యముతో నభేదమును గల్పించికదా తాను ద్రష్టయగును. అభేదములేక దృశ్యము ద్రష్టయు వేఱగుదురేని దృశ్యము ప్రత్యక్షము కాకపోవును. కనుక, ఆత్మ విశుద్ధుఁడు కాఁడను శంక కుత్తరమిదియని గ్రహింపవలెను.

తా. తన వృత్తులతో బహువిధములఁ బ్రవర్తించెడిదగుటచేత ఘటాద్యాకారముగల మనస్సు చేతనముచే గ్రహింపఁబడెనేని చిత్సంబంధమువలన మనస్సునకు చిచ్ఛాయత్వము కలుగునట్లు దృశ్యసంబంధమువలన చేతనమును

ద్రష్టయునగు ఆత్మకు అశుద్ధ్యచిద్రూపత్వాదివికారదోషముసంయుతము అని వార్యమగును. కావున నీదోషనివృత్తికై ఆత్మ దృశ్యమగు మనోబుద్ధ్యాదుల కంటె వేఱై దృశ్యగుణసంబంధరహితమై స్వయంప్రకాశమే యగును. ౪౬

అవ. మతివలె ఆత్మయు సావయవము, పరిచ్ఛిన్నము, పరిణామియు నగునేని మతికివలె ఆత్మకును అశుద్ధ్యాదిదోషములు కలుగును. ఆత్మ సావయవము పరిచ్ఛిన్నము పరిణామియుఁగాదు. కనుక, అశుద్ధ్యాదిదోషవత్తు కాదని సదృష్టాంతముగ నిరూపించుచున్నారు:—

మూ. యథా విశుద్ధం గగనం నిరంతరం
న సజ్జతే నాపి చ లిప్యతే తథా,
సమస్తభూతేషు సదైవ తేష్వయం
సమః సదాఽఽత్మా హ్యజరోఽమరోఽభయః. ౪౭

తా. పరిణామము వికారము మాలిన్యమును లేని ఆకాశము పరిచ్ఛిన్నముకాక నిరవయవమగుటచే, కఱ్ఱను లక్క అంటునట్లుగాని, బట్టను జీడిరస మంటునట్లుగాని, మఱియొకదాని సంపర్కము దానికి అంటదు. ఈ ప్రకారమే విశుద్ధము అపరిచ్ఛిన్నము నిరవయవము నని శాస్త్రసిద్ధమగు ఆత్మ బుద్ధ్యాదుల నంటక తద్దోషరహితమగును. ఏమనఁగా, తత్తదభిమానదేవతా విశిష్టమగు సమస్తభూతములందును ఆత్మ సముఁడును జరామరణభయరహితుఁడునైయుండును. కనుక నిస్సంగుఁడు నిర్లేపుఁడు నని భావము. ఇందుకు— "యః సర్వేషు భూతేషు తిష్ఠన్ సర్వేభ్యో భూతేభ్యోన్తరోయం సర్వాణి భూతాని న విదుర్యస్య సర్వాణి భూతాని శరీరం యః సర్వాణి భూతాన్యంతరో యమయత్యేష త ఆత్మాఽంతర్యామ్యమృతః" అనియు, "సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్, వినశ్యత్స్వవినశ్యంతం యః పశ్యతి

స పశ్యతి.'' (గీత.౧౩-౨౭) అనియు, ''న లిప్యతే లోకదుఃఖేన బాహ్యః.'' (కఠ. ౫-౧౧.) అనియు నీ మొదలగు శ్రుతిస్మృతివాక్యములు ప్రమాణములు. ౪౭

అవ. మఱియు, దృశ్యము బాధితమగును. ఆదృశ్య దోషము లేవియును ఆత్మ నంటవు. దృశ్యము మిథ్య, ఆత్మ సత్యము, కనుక నీ రెండింటికి సంబంధ మెన్నఁడును గలుగదు. బాధ్యమగు జగత్తు మిథ్యయగును. రజ్జుసర్పజ్ఞానమునందు ఆరోపితసర్పము మిథ్యయై అధిష్ఠానరజ్జువు సత్యమగునట్లు అధిష్ఠానాత్మ నిజము. కనుక, ఆరోపితప్రపంచము బాధ్యమగుచు మిథ్యయగునని:—

మూ. అమూర్తమూర్తాని చ కర్మవాసనా
దృశిస్వరూపస్య బహిః ప్రకల్పితాః,
అవిద్యయా హ్యాత్మని మూఢదృష్టిభి
ర్వ్యపోహ్యా నేతీత్యవశేషితో దృశిః. ౪౮

తా. మూఢబుద్ధులచే నవిద్యవలన కర్మవాసనలు, వాయ్వాకాశములనెడి మూర్తిరహిత భూతములు, పృథివీజల తేజస్సులనెడి మూర్తిమద్భూతములును ఆత్మయందే కల్పింపఁబడినవి. కనుక, కల్పితములగు వాసనలను, పంచభూతములను 'నేతి నేతీ'తి యను శ్రుతిచే 'ఇవి కావు, ఇవి కావు' అని నిషేధించినయెడల నిషేధావధియగు జ్ఞానముమాత్రము శేషించును. కనుక, ఆత్మకు దోషసంపర్కము లేదని భావము. ౪౮

అవ. స్థూలసూక్ష్మప్రపంచమునకు ''నేతి నేతీ''తి శ్రుతిచే బాధను జెప్పి, దృశ్యత్వాదియుక్తిచేఁ గూడ బాధను జెప్పుచున్నారు:—

మూ. ప్రబోధరూపం మనసోఽర్థయోగజం
స్మృతౌ చ సుప్తస్య చ దృశ్యతేఽర్థవత్,
తథైవ దేహప్రతిమానతః పృథ
గ్ద్రష్టుః శరీరం చ మనశ్చ దృశ్యతః. ౪౯

తా. జాగ్రదవస్థయందలి వస్తుదర్శనమువలన మనస్సు వస్త్వాకారముగ వ్యాపించి స్మరణదశయందును స్వప్నావస్థయందును ఆవస్తుస్వరూపముగ భాసించుచున్నను, ఆత్మ కానివిధమున, ఆత్మచేఁ జూడఁబడెడి చిత్తశరీరాదులు ఆత్మకంటె నన్యములేకాని ఆత్మకాదు. మఱియు, శుక్తియం దారోపింపఁబడెడి రజతము సత్యజ్ఞానముచే నిషేధింపఁబడి మిథ్యయై శుక్తియే యగునటుల ఆత్మయందుఁ గల్పింపఁబడిన చిత్తదేహాదులు తత్త్వజ్ఞానముచే నిషేధింపఁబడి మిథ్య యగుచు ఆత్మయే యగును. ౪౯

అవ. అధ్యస్త సకలప్రపంచ నిషేధావధిగ ఆత్మను శ్రుతి శేషించిన యెడల నిషేధావధియగు ఆత్మ సంసారనివర్తకమగును. సంసార నివర్తకమగుటచే, నీ నివర్తకత్వము గూడ ఆత్మకొక క్రియయగును. కనుక, క్రియావత్తగు ఆత్మ అనిత్యము కావలెను, అను శంకకుత్తరము:—

మూ. స్వభావశుద్ధే గగనే ఘనాదికే
మలేఽపయాతే సతి చావిశేషతా,
యథా చ తద్వచ్ఛ్రుతివారితద్వయే
సదాఽవిశేషో గగనోపమే దృశౌ. ౫౦

తా. సహజశుద్ధమగు గగనమందు మేఘాదికమలినపదార్థము వచ్చినను పోయినను ఆగగనము సదా ఏకరూపము నిర్వికారముగ నుండునట్లే ద్వైతమును 'నేతి నేతీ'తి యను శ్రుతి వారింపఁగా గగనతుల్యమగు ఆత్మకు ప్రపంచముయొక్క ఉత్పత్తివినాశములవలన భేదవికారములు గలుగవు. కావున, ఆత్మ సదా ఏకరూపముగనే యుండునని భావము. ౫౦

ఇది స్వప్నస్మృతిప్రకరణము.



శ్రీ

# ఉపదేశసాహస్రి

(శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్య ప్రణీతము.)

## శ్లోక ప్రబంధము—పంచదశ ప్రకరణము.



### ౧౫. నాన్యదన్యత్ప్రకరణము.

అవ. ఆత్మస్వభావము శుద్ధమగునేని సాధనము వ్యర్థము కనుక ఆత్మ సంసారిత్వ స్వభావముగలవాఁడై జ్ఞానధ్యానాది సాధనానుష్ఠానముచేత స్వభావశుద్ధ బ్రహ్మాకారము పొందునని కొందఱు తలంతురుగాని, శ్రుతియుక్తులచే బాధ్యమగుటవలన దానిని ముముక్షువు లాదరింపఁదగదు, అని:—

మూ. నాన్యదన్యద్భవేద్యస్మాన్నాన్యత్కించిద్విచిన్తయేత్,
అన్యస్యాన్యాత్మభావే హి నాశస్తస్య ధ్రువో భవేత్.

తా. జీవాత్మ పరమాత్మకంటె నన్యుఁడగునేని యెన్నఁటికిని తాను అన్యపరమాత్మభావమును బొందలేఁడు, కనుక జీవబ్రహ్మములను వేఱుగా భావింపఁగూడదు. ఒకానొక రసవిశేషసంబంధమువలన అన్యమగు తామ్రము

అన్యమగు సువర్ణమగునందువేని యీ అన్యత్వము ఆరససంబంధము క్షీణించ
గనే నశించునుగాని నియతము కానేరదు. ౧

అవ. ఇట్లేని అన్యము ధ్యానార్హము కాదు. తనను
దాను ధ్యానించుట సంభవింపదు. కర్మకర్తృభావ మొకని
యందే పొసఁగదు కనుక నిదిధ్యాసన మెట్లు కలుగుననఁగా
నిచట నుపాయాంతరము ఉండుటవలన జీవాత్మ పరమాత్మ
లకు భేద మంగీకరింప నవసరము లేదని:—

మూ. స్మరతో దృశ్యతే దృష్టం పటే చిత్రమివార్పితమ్,
యత్ర యేన చ తౌ జ్ఞేయౌ సత్త్వక్షేత్రజ్ఞసంజ్ఞకౌ.

తా. చూడఁబడిన వస్తువును స్మరించునపుడు ఏచిత్తమందు పట
మందు చిత్రమువలె నుంచఁబడినదో యది సత్త్వమనియు, ఆ రెండు
వస్తువులును ఎవనిచేఁ దెలియఁబడునో యతఁడు క్షేత్రజ్ఞుఁడనియుఁ జెప్పఁ
బడును కనుక, "ఆత్మా నిదిధ్యాసితవ్యః," అను శ్రుతిచే నిరంతరము ఆత్మాను
సంధానపరుఁడై త్వంపదార్థ మెద్దియో యని విమర్శింపవలెను.

ఇట్లు అంతఃకరణముకంటె వేఱుగ గ్రహింపఁబడిన త్వమర్థమే బ్రహ్మ
మగుటవలన, "అహం బ్రహ్మాస్మి" యని అపరోక్షానుభవమును, దీనిచేతనే
దుఃఖభూయిష్ఠసంసారనివృత్తిరూపఫలమును గల్గును.

సర్వజ్ఞుఁడగు ఈశ్వరునికంటె నల్పజ్ఞుఁడగు జీవుఁడు వేఱనియే
తలఁచునెడల చిత్తరువు పటముకానియట్లుగ జీవునకు బ్రహ్మత్వము దుర్ఘట
మగుచు సంసారము తొలఁగదు కనుక "ఆత్మానిదిధ్యాసితవ్యః" యనెడి
విధియుఁ నిష్ఫలమే యగును.

అంతఃకరణమందు ప్రతిబింబించిన జీవుఁడు బ్రహ్మమే "బింబేన చ
వినా ప్రతిబింబస్యాసంభవః" యని శ్రీరాముఁడు నుడివెను. అంతఃకరణము

జీవోపాధియనియు, అంతఃకరణాభావము బ్రహ్మోపాధి యనియు, "ఉపాధ్యపాహే స్వయమేవ కేవలః" అనుటచేత, ఉపాధులను నిషేధింపఁగా ఆ యుపాధిద్వయమునందున్న చైతన్య మొక్కటియేకనుక, ఆత్మాంతఃకరణములను వేఱుగ గ్రహించుటవలన "ఆత్మానిదిధ్యాసితవ్యః" అనువిధి వ్యర్థము కానేరదు.

1 ప్ర. "అహంబ్రహ్మాస్మి" అని తానే బ్రహ్మమను శ్రుతి జీవాత్మ పరమాత్మలకు అభేదమునే చెప్పుచుండఁగా, ఏకవస్తువునకు విమర్శ యెట్లు సంభవించును?

ఉ. జీవాత్మపరమాత్మలకు ఐక్యము శ్రుతిసిద్ధము కనుక, శ్రుతియందలి త్వంపదమునకు అర్థమెద్ది? వాచ్యార్థమా? లక్ష్యార్థమా? వాచ్యార్థము జీవుఁడుగనుక, నీవాచ్యార్థమగు జీవునకు తత్పదవాచ్యుఁడును, సర్వజ్ఞుఁడుసర్వశక్తిమంతుఁడునగు పరమేశ్వరునితో విరుద్ధధర్మము గలుగుటవలన ఐక్యము సంభవింపదు.కనుక నిచట లక్ష్యార్థమునే గ్రహింపవలయును. లక్ష్యార్థము గ్రహింపఁగా విరుద్ధధర్మములు నిరసింపఁబడుటవలన జీవేశ్వరులకు ఐక్యము నిర్బాధకముగ స్ఫురించును. ఈయర్థము వివేకచూడామణియందు శ్లో. ౨౪౪-౨౪౭ లలో నిట్లు వర్ణింపఁబడెను:—

"ఐక్యం తయోర్లక్షితయోర్న వాచ్యయోర్నిగద్యతేఽన్యోన్యవిరుద్ధ ధర్మిణోః, ఖద్యోతభాన్వోరివ రాజభృత్యయోః కూపాంబురాశ్యోః పరమాణుమేర్వోః. ౨౪౪. తయోర్విరోధోఽయముపాధికల్పితో న వాస్తవః కశ్చిదుపాధిరేషః, ఈశస్య మాయా మహదాదికారణం జీవస్య కార్యం శృణు పంచకోశాః. ౨౪౫. ఏతావుపాధీ పరజీవయోస్తయోః సమ్యఙ్నిరాసే న పరో న జీవః, రాజ్యం నరేంద్రస్య భటస్య ఖేటకస్తయోరపోహే న భటో న రాజా. ౨౪౬. అథాత ఆదేశ ఇతి శ్రుతిః స్వయం

నిషేధతి బ్రహ్మణి కల్పితం ద్వయమ్, శ్రుతిప్రమాణానుగృహీతయుక్త్యా తయోర్నిరాసః కరణీయ ఏవమ్. ౹౪౭.''

2 ప్ర. ఈయర్థవివేచనమువలన ఫలమేమి?

ఉ. సంసారదుఃఖనివృత్తియే మహాఫలము.

3 ప్ర. జీవుఁడు వేఱు, పరమాత్మవేఱుయని సకలజనవిదితముకదా, ఈయర్థము నమ్మఁదగదా? ఈభేదబుద్ధి పరిత్యజింపవలెనా?

ఉ. దీని కుత్తరము ఈప్రకరణమందే ౧-వ శ్లోకమున లెస్సగ విమర్శింపఁబడెను. అన్యము అన్యభావము నెప్పటికినిఁ బొందనేరదు. పొందెనేని తామ్రసువర్ణదృష్టాంతముచేత ఆయన్యభావము స్థిరముకాదు.

4 ప్ర. అన్యమునకు అన్యభావము లేదేని భ్రమరముకంటె వేఱగు కీటకమునకు భ్రమరభావము దుస్సంపాదనీయము గనుక లోక ప్రసిద్ధమగు భ్రమరకీట న్యాయము కల్ల కావలెను.

ఉ. ఓ పూర్వవాదీ! కీటకము అన్యమగు భ్రమరమగునా?

ఓ సిద్ధాంతీ! కీటకము భ్రమరమగునని ఆబాలగోపాలవిదితమై ప్రసిద్ధమే కదా.

సిద్ధాంతి—అయ్యా! ఇట్లగుటకు నిమిత్తమేమి?

పూర్వవాది—కీటకము భయముతో నిరంతరము భ్రమరమునే ధ్యానించుటయే నిమిత్తము.

సిద్ధాంతి—ఈ యర్థమందు సంశయ మేమైన కలదా?

పూర్వవాది—ఈ యర్థమందు సంశయ మణుమాత్రమైనను లేదు. కావుననే ఈ భ్రమరకీటన్యాయము సర్వవిదితము, సకలజన సమ్మాన్యము, సుప్రసిద్ధమునై యున్నది.

సిద్ధాంతి—అట్లేని యీ న్యాయము నెప్పుడును మఱువక విమర్శింపుము.

5 ప్ర. ఈ విమర్శ మెటులఁ జేయవలెను ?

ఉ. లోకములో అన్యవస్తువునకు నిరంతరధ్యానమువలన అన్యభావము కలిగెను. దీనినేకదా భ్రమరకీట న్యాయమని యార్యులు ఆదరించుచున్నారు. "అప్యస త్ప్రాప్యతే ధ్యానా న్నిత్యాప్తం బ్రహ్మ కిం పునః" అనెడి యార్యవచనముంబట్టి నిత్య నిరంతరధ్యానము అన్యవస్తువునకు అన్యవస్తు ధర్మప్రదానమందు దృఢశక్తికలదియై నిర్బాధముగ భాసింపుచుండఁగా కిరాతకులసంవర్ధితరాజకుమార న్యాయమున తాను బ్రహ్మమైనను మహామాయామోహితుఁడై భ్రమవలన జీవుండనని తలంచినను పరమేశ్వర స్వరూప సద్గురుప్రసాదదత్త సుజ్ఞాననయన సంపన్నుఁడు నిత్యనిరంతర ధ్యానమున బ్రహ్మమగుటకు అర్థాపత్తిన్యాయమున సంశయ మిసుమంతయైన నుండునా?

6 ప్ర. కిరాతకుల సంవర్ధిత రాజకుమార న్యాయ మెట్టిది ?

ఉ. ఒకరాజు శత్రువులచే జయింపఁబడెను. ఆరాజు భార్య గర్భిణియై అడవికిం బాఱిపోయి కుమారునిఁగని చనిపోఁగా కిరాతులాబాలుని పెంచిరి. కొంతకాలమున కీసంగతి నెఱిఁగిన పండితులు, పూర్వము జయించిన పరరాజు నశింపఁగా, కిరాతులయొద్దకేగి, యానవాళ్లుచెప్పి, ఆబాలునిఁ గొనిపోయి రాజుగ నియమించిరి. ఆబాలుఁడు రాజకుమారుఁడైనను తాను కిరాతునిగానే మొదట భావించెను. కాని, విమర్శవలన కాలత్రయమందు నిర్బాధకముగ నతఁడు రాజే కదా. ఈన్యాయమున జీవుఁడనని భ్రమియు చైతన్యము సద్గురు ప్రసాదమున బ్రహ్మమే యగును.

7 ప్ర. అన్యము అన్యము కాదని పూర్వము చెప్పితిరికదా, జీవుఁడు బ్రహ్మ మెట్లగును ?

ఉ. పూర్వోక్తము మఱువకుము. అన్యమగు కీటకమే నిరంతరధ్యానమున భ్రమరము కాఁగా తాను బ్రహ్మమై యుండియు భ్రాంతిచే జీవుఁడనువాఁడు బ్రహ్మమెందుకు కానేరఁడు? ప్రతిబింబము బింబముకంటె నన్యము కాదు కదా.

8 ప్ర. అర్థాపత్తియన నేమి? అది యిచట నెట్లుపయోగింపఁబడెను?

ఉ. కఠినమైన వెదురుకఱ్ఱను కొఱికినయెలుక మెత్తని బూరెను తినుట యేమివింత? అనునది అర్థాపత్తి. ప్రకృతార్థమందు భ్రమరముకాని పురుగు భ్రమరము కాఁగా, బ్రహ్మమేయగు జీవుఁడు భ్రాంతి తొలఁగఁగా బ్రహ్మమగుటకు సంశయము లేదని చెప్పుటయే అర్థాపత్తి.

అవ. అంతఃకరణము ప్రత్యక్షము కానందున స్మృత్యవస్థయందు ఆయంతఃకరణమున నీలపీతాదు లెట్లు స్ఫురించును, అను శంక కుత్తరము:—

మూ. ఫలాంతం చానుభూతం యద్యుతం కర్త్రాదికారకైః,
స్మర్యమాణం హి కర్మస్థం పూర్వంకర్త్రైవ తచ్ఛ్రితః. 3

తా. సుఖదుఃఖాదిఫలావసానమగు కర్త్రాదికము కారకములతో మొదట అనుభవింపఁబడి యిపుడు స్మరింపఁబడుచు దృశ్యమగు నంతఃకరణనిష్ఠమే యగును, కాని యీ కర్త్రాదికము ద్రష్టృచైతన్యనిష్ఠముకాదు. ఈ కర్త్రాదికమెక్కడ స్మరింపఁబడుచున్నదో ఆ యంతఃకరణము చైతన్యముచేతనే తెలియఁబడును.

1 ప్ర. స్మృతియన నేమి?

ఉ. పూర్వానుభూతవిషయాకారమును, అంతఃకరణపరిణామరూపము నగు వృత్తి స్మృతియనఁబడును. ఆ స్మృతియందు అనుభూతవిషయము

ఆశ్రయసహితముగ భాసించును. అప్పుడు సాక్షి అనుభవించెడి విషయము నకు అంతఃకరణముకంటె బాహ్యాశ్రయము లేదు. కావున దీనిని స్మరించు చున్నాను అను పరామర్శసిద్ధికై అనుభవము దృశ్యవిషయముకావలెను. అట్టి అంతఃకరణము సాక్షిమాత్రవేద్యము. 3

అవ. ఆత్మయే ద్రష్ట దృశ్యము నని భాట్టమతము వారలు, ఆత్మతనయందున్న వాసనారూపపదార్థమును అనుభ వించునుగనుక, అంతఃకరణము సాక్షిగోచరము కాదని చెప్పె దరు. ఆ మతమిపుడు నిరాకరింపఁబడుచున్నది:—

మూ. ద్రష్టుశ్చాన్యద్భవేద్దృశ్యం దృశ్యత్వాద్ఘటవత్సదా,
దృశ్యా ద్రష్టా సజాతీయో న ధీవత్సాక్షితాఽన్యథా.

తా. భాట్టులు ద్రష్టృదృశ్యములకు భేదము లేదందురు. అది సరి కాదు. ఘటమును జూచువాఁడు దానికంటె భిన్నుఁడేకాని ఘటము కాఁజా లఁడు. ఇట్లు ద్రష్టృదృశ్యములు వేఱైనను పరిణామమగుటచేత రెండును సజాతీయములందువేమో, అదియు సరిపడదు. దృశ్యాంశము జడముకనుక, అచేతనమగు దృశ్యమును చైతన్యాత్మ యనఁదగదు. ఆత్మయుఁ దృశ్యమగు నేని ధీవలె జడమగు ఆత్మకు దృశ్యసాక్షిత్వము ఘటింపకపోవును. ౪

అవ. ఆత్మ సాక్షియే యగును, ఆయాత్మ బ్రాహ్మణాది జాతులు గలదియగుటచే నవిశేషమైకర్మాధికారిగఁ బరిణమింప వచ్చును, అను శంకకుత్తరము:—

మూ. స్వాత్మబుద్ధి మపేక్ష్యాసౌ విధీనాం స్యాత్ప్రయోజకః,
జాత్యాదిశ్శవవత్తేన తద్వాన్నాత్మతాఽన్యథా.

తా. ఈ బ్రాహ్మణాదిజాతియు, వయోఽవస్థాదికమును తమయందు ఆత్మీయాభిమానరూపమగు భ్రమను గల్పించి విధులను నడిపించును. శవము 'నామాత' మొదలగు నభిమానముచేత గర్మము చేయించునట్లుగ, జాత్యాదికము అభిమానమువలన గలుగుటచేత దేహధర్మమగు శవము ఆత్మ కానట్లు దేహధర్మమగు జాత్యాదికము ఆత్మధర్మము కాదు. ఆత్మకు జాత్యాదికముండెనేని ఘటాదికమువలె అది దృశ్యమై యుండును. అపుడు ఆత్మకు ఆత్మత్వము లేకపోవును. కావున, సర్వకర్మసాక్షియగు ఆత్మ జాతివిహితకర్మాధికారి కానేరఁడు. ౫

అవ. మోక్షమునిమిత్తము విద్వాంసుఁడును గర్మము చేయవలసియుండుటచేత, కర్తృత్వమునకు నిమిత్తము అధ్యాసము కాదనెదవేని, అట్లు కాదని చెప్పుచున్నారు:—

మూ. న ప్రియాప్రియ ఇత్యుక్తేర్నా దేహిత్వం క్రియాఫలమ్,
దేహయోగః క్రియాహేతు స్తస్మా ద్విద్వాన్ క్రియా స్త్యజేత్. ౬

తా. "అశరీరం వావ సన్తం న ప్రియాప్రియే స్పృశతః" అను (ఛాం. ౮-౧౨-౧) శ్రుతిబలమున మోక్షము క్రియాజన్యము కాదు. క్రియవలన దేహముకలుగుచుండును, పుణ్యపాప రూపక్రియవలనఁ గలుగు సుఖదుఃఖములు దేహమునకేకాని ఆత్మకు లేవు. మోక్షము క్రియాసాధ్యము కాదు. కావున విద్వాంసుఁడు క్రియలను వదిలి మోక్షహేతువగు జ్ఞానమందు ఆసక్తుఁడు కావలెను. ౬

అవ. కర్మములన్నియు ఆత్మచేఁ గర్తవ్యములై యుండఁగా విద్వాంసుఁడు కర్మములను మానశక్యముకాదని చెప్పఁదగదని:—

మూ. కర్మస్వాత్మా స్వతంత్రశ్చే*న్నివృత్తౌ చ తథేష్యతామ్,
అదేహత్వే ఫలేఽకాఙ్క్షా జ్ఞాతే కుర్యాత్కథం క్రియాః

తా. కర్మములను జేయుటకు ఆత్మ స్వతంత్రకర్తయగునేని కర్మ మానుటయందును గర్త కావచ్చును. కర్మములచే సాధింపఁదగిన ఫలమం దభిలాష లేకపోవుటచేత కర్మత్యాగము అర్థసిద్ధమే యగును. కనుక అనురాగముకలవాఁడు కర్మముచేయుటనుగూర్చి కర్తయగునట్లు వైరాగ్యము గలవాఁడును కర్మముమానుటనుగూర్చి కర్త కాఁగలఁడు. దేహసంబంధరహితమగు మోక్షఫలము కర్మముచేత సాధింపఁదగినదికాదని గురుశాస్త్రోపదేశమున నిరూఢముగఁ దెలియఁగా కర్మముల నెట్లుచేయును? నిష్ప్రయోజనములగు కర్మములను జేయంబూనఁడనిభావము. ౭

అవ. కర్మములను జేయక మానినమాత్రాన కర్మసాధ్యముకాని విదేహకైవల్యము పొంద్బడునా యను శంక కుత్తరము:—

మూ. జాత్యాదీన్ సంపరిత్యజ్య నిమిత్తం కర్మణాం బుధః,
కర్మహేతువిరుద్ధం యత్స్వరూపం శాస్త్రతః స్మరేత్.

తా. బుద్ధిమంతుఁడు కర్మహేతువులగు జాత్యాశ్రమాదులను లక్ష్యపెట్టక కర్మహేతుత్వమును బాధించెడి శుద్ధాత్మస్వరూపమును శాస్త్రాచార్యప్రసాదమువలన సర్వదా ధ్యానింపవలెను.

1 ప్ర. కర్మమునకు హేతువెద్ది?

ఉ. దేహము తాననుకొనెడి అభిమానమే కర్మహేతువు.

---

* నివృత్తం చ తథేష్యతామ్.

2. ప్ర. అహంకారము లేదేని ఫలమేమి?

ఉ. అహంకారమనెడి దేహాభిమానము భగవత్ప్రసాదమువలనఁ దొలఁగెనేని మోక్షసాధనమగు విద్య ఉదయించును. ఇందుకు - "దేహాభిమానా దభివర్ధతే క్రియా విద్యా గతాహంకృతితః ప్రసిద్ధ్యతి," అను శ్రీరామగీతావచనము ప్రమాణము. ౭

అవ. శాస్త్రవాక్యము నుదాహరించుచు స్మరింపఁదగిన ఆత్మస్వరూపమును విశదపరుచుచున్నారు:—

మూ. ఆత్మైకస్సర్వభూతేషు తాని తస్మింశ్చ ఖే యథా,
పర్యగాదోవ్యోమవత్సర్వం శుక్రం దీప్తిమదిష్యతే. ౮

తా. సకలప్రాణులందును చైతన్యరూపమగు ఆత్మ యొక్కటియే. ఆభూతములు ఆత్మయందే అవిద్యచేఁ గల్పింపఁబడినవి. లోపల రంధ్రాకారముగను వెలుపల అవకాశరూపముగను నుండెడి ఆకాశమందు భూతములుండునట్లు సకలభూతములకు లోపల వెలుపలను ఆత్మచైతన్యము నిండియుండును. సకలభూతములును ఆత్మయందు మాయచేఁ గల్పితములగుటచే ఆత్మకంటె వేఱుకావు. కనుక ఆత్మయం దారోపింపఁబడిన నామరూపవికారములను ఉపేక్షించి సకలవికారములందు ననుసరించియుండు సత్తాస్ఫూర్తిరూపములే ఆత్మయని భావింపవలెను. తేజోరూపమగు ఆత్మ ఆకాశమువలె జగత్తంతటను లోపలను వెలుపలను నిండియున్నది. శుక్రమనఁగా తేజస్సు, ఆత్మ ప్రకాశస్వభావము శుద్ధము నని భావము.

ప్ర. సకలభూతములు ఆత్మయందును, ఆత్మ అంతటను నుండునని తెలియుటచే లాభమేమి?

ఉ. ఈజ్ఞానమువలన ద్వేషాదిదోషముల కవకాశముండదు. ఇందుకు- "యస్తు సర్వాణి భూతాన్యాత్మన్యేవానుపశ్యతి, సర్వభూతేషు చాత్మానం

తతో న విజుగుప్సతే" అను స్మృతి ప్రమాణము. "సపర్యగాచ్ఛుక్రం"అను శ్రుతి సర్వమును వ్యాపించిన తేజస్సు, అని బోధించుచున్నది.

అవ. "అవ్రణమస్నావిరమ్" అనెడి పదముయొక్క అర్థమును నిరూపించుచున్నారు:—

మూ. వ్రణస్నాయ్వోరభావేన స్థూలం దేహం నివారయేత్,
శుద్ధాపాపతయాఽలేపం లింగం చాకాయ మిత్యుత.

తా. "అకాయమవ్రణం" ఈ మొదలగు శ్రుతిచేత నరుకులు నరములు లేవని నిషేధింపఁబడుటవలన స్థూలదేహము ఆత్మ కాదని చెప్పఁబడెను. "శుద్ధమపాపవిద్ధం" అను మంత్రముచేత పుణ్యపాపములయొక్క సంబంధము లేక శుద్ధమని చెప్పుటవలన ఆత్మ లింగదేహము కాదనియు నివారింపఁబడెను. ఆత్మ స్థూలసూక్ష్మదేహములకంటెను, తత్కార్యవాసనలకంటెను వేఱని, సముఁడని, అపరిచ్ఛిన్నుఁడనియు సదాధ్యానింపవలెను. ౧౦

అవ. ఇట్లు ఆత్మస్వరూపము నెఱిఁగినవాఁడు బ్రహ్మవేత్తలలో నుత్తముఁడని:—

మూ. వాసుదేవో యథాఽశ్వత్థే
స్వదేహే చాబ్రవీత్సమమ్,
తద్వ ద్వేత్తి య ఆత్మానం
సమం స బ్రహ్మవిత్తమః. ౧౧

తా. శ్రీకృష్ణభగవానుఁడు గీతాశాస్త్రమందు- "అశ్వత్థః సర్వవృక్షాణామ్," అనియు, "వృష్ణీనాం వాసుదేవోఽస్మి," అనియు నికృష్టమగు అశ్వత్థవృక్షమందును, విజ్ఞానైశ్వర్యశక్తిమంతమగుటచే ఉత్కృష్టమగు స్వదేహమందును, నికృష్టోత్కృష్టోపాధులను గణనసేయక చైతన్యమాత్ర

మును ఆత్మనుగఁ జెప్పినట్లు, ఎవఁడు విషమములగు నుపాధుల నన్నింటిని గడవఁ ద్రోసి సర్వత్ర సమమగు శుద్ధచైతన్యము నే చింతించుచుండునో అతఁడు బ్రహ్మవిత్తముఁడు. ౧౧

అవ ఉపాధులందు అహంకార మమకారములు లేని వాసుదేవునకు అంతట సమమగు ఆత్మదర్శనము తగునుగాని ముముక్షువునకు ఉపాధులందు భేదబుద్ధియుండుటచే సమదర్శన మెట్లు, అను శంక కుత్తరము:—

మూ: యథా హ్యన్యశరీరేషు మమాహంతా న చేష్యతే,
అస్మింశ్చాపి తథా దేహే ధీసాక్షిత్వావిశేషతః. ౧౨

తా. దృశ్యములగు నితర శరీరములందు అహంకార మమకారములు కలుగని విధమున తానను కొనెడి దేహమందును దేహాకారముగఁ బరిణమించిన యే బుద్ధికలదో యాబుద్ధికి సాక్షియగుటవలన ఆత్మతత్త్వమును విమర్శించునపుడు సోపాధియగు దేహమందును అహంకార మమకారములు తగవని భావము. ౧౨

అవ. ముముక్షువునకును రాగద్వేషభయములు కలుగుచున్నందున అభిమానము లేకపోలేదని యందువేని అట్లు కాదని చెప్పుచున్నారు:—

మూ. రూపసంస్కారతుల్యా ధీ
రాగద్వేషౌ భయం చ యత్,
గృహ్యతే ధీశ్రయం తస్మాత్
జ్ఞాతా శుద్ధో ఽభయ స్సదా. ౧౩

తా. లోకములో రూపాదికమును జూడఁగా అటువంటి రూపాదిక వృత్తి బుద్ధియం దుదయించును. ఇదియే సంస్కారమనఁబడును. రాగద్వేష ములు భయమును నిట్లే బుద్ధియందే కలుగుటవలన, ఈబుద్ధ్యాదికమునకంతకు సాక్షియగు ఆత్మ రాగద్వేషరహితుఁడు నిర్భయుఁడు నని భావము.

1 ప్ర. సంస్కార మన నేమి ?

ఉ. రూపాద్యాకారముగ మాఱిన అంతఃకరణము తిరిగి కాలాంతర మున రూపాద్యాకారముగ మాఱుటకు శక్తి కలదియగును. దీనికే సంస్కా రమని పేరు.

2 ప్ర. రాగద్వేషములు భయము మొదలగునవి బుద్ధిధర్మములేకాని ఆత్మధర్మములు కావనుటకుఁ బ్రమాణమేమి ?

ఉ. "కామ స్సంకల్పో విచికిత్సా శ్రద్ధా ఽశ్రద్ధా ధృతిరధృతిః హ్రీ ర్ధీ ర్భీ రిత్యేత త్సర్వం మన ఏవ" అను (బృహ. 3.౫.3) శ్రుతిప్రమా ణము. మఱియు, బుద్ధికలిగియున్న జాగ్రత్స్వప్నములందే రాగద్వేషసుఖ దుఃఖాదులు అనుభవింపఁబడుచున్నవికాని బుద్ధి విలీనమైయుండు సుషుప్తి యందు రాగాదులు కలుగనందున నివి ఆత్మధర్మములు కావనియు, ధీధర్మము లగు ననియుఁ నిశ్చయము. ఈ యర్థము "రాగేచ్ఛా సుఖదుఃఖాది బుద్ధౌ సత్యాం ప్రవర్తతే, సుషుప్తౌ నాస్తి తన్నాశాత్ తస్మా ద్బుద్ధే స్తు నాత్మ నః" అని ఆత్మబోధప్రకరణమున వర్ణింపఁబడెను. ౧3

అవ. ఆత్మ సదా శుద్ధుఁడే,అయినను "యథా క్రతురస్మిం ల్లోకే పురుషో భవతి తథేతః ప్రేత్య భవతి" అను(ఛాం.3.౧౪.౧) శ్రుతి వలనను, "యం యం వాఽపి స్మర న్భావం త్యజత్యన్తే కలేబరమ్, తంతమేవైతి కౌంతేయ సదా తద్భావభావితః." అను స్మృతివలనను, తత్త్వజ్ఞానము కలుగకముందు దేహాధ్యా

సముచేత అశుద్ధుఁడగువాఁడు గురూపదేశానంతరము బ్రహ్మ భావనచేత పవిత్రుఁడై బ్రహ్మము కాఁగలఁడు. కనుక మోక్షము భావనారూపక్రియా సాధ్యమగును. క్రియాసాధ్యమగుట వలన, ఈమోక్షము సయితము అనిత్యమేయగును. అను శంక కుత్తరము:—

మూ. యస్మనా స్తన్మయోఽన్యత్వేనాత్మతాప్తౌ క్రియాత్మని,
ఆత్మత్వే చానపేక్షత్వాత్సాపేక్షం హి న తత్స్వయమ్.

తా. పురుషుఁడు ఏదేవతను నిరంతరము ధ్యానించునో ఆ దేవతా స్వరూపుఁడగునట్లు ధ్యాత ధ్యేయస్వరూపుఁడు కాఁడేని ఆత్మస్వరూపావ స్థానప్రాప్తికై ఆత్మయందు నేక్రియయుఁ గలుగదు. ధ్యాత ధ్యేయస్వరూ పాత్మయగునేని ఏక్రియయు నపేక్షింపఁబడదు. ఏమనఁగా క్రియాసాధ్య మగునది అనాత్మయేకాని ఆత్మకానేరదు. లోకములో ధ్యాత తనకంటె నన్యమగుదానినే ధ్యానించును. ధ్యేయవస్తువు అన్యమగునపుడే ధ్యానక్రియ కావలయును. కాని, యిట ఆత్మతత్త్వప్రాప్తికై ధ్యానాదిరూపమగు క్రియ యేదియును ఆత్మయందు సంభవింపదు. ఏలయనఁగా, మోక్షము సహజమగు బ్రహ్మాత్మభావము. దీనినిమిత్తము చతుర్విధములగు క్రియలలో నేదియు నపేక్షింపఁబడదు. క్రియవలనఁ గలిగినదెల్లను ఘటమువలె అనాత్మయుఁ ననిత్యము నగును. ఇట బ్రహ్మాత్మభావరూపమగు మోక్షము క్రియాసాధ్యము కానందున అనిత్యమని శంకింపఁదగదు.

1 ప్ర. ఏక్రియయు కలుగదు అన్నందున, క్రియ యెన్నివిధములు? అవి యెవ్వి?

ఉ. ఉత్పాద్యము, ప్రాప్యము, సంస్కార్యము, వికార్యము-అని క్రియలు నాలుగు విధములు.

2 ప్ర. ఆత్మయందు క్రియ యేల లేదు?

ఉ. క్రియచే సాధ్యమగునదెల్ల జడమగు అనాత్మయే యగును.

3 ప్ర. ఆక్రియలు నాలుగు ఎట్టివి?

ఉ. 1. ఉత్పాద్యమనఁగ పుట్టింపఁదగు ఘటాదికము.

2. ప్రాప్యమనఁగా పొందఁదగు గ్రామాదికము.

3. సంస్కార్యమనఁగా మంత్రములచే శుద్ధిచేయఁదగు పురోడాశాదికము.

4. వికార్యమనఁగా అవస్థాంతరమును బొందెడి క్షీరాదికము. క్షీరము పెరుగుగ మారుటయని అర్థము.

4 ప్ర. ఆత్మకు ఈనాలుగు క్రియలును లేవా?

ఉ. నిత్యమగు ఆత్మ ఉత్పాద్యము కాదు. సర్వవ్యాపియగు ఆత్మ ప్రాప్యమును గాదు. నిత్యశుద్ధమగు ఆత్మ సంస్కార్యమును గాదు. నిర్వికారమగు ఆత్మ వికార్యమును గాదు.

5 ప్ర. ఆత్మ క్రియాసాధ్యమగునేని ఏమిహాని?

ఉ. క్రియాసాధ్యమగునది అనిత్యమై అనాత్మయే యగును.

6 ప్ర. ఆత్మ అశుద్ధమగునా?

ఉ. అశుద్ధమగు మిథ్యాధ్యాసమేకాని ఆత్మ నిత్యశుద్ధమే. ౧౩

అవ. భేదాదిమలము లేనందునను, చిదేకరసమగుట వలనను, ఆత్మ సదా శుద్ధుఁడనియే యొప్పవలెననిః—

మూ. ఖమివైకరసా జ్ఞప్తి రవిభక్తా ఽజరాఽమలా,
చక్షురాద్యుపధానాత్సా విపరీతా విభావ్యతే. ౧౪

తా. చైతన్యము గగనమువలె అఖండైకరసము, అజరామరము, అమలమునునై యుండును. ఐనను చక్షురాద్యుపాధిదోషమువలన నట్లు కనుపింపక విపరీతముగఁ దోఁచును. ౧౫

అవ. ఆత్మ నిర్మలుఁడని స్ఫుటపరుచుచున్నారు:—

మూ. దృశ్యత్వా దహమిత్యేషో ఽనాత్మధర్మో ఘటాదివత్,
తథాఽన్యే ప్రత్యయాజ్ఞేయా దోషా శ్చాత్మాఽమలో హ్యతః. ౧౬

తా. దృశ్యమగుటవలన అహమ్మను ప్రత్యయము (అహంకారము) ఘటాదికమువలె అనాత్మధర్మమగును. ఇట్లు ఇతర ప్రత్యయములు, దోషజనకములగు రాగద్వేషాదులును అనాత్మధర్మములే కనుక ఆత్మ నిర్మలుఁడే.

అవ. అహంకారాదికము ఆత్మధర్మము కాకున్నను, పరిచ్ఛిన్నము వికారవత్తునగు ఆత్మ నిర్మలుఁడు కానేరఁడు, అనుశంక కుత్తరము:—

మూ. సర్వప్రత్యయసాక్షిత్వా దవికారీ చ సర్వగః,
విక్రియేత యది ద్రష్టా బుద్ధ్యాదీవాల్పవి ద్భవేత్. ౧౭

తా. ఆత్మ పరిచ్ఛిన్నుఁడును వికారియునగునేని బుద్ధ్యాదికమువలె నల్పజ్ఞుఁడును, ఆభాసుఁడును నగును. జడమగు బుద్ధికి వేదనము సంభవింపదు. కావున సర్వప్రత్యయసాక్షియగుటచే ఆత్మ సర్వగుఁడును నవికారియు నగును. చిదాభాససహితబుద్ధికే వికారములుగాని బుద్ధిసాక్షియగు ఆత్మకు వికారములులేవు. జడమగు కేవలబుద్ధికి వేదనము సంభవింపదు. ఆత్మకుఁ

కూడ వికారముండునేని విమర్శము లేమిచే వ్యవహారము కలుగక పో వచ్చును. ౧౭

అవ. సాధనజన్యమగు జ్ఞానమునకు ఉత్పత్తివినాశము లుండుటచే బుద్ధివలె ఆత్మయు నల్పజ్ఞుఁడే కావలయునను శంకకుత్తరము:—

మూ. న దృష్టి ర్లుప్యతే ద్రష్టు శ్చక్షురాదే ర్యథైవ తత్,
న హి ద్రష్టు రితి హ్యుక్తం తస్మా ద్ద్రష్టా సదైవ దృక్.

తా. పరిణామముగల చక్షురాదికమునకు లోపము కలుగును గాని పరిణామములేని ద్రష్టకు లోపమెన్నఁడును లేదు. ఈయర్థము "నహి ద్రష్టుర్దృష్టేర్విపరిలోపో విద్యతేఽవినాశిత్వాత్" అను (బృహ. ౬-3-౨3) శ్రుతిచే నిరూపింపఁబడెను. కనుక శ్రుతిప్రమాణమువలన ద్రష్ట సదా ఏకరూపదృక్స్వభావుఁడు. "సదైకభుక్" అను పాఠమున సదా సర్వసాక్షియని యర్థము. ౧౮

అవ. ఆత్మ యిట్లు శుద్ధస్వభావుఁడైనను ఉపాధిసంబంధమువలన అశుద్ధుఁడుగఁ దోఁచుటవలన ప్రత్యగాత్మను పరమాత్మనుగ భావించుటకై ముముక్షువు పదార్థవివేచనమును జేయవలయునని చెప్పుచున్నారు:—

మూ. సంఘాతో వాఽస్మి భూతానాం
కరణానాం తథైవ చ,
వ్యస్తం వాఽన్యతమో వాఽస్మి
కో వాఽస్మీతి విచారయేత్. ౧౯

తా. అహమ్మని భావించెడి ఆత్మ మనుష్యుఁడను, చిక్కినవాఁడను, బలిసినవాఁడను యీమొదలగు వ్యవహారమునుబట్టి పంచభూతసముదాయాత్మకదేహరూపమై స్ఫురించును. కనుక, ఆత్మ పంచభూతసముదాయమా? లేక పృథివ్యాదులలో నేదైన నొకటియా? ఆవిధముననే భాసించెడి ఆత్మ చూచువాఁడను, వినువాఁడను, తినువాఁడను, గ్రుడ్డివాఁడను, చెవిటివాఁడను అనే వ్యవహారమునుబట్టి ఇంద్రియసముదాయమా? లేక ఏకైకశ్రోత్రాదీంద్రియమా? లేక ఒక్క దేహమందే యనేకాత్మలుండెనా? ఒకప్పుడు వీరికి పరస్పరము సమ్మతిలేక కలహము కలుగును గనుక భోగవ్యవస్థ లేకపోవుట చేత ఇంద్రియములకంటె నన్యమగు తదధిష్ఠానమా? అట్లైని ఆత్మ అంతఃకరణప్రాణాదులలో నేదైన యగునా? వానికి సాక్షియగునా? అని యిట్లు విమర్శింపవలయును.

ప్ర. ఎట్లు విమర్శింపవలయును?

ఉ. నేను దేహమా? అవయవములనా? ఇంద్రియములనా? ప్రాణములనా? అందులో శ్రోత్రేంద్రియమునా? వాగింద్రియమునా? వీని యన్నింటికంటె నన్యుఁడనా? అని విమర్శింపవలెను. ౧౯

అవ. విచారఫలమగు పదార్థవివేకమును జూపుచున్నారు:—

మూ. యస్త్వం నాహం సమస్తంవా
భూత మింద్రియ మేవవా,
జ్ఞేయత్వాత్కరణత్వాచ్చ
జ్ఞాతాఽన్యోఽస్మాద్ఘటాదివత్. ౨౦

తా. ద్రష్టనగు నేను ఘటాదిపదార్థమువలె దృశ్యము జడమునగు భూతసముదాయముకాని, ప్రత్యేకభూతముకాని కాను. కత్తికలమువలె సాధనము జడమునగుటచే శ్రోత్రవాగాదీంద్రియజాతముకాని, ప్రత్యేకమగు నింద్రియముకాని కాను. ఈ దృశ్యదర్శనములకంటె నన్యమై చేతనమగు దృక్కే నేనగుదును. ఇట్లు అన్వయ వ్యతిరేకములచే దృగ్దృశ్యదర్శనములను విమర్శింపవలెను.

1 ప్ర. అన్వయ వ్యతిరేకము లన నేమి?

ఉ. అన్వయ మనఁగా (వేదాంతశాస్త్రమందు) అనువృత్తి = అంతటను నిండియుండుట. వ్యతిరేక మనఁగా వ్యావృత్తి = ఒకదానినుండి వేఱొకటి తొలఁగియుండుట.

2 ప్ర. ఇది యెట్లుగ నుండునో వివరింపుఁడు.

ఉ. హారమందు మణులు సూత్రమున నుండుచుగద. ఈ సూత్రము హారములోని యన్నిమణులయందు నిండి యుండుటవలన అనువృత్తము = కలిసియుండునదే. ఒకమణినుండి మఱియొకమణి తొలఁగి యుండుటవలన మణులు వ్యావృత్తము.

3 ప్ర. దృక్కు దృశ్యము నను నవి యేవి?

ఉ. దృక్కు ఆత్మ, దృశ్యము జగత్తు.

4 ప్ర. వీనిలో నేది అనువృత్తము. ఏది వ్యావృత్తము?

ఉ. ఆత్మ సకలవస్తువులందును నిండియుండుటవలన అనువృత్తము. జగత్తులో నొకవస్తువునుండి వేఱొకటి తొలఁగియుండుటవలన జగత్తు వ్యావృత్త మనఁబడును.

5 ప్ర. జగత్తు వ్యావృత్త మెట్లగును?

ఉ. సకలపదార్థములు సకలావస్థలును జగత్తనఁబడును. సత్తనెడి ఆత్మ అన్నిటియందు నిండియుండునుగాని, యొకపదార్థము మఱియొక

దానియందు స్థిరముగ నుండదు. ఇంతయేకాక జాగ్రత్స్వప్నాద్యవస్థలందును బాల్యయౌవనాద్యవస్థలయందును ఆత్మ ఏకాకారముగ నుండునుగాని యీ జాగ్రదవస్థస్వప్నావస్థలో లేదు. జాగ్రత్స్వప్నములు సుషుప్త్యవస్థలో లేవు. ఇట్లు బాల్యము యౌవనమందు లేదు. యౌవనము వార్ధికమందు లేదు. ఇట్లు ఒకదానియందు వేఱొకటి లేకపోవుట వ్యావర్తము (వ్యతిరేకము). ఆత్మ అన్నియవస్థలందును అన్నివస్తువులందును గూడియుండుట అనువృత్తము (అన్వయము) ౨౦

అవ. ఇపుడు సాక్షియగు ఆత్మ అన్నింటను నిండి యుండుననియు, తెలియఁబడు దృశ్యము మఱియొకదాని యందు ఉండదనియు, నిట్లే జాగ్రదాద్యవస్థలు తమకాలము ననేకాని మఱియొక అవస్థలో లేకున్నను, ఆత్మమాత్రము ఈ మూడింటికి సాక్షియై అంతటను నిండియుండునని యీ తురీయావస్థాప్రాప్తిని యీశ్లోకము మొదలుకొని ౨౮-వ శ్లోకము వఱకు వివరించుచున్నారు:—

మూ. ఆత్మాగ్నే రింధనాబుద్ధి రవిద్యాకామకర్మభిః,
దీపితా ప్రజ్వలత్యేషా ద్వారైశ్శ్రోత్రాదిభి స్సదా.౨౧

తా. ఆత్మయనెడి యగ్నిని ప్రస్ఫురింపఁజేయుటకు ఉపాధియగు బుద్ధి అవిద్య, సంకల్ప, కర్మములచే వృద్ధిపఱుపఁబడి శ్రోత్రాదిద్వారముల గుండా ప్రకాశించుచుండును.

1 ప్ర. చేతనమగు ఆత్మను జడమగు బుద్ధి యెట్లు స్ఫురింపఁజేయును?

ఉ. అగ్నివలె ఆత్మ స్వప్రకాశకమేకాని అన్యపదార్థముచేఁ ప్రకాశింపఁబడఁదగినదికాదు. అయినను, కట్టెలు వేయుటవలన స్వతః

ప్రకాశకమగు అగ్ని అధికకాంతిఁగలిగి చీఁకటిని పోఁగొట్టునట్లు ఆత్మ బుద్ధి సంయోగమువలన అజ్ఞానమును బోఁగొట్టి అధికతరముగ భాసించును. చైతన్యగ్రస్తమగు బుద్ధియే ప్రకాశించును గనుక నీశంక కవకాశము లేదు.

2 ప్ర. ఆత్మను అగ్నియని, బుద్ధిని గట్టెలనియుం నేల నిరూపింపఁబడెను?

ఉ. దీనివలన వ్యవహారదశయందు విషయగ్రహణము హోమమని తెలిసి దానియందు సంగమును వదలవలెనని తెలియవలెను. ౨౧

అవ. ఇట్టి బుద్ధి జాగ్రదవస్థయనియు, నిచట ఆత్మ స్థూల పదార్థభోగియనియుఁ జెప్పుచున్నారు:—

మూ. దక్షిణాక్షిప్రధానేషు యదా బుద్ధిర్విచేష్టతే,
విషయైర్హవిషా దీప్తో హ్యాత్మాగ్నిః స్థూలభుక్తదా. ౨౨

తా. కుడికన్ను మొదలగు నింద్రియములందు బుద్ధి వ్యవహరించుచు విషయములనెడి హవిస్సుచేత దీపించునపుడు ఆత్మాగ్ని స్థూలవిషయముల ననుభవించును. ఇదియే జాగ్రదవస్థ యనఁబడును.

1 ప్ర. కుడికన్నని యేలచెప్పవలెను?

ఉ. పురుషులకు దక్షిణాంగము శ్రేష్ఠమగుటచే నిట్లు చెప్పఁబడెను.

2 ప్ర. ఇది జాగ్రదవస్థ యగుటెట్లు?

ఉ. ఇంద్రియములచే వస్తుగ్రహణము జాగ్రత్తనఁబడును. స్వప్నమందు వస్తుభోగము మానసికమే కాని వాస్తవము కాదు. ౨౨

అవ. రూపకాలంకారముగ ఆత్మను అగ్నియనియు, బుద్ధిని ఇంధనములనియు, విషయములను హవిస్సనియుఁ జెప్పుటకు ఫలమును నిరూపించుచున్నారు:—

మూ. హూయన్తే తు హవీంషీతిరూపాదిగ్రహణే స్మరన్,
అరాగద్వేష ఆత్మాగ్నౌ జాగ్రద్దోషై ర్న లిప్యతే. ౧౩

తా. రూపరసాదిపదార్థములను గ్రహించునపుడు 'ఇది మంచిది, ఇది చెడ్డది' యను అధ్యాసముచేత రాగద్వేషములను జెందక ఆత్మయనెడి అగ్ని యందు రూపాదివిషయములనెడి హవ్యములు హోమముచేయఁబడుచున్నవి యని తలఁచువాఁడు పుణ్యాపుణ్యరూపములగు జాగ్రద్దోషముల నంటక వెలుఁగును.

ప్ర. జాగ్రదవస్థయందుఁ జేయఁబడు సుకృతదుష్కృతములవలన పుణ్యపాపములు కలుగకపోవునా ?

ఉ. రాగద్వేషములు లేకుండ భోగములనుభవించుచు, అగ్నియందు హవ్యమును వ్రేల్చునట్లు ఆత్మాగ్నియందు విషయములను హోమము చేయుచున్నానని భావించువానికి పుణ్యపాపరూపమగు విషయదోషములు అంటవు.

అవ. ఇపుడు స్వప్నావస్థను జెప్పుచున్నారు:—

మూ. మానసే తు గృహే వ్యక్తసోఽవిద్యాకర్మవాసనామ్,
పశ్యం స్తైజస ఆత్మోక్తః స్వయంజ్యోతిః ప్రకాశితా.

తా. ఉపాధియగు మనస్సనే గృహమందు ఆయాత్మ అవిద్యాప్రయుక్తములగు కర్మవాసనలను జూచుచు, బాహ్యములగు సూర్యాదితేజస్సుల నపేక్షింపక పదార్థములను బ్రకాశింపఁజేయుచు స్వయంజ్యోతి యగును. ఇందుకు—"దృష్ట్వైవ పుణ్యం చ పాపంచ" అను (బృహ. ౪. 3) శ్రుతియు, "అత్రాయం పురుషః స్వయం జ్యోతిర్భవతి" అను (బృహ. ౪. 3) శ్రుతియుం బ్రమాణములు. ౧౪

అవ. సుషుప్తినిఁ జెప్పుచున్నారు:—

మూ. విషయా వాసనా వాఽపిచోద్యన్తే నైవ కర్మభిః,
యదా బుద్ధౌ తదా జ్ఞేయః ప్రాజ్ఞ ఆత్మాహ్యనన్యదృక్.

తా. ఎపుడు బుద్ధియందు స్థూలదేహ సంబంధ విషయములు స్వప్న వాసనలును గర్మములచే ఉద్బుద్ధములుకావో అపుడు ఆత్మకంటె నితరమును జూడని పూర్ణుఁడగు ఆత్మప్రాజ్ఞుఁడు అనఁబడును. ౨౫

అవ. ఇట్లు అవస్థాత్రయమును దృశ్యమనియు, ఆయవస్థాసాక్షియగు ఆత్మను ద్రష్టయనియు వేఱుపఱచి, యిపుడు అవస్థాత్రయసాక్షియు విశ్వతైజసప్రాజ్ఞులు ముగ్గురకంటె భిన్నుఁడగుటచేత తురీయమును నిత్యవిజ్ఞప్తిస్వభావమును నగు ప్రత్యగాత్మను గూర్చి బోధించుచున్నారు:—

మూ. మనోబుద్ధీంద్రియాణాం యా అవస్థాః కర్మచోదితాః,
చైతన్యేనైవ భాస్యంతే రవిణేవ ఘటాదయః. ౨౬

తా. కర్మచోదితములై ప్రవర్తించెడి మనోఽవస్థయగు స్వప్నమును, బుద్ధ్యవస్థయగు సుషుప్తిని, ఇంద్రియావస్థయగు జాగ్రత్తును, ఘటపటాదులను సూర్యుఁడువలె, చైతన్యమే భాసింపఁజేయును. ౨౬

అవ. ఆత్మ వికారరహితుఁడై సకలావస్థలకు సాక్షియగునేని బుద్ధ్యాదులకుఁ గర్త యెట్లగు నను శంకకు సమాధానము:—

మూ. తత్రైవం సతి బుద్ధేర్జ్ఞ ఆత్మభాసాఽవభాసయన్,
కర్తా తాసాం యదర్థాస్తా మూఢై రేవాభిధీయతే. ౨౭

తా. ఆత్మయందు జాగ్రదాద్యవస్థ లిట్లు ఆరోపింపఁబడఁగా స్వచైతన్యముచేత అవస్థాయుక్తబుద్ధులను భాసింపఁజేయుచున్న ఆత్మ యాయవస్థలకుఁ గర్తయని మూఢులు వ్యవహరింతురు. ఆత్మయొక్క సుఖదుఃఖాది ప్రతిభాసకములగు నాబుద్ధులను ప్రకాశింపఁజేయుటచే ఆత్మయే కర్తయని తలంతురు.

ప్ర. కర్తకాని ఆత్మను కర్తయనుట యెట్లు?

ఉ. చిదాభాసునితో ఆత్మకు అవిమర్శనమువలనఁ గలిగిన అభేదముచేత విజ్ఞానమయుఁనివియగు కర్తృత్వాదిధర్మములు ఆత్మయందు ఆరోపింపఁబడుచున్నవి. ౨౭

అవ. ఇట్లు అజ్ఞాన తత్కార్యములందు ప్రతిబింబితుఁడగు చిదాభాసుఁడు జ్ఞాతయనియు, కర్తయనియు నిరూపించి, మాయోపాధియందు ప్రతిబింబితుఁడగు చిదాత్మయే సర్వజ్ఞుఁడు సర్వకర్తయని నిరూపించుచున్నారు:—

మూ. సర్వజ్ఞో ఽప్యత ఏవ స్యా
త్స్వేన భాసాఽవభాసయన్,
సర్వం సర్వక్రియాహేతోః
స్సర్వకృత్త్వం తథాఽఽత్మనః. ౨౮

తా. స్వభాసచేత జడమగు పదార్థజాతమునెల్ల భాసింపఁజేయుటంబట్టి ఆత్మ సర్వజ్ఞుఁడనఁబడును. కాని, తనకంటె నన్యమగు సర్వమును దెలిసికొనుట యను వ్యాపారము వలనఁగాదు. అట్లైన "ఏకమేవాద్వితీయం, నిర్గుణో నిష్క్రియః" ఈమొదలగు శ్రుతులకు బాధకలుగును. మఱియేమన స్వసన్నిధిసత్తామాత్రాన జడపదార్థములన్నియు స్వస్వవ్యాపారకరణసమర్థములగుటచేతనే ఆత్మ సర్వకర్తయనియు వ్యవహరింపఁబడును.

1 ప్ర. తాను సర్వము నెఱుంగుదనని చెప్పుచు తనకంటె నన్యమును దెలియుటవలన సర్వజ్ఞుఁడు కాఁడని యెట్లు చెప్పఁదగును?

ఉ. స్వాత్మాశ్రయమాయావివర్తమగుటవలన జగత్తు పరమార్థదశ యందు తనకంటె నన్యముకాదు.

2 ప్ర. దీని కుదాహరణమేమి?

ఉ. రజ్జువునందు ఆరోపితమగు సర్పము రజ్జువుకంటె నన్యసత్తకల దికాదు. అనఁగా పాము అనుకొనునపుడు ఒకపామే. భ్రమవదిలి అధిష్ఠాన రజ్జుజ్ఞానము కలిగినపుడు ఒక్కత్రాడే కాని కల్పితమగు సర్పములేదు. కావున రెండవవస్తువులేక రజ్జువు ఒక్కటే యయ్యెను. ఇటు ఒక్క ఆత్మ వస్తువునందు ఆత్మాశ్రిత మాయాశక్తివిలాసకల్పితజగత్తు భాసించునపుడు జగత్తుమాత్రమే తోఁచును. సద్గురూపదేశమున ఆరోపితము మిథ్యయను జ్ఞానము దృఢముకాఁగా, కటకకంకణాదివికారజాతమంతయు కనకముగనే తోఁచునట్లు ఆత్మేతరవస్తువు మిథ్య యని తెలియుటవలన ఆత్మవస్తు వొక్కటియే స్ఫురించును.

3 ప్ర. లోకములో నొకవ్యాపారమును జేయువాఁడు ఆవ్యాపార మునకుఁ గర్తయనఁబడునుగదా, ఇచట నిష్క్రియుఁడగు ఆత్మ సర్వకర్త యని యెట్లు చెప్పఁబడెను?

ఉ. ఆత్మకు సర్వకర్తృత్వముకూడ మాయావశమునఁ గలిగినదే కాని, వాస్తవముకాదు. అనఁగా, స్వసన్నిధానమాత్రమున మాయచేఁ జేయఁబడు వ్యాపారమునకు ఆత్మ కర్తయని మూఢులు వ్యవహరింతురు. ఈ యర్థమును "తస్య సన్నిధిమాత్రేణ సృజామీదమతంద్రితా, తత్సాన్నిధ్యా న్మయా సృష్టం తస్మి న్నారోప్యతేఽబుధైః." అని అధ్యాత్మ రామాయణమున హనుమంతునకు సీత బోధించెను.

4 ప్ర. సన్నిధిమాత్రాన జడవస్తువు ఎట్లు వ్యాపారక్షమమగును?

ఉ. సూదంటురాయి దగ్గర నుండఁగా ఇనుము కదలునుగదా. ఇట్లు జడపదార్థము ఆత్మసన్నిధానమున స్వస్వవ్యాపారములను జేయుటవలన ఆత్మ కర్తయనఁబడెనేకాని ఆత్మకుకర్తృత్వములేదు. ౨౦

అవ. ఇట్లు అవస్థాత్రయసాక్షి యగుటచేత వేఱుగ గ్రహింపఁబడిన శుద్ధచిద్రూపుఁడగు ఆత్మ కార్యకారణోపాధులంబట్టి కర్త, జ్ఞాత, సర్వజ్ఞుఁడు నను వ్యవహారమున కాస్పదుఁడనియు, ఆత్మ కీస్వభావము లేదనియుఁ జెప్పఁగా, ఆత్మ స్వభావము ఎట్టిదియను శంకకు సమాధానము:—

మూ. సోపాధి శ్చైవ మాత్మోక్తో నిరుపాఖ్యో ఽనుపాధికః,
నిష్కలో నిర్గుణ శ్శుద్ధ స్తం మనోవాక్చ నాప్నుతః.

తా. రూపరహితమగు ఆత్మ యిది యని తెలియ శక్యముకానందున అనుపాధికము (ఉపాధిరహితము), సర్వవ్యవహారాతీతము అని భావము. కార్యకారణవ్యవహారమునుబట్టి సోపాధికముగ వర్ణింపఁబడెను. ఆయాత్మ మనోవాగతీతము, నిరుపాఖ్యము, నిరవయవము, నిర్గుణమును అగుటచే, శుద్ధము కూటస్థము నని వ్యవహరింపఁబడును. ౨౧

అవ. ఆత్మ మనోవాక్కులకు అతీతమనుటను సాధించుచున్నారు:—

మూ. చేతనో ఽచేతనో వాఽపికర్తా ఽకర్తాగతో ఽగతః,
బద్ధో ముక్త స్తథా చైకో ఽనేక శ్శుద్ధో ఽన్యథేతి వా.

తా. 'అహ మను శబ్దము, అహ మను జ్ఞానము' అను ఈ రెండును బాహ్యార్థములనుండి మఱలుటచేత ప్రత్యగాత్మను బోధించుననుట అందఱ

షను సమ్మతమే. ఆ అహంశబ్ద ప్రత్యయములు ఘటపటాదులనువలె శుద్ధాత్మను ప్రత్యక్షముగ గోచరింపఁజేయునేని యెవరికిని వివాదమే లేకపోవును. నిరాకారమగు ఆత్మ అనుపాధికమై విషయము కాకపోవుటచేత నిట్లు భిన్నాభిప్రాయములతోఁ గలహించుచున్నారు. వేదవాదులు చేతనమని, వేదబాహ్యులు దేహేంద్రియ ప్రాణములలో నొకటియగు అచేతనమని, వేదవాదులలో మఱికొందఱు కర్తయని, కొందఱు అకర్తయని, కొందఱు సర్వగతుఁడని, కొందఱు దేహపరిమాణుఁడని, కొందఱు జీవుఁడని, కొందఱు ఈశ్వరుఁడని, కొందఱు అన్నిదేహములందును ఆత్మ ఒకటియేయని, కొందఱు రాగాదిగుణరహితుఁడని, కొందఱు ఆత్మరాగద్వేషాదులుఁగలిగి ఫలభేదము నిచ్చుచుండుననియు నిట్లు పరస్పరము కలహించుచున్నారు.

అవ. వివాదము అనాత్మనుమాత్రమే యాశ్రయించినదగుటచే శుద్ధాత్మయందు శబ్దప్రత్యయములు వాదసమర్థములు కావని చెప్పుచున్నారు:—

మూ. అప్రాప్యైవ నివర్తంతే వాచో ధీభిస్సహైవ తు,
　　నిర్గుణత్వా త్క్రియాభావా ద్విశేషాణా మభావతః.

తా. వాక్కులు బుద్ధితోఁగూడ ఆత్మను జేరలేక మఱలునని "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" అను (తై. ఉ. ౨. ౯) శ్రుతి చెప్పుచున్నది. వాగ్బుద్ధులు ఆత్మను జేరలేకపోవుటకుఁ గారణమేమనఁగా, ఆత్మయందు రూపాదిగుణము లేవియు లేవు. ఏక్రియయుం లేదు. గోవులు ధనము మొదలగు విశేషములును లేవు. కనుక ఆత్మ మనోవాగ్బుద్ధులకు గోచరముకాదు. "న చక్షుషా గృహ్యతే నాపి వాచా నాన్యైర్దేవైస్తపసా కర్మణా వా" అను (ముండ. 3. ౧. ౮) శ్రుతియు నిచట ప్రమాణము. దేవమనఁగ ఇంద్రియము.

అవ. విషయముకాని ఆత్మను వేదాంతములు ఎట్లు చెప్పఁగలవనఁగా, లక్షణావృత్తిచే బోధించునని చెప్పుచున్నారు:—

మూ. వ్యాపకం సర్వతో వ్యోమ
మూర్తై స్సర్వై ర్వియోజితమ్,
యథా తద్వ దిహాఽఽత్మానం
వింద్యా చ్ఛుద్ధం పరం పదమ్. 32

తా. ఆకాశము సకలమూర్తద్రవ్యములయొక్క సంపర్కము లేకయేయుండునట్లు, పరమాత్మ అసంగము పరిచ్ఛేదరహితము అవస్థాత్రయసాక్షి, శుద్ధము, సకలశబ్దలక్ష్యమునని తెలియవలెను. 32

అవ. ఇట్లు ఆత్మతత్త్వమును నిశ్చయించిన తరువాత అవస్థాత్రయమందు తాదాత్మ్యాభిమానము చేయరాదని చెప్పుచున్నారు:—

మూ. దృష్టం హిత్వా స్మృతం తస్మి న్సర్వగ్ర శ్చ తమ స్త్యజేత్,
సర్వదృ గ్జ్యోతిషా యుక్తో దినకృ చ్ఛార్వరం యథా.

తా. జాగరపదార్థములను, తద్వాసనావాసితములగు స్వప్నపదార్థములను, ఆ యవస్థాభిమానమును వదిలి, యివి మనోవికారములనియు ఆత్మ నిర్వికారమనియు అనుసంధానము చేయుచుండవలెను. సుషుప్తిని సర్వగ్రాసిగఁ జూడవలెను. స్వయంజ్యోతిః స్వరూపుఁడగు ఆత్మ, సూర్యుఁడు రాత్రియందలి చీఁకటినిఁ బోఁగొట్టునట్లు, అవస్థాత్రయవికారకారణమగు అజ్ఞానమును బ్రహ్మతేజస్సుచే నిరసించి అద్వయానందస్వభావుఁడై విలసిల్లును. 33

అవ. ఎట్లనఁగా:—

మూ. రూపస్మృత్యన్ధకారార్థాః ప్రత్యయా యస్య గోచరాః,
స ఏవాత్మా సమో ద్రష్టా సర్వభూతేషు సర్వగః. ౩౪

తా. ఆకారమును, స్మృతిని, అంధకారమును దెలియునట్టి వృత్తి జ్ఞానమునకు సాక్షియగు ఆత్మ సముఁడు, సర్వద్రష్ట, సకలభూతవాసి, సర్వ వ్యాపకుఁడును అగును. ౩౪

అవ. ఆత్మ అసంగుఁడు ద్రష్ట చిత్స్వరూపుఁడు నగు నేని, ఆయాత్మయందు విచిత్రసంసారజ్ఞాన మెటుల సంభవించును, అను శంక కుత్తరము:—

మూ. ఆత్మబుద్ధి మనశ్చక్షు ర్విషయా లోకసంగమాత్,
విచిత్రో జాయతే బుద్ధేః ప్రత్యయో ఽజ్ఞానలక్షణః.

తా. ఆత్మ బుద్ధితోను, నేత్రములతోను, విషయములతోను సంబంధించుటవలన అజ్ఞానజన్యమగు విచిత్రసంసారము గలుగుచుండును. ౩౫

అవ. ఆత్మను అవిద్యాతత్కార్యోపాధులతో వేఱుగ గ్రహింపమిచే సంసారప్రతిభాసము కలుగునని యుండఁగా ముముక్షువు చేయఁదగినకృత్య మెద్దియన, దాని నిపుడు ఉపదేశింపుచున్నారు:—

మూ. వివిచ్యాస్మాత్స్వ మాత్మానం విన్ద్యాచ్ఛుద్ధంపరంపదమ్,
ద్రష్టారం సర్వభూతస్థం సమం సర్వభయాతిగమ్. ౩౬

తా: శుద్ధము, సర్వోత్తమము, సర్వభూతాంతర్యామి, సర్వభయ

నివర్తకము, సర్వసాక్షియు నగు ఆత్మను, బుద్ధ్యాదిదేహపర్యంతమగు జడసముదాయమునుండి వేఱుగ వివేచనచేసి గ్రహింపవలెను. 36

అవ తెలియఁదగిన ఆత్మస్వరూపమును తిరిగి వర్ణించుచున్నారు:—

మూ. సమస్తం సర్వగం శాంతం
విమలం వ్యోమవత్ స్థితమ్,
నిష్కలం నిష్క్రియం సర్వం
నిత్యం ద్వంద్వై ర్వివర్జితమ్. 37

తా. ఆయాత్మ అపరిచ్ఛిన్నము, సర్వవ్యాపి, నిర్వికారము, నిర్మలము, ఆకాశతుల్యము, నిరవయవము, నిష్క్రియము, అబాధ్యము, ద్వంద్వరహితము, సర్వకల్పనాధిష్ఠానమునై యుండును. "తత్త్వమసి" యను మహావాక్యోపదేశమువలన ఆశేషవిశేషములను, ఉపాధులను గల్పితములని నిరసించి "అహంబ్రహ్మాస్మి" యని భావింపవలెను. 37

అవ. ఇట్లు బ్రహ్మము ప్రత్యగాత్మయే యని నిరూపించి ముముక్షువునకు తిరిగి బోధపఱుచుచున్నారు:—

మూ. అదృష్టం ద్రష్ట్రవిజ్ఞాతం దభ్రమిత్యాదిశాసనాత్,
నైవ జ్ఞేయం మయాఽన్యైర్వా పరం బ్రహ్మ కథంచన.

తా. "అదృష్టమవిజ్ఞాతమ్" ఇత్యాది శ్రుతిబలమువలన పరబ్రహ్మ మెవ్వరికినిఁ దెలియఁదగినది కాదు.

ప్ర. బ్రహ్మ మేల తెలియఁబడదు?

ఉ. తెలియఁబడునది యెల్ల అల్పమగుటచే నది బ్రహ్మము కానేరదు. బ్రహ్మము పరిపూర్ణము సర్వజ్ఞము సర్వమునకు సాక్షి. 38

అవ. ఇట్లు ఆత్మ జ్ఞేయముకాదేని "ఆత్మన్యేవాత్మానం పశ్యేత్" అను ఉపదేశ మెటుల సంభవించును? అను శంక రాఁగా, ఆత్మజ్ఞానము ఘటాదిజ్ఞానమువలె విషయజ్ఞానము కానేరదు. కాని, అవిషయముగ ఆవిర్భావమాత్రమే యని "యస్యామతం తస్య మతం మతం యస్య న వేద సః." అను శ్రుతి చెప్పుటచే ఆత్మ అజ్ఞేయమను పక్షమునుగూడ నిరాకరించుచున్నారు:—

మూ. స్వరూపావ్యవధానాభ్యాం జ్ఞానాలోకస్వభావతః,
అన్యజ్ఞానానపేక్షత్వాత్ జ్ఞాతం బ్రహ్మ సదా మయా.

తా. ఆత్మస్వరూపము సదా సన్నిహితము, జ్ఞానప్రకాశస్వరూపము, జ్ఞానాంతరాపేక్షారహితముగను తెలియఁబడును.

1 ప్ర. తెలియఁబడెడి ఆత్మ విషయము కాదా?

ఉ. కాదు. ఆత్మ విషయి. ఘటాదులు విషయములు. విషయములను గ్రహించెడిది విషయి యనఁబడును.

2 ప్ర. ఈ రెండింటికిఁగల భేదమేమి?

ఉ. జడములగు ఘటాదిపదార్థములు జ్ఞానదేశమునకు దూరమున నుండుటచేతను, ఆగంతుకజ్ఞానసాపేక్షము లగుటచేతను విషయము లగును. చైతన్యమగు ఆత్మ జ్ఞానస్వరూపము, జ్ఞానాంతరాపేక్షారహితము నగుటచే విషయముకాక విషయి యని యీ రెండింటికినిఁగల భేదము.

3 ప్ర. ఆత్మ యెట్లు తెలియఁబడును?

ఉ. జ్ఞాత ఆత్మస్వరూపమే కనుక తాను తనచేతఁ దెలియఁబడఁదగఁడు.

అవ. జ్ఞానస్వరూపమగు ఆత్మకు జ్ఞానాంతరాపేక్ష లేదని చెప్పుటకుఁ దగిన దృష్టాంతము:—

మూ. నాన్యేన జ్యోతిషా కార్యం రవేరాత్మప్రకాశనే,
స్వబోధాన్నాన్యబోధేచ్ఛా బోధస్యాత్మప్రకాశనే. ౪౧

తా. సూర్యునకుఁగల స్వప్రకాశము ఇతరజ్యోతిస్సు నపేక్షించని విధమున, బోధరూపుఁడగు ఆత్మ స్వప్రకాశముకొఱకు ఇతరబోధ నపేక్షింపదు. ౪౧

అవ. దృష్టాంత దార్ష్టాంతికములందు జెప్పిన యితరానపేక్షత్వమును సాధించుచున్నారు:—

మూ. న తస్యైవాన్యతోఽపేక్షా
స్వరూపం యస్య యద్భవేత్,
ప్రకాశాంతరదృశ్యో న
ప్రకాశో హ్యస్తి కశ్చన. ౪౨

తా. దేనికి ఏది స్వరూపమో యది స్వప్రకాశముకొఱకు అన్యము నపేక్షింపదు. ప్రకాశమగు దీపము వేఱొక ప్రకాశము నపేక్షింపదు కదా. ఇచట అనుమానప్రమాణము కలదు. సూర్యునివలె ప్రకాశస్వరూపమగుటవలన, ఆత్మ ప్రకాశాంతరముచే భాసింపదు. ౪౨

అవ. ఆత్మ మఱియొక ప్రకాశముచే భాస్యము కాకున్నను, సూర్యుఁడు ఘటాదికమును బ్రకాశింపఁజేయుచు తనను గూడఁ బ్రకాశింపఁజేయునట్లు, స్వరూపప్రకాశముచే జడములగు నితరపదార్థములనుఁ బ్రకాశింపఁజేయుచు, తననుగూడఁ

ప్రకాశింపఁ జేయరాదా యను శంకకు సమాధానము:—

మూ. వ్యక్తి స్స్యాదప్రకాశస్య ప్రకాశాత్మసమాగమాత్,
ప్రకాశ స్త్వర్క-కార్య స్స్యాదితి మిథ్యావచో హ్యతః.

తా. ప్రకాశరహితమగు జడవస్తువునకు ప్రకాశాత్మకసద్వస్తుసమాగమమువలన స్ఫూర్తి కలుగును. కాని, యా జడవస్తువునకు స్వయముగ ప్రకాశగుణ మెన్నఁడును గలుగదు. కావున సూర్యప్రకాశము స్వరూపమగుటచే సూర్యునిచేనైనను బ్రకాశింపఁజేయఁబడు ననుమాటయే సత్యముకాదు. ఆత్మతనచేఁ బ్రకాశింపఁజేయఁబడుననుమాటయు నిట్లే నిజముకాదు. ౪౩

అవ. ఘటాదులు సూర్యునిచేఁ బ్రకాశింపఁజేయఁబడవా యనుట కుత్తరము:—

మూ. యజ్జాతో ఽభూత్వా భవేద్యచ్చ తస్య తత్కార్యమిష్యతే,
స్వరూపత్వా దభూత్వా న ప్రకాశో జాయతే రవేః.

తా. ఏది మునుపులేక దేనినుండి కలుగునో యది దాని కార్యమగును. ఘటాదులకుఁ బూర్వములేని ప్రకాశము సూర్యునివలనఁ గలుగుటచే ఘటాదులు సూర్యునిచేఁ బ్రకాశింపఁబడునవే యగును. పూర్వము స్వరూపముగనుండు సూర్యుని ప్రకాశము సూర్యునిచేనైనను ప్రకాశింపఁబడదు. ఇట్లు ఆత్మయు నన్యముచేఁగాని తనచేఁగాని ప్రకాశింపఁబడదు. ౪౪

అవ. అట్లైని ప్రకాశస్వరూపుఁడగు సూర్యుఁడు ప్రకాశకుఁడనియు, బోధమాత్రస్వరూపముగల ఆత్మ బోద్ధ యనియు నీవ్యవహారము దేనిచేఁ గలిగెనను శంక కుత్తరము:—

మూ సత్తామాత్రే ప్రకాశస్య కర్త్రాఽఽదిత్యాది రిష్యతే,

ఘటాదివ్యక్తితో యద్వత్తద్వద్బోద్ధాత్మనీష్యతామ్.

తా. ప్రకాశముయొక్క సాన్నిధ్యమాత్రమున ఘటాదికము స్ఫురింపఁగా ఆదిత్యుఁడు ప్రకాశకుఁ డనఁబడునట్లు బోధస్వరూపమగు ఆత్మయందు అధ్యస్తమగు అహంకారాదిసాన్నిధ్యమువలన పదార్థము భాసింపఁగా ఆత్మ వానికి బోద్ధ (తెలిసికొనువాఁడు) యని వ్యవహరింపఁబడును.

అవ. ఆత్మ నిర్వికారముగనే పదార్థములను ప్రకాశింపఁజేయుననుటను సూర్యదృష్టాంతముచే విశదపఱుచుచున్నారు:—

మూ. బిలాత్సర్పస్య నిర్యాణే సూర్యో యద్వత్ప్రకాశకః,
ప్రయత్నేన వినా తద్వత్ జ్ఞాతాఽఽత్మా బోధరూపతః.

తా. పుట్టలోనుండి సర్పము వెలుపలకు రాఁగా సూర్యుఁడు అప్రయత్నముగ తన సహజతేజస్సుచేతనే ఆసర్పనిర్గమనమును ప్రకాశింపఁజేయుచున్నాఁడని వ్యవహరించుచున్నట్లు బోధరూపమగు ఆత్మసన్నిధిమాత్రాన వస్తువులు ప్రకాశించుచుండఁగా ఆత్మ వానినిఁ ప్రకాశింపఁజేయుచున్నాఁడనెడి వ్యవహారము కలుగుచున్నది. ౪౭

అవ. ఇపుడు ఉపాధిసంబంధమువలన ఆత్మ జ్ఞాతయని చెప్పఁబడుటవలనను, ఉపాధిసంబంధము లేదేని ఆత్మకు జ్ఞాతృత్వము లేకపోవుటవలనను, ఈ జ్ఞాతృత్వము ఔపాధికమే యని చూపుటకై యుదాహరణమును జెప్పుచున్నారు:—

మూ. దగ్ధైవముష్ణ స్సత్తాయాం తద్వద్బోద్ధాత్మనీష్యతామ్,
సత్యేవ యదుపాధౌ తు జ్ఞాతే సర్ప ఇవోత్థితే. ౪౭

తా. దహింపఁబడఁదగిన కాష్ఠములు దగ్గిర నున్నపుడె ఉష్ణస్వరూపుఁడగు అగ్ని దాహకుఁడనియుఁ, పాము పుట్టలోనుండి వెడలునపుడె దానికి సూర్యుఁడు ప్రకాశకుఁడనియు వ్యవహరింపఁబడునట్లు, బోద్ధవ్యములగు విషయములున్నపుడె ఆత్మ బోద్ధ(జ్ఞాత)యని వ్యవహరింపఁబడును. కావున, ఉపాధిసంబంధమువలనఁ గలిగిన జ్ఞాతృత్వమును ఆత్మకు ఔపచారికమేకాని వాస్తవము కాదు. ౪౭

అవ. ఆత్మకు జ్ఞాతృత్వమువలెనే కర్తృత్వమును ఔపచారికమే కాని వాస్తవము కాదని రవిదృష్టాంతముచేతనే నిరూపించుచున్నారు:—

మూ. జ్ఞాతాఽయత్నోఽపి తద్వత్ జ్ఞః
కర్తా భ్రామకవద్భవేత్,
స్వరూపేణ స్వయం నాత్మా
జ్ఞేయో ఽజ్ఞేయో ఽథవా తతః. ౪౮

తా. ఆత్మ(జ్ఞః) ప్రయత్నముచేయకయే సకలపదార్థజ్ఞాత యగును. ఎట్లనఁగా, సూర్యుఁడు తనయందు ఏక్రియయును లేకున్నను స్వసన్నిధిమాత్రాన కర్తృకర్మకరణాదికారకములను ప్రవర్తింపఁజేయుచు, ఆకార్యములకుఁ గర్తగ భాసించును. మఱియు, ఆత్మ విశేషరహితము పూర్ణప్రకాశస్వరూపము నగుటచేఁ దెలియఁదగినదియుఁగాదు. దూరపువస్తువువలె తెలియఁదగనిదియుఁ గాదు. లేక, నిర్వికారమగుటవలన ఆత్మకు జ్ఞాతృత్వము లేదు. చైతన్యమే కనుక ఆత్మ అజ్ఞాతయును గాదు. వ్యాపారములేమిచే ఆత్మ కర్తయుఁ గాదు. కారకాధ్యాసకు అధిష్ఠానమగుటచే అకర్తయుం గాదు. ౪౮

అవ. ఆత్మకు జ్ఞేయత్వాదిధర్మము లేవియు లేవని చెప్పిన పైశ్లోకార్థమందుఁ బ్రమాణము:—

మూ. విదితావిదితాభ్యాం తదన్యదేవేతి శాసనాత్,
బంధమోక్షాదయో భావాస్తద్వదాత్మని కల్పితాః. ౪౯

తా. "అన్యదేవ తద్విదితాదథో అవిదితాదధి" అను శ్రుతి కార్య కారణములకంటె నన్యమగు ఆత్మతత్త్వము బ్రహ్మమని ఘోషించుటవలన ఆత్మ కార్యకారణధర్మవిలక్షణస్వభావమని తాత్పర్యము. జ్ఞాతృత్వకారణత్వాదికములు అవిద్యావశమున ఆత్మయందుఁ గల్పితములగునట్లు బంధమోక్షాదులు సుఖదుఃఖాదిభావములును గల్పితములే యని భావము. ౪౯

అవ. బంధమోక్షాదులు ఆత్మయందు కల్పితములని చెప్పినమాటకుఁ గారణమును, దృష్టాంతమును జెప్పుచున్నారు:—

మూ. నాహోరాత్రే యథా సూర్యే ప్రభారూపావిశేషతః,
బోధరూపావిశేషాన్న బోధాబోధౌ తథాఽఽత్మని. ౫౦

తా. ప్రకాశమాత్రస్వరూపుఁడగు సూర్యునకు రాత్రింబగళ్లులేనట్లు బోధస్వరూపుఁడగు ఆత్మకును జ్ఞానాజ్ఞానవిభాగము లేకపోవుటచేత బంధమోక్షములు సత్యములు కావు. ౫౦

అవ. ఈయుపాయముచేత ఉక్తస్వరూపమగు బ్రహ్మము నెఱిఁగినవానికి ఫలమును జెప్పుచున్నారు:—

మూ. యథోక్తం బ్రహ్మ యో వేద హానోపాదానవర్జితమ్,
యథోక్తేన విధానేన స సత్యం నైవ జాయతే. ౫౧

తా. హానమనఁగా విడుచుట. ఉపాదానమనఁగా గ్రహించుట. హానోపాదానములకుఁ గర్తయుఁ గర్మమునుగాని బ్రహ్మమును పైనిఁ జెప్పిన యుపాయముచే తత్త్వంపదార్థపరిశోధనము చేసిన పండితుఁడు తిరిగి జనన మరణప్రవాహములోఁ బడఁడు. ఇందుకు–"న స భూయోఽభి జాయతే" అను స్మృతి ప్రమాణము. ౫౧

అవ. పూర్వముచెప్పిన బ్రహ్మజ్ఞానము లేకున్నను పునర్జన్మము లేదనియెడి మహాఫలము కలుగుచుండఁగా జ్ఞానము వలన నేమి ప్రయోజనము? అను శంక రాఁగా "నాన్యః పంథా విద్యతేఽయనాయ" అను శ్రుతి జ్ఞానములేనిది మోక్షము కలుగదు అని బోధించుటవలన నట్లు శంకింపందగ దని చెప్పుచున్నారు:—

మూ. జన్మమృత్యుప్రవాహేషు పతితో నైవ శక్నుయాత్,
ఇత ఉద్ధర్తుమాత్మానం జ్ఞానా దన్యేన కేనచిత్. ౫౨

తా. జననమరణప్రవాహపతితుఁ డగువానిని లేవనెత్తుటకు జ్ఞానము కంటె వేఱగు సాధనములేదు. ముముక్షువు జ్ఞానముచేతనే యీ ప్రవాహమునుండి దరి చేరును. ౫౨

అవ. ఈయర్థమందు అథర్వోపనిషద్వాక్యము ప్రమాణమని:—

మూ. భిద్యతే హృదయగ్రంథిశ్ఛిద్యంతే సర్వసంశయాః,
క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్దృష్టే ఇతి శ్రుతేః. ౫౩

తా. సర్వోత్కృష్టమగు ఆ పరమాత్మ గురుశాస్త్రానుభవమువలన సంశయ విపర్యయరహితముగఁ దెలియఁబడెనేని, దేహమే ఆత్మయనుకొనెడి

అధ్యాసము నశించును. ఆత్మ దేహముకంటె భిన్నమగునా? కాదా? ఆ యాత్మ తెలియఁబడునా? లేదా? యనెడి సంశయములును నశించును. మఱియు, పూర్వము దేహేంద్రియాదులు 'నేను' అని అనుకొనునపుడు సంభావితమగు కర్తృత్వమువలనఁ బ్రాప్తములగు పుణ్యపాపకర్మములును నశించును. అనఁగా తాను దేహత్రయవిలక్షణుఁ డగుటచే పుణ్యపాపముల నంటక ఆకాశమువలె అసంగుఁడై రాజిల్లును. ౫౩

అవ. ప్రస్తుతార్థమును సంగ్రహముగఁ జెప్పి ముగించుచున్నారు:—

మూ. మమాహమిత్యేతదపోహ్య సర్వతో
విముక్తదేహం పద మంబరోపమమ్,
సుదృష్టశాస్త్రానుమితిభ్య ఈరితం
విముచ్యతే ఽస్మి న్యది నిశ్చితో నరః. ౫౪

తా. గురుప్రసాదముగల నరుఁడు, ఈదేహము నేను, ఈగేహాదికము నాది యనెడి మోహమునువదిలి, ఈయర్థమును నమ్మి సేవించెనేని తప్పక ముక్తిఁజెందును. ఈయర్థమేదియనఁగా, స్థూలసూక్ష్మదేహములకంటె విలక్షణము, ఆకాశమువలె సర్వవ్యాపకము, అఖండము, అసంగము, ఉపాధిసంబంధములేక ఏకాకారము నగునది పరతత్త్వము. ఈపరతత్త్వము సద్గురుసేవవలనను, శాస్త్రవిమర్శనమువలనను దెలియనగును. ౫౪

ఇది నాన్యదన్యత్ప్రకరణము.



శ్రీః

# ఉపదేశసాహస్రి

(శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యప్రణీతము.)

## శ్లోకప్రబంధము — షోడశప్రకరణము.



### ౧౬. పార్థివప్రకరణము.

అవ. పూర్వప్రకరణమందు ఏకదేశిమతమును నిరాకరించుచు బ్రహ్మాత్మైకత్వజ్ఞానమే స్వరూపావస్థానరూప మోక్షసాధనమనియు, భేదాభేదజ్ఞానము మోక్షసాధనము కాదనియు నిరూపింపఁబడెను. సకలతార్కికమతములను నిషేధించుచు ముముక్షువును స్వారాజ్యమందు ఆరూఢునిఁ జేయుటకై యీప్రకరణమును ఆరంభించుచు మొదట స్థూలశరీరము ఆత్మయని వాదించువారలమతమును నిరాకరించుచున్నారు:—

మూ. పార్థివః కఠినో ధాతుర్ద్రవో దేహే స్మృతోఽమ్మయః,
పక్తిచేష్టావకాశాస్స్యుర్వహ్నివాయ్వంబరోద్భవాః.

తా. స్థూలదేహమందు కఠినమగు మాంసాదిపదార్థము పృథివీభాగము. చెమట మొదలగు ద్రవము జలరూపము. పాకము (అన్నము జీర్ణ

మగుట) వహ్నిపరిణామము. చలనాదికము వాయుపరిణామము. అవకాశము ఆకాశపరిణామము. భూతపరిణామ మగుటచే దేహము మృద్వికారమగు పుట్టవంటిది కనుక ఆత్మ కానేరదు. ౧

అవ. ఇంద్రియములు ఆత్మయని వాదించువారల మతమును నిరాకరించుచున్నారు:—

మూ॥ ఘ్రాణాదీని తదర్థాశ్చ పృథివ్యాదిగుణాః క్రమాత్,
రూపాలోకవదిష్టం హి సజాతీయార్థమింద్రియమ్. ౨

తా. ఘ్రాణజిహ్వానేత్రత్వక్ శ్రోత్రనామకేంద్రియపంచకమును, గంధరసరూపస్పర్శశబ్దనామకగుణపంచకమును క్రమముగ పృథివ్యప్తేజోవాయ్వాకాశధర్మములు. ఘ్రాణాదీంద్రియములచేతనే గంధాదివిషయములు గ్రహింపఁబడును. తేజోధర్మమగు రూపము తైజసమగు నేత్రముచేతనే తెలియఁబడునట్లు పృథివీధర్మమగు గంధము పృథివీధర్మమగు ఘ్రాణముచేతనే తెలియఁబడును. ఇట్లే జలాదిధర్మములగురసాదులు జలాదికార్యములగు జిహ్వాదులచేతనే గ్రహింపఁబడును.

ప్ర. ఇంద్రియములును గుణములవలె భూతకార్యములగుటవలన ఫలమేమి?

ఉ. భూతకార్యమగు స్థూలదేహము ఆత్మకానివిధమున భూతకార్యములగు ఘ్రాణాదీంద్రియములును ఆత్మకానేరవు. ౨

అవ. మఱియు ఇంద్రియములు కుఠారాదికమువలె సాధనములగుటచే ఆత్మ కావని చెప్పుచు నింద్రియములు పదునొకండని చెప్పుచున్నారు:—

మూ. బుద్ధ్యర్థానా్యహుః శ్రోత్రాణి వాక్పాణ్యాదీని కర్మణే,
తద్వికల్పార్థమంతస్థం మన ఏకాదశం భవేత్.          3

తా. ఘ్రాణాదులు జ్ఞానేంద్రియములు. వాగాదులు కర్మేంద్రియములు. ఏకకాలమందు దశేంద్రియవ్యాపారములు సంభవింపఁగా ఆకార్యదశకమును నియమించుటకై మనస్సును పదునొంకడవయింద్రియముగ నంగీకరించుటచే నిదియును ఆత్మకాఁజాలదు.

ప్ర. మనస్సు అంతరింద్రియమనుటచే నేమిప్రయోజనము?

ఉ. ఇంద్రియమగుటచే ఘ్రాణాదికమువలె మనస్సుకూడ ఆత్మ కానేరదు.          3

అవ. మనస్సువలె కరణవిశేషమగుటచే బుద్ధియు ఆత్మ కాదని యా బుద్ధియొక్క స్వభావమును జూపుచు బౌద్ధమతమును నిరాకరించుచున్నారు:—

మూ. నిశ్చయార్థా భవేద్బుద్ధి
స్తాం సర్వార్థానుభావినిమ్,
జ్ఞాతాఽఽత్మోక్త స్స్వరూపేణ
జ్యోతిషా వ్యంజయన్నపా.          ౪

తా. వస్తువులను విభజించి గ్రహించెడి ధీవృత్తి బుద్ధి యనఁబడును. ఇది నిశ్చయించెడి స్వభావము కలది. స్వయంజ్యోతిస్స్వరూపముచే సర్వార్థముల ననుభవించెడి యీబుద్ధినిఁ దెలియువాఁడు ఆత్మ.

1 ప్ర. బుద్ధి ఆత్మ కారాదా?

ఉ. ఈ బుద్ధి అన్యముచేతఁ దెలియఁబడుటవలన ఆత్మ కాదు.

2 ప్ర. ఆత్మ మఱియొకదానిచేఁ జూడఁబడదా?

ఉ. దీపమునకువలె స్వయంప్రకాశమగు ఆత్మకు నితరాపేక్ష లేదు.

3 ప్ర. దీపమునకువలె నని చెప్పుట యెట్లు?

ఉ. సకలవస్తుప్రకాశకమగు దీపమును దెలియుటకు మఱియొక దీపముతోఁ బనిలేదు. ఇట్లే, అహంకారాదిదేహాంతజడసంఘాతభాసకమగు ఆత్మజ్ఞానమునకు జ్ఞానాంతరాపేక్ష లేదు. ౪

అవ. ఆత్మ బుద్ధినిఁ బ్రకాశింపఁజేయునేని ఆ బుద్ధిసంబంధమువలన ఆత్మ యశుద్ధమగు నను శంకను దృష్టాంతముచేఁ బరిహారమును జెప్పుచున్నారు:—

మూ. వ్యంజకస్తు యథాలోకో వ్యంగ్యస్యాకారతాం గతః,
వ్యతికీర్ణోఽప్యసంకీర్ణ స్తద్వ జ్జ్ఞః ప్రత్యయై స్సదా. ౫

తా. దీపాదిప్రకాశము ప్రకాశ్యమగు ఘటాదికముయొక్క ఆకారమును బొందియు ఆఘటాదికముతోఁ గలిసియున్నట్టు తోఁచుచున్నను వాస్తవముగ ఘటాదిగతదోషముల నంటక వేఱుగ భాసించునట్లే ఆత్మ బుద్ధివృత్తులతోఁ గలిసియున్నట్టు భాసించుచున్నను వేఱుస్వభావము గలవాఁడే కాని యెన్నడును దృశ్యము కాఁడు. తద్గతదోషముల నంటమిచే నిత్యశుద్ధస్వభావుఁడు నగును. ఇచట సీతారామాంజనేయసంవాదములోని, ఆ-౩, ప-౧౦౫. దృష్టాంతము:—

కవిరాజవిరాజితము:—

తరణి సమస్తరసంబులఁ గ్రోలుచుఁ దద్రసనిష్ఠ వికారములం
బొరయని చందమునన్ విషయంబులఁ బొందుచుఁ దద్గుణదోషములన్
నిరతము నంటక యోగివరుం డతి నిర్మలనిశ్చల మానసుఁడై
పరమసుఖామృతవార్ధిని గ్రుంకుచుఁ బావనుఁడై విలసిల్లుఁ దగన్. ౫

అవ. బుద్ధ్యాదికముకంటె విలక్షణము వ్యాపారరహితమునగు ఆత్మ వాని నెట్లు ప్రకాశింపఁజేయు ననుశంకను దృష్టాంతపూర్వకముగ నిరాకరించుచున్నారు:—

మూ. స్థితో దీపో యథాఽయత్నః
ప్రాప్తం సర్వం ప్రకాశయేత్,
శబ్దాద్యాకారబుద్ధీర్జ్ఞః
ప్రాప్తాస్తద్వత్ప్రపశ్యతి. ౬

తా. ప్రకాశమానమగు దీపము ప్రాప్తమగు పదార్థజాతమునెల్లను ప్రయత్నము లేకయే ప్రకాశింపఁజేయునట్లు, ప్రాప్తమగు శబ్దస్పర్శాది వృత్తిజ్ఞానముల నన్నిఁటిని ఆత్మ ప్రకాశింపఁజేయుచు సర్వసాక్షి యగును.

అవ. అయినను నేను సుఖిని దుఃఖితుఁడ ననెడి విరుద్ధజ్ఞానమువలన ఆత్మకు శుద్ధియెట్లు? అను శంక కుత్తరము:—

మూ. శరీరేంద్రియసంఘాత ఆత్మత్వేన గతాం ధియమ్,
నిత్యాత్మజ్యోతిషా దీప్తం విశంపంతి సుఖాదయః. ౭

తా. నిత్యాత్మతేజస్సుచేఁ ప్రకాశింపఁజేయఁబడు సుఖదుఃఖములతోఁగూడిన శరీరేంద్రియసంఘాతమును ఆత్మయని ప్రవర్తించెడి బుద్ధినిఁ జెందిన సుఖాదులు ఆత్మ ధర్మములు కావు.

ప్ర. సుఖదుఃఖాదులు బుద్ధిధర్మములగునేని ఆత్మ సుఖియని దుఃఖియని వ్యవహార మెటుల గలుగును?

ఉ. ఆత్మ భాసకము, బుద్ధి భాస్యము ననెడి వివేకము లేనందున నీ భ్రాంతి కలుగును. మఱియు, ఆత్మ సదా సర్వావస్థలందును ప్రకాశించు

చుండును. జాగ్రత్స్వప్నములందు మాత్రము ప్రకాశించెడి బుద్ధి సుషుప్తి యందు లీనమై యుండును. ఈ సుఖదుఃఖాదులును బుద్ధితోఁగూడ సుషుప్తి యందు లీనమై జాగ్రత్స్వప్నములందు బుద్ధితోఁగూడ ఆవిర్భవించుచుండు టచే నివి బుద్ధిధర్మములే యగును. ఆత్మ యీ జాగ్రదాద్యవస్థలకును, సుఖ దుఃఖాది బుద్ధివృత్తులకును సాక్షియగుచు సుఖాదులను జెందక యుండును. ఇను పకమ్మి కాల్చుననుమాట ఇనుమునకును దానిఁజెందియున్న అగ్నికిని భేదజ్ఞానము లేనపుడే తోఁచునుగాని, ఆరెండింటికిఁగల భేదమును గనిపెట్టినపుడు ఆదా హశక్తి అగ్నిదేకాని యినుమునది కాదని తెలియఁబడును. ఇట్లు వివేకముచే విమర్శించునపుడు సుఖదుఃఖములు బుద్ధిధర్మములే కాని ఆత్మధర్మములు కావని తెలియును. ౭

అవ. ఈ నిశ్చయమునకుఁ గారణమును చెప్పుచున్నారు:—

మూ. శిరోదుఃఖాదినాఽఽత్మానం
దుఃఖ్యస్మీతి హి పశ్యతి,
ద్రష్టాఽన్యోదుఃఖినో దృశ్యా
ద్దృష్టత్వాచ్చ న దుఃఖ్యసౌ. ౮

తా. దేహావయవములగు శిరస్సు మొదలగువాని బాధవలన ఆత్మను దుఃఖవంతునిగఁ దలఁచుట శరీరేంద్రియసంఘాతమే ఆత్మయనుకొనుటవలనఁ గలుగును. దృశ్యమగు నీధీవృత్తికంటె నన్యమగు ఆత్మ వానికి సాక్షియగు టచే దుఃఖి కాఁడు. బుద్ధితో అధ్యాసమువలననే ఆత్మకు దుఃఖియనే జ్ఞాన ముకలుగుటచే బుద్ధిధర్మములగు సుఖదుఃఖాదులు ఆత్మయందు ఆరోపింపఁ బడినవే కాని ఆత్మధర్మములు కావు. ౮

అవ ద్రష్ట (సాక్షి) యగుటచే ఆత్మకు సుఖదుఃఖా దులు లేవనుమాటను దృఢపరుచుచున్నారు.—

మూ. దుఃఖీ స్యాద్దుఃఖ్యహంమానా ద్దుఃఖినోదర్శనాన్న వా,
సంహతే ఒజ్ఞాదిభి ర్ద్రష్టా దుఃఖీ దుఃఖస్య నైవ సః. ౯

తా. దుఃఖవంతమగు అంతఃకరణము నేనే యని అభిమానమువలన ఆత్మకు దుఃఖమున్నట్లు భాసించును. ఆ యంతఃకరణమును సాక్షిగఁ జూచెడి ఆత్మకు దుఃఖము సహజముకాదు. లోకములో పుత్రాదులు దుఃఖపడు చుండఁగా వారలయందు మమకారముగలవానికే దుఃఖము గలదుగాని, తటస్థుఁడగువానికి దుఃఖములేదుకదా. ఇట్లే శిరోనేత్రాదులతోఁగూడిన దేహమందుగల దుఃఖముసయితము ఉదాసీనుఁడై వానిని సాక్షిగఁజూచు ఆత్మకుఁ గలుగదు. ఇందుకు-"అసంగోహ్యయమనాః శుభ్రః" అను శ్రుతియుం బ్రమాణము. ౯

అవ. దుఃఖవంతమగు అంతఃకరణమును జూచు ఆత్మ కుఁగూడ దుఃఖము తగునని సదృష్టాంతముగ శంకించు చున్నాఁడు:—

మూ. చక్షుర్వత్కర్మకర్తృత్వం
స్యాచ్చేన్నానేకమేవ తత్,
సంహతం చ తతో నాత్మా
ద్రష్టృత్వాత్కర్మతాం వ్రజేత్. ౧౦

తా. అద్దమందున్న చక్షుస్సు దృశ్యమును, ముఖదేశమందున్న చక్షువు ద్రష్టయు నగునట్లు దుఃఖసంబంధముగల ఆత్మ దృశ్యము, స్వరూప చైతన్యము ద్రష్టయు నగునని పూర్వపక్షి యభిప్రాయము. సిద్ధాంతి దీని

నిట్లు పరిహరించుచున్నాఁడు:— ఆచక్షురింద్రియాధారగోళకమే అద్దమం దుండి దృశ్యమగును. దర్శనశక్తిఁగలిగి ముఖనిష్ఠమగు ఆనేత్రము ద్రష్ట యగును. ఇట్లు అనేకాకారమగు నేత్రము దృశ్యమును ద్రష్టయుఁ గాఁద గునుగాని, ఏకరూపమగు ఆత్మకు అంశభేదము లేనందున చిత్ప్రకాశైక స్వభావుఁడగు ఆత్మ యెప్పుడును ద్రష్టయే. దృశ్యాంశమంతయు అనాత్మ యగుటచే ఆత్మ దర్శనక్రియకు కర్మ కానందున దృశ్యము కానేరదు. ౧౦

అవ. ఆత్మకుఁగూడ జ్ఞానయత్నములచేత అనేకత్వము సంభవించుటవలన చక్షుస్సువలె ఆత్మ భాస్యమును భాసకమును కావచ్చును, అను శంకను నిరాకరించుచున్నారు:—

మూ. జ్ఞానయత్నాద్యనేకత్వమాత్మనోఽపి మతం యది,
నైకజ్ఞానగుణత్వాత్తు జ్యోతిర్వ త్తస్య కర్మతా. ౧౧

తా. జ్ఞానము, ప్రయత్నము, ఇచ్ఛ, ద్వేషము మొదలగు గుణభేదములుండుటవలన, అనేకాత్మకమగు ఆత్మ కొన్నియంశములచే గ్రాహ్యమగును. మఱికొన్ని యంశములచే గ్రాహకమగును అని శంకించువాని యొక్క అభిప్రాయము కాని అట్లుకాదు. ఆత్మ జ్ఞానగుణమాత్రము గలవాఁడగుటచేఁ కేవలప్రజ్ఞానఘనమని శ్రుతి నిశ్చయించుటవలన అనేకాత్మత్వము సంభవింపనందున చక్షుస్సువలె ఆత్మ దృశ్యము కానేరదు. ౧౧

అవ. ఇందుకు దృష్టాంతమును వివరించుచున్నారు:—

మూ. జ్యోతిషో ద్యోతకత్వేఽపి యద్వన్నాత్మప్రకాశనమ్,
భేదేఽప్యేవం సమత్వాజ్జ్ఞ ఆత్మానం నైవ పశ్యతి. ౧౨

తా. ఆత్మ ఏకాంశముచే గ్రాహ్యము. ఏకాంశముచే గ్రాహకము నగునని చెప్పెదవేని యీ పక్షమున గ్రాహ్యాంశము చేతనమా? లేక జడమా? ఆయంశము చేతన మనరాదు. ఏమనఁగా, సకలవస్తుప్రకాశక జ్యోతిః స్వరూపమగు సూర్యాదితేజస్సు పరప్రకాశకమే కాని తనను బ్రకాశింపఁ జేసికొనలేదు. ఇట్లు గ్రాహ్యగ్రాహకభేదమున్నను ఆత్మ చైతన్యస్వభావుఁ డగుటచే తన అంశచైతన్యమును బ్రకాశింపఁజేయలేదు. రెండవపక్షమున జడమైన యాచైతన్యము యొక్క యొకభాగమని చెప్పఁదగదు. గ్రహింపఁబడు పదార్థము ఆత్మ కానేరదు. ఆత్మ తనచేతనైనను దెలియఁబడదు. అనెడి దోషములు స్పష్టములే కనుక ఆత్మ యొకయంశముచేత గ్రాహ్యము. వేఱొకయంశముచే గ్రాహకము నగునని చెప్పఁదగదు. ౧౨

అవ. స్వరూపముచేఁగాని అంశచేఁగాని ఆత్మ జూడఁబడలేకపోయినను, తన ధర్మమగు జ్ఞానముచేతఁ జూడఁబడ వచ్చునుగదా యను శంకకుత్తరము:—

మూ. యద్ధర్మా యః పదార్థో న తస్యైవేయాత్స కర్మతామ్,
న హ్యాత్మానం దహత్యగ్ని స్తథా నైవ ప్రకాశయేత్.

తా. ఏది యేపదార్థముయొక్క ధర్మమగునో యా ధర్మము ఆ పదార్థమును దెలియలేదు. ఎట్లనఁగా, అగ్నికి దాహకత్వము ప్రకాశము నను రెండుధర్మములు కలవు. ఈ రెంటిని అన్యపదార్థములయెడఁ బ్రవర్తించును. 'అగ్ని తనను గాల్చుకొనును. అగ్ని తనను బ్రకాశింపఁజేసికొనును' అను మాటలు తగియుండవు. అగ్ని ధర్మములగు దాహకత్వప్రకాశములు తనను దహింపలేవు. ప్రకాశింపఁజేయలేవు. ఇట్లు ఆత్మధర్మమగు జ్ఞానము ఆత్మను దెలియఁజాలదని భావము. ౧౩

అవ. ఈన్యాయముచే విజ్ఞానవాదియు, బౌద్ధుఁడును నిరాకరింపఁబడిరి అని చెప్పుచున్నారు:—

మూ. ఏతేనైవాత్మనాఽఽత్మానో గ్రహో బుద్ధేర్నిరాకృతః,
అంశోఽప్యేవం సమత్వాద్ధి నిర్భేదత్వాన్న యుజ్యతే.

తా. ఈదృష్టాంతముచే బుద్ధిస్వరూపమగు ఆత్మ తనచేతనే గ్రహింపఁబడునను బౌద్ధవాదము సయితము నిరాకరింపఁబడెను. స్వరూపము స్వరూపముచేఁ దెలియఁబడకున్నను ఏకాంశముచే గ్రాహ్యము, అపరాంశముచే గ్రాహకము కావచ్చును. అను భేదవాదము పూర్వమే నిరాకరింపఁబడెను. (ఆత్మానః అనుచోట 'త్మా'కు దీర్ఘము ఆర్షము.) ౧౪

అవ. ఇట్లు బుద్ధి తనచేఁ దెలియఁబడదనుటవలన నితరముచేఁ దెలియఁబడునని సూచింపఁబడెను. కాదేని బుద్ధి క్షణికమనుమాట పొసఁగదు. కనుక బుద్ధియు బుద్ధిగ్రాహకమును శూన్యమే యగును. ఇదియే ఆత్మతత్త్వము, అని వాదించెడి శూన్యవాదిమతమును నిరాకరించుచున్నారు:—

మూ. శూన్యతాఽపి న యుక్తైవం బుద్ధేరన్యేన దృశ్యతా,
యుక్తాఽతో ఘటవత్తస్యాః ప్రాక్సిద్ధేశ్చ వికల్పతః.౧౫

తా. బుద్ధియు ఘటమువలె నితరముచే దృశ్యము కనుకను, స్వప్నజాగరములందు బుద్ధి యుదయింపకమునుపే సుషుప్తియందు బుద్ధిభావాభావములకు సాక్షియగు ఆత్మ యుండుటచేతను శూన్యవాదము నెప్పుడును అంగీకరింపరాదు. ౧౫

అవ. ఇదియుంగాక ఘటరూపకార్యము మృత్తుతోఁ

గూడినదగుచుండుటచేత మృత్తు కారణమై ఘటాదికార్యము లకంటె పూర్వమందే యుండునట్లు, కారణము కారణమందు వ్యాపించినను కార్యముకంటె పూర్వమందే యున్నదగును. కనుక సవికారబుద్ధికంటె పూర్వము సాక్షియగు ఆత్మయుండు నని నిరూపించుచున్నారు:—

మూ. అవికల్పం తదస్త్యేవ యత్పూర్వం స్యాద్వికల్పతః,
వికల్పోత్పత్తిహేతుత్వాదన్యస్యైవ తు కారణమ్.

తా. కారణములేనిది కార్యము పుట్టదు కనుక వికల్పములగు కార్యములకంటె ఏది పూర్వమో యట్టి కూటస్థావికల్పవస్తువు యుండక తీరదు. కనుక కార్యమునకు నియతకారణముండవలెను.

ప్ర. కారణమునకు నియతభావమేది? ఏల ఆనియమమును అంగీకరింపవలెను?

ఉ. నియతకారణ మనఁగా—అదియే దేనికిఁ గారణముగాని మఱి యొకటి కాదనుట—ఎట్లనఁగ; కుండచేయువాఁడు మట్టినే కోరుట. బట్ట నేయువాఁడు నూలునే కోరుట. మూలకారణము శూన్యమగునేని అందఱకును సులభమగు శూన్యమువలననే యందఱు నన్నికార్యములను జేయవచ్చును. అనఁగా - కుమ్మరి మట్టియను విశేషకారణమును అపేక్షింపకయే నూలునుండి యైనను కుండనుజేయవచ్చును. ఇట్లు సాలెవాఁడు నూలును గోరకయే మట్టినుండియైనను బట్టను నేయవచ్చును. లోకములో నిట్టి వ్యవహారము లేనందున జగత్కారణము శూన్యమని చెప్పరాదు. ౧౬

అవ. లోకములో పనిచేయువాఁడే కారణము కనుక నిష్క్రియము కూటస్థమునగు బ్రహ్మము జగత్కారణమెట్లగును? అను శంకరాఁగా సర్పమునకు రజ్జువు వివర్తకారణ

మగునట్లు జగత్తునకు బ్రహ్మము వివర్తకారణమగును గాని ఉపాదానకారణము కాదని యుత్తరము:—

మూ. అజ్ఞానం కల్పనామూలం
సంసారస్య నియామకమ్,
హిత్వాఽఽత్మానం పరం బ్రహ్మ
వింద్యాన్ముక్తం సదాఽభయమ్. ౧౭

తా. బ్రహ్మము వికారరహితము. ఇట్టి నిర్వికారబ్రహ్మమందు అనాద్యవిద్య సకలవికారములను గల్పించును. ఇది సంసారప్రవర్తకము. ముముక్షువు గురుప్రసాదమున నిట్టి అజ్ఞానమును వదలి భయరహిత నిష్ప్రపంచ పరబ్రహ్మానుసంధానపరుఁడు కావలెను.

1 ప్ర. సువర్ణము కటకకుండలాదిభూషణములుగ మాఱువిధమున అజ్ఞానమే సకల ప్రపంచాకారముగ మాఱుచుండఁగా, కూటస్థుఁడు జగత్కారణమని చెప్పఁదగునా?

ఉ. కూటస్థుఁడనఁగా సకలసాక్షియు సర్వాధిష్ఠానమునగు చైతన్యము. ఆ చైతన్యమే సకలకల్పనకు నాధారమగుటచేఁ గల్పితములగు వికారములు 'ఉన్నవి' యనే సత్తను ఆధార కూటస్థ సత్త్వమునుండియే తుచ్ఛములగు తాము పొందుటవలన కూటస్థుఁడు కారణమని చెప్పఁబడును.

2 ప్ర. ఈ యజ్ఞానము కార్యసహితముగ భాసింపుచుండఁగా అద్వైత మెటుల సిద్ధించును?

ఉ. అజ్ఞానము కార్యములతోఁ గూడ పుట్టుచు నశించుచుండఁగా వాని భావాభావములకు సాక్షియగు ఆత్మ శేషించును. సాక్షిత్వముకూడ సాక్ష్యవస్తువుల నపేక్షించియే కలిగినదగుటచే మిథ్యయే. ఇట్లు కార్యకారణ ప్రపంచ సంగరహితము, అద్వయము, అభయమును నగు వస్తువు తానే

యని ముముక్షువు "అహం బ్రహ్మాస్మి" యను మహావాక్య విమర్శవలన అనుసంధానము చేయవలెను. జగత్తునకు అజ్ఞానము ఉపాదానకారణము, బ్రహ్మము వివర్తకారణము. అని భేదము. ౧౭

అవ. సంసారనియామకమగు అజ్ఞానమును వదలి ఆత్మయగు బ్రహ్మమును దెలియవలెనని చెప్పితిరి. అందు సంసారమన నేమి? దానికి అజ్ఞానము కారణ మెట్లగును? ఆయజ్ఞానము నుండి ఆత్మను వేఱుగఁ దెలియు నుపాయ మెద్ది? అను ప్రశ్నలకు త్తరము:—

మూ. జాగ్రత్స్వప్నౌ తయోర్బీజం
సుషుప్తాఖ్యం తమోమయమ్,
అన్యోఽన్యస్మిన్నసత్త్వాచ్చ
నాస్తీత్యేతత్త్రయం త్యజేత్. ౧౮

తా. స్థూలగోచరమగు జాగ్రదవస్థయు, సూక్ష్మగోచరమగు స్వప్నావస్థయు సంసారమనఁబడును. ఈ రెండవస్థలకుం గారణము అజ్ఞానమయమగు సుషుప్తి. ఇట్లు కార్యకారణ స్వరూపమును వర్ణించి వానియొక్క పరిహారమునకు ఉపాయమును జెప్పుచున్నారు.

ఈమూఁడవస్థలు దృశ్యములగుచు నొకదానియం దొకటి లేకపోవుటవలనను ఆత్మ యీమూఁడవస్థలందు ననుగతమై యుండుటవలనను, రజ్జువునం దారోపింపఁబడు సర్పము మిథ్యయగునట్లుగను భావించుచు సకలసాక్షియగు ఆత్మను మాత్రమే సత్యమని భావింపవలెను. ౧౮

అవ. 'త్యజేత్' అను క్రియవలన కర్తృత్వము తోఁచుచున్నది. కావున కర్తృత్వరూపవికారముగల ఆత్మ బ్రహ్మ మెట్లు కాఁదగునను శంక కుత్తరము:—

మూ. ఆత్మబుద్ధిమనశ్చక్షు రాలోకార్థాదిసంకరాత్,
భ్రాంతి స్స్యాదాత్మకర్తేతి క్రియాణాం సంనిపాతతః.

తా. దేహము బుద్ధి మనస్సు కన్ను వెలుతురు పదార్థము ప్రదేశము కాలము ననునీపదార్థములయొక్క ప్రధానాప్రధానభావమువలన క్రియలు (వ్యాపారములు) కలుగుచుండఁగా, ఆత్మ వ్యాపారవత్తనెడి భ్రాంతికలుగును. కనుక బ్రహ్మము నిష్క్రియమను శ్రుతికి విరోధములేదు. ఇక్కడ కర్మశబ్దమునకు "పని" యని యర్థము. ౧౯

అవ. అన్యధర్మములను అన్యమందారోపించుట విషయమైన దృష్టాంతము:—

మూ. నిమీలోన్మీలనే స్థానే వాయవ్యే తే న చక్షుషః,
ప్రకాశత్వాన్మనస్యేవం బుద్ధౌ న స్తః ప్రకాశతః. ౨౦

తా. నేత్రగోళములందుండెడి నిమీలనోన్మీలనములు (కనుమూఁత, కనుతెఱపు) అను క్రియలు వాయువుయొక్క వ్యాపారములే కాని ప్రకాశస్వరూపమగు నేత్రముయొక్క ధర్మములు కావు. అయినను నేత్రములయొక్క నిమీలనోన్మీలనములనే వ్యవహారము కలదు. దీనికి అన్యవస్తువునందు అన్యధర్మారోపమనెడి అధ్యాసమే కారణము. ఇట్లు చక్షుస్సువలె ప్రకాశస్వరూపములగు మనోబుద్ధులందు ప్రాణధర్మములగు చలననైశ్చల్యములు ఆరోపింపఁబడుటచేత మనస్సు చంచలమని బుద్ధిస్థిరమనియుం వ్యవహరింపఁబడుచున్నది. ౨౦

అవ. మనోబుద్ధులకు అసాధారణధర్మములను నిరూపించుచు, ప్రసంగవశమున నుపపాదింపఁబడినదానిని ఉపసంహరించుచున్నారు:—

మూ. సంకల్పాధ్యవసాయాతు మనోబుద్ధ్యోర్యథాక్రమాత్,
నేత రేతరధర్మత్వం సర్వం చాత్మని కల్పితమ్.    ౨౧

తా. మనస్సు సంకల్పస్వరూపము. బుద్ధి నిశ్చయస్వరూపము. ఇట్టి నిర్ణయమువలన మనోధర్మమగు సంకల్పము బుద్ధి కెన్నఁడును లేదు. బుద్ధి ధర్మమగు నిశ్చయము మనస్సునకును లేదు. ఇట్లు కూటస్థాసంగాత్మకుఁ గర్తృత్వ మెన్నఁడును లేదు. జడమగు అవిద్యాదికమునకు స్వతంత్ర వ్యవహారమును లేదు. ఉండునేని నరుని ప్రేరేపణలేకయే బండి నడువవలసి యుండును. జడమునకును చిత్తునకునుగల సంబంధము వాస్తవము కానందున కారణసహితమగు కార్యజాతమంతయు ఆత్మయం దధ్యాసమువలనఁ గల్పింపఁబడినదే కాని వాస్తవము కాదు. కనుక ఆత్మ యెల్లప్పుడును అద్వయ బ్రహ్మమే యనుటకు సంశయములేదు.

1 ప్ర. ఎల్లప్పుడును అద్వయమే యన నేమి ?

ఉ. సృష్టికంటెఁ బూర్వమందు బ్రహ్మము ద్వితీయవస్తురహితమై అద్వయమే కదా. ఇందుకు-"ఇదం సర్వం పురా సృష్టేరేక మేవాద్వితీయకమ్." అను వచనము ప్రమాణము. సృజింపఁబడిన జగత్తంతయు ప్రళయ కాలమున నశింపఁగా బ్రహ్మము మాత్రమే శేషించునుగద. ఐంద్రజాలికుఁడు చేయు పనులన్నియును మాయాకల్పితములగుటచే నవి నశింపఁగా ఐంద్ర జాలికుఁడు మాత్రమే శేషించుట లోకప్రసిద్ధము. ఆద్యంతములందు లేని జగత్తు మధ్యకాలమునం దున్నట్టు భాసించినను పారమార్థికదృష్టి లేనిదే యగును. ఎట్లనఁగా, స్వప్నప్రపంచము నిద్రింపకమునుపు లేదనియును, నిద్రనుండి మేల్కొనిన తరువాతనుగూడ లేదనియును సకలజను లెఱింగిన విషయమే. ఆస్వప్నప్రపంచము ఆద్యంతములందు లేనివిధమున స్వప్నమందు (మధ్యకాలమందు) ఉన్నట్లు భాసించినను లేనిదే యని బుద్ధిమం

తుఁడు నిశ్చయింపకఁబోఁడు. కావున కల్పితప్రపంచము స్వకారణాజ్ఞాన సహితముగ భాసించుచున్నను పారమార్థికదృష్టికి లేనిదేయని స్వప్నదృష్టాంతముచే నిశ్చయింపవలెను. ఈయర్థమునే "ఆదావంతే చ యన్నాస్తి మధ్యే తత్స్వప్నవన్నహి" యను వచనము బోధించుచున్నది.

2. ప్ర. ఎల్లప్పుడును ద్వితీయరహితముగనుండు వస్తువెద్ది?

ఉ. సర్వజగత్కల్పనము ఏబ్రహ్మమందు అధ్యాసవశమునఁ గల్పింపఁబడినదో ఆబ్రహ్మమే ఆద్యంతములందువలె మధ్యయందును శేషించును.

3. ప్ర. దీని కుదాహరణమేమి?

ఉ. ఒక వస్త్రముపై యనేక వృక్షలతాదులు, రాజస్త్రీ భటాది ప్రాణులు చిత్రింపఁబడినను, ఆద్యంతములందు వస్త్రముమాత్రమే మిగులు నట్లు మధ్యయందును సత్యముగ వస్త్రమే మిగులును. (ఇచట ఆద్యంతములనఁగా చిత్తరువు వ్రాయకముందును, చిత్తరువును తుడువగాను మిగిలియుండు వస్త్రమని గ్రహింపవలెను.) వస్త్రముకంటె నన్యమగునది యెల్లను మాయాకల్పితమయి వాస్తవము కానందున, చిత్తరువునందు వ్రాయఁబడిన చెట్లు పండ్లను ఇయ్యఁజాలవు. నదీజలము త్రాగసాధ్యముకాదు. రాజస్త్రీ భటాదులు ఏపనియుం జేయఁజాలరు. కావున చిత్రింపఁబడినదంతయు మిథ్యకాఁగా, మధ్యకాలమందు సయితము సకలవస్తుకల్పనకు అధిష్ఠానమగు పటమువలె, సకలజగత్కల్పనాధిష్ఠానమగు బ్రహ్మమొకటియే ద్వితీయరహితముగ నున్నదని గ్రహింపవలెను.

4 ప్ర. స్వామీ! దయతో నింకొక యుదాహరణమిందు.

ఉ. వత్సా! శ్రద్ధతో వినుము. కంసాలి బంగారుకణిక నొకదానినిఁ గరిగి దానితోఁ బహువిధములగు వస్తువులనుజేసి, ఏకారణముచేతనో యావస్తువులను దిరిగి కరిగించి యెప్పటివలె కణికగాఁ జేసెననుకొనుము. ఆవస్తువులు చేయకముందును, కరిగిన తరువాతను అది బంగారుకణికయే యని

యెల్లయకుఁ దెలిసిన యంశమేకదా. ఆకణిక వస్తురూపముగ నున్నప్పుడు సయుక్తము అది 'బంగారమే' యని విమర్శకునకెట్లు విదితమో, అట్లే సృష్టికి పూర్వాపరములయందు సకలకల్పనాధిష్ఠానమగు బ్రహ్మమే సత్యమనియు, సృష్టి కల్పితము కనుక మిథ్యయనియు విమర్శకునకు విదితమే. ౨౧

౨౨. ఇట్లు దేహమే యాత్మయని, మనస్సు ఆత్మయని, ఇంద్రియము లాత్మయని, శూన్యమే యాత్మయని వాదించు వారల మతములు నిరాకరింపఁబడెను. ఇప్పుడు, దేహేంద్రియాదులకంటె విలక్షణుఁడయినను పరిమాణమున ఆత్మ దేహసమానుఁడే యనెడి జైనమతసిద్ధాంతమునుబట్టి ఆత్మకు పరిచ్ఛేదము ప్రాప్తించగా,పరిచ్ఛిన్నవస్తువు బ్రహ్మము కానేరదు. కల్పకుఁడు వేఱొకఁడు లేనందున, ఆ పరిచ్ఛిన్నవస్తువు, సర్వకల్పనమునకును ఆధారము కానేరదు, అను శంకకుత్తరము:—

మూ. స్థానావచ్ఛేదదృష్టిః స్యాదింద్రియాణాం తదాత్మతామ్,
గతా ధీ స్తాం హి పశ్యన్ జ్ఞో దేహమాత్ర ఇవేక్ష్యతే.

తా. ఇంద్రియములకు బాహ్యగోళకముల ద్వారముగనే బాహ్యార్థదర్శనము కలదుకాని స్వయముగ తాము వస్తువులను జూడలేవు. కావున చక్షురాదీంద్రియములకు దేహతాదాత్మ్యమువలన దేహపరిమాణమువంటి పరిమాణముకలదు. ఇంద్రియ తాదాత్మ్యమును బొందిన యాబుద్ధినిఁ బ్రకాశింపఁజేయు ఆత్మ తాను పరిమాణము లేనివాఁడైనను భ్రాంతివలన దేహపరిమాణమువంటి పరిమాణముగలవానివలె దోఁచును. మధ్యమ పరిమాణముగల ఘటాదికమునకువలె ఆత్మకును అవయవము లుండవలసివచ్చును. అవయవసహితమగునేని ఆత్మ అనిత్యముకావలసి వచ్చును. ఆత్మ అనిత్యమగునేని

పరలోకసాధనమగు కర్మము అనావశ్యకము కావలసియుండును. కనుక, ఉక్తమగు దేహాద్యుపాధిలేక ఆత్మకు పరిచ్ఛిన్నత్వము సంభవింపదు. నిరవయవ బ్రహ్మమునకు ఉపాధిసంసర్గము వాస్తవముకాదు. కావున బ్రహ్మము సర్వజగత్తునకు కల్పనాధిష్ఠానమును, నిత్యమును అని తాత్పర్యము. ౨౨

అవ. దిగంబరమత నిరాకరణముచే ఆత్మలు అనేకములని నిరూపించుటను శాక్యులు - బౌద్ధులు సహింపక వాదసన్నద్ధు లగుచున్నారు:—

మూ. క్షణికం హి తదత్యర్థం ధర్మమాత్రం నిరంతరమ్,
సాదృశ్యాద్దీపవత్తద్ధీస్తచ్ఛాంతిః పురుషార్థతా. ౨౩

తా. జ్ఞానజ్ఞేయములు క్షణమాత్రమే యుండునవి. అనఁగా, ప్రతివస్తువు ప్రతిక్షణము పుట్టుచు నశించుచు నుండునని భావము. ప్రతిక్షణము పుట్టుచు నశించునేని యిది యావస్తువే యను ప్రత్యభిజ్ఞాన మెటులఁ గలుగుననఁగా ఉత్తరము:—ఈదీపము యాదీపమే యనునట్లు సాదృశ్యము వలన ఆవస్తువే యిదియను జ్ఞానము కలుగును. కారణసహితమగు ఆవస్తువు స్ఫురింపకపోవుటయే మోక్షము. ౨౩

అవ. దూషణవిభాగజ్ఞానమునకై సిద్ధాంతి బౌద్ధమతమును విభజించి చూపుచున్నాఁడు:—

మూ. స్వాకారాన్యావభాస్యం చ యేషాం రూపాది విద్యతే,
యేషాం నాస్తి తతశ్చాన్యత్తూర్వాసంగతిరుచ్యతే. ౨౪

తా. ఏమతమున జ్ఞానముచే భాసింపఁదగిన రూపరసాదులు గలవో, ఏమతమున జ్ఞానమాత్రమేకాని రూపాది బాహ్యవస్తువులు లేవో, ఏమతమున నేమియులేక శూన్యమే యుండునో యా మతత్రయ భేదమున

బాహ్యార్థముగలదని వాదించెడి బౌద్ధమతము ఘటింపదని ముందు చెప్పఁబడు చున్నది. ౨౪

అవ. ఆమతము ఘటింపదనుటనే నిరూపించుచున్నారు:—

మూ. బాహ్యాకారత్వతో జ్ఞప్తేః స్మృత్యభావః సహాక్షణాత్,
క్షణికత్వాచ్చ సంస్కారం నైవాధత్తే క్వచిత్తు ధీః. ౨౫

తా. జ్ఞానము బాహ్య వస్త్వాకారముగలదిగా నుండవలెను గనుకను, జ్ఞేయ పదార్థములు పుట్టకముందు అజ్ఞానము మాత్రమే యుండి, మఱి యేప్రమాణమును సిద్ధింపదు గనుకను అందఱు జ్ఞానమాత్రాస్తిత్వ వాది మతములోఁ బ్రవేశింపవలసి యుండును. ప్రతిపదార్థమును క్షణికము గనుక స్మృతియనుమాటయే లేకపోవలయును. బుద్ధియు సంస్కారమును ఎక్కడనైనను గలిగింపకపోవలయును. మఱియు, పదార్థములన్నియు క్షణమేయుండి, యుత్తరక్షణమందు తిరిగితిరిగి పుట్టును. అని చెప్పెడి నీవు కూడ ఉత్తరక్షణమున తిరిగి పుట్టువాఁడవే కనుక, నొక రనుభవించిన వస్తువు మఱియొకరిచే స్మరింపఁబడదు కనుక స్మృతియును లేకపోవలెను గనుక ఈదృశదోషగ్రస్తమగు మీమతము సరికాదు. ౨౫

అవ. సంస్కారము నెక్కడను కలిగింపకపోవలెనను టను వివరపరుచుచున్నారు:—

మూ. ఆధారస్యాక్షణికత్వాచ్చ తుల్యతానిర్నిమిత్తతః,
స్థానే వాక్షణికత్వస్య హానం స్యాన్న తదిష్యతే. ౨౬

తా. సంస్కారము పుట్టుటకు స్థానమగు ఆత్మగాని, అంతఃకరణము గాని సంస్కారమును గలిగించునపుడు లేనందున స్మృతి కలుగకపోవలెను,

అని శౌద్ధమతములో బాహ్యవాదిమతము దూషింపఁబడెను. ఇఁకమీఁదఁ జేయఁబడు దూషణము క్షణిక విజ్ఞానమాత్రవాదమందును సమానమేయని తెలియవలెను. గుణములను బట్టికొని, అవయవములను బట్టికొని లోకములో సాదృశ్యము సిద్ధించును. నిర్గుణములు నిరవయవములునగు విజ్ఞానములకు ఆ సామ్యము ఘటింపదు గనుక పూర్వక్షణమందున్నదే ఉత్తరక్షణమందున్నదని సంస్కారాదికము క్షణికవాదిమతమందు ఘటింపదు. ద్రష్టయుఁ బూర్వక్షణమందున్న వానికంటె ఉత్తరక్షణమందున్నవాఁడు వేఱుకనుక సాదృశ్యనిమిత్తమగు ప్రత్యభిజ్ఞానమయినను నీమతమందు దుర్ఘటమే. ఏల యన, పూర్వాపరక్షణములందు ద్రష్ట యొక్కఁడే యగునేని సంస్కార స్మృతులు ఘటించును. క్షణికత్వవాదము వదలఁబడెనేని పూర్వాపరక్షణము లందలి ద్రష్ట యొక్కఁడేయను ప్రత్యభిజ్ఞ కలుగును. నీవు క్షణికత్వపరిహార మునే యంగీకరింపవుకదా. ౨౬

అవ. సర్వము క్షణికమను భావనచే జగత్తు శాశ్వత మనే భ్రాంతి తొలఁగును. ఇదియే ముక్తియని నీవు (బౌద్ధుఁడు) చెప్పునట్టి మాటయు తగదని చెప్పుచున్నారు:—

మూ. శాంతే శ్చాయత్నసిద్ధత్వాత్సాధనోక్తిరనర్థికా,
వ్యక్తైకస్మిన్సమాప్తత్వాచ్ఛాంతేరన్యానపేక్షతా. ౨౭

తా. ప్రతిపదార్థమును ఒక్కక్షణమేయుండి నశించి తిరిగి పుట్టుచుండునని నీక్షణికవాదమందు శాంతి యన్యము నపేక్షింపదు. ప్రతిక్షణ వినష్టజాతములగు పదార్థములకు సంతతభావము వాస్తవమే కానందున అయత్నసిద్ధమగు శాంతికి సాధనాపేక్ష లేనేలేదు. కనుక భ్రాంతి తగ్గుటవలన శాంతిరూపమోక్షమనెడి నీమాట పొసఁగదు. ౨౭

అవ. మఱియు, ఈబౌద్ధమతమందు లౌకికవ్యవహారమం దును సాధ్యసాధనభావము ఘటింపదని చెప్పుచున్నారు:—

మూ. అపేక్షా యది భిన్నేఽపి పరసంతాన ఇష్యతామ్,
సర్వార్థే క్షణికే కస్మిం స్తథాఽప్యన్యానపేక్షతా. ౨౮

తా. ఈబౌద్ధమతమందు అత్యంతభిన్నములగు కార్యకారణములలో దధిభావము క్షీరకారణమును గోరునట్లు ఇసుకనుగూడ నపేక్షించి యిసుక నుండి పెరుగు పుట్టవలసియుండును. లోకప్రసిద్ధివలన క్షీరమునుండియే పెరుగు పుట్టుచు నితరమగు యిసుకనుండి కలుగదేని సర్వము క్షణికమగు టచే దధియుం బూర్వక్షణవర్తియగు క్షీరముసైనను దనకుం గారణముగ నపేక్షింపఁదగదు. ౨౮

అవ. బౌద్ధమతమందు కార్యమునకు అన్యాపేక్ష లేక పోవుటకుం గారణమును జెప్పుచున్నారు:—

మూ. తుల్యకాలసముద్భూతావితరేతరయోగినౌ,
యోగాచ్చసంస్కృతో యస్తుసోఽన్యంహీక్షితుమర్హతి.

తా. ఈబౌద్ధమతమందు సమకాలమందుం బుట్టినవి పరస్పరసంబంధ ముగలవి యగును. ఎట్లనఁగా, బీజాంకురమును మేఘమును నొకే సమయ మందుఁ గలిగి మేఘముచేత ఉదకమియ్యఁబడి పెంపఁబడును. ఇట్లు అంకు రము అన్యమగు మేఘోదకము నపేక్షింపవచ్చును. క్షణికములగు పదా ర్థములు భిన్నకాలమందుఁ గలిగినవగుటచే వీనికిఁ బరస్పర సంబంధము గాని, ఉపకార్యోపకారక భావముగాని లేనందున నివి యన్యమున పే క్షింపఁదగదు. ౨౯

అవ. ఇట్లు క్షణికమతమును నిరాకరించి, శూన్యమత మును నిరాకరింపఁబోవుచు మొదట స్వమతము యుక్తమని నిరూపించుచున్నారు:—

మూ. మృషాఽధ్యాసస్తు యత్ర స్యాత్తన్నాశ స్తత్ర నో మతః,
సర్వనాశే భవేద్యస్య మోక్షః కస్య ఫలం వద. 30

తా. కర్తృత్వాది సంసారము మిథ్యగానే బ్రహ్మమందుఁ గల్పిత మో ఆబ్రహ్మమందే ఆకల్పితమృషావస్తువు లయించునని వేదాంతుల సమ్మ తము. అనఁగా అజ్ఞానమువలన బంధముగలదని భ్రమపడినవానికి గురు ప్రసాదమువలన తత్త్వజ్ఞానముచేఁ గలిగిన స్వరూప సాక్షాత్కారమే మో క్షమని భావము. సర్వనాశమని చెప్పెడి శూన్యవాదిమతములో, అనుభ వించు పురుషుఁడును లేడు. స్వరూపస్థితిరూపమగు మోక్షమును లేదు. ఆధే యము (కల్పితవస్తువు), అధిష్ఠానము (ఆధారము) ఈ రెండును నశ్వరములే. ఇట్లు చెప్పువాఁడును లేనివాఁడే యని వేదాంతి చేసెడి యాక్షేపము. 30

అవ. పరమార్థస్వభావమొకటి కలదనుటకు ప్రమా ణము లేనందున సర్వనాశమే మోక్షమనుట తప్పక సిద్ధించు ననుటకు ఉత్తరము:—

మూ. అస్తి తావత్స్వయం నామ జ్ఞానం వాఽఽత్మాఽన్య
దేవ వా, భావాభావజ్ఞత స్తస్య నాభావ స్త్వధిగమ్యతే.

తా. స్వయం (తాను) అను వస్తువొకటి కలదని సర్వవాది సమ్మ తము. కాని. ఆవస్తువును జ్ఞానమని, ఆత్మయని, శూన్యమనియు వికల్ప ముగఁ జెప్పెదరు. ఆవస్తువు లేదనుట మాత్రము అంగీకరింపఁ దగినది కాదు. ఏలయన; పదార్థములయొక్క సత్తను అభావమును నెఱిఁగెడి

వస్తువొకటి కలదు. కాదేని, సాక్షియగు స్థిరవస్తువు లేనపుడు వ్యవహార మేదియు లేకపోవలెను.　　౩౧

అవ. సకలపదార్థములయొక్క భావాభావములను గని పెట్టుదాని అభావముకూడ మఱియొకదానికి కలుగునను శంక రాఁగా, దేనికి సకలభావాభావములు గోచరములో అదియే తత్త్వమగుటచే శూన్యవాదమునకు ఇంచుకయేని యవకాశము లేదని పరిహరించుచున్నారు:—

మూ. యేనాధిగమ్యతేఽభావ స్తత్సత్తాన్యత్తన్న చేద్భవేత్,
　　భావాభావానభిజ్ఞత్వం లోకస్య స్యాన్న చేష్యతే.

తా. సర్వముయొక్క అభావమును దెలియునది సద్రూపమగు పరమాత్మయే యగును. అటుల కాదేని లోకముయొక్క స్థితియు, అభావమును దెలియఁబడకఁబోసి హానియేమి? అందువేని, అట్లనరాదు. వీని యభావమునుదెలిసెడి జ్ఞాత జ్ఞానస్వరూపుఁడే. వాఁడు లేఁడని యన శక్యముకాదు. తానుండినవాఁడై లేననుట తగదు. ఏది కాదని నిరాకరించునో అదియే ఆత్మస్వరూపమగుటచేత నట్టివస్తువు నెవరును లేదనరాదు.　　౩౨

అవ. పదార్థముల భావాభావముల నెఱిఁగెడి వస్తువొకటి కలదని తెలిసెనుకాని, యావస్తు వెట్టిదో విశేషాకారముగఁ దెలియలేదు. అను శంకపైని ఆవస్తుస్వరూపమును నిరూపించుచున్నారు:—

మూ. సదసత్సదసచ్చేతి వికల్పాత్ప్రాగ్యదిష్యతే,
　　తదద్వైతం సమత్వాత్తు నిత్యం చాన్యద్వికల్పితాత్.

తా. సాక్షిరూపము, జగత్తు నను పదార్థద్వయము సత్తా? అసత్తా? సదసత్తా? యని వికల్పించి, యీవికల్పములకంటె పూర్వమెద్ది కలదో యది అద్వైతము. వికల్పముకంటె పూర్వము వైషమ్యకారణము లేదుకనుక ఏకమనఁబడును. అయ్యది నిత్యము జ్ఞానస్వరూపము నగును. నిత్యమనఁగా కాలత్రయాఽబాధ్యము. కావున ఆత్మతత్త్వము సత్యజ్ఞానానంతానంద స్వరూపము అని భావము. ఇందుకు సంశయింపఁబనిలేదు. 33

అవ. పలువిధములగు ద్వైతవస్తువులు భాసించుచుండఁగా అద్వైత మెటుల ఘటిల్లునను శంకకు సమాధానము:-

మూ. వికల్పోద్భవతోఽసత్త్వం స్వప్నదృశ్యవదిష్యతామ్,
ద్వైతస్య ప్రాగసత్త్వాచ్చ సదసత్త్వాదికల్పనాత్. 34

తా. వికల్పరూపముగఁ బుట్టుటచేతను, సత్తా? అసత్తా? యను వికల్పముకంటెఁ బూర్వము లేనందునను స్వప్నప్రపంచమువలె బాహ్యాద్వైత ప్రపంచము మిథ్యయని తెలియవలయును. దృశ్యమంతయు ఆరోపితమగుటచే మిథ్యయనియు, నీసకలదృశ్యకల్పనకు ఆధారమగు ఆత్మ సత్యమనియు భావము. 34

అవ. యుక్తిమాత్రముననేకాక శాస్త్రమువలన సయితము ద్వైతము మిథ్యయే యని నిరూపించుచున్నారు:—

మూ. వాచారంభణశాస్త్రాచ్చ వికారాణాం హ్యభాసతా,
మృత్యోః స మృత్యుమిత్యాదేర్మమ మాయేతి చ
స్మృతేః. 35

తా. "వాచారంభణం వికారో నామధేయం" (ఛాం. ౬-౧-౪) అను

వేదవాక్యమువలన వికారములన్నియు మిథ్యయేకాని వాస్తవముకాదు. శ్రుతి యందు 'మృత్తికేత్యేవ సత్యమ్'' అని కారణమగు మృత్తుమాత్రమే సత్యము అని ఏవకారముండుటవలన ''వాచారంభణం'' అనుపదమునకు ''అసత్యము'' అని యర్థము చెప్పవలెను. మఱియు, ''మృత్యోః స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి''(బృహ. ౬-౪-౧౯)అని ద్వైతవిలోకనము నిందింపఁ బడెను. ద్వైతము సత్యమగునేని యీ నింద తగనిది యగును. కావున ద్వైతము అనృతమని తాత్పర్యము. మూలములో 'మృత్యుమిత్యాది' యని ఆదిశబ్దముండుటవలన ''నేహ నానాఽస్తి కించన'' (బృహ. ౬-౪-౧౯) యనెడి సాక్షాత్తు ద్వైతమును నిషేధించుశాస్త్రము గ్రహింపఁబడును. ఇంత యేకాక ''మమ మాయా దురత్యయా'' (గీత. ౭-౧౪) అను చోట ''మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే'' అని గుణత్రయ స్వరూపము సకలకార్యసహితమునగు మాయ పరమాత్మజ్ఞానముచేఁ దొలంగును అని భగవంతుని అనుశాసనమున్నదికనుక మాయికమగు ద్వైతము అసత్యమే యని భావము. సత్యమగునేని కార్యములతోఁ గూడిన మాయ తొలఁగుననెడిమాట నిరర్థకము కావలసివచ్చును. ౩౫

అవ. శ్రుతియుక్తులచే నిట్లు ద్వైతము మిథ్యయని నిరూపించుటచే అద్వైతము నిశ్చయింపఁబడుటవలన ఆత్మకు విశుద్ధి సిద్ధించునని చెప్పుచున్నారు:—

మూ. విశుద్ధిశ్చాత ఏవాస్య వికల్పాచ్చ విలక్షణః,
ఉపాదేయో న హేయోఽత ఆత్మా నాన్యైరకల్పితః.

తా. వివిధముగఁ గల్పింపఁబడిన జగత్తు అసత్యము. ఈకల్పనమున కధిష్ఠానమగుటచే దీనికి విలక్షణముగ సత్యమగు ఆత్మ విడువఁబడఁదగనిదియుం గ్రహింపఁబడఁదగనిదియు నగును. మూర్తిమంతములకే హేయోపాదేయ

త్వము లుండునుగాని అమూర్తమగు ఆత్మకీధర్మములు లేవు. ఇతరముచేఁ గల్పింపఁబడమిచే సిద్ధమగు ఆత్మ కాలత్రయాబాధ్యము.

ప్ర. 1 ఆత్మ యేల గ్రహింపఁదగనిది? ఏల విడువఁదగనిది?

ఉ. ఆత్మకు ఆకారములేనందున గ్రహింపఁదగదు. విడువఁదగదు.

ప్ర. 2 ఆత్మ పరిశుద్ధమెట్లగును?

ఉ. సర్వ వికల్పాధిష్ఠానమగు ఆత్మ కలదా? లేదా? శుద్ధమా? అశుద్ధమా? యని వికల్పించుటకు అర్హముకానందున పరిశుద్ధమగును. 3౬

అవ. ఆత్మ యేల వికల్పనార్హము కాదనఁగా, ఆత్మయందు వాస్తవమగు అజ్ఞానము లేనందున వికల్పార్హము కాదని చెప్పుచున్నారు:—

మూ. అప్రకాశో యథాఽఽదిత్యే నాస్తి జ్యోతిఃస్వభావతః,
నిత్యబోధస్వరూపత్వాన్నాఽజ్ఞానం తద్వదాత్మని. 3౭

తా. జ్యోతిఃస్వరూపుఁ డగుటవలన సూర్యునకు చీఁకటి లేనట్లు, నిత్యబోధస్వరూపుఁ డగుటవలన ఆత్మకు అజ్ఞాన మెప్పుడును లేదు. 3౭

అవ. నిత్యబోధస్వరూపత్వమువలన అజ్ఞానము లేనట్లు నిర్వికారస్వభావమగుటవలన కూటస్థప్రచ్యుతి రూపావస్థాంతరప్రాప్తియు లేదని చెప్పుచున్నారు:—

మూ. తథాఽవిక్రియరూపత్వాన్నావస్థాంతరమాత్మనః,
అవస్థాంతరవత్త్వే హి నాశోఽస్య స్యాన్న సంశయః.

తా. నిర్వికార స్వరూపుఁడగు ఆత్మకు మఱియొక యవస్థ కలుగదు. కలిగెనేని నాశము తప్పదు. అట్లైన నిత్యత్వశ్రుతికి భంగమువచ్చును. 3౮

అవ. మోక్షముకూడ నవస్థాంతర మేకనుక, అవస్థాంతరము లేదని యెట్లు చెప్పవచ్చును. అను శంకకు త్తరము:—

మూ. మోక్షో౽వస్థాంతరం యస్య కృతకః స చలో హ్యతః,
న సంయోగో వియోగో వా మోక్షో యుక్తః కథంచన.

తా. మోక్షము అవస్థాంతరమని చెప్పెడి నీమతమందు మోక్షము 'కృతకః' అనఁగా చేయఁబడునదికదా, అట్లైన మోక్షము అనిత్యమగుచు పరమపురుషార్థము కాకఁబోవును. అవస్థాంతరము మోక్షము కాకున్నను బ్రహ్మముతో సంయోగముగాని ప్రకృతితో వియోగముగాని మోక్షమనెదవేమో అదియును సరికాదు. 3౯

అవ. ఎందుచేత ననఁగా:—

మూ. సంయోగస్యాప్యనిత్యత్వాద్వియోగస్య తథైవ చ,
గమనాగమనే చైవ స్వరూపం తు న హీయతే. ౪౦

తా. కల్పిత పదార్థమెల్లను అనిత్యమే యను నియమము కలదు. కనుక సంయోగ వియోగములు మోక్షము కానేరదు. జీవునకు సంసారము నుండి పరమాత్మునిఁగూర్చి పోవుటయైనను, భక్తానుగ్రహమువలన జీవుని యొద్దకు పరమాత్మ వచ్చుటయైనను క్రియలగుచుఁ బుట్టింపఁబడుటచే మోక్షమనఁబడవు. జీవాత్మపరమాత్మలు వికారవిహీనులగుటవలన వీరికి గమనాగమనములు సంభవింపవు. ఇట్లు పరమతమందు దోషమును జూపి స్వమతము నిర్దోషమని నిరూపించుచున్నారు. స్వరూపము నశింపనిది కనుక, కల్పితములగు నామరూపములు స్వప్నవస్తువులవలె మిథ్యయని ఉపేక్షించుటవలన సర్వకల్పనాధిష్ఠానమగు స్వరూప పరిజ్ఞానమే మోక్షమని భావము. ౪౦

అవ. ఆత్మస్వరూపమనెడి మోక్షము కార్యముకాదు, కావున అనిత్యమునుం గాదనుటకు హేతువును జెప్పుచున్నారు:—

మూ. స్వరూపస్యానిమిత్తత్వాత్ ననిమిత్తా హి చాపరే,
అనుపాత్తం స్వరూపంహి స్వేనాత్యక్తం తథైవచ. ౪౧

తా. ఆత్మస్వరూప మొకదానినుండి పుట్టదు కనుక నిత్యము. అవస్థలు కారణమునుండి పుట్టునవి కనుక అనిత్యములు. ఎట్లనఁగా, ఎవరిచేతను గ్రహింపఁదగనిది, విడువఁదగనిదియే ఆత్మస్వరూపము కావున నిత్యము. ౪౧

అవ. ఆత్మకుఁ జెప్పఁబడిన స్వరూపలక్షణము జూపఁబడుచున్నది:—

మూ. స్వరూపత్వాన్న సర్వస్య త్యక్తుం శక్యో హ్యానన్యతః,
గ్రహీతుం వాతతోనిత్యోఽవిషయత్వాత్పృథక్త్వతః.

తా. ఆరోపితసర్పాదికమునకు అధిష్ఠానరజ్జ్వాదికమే స్వరూపమగునట్లు అవిద్యాకల్పితాకాశమారుతాది జగత్తునకు అధిష్ఠానమగు ఆత్మయే స్వరూపము గనుక భేదరహితమగు ఆత్మ హేయమును గాదు, ఉపాదేయమును గాదు. ఏలయనఁగా, విషయమగు వస్తువు గ్రహింపఁదగును. తనస్వరూపము కానిది విడువఁదగును. కాని విషయి యగుఆత్మ విషయము కానందున గ్రహింపఁబడదు. విషయముకాక విషయి యగుఆత్మ విడువఁబడదు.

అవ. ఆత్మ నిత్యమనుటకు హేత్వంతరము:—

మూ ఆత్మార్థత్వాచ్చ సర్వస్య నిత్య ఆత్మైవ కేవలః,
త్యజేత్తస్మాత్క్రియాఃసర్వాః సాధనైఃసహ మోక్షవిత్.

తా. వచ్చుచుం బోవుచుండునట్టి భోగ్యజాతమంతయుం ననిత్యము. ఆత్మ (తన)కొఱకే యగునట్టి యా భోగ్యజాతమందు రాకపోకలు లేక సత్తాస్ఫూర్తిస్వరూపుఁ డగుటచేత నిత్యుఁడగును. 'కేవలః' అనఁగా ఉపాధి సంబంధము లేనివాఁడు. కావున ఆత్మ నిత్యము. ఆత్మేతరమంతయు నని త్యము. ఆత్మకు ఉపాధియగు సర్వము స్వరూపముగ భావించుటయే మోక్షము. కావున, ఆత్మజ్ఞానము నెఱఁగినముముక్షువు సాధనములను ఆత్మేతర కృత్యములను విడువవలయును. ౪3

అవ. ఈకారణమునను ముముక్షువు క్రియలను మానవలెనని చెప్పుచున్నారు:—

మూ. ఆత్మలాభః పరో లాభ ఇతి శాస్త్రోపపత్తయః,
అలాభోఽనాత్మలాభస్తు త్యజేత్తస్మాదనాత్మతామ్.

తా. ఆత్మలాభము గొప్పలాభమని శాస్త్రముచు యుక్తులును బోధించుచున్నవి. నిత్యసిద్ధమగు ఆత్మలాభమునకు ఇతరబోధ యెందు కనెదవా? వినుము. అనాత్మలాభమనఁగా తనను దాఁ దెలియకపోవుటవలన నిష్పన్నమగు అహంకారాదికమందు అభేదముగ స్ఫురించెడి ఆత్మలాభము. ఇది సంసారదుఃఖకారణము మాత్రమే కాక స్వతఃసిద్ధపరమానందావిర్భావమునకు ప్రతిబంధకముకూడ నగుటవలన లాభమే కాదు. నష్టమే. కావున, అవిద్యాపరికల్పితమగు అహంకారాద్యభిమానమును జ్ఞానబలము నాశ్రయించి విడువవలయును.

1 ప్ర. ఆత్మలాభమే గొప్పదియని చెప్పెడి శాస్త్రమెద్ది?

ఉ. "ఆత్మలాభాత్పరం న విద్యతే" యనెడి (ఆప. ధ. ౧-౧౨-౨) స్మృతి.

2 ప్ర. ఇటువంటి యుక్తి యేది?

ఉ. తాను ఉంటే ధనాదికము పోయినను తిరిగి సంపాదించుకొన

వచ్చును. కాని ధనమునే కాపాడుటకై (తాను నశింపఁగా) ధనము దక్కి-నను తాను లేనందున ఆధనోపయోగము తనకు లేకపోవును. కావున నీ రెండింటిని విమర్శింపఁగా ఆత్మలాభమే ధనాదిలాభముకంటె నెక్కువ యనుయుక్తి. ఇట్టి శాస్త్రయుక్తులు పెక్కులుగలవని మూలమందు "ఉపపత్తయః" అనెడి బహువచనముచే సూచింపఁబడెను.

3 ప్ర. అహంకారత్యాగమునకు సాధనమెద్ది?

ఉ. ప్రమాణజనిత బ్రహ్మాత్మత్వజ్ఞానబలమున అజ్ఞానమును దొలఁగించుటయే సాధనము. ४४

అవ. ఆత్మతత్త్వ బ్రహ్మస్వరూపజ్ఞానమే ఆత్మలాభము (పరమార్థము) అనియు, జీవాత్మపరమాత్మలకు ఐక్యజ్ఞానము మోక్షసాధనమనియు, ఆత్మ అద్వయానందస్వరూపుఁడనియు, ఆత్మయందు అజ్ఞానపరికల్పితసంసారము మిథ్యయే కాని వాస్తవము కాదనియు తమ సిద్ధాంతమును బోధించి, యీ మతమునందే ముముక్షువులకు స్థిరబుద్ధికలుగుటకై పరమతములను ఖండింపఁబూనిన భాష్యకారులగు శ్రీశంకరాచార్యులు మొదట సాంఖ్యమతమును ఖండించుచున్నారు:—

## సాంఖ్యమతఖండనము.

మూ. గుణానాం సమభావస్య భ్రంశో న హ్యుపపద్యతే,
అవిద్యాదేః ప్రసుప్తత్వాన్న చాన్యో హేతురిష్యతే.

తా. సత్త్వరజస్తమోగుణత్రయాత్మకమును అచేతనమును నగు ప్రధానము స్వతంత్రమై పురుషునకు భోగమోక్షముల నిచ్చుటకై మహదాదిరూపముగఁ బరిణమించునని సాంఖ్యమతసిద్ధాంతము. ఆ సాంఖ్యమతము

యుక్తమైనదికాదు. ఏలయనఁగా:—గుణత్రయములో నేదియో యొకటి విజృంభించినపుడే సృష్ట్యాదికము కలుగునుగావున సృష్టిపూర్వకాలమున గుణత్రయసామ్యావస్థ నిశ్చయింపఁబడినది. సామ్యావస్థకు భ్రంశము అనఁగా పూర్వావస్థ మాఱి మఱియొకవిధమున నుండుట. ఆ సామ్యావస్థగల ప్రధానము నిర్హేతుకముగ మాఱునా? అట్లేని సర్వదా పరిణమించుచునే యుండవలెను. అట్లు సదా పరిణమించుటలేదు. కనుక సహేతుకముగ పరిణమించునంటే, అవిద్యాప్రాప్యపురుషులే కారణమగుదురా? ఆ సామ్యావస్థయందు (సృష్టికి పూర్వకాలమందు) అవిద్య లీనమై లేదుకదా, పురుషులు (జీవులు) ఉదాసీనులుకదా, కావున దీనికి హేతువు లేనేలేదు. జీవులకంటె నన్యమగు ఈశ్వరాదికము కారణమందువేని నిది అపసిద్ధాంతమే యగును. ఇంతియే కాక నీమతమున అచేతనమగు ప్రధానమే స్వతంత్రము గనుక ఈశ్వరాపేక్షయు లేదు. కావున సాంఖ్యమతము నిలువకపోవునని తాత్పర్యము. ౮౫

అవ. సృష్ట్యాదికమును గుఱించి గుణములు మూఁడును తమలోఁదాము ఒకదాని కొకటి కారణమగునందువేని అదియును వగవని చెప్పుచున్నారు:—

మూ. ఇతరేతరహేతుత్వే ప్రవృత్తిః స్యాత్సదా న వా,
నియమో న ప్రవృత్తీనాం గుణేష్వాత్మని వా భవేత్.

తా. గుణములు ఒకదానికొకటి హేతువగునేని విశేషము లేనందున సర్వదా పరిణామ మగునా కాదా? సృష్టిస్థితి సంహారములు ఏకకాలమందు సంభవింపవు గనుక సర్వదా సృష్టిస్థితి సంహారములు కలుగుననరాదు. సృష్ట్యాదులకు గుణములందుగాని ఆత్మయందుగాని హేతుత్వ నియమము లేదు. గుణములకంటెను పురుషునికంటెను వేఱైన తత్త్వము కారణముకాదు.

ఇట్లు సాంఖ్యులు చెప్పెదరు. గుణములందుగాని పురుషులందుగాని యుండి నియమించుననెడి కారణము వేఱొకటి సాంఖ్యమతమందు లేదని తాత్పర్యము. ౪౭

అవ. ఒకవేళ ప్రధానవృత్తి కారణమైనను, అప్పుడు ప్రసక్తించు దోషములు నివర్తింపఁదగవని చెప్పుచున్నారు:-

మూ. విశేషో ముక్తబద్ధానాం తాదర్థ్యే న చ యుజ్యతే,
అర్థార్థినో స్త్వసంబంధో నార్థి జ్ఞో నేతరోఽపి వా.

తా. ప్రధానము పురుషార్థమై ప్రవర్తించునేని 'వీరలుబద్ధులు,వీరలు ముక్తులు' అను విభాగము సంభవించదు. ఒక్క ప్రధానము సాధారణముగ సర్వపురుషులనుగూర్చి ప్రవర్తింపఁగా బద్ధముక్త వ్యవస్థ కలుగదని భావము. కాదేని, ఎల్లపుడు బద్ధులైనను ముక్తులైనను గావలసియుండును. మఱియు నీ సాంఖ్యమతమున నొకటి ముఖ్యమనియుం మఱియొకటి దానికి అంగమనియుం వ్యవస్థ తగదు. అర్థమనఁగా సుఖసాధనరూపపదార్థము. అది కోరువాఁడు అర్థి యనఁబడును. వీనికి ఉపకార్యోపకారక భావము సంబంధము. ఈ సంబంధము ప్రధానవాదమందు కుదురదు. ఏలయనఁగా జ్ఞానైక్య స్వభావుఁడగు పురుషునకు సుఖసాధన రూపార్థముయొక్క కోరికలేదు. జడమగు ప్రధానమునకును ఆకోరిక సంభవింపదు. కావున ప్రధానమునకు పదార్థప్రవృత్తి లేదు. ౪౭

అవ. ఇట్లు ప్రధానమునకు పరార్థప్రవృత్తి యుండునేని వ్యవస్థ లేకపోవలసివచ్చును. ఇపుడును ఆ వ్యవస్థ ఘటింపదనియే చెప్పుచున్నారు:—

మూ. ప్రధానస్య చ పారార్థ్యం పురుషస్యావికారతః,
న యుక్తం సాంఖ్యశాస్త్రేఽపి వికారోఽపి న యుజ్యతే.

తా. పురుషునకు ప్రధానకృతాతిశయరూపవికారసంబంధము లేనందున పరార్థత్వము సంభవింపదు. పురుషునకు ప్రధానమునుగుఱించి ప్రభుత్వ మంగీకరింపఁబడెనేని వికారముగలవస్తువు అనిత్య మగుటవలనను ప్రధానమునకు పరార్థత్వముసంభవింపదు. 'సాంఖ్యశాస్త్రేఽపి' యని అపిశబ్దస్వారస్యమువలన వేదబాహ్యము లగుచుఁ బురుషకల్పితములగు నితరశాస్త్రములందును సాంఖ్యశాస్త్రమందువలె వేదమూలకత్వము లేదని సూచింపఁబడెను. ౪౮

అవ. ప్రధానపురుషులకు సంబంధము లేదని వివరించుచున్నారు:—

మూ. సంబంధానుపపత్తేశ్చ ప్రకృతేః పురుషస్య చ,
మిథోఽయుక్తం తదర్థత్వం ప్రధానస్యాచితత్వతః. ౪౯

తా. అసంగోదాసీనస్వభావముగల పురుషునకును, అచేతనమగు ప్రకృతికిని బరస్పరసంబంధము తగదు కనుక ప్రధానము పురుషుని నిమిత్తము ప్రవర్తించునని చెప్పరాదు. కావున, ప్రధానపురుషులకు అర్థార్థిభావము కల్పింపరాదు. అర్థార్థిభావమనఁగా పురుషునకు భృత్యునివలె ప్రధానము సుఖదుఃఖములను సంపాదించుట యని వెనుకటిశ్లోకమునఁ జెప్పఁబడెను. ౪౯

అవ. పురుషునకు వికారము లేదనుటనే విశదపరుచుచున్నారు:—

మూ. క్రియోత్పత్తౌ వినాశిత్వం జ్ఞానమాత్రే చ పూర్వవత్,
నిర్నిమిత్తే త్వనిర్మోక్షః ప్రధానస్య ప్రసజ్యతే. ౫౦

తా. పురుషుఁ డనిత్యుఁడని సాంఖ్యులు స్థిరపరిచిరి. "క్రియవలనఁ జేయఁబడినదెల్ల ఘటమువలె ననిత్యము" అను న్యాయమున పురుషుఁడు ఒకానొకక్రియవలనఁ బుట్టెనేని నశించునుగనుక సాంఖ్యమతమునకు విరోధము కలుగును. చలనక్రియకాని పరిణామక్రియకాని పురుషున కంగీకరింపరాదు. అంగీకరించితిమేని అనిత్యత్వము ప్రసక్తమగును. జ్ఞానక్రియ మాత్ర ముండునని చెప్పినయెడల అజ్ఞానము పుట్టినదా పుట్టనిదా? పుట్టిన యెడల ననిత్యమనియు, పుట్టకుంటే ప్రధానమునుగూర్చి పురుషునకు స్వామిత్వభాగమనియు నిదివఱకే చెప్పఁబడెను. ఇట్లు పురుషుఁడు అసంగోదాసీనుఁడై మఱియొక అతిశయప్రాప్తికిఁ బాత్రుఁడు కానందున ప్రవర్తకుఁడు కాకపోవుటవలన, ప్రదానము తనకంటె నితరహేతువు నంగీకరింపనందునను, ప్రళయకాలమున ప్రధానవికారములు నశ్వరములగుటచే ప్రవర్తకములు కానందునను, ప్రధానవృత్తికి హేతువులేదని చెప్పవలసి యున్నది. అట్లేని ప్రధానమునకు అవ్యవస్థయే కలుగునని ప్రతిపాదించుచున్నాఁడు. ప్రధానము తనకు నిమిత్తములేకయే ప్రవర్తించునెడల ఆ ప్రధానము సర్వదా చేయు వ్యాపారము నేత్రశక్తికలవారి కందఱికిఁ దప్పకఁ గనిపించుచునే యుండుటచేత మోక్షము లేకపోవలసివచ్చును. కావున వ్యవస్థలేని సాంఖ్యశాస్త్రము ముముక్షువులచే నాదరింపఁబడఁ దగదని భావము. ౫౦

## వైశేషికమత ఖండనము.

అవ పురుషుఁడు నిర్గుణుఁడని బోధించెడి సాంఖ్యమతమును నిరాకరించి, పురుషులు సగుణులని చెప్పెడి వైశేషికమతమును దూషించుచున్నారు:—

మూ. న ప్రకాశ్యం యథోష్ణత్వం జ్ఞానేనైవం సుఖాదయః,
ఏకనీడత్వతోఽగ్రాహ్యాః స్యుః కణాదాదివర్త్మనామ్.

తా. వైశేషికులు (తర్కశాస్త్రజ్ఞులగు కణాదాదులు) ఆత్మయందుండు జ్ఞానముచేత ఆత్మయందలి సుఖాదిగుణములు తెలియఁబడునని తలంతురు. అదియును సరికాదు. ఎట్లనఁగా, అగ్నియందుండు ఉష్ణగుణము అగ్ని ప్రకాశముచేతఁ దెలియఁబడదు. కాంతి, వేడిమి యనెడి గుణములు రెండును నొకయగ్నియందుండుటచే ప్రకాశ్యప్రకాశకభావము వాని రెండింటికిఁ దగనివిధమున వారల మతమున తమయందుండు సుఖాదిగుణములు స్వనిష్ఠజ్ఞానముచే గ్రహింపఁదగవు. భిన్నదేశమందుండు రూపాదివిషయము విషయిచే గ్రహింపఁదగును గాని, విషయిచేఁదనయందుండిన విషయములు గ్రహింపఁబడవు. ఏలయనఁగా ఇది గ్రాహ్యము, ఇది దీనిని గ్రహించునది యని భేదనియమము తటస్థింపనందున వైశేషికమతము ఆదరణీయము కాదు. ౫౧

అన. ఈశ్లోకములో అగ్నిదృష్టాంతముచే ఆత్మయందున్న జ్ఞానము తానుండు స్థలముకంటె నన్యమగు స్థలమునందుండు రూపాదివిషయములను గ్రహించునే కాని స్వనిష్ఠమగు సుఖాదులను గ్రహింపనేరదని యుపపాదింపఁబడెను. ఇపుడు జ్ఞానమును సుఖాదులును ఒకదానియందే యుండుటచేత నిది భాసకము ఇది భాస్యమనెడి భేదము సయితము ఘటింపదని చెప్పుచున్నారు:—

మూ. యుగపత్సమవేతత్వం సుఖజ్ఞానయోరపి,
మనోయోగైకహేతుత్వాదగ్రాహ్యత్వం సుఖస్య చ.

తా. (పూర్వశ్లోకమునుండి అన్వయింపవలెను):—

అసమవాయికారణమగు మనస్సంయోగము ఆత్మగుణమునుగూర్చి హేతువగుటవలన సుఖవిజ్ఞానములకు ఒక్కసారి సమవేతత్వము సంభవింపదు. కనుక సుఖమునకు అసమవాయికారణమగు మనఃసంయోగము నశింపఁగా సుఖముకూడ నశింపవలెను. సంయోగాంతరాసమవాయకారణజ్ఞానముచే సుఖము గ్రహింపఁదగదు. అపి శబ్దమువలన సమవాయము ప్రమాణము కాదని సూచింపఁబడెను. చకారమునవలన అవయవరహితములగు ఆత్మమనస్సులకు సంయోగము సంభవింపదు. సంయోగమున్నను వ్యాపకమగు ఆత్మకు విభాగము సంభవింపదు. విభాగములేదేని మఱియొక సంయోగము నయితము కలుగనందున జ్ఞానాదికార్యక్రమము సంభవింపదు. అన్యమతములో కార్యములు అసమవాయికారణమును మీఱియుండదనెడి నియమము గలదు. ఇందులోనును ఆవిధమున అణుపరిమాణమనఃసంయోగము అణుదేశమాత్రమున నుండుటవలన ఆ యణుకార్యముకూడ అణుమాత్రవర్తియగునేని సకలశరీరగతమగు ఆత్మవేదనప్రత్యక్షము కలుగకపోవలెను అను మొదలగు దోషగణము నిరూపింపఁబడెను. ౫౨

అవ. సుఖమువలె దుఃఖేచ్ఛాద్వేష ప్రయత్నములు కూడ స్వనిష్ఠజ్ఞానముచేత గ్రాహ్యములు కావని చెప్పుచున్నారు:—

మూ. తథాఽన్యేషాం చ భిన్నత్వాద్యుగపజ్జన్మ నేష్యతే,
గుణానాం సమవేతత్వం జ్ఞానం చేన్న విశేషణాత్.

తా. దుఃఖము మొదలగు నితరగుణములు పరస్పరము విలక్షణములగుటవలన జ్ఞానసుఖములవలె తన యుత్పత్తిస్థానమందే యున్నజ్ఞానముతో సమానముగ పుట్టనేరవు. ఆత్మ మనస్సంయోగము అనేకకార్యములకు

హేతువుకాదని చెప్పఁబడెను. చకారమువలన విషయివిషయములు ఏకాంశములు కావనిచెప్పిన యంశమును గ్రహింపవలెను. ఇచట జ్ఞానమనఁగా ఆత్మ యని చెప్పెదమన్నచో 'జ్ఞాతం సుఖం జ్ఞాతం దుఃఖం' అను వ్యవహారము వలన సుఖాదులకు విశేషణమగు జ్ఞానము విశేష్యములగు సుఖాదులతోఁ గలిసి యొకచోటనే యుండనేరదని చెప్పుచున్నారు. ౫౩

అవ. ఈ యర్థమునే విశదపరుచుచున్నారు:—

మూ. జ్ఞానేనైవ విశేష్యత్వాజ్జ్ఞానాప్యత్వం స్మృతేస్తథా,
సుఖం జ్ఞాతం మయేత్యేవం తవాజ్ఞానాత్మకత్వతః. ౫౪

తా. జ్ఞానమువలనఁగలిగిన సంస్కారమునఁ బుట్టిన స్మృతివలననే సుఖము నాచేతఁ దెలియఁబడెను అనేవృత్తి కలుగును. కనుక స్మృతి జ్ఞానజన్యము. సుఖాదిగుణములు జ్ఞానవిశిష్టాత్మయందే యుండునా? కేవలాత్మయందుండునా? అని వికల్పించి, క్షణికములగు విశేషణములకును ఆత్మకు నొకమాఱు సమవాయము సంభవింపదని చెప్పఁబడినందున, ఆత్మగతసంఖ్యాపరిమాణాదులను గ్రహింపవలసియుండును గనుక నవి కేవలాత్మయందే సమవేతములని చెప్పరాదు. ఏలయనఁగా నీమతమందు ఘటమువలె జడమయద్రవ్యమగు ఆత్మ గుణమగుజ్ఞానముకంటె వేఱు కనుక, ఆత్మయం దుండినంతమాత్రాన జడమగుటచే సుఖాదికమెద్దియు సిద్ధింపదు. ౫౪

అవ. జ్ఞానసుఖాదులు ఆత్మగుణములని అంగీకరించుటచేత సుఖము జ్ఞానముచేతఁ దెలియఁబడదని చెప్పి, యిపుడా సుఖాదులు ఆత్మధర్మము లనుటయే సంభవింపదని చెప్పుచున్నారు:—

మూ. సుఖాదే ర్నాత్మధర్మత్వ మాత్మన స్తేఽవికారతః,

భేదా దన్యస్య కస్మా న్న మనసో వా ఽవిశేషతః. ౫౨

తా. వైశేషికా! నీమతమున వికారరహితమును, విభువు (వ్యాపకము) అగుటచే నిత్యమునగు ఆత్మకు సుఖదుఃఖాదులు ధర్మము లనఁదగదు. మామతమున వ్యాపకమగు ఆత్మ నిత్యమని యంగీకరించుటచేత, నిత్యమగు ఆత్మయొక్క గుణము అనిత్యమని చెప్పుటకుఁ దగినదృష్టాంతము లేదు కనుక ఆత్మకు గుణములులేవని సిద్ధించును. గ్రాహ్యగ్రాహకభావము బొత్తిగనే లేదు. మఱియు, గుణము గుణియు నత్యంతభిన్నములనెడి నీమతమున భేదము సమానమే కనుక, ఈసుఖాదికము మఱియొక ఆత్మది యనరాదా? మనస్సునది యనరాదా? అనఁగా, సకలజీవులు వ్యాపకులే కనుక ఆత్మకు ఏశరీరసంబంధమువలన సుఖాదులు కలుగునో ఆశరీరమందు సర్వాత్మలు నుండుటవలన, ఆజీవులయొక్క భేదము తెలియఁబడనందున, ఈసుఖాదికము ఈయాత్మదేకాని మఱియొకయాత్మది కాదని నియమము సంభవింపదు. మనస్సునందు సర్వాత్మసంబంధ మఁడుటవలన నీ మనస్సంయోగభేదమును నీ సుఖాదికమును ఈ యాత్మవే యని నియమింపరాదు. అదృష్టము వేఱువేఱుగ నుండుటవలన ఆత్మకు సుఖాదికము వేర్వేఱుగ నుండవచ్చుననియుఁ జెప్పరాదు. ఆ యదృష్టము ఆత్మధర్మము కానందునను, అదృష్టహేతువగు ప్రయత్నాదికము మనస్సంయోగజన్యమగుటవలనను, ఆ మనస్సంయోగమునకు సర్వాత్మలందు భేదము లేనందునను, అదృష్టము సయుతముగ నీసుఖాదికము ఈ యాత్మదేయని నిరూపింప నేరదు. ఎక్కడనో కలిగినను సుఖ మెవనిదో యొకనిది కావచ్చును. ఈ సుఖాదులు మూర్తిమంతము క్రియావత్తునగు మనస్సునవని చెప్పనగును. కావున ఆత్మ సుఖాది గుణవత్తని చెప్పరాదు. ౫౨

అవ. జ్ఞానము మఱియొక జ్ఞానముచేఁ దెలియఁబడునని వైశేషికులు చెప్పెదరు. ఆ జ్ఞానము మఱియొక జ్ఞానముచేతను, అదియే యొకదానిచేతను ఇట్లొకదానిచే నింకొకటి తెలియవలసినయెడల అనవస్థ కలిగి నియమము లేకపోవలసి వచ్చును అని చెప్పుచున్నారు:—

సూ. స్యాన్మాలాపరిహారో న్యా తు జ్ఞానం చే జ్జ్ఞేయతాం వ్రజేత్,
యుగపద్వాఽపిచోత్పత్తి రభ్యుపేతాఽత ఇష్యతామ్.

తా. ఒకజ్ఞానము మఱియొక జ్ఞానమువలనఁ దెలియఁబడునేని వ్యవస్థలేకఁ దెలియఁబడు జ్ఞానములు, తెలిసికొను జ్ఞానములు అని అనంతజ్ఞానములు కలుగవలయును. అది సరికాదు. ఈ జ్ఞానానంత్యదోష నివృత్తికై రెండు జ్ఞానములును ఒక్కసారియే మనస్సంయోగమువలనఁ గలుగుననే పక్షమున, ఈ సంయోగమువలననే రూపరసగంధాదులును ఏకకాలముందే తెలియఁబడవలసి వచ్చును. సంస్కారవశమున కాలాంతరమందు గలిగెడి స్మృతియును నప్పుడే కలుగవలసి వచ్చును. ఇట్టిదోషములు కలుగుటచే జ్ఞానము జ్ఞానాంతరముచేఁ దెలియఁబడుననుట తగదు. ఇచట విశేషాంశము శాస్త్రసమధిగమ్యము. అనఁగా, శాస్త్రజ్ఞానమువలనఁ దెలియవలయును. ౫౬

అవ. మఱియు, ఆత్మకు చైతన్యము స్వరూపలక్షణమా? లేక తటస్థలక్షణమా? స్వరూపలక్షణమే యగునేని పృథివ్యాదికమందు గంధాదికము నిత్యమగుచు స్వరూపమే యగునట్లు, ఆత్మకు చైతన్యము స్వరూపమగుటచేత 'అనిత్యజ్ఞాన ఆత్మా' యను వచనము వ్యర్థమగును. లేక చైతన్యము ఆత్మకుఁ దటస్థలక్షణమగునేని అనాత్మకులేని అసాధార

కాత్మస్వరూపలక్షణము మఱియొకటి చెప్పవలయును. ఆ స్వరూపము చైతన్యముకంటె వేఱొకటి యేదియు లేదు. కావున దేహాదిజడవిలక్షణము ఆత్మ యని చెప్పెడివారలును, ఆత్మ నిర్విశేషచిద్రూపకూటస్థమని యొప్పవలయును. అటుల నంగీకరింపనియెడల వికారముగల వస్తువు అనిత్యమనెడి నియమము వలన బంధమోక్షసంబంధముగల ఆత్మ యొకఁడు గలఁడని నిరూపింప శక్యముకాదు. అనెడి యభిప్రాయముతో చెప్పుచున్నారు:—

మూ. అనవస్థాన్తరత్వాచ్చ బంధో నాత్మని యుజ్యతే,
నాశుద్ధిశ్చాప్యసంగత్వా దసంగో హీతి చ శ్రుతేః. ౫౭

తా. ఆత్మకు మఱియొక అవస్థలేనందున వాస్తవమగు బంధమును లేదు. బంధము కల్పితమగుటవలన మోక్షమును గల్పితమే కాని వాస్తవము కాదు. "అసంగో హ్యయమనాః శుభ్రః" అను శ్రుతివలన సంగములేని ఆత్మకు స్వకృతధర్మబంధము లేనట్లు అన్యసంసర్గకృతమగు అశుద్ధియుఁను లేదని భావము. ౫౭

అవ. దీనినుండియు ఆత్మకు పారమార్థికమగు బంధము లేదని చెప్పుచున్నారు:—

మూ. సూక్ష్మైకాగోచరేభ్యశ్చ న లిప్యత ఇతి శ్రుతేః. ౫౮

తా. సూక్ష్మమనఁగా మనోవాక్కులకు గోచరముకాకపోవుట. ఏకమనఁగా వాస్తవమగు ద్వితీయవస్తువు లేకపోవుట. అగోచరమనఁగా విశేషములు లేకుండుట. ఆత్మ యీ హేతువులవలన లోకదుఃఖములతో సంబంధము లేనివాఁడని 'న లిప్యతే లోకదుఃఖేనబాహ్యః' (కఠ. ౫. ౧౧.) శ్రుతి

చెప్పుచున్నది. "యథా సర్వగతం సౌక్ష్మ్యా దాకాశం నోపలిప్యతే, సర్వత్రావస్థితో దేహే తథాఽఽత్మా నోపలిప్యతే" (భగ. ౧౩-౩౨) అనెడి భగవద్వాక్యమును ఈయర్థమునే బోధించుచున్నది.

అవ. ఇట్లు ఆత్మ నిత్యశుద్ధముక్తస్వభావుఁడని వేదాంతులు చెప్పెడి ఆత్మోపదేశశాస్త్రము నిష్ఫలమని పూర్వపక్షులు ఆక్షేపించుచున్నారు:—

మూ. ఏవం తర్హి న మోక్షోఽస్తి బంధాభావాత్కథంచన.
శాస్త్రానర్థక్యమేవ స్యా న్నబుద్ధేర్భ్రాన్తిరిష్యతే,
బంధో మోక్షశ్చ తన్నాశః స యథోక్తో న చాన్యథా.

తా. ఆత్మ నిత్యశుద్ధుఁడగునేని యేప్రకారముగను బంధములేనందున మోక్షమునులేదు. మోక్షమున్నపుడుకదా మోక్షముకలుగుట. ఈ రెండును లేనందున మోక్షోపాయమగు ఉపదేశశాస్త్రమే వ్యర్థము. అనెడి ఆక్షేపమునకు సమాధానము:—బంధము బుద్ధియొక్క భ్రాంతియే, ఆ భ్రాంతి తొలఁగుటయే మోక్షము. కనుక శాస్త్రము వ్యర్థముకానేరదు. ఆ బంధము అజ్ఞానము, కల్పనామూలకము, సంసారనియామకమునని పూర్వము చెప్పఁబడెను. ౫౯

అవ. బంధము అజ్ఞానమూలకబుద్ధిధర్మాధ్యాసరూపము. ఇది చిదాత్మ కెట్లు సంభవించు నన, తద్ధర్మాధ్యాసమును నిరూపించుచున్నారు:—

మూ. బోధాత్మజ్యోతిషా దీప్తా బోధమాత్మని మన్యతే,
బుద్ధి ర్నాన్యోఽస్తి బోద్ధేతి సేయం భ్రాంతి ర్హి ధీగతా. ౬౦

తా. బోధరూపమగు ఆత్మప్రకాశమువలన వ్యాప్తమగు బుద్ధి తనను చైతన్యమను కొనును. ఇందుకు - 'బోద్ధా బుద్ధిః' అను వచనము ప్రమాణము. దీనికి సాక్షియగు బోద్ధ మఱియొకఁడు లేఁడని తలఁచును. చిదాభాస విశిష్టమగు బుద్ధి ప్రకాశించుచుండఁగా చైతన్యమునకును బుద్ధికిని పృథక్త్వము లేకపోవుటచే 'నేను కర్తను, బద్ధుఁడను' ఈ మొదలగు సంసారము ఆత్మయందు భాసించును. ఈ సంసారము బుద్ధిగతభ్రాంతియేకాని అన్యముకాదు.

అవ. ప్రతీత్యనుసారముగ బుద్ధికిఁగల బోధాత్మత్వము సత్యమేల కారాదనెదవేని, అది సత్యము కాదని చెప్పుచున్నారు:—

మూ. బోధస్యాత్మస్వరూపత్వాన్నిత్యం తత్రోపచర్యతే,
అవివేకోఽప్యనాద్యోఽయం సంసారో నాన్య ఇష్యతే.

తా. సుషుప్తియందు బుద్ధి లేకున్నను నిత్యమగు బోధముగలదు. ఆ బోధయుక్తమగు ఆగంతుకబుద్ధి జడమయినను ఆత్మస్వరూపబోధయుక్తమై అవివేకమువలన తానే కర్తనని భావించును. అవివేకమునకు ఆదిలేనియెడల బ్రహ్మాత్మజ్ఞానమువలన అజ్ఞానమే తొలఁగునుగాని సంసారము నివర్తింపదు. అని శంకింపఁదగదు. కర్త్రాదిధర్మములుగల బుద్ధికి సాక్షియగు ఆత్మను తెలియకపోవుటయే సంసారము. ౭౧

అవ. బంధము అజ్ఞానాత్మకమగుటకు ఫలము:—

మూ. మోక్షస్తన్నాశ ఏవ స్యాన్నాన్యోఽస్త్యనుపపత్తితః,
యేషాం వస్త్వంతరాపత్తిర్మోక్షో నాశస్తు తైర్మతః. ౭౨

తా. జ్ఞానమువలన అజ్ఞానము నశింపఁగా, హేయోపాదేయములు లేనందున తత్కార్యమగు అధ్యాసరూపబంధము విడుటయే మోక్షము.

స్వరూపమునకు అన్యథాభావము మోక్షమని కొందఱు వాదింతురు. వారల పక్షమున ఆత్మనాశమే మోక్షమని చెప్పవలసియుండును. అది సరికాదు. వస్తువు ఉన్నపుడు అది మఱియొక వస్తువుగ మాఱఁజాలదు. వస్తువు నశించినపుడు మొదటివస్తువు లేనేలేదు. వస్తువునకు వస్త్వంతరప్రాప్తి కలదని వారలు చెప్పినను 'సంయోగా విప్రయోగాంతా' అను న్యాయమునను చేయఁబడినది నిత్యముకాదను వ్యాప్తివలనను మోక్షము అనిత్యమే యగును. ౬౨

అవ. దీనికి పూర్వపక్షి శంకింపఁగా, వస్త్వంతరాపత్తి మోక్షమనునప్పుడు చెప్పినదోషములె ఆత్మకు అవస్థాంతరప్రాప్తియనునపుడును సమానములుగా నుండును అని చెప్పుచున్నారు:—

మూ. అవస్థాంతరమప్యేవ మవికారాన్న యుజ్యతే,
 వికారేఽవయవిత్వం స్యాత్తతో నాశో ఘటాదివత్.

తా. ఆత్మకు వికారములు లేనందున మఱియొక యవస్థయును లేదు. ఆత్మకు వికారము లుండునందువేని అవయవములును ఉండవలసివచ్చును. అవయవము లుండెనేని ఘటమువలె ఆత్మయు నశింపవలసివచ్చును. కనుక ఆత్మ నిత్యము. అనఁగా జననమరణములు లేనిది. కావున భ్రాంతినివృత్తియే మోక్షము. ౬౩

అవ. వేదాంతసిద్ధాంతముకంటె భిన్నములగు బంధమోక్షకల్పనములను గొందఱూహింతురుకాని యవి శ్రుతిస్మృతిన్యాయములచే బాధింపఁబడుటచే ముముక్షువులు వానినాదరింపరాదని చెప్పుచున్నారు:—

మూ. తస్మాద్భ్రాంతిరతోఽన్యాహి బంధమోక్షాదికల్పనాః,
సాంఖ్యకాణాదబౌద్ధానాం మీమాంసాహతకల్పనాః.

తా. కావున పరిశేషమువలన ఆత్మయందు బంధమోక్షకల్పనకు భ్రాంతియే మూలమనుట వేదాదివిరుద్ధము కాదు. విమర్శింపఁగా యుక్త్యసహమును వేదవిరుద్ధమునగు సాంఖ్యకాణాదబౌద్ధసమ్మతమగు బంధమోక్షకల్పనమును, వానియొక్క హేతుకల్పనమును ముముక్షువు లెన్నఁడును ఆదరింపఁదగదు. ౬౪

అవ. అట్లాదరింపఁదగనందులకు కారణము:—

మూ. అపి నిందోపపత్తేశ్చ యాన్యతోఽన్యాని చేత్యతః,
త్యక్త్వాతోహ్యన్యశాస్త్రోక్తేర్మతింకుర్యాద్దృఢాంబుధః.
శాస్త్రయుక్తి[1]విహీనత్వా న్నాదర్తవ్యాః కదాచన,
శక్యంతే శతశోవక్తుం దోషాస్తాసాం సహస్రశః. ౬౬

తా. శాస్త్రయుక్తిరహితములును, అనేకదోషయుక్తములు నగుటయే కాక నింద్యములగుటచేత నయ్యవి ఆదరింపఁదగినవి కావు. ఎట్లనఁగా; వేదాంతముకంటె నితరశాస్త్రములు వేదబాహ్యములును శంకాదూషితములును గనుక నిష్ఫలములు, నరకహేతువులును, కావున ముముక్షువులు వాని నాదరింపక వేదాంతశాస్త్రమునందే శ్రద్ధవహించవలెను. ఇందుకు ప్రమాణము:— "యాన్యతోఽన్యాని శాస్త్రాణి పృథివ్యాంవివిధానివై,శంకనీయాని విద్వద్భిర్ధర్మశుద్ధిమభీప్సుభిః. యావేదబాహ్యాఃస్మృతయః యాశ్చకాశ్చ కుదృష్టయః, సర్వాస్తా నిష్ఫలాః ప్రేత్యతమో నిష్ఠాహి తాః స్మృతాః (ఇతిస్మృతిః).౬౬

1 విరోధాత్తా.

అవ. మనస్సు నెచట దృఢపఱచవలెను ? దాని కేమి యుపాయ మనఁగా:—

మూ. శ్రద్ధాభక్తీ పురస్కృత్య హిత్వా సర్వమనార్జవమ్,
వేదాన్తస్యైవ తత్త్వార్థే వ్యాసస్యాభిమతే తథా.

తా. శ్రుత్యుక్తార్థమందు విశ్వాసమును, తదేకపరత్వమునుగలిగి వ్యాస విహితమగు వేదాంతశాస్త్రమందు విశ్వాసముగలవాఁడు ముక్తిని జెందక పోఁడు. ౬౭

అవ. ఇట్లు పరపక్షమును నిరాకరించి, దానికి ఫలమును చెప్పుచున్నారు:—

మూ. ఇతి ప్రణున్నా ద్వయవాదికల్పనా
నిరాత్మవాదాశ్చ తథా హి యుక్తితః,
వ్యపేతశంకాః పరవాదతః స్థిరా
ముముక్షవో జ్ఞానపథే స్యురిత్యుత. ౬౮

తా. ముముక్షువులు పరశాస్త్రవాదములనుండి కలిగిన సంశయములనువదలి వేదాంతకథితజ్ఞానమార్గమున దృఢచిత్తులగుదురను అభిప్రాయముతో పరమతములగు సాంఖ్యబౌద్ధాదివాదములు ఇట్లు ఖండింపఁబడెను. ౬౮

అవ. ఉత్తమపురుషార్థమగు మోక్షమునకు వేదాంతవిహితబ్రహ్మజ్ఞానమే పరమసాధనమని స్వరూపకథనపూర్వకముగ ముముక్షువులకు ఆత్మనిష్ఠత్వము ఆవశ్యకమని చూపుచున్నారు:—

మూ. స్వసాక్షికం జ్ఞానమతీవ నిర్మలం
వికల్పనాభ్యో విపరీతమద్వయమ్,
అవాప్య సమ్యగ్యది నిశ్చితో భవే
న్నిరన్వయో నిర్వృతిమేతి శాశ్వతీమ్. ౧౯

తా. ఇతరముచేఁ దెలియఁబడక, వికల్పనాశూన్యమై, అఖండము శుద్ధమునగు జ్ఞానమునందు నిశ్చయబుద్ధి గలిగినముముక్షువు అజ్ఞానతత్కార్యసంబంధరహితుఁడై అఖండానందస్వరూప నిత్యానందము ననుభవించును. ౧౯

అవ. యథోక్తజ్ఞానాధికారి గమనింపవలసిన తత్త్వనిష్ఠాలక్షణమును జెప్పుచున్నారు:—

మూ. ఇదం రహస్యం పరమం పరాయణం
వ్యపేతదోషై రభిమానవర్జితైః,
స మీక్ష్యకార్యా మతిరార్జవే సదా
న తత్త్వదృ[1]క్స్వన్యమతిర్హి కశ్చన. ౨౦

తా. ఏ వస్త్వైక్యమును బొంది శాశ్వతసుఖమును జెందునో అట్టి యీవస్తురహస్యము సద్గురూపదేశములేక తెలియఁబడదు. ఈ యైక్యజ్ఞానము పరమాత్మప్రకాశమగుటవలన నిది సర్వోత్తమము, నిరవధికము, సర్వాశ్రయము. ఇట్టి ఆత్మజ్ఞానమును సమ్యగ్విచారణచే దృఢపఱిచి, ఇంద్రియములను బహిఃప్రవృత్తినుండి మఱలించి, 'నేను పండితుఁడను' అనెడి స్వాభిమానమును బూర్తిగ వదలినయట్టి జ్ఞానులు సర్వసమమగు బ్రహ్మతత్త్వమందు

1 క్స్వార్థ్యమతి.

సదా నిష్ఠగలిగియుండవలెను. ఆత్మేతరవస్తువునందు చిత్తముంచువాఁడు తత్త్వజ్ఞుఁడు కాఁడు.

1 ప్ర. బ్రహ్మము ఋజువు (సమము) ఎట్లగును?

ఉ. బ్రహ్మము అంతటను నదేకరూపమగుటచేత ఋజువనఁబడును.

2 ప్ర. బహిర్దృష్టిగలవాఁడు ఏల తత్త్వవేత్త కానేరఁడు?

ఉ. వానికి ప్రత్యక్తత్త్వమందు దృష్టిలేదు కనుక తత్త్వవేత్త కాఁజాలఁడు. ఇందుకు-"తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిదముపాసతే." (కేన.) "అథ యోఽన్యాం దేవతాముపాస్తేఽన్యోఽసావన్యోఽహమస్మీతి న సవేద," (బృహ. 3-४-౧౦) అను శ్రుతి ప్రమాణము. ౭౦

అవ. ఇట్లు మహాప్రయత్నముచే లభ్యమగు జ్ఞానము వలన నేమిఫలము కలుగు ననఁగా:—

మూ॥ అనేకజన్మాంతరసంచితైర్నరో
విముచ్యతే ఽజ్ఞాననిమిత్తపాతకైః,
ఇదం విదిత్వా పరమం హి పావనం
న లిప్యతే వ్యోమవదేవ కర్మభిః. ౭౧

తా॥ పరమపావనమగు నీ యాత్మతత్త్వజ్ఞానము కలిగినంతట, అజ్ఞానమూలకముగ ననేకజన్మాంతరములనుండి సంపాదింపఁబడిన పాపకర్మసంచితమునుండి నరుఁడు విముక్తుఁడగును. అప్పుడు నిర్మలాకాశమునకు ధూళి యంటనియట్లు, జ్ఞానికి కర్మము లంటవు. అని సిద్ధాంతము. ౭౧

అవ. జితేంద్రియత్వాదిసుగుణగరిష్ఠుఁడును, ఉత్తమాధికారియు నగు శిష్యునకే గురువు జ్ఞానోపదేశము చేయవలెననిః—

మూ. ప్రశాంతచిత్తాయ జితేంద్రియాయ చ
ప్రహీణదోషాయ యథోక్తకారిణే,
గుణాన్వితాయానుగతాయ సర్వదా
ప్రదేయమేతత్సతతం ముముక్షవే. ౭౨

తా. శమదమాదిగుణోపేతుఁడగు ప్రశాంతచిత్తుఁడు, జితేంద్రియుఁడు, దోషరహితుఁడు, విధ్యుక్తకర్మాచరణుఁడు, వినయ సౌశీల్యాది సద్గుణసంపన్నుఁడు, గురుశుశ్రూషాపరుఁడును, తీవ్రమోక్షేచ్ఛగలవాఁడును అగు శిష్యునకే గురువు తత్త్వరహస్యముల నుపదేశింపవలయును.

అవ. అట్టి సచ్ఛిష్యుఁడు తత్త్వజ్ఞానానుభవమువలన బొందునట్టి ఫలము:—

మూ. పరస్య దేహే న యథాఽఽత్మమానితా
పరస్య తద్వత్పరమార్థ మీయుష్య చ,
ఇదం హి విజ్ఞానమతీవ నిర్మలం
సంప్రాప్య ముక్తోఽథ భవేత్స సర్వతః. ౭౩

తా. ఒకనికి మఱియొకని దేహమందు నేనను అభిమానము కలుగని విధమున, చిరకాలమునుండి ప్రాప్తమైయున్న దేహాభిమానపాశమునుండి వేదాంతవాక్యవిచారకముగ విడువఁబడి దేహేంద్రియాతీతమును, అతినిర్మలమును నగునట్టి యీ విజ్ఞానమును బొందిన ముముక్షువు సర్వదా ముక్తుఁడై పరమానందామృతమును గ్రోలుచుండును. ౭౩

అవ. ఉత్తమాధికారియగు శిష్యునకేకాని తదితరునకు గురువు తత్త్వబోధ చేయఁగూడ దని:—

మూ. న హీహ లాభోఽభ్యధికోఽస్తి కశ్చిన
స్వరూపలాభాత్స ఇతో హి నాన్యతః,
న దేయమైంద్రా దపి రాజ్యతోఽధికం
స్వరూపలాభం త్వపరీక్ష్య యత్నతః. ౨౪

తా. స్వస్వరూపబోధకమగు ఆత్మజ్ఞానముకంటె నుత్తమమగున దెద్ది
యును లేదు. ఆ యాత్మజ్ఞానము వేదాంతశాస్త్రముదక్క మఱేయొక
శాస్త్రమువలనఁ దెలియఁబడదు. కావున ఇంద్రభోగముకంటె నత్యుత్కృష్ట
మగు నీమహావిద్యను ప్రయత్నముచేఁ బరీక్షించి, శ్రద్ధాభక్తి విశ్వాసములు
గల ముముక్షువునకే యుపదేశింపవలెనుగాని తదన్యునకు నుపదేశింపఁ
గూడదు.

ఇచట, విత్తాదిలాభముచేతనైనను లోభములేక విద్యామాత్రార్థియగు
నచికేతునకు యముఁడు జ్ఞానోపదేశము జేసెననుగాథ గ్రాహ్యము. ౨౪

ఇది పార్థివప్రకరణము.

శ్రీః

# ఉపదేశసాహస్రి

(శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్య ప్రణీతము.)

## శ్లోకప్రబంధము - సప్తదశ ప్రకరణము.

---

### ౧౭. సమ్యఙ్మతి ప్రకరణము.

అవ. పరపక్షనిరాకరణము చేయుచు స్థిరపఱిచిన మోక్ష సాధనమగు జ్ఞానమును స్వప్రక్రియ చేసయితము ప్రకటించుటకై మఱియొక ప్రకరణము నారంభించుచున్న శ్రీశంకరాచార్యులు, జ్ఞానప్రాప్తికి దైవభక్తియు ముఖ్యసాధనమని స్ఫురింపఁజేయుచు, నీ ప్రకరణమందు నిరూపింపఁదగిన అర్థమును నమఃశబ్దపూర్వకముగ నిరూపించుచున్నారు:—

మూ. ఆత్మా జ్ఞేయః పరో హ్యాత్మా యస్మాదన్యన్న విద్యతే,
సర్వజ్ఞః సర్వదృక్శుద్ధస్తస్మై జ్ఞేయాత్మనే నమః. ౧

తా. తెలిసికొనఁదగినదియే ఆత్మ. ఆయాత్మ ఘటాదులవలె నింద్రియములకు గోచరము కానిది. సకలదృశ్యమునకు అతీతము. ఆత్మకంటె నన్య

మగు జ్ఞాత లేఁడు. సామాన్యముగను విశేషముగను నెఱుంగువాఁడును, ఆ నృతజడదుఃఖరహితుఁడును, పరిపూర్ణుఁడును, సంసారబంధరహితుఁడును,సత్య జ్ఞానానందస్వరూపుఁడును అగు పరమాత్మయే ఉపాధివశమున జీవాత్మ యనఁ బడును. అట్టి నిత్యసత్యస్వరూపునకు నమస్కారము (ఐక్యము). ఇట 'నమః' పదమునకు అభేదమని యర్థము. ౧

అవ. దైవభక్తివలె గురుభక్తియు విద్యాప్రాప్తికి పరమసాధనమగును. ఇందుకు - "యస్య దేవే పరాభక్తిర్యథా దేవే తథాగురౌ, తస్యైతే కథితాహ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః". అను (శ్వేతా. ౬. ౨౩) శ్రుతి ప్రమాణము:—

మూ. పదవాక్యప్రమాణజ్ఞై ర్దీపభూతైః ప్రకాశితమ్,
బ్రహ్మ వేదరహస్యం యై స్తా న్నిత్యం ప్రణతో ఽస్మ్యహమ్. ౨

తా. పదవాక్యప్రమాణములను బాగుగ నెఱింగి దీపము వస్తువులను బ్రకాశింపఁజేయునట్లు. వేదరహస్యమగు పరబ్రహ్మమును బ్రకాశింపఁ జేసి శిష్యునికిఁ గోచరింపఁజేయునట్టి సద్గురువునకు సర్వదా నమస్కరించుచున్నాను. ౨

అవ. గురువందన మొనరించి, యీ ప్రకరణమందుఁ బ్రతిపాదింపఁబోవు ఉద్దేశమును బ్రతిజ్ఞ చేయుచున్నారు:—

మూ. యద్వాక్సూర్యాంశు సంపాత ప్రణష్టధ్వాన్తకల్మషః,
ప్రణమ్య తాన్ గురూన్ వక్ష్యే బ్రహ్మవిద్యావినిశ్చయమ్.

తా. సూర్యకిరణములు గాఢాంధకారమును దొలఁగించి పదార్థమును బ్రకాశింపఁజేయువిధమున, ఏసద్గురుమూర్తియొక్క వాక్ప్రభ నాహృదయమందలి అజ్ఞానాంధకారమును దొలఁగించి పరమపదార్థమును బ్రకాశింపఁజేసెనో అట్టి శ్రీగురుచరణారవిందముల కభివందన మొనరించి బ్రహ్మవిద్యను నిర్ణయించు న్యాయవిశేషములను వచియించెదను. 3

అవ. బ్రహ్మవిద్యానిర్ణయమునకు ఫలమును జెప్పుచున్నారు:—

మూ. ఆత్మలాభాత్పరో నాన్యో లాభః కశ్చన విద్యతే,
యదర్థా వేదవాదాశ్చ స్మార్తాశ్చాపి తు యాః క్రియాః.

తా. శ్రుతిస్మృతులు సాక్షాత్తుగ విజ్ఞానమును బోధించునో, శ్రుతిస్మృతిబోధితకర్మములు చిత్తశుద్ధినిఁ గలిగించి జ్ఞానమును బుట్టించి, విజ్ఞానమునకుఁ బరంపరాసాధనమగుచున్నవో అట్టి ఆత్మజ్ఞానసంపాదనముకంటె నధికమగు లాభము వేఱెద్దియును లేదు. ౪

అవ. లోకములో పుత్రుఁడు కలిగినపుడు, ధనము దొరకినపుడు, సురూపకళత్రము లభించినపుడును, ఆనందింపఁజేయు ధనదారపుత్రలాభములుండఁగా, ఆత్మలాభముకంటె మించిన లాభము లేదనుమాట నమ్మఁదగునా? అను ప్రశ్నమునకు సహేతుకమగు ప్రత్యుత్తరము:—

మూ. ఆత్మార్థోఽపి హి యో లాభః సుఖాయేష్టో విపర్యయః,
ఆత్మలాభః పరః ప్రోక్తో నిత్యత్వాద్బ్రహ్మవేదిభిః. ౫

తా. పుత్రధనదారాదిలాభము అనుకూలమగునేని ప్రియమగునట్లు,

ఒకప్పుడు అవి ప్రతికూలమగునేని అప్రియముకూడ కావచ్చును. మఱియు, పుత్రధనాదిలాభము నీకంటె నితరునకు కలిగినపుడు అందువలన నీకేమి లాభము? ఈ ధనాదిలాభము నీవున్నపుడేకదా నీకు ఆనందమును గలిగించును. ఒరులకున్నపుడు నీకు నట్టి ఆనందము కలుగదు. ఇంతియేకాక నీవు జీవించియుండఁగా ధనాదులు పోయినను, ధనాదులుండఁగా నీవు పోయినను ఆ ధనాదికమువలన నీకెట్టిలాభమును లేదుకదా. కనుక పుత్రధన కళత్ర లాభములు ప్రియములనియు, తాను (ఆత్మ) ప్రియతమమనియుఁ జెప్పఁబడెను. ఆత్మ(తన)లాభముకంటె పుత్రాదిలాభమే ప్రియమగునదియని పట్టుదలగలవానినిఁ గూర్చి "ప్రియం రోత్స్యతి" అని (బృహ. 3. ౪. ౮.) శ్రుతి చెప్పుచున్నది. అనఁగా, పుత్రధనాదికము ప్రియమైనను తనకంటె నన్యమగుటచే వియోగదశయందు ఏడ్పించునుగాని, ఆత్మవలె నిత్యానందము కాదని శ్రుత్యర్థము. ౫

అవ. ఆత్మ సుఖలాభము నిత్య మెట్లనఁగా:—

మూ. స్వయం లబ్ధస్వభావత్వాల్లాభ స్తస్య న చాన్యతః,
అన్యాపేక్షస్తు యో లాభః సోఽన్యదృష్టి సము
ద్భవః. ౬

తా. ఆత్మలాభము మఱియొకదానినుండి పుట్టునది కాదు. సాధనములవలనఁ బుట్టింపఁబడక స్వయముగనే పుట్టునదికనుక నిది నిత్యము. పుత్రాదికమగు నితరలాభము మఱియొకదానివలనఁ బుట్టినదికనుక అనిత్యము. కాఁబట్టి నిత్యమగు ఆత్మకు అనిత్యవస్తువులతో సంయోగము వియోగమునే కలిగించును గనుక అనిత్యమగు అన్యలాభము నిత్యసుఖము నియ్యఁజాలదు. ౬

అవ. అన్యదృష్టి యెద్ది? అన్యదృష్టివలనఁ గలిగెడి ధన పుత్త్రాదిహానివలనఁ గలుగు దుఃఖమెద్ది? యను ప్రశ్నల కుత్తరము:—

మూ. అన్యదృష్టిస్త్వవిద్యా స్యాత్తన్నాశో మోక్ష ఉచ్యతే,
జ్ఞానేనైవ తు సోఽపి స్యాద్విరోధిత్వాన్న కర్మణా. ౭

తా. ఆత్మకంటె నన్యమగు దృష్టినిఁ గలిగించుటచే అన్యదృష్టి యనఁగా అవిద్య. దీనినుండి కలిగెడి బాహ్యమగు పుత్త్రాదిలాభము స్వప్నతుల్యమై మిథ్యయగుటచేతను, ఆత్మలాభమును గప్పుటచేతను అది హానికరమే యగును. ఆయవిద్యతొలఁగనిచే ఆత్మలాభము కలుగదు. అవిద్యానాశమే మోక్షము. ఈమోక్షము కర్మముచేఁ గాక జ్ఞానమువలననే కలుగును. ఈమోక్షసుఖము నిత్యము. దీనికి మించిన సుఖములేదు.

అవ. అవిద్యకును, అవిద్యాజన్యకర్మములకును విరోధము లేనందునఁ గార్యసహితావిద్యానాశరూపమగు మోక్షము కర్మమువలన గలుగకున్నను, దీనివలన నిత్యమగు పురుషార్థము దొరకవచ్చునుగదా! జ్ఞాన మేల సంపాదింపవలెను? అను శంక కుత్తరము:—

మూ. కర్మకార్యస్త్వనిత్యః స్యా దవిద్యాకామకారణః,
ప్రమాణం వేద ఏవాత్ర జ్ఞానస్యాధిగమే స్మృతః. ౮

తా. మిథ్యాజ్ఞానజన్యరాగాదిజనితకర్మసాధ్యమగు ఫలము నిత్యము కాదు. జ్ఞానసాధ్యమగు ఫలము నిత్యము. అనెడి యుత్తమజ్ఞానమును సంపాదించుటకై కర్మములవలన సంపాదింపఁబడిన ధనధాన్యాదు లీలోకమున క్షయించునట్లు, పుణ్యమువలన నార్జింపఁబడు పరలోక సౌఖ్యములును

నశించుననియు, బ్రహ్మవేత్త సకలశోకవిముక్తుఁడై పరమపదమును బొందు ననియుఁ బోధించెడి యీ శ్రుతులు ప్రమాణము:—"తద్యథేహ కర్మచితో లోకః క్షీయత ఏవమేవాముత్ర పుణ్యచితో లోకః క్షీయతే." (ఛాందో. ౮-౧-౬) "తరతి శోకమాత్మవిత్." (ఛాం-౭-౧3).

ప్ర. మోక్షము జ్ఞానసాధ్యమా?

ఉ. ఇచట సాధ్యమనఁగా లౌకికపదార్థమువలె గలిగించుటకాదు. జ్ఞానముచేత అజ్ఞానమును దొలఁగించుట. కేవలన జ్ఞానము స్ఫురించును అని భావము. ౮

అవ. మఱియు, వేదములు అధ్యయనవిధియే ఫలముగఁ గలవి. కాని పురుషార్థములో అకుఁ గావను శంక కలుగఁగా, మహాపురుషార్థమగు మోక్షమునకై వేదములన్నిఁటికి ఆత్మైక్యజ్ఞానమందే తాత్పర్యమని బోధించుచున్నారు:—

మూ. జ్ఞానైకార్థపరత్వాత్తు వాక్యమేకం తతో విదుః,
ఏకత్వం హ్యాత్మనో జ్ఞేయం వాక్యార్థప్రతిపత్తితః. ౯

తా. సకలవేదములకు ఆత్మైక్యజ్ఞానమందే తాత్పర్యముగనుక వేదవాక్యమే వాక్యముకాని మిగిలినవి నిత్యానందపరమపురుషార్థబోధకములు కాకపోవుటచే వాక్యాభాసములని తత్త్వజ్ఞులు తలంతురు. కావున సకలవాక్యార్థములకు గురుప్రసాదమున సామరస్యముచేత జీవాత్మపరమాత్మలకు ఐక్యమే తెలియవలెను.

ప్ర. అయ్యా! వేదవాక్యములు యాగాదికర్మములనే విశేషముగ బోధించుచున్నవి. కొన్ని వేదవాక్యములు ఉపాసనను విధించుచున్నవి.

ఇట్లుండఁగా, అన్ని వేదములు "తత్త్వమసి" యను వాక్యమువలె ఏకత్వము నెటుల బోధించును?

ఉ. 'తత్త్వమసి' యను మహావాక్యములో 'ప్రతిబింబము మిథ్యయై బింబమే శేషించు'నను న్యాయమున జీవాత్మ బుద్ధియందు ప్రతిబింబితుఁ డగుటచేతను, బుద్ధిసహితమగు జాగ్రత్స్వప్నములందు మాత్రమే యుండుచు, బుద్ధిరహితమగు సుషుప్తియందు లేకపోవుటచే మిథ్య కాఁగా, బింబమగు పరమాత్మయే శేషించునని సాక్షాత్తు బోధింపఁబడుచున్నది. 'సత్యం జ్ఞానమనంతం' (తైత్తి.౨. ౧) ఈ మొదలగు వేదవాక్యములు పై మహావాక్యమునకే సహకారులు. "కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతం సమాః." (ఈశ. ౨) అను నీ మొదలగువాక్యములు వేదవిహితములగు కర్మములఁ జేయుట చేత ఆత్మైక్యజ్ఞానసాధనమగు చిత్తశుద్ధిని సంపాదించుటచే, పరంపరాసాధనమై ఆత్మైక్యమునే బోధించుచున్నవి. "అహరహస్సంధ్యాముపాసీత" యీ మొదలగు ఉపాసనావాక్యములు శ్రద్ధతో నారాధింపఁబడిన దేవుఁడు సుప్రీతుఁడై జ్ఞానసాధనకు సంభవించు విఘ్నములను దొలఁగించి, ఆత్మైక్యజ్ఞానమునే దృఢపఱుచును. నిర్గుణోపాసన దుర్లభమగుటచే సగుణోపాసన మొదట నుపదేశింపఁబడెను. ఈ ఉపాసనకు ఉపాస్యదేవతాకటాక్షమున భేదజ్ఞానమును వదలి ఐక్యజ్ఞానమే సదుపాసన (నిరంతరనిదిధ్యాసనము)వలన సిద్ధించును. కావున, వేదవాక్యములన్నియు సాక్షాత్తుగను పరంపరగను జీవాత్మపరమాత్మలకు ఐక్యమునే బోధించుననుట నిర్వివాదము. ౯

అవ. 'ఆత్మ,' 'బ్రహ్మ' అనుపదములు 'నారాయణ, కృష్ణ, గోవింద' అను పదములవలె ఏకవస్తుబోధకములగు పర్యాయపదములు కావు. కావున బ్రహ్మాత్మైక్యము ఎట్లుసంభవించును? అను శంకకు సమాధానము:—

మూ. వాచ్యభేదాత్తు తద్భేదః కల్ప్యో వాచ్యోఽపి తచ్ఛ్రుతేః,
త్రయం త్వేత త్తతః ప్రోక్తం రూపంనామ చ కర్మ చ.

తా. జీవపరమాత్మలకు వాస్తవభేదము లేదు. ఉండెనేని అన్యోన్యాశ్రయమను దోషము కలుగును. ఎట్లనఁగా, వాచ్యములగు జీవబ్రహ్మములకు భేదముండెనేని వాచకములగు జీవబ్రహ్మశబ్దములకును భేదము కలుగును. అనఁగా నీ రెండును బర్యాయపదములుం గాకపోవును. అగ్ని వహ్ని యను రెండును బర్యాయపదములు గనుక, అగ్ని యొకటియే. ఇట్లు జీవబ్రహ్మములు పర్యాయపదములు కావు. జీవబ్రహ్మములు వేఱగునేని జీవబ్రహ్మశబ్దములును వేఱగును. ఈ భేదము వాస్తవమనుటకుఁ బ్రమాణములేదు. భేదము సప్రమాణము కానందున ఐక్యజ్ఞానము సిద్ధమని చెప్పఁగా, భేదమునకుఁ బ్రమాణము కలదని పూర్వపక్షి శంకించుచున్నాఁడు. నామము, రూపము, కర్మము నను నీ మూఁడును ఆ యాత్మకంటె వేఱుగఁగలవు కనుక ఐక్యము సంభవింపదు. ౧౦

అవ. ఈ పూర్వపక్షమును సిద్ధాంతి నిరాకరించుచున్నాఁడు:—

మూ. అసదేతత్త్రయం యస్మా దన్యోన్యేన హి కల్పితమ్,
కృతో వర్ణో యథా శబ్దా చ్ఛ్రుతో ఽన్యత్ర
ధియా బహిః. ౧౧

తా. నామరూపకర్మములు మూఁడును నొకదానిచే నొకటి కల్పింపఁబడినవి కనుక నివి అసత్తేకాని సత్తు కాఁజాలవు. అన్యోన్యాపేక్షగల భేదము 'ఇది ఇట్టిది' యని నిరూపింపశక్యము కానందున అప్రమాణమగుటచేత లోకసిద్ధమగు మిథ్యాభేదమును వైరాగ్యోత్పత్తికై శ్రుతి అనువదించి

నిరాకరించెను గనుక సీత్రయము అద్వైతజ్ఞానమునకు విరోధము కాదు. అన్యోన్యాపేక్షవలన దెలియఁబడునది మిథ్యయే యగును. ఎట్లనఁగా, గ్రంథస్థముగ వినఁబడిన సహస్రాక్షుఁడు, వజ్రపాణి, ఇంద్రుఁడు నను శబ్దములు చిత్తరువున వ్రాయఁబడి కల్పితములగుటచే మిథ్యయగునుగదా! అట్లే శబ్దము మిథ్యాభూతార్థమును బోధించును. కనుక కల్పితత్రయము మిథ్యయగుచు అసత్తగుటచేత అద్వైతమునకు హానిలేదు. ౧౧

ఈ రెండుశ్లోకములకు నింకొక అర్థము:—

పునరుక్తములుకాని అనేకశబ్దము లుండఁగా వేదము ఐక్యము నెట్లు బోధించునందువా ? అది నిజమేకాని యుక్తులచేతను, ప్రమాణముల చేతను అనేకత్వమునకు బాధయుండుటచేత శ్రుతికి భేదమందు తాత్పర్యము లేదని చెప్పుచున్నారు:— 'వాచ్యభేదాదితి' వాచ్యభేదమునకుఁ బ్రమాణ ముండునేని వాచకభేదమువలన అనేకత్వము సిద్ధించును. వాచక భేదములేక వాచ్యభేదము కలుగనేరదు. మఱియు, ఆరోపిత (భ్రమప్రాప్త) వస్తువునందు శబ్దవ్యవహార ముండుటవలన శబ్దమాత్రమున అర్థతత్త్వము నిశ్చయింపఁబడదు. ఒకపురుషునకే తండ్రి, కొమరుఁడు, అల్లుఁడు, తాత, మామ యనే ఉపాధికృతభేదముండుటవలన అర్థమాత్రమున శబ్దముకూడ నిశ్చయింపఁబడదు. కావున అనాద్యవిద్యాకల్పితబహూపాధి భేదములతోఁ గూడిన కర్తృకారక భేదముచేత జ్ఞానాపేక్షితాంతఃకరణశుద్ధికై అపేక్షింపఁ బడిన కర్మకాండము జ్ఞానమార్గమునకు పరంపరాసాధనమగును. నిరతిశయానందమును, ఆత్యంతికదుఃఖనివృత్తియు జ్ఞానమునకు ప్రయోజనములు. కావున జ్ఞానకర్మము లొక్కపురుషునియం దుండుటయందు విరోధము లేదు. ఈ దృశ్యప్రపంచము నామము, రూపము, కర్మము నని మూఁడువిధ ములుగ భాగింపఁబడెను. "త్రయం వా ఇదం నామరూపం కర్మ," (బృహ. ౩-౬-౧) అని బ్రాహ్మణము. శబ్దములన్నియు వాఙ్మాత్రములు, రూపము

లన్నియును చక్షుర్మాత్రములు, కర్మములన్నియును శరీరమాత్రములు అని విశేష ప్రవిలాపమువలన నా సామాన్యత్రయమును జెప్పి, ఆత్రయము సన్మాత్రము, సదాత్మ, ఏకము నని జగత్తునకంతకు సర్వాత్మత్వము నుపసంహరించుటవలన తత్త్వభేదము లేదని భావము. ౧౧

అవ. శబ్దమువలన మిథ్యార్థకల్పనమును జూపి,మిథ్యార్థమువలన శబ్దకల్పనమును నుదాహరించుచున్నారు:—

మూ. స్వప్నం చాపి యథా రూపం బుద్ధేః శబ్దాయ కల్పతే,
ఏవమేత జ్జగత్సర్వం భ్రాంతిబుద్ధివికల్పితమ్. ౧౨

తా. గోడపై జూడఁబడిన దేవతాస్వరూపమువలె ఆసంస్కారము వలన బుద్ధియందుండు దేవతాస్వరూపమును మిథ్యయే యగుటచే జగత్తంతయు భ్రాంతిచేతనే కల్పితమగును. ౧౨

అవ. జగత్తు మిథ్యయని తెలియుటవలన నేమిఫల మనఁగా:—

మూ. అపదేశత్వతో యుక్తం సచ్చిన్మాత్రం న కల్పితమ్,
వేదశ్చాపి స ఏవాద్యో వేద్యం చాన్యత్తు కల్పితమ్.

తా. సర్వజగత్తును దేనియందు గల్పింపఁబడినదో అట్టి చిద్వస్తువు సత్తుగ నున్నందున అధిష్ఠానము శూన్యమనరాదు. కల్పితము కానందున ఆ చిద్వస్తువు లేనిదియనుగాదు. కల్పితమగు జగత్తుయొక్క ఉత్పత్తికంటె పూర్వమునందుండి నాశమునకును సాక్షిగనున్న ఆ చిద్వస్తువు కాలత్రయమందును అబాధ్యమై యున్నందున నిత్యమని తాత్పర్యము. ఆత్మతత్త్వ ప్రతిపత్తికిఁ గారణములగు శ్రుతులు గురువులును గల్పితములు కానంత

మాత్రమున సచ్చిదాత్మయుఁ గల్పితము కాకపోవునా? యను శంకకు సమాధానము. 'వేదశ్చాపీతి' జడమునకు వస్తుప్రకాశనశక్తి లేనందున స్వయంప్రకాశము పూర్వసిద్ధమగుటచే అకల్పితమగు ఆత్మయే మాయావశమున వేదన (జ్ఞాన)కారణమగు శ్రుతిరూపముగను గురురూపముగను బరిణమించును. దీపమునకుండిన అర్థప్రకాశనశక్తి అగ్నిదేకాని వేఱుకాదు. వేద్యమును స్వయంప్రకాశమునగు తత్త్వము ఆ యాత్మయే. అన్యమగు విశేషములు కల్పితములు. ఆత్మ సకలవిశేషములందును అనుగతమై, కల్పితసకలవస్త్వధిష్ఠానమై, సకలవస్తునిషేధావధియై ఏకమై యుండును. ౧౩

అవ. ఆ యాత్మ ఆద్యము వేద్యము నెట్లగునను శంకకు స్వప్నదృష్టాంతముచే విశదపర్చుచున్నారు:—

మూ. యేన వేత్తి స వేదః స్యాత్స్వప్నే సర్వం తు మాయయా,
యేన పశ్యతి తచ్చక్షుః శృణోతి శ్రోత్రముచ్యతే. ౧౪

తా. స్వప్నమునఁ విషయములను దెలియునది తెలివియే. ఆ తెలివియే వేదమని చెప్పఁబడును. ప్రత్యక్షానుమానాదిప్రమాణములచేఁ దెలియఁబడనిది వేదముచేఁ దెలియఁబడుటవలన నిది వేదమనఁబడును. విద్ ధాతువునకు జ్ఞానమని యర్థము. 'విదంత్యనేనేతి వేదః' అని వ్యుత్పత్తి. "ప్రత్యక్షేణానుమానేన యస్తూపాయో న బుధ్యతే, ఏనం విందంతి వేదేన తస్మాద్వేదస్య వేదతా." అను వచన మిటఁ బ్రమాణము. ఆ విషయములు మాయాకల్పితములు. స్వప్నమందు ఆదిత్యాదితేజస్సు లేవియును లేవు. ఆత్మ స్వయంజ్యోతిస్సని శ్రుతి చెప్పుచున్నది. స్వప్నమందు బాహ్యములగు విషయములు లేనందున మనోమాత్ర కల్పితమగు నదియెల్లను మాయికమే యగును. ఇందుకు-'న తత్ర రథా (బృహ. ౬-౩-౯)'యను శ్రుతియుం బ్రమాణము. ఆత్మ తనచేఁ జూడఁబడుచు మాయాకృతములగు ఉపాధులయం దుండెడి

పదార్థముచేతనే వేద్యమగును. ఆ వస్తుసిద్ధమగు చైతన్యముచేత వేదనారూపుఁడగును. ఈ రెండును మాయికములే. స్వప్నమందు నేత్రాదీంద్రియములు వ్యాపారరహితములగుటవలన ఆత్మ దేనిచే రూపమును గ్రహించునో అదియే నేత్రము. దేనిచే శబ్దమును గ్రహించునో అదియే శ్రవణము. రూపాకార సంస్కారముగల మనస్సే నేత్రమనియు, శ్రోత్రమనియు స్వప్నమందు వ్యవహరింపఁబడును. ౧౪

మూ. యేన స్వప్నగతో వక్తి సా వాగ్ఘ్రాణం తథైవ చ,
రసనస్పర్శనే చైవ మనశ్చాన్యత్తథేన్ద్రియమ్. ౧౫

తా. స్వప్నావస్థయందు పలికెడి వాక్కు, ఆఘ్రాణించెడి నాసిక, రుచిచూచెడి జిహ్వ, స్పృశించెడి త్వగింద్రియము, గ్రహించెడి పాణి మొదలగు నింద్రియములన్నియు మనస్సే. దానికంటె ఇతరేంద్రియము లెవ్వియును స్వప్నమందు వ్యాపారమును జేయక విరమించియుండును. ఆ మనస్సు చైతన్యమాత్రమే. ౧౫

అవ. ఒక్కటియగు చైతన్యము తెలియఁదగిన విషయముగను, తెలియఁదగు నింద్రియములుగను భేదించునా? యనుశంకకు సమాధానము:—

మూ. కల్పోపాధిభిరేవైతచ్ఛిన్నం జ్ఞానమనేకధా,
ఆధిభేదాద్యథా భేదో మణేరేకస్య జాయతే. ౧౬

తా. నీలపీతాదివస్తుసాన్నిధ్యమువలన నలుపు, పచ్చన మొదలగు రంగులు గలదిగ స్ఫురించు స్ఫటికమువలె కల్ప్యములగు ఉపాధిసంఘసంబంధమువలన చైతన్యము అనేకముగ ప్రకాశించును. ౧౬

అవ. భేదరహితమగు జ్ఞానమునకు స్వప్నమందువలెనే జాగ్రదవస్థయందును గల్పితోపాధిభేదవలననే అనేకత్వమును అశేషవ్యవహారాస్పదత్వమును ఉపపన్నమగునని నిరూపించుచున్నారు:—

మూ. జాగ్రతశ్చ యథా భేదో జ్ఞానస్యాస్య వికల్పితః,
బుద్ధిస్థం వ్యాకరోత్యర్థం భ్రాంత్యా తృష్ణోద్భవక్రియః.

తా. చిద్రూపాత్మకు జాగ్రదవస్థయందు వికల్పము లెట్లనఁగా, ఆత్మ ప్రథమమున అజ్ఞానావృతుఁడై బుద్ధినిఁ గల్పించి బుద్ధ్యావరణతోఁగూడి తాదాత్మ్యమువలన గలిగిన భ్రాంతివలన బుద్ధియందుండెడి అర్థజాతమును స్వాత్మగతమగునట్లు తలఁచి వ్యవహరించును. ఆత్మ అవిద్యవలన సంప్రాప్తమగు అంతఃకరణపరిణామావస్థను భాసింపఁజేయుచు, ఆ యంతఃకరణమునకుఁ దాను సాక్షియైనను తాదాత్మ్యాధ్యాసమువలన అనేకరూపప్రపంచమును దనయందుఁ గల్పించుకొని వ్యవహరించును. ౧౭

అవ. స్వప్నదృష్టాంతసిద్ధమగు అర్థము ననువదించుచు దార్ష్టాంతికమును ముగింపుచున్నారు:—

మూ. స్వప్నే తద్వత్ప్రబోధే యో బహిశ్చాంత స్తథైవ చ,
ఆలేఖ్యాధ్యయనేయద్వ త్తదన్యోన్యధియోద్భవమ్. ౧౮

తా. స్వప్నవ్యవహారమందు బాహ్యాభ్యంతరభావము మనసుచే కల్పింపఁబడునట్లే జాగ్రదవస్థయందును మనస్సుచేతనే కల్పింపఁబడును. బాహ్యాభ్యంతరవ్యవహారము కల్పితమనువిషయమున స్వప్నదృష్టాంతమే కాక వేఱొక దృష్టాంతమును జూపుచున్నారు:—అక్షరములయొక్క బాహ్యాకారమును జూచి సంస్కారరూపముగ బుద్ధియందుఁ జదువఁబడును. ఆ బుద్ధిసంస్కార

వశమున తిరిగి వ్రాయఁబడును. ఇట్లు పరస్పరసాపేక్షగల లేఖనాధ్యయనములు వాస్తవములు కానట్లు బాహ్యార్థముల ననుసరించి ఆభ్యంతరమున సంస్కారరూపముగఁ గలుగుచు ఆభ్యంతరసంస్కారవశమున బాహ్యమున భాసించెడి వ్యవహారమంతయుఁ గల్పితమగుటచే మిథ్యయేకాని వాస్తవము కాదు. కల్పితమంతయు మిథ్యయే యని లోకవిదితము. ౧౪

అవ. బుద్ధినిష్ఠమగు అర్థమును వివరింపుచు ౧౩-వ శ్లోకములోని “తృష్ణోపాస్యథాక్రతుః” అను మాటను వివరింపుచున్నారు:—

మూ. యదాహ్యయం కల్పయేద్భేదం తత్కామః సన్యథాక్రతుః,
యత్కామస్తత్క్రతుర్భూత్వా కృతం యత్తత్ప్రపద్యతే.

తా. ఆత్మ భ్రాంతిసంస్కారవశమున బుద్ధ్యావరణమునఁజేరి అవిద్యాకృతభేదము గల్పించినప్పుడు, అధ్యాసవశమునఁ గల్పింపఁబడిన విషయము నభిలషించి దానినే నిరంతరము ధ్యానించుచుండును. (ఇచట ‘క్రతు’ శబ్దమునకు ‘నేను దీనిని సాధింతును’ అనెడి మనోనిశ్చయము అర్థము. యజ్ఞము కాదు) తిరిగి ఆ సంస్కారసహాయమున భేదమును గల్పించి, సంకల్పపూర్వకముగ కర్మములను జేయుచు, వాని ఫలముల ననుభవించుచుండును. ఇట్లు సంకల్పమువలనఁ గర్మము, కర్మమువలన సంకల్పము నని అన్యోన్యాపేక్షతోఁ గల్పితమగు సంసారచక్రము ననుభవించుచుండును. ఇందుకు—“అథో ఖల్వాహుః కామమయ ఏవాయంపురుష ఇతి స యథా కామో భవతి తత్క్రతుర్భవతి తత్కర్మ కురుతే యత్కర్మ కురుతే తదభిసంపద్యతే” (బృహ ౬-౪-౫) అను శ్రుతిప్రమాణము.

అవ. చెప్పఁబడిన ‘దృశ్యం మిథ్యా’యనుటకు యుక్తిచే నిరూపించుచున్నారు:—

మూ. అవిద్యాప్రభవం సర్వమసత్తస్మాదిదం జగత్,
తద్వతా దృశ్యతే యస్మాత్సుషుప్తే నచ గృహ్యతే.౨౦

తా. చరాచరమగు నీ బాహ్యాభ్యంతరజగత్తు సుషుప్తియందు గోచరింపక జాగ్రత్స్వప్నములందు మాత్రమే అవిద్యాప్రభావమువలన కనుపించుచుండుటచే, స్వప్నమందుఁ దోఁచు పదార్థమువలె జగత్తును మిథ్యయని భావము. ౨౦

అవ. అట్లేని, జగత్కారణమగు అవిద్య యెట్టిది? దానిని నివర్తింపఁ జేయఁగల విద్య యెటువంటిది? ఈ రెండింటినిఁ దెలియువా రెవరు? అను ప్రశ్నముల కుత్తరము:—

మూ. విద్యావిద్యే శ్రుతిప్రోక్తే ఏకత్వాన్యధియా హి నః,
తస్మాత్సర్వప్రయత్నేన శాస్త్రే విద్యా విధీయతే. ౨౧

తా. సకలరూపములు నేత్రగ్రాహ్యములు. సకలశబ్దములు వాగ్వాచ్యకములు. సకలకర్మములు దేహకార్యములు. ఈమూఁడును జీవేశ్వరులచేఁ గల్పితములు. అనఁగా ఈశ్వరసృష్టిలో నొకనినే కొడుకు, అల్లుఁడు, భర్త, తండ్రి, మామ, తాత, బావ యని ప్రతియోగి బుద్ధిభేదమువలన జీవుఁడు మార్చుచుండును. ఇట్టి భేదబుద్ధియంతయు అసత్యము, అవిద్య యనఁబడును. ఈ జగత్తు ఏ బ్రహ్మమందుఁ గల్పితమై, ఏ బ్రహ్మమందు నిలిచి, ఏ బ్రహ్మమందే తిరిగి లయించునో ఆ బ్రహ్మ మొకటియే సత్యము నిత్యము నని తెలియుట 'విద్య' యనఁబడును. ఈ భేదబుద్ధి అధ్యారోపమనియు, ఐక్యబుద్ధి అపవాదమనియుఁ శ్రుతి చెప్పుచున్నది. ఒక బంగారపు కడ్డీని పలువిధములగు వస్తువులుగాఁ జేయుదురు. ఈ యన్నివస్తువులకును గారణమొక బంగారు కడ్డీయేకదా. ఇట్లు ఒక బంగారమును పలువిధములుగా జేయుట 'అధ్యారోప'

మనఁబడును. ఈవస్తువు లన్నిఁటినిఁ గరఁగఁగా బంగారము మాత్రమే మిగిలి కల్పితభూషణములు నామరూపరహితములగును. ఇది 'అపవాద' మనఁబడును. కరఁగకముందును, కరఁగి వస్తువులుగా మాఱిన పిమ్మటనుగూడ బంగారము ఒకటియే. ఇట్లు స్వరూపభేదమును బొందిన వస్తువులు కాలత్రయమందును స్వర్ణమే యైనట్లు సకలప్రపంచమును బ్రహ్మమాత్రమే యని తెలియుటయే 'విద్య' ఆద్యంతములయందు లేనిదై మధ్యకాలమందు (వస్తురూపముగ నున్నపుడు) మాత్రము కనుబడు ఆభరణముల యొక్క నామరూపముల నుపేక్షింపఁగా స్వర్ణముమాత్రమే మిగిలియున్నట్లు సృష్టికాలమందుఁ గల్పితములగు నామరూపములు స్వప్నమువలెను, ఇంద్రజాలమువలెను మిథ్య యని యుపేక్షింపఁగా, సకల ప్రపంచకల్పనాధిష్ఠానముగ నేకమై శేషించు బ్రహ్మముమాత్రమే నిత్యము, సత్యము నని శ్రుతిప్రోక్తార్థమును గురుకటాక్షమునఁ దెలియనగును. ఇట్లు “ఆదావంతేచ యన్నాస్తి మధ్యే తత్స్వప్నవన్నహి, మధ్యేఽపి చ తదేవాస్తిభూషాభావే సువర్ణవత్.” శ్రీశంకరాచార్యవచనము:—ఇవి విద్యావిద్యల స్వరూపము. లోకదృష్టితో నేనిదేవత నుపాసించుచున్నాను అనెడి భేదబుద్ధిగలవాఁడు పశుప్రాయుఁడు, ప్రాజ్ఞుఁడు కాఁడని “అథ యోఽన్యాం దేవతాముపాస్తే న స జానాతి యథా పశుః”(బృహ. ౩-౪-౧౦) అను శ్రుతి చెప్పుచున్నది కనుక భేదబుద్ధి అవిద్య. అభేదజ్ఞానము విద్య. అవిద్య అనుభవసిద్ధమైనట్లు విద్య అనుభవగోచరము కాదు. కనుక అధిక ప్రయత్నముచేత అధ్యారోపాపవాదన్యాయమున, శాస్త్రమందుఁ బ్రతిపాదింపఁబడిన విద్యావిచారమును నిరంతరమును జేయుచు ముముక్షువు బ్రహ్మనిష్ఠుఁడు కావలెను.

అవ. సర్వప్రయత్నముచే విద్య నెఱుఁగవలెనని శాస్త్ర

ము చెప్పుచుండ నెల్లరును విద్యాప్రాప్తి కేలయత్నింపరు? అను శంక కుత్తరము:—

మూ. చిత్తే హ్యాదర్శవద్యస్మాచ్ఛుద్ధే విద్యా ప్రకాశతే,
యమైర్నిత్యైశ్చ*నియమై స్తపోభి స్తస్య శోధనమ్. ౨౨

తా. స్వచ్ఛమైన అద్దమందు ముఖప్రతిబింబము స్పష్టముగఁదోఁచు నటుల, చిత్తశుద్ధి కలిగెనేని విద్యయుఁ బ్రకాశించును. అహింస బ్రహ్మచర్యము మున్నగు యమముచేతను, బాహ్యాభ్యంతరశౌచము మొదలగు నియమముచేతను, తపస్సు చేతను చిత్తశోధన చేయుచునెడల చిత్తము పరిశుద్ధమగును. ౨౨

అవ. తపశ్శబ్దార్థమును జెప్పుచున్నారు:—

మూ. శారీరాది తపః కుర్యాత్తద్విశుద్ధ్యర్థముత్తమమ్,
మనఆదిసమాధానం తత్తద్దేహవిశోషణమ్. ౨౩

తా. శ్రీకృష్ణభగవానునిచే గీత, అ-౧౭, శ్లో-౧౪-౧౭ లలోఁ జెప్పఁబడినయట్లు, దేవతలను ద్విజులను గురువులను ప్రాజ్ఞులను భక్తి విశ్వాసములతోఁ బూజించుట, బాహ్యాభ్యంతరశౌచము, ఋజువర్తనము, బ్రహ్మచర్యము, అహింసయు నను సుగుణములుగలిగిన బాహ్యాతపస్సును; పరుషవాక్యము లేకుండ సత్యవాక్కు, శ్రవణానందకరమగు ప్రియభాషణము, వేదాధ్యయనము నను 'వాచిక'తపస్సును; విషయములందు వికారము జెందని మనః ప్రసాదమును, పక్షపాతరహితమగు సౌమ్యత్వమును, ఈశ్వరధ్యానపరత్వము

* 'యజ్ఞైశ్చ తపోభిః' = స్వాశ్రమవిహితధర్మముల నెరవేర్చుచు పరమేశ్వరసాక్షాత్కారమును బొందుటవలన.

గల మౌనమును, విషయప్రవృత్తిలేని మనోనిగ్రహమును, రాగద్వేషాదులు లేని భావసంశుద్ధియును గలిగిన 'మానసిక' తపస్సనెడి త్రివిధతపస్సులను ఆచరించినయెడల చిత్తశుద్ధి కలుగును. అట్టి తపస్సుతో బాహ్యేంద్రియాంతరింద్రియనిగ్రహము గలిగి శీతోష్ణాదిసహిష్ణుత్వమువలన శరీరశోషణమునకు ఓర్చుటయే తపస్సనంబడును. ౨౩

అవ. ఇట్లు పరోక్షముగనుపకరించు తపస్సాధ్యమార్గమును జెప్పి యింకను శ్రవణమననాదికపరసాధనమును వివరించుచున్నారు:—

మూ. మనసశ్చేంద్రియాణాంచ హ్యైకాగ్ర్యం పరమం తపః,
తజ్జ్యాయః సర్వధర్మేభ్యః స ధర్మః పర ఉచ్యతే ౨౪

తా. గురువుచే బోధింపంబడిన శ్రుత్యర్థమందు మననముచే గలుగు చిత్తస్థైర్యము ఏకాగ్ర్యమనంబడును. మననమనంగా వినినయర్థమును యుక్తులచే సత్యమని స్థిరపరచుకొనుట. ౨౪

అవ. ఈ చెప్పిన సాధనములచే చిత్తసంశుద్ధిగల పురుషుడు శ్రవణమననిదిధ్యాసనముల నభ్యసించుచు, అవస్థాత్రయసాక్షియై నిత్యుండైన ఆత్మను మహావాక్యములవలన విమర్శించి, తాను బ్రహ్మమే యని తెలియవలెనని చెప్పుచున్నారు:—

మూ. దృష్టం జాగరితం విద్యాత్స్మృతం స్వప్నం తదేవ తు,
సుషుప్తం తదభావం చ స్వమాత్మానం పరం పదమ్. ౨౫

తా. బాహ్యేంద్రియములచే శబ్దస్పర్శరూపరసగంధముల నెఱుంగుట జాగ్రదవస్థ. సంస్కారవశమున నిద్రలో భాసించు దృష్టవస్తువులే

స్వప్నము. ఆ చూచినది తలంచినది లేని అవస్థ సుషుప్తి యనఁబడును. ఈ అవస్థాత్రయమును వేఱుపర్చి దృశ్యములగు వానికంటె వేఱుగనుండి వాని యొక్క స్థితిగతుల నెఱింగెడి ఆత్మను సత్యజ్ఞానాదిలక్షణములుగల బ్రహ్మముగను, ఆ బ్రహ్మమే తానుగను దెలియవలెను. ౨౫

అవ. అవస్థాత్రయకారణమగు అజ్ఞానము భాసించుచుండఁగా, ఆయవస్థాత్రయమునకంటె వేఱుగనుండు ప్రత్యగాత్మ బ్రహ్మమే యని తెలియుట యెట్లు? అనుప్రశ్నకు ఉత్తరము:—

మూ. సుషుప్త్యాఖ్యం తమోఽజ్ఞానంబీజంస్వప్నప్రబోధయోః,
స్వాత్మబోధప్రదగ్ధం స్యాద్బీజం దగ్ధం యథాఽభవమ్.

తా. సుషుప్తియను తమస్సు స్వప్నజాగ్రదవస్థలకుఁ గారణమగును. దీనినే అజ్ఞానమందురు. స్వప్నమను అంకురమునకును, జాగ్రదవస్థయను వృక్షమునకును ఈ సుషుప్త్యవస్థ బీజమగును. ఈబీజము తత్త్వజ్ఞానమనెడి అగ్నిచే దగ్ధము కాఁబడి, దగ్ధబీజము మొలువనియట్లే, సంసార వృక్షమును బుట్టింపఁజాలదు. ఇట్టి బోధవలన ప్రత్యగాత్మ పరమాత్మయే యగును. ౨౬

అవ. అవస్థాత్రయమునకును అజ్ఞానమే బీజమని చెప్పిన విషయమును ధ్రువపర్చుచు, అజ్ఞాననివృత్తివలననే సంసారము తొలఁగునని చెప్పుచున్నారు:—

మూ. తదేవైకం త్రిధాజ్ఞేయం మాయాబీజం పునఃక్రమాత్,
మాయావ్యాత్మాఽవికారోఽపి బహుధైకో జలార్కవత్. ౨౭

తా. ఒక్కటియగు ఆ మాయాబీజమే సుషుప్తి. సుషుప్తినుండి జాగ్రదవస్థయును, జాగ్రదవస్థనుండి సుషుప్తియును ప్రతిదినము మాఱుచుండును. సమష్టివ్యష్టిభేదములచే ఈశ్వరుఁడు ప్రాజ్ఞుఁడు నను ఉపాధులతోఁ గూడిన లయావస్థను, హిరణ్యగర్భుఁడు తైజసుఁడు నను ఉపాధులతోఁ గూడిన స్వప్నావస్థను. వైశ్వానరుఁడు విశ్వుఁడు నను ఉపాధులతోఁగూడిన జాగ్రదవస్థను పొందుచుండును. ఆ చైతన్యబీజమే దేవతిర్యఙ్మనుష్యస్థావరాదిభేదములను పొంది కార్యావస్థయందు అనేకమగుచుండును. ఒక మఱ్ఱిగింజ మట్టిలోనుండి మొక్క, చెట్టు, కొమ్మ, చిగురు, ఆకు మొదలగు ననేకభేదములను బొంది తిరిగి బీజమగునట్లు కార్యావస్థయందు అనేకముగఁ బరిణమించు నీమాయాబీజము కారణావస్థయందు నొక్క అజ్ఞానబీజమాత్రమే యగును. వేఁచఁబడిన బీజము తిరిగి మొలకెత్తనియట్లు, జ్ఞానాగ్నిచే దగ్ధమైన యీ అజ్ఞానబీజము తిరిగి సంసారాకారముగఁ బరిణమింపదు. అట్టి అజ్ఞాననాశమునకై తత్త్వజ్ఞానమునుగూర్చి యత్నింపవలయును. అజ్ఞానబీజమొకటియె మూఁడుగమాఱునట్టి తమోబీజమునకు స్వతంత్రప్రవృత్తి కలదా యను శంక కలుగును. అట్లు స్వాతంత్ర్యము ప్రకృతికి సిద్ధించెనేని సాంఖ్యసిద్ధాంతప్రసంగము కలుగునని తమస్సున కపేక్షితమగు ఆశ్రయమును వివరించుచున్నారు:—

మాయావీ=మాయకు ఆధారమగు, ఆత్మా=ఆత్మ, అవికారీ=వికారరహితుఁడు. జలమందుఁ బ్రతిఫలించిన సూర్యుఁ డొకండే యగుచు వివిధజలోపాధులందు ననేకముగఁ దోఁచుచున్నను, అనేకముగాక జలోపాధివికారములను జెందకయే యుండును. ఇట్లు మాయావి స్వమాయాకల్పితోపాధులందు అనేకముగఁ దోఁచినను మాయావికారముల నంటక నొక్కండే యగును. ౨౭

అవ. ఈయర్థమునే సదృష్టాంతముగ వివరించుచున్నారు:—

మూ. బీజం చైకం యథా భిన్నం ప్రాణస్వప్నాదిభిస్తథా,
స్వప్నజాగ్రచ్ఛరీరేషు తద్వచ్చాత్మా జలేందువత్. ౨౮

తా. అవిద్యయనెడి కారణ మొకటియేయైనను స్వప్నజాగ్రదాది భేదములచే సమష్టివ్యష్టిశరీరములతో జలబింబితచంద్రునివలె ననేకమై, ఆయా ఉపాధులచే సమష్టియందు హిరణ్యగర్భుఁడు, వైశ్వానరుఁడు నను పేర్లతోను బ్రకాశించుచుండును. ౨౮

అవ. మాయాకల్పితదేహములచే ఆత్మకు అనేకత్వ ముండెనేని వ్యాపారవత్త్వముకూడ కలుగునుగదా! అట్లైని కూటస్థత్వమునకు హాని కలుఁగును. (కూటస్థత్వమనఁగ వ్యాపారవికారములు లేకయుండుట) అను శంకను దృష్టాంత పూర్వకముగ నిరాకరించుచున్నారు:—

మూ. మాయాహస్తినమారుహ్య మాయావ్యేకో యథా
వ్రజేత్, ఆగచ్ఛంస్తద్వదేవాత్మా ప్రాణస్వప్నాదిగో
చరః. ౨౯

తా. మాయావీ+ఏకః=ఇంద్రజాలికుఁ డొకండయ్యును తనమాయచే రచింపఁబడిన ఏనుఁగునెక్కి రాకపోకలు చేయుచున్నట్లు తోఁచినను తాను అచలుఁడే యగునట్లు, ఉపాధిరహితుఁడగు ఆత్మ సుషుప్త్యాద్యవస్థలను బొందినట్లు భాసించుచున్నను చలనరహితుఁడగు కూటస్థుఁడే యగును. ౨౯

అవ. ఆత్మకు సుషుప్త్యాద్యవస్థాసంబంధము నంగీకరించి యిదివఱకుఁ జెప్పఁబడెను. ఇపుడాసంబంధము మాయాకల్పితమే కాని వాస్తవము కాదని నిరూపించుచున్నారు:—

మూ. న హస్తీ న తదారూఢో మాయావ్యనో యథా స్థితః,
న ప్రాణాది న తద్ద్రష్టా తథా జ్ఞోఽన్యః సదాదృశిః.

తా. ఏనుఁగు, ఏనుఁగునెక్కుట యనునవి రెండును మాయికములై, ఐంద్రజాలికుఁడు వీని నంటకయే వీనికి సాక్షిగనుండునట్లు సుషుప్త్యాద్యవస్థలు తత్సాక్షిత్వమును మాయికములై చిద్రూపాత్మ వేఱుగనుండును. (దీనినే 'గజో మిథ్యా పలాయనం మిథ్యా' యని చెప్పెదరు). ౩౦

అవ. సుషుప్త్యాదిసంబంధము ఆత్మకు వాస్తవము కాక పోవచ్చును. కాని యీ మాయాసంబంధము ఎట్లు నివారింపఁబడును అను శంక కుత్తరము:—

మూ. అబద్ధచక్షుషో నాస్తి మాయా మాయావినోఽపివా,
బద్ధాక్షస్యైవ సా మాయా మాయావ్యేవ తతో భవేత్. ౩౧

తా. మాయావికి(ఐంద్రజాలికునకు)మాయాభ్రాంతిలేనట్లు, [1]కనుకట్టు లేనివానికిని (ఇంద్రజాల) మాయాభ్రాంతిలేదు. కనుకట్టుగలవానినే మాయ గజాదిరూపమిథ్యాప్రదర్శనమువలన భ్రమపెట్టును. కనుక మాయకు మాయావితనంతట తాను ఆధారమైయుండవలెను. ఇట్లే చిత్స్వభావమునకు మాయావరణము లేనపుడు, మాయావికి మాయాకార్యమువలన హానిలేనట్లు, మోహమునకుఁ గారణమగు మాయతొలంగఁగా, ప్రతిబంధరహితమగు జ్ఞాన చక్షుస్సువలన 'చిద్రూపుఁడనగు నేను బ్రహ్మమునే' యని దృఢనిశ్చయము గల యోగిని మాయ మోహపెట్టఁజాలదు. అట్టి యోగి ప్రాపంచికవ్యవహారము

1 ఇంద్రజాలికుఁడు సేయు గారడిచూచువారికి నిజముగఁదోఁచు మంత్రప్రభావము 'కనుకట్టు' అనఁబడును.

చూచుచున్నను సుషుప్తునివలె నిర్వికారుఁడై యుండును. (మూలములోని 'వా' శబ్దమునకు 'ఇవ' (వలె) యని యర్థము). 31

అవ. కాఁబట్టి సాక్షాద్బ్రహ్మాత్మజ్ఞానమువలన తాను ఆ మాయావినై మాయా తత్కార్యసంబంధరహితుఁ డగును అనెడి శ్రుత్యర్థమును ముముక్షువు శ్రద్ధతో నాచరింపవలెనని చెప్పుచున్నారుః—

మూ. [1]సాక్షాద్దేవ స్వవిజ్ఞేయః సాక్షాదాత్మేతి చ శ్రుతేః,
భిద్యతే హృదయగ్రన్థి ర్న చేదిత్యాదితః శ్రుతేః. 32

తా. సకలవికారములయొక్క ఉత్పత్తినాశములను గనిపెట్టెడికూట స్థాత్మను సాక్షాద్దైవముగఁ దెలియవలెను. అని 'విజ్ఞానమానందం బ్రహ్మ' అను (బృహ. ౫-౯-౨౮) శ్రుతి బోధించుచున్నది. మఱియు నిట 'యత్సాక్షాద పరోక్షాద్బ్రహ్మ, య ఆత్మా సర్వాంతరః' (బృహ. ౫-౪-౧.) అను శ్రుతియు బ్రహ్మాత్మైకత్వమునే బోధించుచున్నది. ఇట్లు తెలియుటవలన లాభము, తెలియకపోవుటచే నష్టము అని శ్రుతులు ఘోషించుచున్నవి. ఎట్లనఁగా, ఆత్మకు దుష్టమగు అహంకారముతోఁగల సంబంధము సకలదుఃఖమయమగు సంసార కారణమగుటచే 'హృదయగ్రంథి' యనఁబడును. ఈ గ్రంథి ఆత్మజ్ఞానముచే వీడునని 'భిద్యతే హృదయగ్రంథి' యను శ్రుతి బోధించుచున్నది. సమర్థమగు బుద్ధీంద్రియాదిసాధనసంపత్తి గలిగినదగుటచే అత్యుత్తమమగు నీ నరజన్మ మందే 'బ్రహ్మాహమస్మి' యని తనను దాఁ దెలియనియెడల గొప్పహాని కలుగును. అనఁగా నీనరజన్మమునుండి నిట్టి బుద్ధ్యాదిసాధనములులేని పశ్వాదిజన్మము నెత్తినచోఁ గలిగెడి హాని యెంతేనికలదున అవి'న చేదిహా వేదీన్మహతీవినష్టిః' (కేన. ౧౩) అను శ్రుతి బోధించుచున్నది. మఱియు, ''మహతా పుణ్యా

1 సాక్షాదేవ.

అవ. గురువు అటువంటి శిష్యుని సంసారసాగరము నుండిదాటించుఉపాయముగ మొదటి 'తత్త్వమసి' మహావాక్య మందలి పదార్థవివేకమును జెప్పుచున్నారు:—

మూ. దృష్టిః స్పృష్టిః శ్రుతిర్ఘ్రాతిర్మతిర్విజ్ఞాతిరేవ చ,
శక్తయోఽన్యాశ్చభిద్యన్తే చిద్రూపత్వేఽప్యుపాధిభిః.

తా. ఏకమును త్వం పదార్థమునగు చైతన్యము నేత్రత్వక్ శ్రవణాది జ్ఞానేంద్రియములు, వాక్పాణిపాదాదికర్మేంద్రియములు మున్నగు ఉపాధులనుండి చూచుచున్నాను, తాఁకుచున్నాను, వినుచున్నాను, చెప్పుచున్నాను, తీసికొనుచున్నాను, నడుచుచున్నాను మొదలగు నింద్రియవృత్తి భేదముచేత వేఱువేఱుగఁ దోఁచినను, ఆవృత్తులను కడకుఁద్రోచి చైతన్యమాత్రముగ భాగత్యాగలక్షణచే గ్రహించుట "త్వంపదలక్ష్యార్థ" మనఁబడును. ౫౪

అవ. అనుభవమునుబట్టి చైతన్యభేదముండఁగా ఉపాధిభేదము వలననే భేదమని యేలచెప్పవలెనను శంక రాఁగా, చైతన్యమాత్రమునకే భేదమనినయెడల ఆత్మకు వికారములు కలుగవలసివచ్చును. కనుక ఉపాధిసంబంధమువలననే భేదము కాని ఆత్మకు సహజముగ భేదము లేదని చెప్పుచున్నారు:—

మూ. అపాయోద్భూతిహీనాభిర్నిత్యం దీప్యకైరవిర్యథా,
సర్వదృక్సర్వగః శుద్ధః సర్వం జానాతి సర్వదా. ౫౫

తా. సూర్యుఁడొకండయ్యును ఉత్పత్తినాశములులేని తన కిరణప్రసారముచే బ్రహ్మాండమంతయుఁ బ్రకాశింపఁజేయుచు వికారరహితుఁడై యున్నట్లు, ఉత్పత్తినాశములులేక ఉపాధిభేదమాత్రమున భిన్నములగు

సర్వభూతాంతరచిచ్ఛక్తులచేత సకలవిషయములను వేఱ్ఱేఱ గ్రహించు ఆత్మ సర్వమును సాక్షిగఁ జూచుచుండును. అనఁగా, తనయందు ఆరోపింపఁ బడిన సకలమునకు అధిష్ఠానమగుటచేత సర్వసంబంధము గలిగి సర్వమును భాసింపఁజేయుచు, ఆ జడవస్తువులయొక్క ఆగమాపాయములకును, తద్వికారములకును తాను సాక్షియై నిర్వికారుఁడగు ఆత్మ సర్వదా శుద్ధుఁడని భావము. ౧౫

అవ. ఆత్మ యిట్లు వికారరహితుఁడే యైనయెడల సంసారసుఖదుఃఖముల నెటు లనుభవించును? పరిమితమగు బుద్ధియందు ఎట్లుభాసించును? అను శంకకు సమాధానము:—

మూ. అన్యదృష్టిః శరీరస్థ స్తావన్మాత్రో హ్యవిద్యయా,
జలేందావ్ద్యుపమాభిస్తు తద్ధర్మా చ విభావ్యతే. ౧౬

తా. అవిద్యచేత దేహమందుండుటవలన దేహమంతప్రమాణము గలవాఁడనని యెంచు జీవుఁడు తాను దేహాదులకంటె భిన్నుఁడైనను, జలమందు ప్రతిఫలించు చంద్రునకు జలకంపము మొదలగు ధర్మములు వాస్తవముగ లేకున్నను, మూఢదృష్టికి నీ జలగతకంపరూపధర్మములు చంద్రునకున్నటులఁ దోఁచునట్లు, ఆత్మకు సంసారధర్మము లున్నట్లు తోఁచునేకాని వాస్తవముగ నవి ఆత్మధర్మములు కావు. ౧౬

అవ. ఇట్లు ఉపాధిపరామర్శ(సంబంధము) లేక ఆత్మకు భేదము మొదలగు సంసారధర్మములు లేనందునను, ఆయుపాధులకు ఆత్మసత్తకంటె వేఱగు సత్త లేనందున నవి మాయామయములగుట వలనను, నిత్యశుద్ధుఁడును పరిపూర్ణుఁడునగు చిదాత్మ సత్యజ్ఞానాదిలక్షణములుగల పరబ్రహ్మమేయని మహా

వాక్యములచే సద్గురూపదిష్టమగు ఆత్మతత్త్వము నెఱింగినట్టి ముముక్షువు సర్వదృశ్యమగు అవస్థాత్రయమును మిథ్యగ నుపేక్షించి, ఆకాశాదిదేహాంత సకలప్రపంచమునకును సకలావస్థలకును సాక్షియు, అధిష్ఠానమును చిదేకరసము నగు బ్రహ్మము తానేయని సర్వదృశ్యోపేక్షాపూర్వకముగ నిరంతరానుసంధానము చేయువాఁడు ముక్తుఁడగునను నభిప్రాయముతో బ్రహ్మానుసంధానక్రమమును జెప్పుచున్నారు:—

సూ. దృష్ట్వా బాహ్యం నిమీల్యాథ స్మృత్వా తత్ప్రవిహాయ చ, అథోఽస్మీత్యాత్మనో దృష్టిం బ్రహ్మ ప్రాప్నోత్యనధ్వగః. ౫౭

తా. జాగ్రత్ప్రపంచమును బ్రత్యక్షముగఁ జూచి, ఆ సర్వప్రపంచమును కటకకుండలహారాదికమంతయు కనకమాత్రమగునట్లు కారణమాత్రముగ నెంచి, కార్యమును కారణమందు లయింపఁజేసి వాసనామాత్రమగు స్వప్నప్రపంచమును మిథ్యగా భావించి, సూక్ష్మశరీరమును సయితము కారణచిదాభాసమాత్రముగ భావించి, సుషుప్తియందు బీజమాత్రముగనున్న అజ్ఞానమును సత్తనికాని అసత్తనికాని నిర్వచింప నర్హముకాదని యెంచి, వివేకముతో విమర్శించి, ఈ మూఁడవస్థలు వచ్చుచుఁ బోవుచుండఁగ వాని రాకపోకలను సాక్షిగఁ జూచుచు, వాని కాధారము నిత్యమునగు ఆత్మను ఉపాధిరహితముగ భావించువాఁడు బ్రహ్మమగును. ఈ యాత్మ బ్రహ్మమే

* ఇచట 'దృష్ట్వా' యనుటచేత జాగ్రదవస్థయు, 'నిమీల్య' యనుటచేత స్వప్నావస్థయు, 'ప్రవిహాయ' యనుటచేత కారణమగు సుషుప్త్యవస్థయుఁ జెప్పఁబడినది.

కనుక (అనధ్వగ) అర్చిరాదిమార్గములను పొందక బ్రహ్మమే యై విలసిల్లును. ౫౭

అవ. అర్చిరాదిమార్గములఁ బొందనివాఁడు బ్రహ్మమే యగునని చెప్పిన యంశమును విశదపరుచుచు, ఉపాసకునకు వలె విమర్శకునకు ముక్తి యితరాపేక్షకలదికాక స్వతఃసిద్ధమగునని సూచింపుచున్నారు.—

మూ. ప్రాణాద్యేవంత్రికం హిత్వా తీర్ణోఽజ్ఞానమహోదధిమ్,
స్వాత్మస్థో నిర్గుణఃశుద్ధో బుద్ధోముక్తః స్వతోహిసః.౫౮

తా. వివేకి యిట్లు సుషుప్త్యాది మూఁడవస్థలును మాయికములని తెలిసి, అర్చిరాదిమార్గములను జెందక సకలగుణములను ఆత్మయందు లయింపఁజేసి శుద్ధుఁడును ఉపాధిరహితుఁడు నగుటచే స్వభావముగ ముక్తుఁడగును. ౫౮

మూ. అజోఽహం చామరోఽమృత్యురజరోఽభయ ఏవ చ,
సర్వజ్ఞః సర్వదృక్శుద్ధ ఇతి బుద్ధో న జాయతే. ౫౯

తా. ఇట్లు అజ్ఞానమనెడి మహానిద్రనుండి మేల్కొని తాను సర్వజ్ఞుఁడను సర్వసాక్షిని శుద్ధుఁడను అని తెలిసికొనిన వివేకికి జననమరణ భయములేదు. ౫౯

అవ. ప్రబుద్ధునకుఁ బునర్జన్మాభావమునఁ గారణము:—

మూ. పూర్వోక్తం యత్తమోబీజం తన్నాస్తీతి వినిశ్చయః,
తదభావే కుతో జన్మ బ్రహ్మైకత్వం విజానతః. ౬౦

తా. ముందు చెప్పఁబడిన అజ్ఞానమనెడి తమస్సు తత్త్వజ్ఞానముచే నశించును. ఎట్లనఁగా, ముత్యపుచిప్పను జూచి యది రజతమని భ్రాంతి జెందినవాఁడు, విమర్శించి యది ముత్తెపుచిప్పయేకాని వెండికాదని తెలిసి కొనఁగా, ముత్తెపుచిప్పయందు రజతభ్రాంతి తొలఁగును. ఇట్లే తత్త్వజ్ఞానముదయింపఁగనె అజ్ఞానరూపకారణము నశించినందున జ్ఞానికి మఱలజన్మము కలుగదు. కావున బ్రహ్మజ్ఞానము ముక్తికి సాధనమును, మహాఫలప్రదము నగును. ౬౦

అవ. "అహం బ్రహ్మాస్మి" యని ఆత్మసాక్షాత్కారము గలిగినజ్ఞానియు పూర్వమువలె వ్యవహరించుచుండుటవలన ధర్మాధర్మప్రయుక్తమగు శరీరమును బాల్చును, అను శంకకు, క్షీరములనుండి తరచి తీయఁబడినవెన్న తిరిగి పాలలోఁ గలియనియటుల జ్ఞాని మఱల సంసారలంపటుఁడు కాఁడని చెప్పుచున్నారు:—

మూ. క్షీరాత్సర్పిర్యథోద్ధృత్య క్షిప్తం తస్మిన్న పూర్వవత్,
బుద్ధ్యాదేర్జ్ఞస్తథా సత్యాన్న దేహీ పూర్వవద్భవేత్.

తా. పాలు కాఁచి తోడువేయుటచేఁ గలిగిన పెరుగును మథింపఁగా పుట్టిన వెన్న తిరిగి పాలలో కలియనియట్లు, మాయాకల్పితము లగుటచే మిథ్యయగు బుద్ధ్యాదికమునుండి విమర్శించి, జ్ఞానమాత్రముగ తాను బ్రహ్మమేయని తెలిసికొనినవాఁడు తిరిగి దేహాభిమానమును బొందఁడు. అహంకారయుతమగు కర్మము బంధహేతువగును. కాని అహంకారరహితమగు కర్మము బంధహేతువు కానేరదు. ఇందుకు"యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే, హత్వాఽపి స ఇమాఀల్లోకాన్న హన్తి న నిబధ్యతే." ౧౮-౧౭ అను గీతావాక్యము ప్రమాణము. ౬౧

అవ. పదార్థశోధనపూర్వకముగ మహావాక్యమువలన "అహం బ్రహ్మాస్మి" అని ప్రబోధముగలవానికి తిరిగి సంసార భయము లేదు. అను వచనమునందుఁ బ్రమాణమగు "ఆనందం బ్రహ్మణో విద్వాన్న బిభేతి కుతశ్చన" (తై. ౨. ౯) అను శ్రుతియొక్క అర్థమును నిరూపించుచున్నారు:—

మూ. సత్యం జ్ఞానమనంతం చ రసాదేః పంచకాత్పరమ్,
స్యామదృశ్యాదిశాస్త్రోక్త మహం బ్రహ్మేతి నిర్భయః.

తా. అన్నప్రాణాదికోశపంచకమునకంటె పరమై, ఆకాశముల కాధారమై సత్యజ్ఞానానందరూపమగు బ్రహ్మమే నేనని భావించువానికి నెట్టి భయమును లేదు. ౯౨

అవ. భయంకరులనుగూడ భయపెట్టు బ్రహ్మమగువానికి భయశంకయైనను లేదు, అని చెప్పఁబడిన బ్రహ్మజ్ఞునకు సంసారము లేదను మాటను ధృవపరుచుచున్నారు:—

మూ. యస్మాద్భీతాః ప్రవర్తంతే వాఙ్మనః పావకాదయః,
తదాత్మానందతత్త్వజ్ఞో న బిభేతి కుతశ్చన. ౯౩

తా. వాక్ఛబ్దమునకు అధ్యాత్మములగు వాగాదులును, మనశ్శబ్దమునకు అగ్న్యాదులును అర్థము. ఇచట "వాయ్వినా పావకాదయః" అని పాఠాంతరము. అపుడు ఇనః=సూర్యుఁడు, అగ్ని, ఇంద్రుఁడు, మృత్యువును, ఏ బ్రహ్మమునుండి భయపడుదురో అట్టి బ్రహ్మమె ప్రకాశించెడివాఁడు దేనినుండియు భయపడఁడు. ఇందుకు, "కేనేషితం పతతి ప్రేషితం మనః కేన ప్రాణః ప్రథమః ప్రైతి యుక్తః, కేనేషితాం వాచమిమాం వదంతి చక్షుః

శ్రోత్రం క ఉదేవో యునక్తి" "భీషాఽస్మా ద్వాతః పవతే, భీషోదేతి సూర్యః" (తై-౨.) ఇత్యాది శ్రుతులు ప్రమాణము. ౬౩

అవ. పండితులకును హరిహరహిరణ్యగర్భాదులు నమస్కరింపఁదగినవారలై యుండఁగా, వారి ఆజ్ఞాతిక్రమమువలన భయము సంభవించును గనుక వారికిని గర్తవ్యాంశము ఉండును గదా యనుప్రశ్నమునకు కర్తవ్యాంశము లేదని ఉత్తరము:—

మూ. నామాదిభ్యః పరేభూమ్ని స్వారాజ్యే చేత్ స్థితోఽద్వయే, ప్రణమేత్కం తదాఽఽత్మజ్ఞో నకార్యం కర్మణా తదా. ౬౪

తా. నామము, వాగింద్రియము, మనస్సు, ప్రాణము మొదలగు వానికంటె పరము, సర్వవ్యవహారాతీతము, అమృతము, ఏకమునగు స్వమహిమయందు నేను భూమబ్రహ్మమను నైక్యముగలవాఁ డెవనికి నమస్కరించును? తానే సకలాధిష్ఠాన బ్రహ్మమగుటచే సకలనదీజలములు సముద్రమును జేరునట్లు సకల దేవతానమస్కారములు తననే చెందును. కనుకనే 'మహ్యమేవ నమో నమః' అని చెప్పఁబడెను. అట్టి పరమావస్థయందున్న జ్ఞానికి కర్మతోఁ బనియేమియుం లేదు. నామముకంటె వాగింద్రియ మెక్కుడది, వాగింద్రియముకంటె మనస్సు గొప్పది. మనస్సుకంటె ప్రాణము గొప్పది. వీని యన్నిటికంటె ఆత్మ గొప్పదియై అన్నిటిని వ్యాపించి వానిని ప్రకాశింపఁజేయుచు, పరిపూర్ణము శాశ్వతమునై విలసిల్లును. ౬౪

అవ. భూమబ్రహ్మము నామాదులకంటె పరమసూక్ష్మము గనుకను సూక్ష్మముగుటచేత అద్వయ మగునా? యను శంకపైని అవస్థాత్రయరూపమగు నామాదికము భూమబ్రహ్మమందు మాయచే అధ్యస్త మగుట వలన మిథ్యకనుక తదవస్థాత్రయమునకు (వీని రాకపోకలకు) సాక్షియగుటచేతనే తురీయమని యెన్నఁబడుచు, సకలజగత్తు నకు సత్తాస్ఫూర్తులనిచ్చు ఆబ్రహ్మము అద్వయమని చెప్పుటకు అవస్థాత్రయమును అనువదించుచున్నారు:—

మూ విరాడ్వైశ్వానరో బాహ్యః స్మరన్నంతః ప్రజాపతిః,
ప్రవిలీనే తు సర్వస్మిన్ప్రాజ్ఞో ఽవ్యాకృతముచ్యతే.

తా. చైతన్యమొకటియె సమష్టి స్థూలదేహమందు 'విరాట్టు'ని వ్యష్టి స్థూలదేహమందు 'విశ్వుఁ'డనియు, సమష్టి సూక్ష్మదేహమందు 'హిరణ్యగర్భుఁ'డని, వ్యష్టి సూక్ష్మదేహమందు 'తైజసుఁ'డనియు, సమష్టి కారణ దేహమందు 'ఈశ్వరుఁ'డని, వ్యష్టి కారణదేహమందు 'ప్రాజ్ఞుఁ'డనియు ఉపాధివశమున నిట్లు భిన్నముగ వ్యవహరింపఁ బడుటచేత అవస్థాత్రయ సాక్షియగు చైతన్యమునకు తురీయమను సంజ్ఞ బోధకాలమందు చెప్పఁబడునే కాని ఆత్మకు వాస్తవముగ నెట్టి నామరూపములును లేవు. ౬౫

అవ. ఈయవస్థాత్రయాత్మకమగు జగత్తు నపేక్షించి తత్సాక్షియగు చిద్వస్తువును బ్రహ్మమనియు, ఆబ్రహ్మము నేనేయనియు నెఱుఁగుటవలన ముక్తుఁడగునని చెప్పుచున్నారు:-

మూ. వాచారంభణమాత్రత్వాత్సుషుప్తాదిత్రికం త్వసత్,
సతో౽హం జ్ఞశ్చాహమిత్యేవం సత్యసంధో విముచ్యతే.

తా. నామరూపాత్మకమగు దేహత్రయము మిథ్యయని, వాని ఆగమాపాయములను సాక్షిగఁ జూచుచు, సత్యజ్ఞానానందరూపమగుచు బింబభూతమగు పరమాత్మయే నేనుగాని, ప్రతిబింబమగు జీవుఁడను గాను అను ఆరూఢజ్ఞానమువలన సులభముగ ముక్తినొందును. ౬౬

అవ. ఆత్మతత్త్వము నెఱుఁగనపుడధ్యస్తమగు సంసారము ఆత్మతత్త్వజ్ఞానమువలనఁ బోఁగునుగద. అట్లైన జ్ఞానమువలెనే అజ్ఞానముకూడ ఆత్మధర్మమే కావలెనను శంకను దృష్టాంతపూర్వకముగ నిరాకరించుచున్నారు:—

మూ. భారూపత్వాద్యథా భానోర్నాహోరాత్రే తథైవ చ,
జ్ఞానాజ్ఞానే న మే స్యాతాం చిద్రూపత్వావిశేషతః.

తా. నిత్యప్రకాశస్వరూపుఁడగు సూర్యునకు రాత్రింబగళ్లనెడి భేదము లేనట్లు, నిత్యచిద్రూపుఁడగు ఆత్మకుఁ దనయందారోపింపఁబడిన జ్ఞానాజ్ఞానములు వాస్తవముగ లేవు. ఇచట జ్ఞానమనఁగా వృత్తిజ్ఞానమని తెలియవలెను. ౬౭

అవ. ఆత్మ నిర్విశేషము, నిష్క్రియము నను నీయాత్మధర్మములు శాస్త్రసిద్ధములగుటవలన నిచట యుక్తులను జెప్పుటకై శ్రమపడ నవసరము లేదని చెప్పుచున్నారు:—

మూ. శాస్త్రస్యానతిశంక్యత్వాద్ద్విక్రియైవ స్యామహం సదా,
బ్రహ్మణో మే న హేయం స్యాద్గ్రాహ్యం వేతి చ సంస్మరేత్. ౬౮

తా. శాస్త్రమునందు శంకకవకాశము లేనందున నేను నిశ్చయముగ

బ్రహ్మమనే యగుదును. పరిపూర్ణ బ్రహ్మమగు నాకు గ్రహింపఁదగినది కాని విడువఁదగినది కాని ఎద్దియును లేదు. ౬౭

అవ. బ్రహ్మబోధకమగు శాస్త్రమెద్ది? ఎల్లప్పుడు అహేయాగ్రాహ్య బ్రహ్మాత్మజ్ఞాననిష్ఠఁ గలవానికి ఫలమేమి? అనుశంకపైని "యస్తు సర్వాణి భూతాని" యను మంత్రముయొక్క అర్థమును జెప్పుచున్నారు:—

మూ. అహమేవ చ భూతేషు సర్వేష్వేకో నభో యథా,
మయి సర్వాణి భూతాని పశ్యన్నేవం న జాయతే. ౬౮

తా. అన్ని పదార్థములందును పరిచ్ఛిన్నముగనుండు ఆకాశము ఆయాయుపాధుల నుపేక్షింపఁగ నొక్కటియే యగురీతిని, భాగత్యాగ లక్షణచే సకలభూతోపాధుల నొక్కటఁ ద్రోయఁగా, ఆసకలోపాధినిష్ఠమును, వాని కల్పనకధిష్ఠానమును నగు సచ్చిద్రూపాత్మ యొక్కటియే యగును. ఇట్లు సకలభూతముల కధిష్ఠాన (ప్రకాశక) మగు ఆత్మ నేనే యని యెఱిఁగినవానికి పునర్జన్మము లేదు. ౬౮

అవ. ఆత్మ అద్వితీయబ్రహ్మమని చెప్పెడిశ్రుతికి అర్థమును వివరించి, బ్రహ్మము విశేషరహితమనెడి శ్రుతియొక్క అర్థమును జెప్పుచున్నారు:—

మూ. న బాహ్యం మధ్యతో వాఽంతర్విద్యతేఽన్యత్స్వతః క్వచిత్, అబాహ్యాంతః శ్రుతేః కించిత్తస్మాచ్ఛుద్ధః స్వయంప్రభః. ౭౦

తా. స్వయంప్రభమగు ఆత్మకు లోపల, వెలుపల, మధ్యను, మఱి యెక్కడను వాస్తవమగు అన్యపదార్థ మేదియును లేదు. ఆత్మయందుఁ గల్పితమగు పదార్థముయొక్క సత్త ఆత్మసత్తయేకాని కల్పితమగుదానికి స్వతః సత్త లేదు. ఎట్లనఁగా:—శర్కరతోఁ జేయఁబడిన భక్ష్యములోని పదార్థములకుఁ గలుగు మాధుర్యము చక్కెరదేకాని వానికి స్వయముగ మధురిమ లేదు. ఇట్లే జగత్సత్త ఆత్మసత్తకంటె వేఱుకాదు. ఇక్కడ, "తదేతద్బ్రహ్మాపూర్వమనపరమనంతరమబాహ్యమయమాత్మా బ్రహ్మసర్వానుభూః" (బృహ-౪-౫-౧౯) అను శ్రుతి ప్రమాణము. 'సర్వానుభూః' అనఁగా స్వయంప్రభమని అర్థము. ౨౦

అవ. ఆత్మకు సర్వప్రపంచముతో సంగము లేదనుటకు శ్రుతిప్రమాణము:—

మూ. నేతినేత్యాదిశాస్త్రేభ్యః ప్రపంచోపశమోఽద్వయః,
అవిజ్ఞాతాదిశాస్త్రాచ్చ నైవ జ్ఞేయో హ్యతోఽన్యథా.

తా. 'నేతి నేతి' (ఇదికాదు ఇదికాదు) అని ప్రపంచమును నిషేధించు శాస్త్రములవలన ఆత్మను ద్వితీయరహితముగఁ దెలియవలెను. ఇతరపదార్థములు చిత్తాదింద్రియములకు గోచరమగునట్లు ఆత్మ ఇంద్రియగోచరముగఁగాని, సప్రపంచముగఁగాని తెలియఁబడదు. ఇందుకు "అన్యదేవ తద్విదితాదథో అవిదితాదధి, యస్యామతం తస్యమతం మతం యస్య న వేద సః. (కేనోప) అవిజ్ఞాతం విజ్ఞాతృ (బృహ ౫-౮-౧౧) ఈ మొదలగు శ్రుతులు ప్రమాణము. ౨౧

అవ. "తస్మాదేషాం తన్న ప్రియం యదేతన్మనుష్యా విద్యుః." (బృహ. 3-౪-౧౦) (జ్ఞానులు దేవతలను హవ్య

ముల నిచ్చి తృప్తి పొందింపరు కనుక మనుష్యులకుఁ గలిగెడి ఆత్మజ్ఞానము దేవతల కిష్టముకాదు. అను శ్రుతినిఁబట్టి అధ్యాత్మ నెఱిఁగినవారలకు గలిగెడి ఫలములు దేవతలు విఘ్నమునేతురు, అనెదవేని, బ్రహ్మజ్ఞాని దేవతలకును ఆత్మయగుట చేత నట్లనఁగూడదు. విద్వాంసుల ఫలవిఘ్నమును జెప్పెడి శ్రుతి బ్రహ్మజ్ఞులకు వర్తింపదని చెప్పుచున్నారు:—

మూ. సర్వస్యాత్మాఽహమేవేతి బ్రహ్మ చేద్విదితం పరమ్,
స ఆత్మా సర్వభూతానామాత్మా హ్యేషామితి శ్రుతేః.

తా. బ్రహ్మము సర్వమునకును ఆత్మ. ఆబ్రహ్మము నేనే యని ఎఱిఁగినవానికి దేవతలు ఫలవిఘ్నము చేయఁజాలరు. ఏబ్రహ్మము సర్వభూతములకును ఆత్మగా నున్నదో ఆబ్రహ్మమే దేవతలకును ఆత్మయనియు, అట్టి ఆత్మజ్ఞానముగలవానికి దేవతలు ఎట్టి విఘ్నమును జేయలేరని "తస్యహిన దేవాశ్చ నాభూత్యా ఈశత ఆత్మా హ్యేషాం సంభవతి" అను (బృహ. 3-౪-౧౦) శ్రుతి బోధించుచున్నది. ౭౨

అవ. ఇట్లు దేవతలుసయితము బ్రహ్మజ్ఞానిని ఉపాసింపవలెనని సిద్ధింపఁగా, అజ్ఞాని దేవతలకు పశువుకాఁడని నిశ్చయింపఁ బడెనుగనుక, అజ్ఞాని కెవ్వారివలనను భయములేదనుటయందు ప్రమాణమగు శ్రుతియొక్క అర్థమునుగూడ చెప్పుచున్నారు:—

మూ జీవశ్చేత్పరమాత్మానం స్వాత్మానం దేవమంజసా,
దేవోపాస్యః సదేవానాం పశుత్వాచ్చ నివర్తతే. ౭3

తా. జీవుఁడు తనను పరమాత్మునుగాఁ దెలిసికొనినపుడు దేవతలును వీనిని సేవింతురు. దేవతలకుఁ బూర్వమువలె హవిర్భాగముల నిత్తఁ డీయ్య నక్కరలేదు. ఇచట, "యదైవమను పశ్యత్యాత్మానం దేవమంజసా, ఈశానం భూతభవ్యస్య న తదావిజుగుప్సతే;" (కఠ. ౪-౫) "సర్వేఽస్మై దేవా బలి మావహంతి; (తై. ౧-౫) తమేవం విద్వానమృత ఇహ భవతి; (తై. ఆ. 3-౧-3) అనెడి శ్రుతులు ప్రమాణము.　　౭3

అవ. సత్యాభిసంధుఁడు ముక్తుఁడనుటను స్ఫుటపరచు చున్నారు:—

మూ. అహమేవ సదాత్మజ్ఞః శూన్యస్త్వన్యో యథాఽంబరమ్,
ఇత్యేవం సత్యసంధత్వా [1]దసద్ధాతాన బధ్యతే.　　౭౪

తా. "తత్సత్యం స ఆత్మా" (ఛాం. ౬-౧౬) అనెడి శ్రుతిప్రమాణమువలన సదాత్మయం సర్వజ్ఞుఁడునగు నాకు, ఆకాశమునకు తదితరదృశ్య వస్తుసంసర్గము లేనియటుల యితరపదార్థ సంసర్గములేదని భావించు జ్ఞాని సత్యసంధతవలనను, అసత్ + హోతా = అసత్యవస్తువును ఉపేక్షించువాఁడు అసత్యవాదియగు చోరునివలె బంధింపఁబడక ముక్తుఁడగును. ఇచట, "స యథా తత్ర న దహ్యతే, ఐతదాత్మ్యమిదం సర్వమ్" (ఛాం. ౬-౧-౬) మున్నగు శ్రుతులు ప్రమాణము.　　౭౫

అవ. ఇతరుల కిట్టి జ్ఞానము లేనందున పశుప్రాయులై శోచనీయులగుదురనిచూపుచు, "అథ యేఽన్యథాఽతో విదు రన్యరాజాన స్తేక్షయ్యలోకాభవంతి" (ఛాం. ౭-౨౫-౨) యను శ్రుతియొక్క అర్థమును వివరించుచున్నారు:—

---

1 అసద్ధానాన్న.

మూ. కృపణాస్తేఽన్యథైవాతో విదుర్బ్రహ్మ పరం హి యే,
స్వరాడ్యోఽనన్యదృక్స్వస్థ స్తస్య దేవా అసన్వశే. ౭౫

తా. పరమాత్మను దృశ్యమగు అనాత్మగఁ జూచువారు శోచనీయులు
ఇతరము నుపేక్షించి ఆత్మదర్శనము చేయువారు సుఖింతురు. ఇట్టి జ్ఞాను
లకు దేవతలు వశవర్తులగుదురు. ఇందుకు, "ఏవం విజానన్నాత్మరతి రాత్మ
క్రీడః ఆత్మమిథునః ఆత్మానందః స స్వారాడ్ భవతి," (ఛాం-౭-౨౫.)
అను శ్రుతి ప్రమాణము. "తస్య సర్వేషు లోకేషు కామచారో భవతి,"
యస్త్వేవం బ్రాహ్మణో విద్యాత్తస్య దేవా అసన్వశే" (తై. ఆ. 3-౧3)
ఇత్యాది శ్రుతులును ప్రమాణము. ౭౫

అవ. ఆత్మజ్ఞాని ధన్యుఁడు గనుక ముముక్షువులు ము
క్తికై యత్న మవశ్యము చేయవలెనని బోధించుచున్నారు:-

మూ. హిత్వా జాత్యాదిసంబంధాన్వాచో ఽన్యాః సహ క
ర్మభిః, ఓ మిత్యేవం స్వమాత్మానం సర్వం శుద్ధం ప్రప
ద్యథ. ౭౬

తా. ఓ ముముక్షువులారా ! మీరలు దేహము నాశ్రయించియున్న
జాతిని, ఆశ్రమమును, ఇతర వాక్కర్మములను ఉపేక్షించి శుద్ధము సంపూ
ర్ణమునగు ఆత్మను 'ఓం' అని ధ్యానింపుఁడు. "యస్మిన్ ద్యౌః పృథివీ చాంత
రిక్ష మోతం మనః సహ ప్రాణై స్సర్వైః, తమేవైకం జానథ ఆత్మానం అన్యా
వాచో విముంచథామృత స్యైష సేతుః ; ఓమిత్యేవం ధ్యాయథ ఆత్మానం"
(ముండ. ౨-౨,) అను వాక్యద్వయ మిట ప్రమాణము. ఆత్మేతరవిషయము
లగు వాక్యములను విడువుఁడు. సర్వమునకు అధిష్ఠానమును విశేషరహితమునగు
బ్రహ్మమునే ధ్యానింపుఁడు. ౭౬

అవ. ప్రాప్తవ్యమగు ఆత్మను మఱియొకశ్రుతిచే వర్ణించుచున్నారు:—

మూ. సేతుం సర్వవ్యవస్థానా మహోరాత్రాదివర్జితమ్,
తిర్యగూర్ధ్వమధః సర్వం సకృజ్జ్యోతిరనామయమ్. ౨౨

తా. ఆత్మ, వర్ణాశ్రమాది మర్యాదలకు ఏర్పరుచునది. ఈ ఆత్మ సర్వదా స్వయంప్రకాశమగుటచేత దీనికి రాత్రింబగళ్లుగాని చీకటి వెలుతురులుగాని లేవు. ఈ ఆత్మజ్యోతి సర్వవ్యాపియు నిత్యము అసంగమునై యుండును. ౨౨

అవ. ప్రాప్తవ్యమగు ఆత్మకు నింక నేమిలక్షణము? అను ప్రశ్నకు, "అన్యత్రధర్మాదన్యత్రాధర్మాదన్యత్రాస్మాత్కృతాకృతాత్,అన్యత్రభూతాచ్చ భవ్యాచ్చ యత్తత్పశ్యసి తద్వద" అను (ఛాం. ౮-౪) శ్రుతియొక్క అర్థమును వివరించుచున్నారు:—

మూ. ధర్మాధర్మవినిర్ముక్తం భూతభవ్యాత్కృతాకృతాత్,
స్వమాత్మానం పరం విద్యాద్విముక్తం సర్వబంధనైః.

తా. ఆత్మకు ధర్మాధర్మములు లేవు. ఆత్మ ఆగతానాగతముల కంటెను, కార్యకారణములకంటెను పరమగుచు వానినిం బ్రకాశింపఁజేయునదియు, ఏబంధములును లేనిదియును. ౨౩

అవ. ఆత్మకు కర్తృత్వాదిధర్మము లుండఁగా ఆత్మ సర్వబంధవిముక్తుఁ డెట్లగును? అను శంక రాఁగా, అకర్తృత్వాది

ధర్మములుకూడ శ్రుతిచేఁ జెప్పఁబడుటచేత విరుద్ధధర్మములు రెండును ఏకబ్రహ్మవస్తువునం దుండవు కనుక కర్తృత్వాదికము మాయామయమనియు, అకర్తృత్వాదికము ఆత్మధర్మమనియు, విశేషాభిప్రాయముతో విరుద్ధధర్మబోధకములగు శ్రుతుల నుదాహరించుచున్నారు.—

మూ. అకుర్వన్సర్వకృచ్ఛుద్ధస్తిష్ఠన్నత్యేతి ధావతః,
మాయయా సర్వశక్తిత్వాదజః సన్బహుధా మతః.

తా. ఆత్మ వాస్తవముగ నేమియుం జేయనిదైనను ఉపాధివశమున సర్వమును జేయునట్లుండును. పుణ్యపాపసంబంధ రహితమును అచలమునగు ఆత్మ బహువేగముగల మనస్సునుగూడ మీఱియుండును. మనఃప్రాణాదులు పోవుచోటనెల్లను ఆత్మ చైతన్యస్ఫూర్తి నియతముగ నుండుటవలన ఆత్మ కదలకున్నను మీఱి నడుచునట్లు భాసించును. ఆత్మ జననమరణములు లేనిదైనను బహురూపధారి యగును. ఇట్లు విరుద్ధముగ భాసించుటకు సర్వశక్తిగల మాయయే కారణము. ఇచట క్రమముగ నీశ్రుతులు ప్రమాణము. (1) అనేజదేకం మనసో జవీయః. (కఠ. ౨-౧౮) (2) శుద్ధమపాపవిద్ధం. (3) తద్ధావతోఽన్యానత్యేతి తిష్ఠన్. (4)అజాయమానో బహుధా విజాయతే.

అవ. ఆత్మ క్రియారహితమైనను ఉపాధిసంబంధమువలన క్రియాసహితముగఁ దోఁచుననుటకు దృష్టాంతము:—

మూ. రాజవత్సాక్షిమాత్రత్వాత్సాన్నిధ్యాద్భ్రామకో యథా, భ్రామయఞ్జగదాత్మాఽహం నిష్క్రియోఽకారకోఽద్వయః. ౮౦

తా. జగద్రూపుఁడను, పరమార్థమున ఉపాధివిరహముచే చిద్రూపుఁ

డనుకొను నేను స్వభావముగ క్రియాకర్తృండనయినను, సూదంటుఱాయి దగ్గర నినుము కదలుచుండఁగా అచేతనమగు ఱాయి యినుమును కదలించినది అనునట్లును, మహారాజు దేనిని జేయక కూర్చుండినను ఆతని యాజ్ఞ చేతనే జనులు స్వస్వవ్యాపారములను జేయుచుండఁగా రాజు చేయించె ననునట్లును, మాయచే జగదుత్పత్తిస్థితిలయములు జరుగుచుండఁగా, ఆత్మ ఆయాక్రియలను జేయుచున్నట్లు మూఢులు తలంచెదరు. “నిర్గుణో నిష్క్రియః” అను శ్రుతి కర్తృత్వమును నిరాకరించుటచేతనే వారలు మూఢులు. ౨౦

అవ. ఆత్మ స్వభావముగనే నిత్యశుద్ధస్వభావుఁడు కనుక శాస్త్రముచేతను, యుక్త్యనుభవములచేతను నిత్యశుద్ధస్వభావుఁడుగనే తెలియవలెను. అని చెప్పుచున్నారు:—

మూ॥ నిర్గుణం నిష్క్రియం నిత్యం నిర్ద్వంద్వం యన్నిరామయమ్, శుద్ధం బుద్ధం తథా ముక్తం తద్బ్రహ్మాస్మీతి ధారయేత్. ౨౧

తా. పరమాత్ముఁడు గుణక్రియారహితుఁడు, ద్వైతరహితుఁడు, బాధారహితుఁడు, సకలమలరహితుఁడు, బోధస్వరూపుఁడు, బంధరహితుఁడును. పరమాత్మయం దారోపింపఁబడిన బుద్ధియందు ప్రతిఫలించిన జీవాత్మ పరమాత్మయే కనుక ‘నేను ఆ పరమాత్మనేకాని అహంకారాదికము కాను’ అని స్మరింపవలెను. ప్రతిబింబము బింబముకంటె నన్యము కాదు, నిత్యమును గాదు. బింబమునకు ప్రతిబింబమువలన ద్విత్వమును గలుగనేరదు. కనుక ‘నేనా పరమాత్మనే’ యని గురూక్తమార్గమున సదా భావింపవలెను.

లోకములోఁ జెప్పినమాటనే మఱలఁ జెప్పినయెడల పునరుక్తి యనఁబడును. శాస్త్రమందును అట్లే యనఁబడును. కాని వేదాంత శాస్త్రమందు మాత్రము "భూయోఽపి వక్తవ్యం వక్తవ్యం" అను న్యాయమున హితవాక్యము కనుకను, దుర్బోధముకనుకను, ముముక్షువులను సంసారార్ణవమునుండి ఉద్ధరించుటకై పరమకారుణికులగు శ్రీశంకరాచార్యులు పరశివావతారులె కనుక ఒకచోట శాస్త్రమువలనను,మఱియొకచోట ఫలకథనమువల్లను, వేఱొకచోట విద్వదనుభవమును అభినయించి చూపుచు మఱలమఱల బోధింపుచుండుటచే నిచట పునరుక్తిదోషమని శంకింపఁదగదు. ౭౧

అవ. ఇదివఱకుఁ జెప్పిన ప్రకరణార్థమును సులభముగ గ్రహించుటకై సంగ్రహముగ తిరిగి చెప్పుచున్నారు.—

మూ. బంధంమోక్షం చ సర్వం యత ఇదముభయంహేయమేకంద్వయంచ, జ్ఞేయం జ్ఞేయాభ్యతీతం పరమమధిగతం తత్త్వమేకం విశుద్ధమ్, విజ్ఞాయైతద్యథావచ్ఛ్రుతిమునిగదితం శోకమోహావతీతః, సర్వజ్ఞః సర్వకృత్స్యాద్భవభయరహితో బ్రాహ్మణోఽవాప్తకృత్యః.

తా. కర్తృత్వాద్యభిమానమే బంధము. బ్రహ్మస్వరూపావస్థానము మోక్షము. అజ్ఞానమువలన బంధము కలుగును, స్వరూపజ్ఞానమువలన మోక్షముకలుగును. అన్నిటియందు గలిసియున్న ఒక్కటియగు కారణము, పరస్పరభిన్నమగు కార్యము నను రెండింటిని బాధ్యముగఁ దెలిసికొని, విశుద్ధము ఏకమునగు పరతత్త్వమును గురు శాస్త్రబోధలవలన దృశ్యముకంటె విలక్షణముగఁ దెలిసికొని, అనాత్మపదార్థములను గల్పితములగుటచే నవి మిథ్యయని ఉపేక్షించి, శోకమోహములను విడిచినవాఁడు స్వరూపసుఖము ననుభవిం

చును. "తత్ర కో మోహః కః శోక ఏకత్వమనుపశ్యతః" అను కఠ శ్రుతి యిచటః ప్రమాణము. సర్వము అధిష్ఠాన బ్రహ్మమని యెఱుఁగువాఁడు సర్వజ్ఞుఁడు. ఆ సర్వమును దనయందు ఐక్యముచేయువాఁడు సర్వకృత్. ఇచట "అహం విశ్వం భువన మభ్యభవాం" అను (తై. ఉ.3-౧౦) శ్రుతి ప్రమాణము. (ఇచట దీర్ఘము గానము నిమిత్తమని తెలియవలెను). సకలభువనమును నా స్వాధీనము చేసికొనినాను అని శ్రుత్యర్థము. జ్ఞానికి సంసారభయము లేదు. ఇందుకు, "నబిభేతి కుతశ్చన" అను శ్రుతి ప్రమాణము. బ్రహ్మజ్ఞానికి సకల కామములు సిద్ధించుననియు, నిజఁడే బ్రాహ్మణుఁడనియు "సోఽశ్నుతే సర్వాన్కామాన్సహ బ్రహ్మణా విపశ్చితా," "అథ ఏతదక్షరం గార్గి విదిత్వాఽస్మాల్లోకాత్ప్రైతి స బ్రాహ్మణః" అను శ్రుతులు ప్రమాణము. ౧౨

అవ. ఇట్లు ఆత్మజ్ఞాని కృతకృత్యుఁడని చెప్పిన అంశమునే స్ఫుటపఱచుచున్నారు:—

మూ. న స్వయం స్వస్య నాన్యస్య నాన్యశ్చాత్మా చ హేయగః,
ఉపాదేయో న చాప్యేవమితి సమ్యాజ్ఞ్యతిః స్మృతా.౧౩

తా. ఆత్మ తనచే గ్రహింపఁదగినది కాదు, విడువఁదగినదియుఁగాదు. తానే యొకక్రియయందు కర్తగను కర్మగనుండుట శాస్త్రమందును లోకమందును అప్రసిద్ధము. తాను ఉన్నపుడును నశించునపుడును తనను తాఁ బట్టఁడు, విడువఁడు. అన్యవస్తువు లేనపుడు ఇతరమును గ్రహించితిని విడిచితిని యనుమాట బొత్తిగతగదు. ఆదానపరిత్యాగములు ఉపాధులనుబట్టి వ్యవహారదశయందుఁ గలిగినంతమాత్రమున వ్యవహారము స్వప్నవ్యవహారమువలె మాయికమగుటచే నవి అద్వైతప్రసంగమున నుదాహరింపరాదు. కావుననే తానితరులచేత గ్రహింపఁబడును విడువఁబడును అనుట యుక్తియుక్తము కాదు. ఏలయన, తనను గ్రహించెడి మఱియొక ఆత్మలేదు. అనాత్మ

బాధింపఁబడుచు అచేతనమగుటచే తనను తా గ్రహింపనేరదు. ఇట్టి నిశ్చిత జ్ఞానమే సమ్యఙ్మతి (సుజ్ఞానము) అని బ్రహ్మవేత్తలు చెప్పెదరు. ౧౩

అవ. పరిపూర్ణైకరసమగు కూటస్థచైతన్యమందు హానాదానములు సంభవింపవు కనుక పరబ్రహ్మము నేననెడి నిశ్చితబుద్ధియే సమ్యగ్జ్ఞానమనుటకు కారణమును జెప్పుచున్నారు:—

మూ. ఆత్మప్రత్యాయికా హ్యేషా సర్వవేదాంతగోచరా,
జ్ఞాత్వైతాం హి విముచ్యన్తే సర్వసంసారబంధనైః. ౧౪

తా. సర్వవేదాంతములందును బోధింపఁబడినదగుటచే జీవాత్మయే పరమాత్మ యని బోధించు యీజ్ఞానమును సమ్యఙ్మతియనుటకు సంశయము లేదు. భ్రాంతి తొలఁగి సత్యవస్తువును దెలియుటయే సమ్యఙ్మతియని ప్రసిద్ధము. సమ్యఙ్మతిగలవారలు సకలసంసారబంధమునుండియు విడువఁబడి కృతకృత్యులగుదురు. ఇందుకు, "ఇతి గుహ్యతమం శాస్త్రమిదముక్తం మయాఽనఘ, ఏతద్బుద్ధ్వా బుద్ధిమాంస్స్యాత్కృతకృత్యశ్చ భారత" అను భగవద్వాక్యము ప్రమాణము. ౧౪

అవ. ఈ ప్రకరణమందుఁ జెప్పఁబడిన యీజ్ఞానమును ఆస్తికజనవిశ్వాసమునకై పొగడుచు దీనిని బుద్ధిమంతులు తప్పక గ్రహింపవలయునని నొక్కి చెప్పుచున్నారు:—

మూ. రహస్యం సర్వవేదానాం దేవానాం చాపి దుర్లభమ్,
పవిత్రం పరమం హ్యేతత్తదేతత్సంప్రకాశితమ్. ౧౫

తా. ఈ యుపనిషద్బ్రహ్మవిద్య సద్గురూపదేశములేక తెలియఁబడదు

కనుక నిది సమస్తవేదములలోను రహస్యమనఁబడును. ఇందుకు, "ఆచార్యవా న్పురుషో వేద" (ఛాందో. ౬-౧౪-౨) "సర్వే వేదా యత్పద మామనంతి" అను (కఠ. ౨-౧౫) శ్రుతులు ప్రమాణము. "దేవైరత్రాపి విచికిత్సితం పురా, న హి సువిజ్ఞేయ మణురేషధర్మః" అను (కఠ. ౧-౨౧) శ్రుతివలన, ఈ బ్రహ్మవిద్య దేవతలకును రహస్యమైనది. "క్షీయంతే చాస్య కర్మాణి," (ముండ. ౨-౨-౮) "ఏవం విది పాపం కర్మ న శ్లిష్యతే" అను (ఛాందో. ౪-౧౪-౩) శ్రుతులును ఈ బ్రహ్మవిద్య పరమపవిత్రమని చెప్పుచున్నవి. కావున పరమపురుషార్థము సర్వోత్కృష్టమునగు నీ సమ్యగ్జ్ఞానము ప్రకటింపఁబడినది.

అవ. ఈవిద్య గోప్యమని సూచించుచున్నారు:—

మూ. నైతద్దేయమశాంతాయ రహస్యం జ్ఞానముత్తమమ్,
విరక్తాయ ప్రదాతవ్యం శిష్యాయానుగతాయచ. ౮౬

తా. బహిర్ముఖులకు దుర్జ్ఞేయమగు ఈ బ్రహ్మవిద్య ప్రశాంతచిత్తులు కానివారలకు ఉపదేశింపఁదగదు. వినయవిధేయతలు గలిగి, వైరాగ్యసంపన్నుఁడై, ఉత్తమాధికారియగు సచ్ఛిష్యునకు ఉపదేశింపఁదగినది.

అవ. ఈదృశజ్ఞానము నుపదేశించు ఆచార్యుఁడు ప్రలోభాదిగుణములు లేనివాఁడుగ నుండవలెను. శిష్యుఁడును అమానిత్వాది సద్గుణములుగలిగి గురువు దయతో తన కుపదేశించునట్లు వర్తించవలెనని చెప్పుచున్నారు:—

మూ. దదతశ్చాత్మనో జ్ఞానం నిష్క్రియోఽన్యో న విద్యతే,
జ్ఞానమిచ్ఛుంస్తతేత్తస్మాద్యుక్తః శిష్యగుణైః సదా. ౮౭

తా. ఆత్మజ్ఞానప్రదాతయగు గురువునకు ప్రత్యుపకారము చేయ లేరు. కావున శిష్యుఁడు తన సుగుణసంపత్తిచే గురువులను మెప్పించి వారి యనుగ్రహముచే ఆత్మజ్ఞానముం బడిసి సంసారసాగరమును దాటవలయును.

అవ. ఆత్మవిద్యను గుఱించి గురుదేవతాభక్తికంటె నన్యమగు అంతరంగసాధనము లేదని తెలియఁజేయుటకై, గ్రంథారంభమందువలె యీప్రకరణసమాప్తియందును దేవతాగురునమస్కారము నాచరింపవలెనని శ్లోకద్వయముచే నిరూపించుచున్నారు:—

మూ. జ్ఞానం జ్ఞేయం తథా జ్ఞాతా యస్మాదన్యన్న విద్యతే,
సర్వజ్ఞః సర్వశక్తిర్యస్తస్మై జ్ఞానాత్మనే నమః. ౮౮

తా. చిద్రూపాత్మకంటె నన్యమగు జ్ఞాతృజ్ఞానజ్ఞేయములు లేవు. మాయాకల్పితమగు నీ త్రిపుటికి చైతన్యమే ఆధారము. కనుక సర్వజ్ఞుఁడును సర్వశక్తుఁడునగు చిత్సదానంద బ్రహ్మమునకు నమస్కారము. ౮౮

మూ. విద్యయా తారితాః స్మో యైర్జన్మమృత్యుమహోదధిమ్,
సర్వజ్ఞేభ్యో నమస్తేభ్యో గురుభ్యోఽజ్ఞానసంకులమ్.

తా. అజ్ఞానాహంకారాది దుఃఖపరంపరాసంయుక్తమగు సంసారసాగరమును విద్యయనెడి యోడచే దాటించిన సద్గురువులకు నమస్కారము.

ఇది సమ్యఙ్మతిప్రకరణము.

శ్రీః

# ఉపదేశసాహస్రి

(శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యప్రణీతము.)

## శ్లోకప్రబంధము - అష్టాదశప్రకరణము.

---

### ౧౮. తత్త్వమసిప్రకరణము.

అవ. "పూర్వప్రకరణమందు" మోక్షసాధనమగు బ్రహ్మాత్మవిషయకాఽపరోక్షజ్ఞానము వేదాంతశాస్త్రమువలనఁ గలుగుననుట యుక్తముకాదు. స్వర్గప్రాప్తిబోధకవాక్యములవలె వేదాంతవాక్యములును ఆత్మను పరోక్షముగనే బోధించును గాని ప్రత్యక్షముగ బోధింపనేరవు ఆబ్రహ్మము నేనే యని అపరోక్షముగ మహావాక్యములు బోధింపనేరవు". అని వాదించువారల మతమును నిరాకరించుచు, ముందు చెప్పిన తమ సిద్ధాంతమును శ్రుతియుక్తులవలన స్ఫుటముగ బోధించుటకై యీప్రకరణము నారంభించుచు దేవతానమస్కారవ్యాజమున చిత్తవృత్తులయొక్క భావాభావములకు సాక్షియగు కూటస్థచిదాత్మయు, నిత్యాపరోక్షుఁడును, అంతఃకరణప్రతి

బింబుఁడును అగు జీవుఁడే అంతఃకరణరాహిత్యమువలన బ్రహ్మ మగునని నిరూపించు వేదాంతములు బ్రహ్మమపరోక్షమే కాని పరోక్షము కాదని బోధించుచున్నవని సూచించుచు ప్రకరణార్థమును వర్ణించుచున్నారు:—

మూ. { యేనాత్మనా విలీయంతే ఉద్భవంతి చ వృత్తయః,
నిత్యావగతయే తస్మై నమో ధీప్రత్యగాత్మనే. ౧

తా. వేగముతో గుండ్రముగ త్రిప్పఁబడుచున్న కొఱవిని అపద్గా అగ్నిమాత్రముగ నుండునట్లు, సుషుప్త్యవస్థయందు చిత్తవృత్తులన్నియును ఏ చిద్రూపముతో నేకమగునో, ఆ ధీవృత్తులకు అధిష్ఠానము ప్రకాశకము సాక్షియు నిత్యబోధస్వరూపమును అగు ఆ పరబ్రహ్మమునకు నమస్కారము.

అవ. ఇపుడు తమవాక్యమందు ముముక్షుజనవిశ్వాసమునకై తమ గురువులయొక్క గుణసంపత్తిని వర్ణించుచు సంప్రదాయశుద్ధినిఁ జెప్పుచున్నారు:—

మూ. ప్రమథ్య వజ్రోపమయుక్తిసంభృతైః
శ్రుతేరరాతీన్ శతశో వచోఽసిభిః,
ररక్ష వేదార్థనిధిం విశాలధీ
ర్నమో యతీంద్రాయ గురోర్గరీయసే. ౨

తా. గౌడపాద గోవిందపాదాది పరమగురువులకు నమస్కారము. వేదాంతార్థమనెడి నిధిని అపహరించి భేదవాదారణ్యమందు వసించెడి సాంఖ్యాదిశత్రువులను అభేద్యవజ్రాయుధములవంటి యుక్తులతోఁ గూడిన వాక్యఖడ్గములచే ఖండించి బ్రహ్మతత్త్వమును రక్షించి, అస్మద్గురువులకు బోధిం

చిన పరమగురువులకు నమస్కారముకంటె నన్యమేమియుఁ బ్రత్యుపకార
మును జేయఁజాలను. 2

అవ. ఇట్లు నమస్కారవ్యాజమున ప్రకరణార్థమును, స్వగురుసంప్రదాయశుద్ధినిం జెప్పి, తత్త్వమస్యాది మహావాక్యవిమర్శవలననే తనయందు అపరోక్షజ్ఞానము నిర్విఘ్నముగ నావిర్భవించునని యీప్రకరణసిద్ధాంతమును చూపుచున్నారు:—

మూ. నిత్యముక్తః సదేవాస్మీత్యేవం చేన్న భవేన్మతిః,
కిమర్థం శ్రావయత్యేవం మాతృవచ్ఛ్రుతిరాదరాత్. 3

తా. సద్వస్తువు నేనే. నేను సద్బ్రహ్మవస్తువను. నిత్యముక్తుఁడను. అనఁగా, బంధము కల్పితమే కాని, సదానందస్వరూపుఁడ నగు నాకు వాస్తవముగ బంధము లేనే లేదు. సూర్యునకెప్పుడైనను చీకటి యుండునా? (ఉండదు.) ఇట్లు విమర్శించువానికి వేదాంతవాక్యశ్రవణాదికమువలన సద్బుద్ధి కలుగదేని, పుత్రుని హితముగోరెడి తల్లివంటి శ్రుతి ఆదరముతో 'తత్త్వమసి' (ఓజీవా! ప్రతిబింబమువగు నీవు ఆపరమాత్మవే) యని యెట్లు బోధించును? అనఁగా, వేదాంతవాక్యశ్రవణమననాదికమువలన ముక్తి తప్పక కలుగును గనుక, ఆదరముతో శ్రుతివాక్యమును విమర్శింపవలెనని భావము. 3

అవ. రజ్జువునందుఁ గలుగు సర్పభ్రాంతి రజ్జుస్వరూపమును దెలిసికొనినంతటఁ దొలఁగురీతి, ఆరోపితాఖిలానర్థకప్రపంచభ్రాంతి తత్త్వమసీత్యాదిమహావాక్యవిమర్శచే నివారించునని చెప్పుచున్నారు:—

మూ. సిద్ధా దేవాహిమిత్యస్మాద్యుష్మద్ధర్మో నిషిధ్యతే,
రజ్జ్వామివాహిధీర్యుక్త్యా తత్త్వమిత్యాదిశాసనైః. ౪

టీ. రజ్జ్వాం=సిద్ధమైన త్రాటియందు, అహిధీః = భ్రాంతికల్పితసర్ప జ్ఞానము, యుక్త్యా ఇవ = హితవాక్యవిమర్శముచేత నివారింపఁబడునట్లు, సిద్ధాత్ = నిర్వికారమగు, అహం ఇతి అస్మాత్ ఏవ=అహమ్‌శబ్దలక్ష్యార్థము వలననే, యుష్మద్ధర్మః = అహంకారాది పరాగర్థము, తత్ త్వమ్ ఇత్యాది శాసనైః = 'తత్త్వమసి' మొదలగు మహావాక్యములవలన, నిషిధ్యతే=భ్రమ కల్పితద్వితీయవస్తువును; కారణాత్మకముగ ఆత్మయందు ప్రవిలాపనము చేయుటచే నివారింపఁబడును.

తా. త్రాటినిఁ జూచి యది సర్పమని భ్రమఁజెందినపుడు, హితబోధ వలన నది త్రాడుమాత్రమే యని తెలిసికొనఁగా సర్పభ్రాంతి తొలఁగునటుల, ప్రత్యగర్థమగు ఆత్మను భ్రాంతిచేత అహంకారాది దేహాంతజగత్తుగ భావించి, పిదప తత్త్వమసీత్యాదిమహావాక్యములచే సద్గురుబోధితుఁడైన జ్ఞానికి ఆరో పితసకలప్రపంచము అధిష్ఠానబ్రహ్మమాత్రముగ స్ఫురించును. ౪

అవ. మంత్రధ్యానమువలన విషబాధ నివారింపఁబడు నట్లు, పరబ్రహ్మముయొక్క స్వరూపము దెలియఁగనే భ్రాంతి కల్పితమగు జగద్భ్రమ నశించునని చెప్పుచున్నారు:—

మూ. శాస్త్రప్రామాణ్యతో జ్ఞేయా ధర్మాదేరస్తితా యథా,
విషాపోహో యథా ధ్యానాత్ వ్యాప్తిః స్యాత్పా
ప్మనస్తథా. ౫

టీ. ధ్యానాత్ =గారుడాదిమంత్రజపమునుండి, విషాపోహః యథా =

సర్పవిషము పోవునట్లును, (వాసుదేవాది మంత్ర జపమువలన) పాప్మనః హానిః యథా=పాపము తొలఁగునట్లును, తథా శాస్త్రప్రమాణతః=శాస్త్రప్రామాణ్యమువలననే, ధర్మాదేః అస్తితా జ్ఞేయాస్యాత్ = స్వర్గమోక్షాదులు కలవని తెలియవలయును.

తా. భ్రాంతితొలఁగుటకై భగవద్భక్తియు, పరతత్త్వజ్ఞానమును, పాపవిషనివృత్తికై మంత్రజపమువలె ఆవశ్యకములు.

అవ. వాక్యశ్రవణమువలన "అహం బ్రహ్మాస్మి" యను జ్ఞానమువలెనే "అహంకరోమి" యను జ్ఞానముసయితము అనుభవసిద్ధముగ నుండఁగా, ఈకర్తృత్వజ్ఞానము "అహం బ్రహ్మాస్మి" యను జ్ఞానమువలననే బాధింపఁబడునను టెట్లు? అను ప్రశ్నకు సమాధానము:—

మూ. సద్బ్రహ్మాహం కరోమీతి ప్రత్యయావాత్మసాక్షికౌ,
తయోరజ్ఞానజస్యైవ త్యాగో యుక్తతరో మతః. ౬

టీ. అహం=నేను, సద్బ్రహ్మ=సచ్చిదానందబ్రహ్మమగుదును, అహం కరోమి=నేను చేయుచున్నాను, ఇతి ప్రత్యయౌ=అను నీ రెండుజ్ఞానములు, ఆత్మసాక్షికౌ = ఆత్మకు గోచరములగును. తయోః=ఆ రెండుజ్ఞానములలో, అజ్ఞానజస్యత్యాగఃఏవ = అజ్ఞానమువల్ల గలిగిన 'అహంకరోమి' అను జ్ఞానమును విడుచుటయే, యుక్తతరో మతః=మిగుల నుత్తమము.

తా. నేను బ్రహ్మమను (అహం బ్రహ్మాస్మి), నేను చేయుచున్నాను. (అహంకరోమి) యనెడి రెండు జ్ఞానములును ఆత్మకు గోచరములు. ఈ రెండింటిలో 'అహంకరోమి' యను అజ్ఞాన జన్యజ్ఞానమును విడుచుటయే యుత్తమమైన ఆత్మాపరోక్షజ్ఞానమునకు సాధనమగును. ౬

అవ. 'అహంబ్రహ్మ,' 'అహంకరోమి' యను రెండుజ్ఞానములలో ప్రమాణజన్యమెద్ది? అజ్ఞానజన్యమెద్ది? బాధకమెద్ది యనుప్రశ్నల కుత్తరము:—

మూ. సదస్మీతి ప్రమాణోత్థా ధీరన్యాతన్నిభోద్భవా,
ప్రత్యక్షాదినిభా వాఽపి బాధ్యతే దిగ్భ్రమాదివత్. 2

టీ. సత్ అస్మి ఇతి ధీః = సద్వస్తువు నేను అనెడి బుద్ధి, ప్రమాణోత్థా = తత్త్వమసి యను మహావాక్యప్రమాణమువలనఁ బుట్టును. అన్యా = నేను కర్తను అనెడి బుద్ధి, తన్నిభోద్భవా = ప్రమాణాభాసవలనఁ గలుగును. వా=లేక, దిగ్భ్రమాదివత్=కొఱవిత్రిప్పునప్పుడు బయలుదేరిన యగ్నికణములు త్రిప్పుట చాలింపఁగా తగ్గినవై వహ్నిమాత్రముచే బాధింపఁబడునట్లు ప్రత్యక్షముగఁ గనిపించు కర్తృత్వాదికము భ్రమ తొలఁగగ సత్యజ్ఞానముచేతనే బాధింపఁబడును.

తా. మహావాక్యజన్యమగు 'అహం బ్రహ్మాస్మి' యను జ్ఞానము 'అహం కర్తా' అనే భ్రమజన్యజ్ఞానమును బాధించును. అనఁగా భ్రమజన్యజ్ఞానము మహావాక్యజన్యజ్ఞానమువలన నశించును. కొఱవిని త్రిప్పునపుడు అగ్నికణములు పెక్కులు బయలుదేరినను భ్రమణము తగ్గగ వహ్నియొక్కటియే మిగులును. ఇట్లు భ్రాంతివలనఁ గలిగిన కర్తృత్వభోక్తృత్వాది జ్ఞానము బ్రహ్మజ్ఞానముచే బాధింపఁబడఁగా ఆత్మమాత్రమే మిగులును. 2

అవ. 'బ్రహ్మాస్మి' యను జ్ఞానమువలె 'అహంకర్తా'యను జ్ఞానముసయితము "సత్యంవద, ధర్మం చర, స హి కర్తాభోక్తేత్యాహుర్మనీషిణః" ఇత్యాదిశాస్త్రజన్యమే యగుటచేత దీనికి బాధ యేల కలుగవలెను? ఈజ్ఞానమసత్యమగు నేని నిజము

చెప్పుము ధర్మముచేయుము అను శాస్త్రముకూడ వ్యర్థముకావలయునుగదా. అని శంకింతువేని వినుము:—

మూ. కురు భోక్తేతి యచ్ఛాస్త్రం లోకబుద్ధ్యనువాది తత్,
సదస్మీతి శ్రుతేర్జాతా బాధ్యతేఽన్యా తయైవ ధీః.  ౮

టీ. కురు భోక్తా ఇతి యత్ శాస్త్రం = కర్మములను జేయుము ఆ ఫలము ననుభవించుము అనుశాస్త్ర మెద్దికలదో, తత్=అది, లోకబుద్ధ్యనువాది=లోకసిద్ధమగు అర్థమును అనువదించును. సత్ అస్మి ఇతి ధీః=నేను బ్రహ్మమనను జ్ఞానము, శ్రుతేః జాతా=ఉపనిషద్వాక్యమువలనఁ గలిగినది. అన్యా=నేను కర్తను భోక్తను అనెడి బుద్ధి, ఏతయా ఏవ బాధ్యతే=ఈ ఉపనిషద్వాక్యము చేతనే బాధింపఁబడును.

తా. లోకవ్యవహారానుసారముగఁ జెప్పఁబడిన కర్మకాండము పరమార్థమగు జ్ఞానకాండముచే బాధింపఁబడునని భావము.  ౮

అవ. ఇట్లు విమర్శసహితమగు మహావాక్యవిచారణ వలన ఆత్మ అపరోక్షమగును. ఆయపరోక్షాత్మజ్ఞానము ఇతరము నపేక్షింపకయే సంసారదుఃఖమును దొలఁగించునని (శ్రీశంకరాచార్యులు) స్వమతమును బోధించి, ఆ యపరోక్షజ్ఞానము పునఃపునరనుసంధానమువలన సుస్థిరమగునని చెప్పుచున్నారు:-

మూ. సదేవ త్వమసీత్యుక్తే నాత్మనో ముక్తతా స్థిరా,
ప్రవర్తతే ప్రపంచశ్చేన్మతో యుక్త్యాఽనుచింతయేత్.

టీ. త్వం=నీవు, సత్ ఏవ అసి=బ్రహ్మమే అయితివి అని, ఉక్తే=చెప్పఁగా, ఆత్మనః=జీవునకు, ముక్తతా=ముక్తి, స్థిరా న ప్రవర్తతే=దృఢము

కానేరదు. అతః=కనుక, యుక్త్యా=ఉపాయముతో, ప్రసంచక్షాం అనుచింతయేత్=మఱల మఱల అభ్యసింపవలెను.

తా. 'నీవే ఆత్మవు' అని యొకమాఱు బోధించుమాత్రమున ఆత్మజ్ఞానము దృఢము కాఁజాలదు కనుక సంతతదృఢాభ్యాసము కావలెనని అభిప్రాయము.

అవ. అభ్యాసక్రమమును జెప్పుచున్నారు:—

మూ. సకృదుక్తం న గృహ్ణాతి వాక్యార్థజ్ఞోఽపి యో భవేత్,
అపేక్షతేఽత ఏవాన్యదవోచామ ద్వయం హితత్. ౧౦

టీ. వాక్యార్థజ్ఞః అపి = గురూపదిష్టమహావాక్యార్థమును దెలిసికొన్నను, సకృత్ ఉక్తం=ఒకమాఱు చెప్పినంతమాత్రమున, న గృహ్ణాతి=పరమార్థమును దెలియఁజాలఁడు. అత ఏవ=కనుకనే, అన్యత్=సహకారివాక్యమును, అపేక్షతే=కోరును. తత్ ద్వయం=కావున రెండువాక్యములను, అవోచామ=చెప్పితిమి.

తా. ఎంత బుద్ధిమంతుఁడైనను గురూపదేశమును ఒకమాఱు వినినంతమాత్రమున పరమార్థము మనస్సున దృఢముగ నాటదు కనుక యుక్తులచే మఱల మఱల మననము చేయవలయునని చెప్పఁబడెను. ౧౦

అవ. యజ్ఞాదికర్మములందు విధినియామకమగునట్లు బ్రహ్మాత్మైక్యజ్ఞానము దృఢపడునంతవఱకు పునఃపునరనుసంధానము చేయవలెనని వేదాంతశాస్త్రము విధించుచున్నదని చెప్పుచున్నారు:—

మూ. నియోగోఽప్రతిపన్నత్వాత్కర్మణాం స యథా భవేత్,
అవిరుద్ధో భవేత్తావద్యావత్సంవేద్యతాఽదృఢా. ౧౧

టీ. కర్మణాం = యజ్ఞాదికర్మలకు, నియోగః = 'యజేత' యాగము చేయవలెను అను మొదలగు విధి, యథా భవేత్ = ఎట్లుండునో, (తథా = అట్లే), సంవేద్యతా = బ్రహ్మాత్మైక్యజ్ఞానము, యావత్ అదృఢా తావత్ = ఎంతవఱకు దృఢముకాదో అంతవఱకు, (ఈ వేదాంతశాస్త్రమందలి విధి కూడ) అప్రతిపన్నత్వాత్ = బ్రహ్మ సాక్షాత్కారము దృఢముగఁ గలుగదు కనుక, నియోగః అవిరుద్ధః = విధియుక్తమే యగును.

తా. ఒక్కసారి గురూపదేశమైనంతమాత్రాన బ్రహ్మ సాక్షాత్కారము కలుగదు కనుక "ఆవృత్తిరసకృదుపదేశాత్" అను న్యాయమును బట్టి యాగాదికర్మలకు వేదవిధి యున్నట్టే వేదాంతశాస్త్రమందును "మనుతాం, నిదిధ్యసేత్" = (గురుముఖమున విన్న అర్థమును యుక్తులతో చింతింపవలెను. ఇతరవృత్తిరహితముగ ధ్యానింపవలెను) అను విధులు, దేహాత్మజ్ఞానము ఎంత దృఢముగనున్నదో అంతదృఢముగ బ్రహ్మ సాక్షాత్కారము కలుగుపర్యంతము సార్థకములగునని భావము. 'యజేత' ఇత్యాది విధులు శాబ్దములు. కాని యిచట 'మనుతాం నిదిధ్యసేత్' ఇత్యాదికములు ఆర్థికములు అని భేదము. ౧౧

అవ. మఱియు, విధులక్కఱలేకయే సద్గురుముఖము నుండి శ్రవణమాత్రముననే 'బ్రహ్మమే నేననెడి సాక్షాత్కారము కలిగెనెడల యమనియమాదులు వ్యర్థములగుననే శంక కుత్తరము:—

మూ. చేష్టితం చ తథా మిథ్యా స్వచ్ఛందః ప్రతిపద్యతే,
ప్రసంఖ్యానమతః కార్యం యావదాత్మాఽనుభూయతే.

టీ. చేష్టితం=యమనియమాద్యనుష్ఠానము, స్వచ్ఛందః = వేదమందు విధింపఁబడకయే స్వతంత్రముగఁ బ్రవర్తించునని, ప్రతిపద్యతే(చేత్)=అంగీక

రింపఁబడునేని, (తదా=అప్పుడు), మిథ్యాస్యాత్=ఆ యమనియమాదులు వ్యర్థములగును. అతః=కనుక, ఆత్మా=ఆత్మసాక్షాత్కారము, యావత్ అనుభూయతే (తావత్)=దృఢమగుపర్యంతము, ప్రసంఖ్యానం కార్యం=మనననిదిధ్యాసములను ఆవృత్తి చేయఁదగినది.

తా. యమనియమాదులు విహితములు కానియెడల నవి మిథ్యకావలసివచ్చును గనుకను, దేహాత్మబుద్ధితో నేను బ్రాహ్మణుఁడను గృహస్థుఁడను యలిని అను నీ మొదలగు దేహాభిమానము దృఢముగ నుండునట్లు 'నేను బుద్ధియందు ప్రతిబింబించిన జీవుఁడనుగాను, బుద్ధికి అధిష్ఠానమగు కూటస్థబ్రహ్మము నే' అనెడి బుద్ధి (వృత్తి) దృఢమగుపర్యంతము మనననిదిధ్యాసములు చేయుచుండవలెను. ౧౨

అవ. పై విషయమునే స్ఫుటపరుచుచున్నారు:—

మూ. సదస్మీతి చ విజ్ఞాన మక్షజో బాధతే ధ్రువమ్,
శబ్దోత్థం దృఢసంస్కారో దోషైశ్చాకృష్యతే బహిః.

టీ. శబ్దోత్థం = సకృదుపదేశమువలనఁ గలిగిన, సత్ అస్మి ఇతి విజ్ఞానం = నేను బ్రహ్మమును అను విజ్ఞానమును, దృఢసంస్కారః = చిరకాలమునుండి అభ్యసించిన, అక్షజః = ప్రత్యక్షజ్ఞానము (కర్తృత్వమే), ధ్రువం బాధతే = తప్పక బాధించును, దోషైః = రాగద్వేషాదులచేత, బహిః = బయటకు, ఆకృష్యతే చ = జనుఁడు లాగఁబడును.

తా. 'నేనా బ్రహ్మమునే' యని గురుముఖమున నొకసారి బోధింపఁబడినను చిరకాలాభ్యస్తమగు 'నేను కర్తను భోక్తను' అనెడి దేహాభిమానపూర్వకమగు బాహ్యప్రవృత్తి ఆ సుజ్ఞానమును బాధించుటయేకాక, ప్రపంచమందు రాగద్వేషాదులనుగూడ గలిగించి ముముక్షువును బాధించును గనుక, మననాదికము నభ్యసింపవలయును, అని భావము. ౧౩

అవ. చిరకాలవాసనాజన్యమగుటవల్లనే కాక మఱియొకవిశేషమువలనను ప్రత్యక్షము ప్రబలమై సుజ్ఞానమును బాధించుననిః—

మూ॥ శ్రుతానుమానజన్మానౌ సామాన్యవిషయౌ యతః,
ప్రత్యయావక్షజోఽవశ్యం విశేషార్థో నివారయేత్.

టీ. శ్రుతానుమానజన్మానౌ=శాస్త్రమువలనను ఊహవలనను గలిగిన, ప్రత్యయౌ=నేను బ్రహ్మమను, నేను కర్తను అనెడి రెండుజ్ఞానములు, యతః=ఏ హేతువున, సామాన్యవిషయౌ = సమానముగనే కలిగినవో, (తతః = ఆహేతువువలన) విశేషార్థః = ప్రత్యక్షజ్ఞానమే సామాన్యజ్ఞానమును అనఁగా నొకసారి శ్రుతమైన బ్రహ్మాత్మజ్ఞానమును, నివారయేత్ = బాధించును.

తా. విశేషార్థములను బోధించెడి కర్తృత్వాది ప్రత్యక్షజ్ఞానము భ్రాంతిగాని వంచనగాని లేనిదగుటచేత, శాస్త్రమువలనను అనుమానప్రమాణమువలనను దెలియఁబడునట్టి శాబ్దానుమాన ప్రమాణజన్య జ్ఞానమగు బ్రహ్మజ్ఞానమునే బాధించును. ౧౪

అవ. మహావాక్యార్థమును విన్నంతమాత్రాన ఎవఁడైనను ధన్యుఁడగునేని(అపుడు)అభ్యాసవిధి వ్యర్థముకావచ్చును. విన్నంతమాత్రమున లోకములో నెవఁడును ధన్యుఁడుకాఁడు కనుక అభ్యాసమావశ్యకమనిః—

మూ. వాక్యార్థప్రత్యయీ కశ్చిన్నిర్దుఃఖో నోపలభ్యతే,
యది వా దృశ్యతే కశ్చిద్వాక్యార్థశ్రుతిమాత్రతః.
నిర్దుఃఖోఽతీతదేహేషు కృతభావోఽనుమీయతే,
చర్యానోఽశాస్త్రసంవేద్యాస్యాదనిష్టం తథా సతి. ౧౫

టీ. వాక్యార్థప్రత్యయీ = వాక్యార్థశ్రవణమాత్రమున సుజ్ఞానము గలవాఁడు, కశ్చిత్ (అపి)=ఒకఁడైనను, నిర్దుఃఖీ=సంసారదుఃఖరహితుఁడుగ, న ఉపలభ్యతే=కనుపింపఁడు. వాక్యార్థశ్రుతిమాత్రతః = వాక్యార్థశ్రవణము వలననే, కశ్చిత్=ఎవఁడైనను, నిర్దుఃఖః దృశ్యతే యది=దుఃఖరహితుఁడై కనుపించినయెడల, అతీతదేహేషు = పూర్వపుదేహములందు, కృతభావః= అభ్యాసము దృఢముగఁ జేసినవాఁడు (అని), అనుమీయతే = ఊహింపఁబడును. నః=మాయొక్క (యతులయొక్క), చర్యా=ఆశ్రమాచారము, అశాస్త్రసంవేద్యా స్యాత్=శాస్త్రవిహితము కాకపోవలసివచ్చును. తథా సతి=శాస్త్రవిహితము కానియెడల, అనిష్టం స్యాత్=బాధ కలుగును.

తా. 'తత్త్వమసీ'త్యాది మహావాక్యముల నొకసారి వినినంతమాత్రమున నెవఁడును ముక్తుఁడు కాఁజాలఁడు. అట్లయినటుల శాస్త్రమువలనఁ దెలియఁబడునేని యట్టి వామదేవాదులు మోక్షప్రాప్తిగనుట జన్మాంతరమందు దృఢాభ్యాసము చేసినవారలని యెఱుఁగునది. అదియుంగాక, యతులకు విహితమగు కర్మములు శాస్త్రవిహితములు కాకపోవలసివచ్చును. అట్లు అంగీకరించితిమా ఆరూఢపాత మనెడిదోషము సంభవించును. కావున వినిన వేదాంతవాక్యమును మనననిదిధ్యాసములచే దృఢముగ నభ్యసింపక మోక్షము సిద్ధింపదని భావము. ౧౫—౧౬

అవ. అభ్యాసవిధి ఆవశ్యకమగునేని సిద్ధబ్రహ్మోపదేశము అనుమాట యెట్లు సిద్ధించును? అను శంక కుత్తరము:—

మూ. సదసీతి ఫలంచోక్త్వా విధేయం సాధనం యతః,
నతదన్యత్ప్రసంఖ్యానాత్ ప్రసిద్ధార్థ మిహేష్యతే.

టీ. యతః = ఏహేతువువలన, ఫలం ఉక్త్వా=ఫలమును జెప్పి, సాధనం విధేయం = సాధనమును జెప్పవలెను. అతః=కనుక, తత్ = ఆ బ్రహ్మైక్యజ్ఞానమునకు, ప్రసంఖ్యానాత్ =అభ్యాసముకంటె, అన్యత్ =ఇతరసాధనము, ఇహ = ఈవేదాంతశాస్త్రమందు, ప్రసిద్ధార్థం=ప్రసిద్ధార్థమును (అభివ్యక్తముచేయఁదగిన సాధనము), న ఇష్యతే=(వేఱొకటి) లేదు.

తా. స్వర్గప్రాప్తికి జ్యోతిష్టోమాదికము సాధనమగునట్లు, మోక్షప్రాప్తికి వినిన అర్థమును మననముచేయుట నిదిధ్యాసము (ఇతరవృత్తిరహితముగ తదేకాకారముగ ధ్యానించుట)తక్క నితరమెద్దియు సాధనముకాదు. కనుక నిరంతరాభ్యాసమువలన నీవు ఆబ్రహ్మమే అయితివనెడి మహాఫలము స్ఫుటమగును. ౧౭

అవ. పూర్వపక్షసమాప్తిః—

మూ. తస్మాదనుభవాయైవ ప్రసంచక్షీత యత్నతః,
త్యజన్ సాధన తత్సాధ్య విరుద్ధం శమనాదిమాన్.౧౮

టీ. తస్మాత్ =కావున, శమనాదిమాన్ =శమదమాదిసాధనసంపన్నుఁడగుచు, సాధనతత్సాధ్యవిరుద్ధం = అభ్యాసము బ్రహ్మసాక్షాత్కారము అనెడి కారణసాధ్యములకంటె నితరమగు కర్మమును, త్యజన్ = వదలుచు, అనుభవాయ ఏవ = ఆత్మసాక్షాత్కారము నిమిత్తమే, యత్నతః=ప్రయత్నముతో, ప్రసంచక్షీత = అభ్యాసముచేయవలెను.

తా. పైకారణములనుబట్టి శమదమాదిసాధనసంపత్తిచే అభ్యాసము బ్రహ్మసాక్షాత్కారము అనెడి కారణసాధ్యములకంటె నితరకర్మమును వదలుచు, ఆత్మసాక్షాత్కారము కొఱకే దృఢప్రయత్నముతో అభ్యాసము చేయవలెను. ౧౮

అవ. సిద్ధాంత ప్రారంభము:—

మూ. నైతదేవం రహస్యానాం నేతినేత్యవసానతః,
క్రియాసాధ్యం పురా శ్రావ్యం న మోక్షో నిత్యసిద్ధతః.

టీ. ఏతత్ = అభ్యాసము చేయవలెనని యీచెప్పుట, ఏవం న=విధి యనరాదు. (ఏమనఁగా,) రహస్యానాం=వేదాంతశాస్త్రప్రతిపాద్యరహస్యములను, నేతినేత్యవసానతః = దృశ్యవస్తువుల నన్నిఁటిని కాదు కాదని నిరాకరించుటయే ఫలము. క్రియాసాధ్యం = విధిరూపకర్మము, పురా=కర్మకాండమునందే, శ్రావ్యం=వినఁదగినది. నిత్యసిద్ధతః=సాధ్యముకాక నిత్యసిద్ధమగుటవలన, మోక్షః=మోక్షము, న=క్రియాసాధ్యముకాదు.

తా. వేదాంతశాస్త్రమందు విధులు లేవు. విధులు విధ్యాభాసలుకాని విధులుకావు. కర్మమువలన సాధింపఁదగిన స్వర్గాదికము పూర్వమీమాంసాశాస్త్రమునందే చెప్పఁబడెను. ఉత్తరమీమాంసాశాస్త్రమునందు చెప్పఁబడెడి మోక్షము క్రియచేత సాధ్యముకాదు. ఆత్మస్వరూపముకంటె మిగిలిన కల్పితాంశములను మిథ్యగా భావింప స్వరూపమే మిగులును.

జలమునుగోరువాఁడు ఆవరించి యున్న నాఁచును తొలఁగింప స్వతః సిద్ధమగు శుద్ధజలమే కనుపడునట్లు మాయాకల్పితములును ఆత్మావరకములునగు నామరూపములను నుపేక్షింపఁగ సిద్ధబ్రహ్మము స్ఫురించును గనుక నాఁచును తొలఁగించుటకువలెనే నామరూపాత్మక మాయికప్రపంచ నిరాసమునకే శాస్త్రప్రవృత్తి యని—

"అవిద్యయాకల్పిత నామరూపవ్యపోహ ఏవ ప్రయతేతవిద్వాన్,
న బ్రహ్మబోధే తదపోహమాత్రాత్ బ్రహ్మావభాతి స్వయమేవ సాక్షాత్.

శైవాలమాత్రాపనయేపిపాసోఃకార్యః ప్రయత్నోనతుతోయసిద్ధౌ, తస్మిన్నపేతేసలిలం విశుద్ధం సిద్ధం జనానాం విషత్వమేతి.'' అనెడి మహావాక్యరత్నావళీవాక్యము లిచట ప్రమాణము. ౧౯

అవ. తత్త్వమస్యాది మహావాక్యములు అపరోక్షాద్వితీయ బ్రహ్మాత్మజ్ఞానమును గలిగించి అజ్ఞానమును అజ్ఞానకార్యమగు దుఃఖమును దొలఁగించునని చెప్పఁదలఁచి, దుఃఖబీజము అజ్ఞానమే యనుటకు సదృష్టాంతముగఁ జెప్పుచున్నారు:—

మూ. పుత్రదుఃఖం యథాఽధ్యస్తం పిత్రాఽదుఃఖేస్వ ఆత్మని,
అహంకర్తా తథాఽధ్యస్తో నిత్యాదుఃఖే స్వ ఆత్మని.౨౦

టీ. అదుఃఖే=జ్వరము మొదలగు దుఃఖములులేని, స్వే ఆత్మని=తన ఆత్మయందు, పుత్రదుఃఖం=కుమారునకుఁ గలిగిన జ్వరము, యథా అధ్యస్తం=ఎట్లు ఆరోపింపఁబడునో, తథా=అట్లే, నిత్యాదుఃఖే=ఎల్లప్పుడును సంసారాదిదుఃఖలేశమును లేని, స్వే=స్వరూపమగు, ఆత్మని=ధీసాక్షియగు ఆత్మచైతన్యమందు, అహం కర్తా=చిదాభాసవిశిష్టమగు అంతఃకరణముతో ఐక్యారోపమువలన ''నేను కర్తను, సుఖదుఃఖభోక్తను'' అని, అధ్యస్తః=అవివేకమువలన ఆరోపించి సంసారదుఃఖము ననుభవించును.

తా. సాక్షికూటస్థస్వరూపమగు ఆత్మ శరీరోపాధ్యభిమానము వశమున శరీరమునకుఁ గలిగెడి తాపము తనదిగ భావించును. ఎట్లనఁగా లోకములో పుత్రుఁడు బాధపడుచుండఁగా తండ్రి అవివేకమువలన తానే బాధపడునట్లు దుఃఖించునుగద. దీనికి మూలము మమకారము. ఇట్లే ఆత్మకు తాపమున్నదనుటకు మూలము అజ్ఞానము అని తెలియవలెను. ౨౦

అవ. బుద్ధియందు ప్రతిబింబించిన జీవుఁడు బింబస్వభావుఁడే యని తెలియమిచే జీవునకు సంసారము అధ్యస్తమయినది. ప్రతిబింబము అసత్యము గనుక జీవుఁడు బ్రహ్మస్వభావుఁడే యని ఎఱుఁగుటవలన ఆయధ్యాసము తొలఁగును. ఈ జ్ఞానమునకు 'నేతి నేతి' 'తత్త్వమసి'—(దృశ్యప్రపంచము మిథ్య, నీవు ప్రతిబింబమవుకావు. బింబభూత పరమాత్మయేయని బోధించు) మున్నగుశ్రుతులే కారణము. సుషుప్తియందు ఆత్మకు ఎట్టిక్రియయు లేనివిధమున, జాగ్రత్స్వప్నములందును ఆత్మ నిష్క్రియుఁడే యను నిశ్చయమువలన పునరధ్యాసబీజము ఉండదు కనుక ప్రసంఖ్యానవిధి (అభ్యాసమున) కవసరము లేదని ఫలితమును జెప్పుచున్నారు:—

మూ. సోఽధ్యాసో నేతినేతీతి ప్రాప్తవత్ప్రతిషిధ్యతే,
భూయోఽధ్యాసవిధిః కశ్చిత్కుతశ్చినోపపద్యతే. ౨౧

టీ. సః అధ్యాసః=శరీరముతో ఆత్మకు అధ్యాసము, ప్రాప్తవత్= నిజముగ నున్నట్టుగ నెంచి, నేతి నేతి ఇతి=జగత్తు కాదు కాదని, ప్రతిషిధ్యతే=నివారింపఁబడుచున్నది. 'ప్రాప్తవత్'అని 'వత్' శబ్దమువలన అధ్యాసము ఆరోపితమేకాని వాస్తవముకాదని తెలియఁబడుచున్నది. కనుక, కుతః చిత్=దేనినుండియు, న ఉపపద్యతే=సంభవింపనేరదు.

తా. మిథ్యాభూతమగు అధ్యాసము సత్యమగునట్టుగ నిషేధింపఁబడినది కనుక అధ్యాసవిధి కవసరములేదు. ౨౧

అవ. లోకమందు కంటికి గోచరమగు శుక్తిని రజతముగ భ్రమించుట కలదు. ఇదియే అధ్యాస మనఁబడును. సకలవిషయములను గ్రహించుటచే తత్సాక్షియై విషయియగు

బ్రహ్మము కంటికగపడదు. ఆ బ్రహ్మమందు విషయధర్మములగు దుఃఖాదు లెట్లు ఆరోపింపఁబడును? అనెడి శంక రాఁగా, దృశ్య మగునట్టి వస్తువునందే ఆరోపము కలుగవలయునను నియ మము లేదని చెప్పుచున్నారు:—

మూ. ఆత్మనీహ యథాఽధ్యాసః ప్రతిషేధ స్తథైవ చ,
మలాధ్యాసనిషేధౌ ఖే క్రియేతే చ యథాఽబుధైః.

టీ. ఆత్మని=గోచరముకాని జీవునియందు, అధ్యాసః=దేహసంబం ధములగు జరామరణాదులయొక్క ఆరోపణ, యథా=ఎట్లు కలుగునఁగా, ఖే=ఇంద్రియములకు గోచరముకాని ఆకాశమందు, మలాధ్యాసనిషేధౌ= మాలిన్యారోపణమును, తన్నిషేధమును, అబుధైః=మూఢులచేత, యథా క్రియేతే=ఎట్లు చేయఁబడునో, తథైవ=అట్లే, ఇంద్రియవిషయముకాని బ్రహ్మమందు అజ్ఞులు సంసారాధ్యాసముచు జేసి తదపవాదముం జేతురు. 'ఆత్మనీహతథాధ్యాసః' అను పాఠములో పూర్వార్థమునకు ఉత్తరార్థము దృష్టాంతమని స్పష్టమగును.

తా. రూపరహితమగు ఆకాశమునందు బాలురారోపించు నీలిమ విమర్శించునపుడు లేనియట్టుల, ఆత్మయందు మూఢులచే నారోపింపఁబడు సంసారాధ్యాసమును వివేకదృష్టితో విమర్శింప నది లేనిదే యగును. మాలి న్యారోపనిషేధములవలె అధ్యాసారోపనిషేధములును భ్రమకల్పితములే కాని వాస్తవము కాదు.    ౨౨

అవ. "ప్రాప్తవత్ప్రతిషిధ్యతే" అను వాక్యమును వివ రించుచున్నారు:—

మూ. ప్రాప్తశ్చేత్ప్రతిషిధ్యేత మోక్షోఽనిత్యోఽభవేద్ధ్రువమ్,

అతో౽ప్రాప్తనిషేధో౽యం దివ్యగ్నిచయనాదివత్. ౨౩

టీ. ప్రాప్తః=(సంసారము) ప్రమాణసిద్ధమగుచు, ప్రతిషిధ్యేతచేత్= నిషేధింపఁబడునేని, మోక్షః = స్వరూపజ్ఞానము, ధ్రువం=నిశ్చయముగ, అనిత్యః భవేత్=నశింపవలసివచ్చును. అతః=కనుక, దివి=ఆకాశమందు, అగ్నిచయనాదివత్=అగ్నిని పోగుచేయుటవలెనే, అయం=ఇది, అప్రాప్త నిషేధః=ప్రాప్తించనిదానిని నివారించుటయే.

తా. ఆత్మకు బంధము వాస్తవమగునేని మోక్షము కలుగకపోవును. అందువలన ఆత్మకు వికారములు కలుగవచ్చును. అట్లేని వికారియగు ఆత్మ అనిత్యమగును. బంధము కలిగినదియన్నను ఆ బంధము ఆత్మవలన కలిగిన దగుటచేత ఒకబంధము పోయినను వేఱొకబంధము పుట్టవచ్చును. బంధము తిరిగి కలిగెనేని మోక్షము అనిత్యమగును. ఇన్నిదోషములు సంభవించుట వలన బంధము అవిద్యాకల్పితమే కాని వాస్తవముకాదు. ఈ బంధము జ్ఞానమువల్లనే తొలఁగుటచేత అభ్యాసముతోఁ బనిలేదని ప్రకృతార్థమును ముగించుచున్నారు. "నాంతరిక్షే న దివ్యగ్నిశ్చేతవ్యః" (తై. సం. ౫. ౨. ౭) అని భూమియందుఁ గలిగెడి అగ్నిసంచయనమును ఆకాశమందు ఉన్నట్టు భావించి అప్రాప్తమగు అగ్నిచయనము ఆకాశమున లేదని యెట్లు శ్రుతి యందు నివారింపఁబడెనో అట్లే సంసారబంధరహితమగు ఆత్మయందు బంధా రోపణము బంధనిషేధమును మాయాకృతములుగాని వాస్తవములు కావు. ఆదిశబ్దముచేత ఆకాశమాలిన్యము సయితము లేనిదే నిషేధింపఁ బడెనని గ్రహింపవలెను. ౨౩

అవ. ఆత్మయందు బంధబోధక ప్రమాణమేమియు లేనందున బంధము మాయికమే యని చెప్పుచున్నారు:—

మూ. సంభావ్యో గోచరే శబ్దః ప్రత్యయో వాన చాన్యథా,
న సంభావ్యౌ తదాత్మత్వాదహం కర్తుస్తథైవ చ. ౨౮

టీ. శబ్దః=శబ్దముగాని, ప్రత్యయః=(ప్రత్యక్షానుమాన ప్రమాణజన్య మైన) జ్ఞానముగాని, గోచరే=విషయవస్తువునందు, సంభావ్యః=సంభవించును. అన్యథా=గోచరముకాని వస్తువునందు, న=సంభవింపదు. అహం * కర్తుః= ప్రమాతయగు జీవుఁడును, తథైవ=అట్లే శబ్దజ్ఞానములును, తదాత్మకత్వాత్ = బ్రహ్మస్వరూపమే యగుటవలన, న సంభావ్యౌ=ఆ ప్రమాణములు ఆత్మ యందు ప్రవర్తింపవు.

తా. శబ్దప్రమాణమువలనఁగాని యితరప్రమాణములవలనఁగాని ఆత్మ యందు బంధము చెప్పఁబడలేదు. ఉపాధిని నుపేక్షింప ప్రమాత (జీవుఁడు) సయితము బ్రహ్మమే కనుక ఆప్రమాణము లీబ్రహ్మమును బోధింపలేవు. ఆ గంతుకములగు శబ్దప్రత్యయములకును, అహంకారమునకును చిదాత్మకంటె వేఱగుస్వరూపము లేదు. ఆత్మ నిష్క్రియము. ౨౮

అవ. కావున అధ్యస్తవస్తువుల నిషేధమే చెప్పవలసి యున్నదని చెప్పుచున్నారు:—

మూ. అహం కర్త్రాఽఽత్మనిన్యస్తం చైతన్యేకర్తృతాది యత్,
నేతినేతీతి తత్సర్వం సాహంకర్త్రా నిషిధ్యతే. ౨౯

టీ. చైతన్యే=చిద్రూపమగు, ఆత్మని = ఆత్మయందు, అహంకర్త్రా= సాభాసాంతఃకరణప్రతిబింబు (జీవు)నిచేత, యత్ = ఏకర్తృత్వాదికము, న్యస్తం = ఆరోపింపఁబడినదో, తత్ సర్వం = ఆ కర్తృత్వభోక్తృత్వాదిక

* ఇది సతః షష్ఠి, సతి సప్తమివంటిది.

మంతయు, న ఇతి, న ఇతి, ఇతి=ఇదికాదు ఇదికాదు అని, సాహంకర్త్రా= అహంకారముతోఁగూడ, నిషిధ్యతే=(ఇది ఆత్మ కాదని) నివారింపఁబడును.

తా. చిద్రూపాత్మయందు అంతఃకరణప్రతిబింబుఁడగు జీవునిచే ఏ కర్తృత్వభోక్తృత్వములు ఆరోపింపఁబడుచున్నవో ఆ కర్తృత్వభోక్తృత్వాదికమంతయు 'నేతి నేతి' యని అహంకారసహితముగ నిషేధింపఁబడుటచేత నవియన్నియు ఆత్మ కావని స్ఫుటమగును. ౨౫

అవ. ఆరోపితమునే శాస్త్రము నిషేధించినయెడల ఆత్మ యెట్లు తెలియఁబడును? అను శంక కుత్తరము:—

మూ. ఉపలబ్ధిః స్వయం జ్యోతిర్దృశిః ప్రత్యక్సదక్రియః,
సాక్షాత్సర్వాంతరస్సాక్షీ చేతానిత్యోఽగుణోఽద్వయః.

టీ. ఉపలబ్ధిః = జ్ఞానస్వరూపము, స్వయంజ్యోతిః = స్వయముగఁ బ్రకాశించునది. దృశిః = సకలమును జూచునది, ప్రత్యక్ =(దృశ్యము అసత్తు జడము దుఃఖమును అగు జగత్తుకంటె) విలక్షణము. దృక్ = సచ్చిదానందరూపము, సత్ =కాలత్రయాబాధ్యము, అక్రియః = చలనరహితమై పూర్ణమైనది, సాక్షాత్ = ప్రత్యక్షమైనది, సాక్షీ = మాయాకల్పితపదార్థములయొక్క రాకపోకలను గనిపెట్టునది, చేతాః=సకలమును వ్యాపారక్షమముగఁ జేయునది. [ఇచట "అజడాత్మవదాభాంతి యత్సాన్నిధ్యాజ్జడా అపి, తమాత్మానం వేదితారం విద్ధి బుద్ధ్యా సుసూక్ష్మయా," అను స్మృతి ప్రమాణము] నిత్యః = (కాలత్రయమందు బాధలేక) నిత్యమైయుండునది, అగుణః = సత్త్వరజస్తమోగుణములు లేనిదై వానికి సాక్షిమాత్రముగ నుండునది, అద్వయః=మాయాకల్పితవస్తువులకు స్వతస్సత్త లేనందున వానికి సత్తాప్రదమగుచు ఒక్కటియే యగుటచేత ఆత్మ ద్వితీయరహితము.

తా. ఆత్మ స్వప్రకాశము, దృక్స్వరూపము అనుటయందు ఉపనిషత్తులు ప్రమాణము. కాని, ఆత్మ లేదనుటయందు ఏప్రమాణమును లేదు. ఆత్మయొక్క విశేషణములు టీకయందు వివరింపఁబడినవి. ౫౯

అవ. అయ్యా! 'తాను' 'తనది' యను జ్ఞానములు అహంప్రత్యయమునకును మమప్రత్యయమునకును విషయములు. అట్లైన ఆత్మ ఎట్లు స్వతస్సిద్ధ మగును? అను శంకకు ఉపాధిసంబంధమువలన అట్లు తోఁచినను ఆత్మ స్వతస్సిద్ధము కాకపోదు. అని చెప్పుచున్నారు:—

మూ. సన్నిధౌ సర్వదా తస్య స్యాత్తదాభోఽభిమానకృత్,
ఆత్మాఽఽత్మీయంద్వయం చాతఃస్యాదహంమమగోచరః.

టీ. అభిమానకృత్=అహంకారము, సర్వదా=ఎల్లప్పుడును, తస్య=చైతన్యముయొక్క, సన్నిధౌ=సన్నిధియం దుండుటచేత, తదాభః=చైతన్యప్రకాశము గలిగియుండును. అతః=కనుక, ఆత్మా=తాను, ఆత్మీయం=తనది (అనే), ద్వయం=ద్వంద్వము, స్యాత్=కలుగును. (అయం=ఇది), అహంమమ గోచరః='అహం' 'మమ' యని వ్యవహరింపఁబడును.

తా. అహంకారము జడమైనను ఆత్మచైతన్యసాన్నిధ్యమువలన నేను నాది యని వ్యవహరించును. ౬౦

అవ. 'సంభావ్యో గోచరే శబ్దః' అని ౫౮-వ శ్లోకములోఁ జెప్పఁబడిన ప్రత్యయాగోచరత్వమును నిరూపించి, యిపుడు ఆత్మయందు అహం శబ్దముసహితము ప్రవర్తింపదు. అహంశబ్దమునకు అహంకారమే అర్థమని చెప్పుచున్నారు:—

మూ. జాతికర్మాదిమత్త్వాద్ధి తస్మిఀశబ్దాస్త్వహంకృతి,
న కశ్చిద్వర్తతే శబ్దస్తదభావాత్స్వ ఆత్మని. ౨౮

టీ. శబ్దాః='అహం' 'మమ' శబ్దములు, జాతికర్మాదిమత్వాత్ = బ్రాహ్మణాదిజాతులు, తపఃప్రభృతి కర్మములు గలవగుటచేత, తస్మిన్ అహంకృతి=చిదాభాసవిశిష్టమైన దేహద్వయమందు, హి=నిశ్చయముగ, ప్రవర్తంతే=ప్రవర్తించును. తదభావాత్=ఆ జాతికర్మములు లేనందున, స్వే ఆత్మని=స్వరూపాత్మయందు, కశ్చిత్ (అపి)=ఏశబ్దమును, న వర్తతే=ప్రవర్తింపదు.

తా. అహంశబ్దము ముఖ్యవృత్తిచేత జాతికర్మములుగల దేహాదికమునే బోధించునుగాని జాతికర్మరహితమగు ఆత్మను బోధింపదు. ఆత్మయందు వాచకశబ్దములెవ్వియు లేనందున అహంశబ్దమునకు లక్ష్యార్థమగు ఆత్మ స్వతఃసిద్ధమని భావము. ౨౮

అవ. స్వతస్సిద్ధమగుఆత్మకు శబ్దప్రయోగహేతువులగు జాతికర్మాదులు లేనందున నిరుపాధికమగు ఆత్మయందే శబ్దమును బ్రవర్తింపదేని ఉపనిషత్తులు ఆత్మనెట్లు ప్రతిపాదించును? అను శంకకుత్తరము:—

మూ. ఆభాసో యత్ర తత్రైవ శబ్దాః ప్రత్యగ్దృశిం స్థితాః,
లక్షయేయుర్న సాక్షాత్తమభిదధ్యుః కథంచన. ౨౯

టీ. యత్ర = ఏ అహంకారాదికమందు, ఆభాసః = చైతన్యప్రతిబింబము ఉండునో, తత్ర ఏవ = చిదాభాసవిశిష్టమైన ఆయంతఃకరణాదికమందే, స్థితాః = వాచకములుగనున్న, శబ్దాః=ఆత్మ మొదలగు శబ్దములు, ప్రత్యగ్దృశిం=ప్రత్యగాత్మను, లక్షయేయుః = లక్షణావృత్తితో బోధించును,

కాని, కథంచన=ఎట్లుగను, సాక్షాత్=వాచనికముగ, న అభిదధ్యుః=బోధింపలేవు. కావున ఆత్మ ఉపనిషత్తులందు లక్షణావృత్తిచే బోధింపఁబడును గాని ఆత్మ ఇదమిత్థమ్మని బోధింపఁబడదు.

తా. ఏ అహంకారాదికమందు చైతన్యప్రతిబింబుఁడగు జీవుఁడు ఉండునో ఆ యంతఃకరణాదికమందే వాచకములగు ఆత్మాదిశబ్దములు ప్రత్యగాత్మయందు లాక్షణికములగును. అనఁగా, ఆత్మ ఉపనిషత్తులందు లక్షణావృత్తిచే బోధింపఁబడునుగాని ఇదమిత్థమ్మని ప్రత్యక్షముగ బోధింపఁబడదు. ౭౯

అవ. ఉపనిషత్తులు ఆత్మను ముఖ్యవృత్తితో బోధింపలేవనుటకు కారణము:—

మూ. నహ్యజాత్యాదిమాన్కశ్చిదర్థః శబ్దైర్నిరూప్యతే,

టీ. అజాత్యాదిమాన్=జాతికర్మాదికములేని, కః చిత్ అర్థః=ఏయర్థమును, శబ్దైః=శబ్దములచేత,నిరూప్యతే=(ముఖ్యవృత్తితో) బోధింపఁబడదు.

తా. జాతికర్మాదులు గలవానినే శబ్దములు ముఖ్యవృత్తిచే బోధించునుగాని తద్రహితమగు ఆత్మయందు ఈశబ్దములు ముఖ్యవృత్తితోఁ బ్రవర్తింపవు, కనుక నీశబ్దములను ఆత్మయందు లక్షణావృత్తినే అంగీకరింపవలెను.

అవ. అయ్యా! లక్షణావృత్తితో నెచట శబ్దమునకు తాత్పర్యమో, అట్టి అహంకారాతిరిక్తమగు ప్రత్యగాత్మయందు వృత్తి సంభవించునేని లోకులు అహంకారమందు ఆత్మశబ్దము నెట్లుపయోగింతురని శంకింతువేని, ఆత్మశబ్దము

నకు అహంకారము గౌణార్థము. అని దృష్టాంతయుక్తముగఁ జెప్పుచున్నారు:—

మూ. ఆత్మాభాసో యథాఽహంకృదాత్మశబ్దైస్తథోచ్యతే. 30
ఉల్ముకాదౌ యథాఽగ్న్యర్థాః పరార్థత్వాన్న చాంజసా,

టీ. అగ్న్యర్థాః=అగ్నిని బోధించెడి 'దహతి' మొదలగు శబ్దములు, పరార్థత్వాత్=అగ్నినే బోధించుటవలన, ఉల్ముకాదౌ = కొఱవి యినుము మొదలగువానియందు, అంజసా=సత్యముగ, యథా=ఎట్లు, న=ప్రవర్తింపవో, తథా=అట్లే, అహంకృత్ = అహంకారము, ఆత్మాభాసః=ఆత్మవలె భాసింపుచు, ఆత్మశబ్దైః ఉచ్యతే = ఆత్మశబ్దములచేతఁ జెప్పఁబడినను నది ముఖ్యార్థము కాదు.

తా. అహంకారము ఆత్మశబ్దమునకు గౌణార్థమేకాని ముఖ్యార్థము కాదు. ఆత్మవలె భాసించుటచే నట్లు చెప్పఁబడును. కొఱవి, కాలిన యినుము మొదలగు శబ్దములు వానియందు అభివ్యక్తముగనున్న అగ్నినే బోధించునుగాని యీవస్తువులను బోధింపవు. అట్లే అహంకారము ఆత్మాభాసముకాని అహంశబ్దమునకు ముఖ్యార్థము కాదు. 30

అవ. ౨౭-వ శ్లోకమునఁ జెప్పఁబడినట్లు సిద్ధాంతి ఆభాసమును అంగీకరించెను. భేదబుద్ధితోను వ్యత్యయబుద్ధితోను భాసించెడి యీ ఆభాసము 'సత్యమా, మాయికమా' యను శంక రాఁగా, ఆభాసము పరమార్థమని నిశ్చయించుటకై దృష్టాంతమును జూపుచున్నారు:—

మూ. ముఖాదన్యో ముఖాభాసో యథాఽఽదర్శానుకారతః.
ఆభాసాన్ముఖమప్యేవమాదర్శాననువర్తనాత్,

టీ. ముఖాభాసః = ముఖప్రతిబింబము, ఆదర్శానుకారతః యథా ముఖాత్ అన్యః=అద్దమందు తోఁచుటచే ఎట్లు అన్యమగునో (సః=ఆ ముఖ ప్రతిబింబము), ఆదర్శాననువర్తనాత్ = ప్రక్కనుండి చూడఁగ అద్దము నందు లేనిదగుచు, ఆభాసాత్ ఏవం ముఖం అపి=(అన్యత్ ఏవ) = ఇట్టి క్రియాభేదమువలన ముఖమున్నూ అన్యమే యగుచు.

తా. కంఠస్థముఖమునందు నాదము కలుగుచు. ప్రతిబింబముఖమందు నాదము కలుగదు. ఇంతియేకాక సిప్రతిబింబము ఆదర్శసత్తకంటె నన్యసత్త లేనిదికనుక సత్యముకాదు. ప్రత్యక్షముగ కంటికి కనుపించుటచేత అసత్య మునుగాదు. కనుక ఆభాసము అనిర్వచనీయము, అనఁగా నిట్టిదని చెప్పనలవి కానిది. ఉపాధిసంబంధమువలనఁగలిగిన యీభేదము ఉపాధినిరసనమువలన ఏకమే యగును. "ఉపాధ్యపోహేస్వయమేవకేవలః" అని యార్య వచనము.    ౩౧

అవ. దార్ష్టాంతికమును నిరూపించుచున్నారు:—

మూ. అహంకృతావాత్మనిభాసో ముఖాభాసవదిష్యతే.౩౨
ముఖవత్స్మృత ఆత్మాన్యోఽవివిక్తౌ తౌ తథైవ చ,

టీ. అహంకృతి = అహంకారమందు, ఆత్మనిర్భాసః = చైతన్యావ భాసము, (చైతన్యము కాకున్నను చైతన్యమువలెఁ దోఁచుట), ముఖాభాస వత్ =ముఖప్రతిబింబమువలె, ఇష్యతే=శుద్ధాత్మకంటె వేఱుగఁ జెప్పఁబడును. ఆత్మా=శుద్ధాత్మ, ముఖవత్ =కంఠస్థముఖమువలె, అన్యః స్మృతః=ఆభాసము కంటె భిన్నమగును. తథైవచతౌ అవివిక్తౌ = ఆత్మ ఆత్మాభాసలు ముఖముఖా భాసములవలె పరమార్థముగ భేదము లేనివి.

తా. ముఖము, అద్దము, ముఖాభాసము నని వ్యవహారభేదమున్నను పరమార్థతః భేదము లేనట్లు, ఆత్మ, అంతఃకరణము, ఆత్మాభాసము నని వ్యవ

హారభేదమున్నను పరమార్థముగ చైతన్యమాత్రమే కాని భేదము లేదని భావము. 32

అవ. ఇట్లు అనాద్యవిద్యయందును, తత్కార్యమగు అహంకారమందును ప్రతిఫలించిన చైతన్యము ఉపాధిసంబంధమువలన సంసారియనఁబడునని శ్రీమచ్ఛంకరాచార్యులు స్వమతమును నిరూపించి, దానిని ధ్రువపరుచుటకై ఏకదేశి మతమును ఉపన్యసించి, దానిని దూషించుచున్నారు:—

మూ. సంసారీ చ స ఇత్యేక ఆభాసో యస్త్వహంకృతి. 33
వస్తు చ్ఛాయా స్మృతేరన్యన్మాధుర్యాది చ కారణమ్,

టీ. అహంకృతి = అహంకారమందు, యః ఆభాసః=ఏ ఆభాసము కలదో, సః=ఆ అహంకారమందు ప్రతిఫలించిన ఆత్మాభాసమే, సంసారీ ఇతి =సంసారి యని, ఏకే=కొందఱు (తలంతురు.) "నాక్రమేత్కామతశ్ఛాయాంగుర్వాదేః" అను స్మృతి నీడ పరమార్థవస్తుతుల్య మగునని చెప్పుట వలన, ఛాయా=ఆభాసము, వస్తు=పరమార్థవస్తువే యగును. అన్యత్ చ = మఱియొకవిశేషము కలదు. మాధుర్యాది = మాధుర్యము, కారము, నీడ మొదలగునవి యిచట, కారణం=కారణముగ నున్నది.

తా. అహంకారమందుఁ బ్రతిఫలించిన ఆత్మాభాసమే సంసారియని కొందఱు తలంతురు. కాని, ఆభాసము పరమార్థవస్తువే యగును. ఎట్లన— కారము కొట్టెడి చోటనున్నవానికి కారమే యధికముగ భాసించునట్లు మధురపదార్థభూయిష్ఠస్థలమందుండు నరునకు మధురగంధము అధికముగ స్ఫురించును. చెట్టునీడను గూర్చున్నవానికి చలువకలుగుట యెల్లరకుం దెల్లమే. ఇట్లే జీవునకుఁ గలుగు సుఖవాసనవలన పరమాత్మ పరమసుఖస్వరూ

ప్పఁడని తెలియవలెను. ఐతే జీవునకుఁగల దుఃఖమువలన పరమాత్మకు దుఃఖ మధికమని యేల యనరాదని యాక్షేపింతువేని వినుము.ఏ వఁడును 'తన చావునకు మందు పుచ్చుకొనఁడు' అనునట్లు స్వరూపనాశమునకై యత్నిం చువాఁ డుండఁడు.లోకములో నందఱు తమకు దుఃఖముపోవలెనని యత్నిం చువారలేకాని సుఖము పోవలెనని యెవరును గోరరు. దుఃఖమే ఆత్మ స్వరూపమైనయెడల నెవ్వరును దుఃఖము పోవలయునని కోరరు. కావున దుఃఖము ఆగంతుకమనియు, ఆత్మకు సుఖమే స్వరూపమనియుఁ దెలియ వలెను. 33

అవ. మఱల, ఏకదేశిమతముయొక్క త్రివిధభేదము లను జెప్పుచున్నారు:—

మూ. జైకదేశో వికారో వా తదాభాసాశ్రయః పరే. 34
అహంకర్త్రైవ సంసారీ స్వతంత్ర ఇతి కేచన,

టీ. జైకదేశః=చిదాత్మయొక్క యొకభాగము సంసారియని కొం దఱు, వికారః వా=అగ్నికణములు అగ్నివికారములగునట్లు ఆత్మవికారము లని కొందఱు,తదాభాసాశ్రయః=చిదాభాసునకు ఆధారమగు అహంకారము సంసారియని మఱికొందఱు చెప్పెదరు. కేచన=భాట్టమతస్థులు కొందఱు, అహం స్వతంత్రః కర్తా ఇతి=నేను స్వతంత్రకర్తనుగాని పరమాత్మవశుఁడను గానని చెప్పెదరు.

తా. ఏకదేశిమతస్థులలో కొందఱు చిదాత్మయొక్క యొకభాగము సంసారియని చెప్పెదరు. "మమైవాంశో జీవలోకే జీవభూతః సనాతనః" ౧౫-౭. అను గీతావాక్యము వీరికి ప్రమాణము. అగ్నికణములు అగ్నివికా రములైనట్లు సంసారులు (జీవులు) ఆత్మవికారములని కొందఱు చెప్పెదరు.

ఆత్మనః సర్వేప్రాణాః సర్వేలోకాః సర్వేదేవాః సర్వాణిభూతానివ్యుచ్చరంతి. (బృహ. ౪-౧-౨౦.) (అగ్నినుండి అగ్నికణములు వెడలునట్లు జీవులు పరమాత్మనుండి వెడలుదురు)అనెడి శ్రుతి వీరికి ప్రమాణము. చిదాభాసునకు ఆధారమగు అహంకారము సంసారియని మఱికొందఱు చెప్పెదరు. వీరికి ("తన్మనో దిశం దిశం పతిత్వా" ఛాం. ౬-౮-౨.) అను శ్రుతిప్రమాణము. భాట్టమతస్థులు "అహం స్వతంత్రః కర్తా ఇతి" (నేను స్వతంత్రుఁడనుగాని పరమాత్మవశుఁడనుగాను) అని చెప్పెదరు.

అవ. ఇఁకను బౌద్ధమతమును గూర్చి చెప్పుచున్నారు:—

మూ. అహంకారాదిసంతానః సంసారీ నాన్వయీ [1]క్వచిత్.
ఇత్యేవంసౌగతాఆహు స్తత్ర న్యాయోవిచార్యతామ్,

టీ. అహంకారాది సంతానః=క్షణికములగు విజ్ఞానములే, సంసారీ=సంసారికాని, అన్వయీ ఏకః=విజ్ఞానోత్పత్తినాశములను గనిపెట్టెడి చిద్వస్తువు, క్వచిత్ న = ఎచ్చటను లేదు. ఇత్యేవం=ఈప్రకారము, ఆహుః = (బౌద్ధులు) చెప్పెదరు. తత్ర=ఆ మతభేదములందు, న్యాయః విచార్యతాం=ఏది అర్హమో దానిని పండితు లూహించవలయును.

తా. క్షణికములగు విజ్ఞానములే జీవులుగాని విజ్ఞానోత్పత్తి నాశములను గనిపెట్టెడి చిద్వస్తువు లేనేలేదని క్షణికవాదులు (బౌద్ధులు) చెప్పెదరు కాని ఆవాదము విశ్వసనీయమగునో కాదో జ్ఞానులు ఊహించఁదగును.

అవ. ప్రసంగాగతమగు సంసారివిచారమును మాని ప్రస్తుతమగు ఆభాసమును నిరూపించుచున్నారు:—

---

1 పృథక్=వేఱుగ.

మూ. సంసారిణాం కథా త్వాస్తాం ప్రకృతం త్వధునోచ్యతే.
ముఖాభాసో య ఆదర్శే ధర్మో నాన్యతరస్య సః,
ద్వయోరేకస్య చేద్ధర్మో వియుక్తే ఽన్యతరే భవేత్. 32

టీ. సంసారిణాం కథా తు ఆస్తాం = సంసారి యెవఁడను విమర్శ యటుండనిమ్ము, అధునా=ఇప్పుడు, ప్రకృతం=ప్రస్తుతాభాసము, ఉచ్యతే= చెప్పఁబడును. ఆదర్శే=అద్దమందు, యః ముఖాభాసః=ఏముఖప్రతిబింబము గలదో, సః = ఆప్రతిబింబము, అన్యతరస్య ధర్మః న=కేవల ముఖధర్మము కాదు, కేవలదర్పణధర్మమును గాదు. ద్వయోః ఏకస్య=ముఖాదర్శములు రెండింటిలో, ఏకస్య ధర్మః చేత్=ఏదోయొకదాని ధర్మమయితే, అన్యతరే వియుక్తే = ముఖము లేకుండ అద్దమున్నను అద్దములేక ముఖమున్నను, భవేత్=ముఖాభాసము కనిపింపవలెను. రెండును లేనపుడు ఆభాసము లేక పోవుటచే నీయాభాసము ముఖమునది యనికాని అద్దమునది యనికాని చెప్పఁదగదు.

తా. సంసారి యెవఁడను విమర్శము నటులుంచి, ప్రస్తుతాభాసమును నిరూపించుటకై ఆదర్శదృష్టాంతముచే చిదాభాసలక్షణమును వివరించుచున్నారు. ఎట్లన, అద్దమందు ప్రతిఫలించు ముఖప్రతిబింబము ముఖధర్మము కాదు, దర్పణధర్మమునుగాదు. ఆరెండింటిలో యేదోయొకదాని ధర్మమైన యెడల ముఖము లేనపుడు అద్దమున్నను, అద్దములేనపుడు ముఖమున్నను ముఖాభాసము కనుపింపవలసినదే. ఈరెండును లేనపుడు ఆభాసమే లేదు కనుక ఆయాభాసము ముఖమునది యనికాని అద్దమునది యనికాని చెప్పవలనుగాదు. 32

అవ. దీనికి పక్షాంతరమును జెప్పుచున్నారు:—

ఉపదే—31

మూ. ముఖేన వ్యపదేశాత్స ముఖస్యైవేతి చేన్మతమ్,
నాదర్శానువిధానాచ్చ ముఖే సత్యవిభావతః. 3౮

టీ. ముఖేన వ్యపదేశాత్ = ముఖాభాసమని చెప్పుటవలన, సః=ఆ యాభాసము, ముఖస్య ఏవ ఇతిమతం చేత్=ముఖమునదే యనినయెడల, ఆదర్శానువిధానాత్ = అద్దమున్నపుడే ఆయాభాసము కలుగుచు అద్దము లేనపుడు లేకపోవుటవలనను, ముఖేసతి = ముఖ మున్నప్పటికి, అవిభావతః= (అద్దము లేనపుడు) లేనందునను, న=అభాసము ముఖధర్మము కాదు.

తా. ముఖాభాసమని చెప్పుటచే నాయాభాసము ముఖమునదే యందు మేని, అద్దమున్నప్పుడే ఆభాసము కలదు కాని అద్దము లేనపు డాభాసము లేదు. కనుక ఆభాసము ముఖధర్మము కాదు. 3౮

అవ. మూడవపక్షము ననువదించి దానిని దూషించు చున్నారు:—

మూ. ద్వయోరేవేతి చేత్తన్న ద్వయోరేవాప్యదర్శనాత్,
అదృశ్యస్య సతో దృష్టిః స్యాద్రాహోశ్చంద్రసూర్య
యోః. 3౯

టీ. తత్=ఆయాభాసధర్మము, ద్వయోరపి అదర్శనాత్ = కేవల ముఖమునకుఁగాని కేవలదర్పణమునకుఁగాని లేనందున, ద్వయోరేవ ఇతి న=ముఖదర్పణములు రెండింటియొక్కధర్మము ఆభాసమని చెప్పరాదు. సతః=వాస్తవముగ నుండినను, అదృశ్యస్య=ఏయింద్రియములకును గోచరము కాని, రాహోః దృష్టిః = రాహుదర్శనము, చంద్రసూర్యయోః స్యాత్ = చంద్రసూర్యుల గ్రహణకాలమందు కనుపించును.

తా. ఆయాభాసధర్మము కేవలముగ ముఖమునకుఁగాని దర్పణమున కుఁగాని లేనందున ముఖదర్పణములు రెండింటియొక్క ధర్మము ఆభాసమని చెప్పరాదా? ఆదువేని, ముఖదర్పణములు రెండును ఏలాగుననో కలిసి నపుడు ప్రతిబింబము కలుగకపోవుటచేత ఆభాసము ముఖాదర్శసంయోగ జన్యమనియుఁ జెప్పఁదగదు. ఈ మూఁడుపక్షములును పొసఁగనందున ఆభా సమునకు వేఱొక నాల్గవవస్తువు పరమార్థవస్తువుకావలెనని దృష్టాంతపూర్వ కముగ శంకించుచున్నాఁడు. ఎట్లన, ఇంద్రియములకు గోచరముకాని రాహు దర్శనము చంద్రసూర్యుల గ్రహణసమయమునఁ గనుపించును. ఈవిధము ననే వాస్తవమగు ముఖాభాసము స్వయముగఁ గనుపింపకున్నను ముఖసత్త యుఁ ముఖవద్దర్పణస్థితియుఁ నను ఉపాధిద్వయమందుఁ గనిపించునని పూర్వ పక్షి తాత్పర్యము. ౩౯

అవ. రాహువునకు ముఖాభాసమునకు భేదముండుట వలన నీచతుర్థపక్ష మంగీకరింపఁబడదని చెప్పుచున్నారు:—

మూ. రాహోః ప్రాగేవ వస్తుత్వం సిద్ధం శాస్త్రప్రమాణతః,
ఛాయాపక్షే త్వవస్తుత్వం తస్యస్యాత్పూర్వయుక్తితః.

టీ. ప్రాక్ ఏవ=చంద్రసూర్యగ్రహణములు కలుగకముందే, శాస్త్ర ప్రమాణతః = జ్యోతిశ్శాస్త్రప్రమాణమువలనను, పురాణాదిప్రమాణమువల నను, రాహోః = రాహుగ్రహమునకు, వస్తుత్వం సిద్ధం=సత్యత్వము నిశ్చ యింపఁబడినది. ఛాయాపక్షేతు=భూఛాయ యని చెప్పెడిపక్షమున, తస్య అవస్తుత్వం=అది అసత్యమని, పూర్వయుక్తితః స్యాత్ = పైయుక్తివలననే తెలియఁబడుచున్నది.

తా. చంద్రసూర్యగ్రహణములను ప్రత్యక్షముగఁ జూచుటతో నిమి

త్తము లేకయే జ్యోతిశ్శాస్త్రప్రమాణముచేతను పురాణాది ప్రమాణము చేతను రాహుగ్రహము ఉన్నట్లు నిశ్చయింపఁబడినది. ముఖాభాస మొకటి కలదనెడి శాస్త్రమెద్దియును లేదు. అనఁగా, ముఖదర్పణములయొక్క సంబంధముకంటె పూర్వమందును పరమందును ముఖాభాసమునకు ముఖదర్పణ వ్యతిరిక్తసత్త యెక్కడను ఏప్రమాణముచేతను నిశ్చయింపఁబడలేదని తాత్పర్యము. రాహువు ఛాయాగ్రహమని చెప్పెడి వారల మతమును పూర్వోక్తులవల్లనే పూర్వపక్షమగును. ४०

అవ. పై 3४-వ శ్లోకములో ఛాయ వాస్తవము అను విషయమై చెప్పిన స్మృతిపైని ఉత్తరము:—

మూ. ఛాయాక్రాంతేనిషేధోఽయం న తు వస్తుత్వసాధకః,
న హ్యర్థాంతరనిష్ఠం సద్వాక్యమర్థాంతరంవదేత్. ४౧

టీ. అయం నిషేధః=(3४-వ శ్లోకములో చెప్పఁబడిన) ఈ నిషేధము, ఛాయాక్రాంతః = గురుచ్ఛాయనుగూర్చి చెప్పఁబడెను, తు=కాని, వస్తుత్వసాధకః న=దానిచే ఛాయయొకపరమార్థమని చెప్పఁబడలేదు. వాక్యం=ఒకవాక్యము, అర్థాంతరనిష్ఠం సత్=ఒకఅర్థమును జెప్పుచు, అర్థాంతరం న వదేత్=మఱియొక అర్థమును (ఆవాక్యమే) బోధింపలేదు.

తా. 3४-వ శ్లోకములోఁ జెప్పఁబడిన నిషేధము గురుచ్ఛాయను దాటఁగూడదనుటనుగూర్చి చెప్పఁబడెనేకాని ఛాయయొక పరమార్థమని చెప్పఁబడలేదు. ఒక వాక్యము ఒక యర్థమును జెప్పుచు మఱియొక అర్థమును బోధింపదు.

అవ. చెట్టునీడను గూర్చుండినవానికి చల్లదనము కలు

గుటవలన చెట్టునీడయు నొకవస్తువేయనుట భ్రాంతిమాత్రమే యని చెప్పుచున్నారు:—

మూ. మాధుర్యాది చయత్కార్యముష్ణద్రవ్యాద్యసేవనాత్,
ఛాయాయా న త్వదృష్టత్వాదపామేవ చ దర్శనాత్.

టీ. మాధుర్యాది యత్కార్యం చ=(చెట్టునీడను గూర్చుండినవానికి) చేలువ మొదలగు నేసుఖముకలదో(అది), ఉష్ణద్రవ్యాద్యసేవనాత్=ఎండ మొదలగు నుష్ణద్రవ్యములను సేవింపనందువలననే కలిగెను, తు=కాని, ఛాయాయాః న=అది నీడయొక్క గుణము కాదు. (ఏలయనఁగా,) అదృష్టత్వాత్ = కానిన తాలియదుగున చల్లదనము కనుపింపనందునను, అపాం ఏవ దర్శనాత్ చ=నియతముగనాచేలువ జలధర్మమగుటవలనను నీడయందుఁ గూర్చుండినవానికిఁగలిగిన చేలువ ఎండలేనందుననే ఉదకమునకు స్వాభావ చేల్లదనము నీడదే యనుకొనుట భ్రమమాత్రమే.

తా. ఎండలోనుండి చెట్టునీడను గూర్చుండినవానికి చేల్లదనమువలనఁ గలుగు సుఖము ఎండలో లేకపోవుటవలనఁ గలుగును గాని, ఆ చేల్లదనము నీడయొక్క గుణము కాదు. చెట్టు నీడవలనఁ గలిగినది యనుకొనుట భ్రమమాత్రమే యగును. ౪౭

అవ. ఇట్లు ముఖము, ఆశ్రయమగు అద్దము, ముఖాభాసము ననునీమూఁడును వ్యవహారదశయందు వేఱుగ భాసించినను పరమార్థదృష్టితోఁ జూడఁగ నన్నియు నొక ముఖము కంటె వేఱు కానట్లు ఆత్మ, ఆభాసాశ్రయమగు మాయ, ఆత్మాభాసము ననుమూఁడును వ్యవహారదశయందు వేఱుగఁ దోఁచినను ఇవి వాస్తవము కావని నిరూపించుచున్నారు:—

మూ. ఆత్మాభాసాశ్రయా శ్చైవం ముఖాభాసాశ్రయా
యథా, గమ్యన్తే శాస్త్రయుక్తిభ్యామాభాసాసత్త్వ
మేవ చ. ౪౩

టీ. ఆత్మా=త్వంపదలక్ష్యార్థము, ఆభాసః=అవిద్యాతత్కార్యోపాధి ప్రతిబింబితజీవుఁడు, ఆశ్రయః = అవిద్యాతత్కార్యోపాధి, (ఏతే=ఈ మూఁడును) ముఖాభాసాశ్రయాః యథా=ముఖము ముఖప్రతిబింబము ఆశ్రయమగు అద్దము నను మూఁడింటివలె, శాస్త్రయుక్తిభ్యాం = శాస్త్రము చేతను యుక్తిచేతను, గమ్యంతే = తెలియఁబడును. ఆభాసా సత్త్వం ఏవ చ=ఆభాసయే సత్యముకాదనియు (గమ్యతే=తెలియఁబడును).

తా. ముఖము, ముఖప్రతిబింబము, అద్దము నను మూఁడింటివలెనే ఆత్మ, ఆభాసము (జీవుఁడు), ఆశ్రయము (మాయ) యను మూఁడును ఆత్మాభాసములేకాని వేఱుకావని శాస్త్రమువల్లను యుక్తివల్లను దెలియఁబడును. "రూపంరూపం ప్రతిరూపో బభూవ," (కఠ. ౫) "ఇంద్రోమాయాభిః పురురూప ఈయతే," (బృహ. ౪-౫-౧౯.)"అనీశయాశోచతి ముహ్యమానః" (ముండ. 3-౧.) అను శ్రుతు లిటఁ బ్రమాణము. బుద్ధ్యాదివిషయములు దృశ్యములును రాకపోకలు గలవియునై నిత్యసిద్ధసాక్షియగు ఆత్మయందు అధ్యాసములేనిది స్ఫురించుట ఉండుటయు ననుచితమను యుక్తివలనను ప్రత్యగాత్మ యొకటియే నిత్యము, ఆభాసాదికము సర్వము ననిత్యమునని నిశ్చయింపఁబడును. ౪౩

అవ. ఇట్లుండఁగా, నీమతమందు ఆశ్రయము లేకపోవుటచేత సంసారమును మోక్షమును సంభవింపవు. ఏలయనఁగా, సంసారము కేవలమగు ఆత్మకు లేదు. ఆత్మాభాసునకును లేదు.

ఆశ్రయమునకును లేదు. ఈమూఁడును కలిసిన సముదాయము నకును సంభవింపదు. అని పూర్వపక్షి శంక:—

మూ. న దృశేరవికారిత్వాదాభాసస్యాప్యవస్తుతః,
నాచితిత్వాదహంకర్తుః కస్య సంసారితా భవేత్? ౪౪

టీ. అవికారిత్వాత్ =కూటస్థుఁడు అవికారికనుక, దృశేః = చైతన్యమునకు, న=సంసారిత్వము లేదు. అవస్తుతః=వాస్తవము కానందున, ఆభాసస్యాపి న=చిదాభాసునకును సంసారము లేదు. అహంకర్తుః అచితిత్వాత్ = ఆభాసాశ్రయమగు అహంకారము జడముకనుక, న=దీనికిని సంసారము కలుగదు. (అతః=కనుక), సంసారితా=సంసారము, కస్య భవేత్ =ఎవనికిఁ గలుగును?

తా. జ్ఞాత, కర్త, భోక్త మొదలగు వికారములే సంసారము. ఇవి లేకపోవుటయే మోక్షము. వీనితోఁ గూడినవాఁడు వికారియగును. అందులో నీవికార మెవనికని విచారింపఁగా, కూటస్థుఁ డవికారియగుటవలన వానికి సంసారము కలుగదు.ఆభాసము వాస్తవము కానిది కనుక చిదాభాసునకును సంసారములేదు. ఆభాసాశ్రయమగు అహంకారమునకును సంసారము లేదు. కాఁబట్టి యిఁకను సంసారమెవరికిఁ గలుగును? మోక్షమెవనికిఁ గలుగును? అని శంక. ౪౪

అవ. సంసారము మోక్షము ననునవి అవిద్యాకల్పితములు కనుక వాస్తవములు కావని సమాధానము:—

మూ. అవిద్యామాత్ర ఏవాతః సంసారోఽస్త్వవివేకతః,
కూటస్థేనాత్మనా నిత్యమాత్మవా నాత్మనీవ సః. ౪౫

టీ. సంసారః=కర్తృత్వభోక్తృత్వరూపసంసారము, అవిద్యామాత్ర ఏవ=స్వప్నవస్తువువలె భ్రాంతికల్పితమే. అస్తు=అగును. అతః=కనుక, అవివేకతః=ఆత్మానాత్మవివేకము లేకపోవుటచే, సః = ఆసంసారము, నిత్యం=ఎల్లపుడు, కూటస్థేన ఆత్మనా = కూటస్థాత్మతో, ఆత్మవాన్=స్థితిగలదై, ఆత్మని ఇవ=ఆత్మధర్మమువలె భాసించును.

తా. కర్తృత్వభోక్తృత్వరూపసంసారము స్వప్నప్రపంచమువలె అవిద్యాకల్పితమే కాని వాస్తవము కాదు. ఆత్మానాత్మవివేకము లేకపోవుటవలన నిర్వికారుఁడై సర్వజగదాగమాపాయములకు సాక్షిమాత్రుఁడగు ఆత్మతో స్థితిగలదగుటచేత సంసారము ఆత్మధర్మమువలె భాసించును. కనుక సంసారము, మోక్షముననునవి కల్పితమాత్రములగుటచే వాస్తవములు కావు. ౪౫

అవ. ఆత్మసత్తతో స్థితిగల సంసారము ఆత్మధర్మమువలె భాసించు ననుటకు దృష్టాంతము:—

మూ. రజ్జుసర్పో యథా రజ్జ్వా సాత్మకః ప్రాగ్వివేకతః,
అవస్తు సన్నపి హ్యేష కూటస్థేనాత్మనా తథా. ౪౬

టీ. వివేకతః ప్రాక్=విమర్శింపకముందు, రజ్జుసర్పః=త్రాఁటియందు సర్పభ్రాంతి, యథా=ఏవిధమున, రజ్జ్వాసాత్మకః=రజ్జుసత్తకంటె భిన్నసత్త కలది కాదో, తథా=అట్లే, ఏషః=ఈకర్తృత్వాదిసంసారము, అవస్తుసన్నపి= సత్యము కాకున్నను, కూటస్థేన ఆత్మనా=సత్యమగు ఆత్మతో అధ్యాసము గలదియై తానును సత్యముగ తోఁచుచుండును.

తా. రజ్జువందు సర్పభ్రాంతి కలిగినపుడు దాని నిజమును విమర్శింపక ముందు ఆ భ్రాంతిసర్పము ఏవిధమున రజ్జుసత్తకంటె భిన్నము కాదో అట్లే

యీ కర్తృత్వభోక్తృత్వాదిసంసారము సత్యము కాకున్నను నిత్యసత్యాత్మతో అధ్యాసముగలదియై సత్యముగ తోఁచును. కావున సంసారము అవిద్యాకల్పితము. మోక్షమును అట్టిదే. ౪౮

అవ. పూర్వపక్షి మతాంతరముచే సూక్ష్మముగ శంకించుచున్నాఁడు:—

మూ. ఆత్మాభాసాశ్రయశ్చాత్మా ప్రత్యయైస్స్వైర్వికారవాన్,
సుఖీ దుఃఖీ చ సంసారీ నిత్య ఏవేతి కేచన. ౪౯

టీ. ఆత్మాభాసాశ్రయః = జీవకల్పనాధిష్ఠానము, ఆత్మాచ=ఆత్మయే. (ఆయాత్మ), స్వైః ప్రత్యయైః వికారవాన్=తనదియగు వికారములచేత వికారముగలవాఁడు, సుఖీ దుఃఖీ చ సంసారీ=సుఖి దుఃఖి యనుసంసారధర్మములు గలిగియుండును (తథాఽపి = అట్లు వికారవంతుఁడైనను), (ఆత్మా) నిత్యః ఏవ ఇతి=ఆత్మనిత్యుఁడేయని, కేచన మన్యతే=కొందఱు తలంతురు.

తా. జీవకల్పనాధిష్ఠానము ఆత్మయే. ఆయాత్మ తనసంబంధమగు వికారములవలన సుఖదుఃఖాదిసంసారధర్మములు గలిగియుండును. అట్లయ్యును ఆత్మ నిత్యుఁడేయని కొందఱు తలంతురు. తరంగబుద్బుదాదివికారములుండినను సముద్రుఁడు నిత్యుఁడే యైనట్లు ఆత్మ నిత్యుఁడని వారు ఉదాహరింతురు. ఆభాసము తదాశ్రయాంతఃకరణము నను భేదములను గల్పించి తత్సంబంధమగు వికారములవలనఁగలుగు అవివేకముచేత ఆత్మను సంసారిగాఁ దలంతురని చెప్పుచు శ్రమపడుటకంటె 'ఆత్మ సంసారి' యని చెప్పిన బాగుండును. ౪౯

అవ. "సంభావ్యో గోచరే శబ్దః" అను ౨౮-వ శ్లోకములో ఆత్మ సంసారియని చెప్పెడి ప్రమాణము లేదని చెప్పి

యున్నాము. ఆవిషయమును మఱువకుము. అను అభిప్రాయముతో, ఈకల్పన ఊహామూలకమే కాని ప్రమాణమూలకము కాదని చెప్పుచున్నారు:—

మూ. ఆత్మాభాసాపరిజ్ఞానాద్యాథాత్మ్యేన విమోహితాః,
అహంకర్తారమాత్మేతి మన్యన్తే తే నిరాగమాః. ౮౮

టీ. యాథాత్మ్యేన = యథార్థముగ, ఆత్మాభాసాపరిజ్ఞానాత్ = కూటస్థునియొక్కయు జీవునియొక్కయు నిజస్థితి తెలియకపోవుటవలన, విమోహితాః= భ్రమజెందినవారై, అహంకర్తారం=అహంకారమునే, ఆత్మా ఇతి మన్యన్తే = ఆత్మయని తలంతురు. (యతః=ఏమన), తే=వారలు, నిరాగమాః=శాస్త్రరహస్యార్థము నెఱుఁగరు.

తా. కూటస్థునియొక్కయు జీవునియొక్కయు యాథార్థ్యమును దెలియకపోవుటవలన విమోహితులై, అహంకారమునే ఆత్మయని కొందఱు తలంతురు. శాస్త్రార్థరహస్యముల నెఱుంగకపోవుటయే దీనికిఁ గారణము. "నిష్కలం నిష్క్రియం శాంతం నిరవద్యం నిరంజనం"(శ్వేతా. ౬.) అనియు, "సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ," అనియు, "కృత్స్నః ప్రజ్ఞానఘన ఏవాత్రాయం పురుషః స్వయంజ్యోతిః,"(బృహ. ౬-3-౯) అనియు శ్రుతి వికారవంతమగు అంతఃకరణముతో సంబంధములేని ఆత్మ శుద్ధమని చెప్పుచున్నది. మఱియు, "అనీశయా శోచతి ముహ్యమానః" (ముండ. 3-౧.) అవిద్యాయామంతరే వర్తమానాః" (ముండ.౧-౨.) అన్యతేన హి ప్రత్యూఢా" (ఛాందో. ౮-3-౨.) అను శ్రుతులు వికారవతగు అంతఃకరణోపాధితోఁగూడిన జీవుఁడు అనిత్యుఁడనియు, వికారియనియు చెప్పుచున్నవి. ఈ భేదము మాయాకృతము, ప్రతిబింబము, వస్తువుకంటె నభిన్నము, కనుక

ఆత్మమాత్రమే శేషించుననెడి రహస్యము నెఱుంగనివారలు భ్రమపడుదురని భావము. ౪౭

అవ. అట్టివారలకు మోక్షము దుర్లభమని చెప్పుచున్నారు:—

మూ. సంసారో వస్తుసంస్తేషాం కర్తృభోక్తృత్వలక్షణః,
ఆత్మాభాసాశ్రయాజ్ఞానాత్సంసరంత్యవివేకతః. ౪౮

టీ. కర్తృభోక్తృత్వలక్షణః=కర్త భోక్త ఇత్యాదిరూపమగు, సంసారః=సంసారము, తేషాం = వారలమతమున, వస్తుసన్ =పరమార్థసత్యమగును. (తే=వారలు), అవివేకతః = అజ్ఞానమువలన, ఆత్మాభాసాశ్రయాజ్ఞానాత్ =ఆత్మ, ఆత్మాభాసుఁడగు జీవుఁడు, జీవాశ్రయమగు అవిద్యయను నీ మూఁడింటిని నెఱుంగక, సంసరంతి = జననమరణములను బొందెదరు.

తా. కర్తృత్వభోక్తృత్వాదిరూపమగు సంసారము వారలమతమున పరమార్థసత్యమగును. "నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః" (గీత. ౨-౧౬.) అను స్మృతినిబట్టి సంసారము నిత్యమనియు మోక్షము లేదనియు వారలు తలంతురు. అజ్ఞానమువలన ఆత్మ, జీవుఁడు, అవిద్య యను నీమూఁడింటియొక్క యథార్థమును దెలియఁజాలక వారలు జననమరణరూప సంసారమునందుఁ జిక్కువడి మోక్షము గనఁజాలరు. ౪౮

అవ. పరపక్షమందలి దోషమును హానినిఁ జెప్పి, స్వపక్షమందు ఆభాసమును అంగీకరించుటవలనఁ గలుగు లాభవిశేషమును జెప్పుచున్నారు:—

మూ. చైతన్యాభాసతా బుద్ధేరాత్మనస్తత్స్వరూపతా,

స్యాచ్చేత్తం జ్ఞానశబ్దైశ్చ వేదః శాస్తీతి యుజ్యతే. ౫౦

టీ. బుద్ధేః=అంతఃకరణముయొక్క, చైతన్యాభాసతా=చైతన్య ప్రతిబింబమగు, ఆత్మనః=ఆత్మ, తత్స్వరూపతా=చిద్రూపము, స్యాచ్చేత్=అగునేని (తదా=అపుడు), వేదః=శ్రుతి, తం=ఆయాత్మను, జ్ఞానశబ్దైః=జ్ఞానము, సత్తు, అనంతము, ఆనందము మొదలగు పదములచే, శాస్తి=నిరూపించు ననుట, యుజ్యతే=తగును.

తా. శ్రుతిస్మృతిన్యాయవిదులు చిదాభాసుని అంగీకరింతురు. ప్రకాశస్వభావముగల చిద్వస్తువు బుద్ధియందు ప్రతిబింబించుటవలన చిదాభాసుఁడు కలుగును. జలమందు సూర్యుఁడు ప్రతిఫలింపఁగా సూర్యాభాసము కలుగునట్టే బుద్ధియందు ప్రతిఫలించిన చైతన్యము చిదాభాసుఁడగును. కావున ఆభాస విశిష్టబుద్ధియందు తగిన జ్ఞానాదిశబ్దములచేత వేదము ఆత్మను లక్షణావృత్తితో బోధించును. ''యతో వాచో నివర్తంతే'' అను శ్రుతి ఆత్మ శబ్దముచే నిరూపింపఁదగనిది యని నిషేధించుటవలన ముఖ్యవృత్తి చెల్లదు కనుక నిట లక్షణావృత్తి గ్రహింపఁబడెను. లేనియెడల ధర్మరహితమగు ఆత్మయందు శబ్దము ప్రవర్తింపలేకపోవుటచే ఆత్మ వేదాంతవేద్యము కాదు. మఱియొక ప్రమాణముచేతనైనను ఆత్మ తెలియఁబడకఁబోవును. అట్లంగీకరించినయెడల ఆత్మ లేకపోవలసివచ్చును. తాను లేనటుల నెంతటి మూఢుఁడైనను దలఁచుకొనఁడనఁగా, నే బుద్ధిమంతుఁడు ఆత్మ లేదని నిశ్చయించును? ఆభాసునిఁగూర్చి లక్షణావృత్తిచే శ్రుతి బోధించుటచే ఆభాసుని అంగీకరింపవలసి యుండెను. ౫౦

అవ ఆభాసుని అంగీకరించినయెడల ఆత్మయందు వేద

శబ్దము ప్రవర్తింపఁదగును. కాని జానాతి (ఎఱుఁగును) మొద లగు శబ్దములకు ఆత్మయందుఁ బ్రవృత్తి యెట్లు కలుగును? శబ్దప్రవృత్తి లేదేని వ్యవహారము లోపించును, అని మఱి యొక శంక కలుగుచున్నది.

మఱియు, జ్ఞానశబ్దమునకు వ్యుత్పత్తిని విమర్శింపఁగా, ‘జ్ఞాయతేఽనేనేతి జ్ఞానం’ (తెలియుటకు సాధనము) అని యర్థముకద. ముఖ్యవృత్తినివిడిచి లక్షణ యేల చెప్పవలయును? అనెడి శంకయు గలుగుచున్నది, అని చెప్పుచున్నారు:—

మూ. ప్రకృతిప్రత్యయార్థౌ యౌ భిన్నావేకాశ్రయావుభౌ,
కరోతి గచ్ఛతీత్యాదౌ దృష్టౌ లోకప్రసిద్ధితః.   ౫౨

టీ. ప్రకృతిప్రత్యయార్థౌ యౌ = ప్రకృత్యర్థమగు వ్యాపారమును ప్రత్యయార్థమగు కర్తృత్వము ననునవి యేవికలవో, (తౌ = ఆ రెండును), భిన్నౌ=స్వరూపమువలన వేఱైనను, ఏకాశ్రయౌ = ఒకపదమునందే వర్తించుచు, కరోతి గచ్ఛతి ఇత్యాదౌ=చేయుచున్నాఁడు పోవుచున్నాఁడు అను పదములందు, యథా దృష్టౌ=లోకమున నెట్లు తెలియఁబడునో, (తథా= అట్లే), లోకప్రసిద్ధివలననే తెలియఁబడును.

తా. ప్రకృత్యర్థమగు వ్యాపారమును ప్రత్యయార్థమగు కర్తృత్వ మును స్వరూపమువలన వేఱైనను ఒకపదమునందే వర్తించుచు, ‘కరోతి గచ్ఛతి’ మొదలగు పదములందు ఎట్లు తెలియఁబడుచున్నవో అట్లే లోక ప్రసిద్ధివలననే ‘జానాతి కరోతి’ యను పదములందలి జ్ఞానము జ్ఞాతయు, కరణము కర్తయు నను ధర్మములకు ఆత్మయొక్కఁడే ఆధారము కావ చ్చును. అని తాత్పర్యము.   ౫౧

అవ. ఈ రెండింటికిని ఆధార మొకటియైనవిధమున నెక్కడైనను ఆధారము వేఱువేఱుగా నుండఁగూడదా యనుశంక కుత్తరము:—

మూ. నానయోర్ద్వ్యాశ్రయత్వంచలోకేదృష్టంస్మృతౌతథా,
జానాత్యర్థేషుకోహేతుర్ద్వ్యాశ్రయత్వే నిగద్యతామ్.

టీ. అనయోః = ప్రకృతిప్రత్యయార్థములకు, ద్వ్యాశ్రయత్వం = వేఱువేఱు చోట్లనునికి, లోకే=వ్యవహారములో, న దృష్టం=కనుపించలేదు. తథా=అట్లు, స్మృతౌ= వ్యాకరణశాస్త్రమందును (న దృష్టం=కనుపింపదు), జానాత్యర్థేషు=తెలియుట తెలియును అను అర్థములుగల పదములకు, ద్వ్యాశ్రయత్వే=వేఱువేఱుపదములు వాచకములగునేని యపుడు,'జానాతి' యను పదములోనున్న 'తి'యను ప్రత్యయమునకు ఆత్మ యర్థమనియు మిగిలిన భాగమునకు బుద్ధి యర్థమనియుఁ గల్పించుటకు, కోహేతుః=కారణ మెద్దియో, నిగద్యతామ్=నీవే చెప్పవలయును.

తా. ప్రకృతిప్రత్యయార్థములకు వేఱువేఱుచోట్ల నునికి యున్నట్లు వ్యవహారమందుఁ గనుపింపదు. వ్యాకరణశాస్త్రమందు సయితము నటుల కనుపింపదు. తెలియుట తెలియును అను అర్థములుగల పదములకు వేఱువేఱు పదములు వాచకములగునేని జానాతి శబ్దములోని 'తి' ప్రత్యయమునకు ఆత్మ యనియు మిగిలినభాగమునకు బుద్ధియనియు అర్థమును గల్పించుటకు హేతువెద్దియో నీవే యూహింపుము. ౫౨

అవ. ప్రకృతిప్రత్యయార్థములు ఒకవస్తువునం దుండుననెదవా ? లేక వానికి ఒకేఆధారము సత్యము కాదందువా ?

యని వికల్పించి సిద్ధాంతి మొదటి యంశమున కుత్తర మిచ్చు చున్నాఁడు:—

మూ. ఆత్మాభాసస్తు తిఙ్వాచ్యో ధాత్వర్థశ్చ ధియః క్రియా,
ఉభయం చావివేకేన జానాతీత్యుచ్యతే మృషా. ౫౩

టీ. తు=అట్లు శంకింపనవసరములేదు, వినుము. ఆత్మాభాసః=జీవుఁడు, తిఙ్వాచ్యః='జానాతి' యను పదమందున్న 'తి'యను ప్రత్యయమున కర్థము, ధియః క్రియా=బుద్ధివృత్తి, ధాత్వర్థః=ప్రకృత్యర్థము. (కనుక) ఉభయం చ=ఆత్మాభాసము బుద్ధివృత్తి యను నీ రెండును, అవివేకేన=పరమార్థాత్మజ్ఞానము లేకపోవుటచేత, మృషైవ=వ్యర్థముగ, జానాతి ఇతి ఉచ్యతే=తెలియును అని చెప్పఁబడును.

తా. ఆత్మాభాసుఁడగు జీవుఁడును, బుద్ధివృత్తియను నీరెండును అవివేకముచేత జానాతి (తెలియును) అని ఆత్మపరముగ నన్వయింపఁబడును. అగ్నితప్తముగాని యినుము కాల్పనేరదు. ఇనుముతోఁజేరని అగ్నికొట్టఁబడదు. అయినను ఈరెండును కలియుటవలన ఇనుము కాల్చుచున్నది, అగ్ని కొట్టఁబడుచున్నది యని పరస్పరాధ్యాసమువలన నట్లు తోఁచును. ఇట్లే ఆత్మకు వికారములేదు. జడమగు బుద్ధికి బోధలేదు. అయినను అన్యోన్యాధ్యాసమువలన చిదాభాసుఁడు తెలియును దుఃఖించును అను వ్యవహారము కలుగుచున్నది. ౫౩

అవ. ఇఁకను రెండవ విషయమును గూర్చి చెప్పుచున్నారు:—

మూ. న బుద్ధేరవబోధోఽస్తి నాత్మనో విద్యతే క్రియా,
అతో నాన్యతరస్యాపి జానాతీతి చ యుజ్యతే. ౫౪

టీ. బుద్ధేః=జడమగు బుద్ధికి, అవబోధః = చిత్ప్రకాశము, న=లేదు. ఆత్మనః=బోధస్వరూపుఁడగు ఆత్మకు, క్రియా న విద్యతే=వికారములేదు. అతః=కనుక, అన్యతరస్య అపి = కేవలబుద్ధికిఁగాని కేవలాత్మకుఁగాని, జానాతీతి=తెలియుననువ్యాపారము, నయుజ్యతే=తగదు.

తా. జడమగు బుద్ధికి చిత్ప్రకాశము లేదు. బోధస్వరూపుఁడగు ఆత్మకు క్రియ (వికారము) లేదు. కనుక 'జానాతి' యను వ్యాపారము కేవల బుద్ధికిఁగాని కేవలాత్మకుఁగాని వర్తింపదు. కాఁబట్టి లోకవ్యవహార సిద్ధికై 'జానాతి' యనుచోట ఆరోప్యాంశముతో అధిష్ఠానమునకైక్యము నంగీకరింపవలయును. ఈయధ్యాసమువలన లోకమందుగాని శాస్త్రమందు గాని విరోధము లేదు. ౫౪

అవ. జానాతీతి జ్ఞః = తెలియువాఁడు జ్ఞుఁడనఁబడును. తెలియనివాఁడు అజ్ఞుఁడనఁబడును. ఈవ్యుత్పత్తివలన ఆత్మకాని బుద్ధికాని వేఱ్ఱేఱుఁ దెలియఁజాలవు, జడాజడములకు ఐక్యము సంభవింపదు కనుక మిళితములగు ఆత్మబుద్ధులును దెలియఁ జాలవు. అధ్యాసము లేక జడాజడములకు సాన్నిధ్యము కలుగదు కనుక అన్యతరసంధినిమిత్తమగు ఉభయాశ్రయత్వము అన్యతరమందుఁ గలుగనేరదు. మఱియు నిట్లు జ్ఞప్తియే జ్ఞాన మనఁబడును, అనెడి భావవ్యుత్పత్తియు ఆత్మయందు సంభవింపదని చెప్పుచున్నారు:—

మూ. నాప్యతో భావశబ్దేన జ్ఞప్తిరిత్యపి యుజ్యతే,
న హ్యాత్మా విక్రియామాత్రో నిత్య ఆత్మేతి శాసనాత్.

టీ. అతః=కనుక, భావశబ్దేన అపి=ధాత్వర్థసామాన్యవచనముచేతఁ గూడ భావార్థకవ్యుత్పత్తి నాశ్రయించి, జ్ఞప్తిః=జ్ఞానము అని, ఇత్యర్థః=ఈ యర్థముసయితము, న యుజ్యతే=తగదు. హి=ఏలయనఁగా, ఆత్మా నిత్యః ఇతి శాసనాత్=ఆత్మ నిత్యమను శాస్త్రమువలన, ఆత్మా=ఆత్మ, విక్రియామాత్రః=వికారమాత్రుఁడును, న=కాఁడు.

తా. కాఁబట్టి (పైశ్లోకముతో నన్వయము) ధాత్వర్థసామాన్యవచనముచేతఁగూడ జ్ఞానమను నర్థము సయితము తగదు. ఏమన, 'ఆత్మ నిత్యము' అను శాస్త్రమువలన ఆత్మ వికారమాత్రుఁడు కాఁడు. ౫౫

అవ. ఆత్మవాచియగు జ్ఞానశబ్దమునకు కర్తృవ్యుత్పత్తియే కాని భావవ్యుత్పత్తి లేదని చెప్పినట్లు, 'జ్ఞాయతేఽనేన జ్ఞానం' = దీనిచేఁ దెలియఁబడునుఅను కరణవ్యుత్పత్తియు, జ్ఞాయత ఇతి జ్ఞానం = తెలియఁబడునదిఅను కర్మవ్యుత్పత్తియును లేవని చెప్పుచున్నారు:—

మూ. న బుద్ధేర్బుద్ధివాచ్యత్వం కరణం న హ్యకర్తృకమ్,
నాపి జ్ఞాయత ఇత్యేవం కర్మశబ్దైర్నిరూప్యతే. ౫౬

టీ. బుద్ధేః బుద్ధివాచ్యత్వం న=(బుధ్యతేఽనయా బుద్ధిః ఇతి) దీనిచేఁ దెలియఁబడును గనుక బుద్ధియను కరణవ్యుత్పత్తిచేత-బుద్ధియనఁగా అంతఃకరణమే కాని ఆత్మ కాదు. హి=ఏలయనఁగ, కరణం = సాధనము, అకర్తృకం న=కర్త్రపేక్షలేక పనిచేయనేరదు. అపిచ=మఱియు, జ్ఞాయత ఇతి ఏవం = తెలియఁబడుటవలన జ్ఞానము ఆత్మయని, కర్మశబ్దైః=కర్మవాచకప్రత్యయముల చేత, న నిరూప్యతే=చెప్పఁబడదు.

తా. 'దీనిచేఁ దెలియఁబడును గనుక బుద్ధి' యను కరణవ్యుత్పత్తి వలన బుద్ధియనఁగా అంతఃకరణమే కాని ఆత్మ కాదు. ఏలయన కర్త్రపేక్షలేక సాధనము స్వయముగ పనిచేయనేరదు. మఱియు, కర్మవాచకప్రత్యయము లచేత జ్ఞానము ఆత్మయని నిరూపింపఁబడదు. ౫౬

అవ. ఇట్లు జ్ఞానశబ్దమునకు ముఖ్యవృత్తిచేత ఆత్మయని అర్థము కాదనిచెప్పిన సిద్ధాంతి మాటమీఁద, పూర్వపక్షి 'యీ ఆక్షేపము మీ మతమునందును సమానమే' యనిన, సిద్ధాంతి యా శంకను పరిహరించుచున్నాఁడు:—

మూ. న యేషామేక ఏవాత్మా నిర్దుఃఖోఽవిక్రియః సదా,
తేషాం స్యాచ్ఛబ్దవాచ్యత్వం జ్ఞేయత్వం చాత్మనఃసదా.

టీ. యేషాం = ఎవరిమతమున, ఆత్మా=ఆత్మ, ఏకః ఏవ=ఒక్కఁడే, నిర్దుఃఖః = దుఃఖరహితుఁడు, సదా అవిక్రియః=ఎల్లపుడు నిర్వికారుఁడు అని చెప్పఁబడెనో, తేషాం=వారిపక్షమున, ఆత్మనః=ఆత్మకు, జ్ఞేయత్వం = తెలియఁబడుటయు, శబ్దవాచ్యత్వం = శబ్దములచేఁ జెప్పఁదగుటయు, సదా న స్యాత్ =ఎపుడును గలుగ నేరదు.

తా. ఆత్మ అద్వితీయుఁడు, దుఃఖరహితుఁడు, నిష్క్రియుఁడు నని ఎవరిమతమునఁ జెప్పఁబడెనో వారిపక్షమున ఆత్మకు జ్ఞేయత్వశబ్దవాచ్యత్వము లెన్నఁడును గలుగనేరవు. ఆత్మ దుఃఖియు వికారియునై అద్వితీయుఁడు కాఁడేని, అపుడు ఆత్మ జ్ఞేయుఁడును శబ్దవాచ్యుఁడును అగునని తాత్పర్యము.

అవ. అట్లేని ఆత్మ శబ్దవాచ్యుఁడని సాధించుటకై వికారవంతుఁడును కానగునని శంక:—

మూ. యదాఽహంకర్తురాత్మత్వం తదా శబ్దార్థముఖ్యతా,
నాశనాయాదిమత్త్వాత్తు శ్రుతౌ తస్యాత్మతేష్యతే. ౫౫

టీ. యదా=ఎపుడు, అహంకర్తుః ఆత్మత్వం=అహంకారము ఆత్మయగునో, తదా = అపుడు, శబ్దార్థముఖ్యతా=ఆత్మ శబ్దవాచ్యుఁడగును. శ్రుతౌ=వేదమందు, తస్య=ఆ అహంకారమునకు, అశనాయాదిమత్త్వాత్=క్షుత్పిపాసాదులు గలిగియుండుటచేత, ఆత్మతా=ఆత్మత్వము, న ఇష్యతే= అంగీకరింపఁబడదు.

తా. ఎపుడు అహంకారము ఆత్మయగునో యపుడు ఆత్మశబ్దముచేఁ జెప్పఁదగినవాఁడగును. కాని ఆ యహంకారము క్షుత్పిపాసలు శోకమోహములు జరామరణములు గలిగియుండునని వేదమందుఁ జెప్పఁబడెనది కనుక అహంకారమునకు ఆత్మత్వమంగీకరింపఁబడదు. ఈ క్షుత్పిపాసాదిషడ్వికారములు ఆత్మకు లేవనియు, క్షుత్పిపాసలు ప్రాణధర్మములనియు, శోకమోహములు మనోధర్మములనియు, జరామరణములు దేహధర్మములనియు శ్రుతి చెప్పుచున్నది. జ్ఞానాదిశబ్దములు ఆత్మను సాక్షాత్తుగఁ జెప్పఁజాలవు కనుక, ఆభాసుని సాక్షాత్తుగ వివరించి, పరమాత్మను లక్షణావృత్తిచేత శ్రుతి బోధించునని యెల్లరు నంగీకరింపవలయును. ౫౫

అవ. ఒకచోట ముఖ్యవృత్తితోఁ బ్రవర్తించిన శబ్దమునకు మఱియొకచోట లక్షణావృత్తి చెప్పఁదగునుగాని, యెక్కడను ముఖ్యవృత్తితోఁ బ్రవర్తింపని శబ్దము లక్షణావృత్తిచే నయినను దేనిని బోధింపలేదు. కాఁబట్టి ఆత్మనుగాని అన్యమునుగాని ముఖ్యవృత్తిచే బోధింపలేని శబ్దము లక్షణావృత్తిచేనయినను బోధింపఁజాలదు. అని నాల్గుశ్లోకములచే పూర్వవాది ఆక్షేపించుచున్నాఁడు:—

మూ. హన్త తర్హి న ముఖ్యార్థో నాపి గౌణః కథంచన,
జానాతీత్యాదిశబ్దస్య గతి ర్వాచ్యా తథాఽపితు. ౭౯

తా. జానాతీత్యాదిశబ్దములకు ముఖ్యవృత్తి లేక గౌణవృత్తియైనను లేనియెడల, నీజానాతీత్యాదిశబ్దములకు గతి యేమో చెప్పవలయును. ౭౯

అవ. ముఖ్యార్థము లేదేని గౌణార్థమును లేకపోవలెను అని యడుగుము. కాని గతి యేల చెప్పవలెనను శంకకుత్తరము :—

మూ. శబ్దానా మయథార్థత్వే వేదస్యాప్యప్రమాణతా,
సా చ నేష్టా తతో గ్రాహ్యా గతి రస్య ప్రసిద్ధితః. ౮౦

టీ. శబ్దానాం అయథార్థత్వే = లోకములో వాడఁబడెడి శబ్దములు ప్రమాణము కానపుడు, వేదస్యఅపి అప్రమాణతా = వేదమునయితము అప్రమాణమే యగును. సా చ = ఆవేదము ప్రమాణము కాకపోవుట, న ఇష్టా=ఆస్తికు లెవ్వరికిని సమ్మతముకాదు. తతః = వేదమునకుఁ బ్రమాణము చెప్పకతీరనందున, ప్రసిద్ధితః = లోకప్రసిద్ధివలనని యంటివేని, అస్య గతిః గ్రాహ్యా = ఈవేదమునకైనను గతి కల్పింపవలెను. అని పూర్వపక్షి శంకకు ప్రసిద్ధియే వేదమునకు గతి. కావున వేఱుగఁ జెప్పనక్కఱలేదని సిద్ధాంతి ఉత్తరము.

తా. లోకమందు వాడఁబడు శబ్దములం ప్రమాణముకానపుడు వేదమును అప్రమాణమేయగును. వేదము అప్రమాణమగుట ఆస్తికు లెవరును అంగీకరింపరు. వేదమునకు ప్రమాణము చెప్పకతీరదు కనుక, లోకప్రసిద్ధియే వేదమునకు గతి. ౮౦

అవ. ఓయి సిద్ధాంతీ! వేదమునకు ప్రాకృత జనప్రసిద్ధి వలన గతి కల్పింతువా? లేక, పాణిని మొదలగు మహర్షి ప్రసిద్ధి వలన గతి కల్పింతువా? అని వికల్పించి మొదటిదియగు ప్రాకృత ప్రసిద్ధిపక్షమును నిరాకరించుచున్నారు:—

మూ. ప్రసిద్ధి ర్మూఢలోకస్య యది గ్రాహ్యా నిరాత్మతా,
లోకాయతికసిద్ధాంతః సా చానిష్టా ప్రసజ్యతే ౬౧

టీ. మూఢలోకస్య ప్రసిద్ధిః=దేహాత్మవాదులగు లోకాయతికాది నాస్తికులయొక్క మతము, గ్రాహ్యా యది=గ్రహించెదమేని, నిరాత్మతా=ఆత్మ దేహాభిన్నముగ లేదనెడి, లోకాయతికసిద్ధాంతః=బౌద్ధసమ్మతమగు నాస్తికవాదము (సంభవించును), సాచ=ఆ వాదము, అనిష్టా ప్రసజ్యతే = ఆస్తికులగు మీకు గ్రాహ్యము కాదుకద.

తా. వేదమునకు గతి గల్పించుటలో లోకాయతికాది నాస్తికమతము గ్రహింపఁబడినయెడల బౌద్ధమతసమ్మతమగు నాస్తికవాదము సంభవించును. అది ఆస్తికులకు అనిష్టము. ౬౧

అవ. రెండవదియగు మునిమతమును అనువదించి దూషించుచున్నారు:—

మూ. అభియుక్తప్రసిద్ధి శ్చే త్పూర్వవ ద్దుర్వివేకతా,
గతిశూన్యం న వేదో ఽయం ప్రమాణాం సంవదత్యత.

టీ. అభియుక్తప్రసిద్ధిః చేత్=మహర్షిగృహీతప్రసిద్ధినే యంగీకరించిన యెడల, పూర్వవత్=పూర్వము చెప్పఁబడినట్లు, దుర్వివేకతా=బుద్ధికిఁగాని ఆత్మకుఁగాని జ్ఞాతృత్వము నిరూపింప శక్యముకాదని ముందుచెప్పిన దోషము

అనివార్యమే యగును. అట్లేని వేదమునకు గతి యేమనియందువా వినుము. ప్రమాణం=సకలమునకును ప్రమాణమగు, అయంవేదః = ఈవేదము, గతి శూన్యం న=గతి లేనిది కాదు. ఉత=కాక, సంవదతి=సమ్మతమే యగును.

తా. గతి విషయమై మహర్షి గృహీతప్రసిద్ధినే యంగీకరించినయెడల నిదివఱకు చెప్పఁబడినట్లు బుద్ధికిఁగాని ఆత్మకుఁగాని జ్ఞాతృత్వదోషము సంభ వించుటవలన మునిమతము సమ్మతము కాకపోదు. కనుక వేదమే గ్రాహ్యము.

అవ. జానాతి మొదలగు శబ్దములు ఉపాధిసంబంధము వలన చిదాత్మయందుఁ బ్రయోగింపఁ దగును అని సిద్ధాంతి దృష్టాంతపూర్వకముగఁ జెప్పుచున్నాఁడు:—

మూ. ఆదర్శే ముఖసామాన్యం ముఖస్యేష్టం హి మానవైః,
ముఖస్య ప్రతిబింబో హి ముఖాకారేణ దృశ్యతే.౬౩

టీ. ఆదర్శే=అద్దములో, ముఖసామాన్యం=ముఖముయొక్క సమాన ధర్మమే, మానవైః=(అద్దముకంటె వెలుపలనున్న) జనులచేత, ముఖస్య= ముఖముయొక్క, (ఇతి=ప్రతిబింబమని) ఇష్టం హి=అంగీకరింపఁబడునుగద, హి=ఏలయన, ముఖస్య ప్రతిబింబః = ముఖముయొక్క ప్రతిబింబమే, ముఖాకారేణ దృశ్యతే=ముఖమువలె భాసించును.

తా. అద్దములోఁ గనుపడు ముఖప్రతిబింబమును జూచుకొని యిది నా ముఖమేయని, ప్రతిబింబమును సయితము ముఖముగ భావించునట్లు, అంతఃకరణప్రతిబింబుఁడగు జీవుని ఆత్మగాఁ దలంతురు. ౬౩

అవ. అద్దమునందలి దోషమువలన ప్రతిబింబించిన ముఖము మలినముగగాని, వక్రముగగాని, అల్పముగగాని,

కనుపించునపుడు నిజముఖమున అట్టి వికృతరూపము లేక
న్నను వికృతిగనున్నట్లు యవివేకి తలంచునట్లు, ఉపాధియగు
బుద్ధిసంబంధమువలన జ్ఞాత, కర్త, భోక్త, యిత్యాది వ్యవహా
రభేదము ఆత్మకు కల్పింపఁబడుచున్నదని చెప్పుచున్నారు:—

మూ. యత్ర యస్యావభాసస్తు తయోరేవావివేకతః,
జానాతీతి క్రియాం సర్వో లోకో వక్తి స్వభావతః. ౬౮

టీ. (లోకే=లోకమందు), యత్ర=ఏవస్తువునందు, యస్య అవభా
సః=దేని ప్రతిబింబము (కలుగునో), తయోః అవివేకతః=ఆరెండింటియొక్క
తాదాత్మ్యాధ్యాసమువలననే, క్రియాం=ప్రతిపనిని, స్వభావతః జానాతి ఇతి=
స్వభావమువలన నెఱుంగునని, సర్వోలోకః=ఎల్లరును, వక్తి=చెప్పెదరు.

తా. ప్రతిబింబావభాసమునుబట్టి అవివేకముచేత సకలక్రియలును
అహంకారాధ్యాసమువలన గలుగునని భావము. ౬౮

అవ. ఈయర్థమునే వివరించుచున్నారు:—

మూ. బుద్ధేః కర్తృత్వమధ్యస్య జానాతీతి జ్ఞ ఉచ్యతే,
తథా చైతన్యమధ్యస్య జ్ఞత్వం బుద్ధేరిహోచ్యతే. ౬౯

తా. బుద్ధియొక్క కర్తృత్వమును ఆత్మయం దారోపించుటచేత
జానాతీతి జ్ఞః=తెలిసికొనువాఁడు గనుక జ్ఞాత యనఁబడును. ఈవిధముననే
ఆత్మచైతన్యమును బుద్ధియందారోపించుటచేత బుద్ధియొక్క జ్ఞానమనెడి
వ్యవహారము కలిగెను. ౬౯

అవ. బుద్ధ్యాదికముఁవలన ఆత్మకు జ్ఞానము కలుగుచుం

డఁగా బుద్ధియందు ఆత్మచైతన్య మారోపింపఁబడునని చెప్పె దరేమి యను శంకకు సమాధానము:—

మూ. స్వరూపం చాత్మనో జ్ఞానం నిత్యం జ్యోతిఃశ్రుతేర్యతః,
న బుద్ధ్యా క్రియతే తస్మాన్నాత్మనాఽన్యేన వా సదా. ౬౬

తా. "తదేవ జ్యోతిషాం జ్యోతిరాత్మైవాస్యజ్యోతిః", "అత్రాయం పురుషః స్వయంజ్యోతిః సాక్షీ చ", ఇత్యాది శ్రుతులవలన ఆత్మకు నిత్యజ్ఞానమే స్వరూపము. ఇదియే ప్రజ్ఞానము. కావున అజ్ఞానము బుద్ధిచేతఁ జేయఁబడదు. ఇట్లు జ్ఞానము ఆత్మచేఁగాని, అన్యములగు నింద్రియములచేఁగాని యెప్పుడును చేయఁబడదు. ౬౬

అవ. బుద్ధ్యాత్మలకు పరస్పరాధ్యాసమువలననే సకల వ్యవహారములు కలుగుననుటయందు దృష్టాంతమును జెప్పుచున్నారు:—

మూ. దేహేఽహం ప్రత్యయో యద్వజ్జానాతీతి చ లౌకికాః,
వదన్తి జ్ఞానకర్తృత్వం తద్వద్బుద్ధేస్తథాఽఽత్మనః. ౬౭

టీ. దేహే = (రూపాదికముగలదగుటచే ఘటాదికమువలె అహం ప్రత్యయార్హ్యముకాని) దేహమందు, లౌకికాః జానాతీతి యద్వద్వదంతి = లోకులు 'తెలుసుకొనును' అని ప్రయోగించునట్లు, బుద్ధేః=జడమగు బుద్ధికి, ఆత్మనః=చిదాభాసవ్యాప్తివలన, జ్ఞానకర్తృత్వం వదంతి = ఎఱుఁగుదును అనే వ్యవహారమును జెప్పుచున్నారు.

తా. వికారరహితమగు ఆత్మకు వికారవంతమగు చిత్తముతో సధ్యాససంబంధమువలన వికారిత్వవ్యపదేశము (వ్యవహారము) కలుగుచుండును. ఇట్లు లోకులు 'దేవదత్తుఁడు ఎఱుఁగును' అని దేహాధ్యాసమువలన దేహము

నకే జ్ఞాతృత్వమును జెప్పుచుండుట నెల్లరు నెఱింగినదే. కనుకనే బుద్ధి యెఱుఁగుననియు, ఆత్మకు వికారము కలదనియు నీమొదలగువ్యవహారము అధ్యాసమువలననే కలుగునని భావము. ౬౭

అవ. ఆత్మచేఁ జేయఁబడెడి జ్ఞానమునకు ఉత్పత్తివినాశములు గలవని తార్కికులు చెప్పుచుండఁగా నిత్యమగు జ్ఞానము ఆత్మస్వరూపమని చెప్పఁదగునా? యను శంకకుత్తరము:—

మూ॥ బౌద్ధైస్తు ప్రత్యయైరేవం క్రియమాణైశ్చ చిన్నిభైః,
మోహితాః క్రియతే జ్ఞానమిత్యాహుస్తార్కికా జనాః.

తా. ముందు చెప్పఁబడినట్లు ఆత్మబుద్ధులకు పరస్పరాధ్యాసమువలన చిత్తువలె భాసింపుచున్న బుద్ధివికారములగు వృత్తివిశేషములచే మోహితులగు తార్కికులు జ్ఞానము చేయఁబడునని చెప్పెదరు. కాని, జ్ఞానము చేయఁబడదు. జడమగు బుద్ధికిని చిత్స్వభావమగు ఆత్మకుఁగల వివేకము లేకపోవుటయే వార లట్లుచెప్పుటకుఁ గారణము. నిజముగ జ్ఞానము పుట్టి నశించుచుండెనేని యీజ్ఞానముయొక్క ఉత్పత్తివినాశములను గనిపెట్టెడి సాక్షి యెవఁడుండును? సాక్షిలేని వ్యవహారము ప్రసిద్ధముకాదు.

అవ. ఇట్లు విచారింపఁగా ప్రమాణసిద్ధమగు కూటస్థాత్మకు వికారముకలుగుట ప్రమాణముకాదు. ఏలయనఁగా జ్ఞానము ఆత్మస్వరూపమని శ్రుతి ఘోషించుటచేత నిత్యమగు జ్ఞానము చేయఁబడునదికాదు. ఆత్మకు బుద్ధిసంబంధ మున్నప్పుడే జ్ఞాతృత్వము సిద్ధించునుగాని సుషుప్తియందు బుద్ధిలేనందున ఆత్మ జ్ఞాతయుఁ గానేరఁడు. బుద్ధియు ఆత్మకంటె వేఱుగ జ్ఞానా

కారముగఁ దెలియఁబడదు. ఆత్మ, బుద్ధి, చిదాభాసుఁడు నను నీ మూఁడింటిని గ్రహింపక వ్యవహారమందు బుద్ధ్యాత్మలకు ఐక్యాధ్యాసమువలన నెఱుఁగుననుమాట చెప్పఁబడినను ఇది వాస్తవము కాదని విస్తరముగవివరించి ప్రకృతాంశమును విరమించుచున్నారు:—

మూ. తస్మాజ్జ్ఞాభాసబుద్ధీనామవివేకాత్ప్రవర్తితాః,
జానాతీత్యాదిశబ్దశ్చ ప్రత్యయో యా చ తత్స్మృతిః.

తా. 'జానాతి' యనుశబ్దమును, తద్విషయజ్ఞానమును, ఆసంస్కారమువలనఁ గలుగు స్మృతియు, పూర్వోక్తమైన ఆత్మ, బుద్ధి, చిదాభాసుల యొక్క వివేకజ్ఞానము లేమిచేతనే జరుగుచుండును. ౮౯

అవ. ఆత్మ బుద్ధ్యాభాసములను వివేకమువలన వేఱుగ గ్రహింపమిచే సకలవ్యవహారము గలుగునుగాని అదిపారమార్థికము కాదని సదృష్టాంతముగఁ జెప్పుచున్నారు:—

మూ. ఆదర్శానువిధాయిత్వం ఛాయాయా అస్యతే ముఖమ్,
బుద్ధిధర్మానుకారిత్వం జ్ఞాభాసస్య తథేష్యతే. ౯౦

తా. ముఖప్రతిబింబముయొక్క ఆదర్శానుకారము (ముకురమందున్న మాలిన్యాదికము) ముఖమునం దారోపింపఁబడునట్లు, చిదాభాసునియొక్క బుద్ధిధర్మానుకారము (దుఃఖిత్వాదికము) ఆత్మయం దారోపింపఁబడును. (అస్యతే=అధ్యస్యతే).

అవ. చిదాభాసునితో నైక్యాధ్యాసమును బొందుట చేతనే బుద్ధికి వృత్తిగ్రాహకత్వవ్యవహారము కలుగునని చెప్పుచున్నారు:—

మూ. బుద్ధేస్తు ప్రత్యయాస్తస్మాదాత్మాభాసేన దీపితాః,
గ్రాహికా ఇవ భాసన్తే దహన్తీవోల్ముకాదయః. ౭౧

తా. కనుక, చిదాభాసునిచే భాసింపఁజేయఁబడిన బుద్ధివృత్తులు అగ్నివిశిష్టమగు కొఱవులవలె తాము జడములైనను ప్రకాశకసాన్నిధ్యము వలననే గ్రాహికములవలె భాసించును. ౭౧

అవ. బుద్ధికిని చిదాభాసునకును గల భేదము తెలియ నందున మోహితులగు తార్కికులు జ్ఞానము ఆత్మచేఁ జేయఁబడునని చెప్పునట్లు బౌద్ధులును మోహమువలన బుద్ధ్యతిరిక్తమగు గ్రాహకము లేదనెదరని చెప్పుచున్నారు:—

మూ. స్వయమేవావభాస్యంతే గ్రాహకాః స్వయమేవ చ,
ఇత్యేవం గ్రాహకాస్తిత్వం ప్రతిషిద్ధ్యంతి సౌగతాః. ౭౦

తా. బుద్ధివృత్తులు తమంతతామే భాసించును. అవియె విషయములను గ్రహించును. కావున నివృత్తులను మఱియేదియును గ్రహింపలేదని బౌద్ధులు చెప్పెదరు. ౭౨

అవ. ఈ శ్లోకమున శ్రీమచ్ఛంకరాచార్యులు స్వాభిప్రాయమును బోధించుటకై యిట్లనుచున్నారు:—ఓయీ! బౌద్ధులు బుద్ధివృత్తిగ్రాహకము, మఱియొకటి లేదనియు, ఆ బుద్ధివృత్తి గ్రాహ్యము గ్రాహకము నగునని తలఁతురేని వారి మతము అనుభవానుసారి యగుటవలన చిదాభాసుని అంగీకరింపని ఆ బౌద్ధుల నెట్లు నిరాకరింపఁదగును:—

మూ. యద్యేవం నాన్యవృత్త్యాస్తే కిం తద్వారణముచ్యతామ్,

భావాభావౌ హి తేషాం యౌ నాన్యగ్రాహ్యౌ సతౌ యది. 23

తా. ఇట్లు ఆ బుద్ధివృత్తులు స్వాతిరిక్తసాక్షి చైతన్యముచే గ్రహింపఁబడవని చెప్పెడి బౌద్ధులమతమును నివారించుట యెట్లో మీరూహించి చెప్పుడనఁగా, నొక శిష్యుఁ డిట్లనియె—అయ్యా! ఆ బౌద్ధమతమందు బుద్ధివృత్తులయొక్క ఉత్పత్తివినాశములను గ్రహించెడి యన్యమును, నిత్యసిద్ధమునునగు సాక్షి లేకున్నను, ఈ బుద్ధివృత్తులయొక్క యుత్పత్తివినాశము లెచటనో ఆవస్తువను నేనేయని ప్రత్యభిజ్ఞ కలుగవచ్చును. కాఁబట్టి ఆ బౌద్ధులు చిదాభాసుని నంగీకరింపరని తలంచెద. 23

అవ. శిష్యుఁ డిట్లు చెప్పఁగా, నీయుక్తిమాత్రాన బౌద్ధుఁడు నివారింప శక్యముకాఁడని మఱల నాచార్యులు చెప్పుచున్నారు:—

మూ. అన్వయీ గ్రాహక స్తేషామిత్యేతదపి తత్సమమ్,
అచితిత్వస్య తుల్యత్వాదన్యస్మిన్గ్రాహకే సతి. 24

తా. ఈ బుద్ధివృత్తు లెక్కడఁబుట్టునో, ఎక్కడ లయించునో, ఆ యుత్పత్తినాశములందు నుంటున్నవాఁడనే నేను ప్రత్యభిజ్ఞయు జడమగు నొక బుద్ధివృత్తియే కనుక తానాబుద్ధివృత్తులలో నొకటి యగునుగాని, యా బుద్ధివృత్తులకు సాక్షి కానేరఁడు. ఎట్లనఁగా ప్రత్యయ (బుద్ధివృత్తి) గ్రాహకమగు ప్రత్యభిజ్ఞ అప్రకాశమగునేని దీనికి గ్రాహకము వేఱొకటి యుండవలెను. అప్పుడీ ప్రత్యభిజ్ఞ గ్రాహ్యపక్షములోనే చేరుచు జడమేయగుటచేఁ దనకంటె నితరమగు బుద్ధివృత్తులను గ్రహింపశక్తిలేనిదే యగును. కనుక, ఆ ప్రత్యభిజ్ఞ స్వప్రకాశమని చెప్పినయెడల మామతానుసరణమే కలుగును. అనఁగా నిర్వికారచిదాభాసుఁడు సిద్ధించును. 24

అవ. స్వప్రకాశమగు సాక్షి లేనియెడల బుద్ధివృత్తుల యొక్క యుత్పత్తివినాశములు సిద్ధింప వనినయెడల, సాక్షి సాన్నిధ్యమువలన ఆభావాభావములు సిద్ధింపవచ్చును గనుక చిదాభాసకల్పనకు అవసరము లేదని శంక:—

మూ. అధ్యక్షస్య సమీపే తు సిద్ధిః స్యాదితి చేన్మతమ్,
నాధ్యక్షేఽనుపకారిత్వాదన్యత్రాపి ప్రసంగతః. ౨౫

తా. సాక్షిసాన్నిధ్యమాత్రాన కార్యసిద్ధియగునేని వికారరహితసాక్షి వలన నుపకారమేమియుం గలుగదు. మఱియు, సాక్షి సమానముగ నంత టను నిండియుండుటవలన నీ యుపకారము చేతనములకువలె నచేతనములగు కాష్ఠలోష్టాదికములకును గలుగవలసివచ్చును. కాని అట్లు కలుగదు కనుక సాక్షీతరమగు చిదాభాసుని కల్పింపకతీరదు. క్రింది యుద్యోగులు లేనిచే రాజువలననే కార్యసిద్ధికలుగనట్లు కేవలమైతన్యమువలన నేకార్యమును గలు గనేరదు. ౨౫

అవ. ఇట్లు చిదాభాసుని నంగీకరింపనిచో బాధ్యాదిమత దోషపరిహారము కలుగదని శిష్యునకుం జెప్పి, శాస్త్రీయబంధ మోక్షవ్యవహారము సయుక్తము వారలకు సిద్ధింపదని చెప్పు టకై వికల్పించుచున్నారు:—

మూ. అర్థీ దుఃఖీ చ యః శ్రోతా సత్వధ్యక్షోఽథవేతరః,
అధ్యక్షస్య చ దుఃఖిత్వమర్థిత్వం చ న తే మతమ్. ౨౬

తా. సంసారదుఃఖభోక్తయగుటచేత మోక్షార్థియగు గురూపదేశ శ్రోత సాక్షియా? అన్యుడా? ఆ శ్రోత సాక్షియగునేని వానికి దుఃఖము మోక్షాపేక్షయుం గలుగవనుట ప్రసిద్ధము. కనుక గురూపదేశమును విను వాడు సాక్షి కానేరడు. ౨౬

అవ. ఈశ్రోత అన్యుఁడును గాఁడని చెప్పుచున్నారు:—

మూ. కర్త్రాఽధ్యక్షః సదస్మీతి నైవ సద్గ్రహమర్హతి,
సదేవాసీతి మిథ్యోక్తిః శ్రుతేరపి న యుజ్యతే. ౭౭

తా. గురూపదేశశ్రోత సాక్షికంటె భిన్నుఁడనేయెడల, దుఃఖాది వికారములుగల కర్తయగు నేను సాక్షినే యను బుద్ధిని గ్రహింపజాలఁడు. నీవా సద్వస్తువవే యని శ్రుతి చెప్పినను ఆమాట యసత్యమే యగును. ౭౭

అవ. చిదాభాసుని అంగీకరింపని బౌద్ధుని మతమున బంధమోక్షములు సంభవింపవని నిరూపించి, చిదాభాసుని అంగీకరించిన యెడల బంధమోక్షములు సిద్ధించునను స్వపక్షమును నిరూపించుచున్నారు:—

మూ. అవివిచ్యోభయం వక్తి శ్రుతిశ్చేత్స్యాద్గ్రహస్తథా,
అస్మదస్తు వివిచ్యైవ త్వమేవేతి వదేద్యది. ౭౮
ప్రత్యయాన్వయినిష్ఠత్వ ముక్తదోషః ప్రసజ్యతే,

తా. ఆత్మను అహంకారముతో వేఱుచేయక యథాసంభవముగ దుఃఖిత్వాదికమును గ్రహించి శ్రోతగనుండువానిని గుఱించి "తత్త్వమసి" యను శ్రుతి ఆత్మతత్త్వమును బోధించినయెడల శ్రుత్యుక్తము సమీచీనముగ నుండును.

అంతఃకరణమందు చిదాభాసుఁడు ప్రతిఫలించినను, ఆ యంతఃకరణ ధర్మములను చిదాత్మయం దారోపించుటవలన అవివిక్తాహంకారుఁడు (చిదాత్మవేఱు అహంకారము వేఱునని వేఱుచేయక తాదాత్మ్యబుద్ధిగలవాఁడు) ఆత్మస్వరూపము నపేక్షించుచు ముముక్షువగును. అట్లు వివేకజ్ఞానము లేక అహంకారచిదాభాసులకు ఐక్యజ్ఞానము గలిగియున్నవానిని చిదాభాససహి

తాంతఃకరణసాక్షిగ భాగత్యాగలక్షణతో బోధించి తేజోఽబన్నాది(వహ్ని జలభూమ్యాది) జగత్కారణమును సచ్ఛబ్దవాచ్యమునగు బ్రహ్మమును 'తత్' అని నిర్దేశించి, 'త్వం తదసి' భాగత్యాగముచేత నీవే యాబ్రహ్మమవని శ్రుతి ఆత్మతత్త్వమును బోధించును. అప్పుడు స్వరూపజ్ఞాన ముదయించును. భాగత్యాగమనఁగా, జీవోపాధియగు అంతఃకరణము, ఈశ్వరోపాధియగు మాయ యను నిరెండుపాధులను వదలి, ఉపాధిద్వయనిష్ఠమగు చైతన్య మొకటిగ భావించుట. ఈ భాగత్యాగమునే జహదజహల్లక్షణయందురు.

అహంకారమే కర్త యగుచుండఁగా చిదాభాసకల్పన మేల యను సాంఖ్యవాదము ననువదించి నిరాకరించుచున్నారు. 'అస్మదస్త్వితి' అహం కారమును ప్రత్యగాత్మనుండి వేఱుచేసి అహంకారగతచైతన్యము నీవేయని చెప్పినయెడల జడమగు అహంకారమునకుఁ గాని శుద్ధచైతన్యమునకుఁ గాని బోధసంభవింపనందున శ్రుతికి అసత్యము వచ్చునని మొదలగు దోషము సంభవిం చును గనుక చిదాభాసుని నంగీకరింపవలయునని భావము.

౨౧. అట్లైతే అహంకర్తృవిషయమగు ఉపదేశము సాక్షికిని సంభవించునుగదా యని శంకించి చిదాభాసుని నంగీకరింపనియెడల నదియును దుర్ఘటమే యగునని చెప్పు చున్నారు:—

మూ. త్వమిత్యర్థ్యక్షనిష్ఠశ్చేదహమర్థ్యక్షయోః కథమ్. ౨౨
సంబంధో వాచ్య ఏవాత్ర యేన త్వమితి లక్షయేత్,

తా. 'త్వం' అను పదము అహంకారమును చెప్పుచు సాక్షిని బోధించునేని, అహంకారమునకును సాక్షికిని సంబంధము లేనిదే వాక్యార్థ బోధ కలుగదు కనుక తాదృశసంబంధ మొకటి చెప్పకతప్పదు. ఏ సంబం

ధముచేత 'త్వం' అను పదము భాగత్యాగలక్షణచేత సాక్షిని బోధించునో ఆసంబంధము నిష్క్రియుండగు ఆత్మకెట్లు చెప్పనగును అని ప్రశ్న.

అవ. అధ్యస్తసంబంధము వాస్తవముకాదని నిరూపించుచున్నారు.—

మూ. ద్రష్టృదృశ్యత్వసంబంధో యద్యధ్యక్షే క్రియేత కథమ్.

తా. ద్రష్టృదృశ్యత్వసంబంధము (చూచువాఁడు చూడఁబడునదెడి సంబంధము) సాక్షియందుఁ జెప్పఁదగదు. ఏలయన అహంకారము జడము, సాక్షి సంబంధరహితుఁడు నిర్వికారుఁడును గనుక నీ రెండింటికిని సంబంధమేదియుఁ దగదు. ౮౦

అవ. చిజ్జడములకు సంబంధమువలెనే తాదాత్మ్యమును పొసఁగదని చెప్పుచున్నారు:—

మూ. అక్రియత్వేఽపి తాదాత్మ్య మధ్యక్షస్య భవేద్యది,
ఆత్మాఽధ్యక్షో మమాస్తీతి సంబంధాగ్రహణేనధీః ౮౧

తా. లోకములో 'ఘటముయొక్క నైల్యము' అనుచో నీ రెండింటికిని సంబంధము గలదు. 'శుక్లః ఘటః' అనుచోట శుక్లవర్ణమునకును ఘటపదార్థమునకును తాదాత్మ్యముకలదు. నిర్వికారుఁడగు ఆత్మకు సంబంధము దేనితోను గలుఁగనియట్లే తాదాత్మ్యమును సంభవింపదు. సంబంధముగల వానికే తాదాత్మ్యము గలుగవలయును. ఇట్లే ఆత్మ వ్యాపారరహితుఁడైనను జడజాతమున కధ్యక్షుఁడగుటచేత తాదాత్మ్యముండునందువేని "నాయాత్మాధ్యక్షుఁ"డను సంబంధము గ్రహింపఁబడనియెడల శ్రుతివలన తాదాత్మ్యబుద్ధియుఁ గలుగనేరదని అర్థము. ౮౧

అవ. 'ఏష మ ఆత్మాఽంతర్హృదయే అణీయాన్ ఏషమ ఆత్మాఽంతర్హృదయే ఏతద్బ్రహ్మ (ఛాం 3.౧౪) అను శాస్త్రమువలన అహంకారమునకును అధ్యాత్మకును సంబంధము కలదనెడి శంకను నిరాకరించుచున్నారు:—

మూ. సంబంధగ్రహణం శాస్త్రాదితి చేన్న వ్యసే న హి,
పూర్వోక్తాః[1]స్యుస్త్రిథాదోషా గ్రహావాస్యాన్న చేతిచ.

తా. శాస్త్రమువలన అహంకారాధ్యక్షులకు సంబంధ మున్నదను కొనెదవేని యట్టి సంబంధము కలుగనేరదు. ఎట్లనఁగా జడమగు అహంకారము సంబంధమును గ్రహింపనేరదు. నిర్వికారమగు ఆత్మయుఁ పరస్పర సంబంధమును గ్రహింపనేరదు. శ్రుతి జడమును బోధింపలేదనెడి మూఁడవ దోషమును గలుగును. ఏదయిన నొకసంబంధమును గల్పించినను 'నాకు అధ్యక్షుఁడొకఁడు గలఁడ'ను సంబంధము సంభవించును. కాని తాదాత్మ్యాధ్యాసము అంగీకరింపఁబడనందున 'నేనే యధ్యక్షుఁడ'నెడిసంబంధము గ్రహింపఁబడదు. నాకు అధ్యక్షుఁడొకఁడు గలఁడనుమాటయును జడమగు నహంకారమునకు సంభవింపనేరదని 'చ'కారమువలననే సూచింపఁబడెను. ౨౭

అవ. ఇట్లు పరపక్షమందు ఆత్మానాత్మలకు సంబంధము కలుగనేరదని దూషించి స్వపక్షమందు మిథ్యాతాదాత్మ్య సంబంధము కలదని చూపుచున్నారు:—

మూ. అదృశి ర్దృశిరూపేణ భాతి బుద్ధి ర్యదా తదా,
ప్రత్యయా అపి తస్యాః స్యుస్తప్తాయోఽపిస్ఫులింగవత్.

---

1 స్యుస్త్రయోదోషా.

తా. జడమగు బుద్ధి చేతనాకారముగ భాసింపుచుండునని చెప్పినను, కాలిన యినుపకడ్డీని దాగలిమీఁద సమ్మెటచే కొట్టినపుడు దానినుండి వెడలు కణములు అగ్నియేయైనటుల, ఆబుద్ధివృత్తులును చిద్రూపములే యగును.౮౩

అవ. ఈ మిథ్యాతాదాత్మ్యసంబంధముననే లౌకికవైదికవ్యవహారములు సిద్ధించునని చెప్పుచున్నారు:—

మూ. ఆభాసస్తదభావశ్చ దృశేః సీమ్నో న చాన్యథా,
లోకస్య యుక్తితః స్యాతాం తద్గ్రహశ్చ తథా సతి.౮౪

తా. ఆభాసయు, ఆభాసాభావమును, మనోవృత్తులును వీని యభావమును గలుగుచుండును. చిత్సాన్నిధ్యములేక జీవాభాసములుగాని మనోవృత్తులుగాని కలుగనేరవు. చిదాభాసుని అంగీకరింపనియెడల వృత్తులును వృత్త్యభావములును జడమగు ధీవృత్తిచేత గ్రహింపఁబడఁజాలవు. ఆత్మయు చిదాభాసద్వారముననే బుద్ధివృత్తులను జూచుచుండును. "ఆవరణాభిభవార్థావృత్తిః" అని ధీవృత్తి ముందుగ వస్తువు నాక్రమించిన అజ్ఞానమును దొలఁగింపఁ బిమ్మట వస్తువు స్ఫురించుననెడి యుక్తి బుద్ధివృత్తులందుఁ బ్రతిబింబించిన ఆత్మయే చిదాభాసుఁ డనఁబడును. ౮౪

అవ. లోహసంపర్కమువలన నగ్నికి తాడనాదివికారములు కలుగునట్లు దేహసంబంధమువలన ఆత్మకును తాపాదివికారములు కలుగు ననుశంకను, దర్పణప్రతిబింబ దృష్టాంతముచే నివారించుచున్నారు:—

మూ. నన్వేవం దృశిసంక్రాన్తి రయఃపిండేఽగ్నివద్భవేత్,
ముఖాభాసవదిత్యేత దాదర్శే తన్నిరాకృతమ్. ౮౫

తా. అయఃపిండమందు సంక్రమించు అగ్నికి విస్ఫులింగాదివికారములు కలుగునట్లు బుద్ధియందు సంక్రమించిన చిదాత్మకును తాపాదివికారములు కలుగునుగద, యను శంకకుఁ బరిహారము—ఆదర్శమునందు ముఖాభాసము మిథ్యయనియు ముఖము సత్యమనియు గ్రహింపఁబడునట్లు చిదాభాసుఁడు మిథ్యయనియు చిదాత్మ వాస్తవమనియుఁ బూర్వము(౩౨-వ శ్లోకమున) చెప్పఁబడినదియే యిచట స్మరింపవలయును. ౧౫

అవ. అట్లని వికారవంతమగు తప్తాయఃపిండమందలి విస్ఫులింగదృష్టాంత మిచ్చుటఁ దగదని శంక రాఁగా, మాకు వివక్షితమగు అంశము మాత్ర మిచటను గలుగుటచేత దృష్టాంతము తగినదియే యని చెప్పుచున్నారు:—

మూ. కృష్ణాయో లోహితాభాసమిత్యేతద్దృష్టముచ్యతే,
దృష్టదార్ష్టాంతతుల్యత్వం న తు సర్వాత్మనా క్వచిత్.

తా. నల్లని యినుము కాల్పఁగా నెఱ్ఱగా భాసించును. ఇట్టి తాదాత్మ్యమువలన జడమగు బుద్ధి చేతనమువలె భాసించును. ఇట్టి సామ్యమే మఱియొకటికలదు. ఎట్లన—లోకములో ఉపమానోపమేయములకు కొన్నిధర్మములనుబట్టి సామ్యమే కాని యావద్ధర్మములు వర్ణ్యమందుండవు. ముఖము చంద్రునివలెనుండుననుచోట ముఖము చంద్రునివలె గుండ్రముగను మనోహరముగను నుండునేకాని జడమగుముఖము తేజోరూపుఁడగు చంద్రునివలె ప్రకాశకరము కాదు. కావున తప్తాయఃపిండవిస్ఫులింగదృష్టాంతమున చిత్తుతో చిదాభాసునకు బుద్ధివికారములు సంభవించుట యిచట వివక్షితము కాదని యెఱుఁగవలయును. ౧౬

అవ. దృష్టాంతమందు వివక్షితాంశమును జెప్పి, ప్రకృతార్థమందు అవివక్షితాంశమును జూపుచున్నారు:—

మూ. తద్వైవ చేతనాభాసం చిత్తం చైతన్యవద్భవేత్,
ముఖాభాసో యథాఽఽదర్శే ఆభాసశ్చోదితో మృషా.

తా. జడమగు చిత్తము చిదాభాసయుక్తమగుచు చైతన్యమువలె భాసించును. అద్దమందు ముఖాభాసము వికారములేకయుండునట్లు బుద్ధియందుండు చిదాభాసుఁడును వికారములేనివాఁడే యగును. చిదాభాసునకు వికారములు ప్రసిద్ధముగ నెల్లరచేత ననుభవింపఁబడుచుండఁగా వికారములు చిదాభాసునకు లేవని చెప్పినంతమాత్రాన నమ్మవచ్చునాయని శంకింపవలదు. ముఖాభాసమునకుఁ గలిగిన వికారములు - అనఁగా, నొకప్పుడు స్వచ్ఛముగఁ ప్రకాశించుట, మఱియొకప్పుడు మలినముగ నుండుట యనునవి. అద్దము యొక్క మాలిన్యాదివికారములవలననే కలిగెనుగాని ముఖాభాసమున కెంతమాత్రమును లేవు సరేకదా. విమర్శింపఁగా ముఖాభాసమును మిథ్యయే. ఇట్లు చిదాభాసునకుఁ గలిగెడి కర్తృత్వభోక్తృత్వసుఖదుఃఖాదివికారములు బుద్ధియొక్క హర్షశోకాదివికారములవలననే కలిగెనుగాని చిదాభాసున కెంతమాత్రమును వికారములు లేవు. ఇంతియేకాక ముఖాభాసమనఁగా ముఖప్రతిబింబము. ప్రతిబింబము సత్యము కానందున ముఖాభాసమువలె చిదాభాసుఁడును మిథ్యయే యని విమర్శింపవలయును. ఆభాసః + చ + ఉదితః మృషా=ఈషద్భాసన మాభాసః = లేకున్నను కొంచెముండునట్లు భాసించుట, ఈ యాభాసము, మృషా ఉదితః=అసత్యమనఁబడును. సుఖదుఃఖకర్తృత్వభోక్తృత్వాదివికారములు బుద్ధియుండునప్పుడే యుండును. బుద్ధిలేని సుషుప్త్యవస్థయందు లేనందున నీసుఖాదులు బుద్ధిధర్మములేకాని ఆత్మధర్మములు కావని ఆత్మబోధప్రకరణమందలి యీశ్లోకము బోధించుచున్నది.—— శ్లో. "రాగేచ్ఛా సుఖదుఃఖాది బుద్ధౌ సత్యాం ప్రవర్తతే, సుషుప్తౌ నాస్తి తన్నాశా త్తస్మా ద్బుద్ధే స్తు నాత్మనః. ౮౭

అవ. చిత్తమునకు చేతనతావభాసము చిదాభాసవ్యాప్తివలననేకాని స్వయముగ నేల లేకపోవలయుననుశంకకవకాశము లేదు. చిత్తము చేతనమగుటకుఁ బ్రమాణమును యుక్తియును లేదని చెప్పుచున్నారు:—

మూ. చిత్తం చేతనమిత్యేతచ్ఛాస్త్రయుక్తివివర్జితమ్,
దేహస్యాపి ప్రసంగః స్యాచ్చక్షురాదేస్తథైవచ. ౮౮

తా. ఉత్పత్తినాశములుగల చిత్తము దృశ్యమగుటచేత ఘటమువలె జడమేకాని చేతనము కాదు. చిత్తము చేతనమగునేని చక్షురాదీంద్రియములును దేహముగూడ చేతనమే కావలసివచ్చును. కావున చిత్తము చిదాభాససంబంధములేనిదే చేతనము కానేరదు. ౮౮

అవ. చక్షురాదీంద్రియములును దేహమును చేతనమే కావచ్చు నంటివేని, యపుడు లోకాయతికవాదము సంభవించుటచేత అపసిద్ధాంతమగును గనుక నట్లనరాదని నివారించుచున్నారు:—

మూ. తదస్త్విష్టేతి చేత్తన్న లోకాయతికసంగతేః,
న చ ధీర్బ్రహ్మాస్మీతి యద్యాభాసో న చేతసి. ౮౯

తా. దేహమును చక్షురాదులును చేతనములేయగుట వేదవిరుద్ధము. చిత్తమందు చిదాభాసుఁడు లేనియెడల 'బ్రహ్మాస్మి' యను బుద్ధి కలుగనేరదు. ఏలయనఁగా, చిదాభాసములేని కేవలబుద్ధి జడము. చిన్మాత్రము. వికారరహితకూటస్థము. కావున ఆభాసము నంగీకరింపనియెడల ద్వారములేనందున మహావాక్యజన్యమగు 'అహంబ్రహ్మాస్మి' యను ఐక్యజ్ఞానము సయితము సంభవింపదనిభావము. ౮౯

అవ. 'బ్రహ్మాస్మి' యను బుద్ధి లేనియెడల నష్టమేమి యను ప్రశ్నకుత్తరము:—

మూ. సదస్మీతి ధియోఽభావే వ్యర్థం స్యాత్తత్త్వమస్యపి,
యుష్మదస్మద్విభాగజ్ఞే స్యాదర్థవదిదం వచః. ౯౦

తా. 'అహం బ్రహ్మాస్మి' యను బుద్ధిలేదేని 'తత్త్వమసి' యను మహావాక్యమును వ్యర్థమేయగును. ఆ తత్త్వమసి యను మహావాక్యమును వినిన వారందఱికి వెంటనే "అహం బ్రహ్మాస్మి" యను బుద్ధి యుదయింపనందున ఆ తత్త్వమసియను వాక్యము వ్యర్థమే కానిమ్మని యందువేని వినుము.—"అధికారిణః ప్రమితిజనకో వేదః" = సాధనచతుష్టయసంపత్తిగలవానికే వేదము యథార్థజ్ఞానమును గలిగించును, అను న్యాయమువలన, సమ్యక్పదార్థజ్ఞానము గలవాఁడే వాక్యార్థజ్ఞానమున కధికారికనుక ఆత్మానాత్మవివేకముగల పురుషునందే యీ 'తత్త్వమసి' వాక్యము సార్థకమగునుగాని వినినవారందఱకు నిది శీఘ్రముగ ఫలింపనేరదు. కాఁబట్టి మహావాక్యము వ్యర్థము కాఁదగదు.

అవ. ఆ యుష్మదస్మద్వివేకమును వివరించుచున్నారు:—

మూ. మమేదం ప్రత్యయౌ జ్ఞేయౌ యుష్మద్యేవ న సంశయః,
అహమిత్యస్మదీష్టః స్యాదయమస్మీతి చోభయోః. ౯౧

తా. ఈపుత్రవిత్తాదికమను జ్ఞానమును, ఇది నాదియను జ్ఞానమును అనాత్మయగు 'యుష్మత్తు' యొక్క అర్థములు. పుత్రాదిబాహ్యార్థము సయితము దేహామే నేననెడి యధ్యాసనిమిత్తముగ 'అస్మద'ర్థమందుఁ బ్రవేశించుటవలన బాహ్యార్థసంబంధము అనాత్మధర్మమే యనుట మిగుల యుక్తము. 'అహం' అను జ్ఞానము ఆభాసద్వారా ఆత్మయందును, వ్యావహారికమగు

అహంకారమందును జెప్పఁదగును. అహమ్మని వ్యవహరించుటవలన అస్మదర్థమగును. 'అయం దేహాదిరస్మి' అనుచోట 'అస్మి' యనునది అనాత్మవిషయకజ్ఞానము. ౯౧

అవ. ఆత్మానాత్మవిషయజ్ఞానములను సంకీర్ణములుగను అసంకీర్ణములుగను జెప్పి, ఆత్మానాత్మభేదసిద్ధికై కొన్నిజ్ఞానములు ప్రధానములు, మఱికొన్ని యప్రధానములు నని గ్రహింపవలయు నని:—

మూ. అన్యోన్యాపేక్షయా తేషాం ప్రధానగుణతేష్యతే,
విశేషణవిశేష్యత్వం యథా గ్రాహ్యం హి యుక్తితః.

తా. ఆ యాత్మానాత్మజ్ఞానములు కొన్నికొన్ని సమయములందు ప్రధానములు, విశేష్యములును, మఱికొన్ని వేళల అప్రధానములు, విశేషణములు నగునేని యుక్తిచే గ్రహింపవలయును. ౯౨

అవ. విశేషణవిశేష్యభావమును యుక్తిచే గ్రహింపవలయుననుటను వివరించి చూపుచున్నారు:—

మూ. మమేదం ద్వయమప్యేతన్మధ్యమస్య విశేషణమ్,
ధనీ గోమాన్యథా తద్వద్దేహోఽహంకర్తురేవ చ. ౯౩

తా. మమ=నాది, ఇదం=ఇది, ఇదం ద్వయం = అను నీరెండును, మధ్యమస్య=పూర్వశ్లోకములో మధ్యనున్న అస్మదర్థమునకు విశేషణము. ఇందు కుదాహరణము:—ధనీ గోమాన్ అహం=ధనముగలవాఁడును, గోవులు గలవాఁడును నేను. అనుచోట ధనము గోవులు అనునవి విశేషణములై దృశ్యములై అహంకారమునకు (కర్తకు) నాది యని చెప్పఁబడును. ఇట్లే

దేహముకంటెను అంతరమగు అహంకారమును ఆత్మకు విషయమగును. అహం కారాభిమానముగల ఆత్మకు బాహ్యములగు ధనాదులకంటె ఆంతరమగుట వలన నాదియగు దేహమని విశేషణమగును. కనుకనే 'నేను గోమంతుఁడను, ధనవంతుఁడను' అను వ్యవహారమువలె 'నాదేహము' అనియుఁ సిద్ధించు చున్నది. మూలమున 'చ'కారమువలన నేను జ్ఞాతను అనే తలంపువలన స్థూలదేహముకంటె ఆంతరమగు అహంకారము ఆత్మకు విశేషణమగును. నా యహంకారము, అహంకారవంతుఁడను నేను నని చెప్పుటవలన విశేష్య విశేషణభావము సంభవించును. ౯౩

అవ. ఈ ప్రపంచమంతయు నే యాత్మసత్తవలన స్థితి గలదై, ఏ యాత్మప్రకాశమువలననే ప్రకాశించుచున్నదో యట్టి ఆత్మ యందారోపింపఁబడు ప్రపంచము ఆత్మకు "ప్రపంచవంత మాత్మ" యని విశేషణమగుచున్నను, ఆ సాక్షి చేత స్పృశింపఁబడదు అను మొదలగు వాక్యములందు నిరపేక్ష ముగ సిద్ధించు ఆత్మ శుద్ధమని, యుష్మదస్మద్విభాగ మెఱిఁగిన జ్ఞానికి తత్త్వమసీత్యాది వాక్యములవలన వాక్యార్థజ్ఞానము తప్పక కలుగును గనుక వేదాంతవాక్య మప్రమాణము కాదని ధ్రువపర్చుచున్నారు:—

మూ. బుద్ధ్యారూఢం సదా సర్వం సాహంకర్తా చ సాక్షిణః,
తస్మాత్సర్వావభాసో జ్ఞః కించిదప్యస్పృశన్సదా. ౯౪

తా. బుద్ధివృత్తిచే గ్రహింపఁబడెడి జగత్తంతయు సాక్షికి విశేష ణము అనఁగా నప్రధానముగ నుండును. ఇదియేకాక చిదాభాసవిశిష్టమగు సూక్ష్మదేహముకూడ సాక్షియం దారోపింపఁబడి సాక్షిచే భాసింపఁబడుట

వలన సాక్షికి విశేషణ మగును. ఇట్లాలోచింపఁబడిన విశేషణములతో వాస్తవముగ దేనిని స్పృశింపకయే సాభాసద్వారా ప్రకాశింపఁజేయు ఆత్మ జ్ఞానస్వరూపమనియే విమర్శింపవలెను. ౫౪

అవ. ఇది వివేకుల మార్గము. అవివేకులు 'ఈ క్షేత్రము నాది' యని క్షేత్రమునకే ఆత్మను విశేషణముగ భావించుట వలన వారిమార్గము దీనికి విరుద్ధమని చెప్పుచున్నారు:—

మూ. ప్రతిలోమమిదం సర్వం యథోక్తం లోకబుద్ధితః,
అవివేకధియామస్తి నాస్తి సర్వం వివేకినామ్. ౫౫

తా. బాహ్యార్థమందు దృష్టిగల లోకులబుద్ధిద్వారా యిది యంతయు ప్రధానమనియు, ఆత్మ యీదృశ్యమునకు విశేషణమనియు భాసించుచుండును. దీని కవివేకమే కారణము. వివేకియయితే విశేషణమగు ఆత్మను ప్రధానముగను, క్షేత్రాదికముఁగలవాఁడు తానని యెంచుచు ముఖ్యుఁడగు తనను నది యప్రధానమని భావించును. కాఁబట్టి వివేకులు ప్రధానమగు ఆత్మవస్తువును నిరంతరము పరిశీలించెదరని తలఁచి, అధ్యారోపాపవాదన్యాయము నవలంబించి పరమకారుణికులగు శ్రీమచ్ఛంకరభగవత్పాదులు ప్రతీయమానమగు సత్తను ప్రధానముగ గ్రహించి, ఆత్మ జగత్తులకు విశేషణవిశేష్య (ముఖ్యాముఖ్య) భావమును నిరూపించిరి.

అధ్యారోపమనఁగా, నిర్గుణబ్రహ్మమందు మొదట ఆకాశము, పిమ్మట వాయ్వగ్నిజలాదికము క్రమముగఁ గలుగుట. అపవాదమనఁగా భౌతికములు భూతములందు, భూమి జలమందు, జల మగ్నియందు, అగ్ని వాయువునందు, వాయువు ఆకాశమందు, ఆకాశము అవ్యక్తమందు, అవ్యక్తము ఆత్మయందును లయింపఁజేయుట. ౫౫

అవ. అన్వయవ్యతిరేకములచేతనే సర్వసంసారము నివర్తించుచుండఁగా మహావాక్యమేల యను శంక కుత్తరము:—

మూ. అన్వయ వ్యతిరేకౌ హి పదార్థస్య పదస్య చ,
స్యాదేతదహమిత్యత్ర యుక్తిరేవావధారణే. ౯౬

తా. పదార్థమునకు అన్వయవ్యతిరేకములన నేవి? ఆత్మపదార్థము ద్రష్టయు సాక్షియునుగాని దృశ్య మెన్నఁడును గాదు. సాక్ష్యమును (తెలియఁబడునదియును) గాదు. ఆత్మ ప్రకాశము నిత్యము స్వతస్సిద్ధము నగుట వలనను, మఱియొకదాని నాశ్రయించి యుండనందునను, దేనికిని నెప్పుడును అప్రధానము కానేరదు. ఇట్లే దృశ్యమును జ్ఞేయము నగు అహంకారము మొదలు భోగ్యవస్తువుల వఱకునుండు ప్రపంచము స్వాన్యమగు ఆత్మసంబంధములగు సత్తాస్ఫూర్తులు గలదియగుటచేత అన్యాశ్రయము కనుక ఆత్మకు ప్రధానముగ నుండక తీరదు. కావున, ఆగమాపాయములు లేక దృక్కగు ఆత్మ శుక్తివలె సత్యము. మిగిలిన ఆరోపితజగత్తు ఆరోపిత జగత్తువలె మిథ్యయనియు, అనృతజడపరిచ్ఛిన్నపరాధీనపరాగర్థములనుండి వ్యావృత్తమై సత్యజ్ఞానానంతప్రత్యగానందమగునది ఆత్మయనియు వివేచనముచేయుటయే పదార్థముయొక్క అన్వయవ్యతిరేకములు.

పదముయొక్క అన్వయవ్యతిరేకములనఁగా ఆత్మ, చైతన్యము, ప్రజ్ఞానము, బ్రహ్మము, సత్తు ఇత్యాది కేవలపదములు కేవలాత్మను, బోధించునుగాని, విశేషణములనుగాని, ఆవిశేషణవిశిష్టములనుగాని బోధింపఁజాలవు. కర్త, భోక్త, జ్ఞాత, ద్రష్ట, శ్రోత, వక్త, గంత, కృశ, బలవంత ఇత్యాది పదములు కేవలపరిపూర్ణాత్మను బోధింపఁజాలవు. ఏలయన, నీపదములు ఉపాధివిశిష్టక్రియాదికమును దెల్పుచుఁ బ్రయోగింపఁబడినవి, కావున ఆత్మను బోధింపఁజాలవు.ఇట్టి విమర్శయే పదముయొక్క అన్వయవ్యతిరేకములు.

ఇట్లు పదపదార్థాన్వయవ్యతిరేకము లనుచోట అస్మదర్థవిషయమును నిశ్చయించుటయందు యుక్తియే చెప్పఁబడెనుగాని "తత్త్వమసి" యను వాక్యమునందలి పదములకు ఐక్యము చెప్పఁబడలేదు. కావున నీ వివేకముచేత ఆత్మ దేహాదివిలక్షణుఁడని నిశ్చయింపఁగా నపుడు 'నేనెవఁడ'ను విమర్శకలుగ నీ వా పరమాత్మవే యని బోధించెడి 'తత్త్వమసి' యను వాక్యమునకు అవసరము కలుగునని భావము. ౯౬

అవ. జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలు ఒకదానియం దొకటి యుండవుకాని ఆత్మ యీమూఁడవస్థలందును విడువక యుండునని ప్రకారాంతరముచే ఆత్మానాత్మవివేకమును జూపుచున్నారు:—

మూ. నాద్రాక్షమహమిత్యస్మిన్సుషుప్తేఽన్యన్న నాగకే,
న వారయతి దృష్టిం స్వాం ప్రత్యయం తు నిషేధతి.

తా. ఈ సుషుప్త్యవస్థయందు 'అన్యమగు దేనిని నేను చూడలేదు' అని చెప్పిన జనుఁడు తనను (చైతన్యమును) నివారింపలేదు. విషయమేమియుం లేదని మాత్రము నిషేధింపఁబడెను. కావున దృష్టనష్టస్వభావములుగల అవస్థాత్రయము మిథ్యయగుచు, ఆయవస్థ తనకాలమందే కాని తక్కిన రెండవస్థలయందును లేకపోవుచుండఁగా, నాయాయవస్థల భావాభావములను సాక్షిగఁ జూచుచు మూఁడింటియందును నశింపక నంటియుండు ఆత్మ సత్యమనెడి వివేకము సిద్ధించును. ౯౭

అవ. ఈ యన్వయవ్యతిరేకములు యుక్తిచేమాత్రమే కల్పింపఁబడినవి కావు. ఇవి శాస్త్రసమ్మతములు నని నమ్మకమునకై శాస్త్రము నుదాహరించుచున్నారు:—

మూ. స్వయంజ్యోతిర్న హి ద్రష్టురిత్యేవం సంవిదోఽస్తితామ్,
కౌటస్థ్యం చ తథా తస్యాః ప్రత్యయస్యతులుప్తతామ్,
స్వయమేవాబ్రవీచ్ఛాస్త్రం ప్రత్యయావగతీ పృథక్.

తా. "అత్రాయం పురుషః స్వయంజ్యోతిః," "న హి ద్రష్టుర్దృష్టేః విపరిలోపో విద్యతే," ఇత్యాది శాస్త్రము చైతన్యము కలదనియు నది కూటస్థమనియుఁ జెప్పెను. "న తు తద్ద్వితీయమస్తి తతోఽన్యద్విభక్తం" ఇత్యాది శాస్త్రము జ్ఞాతృజ్ఞానజ్ఞేయరూపభేదము అసత్తనియుఁ జెప్పెను. ఇట్లు 'ప్రతీయత ఇతి ప్రత్యయః' యనెడి కర్మవ్యుత్పత్తిచే ప్రత్యయమనఁగా తెలియఁబడు విశ్వమును, అవగతి యనఁగా జ్ఞానమును వేఱుగ శాస్త్రద్వయముచేఁ జెప్పఁబడెను. ౯౧

అవ. ఇట్లవాంతర వాక్యకృతమగు యుష్మదస్మద్వివేకమును యుక్తిచే నిరూపించి, పదార్థతత్త్వము నెఱిఁగిన పురుషునకు తత్త్వమస్యాదిమహావాక్యము సఫలవిజ్ఞానమును గలిగించునని చెప్పుచున్నారు:—

మూ. ఏవం విజ్ఞాతవాక్యార్థే శ్రుతిలోకప్రసిద్ధితః,
శ్రుతిస్తత్త్వమసీత్యాహ శ్రోతుర్మోహాపనుత్తయే. ౯౯

తా. ఇట్లు శ్రుతివలనను లోకప్రసిద్ధివలనను అన్వయవ్యతిరేకములవలనను అవాంతరవాక్యార్థమును బాగుగ నెఱిఁగినపురుషునకు మహావాక్యాత్మకశ్రుతి జిజ్ఞాసువుయొక్క అజ్ఞానమును బోఁగొట్టుటకై సద్రూపమగు ఆ బ్రహ్మము 'త్వమేవ' నీవే యని బోధించును. ౯౯

అవ. వాక్యశ్రవణమాత్రమున మోహము పోవుట

యందు పురాణప్రసిద్ధమగు దృష్టాంతమును జెప్పుచున్నారు:—

మూ. బ్రహ్మా దాశరథేస్స్వస్వ దుక్త్యా వాహానుదక్తవాన్,
తస్య విష్ణుత్వసంబోధే న యత్నాంతరమూచివాన్.

తా. ఇచట తమస్సనంగా దేవకార్యమును సాధించుటకై బుద్ధి పూర్వకముగ స్వమాహాత్మ్యగోపనము. ఈశ్వరునకు సంమోహము కలుగదని సంక్షేపశారీరకమందుఁ జెప్పఁబడెను—"సంకల్పపూర్వకమభూద్రఘునందనస్య నాహం విజాన ఇతి కంచనకాలమేతత్, బ్రహ్మోపదేశముపలక్ష్య నిమిత్తమాత్రం తచ్చోత్ససర్జ స కృతే సతి దేవకార్యే." అని. రామా! నీవు విష్ణువవుగాని దశరథపుత్రుఁడవు కావని చెప్పుచున్న బ్రహ్మ సంకల్పమాత్రకృతమగు రాముని సంమోహమును విష్ణుత్వముచే నొప్పకుండునట్లు నిరాకరించెనేకాని మఱే యేవచనమును జెప్పలేదు. ౧౦౦

అవ దృష్టాంతమును జెప్పి ప్రకృతార్థమును వివరించుచున్నారు:—

మూ. అహంశబ్దస్య నిష్ఠా యా జ్యోతిషి ప్రత్యగాత్మని,
సైవోక్తా సదసీత్యేవం ఫలం తత్ర విముక్తతా. ౧౦౧

తా. బాహ్యవస్తువులనుండి తొలఁగించి శోధింపఁబడిన నిరుపాధిక బ్రహ్మచైతన్యము సాక్షియు స్వయంప్రకాశస్వభావముగలదియు నని నిశ్చయించి, లక్షణావృత్తిచేత ఆచైతన్యమందు పర్యవసన్నమగు ధీవృత్తియే 'సదసి' నీవు ఆ సదానంద బ్రహ్మమవే యను నిష్ఠయని చెప్పఁబడెను. అందు 'నీవాబ్రహ్మమవే' యను ఉపదేశమాత్రమున 'నేను లక్షణావృత్తిచే ఆ బ్రహ్మ'మని వాక్యార్థజ్ఞానము కలుగఁగా మోహము తొలఁగి ముక్తి కలుగును. ఈ నిష్ఠ చెప్పఁబడెనేకాని యిది ఆచరణలో లేదు.

దీనికి మఱియొక వ్యాఖ్యానము:—పూర్వశ్లోకమునందే శ్రీరాముని దృష్టాంతములో ప్రస్తుతార్థము గూఢముగ నున్నది. కావున నీ శ్లోకమునకు వేఱొక యర్థము వ్రాయఁబడుచున్నది—మహామహిమగల శ్రీరామునకు నీవు విష్ణుమూర్తివేకాని దశరథాత్మజుఁడవు కావని ఉపదేశించుటవలన తన తత్త్వము తెలియఁబడెనుగాని, యిచట నేను కర్తను, పుణ్యపాపములను జేయువాఁడను, వానిఫలము ననుభవించెడి భోక్తను, అని ప్రత్యక్షముగ విపరీతజ్ఞానముగల యిప్పటివారలకు సద్గురుప్రోక్తమగు ఉపదేశమాత్రమున 'నేను బ్రహ్మ'మను జ్ఞానము సంశయరహితముగ నెట్లు కలుగునని శంక కలుగఁగా, త్వం పదార్థమునకు శోధవలన లక్ష్యార్థకూటస్థుఁడను నర్థమును గ్రహించి, వాచ్యార్థమగు జీవత్వము నుపేక్షించి 'నేను కర్తృత్వాదిధర్మసాక్షిని' యని తలంచునపుడు బ్రహ్మత్వోపదేశమునకు బాధ యేమియు లేదని యా శంకను నిరాకరించుచు 'సదసి' యను వాక్యముచే ఆ నిష్ఠయే బోధింపఁబడెనని తాత్పర్యము. ౧౦౧

అవ. ఇట్లు తత్త్వంపదార్థశోధనపూర్వక జ్ఞానమును, దీనిచే వాక్యార్థమువలన సమూలసంసారనివృత్తియుఁ గలుగునని చెప్పఁగా, శ్రుతికిఁ బ్రామాణ్యమును జెప్పుటకై కార్యపరముగ తత్త్వంపదములకు జీవేశ్వరు లనియే యర్థము చెప్పవలయుననెడి దురాగ్రహము విద్వదనుభవమునకు విరోధము కావున పనికిరాదని చెప్పుచున్నారు:—

మూ. శ్రుతమాత్రేణ చేన్నస్యాత్కార్యం తత్ర భవేద్ధ్రువమ్,
వ్యవహారాత్పురాఽపీష్టః సద్భావః స్వయమాత్మనః.

తా. పూర్వము చెప్పఁబడిన శ్రీరామదృష్టాంతమువలన శ్రవణమాత్రమున ముక్తిఫలకమగు విజ్ఞానము కలుగకున్నయెడ, అపుడు తప్పక

కార్యరూపజీవేశ్వరులను దప్పక కల్పింపవలసియుండును. అట్లు కార్యపర త్వమును గల్పింపనియెడల అర్థవాదములకు స్వతఃప్రమాణము లేనట్టు మహావాక్యములకును అప్రామాణ్యము సంభవించును. ఫలము వెంటనే సిద్ధించుటవలన నిచట కార్యపరత్వము కల్పింపఁదగదు. ('స్వయంజ్యోతిష్షహి ద్రష్టుః' అను) ౯౨వ శ్లోకములో అర్థశ్లోక మధికముగ నున్నది. ఆ యర్థశ్లోక మిచటఁ జెప్పఁబడవలసి యుండును. సిద్ధమగు బ్రహ్మమందు శాస్త్రము ప్రమాణము కాదనెదవేని, శాస్త్రము తత్త్వముకంటె వ్యత్యయముగ నున్నదనియా? నిష్ఫలమనియా? సంశయమనియా? అనుత్పన్నమనియా? అను శాస్త్రవిషయములగు వికల్పములను 'వ్యవహారాత్' అను మొదలగు వాక్యముల చేత క్రమముగ నిరాకరించుచున్నారు. ఎట్లనఁగా— 'అహం బ్రహ్మాస్మీ'తి శాస్త్రోపదేశము కలుగకమునుపే బ్రహ్మము స్వతస్సిద్ధము. దీనికి బాధ యేమియుం లేదు కనుకను, యథావస్థితమగు ఆత్మరూపమును శ్రుతి బోధించుటవలనను, ఇది సత్యజ్ఞానమేకాని శుక్తియందలి రజతజ్ఞానమువలె భ్రమ కాదు. ౧౦౨

౮౪. అనుభవమునకు విరుద్ధమగుటవలన మహావాక్యము నిష్ఫలమనియుం జెప్పఁదగదని చెప్పుచున్నారు:—

మూ. అశనాయాదినిర్ముక్త్యై తత్కాలా జాయతే ప్రమా,
తత్త్వమస్యాది వాక్యార్థే త్రిషు కాలేష్వసంశయః.

తా. ఆప్తవాక్యము వినినపుడే కలిగిన తత్త్వజ్ఞానము క్షుత్పిపాసాది సంతాపయుతమగు సంసారమును నివర్తించును. సత్యజ్ఞానానందమును గలిగించునను నీమాట విద్వాంసులకుఁ బ్రత్యక్షమే కనుక 'తత్త్వమసి' యను వాక్యము వ్యర్థముకాదని రెండవవికల్పము నిరాకరింపఁబడెను. కాలత్రయమందును 'తత్త్వమసి' యను అర్థమునకు సంశయము లేనందున శాస్త్రము

సంశయసహితమును గానేరదు కనుక అప్రమాణము కాదు. అని మూఁడవ వికల్పము నిరాకరింపఁబడెను. ౧౦౩

అవ. నాల్గనవికల్పమును నిరాకరించుచున్నారు:—

మూ. ప్రతిబంధవిహీనత్వాత్స్వయం చానుభవాత్మనః,
జాయేతైవ ప్రమా తత్ర స్వాత్మన్యేవ న సంశయః.

తా. పదార్థజ్ఞానములేనిది వాక్యార్థజ్ఞానము కలుగదు. ప్రతిబంధము లేకుండునట్లు పదార్థము నెఱిఁగినవానికి వాక్యార్థజ్ఞానము తనయందు శ్రవణకాలమందే నిస్సంశయముగఁ గలుగును. 'బ్రహ్మ అస్తి' యను జ్ఞానము 'ఆకాశకుసుమము ఉన్నది' యనునట్లు వినఁబడునేకాని కనఁబడదు అను శంకయు అనుభవస్వరూపుఁడగు తాను లేఁడని చెప్పశక్యముకాకపోవుట వలన నిరాకరింపఁబడెను. కనుక 'హుంఫట్' ఇత్యాదిశబ్దములకువలె ఆత్మకు అనుత్పత్తిరూపమగు అప్రామాణ్యమును లేదు. స్వయంప్రకాశమగు బ్రహ్మము సిద్ధింపఁగా తద్బోధకమగు మహావాక్యమునకును ప్రామాణ్యము సిద్ధమే.

అవ. ఇట్లు ప్రమాణస్వరూపనిరూపణముచేత 'అహం బ్రహ్మాస్మి' యను జ్ఞానమును నిరూపించి యిపుడు జ్ఞేయార్థస్వభావనిరూపణముచేతనుగూడ ఆ జ్ఞానమును నిరూపించుటకై వికల్పించుచున్నారు:—

మూ. కిం సదేవాహమస్మీతి కిం వాఽన్యత్ప్రతిపద్యతే,
సదేవచేదహంశబ్దః సతా ముఖ్యార్థ ఇష్యతామ్.౧౦౪

తా. 'తత్త్వమసి' వాక్యమును వినునపుడు 'అహమస్మి' యని సత్తు తెలియఁబడునా? ఇతరమేదయినఁ దెలియఁబడునా? యని వికల్పించి, సత్తే

తెలియఁబడునందువేసి సచ్ఛబ్దము ముఖ్యార్థమే కనుక సచ్ఛబ్దాహం శబ్దములకు వాక్యార్థముచేత ఏకార్థమే తెలియనగుచుగాని, శాస్త్రాంతరప్రసిద్ధములగు సంసర్గాదులిచట నుపయోగింపనందున అపరోక్షజ్ఞానము సిద్ధింపకపోదు.

అవ. మఱియేదయినను దెలియఁబడునా? యను రెండవ పక్షములో దోషమును జూపుచున్నారు:—

మూ. అన్యచ్చేత్సదహంగ్రాహప్రతిపత్తిర్మృషైవ సా,
తస్మాన్ముఖ్యగ్రహే నాస్తి వారణాఽవగతేరిహ. ౧౦౬

తా. సత్తు ప్రత్యగాత్మకంటె వేఱైనయెడల అహంగ్రాహప్రతిపత్తి (నేననెడి జ్ఞానము) అసత్యమే యగును. అప్పుడు 'అహం బ్రహ్మాస్మి' యను వాక్యార్థమప్రమాణమేయగును. కనుక ప్రమాణ ప్రమేయ స్వభావములను బరిశీలింపఁగా తత్త్వమసీత్యాది మహావాక్యములవలననే ఫలవంతమగు ఆత్మతత్త్వవిజ్ఞానముద్భవించునని ప్రస్తుతార్థమును ఉపసంహరించుచున్నారు. 'తస్మాదితి'=కావున వాక్యార్థమునందు ముఖ్యార్థమును గ్రహించినపుడు, 'అవగతేః వారణా నాస్తి'=జ్ఞానమునకు ప్రతిబంధము లేదు కనుక ముఖ్యార్థము నివారింపఁబడదు.

అవ. ఫలము జ్ఞాత చిదాభాసుఁడు ననునవి సమానార్థములు. కేవల (చిదాభాసరహిత) బుద్ధిచే ఘటాదిజ్ఞానము కలుగనందున చిదాభాసరూపఫలమును గల్పింపవలయును. ప్రమాణప్రవృత్తికంటెను బూర్వమందే యుండుటచేత బ్రహ్మచైతన్యమే ఫలమని చెప్పరాదు. "జ్ఞాతత్వం నామకుంభే తచ్చిదాభాసఫలోదయః, న ఫలం బ్రహ్మచైతన్యం మానాత్ప్రాగపి సత్త్వతః." (పంచదశీ, కూ. దీ. శ్లో - ౧౦) కనుక కూటస్థుం

(నిర్వికారుఁ) డగు ఆత్మకు జ్ఞాతృత్వరూపఫలముసయితము తగదుకనుక ఆత్మగ్రహామందు ప్రతిబంధము గలదనెడి శంకకు సమాధానమును జెప్పుచున్నారు:—

మూ. ప్రత్యయీ ప్రత్యయశ్చైవ యదాభాసౌ తదర్థతా,
తయోశ్చితిమత్త్వాచ్చ చైతన్యే కల్ప్యతే ఫలమ్.

తా. ప్రత్యయ మనఁగా అంతఃకరణవృత్తి. ప్రత్యయి యనఁగ పరిణామియగు అంతఃకరణము. ఈ రెండును నేచైతన్యముయొక్క ఆభాసరూపములో ఆ చైతన్యమునకు అప్రధానములగును. అంతఃకరణమందు ప్రతిఫలించిన యా చైతన్యమే చిదాభాసుఁడు. అని ఫలము చెప్పవలెను. మఱియు జడములగు అంతఃకరణ తద్వృత్తులకు ఫలసంబంధము కలుగనందున ఫలము ఆత్మదనియే చెప్పవలయును. ౧౦౭

అవ. అట్లైనను వ్యాపారరహితమగు ఆత్మకు ఫల (జ్ఞాతృత్వ) సంబంధమును గల్పింపఁదగునా? యను శంకను దృష్టాంతపూర్వకముగఁ బరిహరించుచున్నారు:—

మూ. కూటస్థేఽపి ఫలం యోగ్యం రాజనీవ జయాదికమ్,
తదనాత్మత్వహేతుభ్యాం క్రియాయాః ప్రత్యయస్య చ.

తా. ఓ సిద్ధాంతీ! రాజ తద్భటులకు స్వస్వామి భావసంబంధ ముండుటవలన భృత్యకృతజయాదికము రాజునం దారోపింపఁదగునుగాని, యిట కూటస్థజీవుల కెట్టిసంబంధమువలన జీవకృతకర్తృత్వాదికము కూటస్థునం దారోపింపఁబడును? అని ప్రశ్న కలుగఁగా, ఫలసంబంధకారణమగు అధిష్ఠానాధిష్ఠేయభావము కూటస్థజీవులకు సంభవించునని చెప్పుచున్నారు—తదితి—క్రియయనఁగా అహంకారము. ప్రత్యయమనఁగా అంతఃకరణ ప్రతిఫలిత

కర్తృవ్యాపారమువలన సిద్ధించునుగాని కర్తతో సమానముగ సిద్ధింపనందున కర్త్రధీనమగు కర్మము కర్తనపేక్షింపక తీరదని భావము. ౧౩౨

అవ. కనుక విధిరూపమగు ప్రమాణమువలననే యభీష్ట వస్తువు సిద్ధించునుగాని, అన్యనిషేధప్రధానమగు ప్రమాణము వలన సిద్ధింపదని నిశ్చయింపఁ బడెనని చెప్పి, యీవిషయము నుపసంహరించుచున్నారు:—

మూ. శబ్దాద్వాఽనుమితేర్వాఽపి ప్రమాణాద్వేతరోఽన్యతః,
సిద్ధిః సర్వపదార్థానాం స్యాదజ్ఞం ప్రతి నాన్యథా. ౧౩౩

తా. సకలపదార్థములను విధిరూపప్రత్యక్షానుమానశబ్దప్రమాణము వలననే అజ్ఞులు తెలియుదురు. కాని యాపదార్థములను అన్యనిషేధపరములగు ప్రమాణములచేతఁ దెలియలేరు. ౧౩౩

అవ. జడవస్తువులు ప్రవృత్తప్రమాణము వలన సిద్ధించినను, చైతన్యమునకు ప్రమాణాపేక్ష లేదుకదా యను శంకకుత్తరము:—

మూ. అధ్యక్షస్యాపి సిద్ధిః స్యాత్ప్రమాణేన వినైవ వా,
వినా స్వస్య ప్రసిద్ధిస్తు నాజ్ఞం ప్రత్యుపయుజ్యతే. ౧౩౪

తా. అధ్యక్షుఁడనఁగా జ్ఞాతృజ్ఞానజ్ఞేయములనెడి ధీవృత్తులను భాసింపఁజేయు కూటస్థుఁడు. ఈకూటస్థుఁడు ప్రమాణముచేత సిద్ధించునా? ప్రమాణాపేక్షలేకయే సిద్ధించునా? యనిన స్వప్రకాశరూపుఁడగు చైతన్యకూటస్థుఁడు ప్రమాణాపేక్షలేకయే సిద్ధించును. అట్లయినను పూర్వోక్తమగు వృత్తిజ్ఞానమునుగూర్చి కూటస్థాపేక్ష కావలయును. ౧౩౪

అవ. అధ్యక్షస్వరూపము జ్ఞానమా? జడమా? యని వికల్పించి, ఆ యధ్యక్షుఁడు ప్రమాణసిద్ధుఁడని చూపుచు ప్రథమపక్షము నంగీకరించుచున్నారు:—

మూ. తస్యైవాజ్ఞత్వమిష్టం చేజ్జ్ఞానత్వేఽన్యామతిర్భవేత్,
అన్యస్యైవాజ్ఞతాయాం చ తద్విజ్ఞానే ధ్రువా భవేత్.

తా. ఆ చైతన్యము జ్ఞానహీనమైనచో దాని నెఱుఁగుటకు ప్రమాణజన్యమైన వేఱొక మతి నపేక్షించును. ఆత్మేతరమగు అహంకారాదికము జ్ఞానహీనము కనుక తమ్ము నెఱుంగుటకై ప్రమాణము నపేక్షించునుగాని చైతన్యము స్వయంజ్యోతియగుటచే నితరము నపేక్షింపదు. ఎట్లయినను విధిముఖప్రమాణమువలననే యధ్యక్షసిద్ధి యనిభావము. ౧౩౫

అవ. స్వతః సిద్ధమగు అధ్యక్షస్వరూపము ప్రమాణము నపేక్షింపదు అనెదవేని సిద్ధిశబ్దమున కేమి యర్థమో చెప్పుము అని యడుగుచున్నారు:—

మూ. జ్ఞాతతా స్వాత్మలాభో వా సిద్ధిః స్యాదన్య దేవ వా,
జ్ఞాతత్వేఽనంతరోక్తా త్వం పక్షౌ సంస్మర్తు మర్హసి.

తా. సిద్ధియనఁగా జ్ఞానమా? స్వాత్మలాభమా? ఈరెండింటికంటె నన్యమా? సిద్ధియన జ్ఞానమని చెప్పినయెడల నందువలనఁ గలిగెడి దోషములు పై (౧౩౫) శ్లోకమునందే చూపఁబడెను. వానిని స్మరించినయెడల దుష్టమగు మొదటిపక్ష మంగీకరింపఁబడదు. ౧౩౬

అవ. రెండవపక్షము ననువదించి దూషించుచున్నారు-

మూ. సిద్ధిః స్యాత్స్వాత్మలాభశ్చేద్యత్నస్తత్ర నిరర్థకః,
సర్వలోకప్రసిద్ధత్వాత్స్వహేతుభ్యస్తు వస్తునః. ౧౩౭

తా. సకలవస్తువులును తమతమ కారణములవలనఁ బుట్టునని సర్వలోకప్రసిద్ధమగుటచే స్వాత్మలాభముకొఱకు నధికప్రయత్నముచేయఁ బనిలేదు.   ౧౩౭

అవ. మూఁడవపక్షమప్రసిద్ధమని చెప్పఁబోవుచు, చెప్పుచున్న పక్షమును ముగించుచున్నారు:—

మూ. జ్ఞానజ్ఞేయాదివాదేఽతః సిద్ధిర్జ్ఞాతత్వముచ్యతే,
అధ్యక్షాధ్యక్షయోః సిద్ధిర్జ్ఞేయత్వం నాత్మలాభతా.

తా. జ్ఞానము జ్ఞేయము జ్ఞాత యని త్రిపుటినిఁ జెప్పెడివారల మతమున సిద్ధియనఁగా జ్ఞానమే. అధ్యక్షుఁడనఁగ నియమించువాఁడు. అధ్యక్ష్యమన నియమింపఁబడునది. జగత్తు అధ్యక్ష్యమనియు, ఆత్మ నియామకుఁడనియు వాదించువారల మతమున సిద్ధియనఁగా జ్ఞేయత్వమే. (తెలియఁబడుటయే) కాని ఆత్మలాభము కాదు. 'అధ్యక్షస్యాపీతి' యను ౧౩౮-వ శ్లోకము మొదలు ఓశ్లోకమువఱకు అర్థాంతరము. 'అహమజ్ఞాసిషంచేద'మ్మను ౧౩౦-వ శ్లోకము మొదలింతవఱకునుంగల గ్రంథముచేత కర్తృ కరణ కర్మములకు విధిద్వారా ప్రవర్తించిన ప్రమాణమువలననే సిద్ధికాని నిషేధద్వారా ప్రమాణసిద్ధి లేదని ప్రసంగవశమున ప్రాప్తమగు నర్థమును చాలించి, 'అధ్యక్షుఁడును తానొక వస్తువే కనుక ప్రవృత్తప్రమాణమువలననే సిద్ధించుననెడి ప్రకృతార్థమును అనుసరించుచున్నారు. ప్రకృతార్థానుసరణము, "ప్రకృతమనుసరామః, పాయసం భక్షయామః" పాయసభక్షణప్రాయమని యార్యోక్తి ప్రకటించుచున్నది.

'అధ్యక్షస్యాపీతి' యను ౧౩౮-వ శ్లోకమున ప్రమేయములగు నితర వస్తువులవలె అధ్యక్షుఁడు ప్రమాణాపేక్షలేక సిద్ధింపఁడు. చేతనమగు అధ్య

త్ముఁడు ప్రమాణములేక సిద్ధింపఁగూడదా యందువేని వినుము. స్వయంప్రభ మగు జ్ఞానమునకు ప్రమాణాపేక్ష లేకపోవచ్చునుగాని త్రిపుటీవృత్తిలో జ్ఞాతయగు అధ్యక్షుఁడు ప్రమాణములేక సిద్ధింపఁడు. ఎట్లనఁగా — అధ్యక్షుఁడే తానజ్ఞుఁడై ప్రమాణములేనిది అర్థమును సాధించునా? అధ్యక్షునికంటె నన్యమగు అంతఃకరణాదికము సాధించునా? యని వికల్పించి, ఆయధ్యక్షుఁ డజ్ఞుఁడైనయెడల నతనినిఁ దెలియుటకుఁ బ్రమాణ మపేక్షింపఁబడును గనుక చైతన్యస్వభావుఁడగు అధ్యక్షునకుఁ బ్రమాణాపేక్ష లేదు.

రెండవపక్షమున అంతఃకరణాదికము అధ్యక్షుని తెలిసికొనుననేయెడల ప్రమాణ మపేక్షింపఁబడును.

ఎట్లయినను విధిముఖమునఁ బ్రవర్తించిన ప్రమాణమువలననే యధ్యక్షసిద్ధియని యంగీకరింపవలయును.

(౧౩౬ శ్లో. జ్ఞాత తేతి)సిద్ధియనఁగా జ్ఞానము గలిగియుండుట యనెడి పక్షమందు, ౧౩౫-వ శ్లోకమునందు చెప్పినప్రకారము ఆయధ్యక్షుఁడు అజ్ఞుఁడగునేని ప్రమాణాపేక్ష కలుఁగునని చెప్పిన దోషమే సంభవించును. అధ్యక్షుఁడు జ్ఞాతయగునేని పూర్వోక్తమగు వికల్పమును దూషణమును స్మరింపుము. అనఁగా, అధ్యక్షుఁ డజ్ఞుఁడనెడి కల్పము యుక్తము కాదు. సిద్ధియనఁగా జ్ఞానము కలుగుట యని చెప్పినయెడల ఆచైతన్యరూపమగు జ్ఞానమునకుఁ బ్రమాణజన్యమగు మఱియొక బుద్ధ్యపేక్ష యుండవలెనా? యక్కఱలేదు. అచేతనమగు అహంకారము అర్థమును సాధించునని చెప్పు నెడల అధ్యక్షునిఁ దెలియుటకై అన్యమతి (ప్రమాణము) నిశ్చయముగ నపేక్షింపఁబడునని పూర్వమే చెప్పఁబడినదానిని మఱువకుము. ౧౩౬

అవ. సిద్ధియనఁగ జ్ఞానముకాదు, ఆత్మలాభమునుగాదు. ఈ రెండింటికంటె వేఱగు స్పష్టత్వమను పదార్థమొకటి ప్రసిద్ధ

నముగనున్నది యనే భాట్టమతమును శంకించి పరిహరించుచు న్నారు:—

మూ. స్ఫుటత్వం కర్మకర్త్రాదేః సిద్ధితా యది కల్ప్యతే,
స్ఫుటతాఽస్ఫుటతే స్యాతామన్యస్యైవ న చాత్మనః.

తా. స్ఫుటత్వమనునది యజ్ఞాదికర్మమునకు, యజమానాదికర్తకును, ఆదిశబ్దమువలన సాధనపశ్వాదికమునకును సంభవించును. ఈకర్త్రాదివిలక్షణ మగు సాక్షికి స్ఫుటత్వముతోఁగాని అస్ఫుటత్వముతోఁగాని పనిలేదు. ఉత్ప త్తివలన స్ఫుటతయు, ఆచ్ఛాదనవలన అస్ఫుటతయు ననునవి జీవాత్మధర్మములే యగునుగాని నిరంతరస్వయంప్రకాశమానమగు పరమాత్మకు ధర్మవికల్పము లెప్పుడును లేవు. ౧౩౯

### భాట్టమతనిరాకరణము.

అవ. ఈయర్థమునే వ్యతిరేకముఖమున స్ఫుటపరచు చున్నారు:—

మూ. అప్రత్యక్షేఽపి చాంధస్య స్ఫుటీభావో ఘటస్య తు,
కర్త్రాదేః స్ఫుటతేష్టా చేద్దృష్టతాఽధ్యక్షకర్తృతా. ౧౪౦

తా. దర్శనశక్తిలేని గ్రుడ్డివానికిఁ దెలియఁబడు ఘటముయొక్క స్ఫుటీభావము జ్ఞానమునకే విషయమగునని భాట్టమతసిద్ధాంతము. ఆ మతము వారికి కర్త్రాదికము స్ఫుటమని సమ్మతమగునేని యప్పుడు ప్రత్యక్షత్వము అన్యాత్ము నకేయని చెప్పవలెను. ప్రకాశస్వరూపమగు స్ఫుటత జడమగు కర్త్రాదికము నకు సంభవింపదు గనుక సిద్ధియనఁగా భాట్టులు చెప్పెడి 'స్ఫుటత' సరికాదు. కావున సిద్ధియనఁగ జ్ఞానము కలుగుటయే. ఇది కర్త్రాదిగతచిదాభాసునియందే

యుండును. ఈ సంఘమును భాసింపఁజేయు చిదాత్మ ప్రదీపమువలె స్వయం ప్రకాశమును సర్వప్రకాశకముగను నుండునని ఉపమానానుమానప్రమాణములచేఁ దెలియవలయునని తాత్పర్యము. ౧౮౦

## బౌద్ధమతోపన్యాసము.

అవ. ఇచట కర్తృకర్మరహితమగు జ్ఞానమే స్వమహిమచే భాసించునని విజ్ఞానవాదియగు బౌద్ధుఁడు వాదించుచున్నాఁడు:—

మూ. అనుభూతేః కిమన్యస్మిన్నాస్యృత్త్వాపేక్షయా వద,
అనుభవితరీష్టా స్యాత్సోఽప్యనుభూతిరేవ నః. ౧౮౧

తా. స్వప్రకాశమగు అనుభూతి యన్యమగు కర్త్రాదికము నపేక్షింపదు. ఓ బౌద్ధుఁడా! ఆ యనుభూతి యనుభవించెడి కర్తయం దుండునందువేని మా (వేదాంతి) మతమందు, అనుభూతికంటె నన్యముగ ననుభవిత లేనందున మీరు చెప్పిన అనుభవిత (అనుభవించువాఁడు) మా మతమందు అనుభూతియేకాని యన్యముకాదు. ఇట్లు "స్వయమేవానుభూతిత్వాద్విద్యతే నానుభావ్యతా" యని శ్రీవిద్యారణ్యులు (చూ. పంచదశీప్రకరణము-పంచకోశవివేకము, శ్లో -౧౩). ౧౮౧

అవ. అట్లైని, "అనుభూతి=(అనుభవము), అనుభవిత=అనుభవించువాఁడు, అనుభావ్యము = అనుభవింపఁదగిన వస్తువు" ననెడి యీ త్రివిధభేద మెటుల సిద్ధించునందువేని వినుము:—

మూ. అభిన్నోఽపి హి బుద్ధ్యాత్మా విపర్యాసితదర్శనైః,
గ్రాహ్యగ్రాహకసంవిత్తిభేదవానివ లక్ష్యతే. ౧౮౨

తా. బుద్ధ్యుపాధిస్వభావముగల ఆత్మ యొక్కద్వైతము భ్రాంతిగల వానికి గ్రహణము గ్రాహకుడు గ్రాహ్యము అని భేదముగలిగి యున్నట్లు భాసించుచుండును. సంవిత్తి యన గ్రహణము. ౧౮౨

అవ. బుద్ధి కారకముకాదని యంగీకరించుటవలన కర్త్రాదికము నపేక్షింపఁ బనిలేదని చెప్పుచున్నారు:—

మూ. భూతిర్యేషాం క్రియా సైవ కారకం సైవ చోచ్యతే,
సత్త్వం నాశిత్వమస్యాశ్చేత్సకర్తృత్వంత భేష్యతామ్.

తా. సర్వక్షణికవాదివియగు నీమతమున సర్వముకు క్షణికమే యగుటచేత 'సకర్తృత్వం' అనెడి అనుభూతి స్వరూపమే కనుక నశింపదు.

అవ. సత్త్వాదిధర్మము నంగీకరింప మనెదరేని యపుడు మీక్షణికవాదమునకే భంగముకలుగునని చెప్పుచున్నారు:—

మూ. న కశ్చిచ్చేష్యతే ధర్మ ఇతి చేత్క్షణికాస్తు తా,
నన్వస్తిత్వాదయో ధర్మా నాస్తిత్వాదినివృత్తయః.
న భూతేస్తర్హి నాశిత్వం స్వాలక్షణ్యం మతం హి తే,

తా. ఏధర్మమును లేదను నెడల ధర్మములన్నియును క్షణికములను మీ మతమే నిలువనేరదు. మీమతమున అస్తిత్వాదులు ధర్మములుకావు. మఱి యేమన, నివి రెండవపక్షమున నుండవనియే చెప్పెదమందురా? అట్లేని అను భూతి నశించునది కాకపోవలయును. ఏలయన, 'సర్వం స్వలక్షణం' అని మీమతప్రకారముగ ననుభూతి స్వలక్షణమే కనుక నశింపదు. ౧౮౪

అవ. దీనినే స్ఫుటపరుచుచున్నారు:—

మూ. స్వలక్షణావధిర్నాశో నాశోఽనాశనివృత్తితా. ౧౭౫
అగోరసత్త్వం గోత్వం తే నతు తద్గోత్వలక్షణమ్,

తా. స్వలక్షణావధియే నాశము. ఎట్లన, కంకణాదిరూపముననున్న వస్తువులను కరుగఁగా ప్రకృతియగు స్వర్ణమేయగును. నాశము కలదని యొప్పుకొనునెడల దీనికిఁ బ్రతియోగియగు అనాశమునుకూడ నొప్పుకొనవలయును. కావున నాశమనఁగా అనాశముకాకపోవుట మఱియు, బౌద్ధుఁడా! మీమతమున ఆవిర్భావతిరోభావములకు అవధియగు మఱియొక నిత్యవస్తువు లేనందున వస్తువుయొక్క స్థితికాని నాశముకాని సిద్ధింపదు. ఏమనఁగా— 'నాశమన, అనాశములేకపోవుట' యని మీ రంగీకరించిన అన్యాపోహ (ఇది దీనికంటె నన్యముకాదు) అనెడి పక్షముసయితము పొసఁగదు. ఎట్లన; నాశము కలుగునపుడు దీనికి విరుద్ధమగు అనాశము ఉండదు. అనాశము లేదేని దాని యపోహమును గలుగనేరదు.

ఇఁక నొకబాధయు మీ (బౌద్ధ) మతమునఁ గలుగును. ఎద్దియన; పదార్థములకు సామాన్యలక్షణము నొప్పక, నిది యన్యముకంటె వేఱని విశేషలక్షణమును జెప్పుటచేత, అన్యోన్యాశ్రయమనెడి దోషము సంభవించును. అశ్వముకానిది గోవు అని కదా మీమతము. ఇచట గోవుకానిది అశ్వమనియుఁ జెప్పవలయును. ఇదియే అన్యోన్యాశ్రయదోషము. ఈ దోషము కలుగుటవలన గోభిన్నము కాకపోవుట గోత్వమని చెప్పునదియు గోలక్షణము కానేరదు. ఇట్టి అన్యోన్యాశ్రయదోషము శాస్త్రైకవేద్యము.

అవ. ఈ యపోహవాదమున మఱియొక దోషము కూడ సంభవించునని చెప్పుచున్నారు:—

మూ. క్షణవాచ్యోఽపి యోఽర్థః స్యాత్సోఽప్యన్యాస్వభావ
ఏవ తే. ౧౮౬

తా. మీ మతమున క్షణమనఁగ క్షణాభావము కానిది యని యర్థము కద. అట్లేని, ఆక్షణికాభావము క్షణమని నీవు చెప్పవలసియుండునుగనుక క్షణమునకు విరోధిని నయితము నీ వంగీకరింపవలసియుండుననెడి యీ దోషముకూడ మీ మతమున సంభవించును. ౧౮౬

అవ. అభావమనఁగా సత్తుకాదని చెప్పవలెనని యపుడు కదా మీరాక్షేపింపవచ్చును ఇఁక నేమి యన, ఇతరమును నివర్తించుటవలన (నిరుపాఖ్యము) చెప్పుటకు వీలులేకుండు నేని యదియును సంభవింపదని శంక:—

మూ. భేదాభావేఽప్యభావస్య భేదో నామభిరిష్యతే,
నామభేదైరనేకత్వమేకస్య స్యాత్కథం తవ. ౧౮౭

తా. అభావము స్వరూపమున భేదములేకుండ నొక్కటియైనను, 'గోవుకానిది అశ్వము, అశ్వముకానిది గోవు' నని నామమాత్రమున భేదము సిద్ధించునని చెప్పఁగా, సిద్ధాంతి దూషించుచున్నాఁడు—నామేతి—స్వభావ రహితమై యొక్కటియగు అభావము వ్యర్థసంజ్ఞలచేత వ్యావర్తకమును అనేకమును నెట్లగునో చెప్పుము. ౧౮౭

అవ. 'వ్యావృత్తి, అపోహము' ననునీరెండును 'భిన్నవస్తువులకా? అభిన్నవస్తువులకా? యనివికల్పించి భిన్నవస్తువులకని చెప్పునెడల అది తగదని నిరాకరించుచున్నాఁడు:—

మూ. అపోహో యది భిన్నానాం వృత్తిస్తస్య కథం గతి,

నాభావా భేదకా స్సర్వే విశేషా వా కథంచన. ౧౪౭

తా. అపోహమనఁగా అది కాదనిచెప్పుట. వ్యావృత్తియనఁగా మఱి యొక్కదానినుండి మరలుట. భేదప్రతియోగివస్తువులు అనేకములు. అనఁగా, గోవుకానిది యొక గుఱ్ఱమే కాక ఎద్దు జింక మొదలగునవి యనేకము లుండఁగా, ఆ ప్రతియోగివస్తువులు తెలియఁబడక, వాని అపోహము శక్యము కానందున, ఆయపోహము గోవునం దెట్లు సంభవించును? సిద్ధింపదు కద. అనేకపదార్థాపోహము సంభవింపనపుడు కొన్నిటి యభావము కొన్ని చోట్లనే సులభము కనుక వ్యవహారనియమము లేకపోవును. ఏకవస్తువునకు అభావవస్తువులు భేదకములు కావు సరేకదా. ఖండాఖండత్వాది విశేషము లైనను భేదకములు కానేరవు. భేద్యభేదకములనుచు నీమతమున భేదము సిద్ధింపదుగద. ౧౪౭

అవ. ఇట్లు అపోహవాదమందు ఖండమగు (ఏకవ్యక్తి యగు) గోవు, నల్లని కలువ యీ మొదలగు వ్యవహారము సిద్ధింపదు. గో విది యనెడి యసాధారణ స్వరూపము సిద్ధింపదు. కనుక నిది సమంజసము కాదని చెప్పి అపోహవాదనిరాకరణము నుపసంహరించు చున్నారు:—

మూ నామజాత్యాదయో యద్వత్సంవిదస్తేఽవిశేషతః. ౧౪౮

తా. నీమతమున సంవిత్తనఁగ జ్ఞానము విశేషరహితము గనుక నామ జాత్యాదులు కానట్లుగనే, గోవు మొదలగువానికి గోభిన్నాదికముకంటె వ్యావృత్తిగాని ఖండత్వముకాని భేదకము (విశేషణము)ను గాదు. విశిష్ట వ్యవహారమే లేనపుడు వాదమెట్లు నిలుచును? నిలువదు. ౧౪౮

అవ. 'భూతిర్యేషాం క్రియా సైవ' యను ౧౪3-వ

శ్లోకములో సంవిత్తునకుఁ గ్రియాకారకభేదాపేక్ష లేదని చెప్పినది ప్రత్యక్షానుమానప్రమాణమని చెప్పుచున్నారు:—

మూ. ప్రత్యక్షమనుమానం వా వ్యవహారే యదీచ్ఛసి,
క్రియాకారకభేదైస్తదపభ్యుపేయం ధ్రువం భవేత్.

తా. వ్యవహారదశయందు ప్రత్యక్షప్రమాణముగాని, అనుమాన ప్రమాణముగాని నీవంగీకరించినయెడల, ఆ ప్రమాణములు క్రియాకారక భేదసహితముగనే యంగీకరింపవలయును. ౧౫౦

## బౌద్ధమతనిరాకరణము.

అవ. అజ్ఞేని సంవేదనముకంటె నన్యమగు వేద్యము వేత్తయను నీద్వయము నీకసమ్మతమైనను బలాత్కారముగ నైన నొప్పుకొనకతీరదని చెప్పి బౌద్ధమతమును నిరాకరించు చున్నారు:—

మూ. తస్మాన్నీలం తథా పీతం ఘటాదిర్వా విశేషణమ్,
సంవిదస్తదుపేయం స్యాద్యేన చాప్యనుభూయతే. ౧౫౧

తా. నల్లనిది పచ్చనిది యని విశేషణముగాని ఘటాదివస్తువుగాని యనుభవించు జ్ఞాత యొకఁడు కలఁడని తప్పక యొప్పుకొనవలసి యుండును. ౧౫౧

అవ. సంవిత్తు సకలవేద్యసాక్షియనుటకు అనుమాన ప్రమాణమును జూపుచున్నారు:—

మూ. రూపాదీనాం యథాఽన్యః స్యా
ద్గ్రాహ్యత్వాద్గ్రాహకస్తథా,
ప్రత్యయస్తత్తథాఽన్యః స్యా
ద్వ్యంజకత్వాత్ప్రదీపవత్. ౧౫౨

తా. గ్రహింపఁబడునదెల్ల తనకంటె నితరముచే గ్రహింపఁబడును. ఎట్లన, రూపాదికము నేత్రాదికముచేఁ గద గ్రహింపఁబడును. ఇట్లే గ్రాహ్యమగు సంవిత్తు ఇతరముచే గ్రహింపఁబడును. అని బౌద్ధునిగుఱించి యీ ప్రయోగము జూపవలయును. ౧౫౨

ఆస్తికులను గూర్చి యీ ప్రయోగము జెప్పవలెను—

ప్రకాశింపఁజేయుః దీపము ప్రకాశ్యమానములగు ఘటాదులకంటె నన్యమగునట్లు, గ్రాహ్యములగు రూపాదులకంటె గ్రాహకమగు ఆత్మ అన్యము.

అవ. అట్లయిన జ్ఞాతకును జ్ఞానమునకునుగల సంబంధ మెద్ది యను ప్రశ్నమున కుత్తరము:—

మూ. అధ్యక్షస్య దృశేః కీదృక్సంబంధః సంభవిష్యతి?
అధ్యక్షేణతుదృశ్యేనముక్త్వాఽన్యోఽద్రష్టృదృశ్యతామ్.
అధ్యక్షేణ కృతా దృష్టిర్దృశ్యం వ్యాప్నోత్యథాపివా,
నిత్యాధ్యక్షకృతః కశ్చిదుపకారో భవేద్ధియామ్. ౧౫౩

తా. ద్రష్టను దృశ్యమును అంగీకరించినయెడల ఆభాసుఁడును దప్పక నంగీకరింపఁబడవలసియే యుండును. ఎట్లన, జ్ఞాతకును జ్ఞానమునకును గల సంబంధము వాస్తవమా? మాయికమా? అధ్యక్షుఁడు దృశ్యముకాక నితరుఁడైనను దృశ్యమును వ్యాపించునా? లేక అధ్యక్షకృతమగు దృష్టియే దృశ్యమును వ్యాపించునా? అని వికల్పించి జ్ఞాతృజ్ఞానసంబంధము వాస్తవ

మగునేని ఆత్మ సావయవము పరిణామి యనెడి దోషములు సంభవించును. ఇది శ్రుతివిరుద్ధము కనుక నీ సంబంధము వాస్తవముకాదని నిరాకరించి, యీ సంబంధము మాయికమనియు, ధీవృత్తులకు నిత్యాధ్యక్ష కృతోపకారము కలుగనందున ఆభాసునిఁ గల్పింపవలయుననెడి రెండవపక్షము నంగీకరించుచున్నారు. ౧౫౪

అవ. ఆయుపకారమెట్టిదియనఁ జెప్పుచున్నారు:—

మూ. స చోక్తస్సన్నిభత్వం ప్రాక్సంవ్యాప్తిశ్చ ఘటాదిషు,
యథా లోకాదిసంవ్యాప్తిర్వ్యంజకత్వాద్ధియస్తథా.

తా. బుద్ధికి నిత్యాధ్యక్ష కృతోపకారము (జడమగు బుద్ధియందు ప్రతిబింబించిన ఆభాసద్వారము) పూర్వము ముఖ ప్రతిబింబదృష్టాంతముచేఁ జెప్పఁబడెను. ఆత్మకు ఆభాసద్వారా బాహ్యవస్తుసంబంధమును జెప్పుటకై యిపుడు ఆభాసయుక్తమగు బుద్ధి విషయములను వ్యాపించుటను దృష్టాంతసహితముగఁ జెప్పుచున్నారు. ప్రకాశకమగు ఆలోకము ఘటాదికమందు వ్యాపించునట్లు పదార్థములను స్ఫురింపఁజేయు ధీవృత్తి వానిని వ్యాపించును. ౧౫౫

అవ. ఉక్తార్థమునే స్ఫుటపఱచుచున్నారు:—

మూ. ఆలోకస్థో ఘటో యద్వద్బుద్ధ్యారూఢో భవేత్తథా,
ధీవ్యాప్తిస్స్యాద్ఘటారోహో ధియో వ్యాప్తౌ క్రమో
భవేత్. ౧౫౬

తా. ఆలోక (కాంతి) సన్నిధినున్న ఘటము ఆలోకారూఢమగునట్లు, బుద్ధినివిష్టమగు ఘటము బుద్ధ్యారూఢమగును. ఆరూఢమనఁగా పురుషుఁడు గుఱ్ఱము నెక్కినట్లు ఆలోకము బుద్ధిని ఎక్కుటకాదు. మఱియేమన,

ఘటాదికమును బుద్ధి వ్యాపించుటయే. అట్లయిన బుద్ధికిని ఆత్మకును భేదమే
మనఁగా, బుద్ధికి నిత్యాధ్యక్షకృతమగు నుపకారములలో నొకటి బుద్ధి
ఆత్మాకారమగుటయేయని ముఖప్రతిబింబదృష్టాంతముచే ముందు చెప్పఁ
బడెను. ఇపుడు ఘటాదిబాహ్యవస్తువులను ప్రకాశింపఁజేయుటకై దృశ్య
ఘటాదికమును వ్యాపించుటయే ఆలోకదృష్టాంతముచేఁ జూపఁబడుచున్నది.
బుద్ధి ఆత్మనిభమైనను ఆత్మ యన్నివిషయములను క్రమాపేక్షలేకయే ప్రకా
శింపఁజేయును. బుద్ధి స్వవిషయములను ఒకదానితరువాతనొకటినిఁ బ్రకా
శింపఁజేయునని భేదము. ౧౫౬

అవ. విషయములను బుద్ధి వ్యాపించునపుడు అపేక్షిం
చెడి క్రమమును ఆత్మ యపేక్షింపదనుటను విశదపరుచుచు
న్నారు:—

మూ. పూర్వం స్యాత్ప్రత్యయవ్యాప్తిస్తతోఽనుగ్రహ ఆత్మనః,
కృత్స్నాధ్యక్షస్య నో యుక్తః కాలాకాశాదివత్క్రమః.

తా. బుద్ధి మొదట స్వవిషయమును వ్యాపించును. పిమ్మట విషయా
కారముగ మాఱిన యాబుద్ధియందు ఆత్మ ప్రతిఫలించి ఘటాదివిషయమును
భాసింపఁజేయును. ఈవిధముగ క్రమద్రష్టయగు బుద్ధి ఆత్మకు శేషము
(అప్రధానము) అగును. ఆత్మ మఱియొకదానికి శేషముకాదు. అని చెప్పు
చున్నారు—'కృత్స్నేతి'—ప్రతివిషయమందును భేదముగ మాఱుచు
పదార్థమును భాసింపఁజేయు బుద్ధికే క్రమభేదము కలదుకాని, సకలవిశేష
ములకును ఆస్పదమగుటచేత సకలమునకు అధ్యక్షుమై యంతటను అనుగత
ప్రకాశరూపుఁడును పరిచ్ఛేదరహితుఁడును నగు ఆత్మకు ఆ క్రమముతోఁ
బనిలేదు. పరిచ్ఛేదమనఁగా, ఈ దేశమందు, నీ కాలమందు, నీ వస్తువునందుఁ
గలదు. తక్కిన దేశకాలవస్తువులందు లేదను నియమము. అట్టినియమము

లేదు కనుక ఆత్మ అపరిచ్ఛిన్నుఁడు. కాలము, ఆకాశము, దిక్కు—నను నివి నియమములేక సదా సర్వత్ర నిండియుండునట్లు ఆత్మయును సదా సర్వత్ర నిండియుండును. కనుక ఆత్మకు బుద్ధివలె క్రమవ్యాప్తితోఁ బనిలేదు. ౧౩౭

అవ. అధ్యక్షుఁడును బుద్ధివలె భోగ్యవిషయములను భాసింపఁజేయుటవలన పరిణామమును బొందవలయునను శంక కుత్తరము:—

మూ. విషయగ్రహణం యస్య కారకాపేక్షయా భవేత్,
　　సత్యేవ గ్రాహ్యశేషే చ పరిణామీ స చిత్తవత్.

తా. కర్త్రాదికారకాపేక్షచేఁగాని, కొంతవిషయమును మాత్రము గ్రహింపఁగా మఱికొంతవిషయము మిగులునపుడుకాని ఆత్మ చిత్తమువలె పరిణామమును బొందును. కాని పరిపూర్ణమగు నీయాత్మ తనయందు ఆరోపితమగు సకలప్రపంచమును నొక్క—సారిగ భాసింపఁజేయుచు గ్రహించును గనుక పరిణామమును బొందదు. ౧౩౮

అవ. అధ్యక్షునకు విషయాకారమగు పరిణామము లేకున్నను బ్రహ్మాకారమగు పరిణామము కలుగవచ్చును. ఏలయన, బ్రహ్మము స్వాత్మయైనను బ్రహ్మాకారావభాసమునకు జ్ఞానాపేక్షకలుగుటచే పరిణామము ఆత్మకును గలుగవలయు ననుశంక కుత్తరము:—

మూ. అధ్యక్షోఽహమితి జ్ఞానం బుద్ధేరేవ వినిశ్చయః,
　　నాధ్యక్షస్యావిశేషత్వాన్న తస్యాస్తి పరో యతః.

తా. తత్త్వమస్యాదిమహావాక్యములవలనఁ గలిగిన 'నేను పరమాత్మనే' యను జ్ఞానము అధ్యక్షునకుఁ గలుగదు. ఆ యధ్యక్షునకు వస్తుకృతవిశేష

ములు లేనందున నిరవయవుఁడును అసంగుఁడునునగు ఆత్మకుఁ దననుండికాని, యితరులనుండికాని భేదము కలుగనందున 'నేను పరమాత్మనే' యను బ్రహ్మాకారవృత్తి చిదాభాససహితమగు బుద్ధిదేయని తెలియవలెను. ఆ యధ్యక్షునకు మఱియొకరివలన జ్ఞానము కలుగదు. అట్లు గలిగెనేని యీ జ్ఞానము మఱియొకరివలనను, ఇదిమఱియొకరివలను అని వ్యవస్థ లేకపోవలసివచ్చును. ఈ బ్రహ్మాకారవృత్తి అన్నిబుద్ధులకును గలుగునా యనెదవేని యిటువంటి సంస్కారములుగల బుద్ధికే కలుగునుగాని, అన్నిబుద్ధులకుఁ గలుగనేరదు. సంస్కార మెట్టిదన నీ బ్రహ్మాకారవృత్తిని సంపాదించెడి బుద్ధి ఈ క్రింది సంస్కారములు కలదిగ నుండవలెను:—

1. బహుజన్మార్జిత పుణ్యపరిపాకమువలన సకలదోషనివృత్తిగలదియు,

2. రామకృష్ణశివాది సగుణబ్రహ్మోపాసనవలన చాంచల్యములేక నిశ్చలమైనదియు,

3. ఈ జన్మమున వివేకవైరాగ్యములు కలదియు,

4. తత్ త్వం పదార్థపరిశోధన జ్ఞానమువలన దృఢసంస్కారము గలదియునై బుద్ధి యుండఁగా, వేదాంతవాక్యశ్రవణానంతరమున శోధిత తత్త్వంపదార్థములందుండు కల్పిత భేదాంశము నిరాకరింపఁబడఁగా, అఖండాకారవృత్తి కలుగును. ఆధీవృత్తియందు ప్రతిఫలించిన చిదాత్మ తాదృగ్వృత్త్యభిన్నాకారముతో 'అహం బ్రహ్మాస్మి' యని పరామర్శింపఁబడును. ఉపాధికృతవిశేషాంశములను బరిహరింపఁగా వివిక్తమగు స్వస్వరూప పరబ్రహ్మమే శేషించును. కాఁబట్టి, ఆత్మయందు విశేషమేమియుం గలుగదు; అని చిత్తమునకువలె చిదాత్మకును పరిణామము పరిణామముచే నితరవేద్యత్వమును సంభవించుననుటకుఁ బ్రమాణము లేనందునను, అనవస్థాదోషప్రసంగమువలనను, నటుల నంగీకరింపఁదగదని తాత్పర్యము. ఆ యాత్మను దెలియుట

డింకొకఁడు లేఁడు. ఉండెనేని వాని కింకొకఁడు, వానికి మఱియొకఁడు జ్ఞాత యని యిట్లు హద్దులేకుండుటయే అనవస్థాదోషమని శాస్త్రమునందుఁ జెప్పఁబడును. ౧౪౯

అవ. జ్ఞానాకారపరిణామము బుద్ధిదే. ఐనను జ్ఞానఫలము బుద్ధికిఁగాక ఆత్మకేకదా యను నభిప్రాయముతో, అహంకర్తకు ఫలసంబంధమును జెప్పినయెడల సంభవించు దోషమును జెప్పుచున్నారు:—

మూ. కర్త్రా చేదహమాత్మేవ మనుభూయేత ముక్తతా,
సుఖదుఃఖాదినిర్మోక్షో నాహంకర్తరి యుజ్యతే ౧౫౦

తా. వికారముగల కర్తచేత 'నేను ముక్తుఁడ'నని ముక్తి యనుభవింపఁబడెనేని యప్పుడు 'నేను కర్తను గా'నని కర్తృత్వము బాధింపఁబడుటచే, ఆకర్తయందు 'నేను సుఖాదిమంతుఁడ' ననెడి యనుభవమునకు విరోధము కలుగుటవలన సుఖదుఃఖసంబంధాభావము వీనికిఁ దగదు. అనఁగా, ముక్తికాలమున క్రియతోఁ గర్తయు లీనమగుటవలన, అహంకారరూపకర్తకు ఫలసంబంధము లేదని భావము. ౧౫౦

అవ. ఆత్మ నిత్యకూటస్థుఁడగుటవలన ఫలభాగి యెట్లగునను శంక రాఁగా, తత్త్వజ్ఞానము కలిగినపిమ్మట నాంతరీయకముగ మునుపు దేహాదికము నధ్యసింపఁబడిన దేహాత్మాభేదము బాధింపఁబడుచు ఆభాసమగుచుండుటయే ఫలమని యంగీకరించుటవలన, ఆఫలము ఆత్మయందుఁ దగియుండునను నభిప్రాయముతో చెప్పుచున్నారు:—

మూ. బాధ్యతే ప్రత్యయేనేహావివేకేనావివేకవాన్,
దేహాదావభిమానోత్థో దుఃఖీతి ప్రత్యయో ధ్రువమ్.
కుండలీప్రత్యయో యద్వత్ప్రత్యగాత్మాభిమానినా,

తా. కుండలమనఁగ కర్ణభూషణము. ఇది కలవాఁడు కుండలి యని యు, లేనివాఁడు అకుండలియనియు వ్యవహరింపఁబడునట్లు, దుఃఖముగల వాఁడు దుఃఖి, సుఖముగలవాఁడు సుఖి, యిట్లు కామి, కృశుఁడు, స్థూల దేహి యని వ్యవహరింపఁబడును. ఈవ్యవహారము దేహాదికమందు ఆత్మాభి మానమువలనఁ గలిగినది. దేహాభిమానకృతమగు నీవ్యవహారము, ప్రత్యగాత్మ యే నేనని భావించెడి వివేకజ్ఞానముచే బాధింపఁబడును. ఏదిలేకుండ నేది సంభవింపదో దీని కది 'నాంతరీయ' మనఁబడును. దేహాభిమానము లేనిది నేను సుఖిని, దుఃఖిని యనెడి వ్యవహారము కలుగదు కనుక నీవ్యవహారమున కు దేహాభిమానము నాంతరీయకము. ఇచట ప్రత్యగాత్మాభిమాన మనఁగా శోధితమగు త్వంపదలక్ష్యార్థమని భావము. ౧౯౧

అవ. విరోధము సమానమేకనుక అవివేకప్రత్యయము చేత వివేక మేల బాధింపఁబడకూడదను శంకకు సమాధా నము:—

మూ. విపర్యాసేఽసదన్తం స్యాత్ప్రమాణస్యాప్రమాణతః.

తా. అటులఁగాక, అవివేకముచేత వివేకజ్ఞానము బాధింపఁబడునేని ప్రమాణశాస్త్ర మంగీకరింపఁబడనందున సర్వమును శూన్యమాత్రముగ శేషిం చును. అనఁగా, ప్రమాణసిద్ధమగు అర్థములేనియెడల ప్రతిభాసము నిరా ధారమగును. అట్లేని బాధకు వ్యవస్థ లేమిచే శూన్యమే శేషించునని భావము.

అవ. వివేకముచే నవివేకము బాధింపఁబడునని చెప్పిన విషయమును స్పష్టపఱచుచున్నారు:—

మూ. దాహచ్ఛేదవినాశేషు దుఃఖిత్వం నాన్యథాఽఽత్మనః,
నైవ హ్యన్యస్య దాహాదావన్యోదుఃఖీ భవేత్క్వచిత్.

తా. శరీరమునకు బాధగలిగించు కాల్పు నఱుకు మొదలగు బాధలు కలిగినపుడు దుఃఖము కలుగును. ఇవి కలుగనియపుడు దుఃఖముకలుగదు. ఈ దాహచ్ఛేదాదులు ఆత్మకుఁ గలవాయనిన దేహాభిమానము గలిగిన యప్పుడే కలుగునుగాని దేహాభిమానములేని సుషుప్తియందు దుఃఖము లేదు. కనుక దేహాదికముకంటె ఆత్మ అన్యమని శ్రుత్యనుభూతిప్రసిద్ధము. ఒకనికిఁ గలిగిన దాహాదికమువలన మఱియొకనికి బాధ కలుఁగదు. కనుక దేహాదికమునకుఁ గలిగిన దాహాదికమువలన ఆత్మకుఁ గలిగెడి దుఃఖమునకు అధ్యాసమే కారణమని భావము. ౧౬౩

అవ. ఆత్మకు వాస్తవమగు దాహాదికసంబంధము లేనందుకుఁ బ్రమాణము:—

మూ. అస్పర్శత్వాదదేహత్వాన్నాహం దాహ్యో యతః సదా,
తస్మాన్మిథ్యాభిమానోత్థం మృతే పుత్రే మృతిర్యథా.

తా. దేహముగాని స్పర్శాదిగుణముగాని లేనందున ఆత్మ దహింపఁబడదు. కావున అధ్యాసమే దుఃఖమునకు నిదానము. వీఁడు నాపుత్రుఁడని పుత్రాభిమానముగలవాఁడు పుత్రునిమరణమునకు తానే మరణించినట్లు భావించునుగద. కావున అధ్యాసమే దుఃఖకారణమని భావము. ౧౬౪

అవ. పూర్వోక్తదృష్టాంతమును వివరించుచు వివేక

జ్ఞానమువలన అవివేకజ్ఞానమే నివ_ర్తింపఁబడుననెడి విషయము నుపసంహరించుచున్నారు:—

మూ. కుండల్యహమితి హ్యేతద్బాధ్యేత్త్రైవ వివేకినా,
దుఃఖీతి ప్రత్యయ స్తద్వత్కేవలాహంధియా సహ.

తా. 'నేను కుండలములు గలవాఁడను' అను బుద్ధి దేహాత్మబుద్ధివలననె కలిగి, 'నేను దేహముకంటె నన్యమగు ఆత్మను' అనెడి జ్ఞానముదయింపఁగనె యా బుద్ధి నశించునట్లు, నేను దుఃఖిని యనుజ్ఞానము నేను శుద్ధబ్రహ్మను అనెడి వృత్తిజ్ఞానముతోఁగూడఁ దొలఁగునని భావము. ౧౬౫

అవ. సంసారములోఁ బరిపూర్ణసుఖముల ననుభవించెడివాఁడు ముక్తినిమిత్తము యత్నింపఁడు. ఇందు బహువిధ సంతాపములచేఁ దప్తుఁడగువాఁడే దుఃఖనివృత్తికొఱకును, నిత్యానందప్రాప్తికిని ప్రయత్నించును. కావున దుఃఖరహితుఁడగువాఁడు మోక్షోపదేశమున కర్హుఁడు కాకపోవుటచే ఆత్మకుఁగూడ దుఃఖమున్నట్లు తోఁచుచున్నది. ఈదుఃఖస్థితికై ఆత్మ శక్తిమంతుఁడనవలసియుండును. కనుక ఆత్మకీదుఃఖ మాగంతుకమే కాక సహజమనియుఁ జెప్పఁదగును.సుషుప్తియందుఁగనుపింపకున్నను రాఁబోవు స్వప్నజాగ్రద్దుఃఖములకు బీజమైన శక్తిని సుషుప్తియందెవరును లేదనలేరుకదాయను నాక్షేపము నుపసంహరించుచున్నారు:—

మూ. సిద్ధే దుఃఖిత్వ ఇష్టం స్యాత్తచ్ఛక్తిశ్ఛందసాఽఽత్మనః,
మిథ్యాభిమానతో దుఃఖీ తేనార్థాపాదనక్షమః. ౧౬౬

తా. ఏయవస్థయందైనను కేవలాత్మకు దుఃఖము ప్రమాణసిద్ధమగునేని, ఆదుఃఖశక్తిని అంగీకరింతుము. అట్లుగాక దుఃఖమన్యథాసిద్ధమగుచున్నది. ఎట్లనఁగా, నీదుఃఖము ఆత్మకు మిథ్యాభిమానమువలనఁ గలిగినది, కనుక దుఃఖమున్నట్లు తోఁచుచుండును. మనస్సు ఉన్నపుడు దుఃఖమును, మనస్సులేనపుడు దుఃఖము లేకుండుటయు ననుభవసిద్ధమనియే (యీ క్రిందిశ్లోకమువలన) స్ఫురించుచున్నది. 'రాగేచ్ఛాసుఖదుఃఖాది బుద్ధౌ సత్యాం ప్రవర్తతే, సుషుప్తౌ నాస్తి తన్నాశాత్తస్మాద్బుద్ధేస్తు నాత్మనః.' మిథ్యాభిమానమువలనఁ గలిగిన దుఃఖము సైతము మిథ్యయే. ౧౬౬

అవ. ఆత్మకు దుఃఖము సహజము కాదనియే చెప్పుచున్నారు:—

మూ. అస్పర్శోఽపి యథా స్పర్శమచలశ్చలనాది చ,
అవివేకాత్తథా దుఃఖం మానసం చాత్మనీక్ష్యతే. ౧౬౭

తా. నిరవయవమగు పరిపూర్ణాత్మకు కదలుట, తాఁకుట, లేచుట, కూర్చుండుట మున్నగు క్రియలు స్థూలదేహోపాధితో నభేదాధ్యాసము వలనఁ గలుగుచుండును. ఇట్లే మనస్సంబంధమగు దుఃఖము సూక్ష్మదేహముతో నభేదాధ్యాసమువలననే కలుగును. ౧౬౭

అవ. ఈయర్థమునే అన్వయవ్యతిరేకములచే నిరూపించుచున్నారు:—

మూ. వివేకాత్మధియా దుఃఖం నుద్యతే చలనాదివత్,
అవివేకస్వభావేన మనో గచ్ఛత్యనిచ్ఛతః. ౧౬౮

తా. స్థూలదేహసంబంధమగు చలనాదికము వివేకదృష్టివలన ఆత్మసంబంధము కాదని తెలియుటవలన నాయధ్యాసము నివర్తియగును. అట్లే

సూక్ష్మశరీర నిమిత్తమగు దుఃఖము బ్రహ్మాత్మజ్ఞానమువలన సమూలముగ నివర్తించును. ౧౮౮

అవ. సహజమగు నీమనశ్చలనమునకు ఫలము:—

మూ॥ తదాను దృశ్యతే దుఃఖం నైశ్చల్యేనైవ తస్య తత్,
ప్రత్యగాత్మని తస్మాత్తద్దుఃఖం నైవోపపద్యతే. ౧౮౯

తా॥ మనస్సు నిశ్చలముకాఁగా ఆత్మకు దుఃఖము లేదు. కావున ప్రత్యగాత్మకు దుఃఖము లేదని భావము. ౧౮౯

అవ. ఇట్లు ప్రత్యగాత్మ దుఃఖరహితుఁడని నిశ్చయింపఁగా, మహావాక్యమువల్ల 'అహం బ్రహ్మాస్మి' యను అపరోక్షజ్ఞానము కలుగునని చెప్పుచున్నారు:—

మూ॥ త్వంసతోస్తుల్యనీడత్వా న్నీలాశ్వవదిదం భవేత్. ౧౯౦

తా॥ నీలాశ్వమనుచోట నీలత్వమనెడి ధర్మము, అశ్వత్వమను ధర్మము నీరెండును ఏకద్రవ్యమందే యుండునట్లుగ, త్వంపదలక్ష్యార్థమగు కూటస్థుఁడును తత్పదలక్ష్యార్థమగు బ్రహ్మమును ఏకచిద్ద్రవ్యనిష్ఠములేయని భావింపగ నీయపరోక్షజ్ఞానము కలుగును. ౧౯౦

అవ. తత్త్వంపదార్థములు ఏకార్థనిష్ఠము లనుటను స్పష్టపరుచుచున్నారు:—

మూ॥ నిర్దుఃఖవాచినా యోగా త్త్వంశబ్దస్య తదర్థతా,
ప్రత్యగాత్మాభిధానేన తచ్ఛబ్దస్య యుతేస్తథా. ౧౯౧

తా॥ త్వంశబ్దము దుఃఖరాహిత్యమును బోధించు తచ్ఛబ్దసంబంధము

వలన తత్పదార్థమగును. పరమాత్మరయు ప్రత్యగాత్మ బోధకమగు త్వంపద సామానాధికరణ్యమువలన అపరోక్షమగును. ౧౭౧

అవ. తత్త్వమసి యనువాక్యము అపరోక్షజ్ఞానమును గలిగించుననుటకు దృష్టాంతము:—

మూ. దశమస్త్వమసీత్యేవం వాక్యం స్యాత్ప్రత్యగాత్మని.

తా. పదిమంది గంగలో స్నానముచేసి గట్టెక్కి యందఱును తనను గాక మిగిలినవారల లెక్కపెట్టుచు పదియవవాఁడు గంగలో మునిఁగెనని దుఃఖించుచుండిరి. అప్పుడొక సత్పురుషుఁడు వారల శోకకారణమడుగఁగా పదియవవాఁడు లేఁడని విచారించుచుంటిమనిరి. ఆసజ్జనుఁ డపుడా పదిమందినిఁజూచి, 'పదియవాఁ డున్నాఁడు మునిఁగిపోలే'దని చెప్పఁగా, 'అయ్యా! ఆపదియవవానినిఁ జూపు'మని వేఁడుకొనిరి. అప్పుడా పురుషుఁడు, 'అయ్యలారా! మీరిపుడెందరున్నా'రని యడుగ, 'మేము తొమ్మండ్రమున్నా'మనిరి. అప్పుడాతఁడు 'నీ నీ తొమ్మండ్రఁగానివాఁడవేనా' యని యొక్కొకని యడుగ 'నేను లెక్కపెట్టినవాఁడ'నని యొక్కొకఁడు బదులుచెప్పెను. అంత నాపురుషుఁడు వారలలో తొమ్మండ్రను లెక్కపెట్టి యిదిగో నీవు పదియవవాఁడవు. లెక్కపెట్టినవాఁడు తనను మఱచి కొదువ వారలను లెక్కింప మీరలు తొమ్మండ్రే యనుకొని తొట్రుపడితిరని తెలియఁజెప్పఁగా వారలు సంతోషించిరి.

విమర్శకుఁడా! నీవిట్లు విమర్శించినయెడల, అహంకారాదిదేహాంత సంఘాతము జడము. వీనినిఁ గనిపెట్టెడి జీవుఁడు చేతనుఁడు. ఈచేతనుఁడు బుద్ధిప్రతిబింబుఁడు. ఈబుద్ధి జాగ్రత్స్వప్నములయందు మాత్రమే యుండును గనుక ప్రతిబింబజీవుఁ డీయవస్థలందే భాసించును. సుషుప్తియందు బుద్ధి ప్రత్యగాత్మయందు లీనమగుటచే స్ఫురింపదు. ఇట్లు సద్గురువు చెప్ప,

సుషుప్తియందు పరమాత్మ కలఁడాయని శిష్యుఁడడిగెను. తప్పక పరమాత్మ కలఁడని గురువు చెప్పఁగ, నది యెట్లో కరుణించి చెప్పుఁడని యడుగ, నొక యద్దమును జూపి, యాయద్దములోని ప్రతిబింబము నిజమా, అసత్యమా యని గురు వడిగెను. ప్రతిబింబము అసత్యమని శిష్యుఁడు చెప్పెను. ఏలయని యడుగ, ప్రతిబింబ మద్దమున్నపుడుండి, అద్దము లేనపుడు లేకపోవుననెను. అపుడు గురు విట్లు చెప్పెను. ధీమంతుఁడా! అద్దమువంటిది బుద్ధి. ముఖము వంటిది పరమాత్మ. ప్రతిబింబమువంటిది జీవుఁడు. అద్దమువంటి బుద్ధినిఁదీసి వేయఁగా ప్రతిబింబమువంటి జీవుఁడే బింబభూతమగు పరమాత్మయగును. కనుక జీవుఁడవగు నీకును పరమాత్మకునుగల యుపాధుల నుపేక్షింపఁగా చైతన్యమొకటియే నిలచియుండును. కూటస్థుఁడు బుద్ధ్యుపాధియందు ప్రతిఫలించి జీవసంజ్ఞను బొందును. జీవేశ్వరులకు ఐక్యము చైతన్యమాత్రమే యగునని సద్గురువు బోధించెను. ౧౭౨

అవ. తత్త్వంపదముల కొక్కటే యర్థమగునేని, యవి పర్యాయపదములు కాగా,నా రెండింటికి సహప్రయోగము తగ దందువేని, వానికి ప్రవృత్తినిమిత్తము వేఱగుటచే నవి పర్యాయపదములు కావని చెప్పుచున్నారు:—

మూ. స్వార్థస్య హ్యప్రహాణేన విశిష్టార్థసమర్పకౌ,
ప్రత్యగాత్మావగత్యంతౌ నాన్యోఽర్థోఽర్థాద్విరోధ్యతః.

తా. త్వం శబ్దము తచ్ఛబ్దము, ననునివి జీవేశ్వరులనెడి ముఖ్యార్థమును విడువకయే ప్రత్యగాత్మపరమాత్మలను బోధించుటచే పర్యాయపదములు కావు. విశిష్టాంశములను విడుచుటవలన శుద్ధచైతన్యమాత్రమునకు సామానాధికరణ్యము సిద్ధించును. కావున అజడార్థమే వేదాంతములందుఁ జెప్పఁబడెను. మఱియుం సువర్ణకంకణములకువలె తత్త్వంపదములకు కార్య

కారణభావములేదని "అన్యత్రాస్మాత్కృతాకృతా" త్తను (కఠ. ౨. ౧౪.) శ్రుతి చెప్పుచున్నది. ప్రత్యగాత్మపరమాత్మశబ్దములు అఖండార్థచైతన్యమునే లక్షణావృత్తిచేఁ జెప్పును. ఉపాధిసంబంధమాత్రకృతభేదముగలదగుటవలన ఈదేవదత్తుఁడప్పుడు చూడఁబడినవాఁడేయని బోధించెడి 'సోఽయం దేవదత్తః'యను వాక్యమందు తద్దేశతత్కాలములను, ఏతద్దేశతత్కాలములను బరిహరింపఁగా దేవదత్తుఁ డొకఁడే యగును. విశేషాంశములను బరిహరించుటచే నిది లక్షణావృత్తియగును. ౧౭౩

అవ. ఇట్లు వాక్యార్థ మఖండార్థబోధకమైనంతమాత్రమున ఫలము సిద్ధింపనందున, ఆఫలము సిద్ధించుటకై ప్రయత్నాంతరము నపేక్షింపరాదా యనిన, కోరిన యర్థమును వదిలి అర్థాంతరమును గల్పింపఁగా వాక్యార్థ మప్రమాణమగును అనునభిప్రాయముతో జ్ఞానమాత్రముననే ఫలము సిద్ధించునని దృష్టాంతయుక్తముగఁ జెప్పుచున్నారు:—

మూ. నవబుద్ధ్యపహారాద్ధి
స్వాత్మానం దశపూరణమ్,
అపశ్యన్ జ్ఞాతుమేవేచ్ఛే
త్స్వమాత్మానం జనస్తథా. ౧౭౪

తా. మేము తొమ్మండ్రమేయను భ్రమమూలమున దశమసంఖ్యను సంపాదించు తనను జూడక, నా పదియవవానినే తెలియఁగోరునుగాని యితఁడు మఱే దేనినింగోరఁడు. ఇట్లే ముముక్షువు భ్రాంతినివారణమునకై కారణాంతరముచే మఱచిన ఆత్మ(తన)ను దెలియఁగోరునేకాని మఱియొక దాని నపేక్షింపఁడు. ౧౭౪

అవ. ప్రకృతమున. స్వాత్మ యెవనివలన నపహరింపఁబడెనన సదృష్టాంతముగఁ జెప్పుచున్నారు:—

మూ. అవిద్యాబద్ధచక్షుష్ట్వాత్కామాపహృతధీః సదా,
వివిక్తం దృశిమాత్మానం నేక్షతే దశమం యథా.

తా. దశముఁడగువాఁడు అజ్ఞానముచే నావరింపఁబడుటచే తొమ్మిదియందుమాత్రము ధీవిక్షేపముగలిగి తనను దశమునిగఁ దెలియఁజాలనివిధమున, పామరుఁడు తన వివేకజ్ఞానము అనాదియగు అజ్ఞానముచేఁ గప్పఁబడుటవలనఁ గామక్రోధాదివిక్షేపము గలిగి దృశ్యసంఘముకంటె నన్యదృగ్రూపమగు ఆత్మస్వరూపమును దెలియఁజాలఁడు. ౧౭౫

అవ. ఆత్మజ్ఞాన మెటులఁ గలుగుననఁగా నిమిత్తమాత్రమగు శాస్త్రాచార్యోపదేశమువలనఁ దెలియఁబడునని సదృష్టాంతముగఁ జెప్పుచున్నారు:—

మూ. దశమస్త్వమసీత్యేవం తత్త్వమస్యాదివాక్యతః,
స్వమాత్మానం విజానాతి కృత్స్నాంతఃకరణేక్షణమ్.

తా. లెక్కపెట్టఁబడు తొమ్మండ్రకంటె వేఱై తత్సాక్షివియగు పదియవవాఁడవు నీవేయని తెల్పఁబడినట్లు, 'తత్త్వమసీ' త్యాదిమహావాక్యములవలనఁ దెలియఁబడు అంతఃకరణ తద్వృత్తులకంటె వేఱుగుచు వాని రాకపోకలకు సాక్షియగు ఆత్మను సద్గురుబోధవలనఁ దెలియఁగును. ౧౭౬

అవ. 'యచ్ఛబ్దయోగః ప్రాథమ్యమిత్యాద్యుద్దేశలక్షణమ్, తచ్ఛబ్ద ఏవకారశ్చ స్యాదుపాదేయలక్షణమ్'అని శాస్త్రము చెప్పుటచేత ప్రథమనిర్దిష్టము ఉద్దేశ్యము, చరమనిర్దిష్టము

విధేయమును గాఁదగి యుండఁగా, 'తత్త్వమసి' యను వాక్యమందు 'తత్' పదము ప్రథమోద్దిష్టమై విధేయమగు చున్నది. 'అహం బ్రహ్మాస్మి' యనుచోట త్వమర్థమగు 'అహ' మ్మనునది ప్రథమోద్దిష్టమై విధేయమగుచున్నది. కనుక నిచట ఉద్దేశ్యవిధేయభావ మెటుల సిద్ధించు నను శంకపైని, వేదపదములకు అర్థమునుబట్టియే సంబంధమును జెప్పవలెనుగాని పాఠక్రమనియమముతోఁ బనిలేదు 'పాత్రము తెమ్ము,' 'తెమ్ము పాత్రము' అనుచోట భేదమేమి? ప్రధానము అర్థసంబంధము వలననే గ్రహింపవలయునని చెప్పుచున్నారు:—

మూ. ఇదం పూర్వమిదం పశ్చాత్పదం వాక్యం భవేదితి,
అన్వయవ్యతిరేకాభ్యాం తతో వాక్యార్థబోధనమ్. *

తా. పాఠనియమము లేకపోయినను ప్రసిద్ధపదమును ఉద్దేశించి అప్రసిద్ధార్థము బోధింపఁబడును. 'ప్రసిద్ధముద్దిశ్యానూద్యాప్రసిద్ధో బోధ్యతే.' యనున్యాయముచే ప్రసిద్ధములగు 'త్వం' 'అహం' పదములు మొదటను, అప్రసిద్ధములగు 'బ్రహ్మ' 'సత్' పదములు తరువాతను బ్రయోగించిన వాక్యార్థము కలుగును, అనెడి నియమమున్నను త్వమర్థమగు జీవుఁడు అర్థక్రమము బలీయమను నర్థబోధకమగు 'పాఠక్రమాదర్థక్రమో బలీయాన్' అనున్యాయముంబట్టి తత్పదార్థపరమాత్మయగునని యిట్లు బోధింపఁబడెను.

* ౧౭౭ శ్లోకమునకు ద్వితీయపాదము శ్రీరంగప్రతిరీత్యా 'నియమో నైవ వేదేఽస్మిన్ పదసాంగత్యమర్థతః.' అని యున్నది. బొంబాయి ప్రతిలో నీపాదము ౧౭౮ శ్లోకములో చేరినది.

అవ. ఈ చెప్పఁబడిన యర్థమునకుఁ గారణమును జెప్పు చున్నారు:—

మూ. వాక్యే హి శ్రూయమాణానాం పదానామర్థసంస్మృతిః,
నియమో నైవ వేదేఽస్తి పదసాంగత్యమర్థతః. ౧౭౮

తా. వేదమందు ఈపదము ముందు ప్రయోగింపవలెను, ఈపదము తరువాత ప్రయోగింపవలెను అను నియమములేక, అర్థమువలననె పదసంగతి కలుగును గనుక వాక్యమందుండెడి పదములంబట్టి అర్థము స్మరింపఁబడును.

అవ. ఆచార్యునిచే 'బ్రహ్మము నీవ' యని బోధింపఁబడి నపుడుకదా, 'నేను బ్రహ్మ మెటులగుదు' నని శిష్యుఁడు గురువును బ్రశ్నించును. అట్లు కాదేని వాక్యము సాక్షాద్బోధ జననసమర్థము కాదని తోఁచునను శంకకు సమాధానము:—

మూ. యదా నిత్యేషు వాక్యేషు పదార్థస్తు వివిచ్యతే,
వాక్యార్థజ్ఞానసంక్రాన్త్యై తదా ప్రశ్నో న యుజ్యతే.

తా. స్వతస్సిద్ధములగుచు నర్థాంతరరహితములగు వేదవాక్యములందు పదార్థజ్ఞానమువలన వాక్యార్థజ్ఞానమును గ్రహించునపుడు ప్రశ్నాపేక్ష లేదు.

అవ. పదార్థతత్త్వమెఱుఁగనివానికే ప్రశ్నాపేక్షయను టను స్పష్టపరుచుచున్నారు:—

మూ. అన్వయవ్యతిరేకోక్తిః పదార్థస్మరణాయ తు,
స్మృత్యభావే న వాక్యార్థో జ్ఞాతుం శక్యోహి కేనచిత్.

తా. పదార్థస్ఫూర్తిలేనిదే వాక్యార్థము తెలియఁబడదు. కనుక పదార్థస్ఫూర్తినిమిత్తము అన్వయవ్యతిరేకములు చెప్పఁబడెను. ౧౮౦

అవ. అందులోను త్వంపదార్థశోధన మత్యంతప్రయత్నముతోఁ జేయవలెనని చెప్పుచున్నారు:—

మూ. తత్త్వమస్యాదివాక్యేషు త్వంపదార్థావివేకతః,
వ్యజ్యతే నైవ వాక్యార్థో నిత్యముక్తోఽహమిత్యతః.

తా. తత్త్వమస్యాదివాక్యములందలి త్వంపదార్థమును లెస్సగ విమర్శింపక నేను నిత్యముక్తుఁడనను వాక్యార్థము స్ఫురింపదు. ౧౮౧

అవ. ఇట్టివిమర్శవలనఁ గలుగుప్రయోజనమును జెప్పుచున్నారు:—

మూ. అన్వయవ్యతిరేకోక్తిస్తద్వివేకాయ నాన్యథా,
త్వంపదార్థవివేకే హి పాణావర్పితబిల్వవత్. ౧౮౨
వాక్యార్థో వ్యజ్యతే చైవం కేవలోఽహం పదార్థతః,
దుఃఖీత్యేతదపోహేన ప్రత్యగాత్మవినిశ్చయాత్.

తా. కనుకనే (పూర్వశ్లోకముతోనన్వయము) త్వంపదార్థశోధనమునకై అన్వయవ్యతిరేకములు చెప్పఁబడినవి. త్వంపదమునకు ముఖ్యార్థము చిదాభాసుఁడగు జీవుఁడు (చిత్తుయొక్క ప్రతిబింబము). అద్దము వంటి బుద్ధి లేనిసమయమున నీ జీవుఁడు మిథ్యయగును. ఏలయన, అద్దములేని సమయమున ముఖప్రతిబింబము ముఖమునందు లీనమగుచు వాస్తవముకాని యట్లు, బుద్ధిలీనమైయుండు సుషుప్త్యవస్థయందు ప్రతిబింబమగు చిదాభాసుఁడును (జీవుఁడును) బింబభూతచిత్తునందు విలీనమగును. ఇట్లు త్వంపదముయొక్క ముఖ్యార్థమగు జీవాంశమును విడిచి, జహదజహల్లక్షణచే

లక్ష్యార్థమగు శుద్ధచైతన్యమును గ్రహింపఁగా, 'అహం బ్రహ్మాస్మి' యను వాక్యార్థము చైతన్యమాత్రముగ శేషించును. ఇట్టి విమర్శవలన వాక్యార్థము హస్తగతబిల్వమువలె స్ఫుటమగును. 'అహం దుఃఖీ'యను వాక్యమందలి దుఃఖీయను నంశము దేహతాదాత్మ్యమువలనఁ గలిగినదని విమర్శించి దానినిఁ బరిహరింపఁగా ప్రత్యగాత్మయే స్ఫురించును. దుఃఖాదిసంసారము జీవధర్మమే కాని ఆత్మధర్మము కాదనియు, జీవుఁడు ప్రతిబింబమాత్రుఁడగుటచే మిథ్యయనియుఁ, దెలియుట 'విద్య' యనియు, నీ విద్య కార్యసహితమగు అవిద్యను దొలఁగించుననియు పంచదశీ చిత్రదీపప్రకరణమందు శ్రీ విద్యారణ్యులు ఆనతిచ్చిరి. ౧౮౩

అవ. పూర్వోక్తన్యాయానుసరణముగఁ జెప్పఁబడిన వాక్యమువలననే అపరోక్షాఖండ బ్రహ్మాత్మజ్ఞానమును బోధించి, యిచట,పూర్వవాది చేయు వికల్పములు నిర్మూలములని చూపుచున్నారు:—

మూ. తత్రైవం సంభవత్యర్థే శ్రుతహానాశ్రుతార్థధీః,
నైవ కల్పయితుం యుక్తా పదవాక్యార్థకోవిదైః.౧౮౪

తా. శాస్త్రాదేశమువలన పదవాక్యార్థము లిట్లు స్పష్టమగుచుండఁగా బుద్ధిమంతులు శ్రుత్యర్థమును వదిలి అశ్రుతార్థమును గ్రహింపరాదు.

అవ. వ్యాఖ్యానుసారముగ వాక్యార్థము స్పష్టమగుచుండఁగా, 'ప్రత్యక్షాదివిరుద్ధేఽర్థే వాక్యస్యాబాధదర్శనాత్' అనున్యాయమునను, ప్రత్యక్షవిరోధమునను శ్రుతహాన్యాది కల్పనము తగదని చెప్పుచు, పూర్వవాది దృష్టాంతపూర్వకముగ శంకించుచున్నాఁడు:—

మూ. ప్రత్యక్షాదీని బాధేరన్కృష్ణలాదిషు పాకవత్,
అక్షజాదినిభై ర్నైతైః కథం స్యాద్వాక్యబాధనమ్.౧౮౫

తా. కృష్ణలాన్ శ్రపయేత్=సువర్ణశకలములను వండవలెనని ప్రత్యక్షముగ వినఁబడు శ్రుతి బాధింపఁబడును. ఆసువర్ణశకలములు బియ్యపుగింజలవలె విశీర్ణావయవములు కానేరవుకనుక పాకక్రియాసాధ్యమగు సంస్కారము మాత్రమే యచట గ్రహింపఁబడును. అట్లే యిచట భేదగ్రాహకములగు ప్రత్యక్షాదిప్రమాణములు అఖండార్థమును బాధించును. ఆత్మ బ్రహ్మమని సద్గురూక్తివలన వినినను పూర్ణముగ కనుపింపనందున 'తత్త్వమసి,' 'సత్యం జ్ఞానమనంతంబ్రహ్మ' యను వాక్యములు ప్రసంఖ్యానమువలన ఆత్మశోభాకరములు మాత్రములే యగునను వాదమును నిరాకరించుచున్నాఁడు— అక్షజాదీతి—కర్తృత్వాద్యాభాసము సత్య మగునేని ప్రత్యక్షాదులు ప్రమాణములగుచు మహావాక్యార్థమును బాధించును. ఈకర్తృత్వాదికము ప్రత్యక్షమునుగాదు సత్యమునుగాదు. ఆత్మయందారోపింపఁబడిన అహంకారాదిసంసర్గము లేనిది కర్తృత్వభోక్తృత్వదుఃఖిత్వములు సంభవింపవని నిరాకరింపఁబడుటవలన ప్రత్యక్షాభాసములగు కర్తృత్వాదులచేత ప్రమాణభూతవాక్యార్థమునకు బాధ కలుగనేరదు. బ్రహ్మజ్ఞానమువలన సంస్కారముగల ఆత్మకు అన్యత్రవినియోగము లేనందున మహావాక్యములు ఆత్మసంస్కారమాత్రమునకేయని చెప్పనొప్పదు. మఱి, వెంటనే బ్రహ్మత్వమేల సాక్షాత్కరింపఁబడదందువేని పదార్థశోధన మతిదృఢముగ లేనందున సాక్షాత్కారము వెంటనే కలుగలేదని చెప్పఁబడెను. ౧౮౫

అవ. ఇట్లు ప్రత్యక్షప్రమాణమువలన వాక్యార్థమునకు బాధలేకున్నను ప్రత్యక్షముగ దుఃఖము ననుభవించుచున్న

వాఁడు నేను సుఖవంతుఁడనని తలంపఁడు కదా యని పూర్వపక్షి శంకించుచున్నాఁడు:—

మూ. దుఃఖ్యస్మీతి సతి జ్ఞానే నిర్దుఃఖీతి న జాయతే,
ప్రత్యక్షాదినిభత్వేఽపి వాక్యాన్న వ్యభిచారతః. ౧౮౬

తా. దుఃఖమును బ్రత్యక్షముగ ననుభవించునపుడు 'నేను సుఖవంతుఁడ'ననెడి జ్ఞానము కలుగదుకద. ఇట్లుండ, విరోధము లేనందున ప్రత్యక్ష ప్రమాణము ప్రబలమని పూర్వపక్షి చెప్పఁగా, అధ్యాసకాలమున దుఃఖము ప్రత్యక్షముగ నుండినను జ్ఞానము కలిగినపుడు ఈదుఃఖము లేకపోవును గనుక, అది ప్రత్యక్షమువంటిదే కాని నమ్మఁదగినది కాదని సిద్ధాంతి సమాధానము చెప్పెను. ౧౮౬

అవ. ఈ ప్రత్యక్షము ఆభాసముకనుక నమ్మఁదగినది కాదనుటకు దృష్టాంతమును జెప్పుచున్నారు:—

మూ స్వప్నే దుఃఖ్యహమధ్యాసం దాహచ్ఛేదాదిహేతుతః,
తత్కాలభావిభిర్వాక్యైర్న బాధః క్రియతే యది.

తా. స్వప్నమందు నా ముక్కు నెవఁడో కోసెననెడి దుఃఖము ననుభవించితిని. అపుడు నాతోఁబుట్టువు బోధింపఁగా నా యధ్యస్తదుఃఖము తొలఁగెను. ఇట్టి యనుభవమునుబట్టి దుఃఖము బుద్ధిధర్మమేగాని ఆత్మధర్మము కాదు. అప్పుడు చెప్పిన ఆప్తవాక్యమువలన దుఃఖము లేకపోయె నందువేని.

అవ అట్లయినను దుఃఖమాత్మ కన్నియవస్థలలోను నుండక బుద్ధితోఁగూడ నుండును, ఆత్మయన్ననో వ్యభిచరింపక యన్నియవస్థలలోను నుండునని చెప్పుచున్నారు:—

మూ. సమాప్తే స్వప్నే దుఃఖస్య ప్రాక్ప తద్బాధ ఇష్యతామ్,
న హి దుఃఖస్య సంతానో భ్రాంతేర్వా దృశ్యతే
క్వచిత్. ౧౮౮

తా. స్వప్నమందు అనుభవకాలమున దుఃఖముండినను పూర్వపరావస్థలలో లేనందున, శుక్తియం దారోపింపఁబడిన రజతమువలె నా దుఃఖము అసత్యమే యగును. ఏలయన, స్వప్నదుఃఖము తత్కాలమందే యున్నది. ఆత్మ జాగ్రత్సుషుప్తులయందును నున్నది కాని యా దుఃఖములేదు. కావున, ఆగంతుకమగు దుఃఖము నిర్వికారాత్మకు సహజధర్మము కాదు. కనుక దుఃఖమాగంతుకము కాఁగా శుక్తియొక్క యథార్థజ్ఞానము ఆరోపితరజతజ్ఞానమును బాధించునట్లు ప్రమాణజ్ఞానము దుఃఖిత్వాదికమును బాధించుచునే తత్త్వమస్యాదిమహావాక్యములవలనఁ గలుగును. కనుక మహావాక్యములందు నిట్టి సామర్థ్యము కలదా లేదాయని సందేహింపఁదగదు. ౧౮౮

అవ. ఈ కారణములనుబట్టి మహావాక్యము ప్రత్యక్షప్రమాణముకంటె దుర్బలమైనది కాదని చెప్పుచున్నారు:—

మూ. ప్రత్యగాత్మన ఆత్మత్వం దుఃఖ్యస్మీత్యస్య బాధయా,
దశమం నవమస్యేవ వేద చే దవిరుద్ధతా. ౧౮౯

తా. లెక్కపెట్టఁబడుచున్న—తొమ్మండ్రకంటె వారలను లెక్కపెట్టు పదియవవాఁడు వేఱగునట్లు, 'నేను దుఃఖిని'యని కలిగిన భ్రాంతి స్వాత్మబోధచే బాధింపఁబడఁగా, బాధ్యములగు దేహాద్యహంకారములకు ప్రత్యగాత్మ సాక్షియేయని తెలిసికొనినచో విరుద్ధము లేదని భావము.

అవ. ఇదివఱకు విస్తరించి చెప్పిన విషయమును నాల్గు శ్లోకములతో సంగ్రహముగఁ జెప్పుచున్నారు:—

మూ. నిత్యముక్తత్వవిజ్ఞానం వాక్యాద్భవతి నాన్యతః,
వాక్యార్థస్యాపి విజ్ఞానం పదార్థస్మృతిపూర్వకమ్. ౧౯౦
అన్వయవ్యతిరేకాభ్యాం పదార్థః స్మర్యతే ధ్రువమ్,
ఏవం నిర్దుఃఖమాత్మాన మక్రియం ప్రతిపద్యతే. ౧౯౧
సదేవేత్యాదివాక్యేభ్యః ప్రమా స్ఫుటతరా భవేత్,
దశమస్త్వమసీత్యస్మా ద్యథైవం ప్రత్యగాత్మని. ౧౯౨
ప్రబోధేన యథా స్వాప్నం సర్వదుఃఖం నివర్తతే,
ప్రత్యగాత్మధియా తద్వద్దుఃఖిత్వం సర్వదాత్మనః. ౧౯౩

తా. పదార్థజ్ఞానమువలన తెలిసిన వాక్యార్థజ్ఞానమువలన మోక్షము కలుగును. ఆరోపితసకలపదార్థములందును చైతన్యమనువర్తించును. స్థూలదేహము సూక్ష్మమందులేదు. సూక్ష్మదేహము కారణమందులేదు. ఈమూఁడు శరీరములును శుద్ధచైతన్యమందు లేవు. ఇట్లు ఆత్మనిష్క్రియమనియుఁ దుఃఖరహితమనియుఁ దెలియవలెను. ఈ జ్ఞానము, గణ్యములను లెక్కించు గణకుఁడవగు నీవే పదియవవాఁడవనునట్లు, సకలపదార్థసాక్షియగు చైతన్యము నీవేయని 'సదేవసోమ్యేదమగ్రఆసీ'దిత్యాది శ్రుతివాక్యములు బోధించును. మఱియు, మేల్కొనినపుడు స్వప్నప్రపంచము మిథ్యయై బాధింపఁబడఁగా, ఆ స్వప్నావస్థయందుఁ గలిగినదుఃఖము తొలఁగినట్లు, ఆత్మ దేహత్రయసాక్షి యనెడి జ్ఞానమును సర్వదా భావించుటవలన దేహాభిమానమువలనఁ గలిగిన దుఃఖము తొలఁగును. ౧౯౦-౧౯౩

అవ. ౧౮౫-వ శ్లోకమందుఁ జెప్పఁబడిన కృష్ణలాదిపాక దృష్టాంతము పరమాత్మవిషయము కాదని చెప్పుచున్నారు:—

మూ. కృష్ణలాదౌ ప్రమాజన్మ తదన్యార్థాఽమృదుత్వతః,
తత్త్వమస్యాదివాక్యేషు న త్వేవమవిరోధతః. ౧౯౮

తా. కృష్ణలాదివాక్యమున ప్రత్యక్షశ్రుతివలన సత్యజ్ఞానమే కలుగును. కృష్ణలములనఁగా సువర్ణశకలములు. ఇవి కఠినములు గనుక పచనార్థములు కావు. కనుక నచట ప్రత్యక్షశ్రుతికి బాధ కలిగెను. ౧౯౮

అవ. ప్రస్తుతమహావాక్యార్థమున నట్టి విరోధము లేదని చెప్పుచున్నారు:—

మూ. వాక్యే తత్త్వమసీత్యస్మిన్ జ్ఞాతార్థం తదసిద్వయమ్,
త్వమర్థే సత్యసాహాయ్యాద్వాక్యం నోత్పాదయేత్ప్రమామ్. ౧౯౯

తా. తత్త్వమస్యాది వాక్యములందుఁగల త్వంపదార్థమును వివేచన చేయనందున వాక్యార్థము తెలియఁబడదనుమాటనే యిపుడు వివరించుచు, త్వంపదముయొక్క అర్థము నధికశ్రద్ధతో విమర్శింపవలయునని సూచించుచున్నారు—వాక్యేతత్త్వమసీతి—ఈ శ్లోకములో 'తత్త్వమసి' యను మహావాక్యమందునున్న తత్ త్వం అసి యను మూఁడుపదములలో, తత్ = బ్రహ్మము, అసి=ఐతివి యను నర్థములు సుప్రసిద్ధములు. త్వంపదముయొక్క అర్థము సహాయశూన్యమగుటచే ప్రృథముగఁ దెలియఁబడక యీ మహావాక్యము నిశ్చితమగు అపరోక్షానుభవమును గలిగింపఁజాలదని భావము.

అవ. ఇపుడు అసిపదముయొక్క ఉపయోగమును జెప్పుచున్నారు:—

మూ. తత్త్వమో స్తుల్యనీడార్థమసీత్యేతత్పదం భవేత్. ౧౯౬

తా. 'తత్ త్వం' అని మాత్రము చెప్పి 'అసి'యని చెప్పనియెడల చేయుము, ఆలోచింపుము మొదలగు నన్యవ్యాపారము కలుగవలసివచ్చును. అట్లుగాక 'నీవు ఆబ్రహ్మవే' యని సామానాధికరణ్యమును (ఏకార్థమును) అసిపదము బోధించుచున్నది. 'తదేవ త్వం' 'త్వం తదేవ' యని కైవల్యోప నిషత్తుకూడ దీనినే బోధించుచున్నది. ౧౯౬

అవ. అన్యాకాంక్ష లేక సామానాధికరణ్య ముండిన నేమి ఫల మనుశంక కుత్తరము:—

మూ. తచ్ఛబ్దః ప్రత్యగాత్మార్థ స్తచ్ఛబ్దార్థ స్త్వమ స్తథా,
దుఃఖిత్వాత్ప్రత్యగాత్మత్వం వారయేతాముభావపి. ౧౯౭

తా. సామానాధికరణ్యమనఁగా ఏకవిభక్తిగల పదద్వయము, అనఁగా కర్మధారయసమాసము "తదేవ త్వం, త్వం తదేవ" అని తత్త్వంపదముల కైక్యము (అభేదము)ను చెప్పుటచేత త్వంపదము దుఃఖభాగి కాదనియుం. తత్పదము పరోక్షము కాదనియును సిద్ధించును. ౧౯౭

అవ. వాక్యార్థము నిట్లు శోధింపఁగా, అద్వితీయత్వ బోధకశ్రుతికి విరోధము లేదని చెప్పుచున్నారు:—

మూ. ఏవం చ నేతినేత్యర్థం గమయేతాం పరస్పరమ్. ౧౯౮

తా. తత్ త్వంపదములకు సామానాధికరణ్యముచేతను, భాగత్యాగ లక్షణచేతను ఐక్యము సిద్ధింపఁగా 'నేతినేతి' యను శ్రుత్యర్థమునే తత్ త్వం పదములు తెలియపర్చును. 'నేతినేతి' యను శ్రుతికి ఆరోపితనామరూప

పరిహారముచేత అధిష్ఠానచైతన్యమాత్ర శేషమని భావము. ఇచట పరిహార మనఁగా మిథ్యయనియు, శేషమనఁగా సత్యమనియు నర్థములు ౧౫౦

అవ. మహావాక్యార్థవిమర్శవలన ఆరోపితనామరూపపరిహారము అధిష్ఠానసత్యత్వరూపఫలమే కాకుండ, పూర్వవాది చెప్పిన శ్రుతహాని,అశ్రుతకల్పన యనెడి దోషద్వయనివృత్తియు ఫలమని చెప్పి విరమించుచున్నారు:—

మూ. ఏవం తత్త్వమసీత్యస్య గమ్యమానే ఫలే కథమ్,
అప్రమాణత్వమస్యోక్త్వా క్రియాపేక్షత్వముచ్యతే.

తా. ఇట్లు తత్త్వమసి యను వాక్యములో త్వంపదమునకు దుఃఖాభావమును, తత్పదమునకు పరోక్షత్వాభావము (ప్రత్యక్షత్వము)ను ఫలములు స్పష్టముగఁ గనుపించుచుండ నీమహావాక్యము ప్రమాణము కాకపోదు. మహావాక్యము వ్యాపారాంతరాపేక్ష లేకయే స్వతఃప్రమాణ మగును. ౧౫౧

అవ. ఈ విమర్శవలన మహావాక్యమునకు వ్యాపారాంతరాపేక్ష లేదని ధ్రువపఱిచి విరమించుచున్నారు:—

మూ. తస్మాదాద్యంతమధ్యేషు కుర్వి త్యేతద్విరోధ్యతః,
న కల్ప్యమోఽశ్రుతత్వాచ్చ శ్రుతత్యాగోఽప్యనర్థకః.

తా. కావున, ఆద్యంతమధ్యేషు='తత్త్వమసి' యని ప్రథమోపదేశమందును, తత్త్వంపదార్థములను శోధించు మధ్యకాలమందును, సంశయరహితముగ బ్రహ్మానుభవకాలమందును, కురు=చేయుమని యెడి అనుష్ఠానమును గల్పింపము. ఏలయన,'కురు' అను క్రియ తదర్థజ్ఞానమునకు విరోధియగును. ఇంతియేకాక 'తత్త్వమసి'యను వాక్యములో 'అసి'పదము కుర్విత్యాదిపద

ముల యర్థమగు అనుష్ఠానాదికమును నివారించుచున్నందున అనుష్ఠానము శ్రుతిసిద్ధము కానేరదు. మఱియుఁ, అప్రాప్తమగు తత్త్వమర్థస్వరూపము చింతింపఁదగినదిగ విధింపఁదగదు. ఏలయన, తత్త్వంపదార్థైక్యము విమర్శము ననేకాని యన్యమగు ననుష్ఠానాదికమువలనఁ గలుగదు. సిద్ధమగు తత్త్వంపదైక్యమును వదలి చింతనవిధినే యెట్టకేలకు అంగీకరించితిమేని చింత్య బ్రహ్మసాక్షాత్కారము ప్రమాణము కానందున అవిద్యానివృత్తిరూపఫలము సిద్ధింపదు. అప్పుడు ప్రసంఖ్యానవిధి వ్యర్థమగును. ౨౦౦

అవ. ఉక్తార్థమును బాగుగ గ్రహింపక పూర్వపక్షి తిరిగి యాక్షేపించుచున్నాఁడు:—

మూ. యథాఽనుభూయతే తృప్తిర్భుజేర్వాక్యాన్న గమ్యతే,
వాక్యస్య విధృతిస్తద్వద్ధోశకృత్వాప్యసీక్రియా. ౨౦౧

తా. 'భోజనమువలనఁ దృప్తికలుగును', అనునది వాక్యమాత్రమునఁ గలుగదు. భుజియించుటవలననే కలుగవలయును. ఇట్లే, 'తత్త్వమసి' యను వాక్యమును వినినమాత్రమున మోక్షము కలుగునని చెప్పుట,గోమయముతో పరమాన్నమునువండునట్లు పరిహాసాస్పద మగునుగాని,అనుష్ఠానములేని వాక్య శ్రవణము సఫలము కాదని పూర్వపక్షి యభిప్రాయము. ౨౦౧

అవ. వాక్యార్థము సామాన్యముగ అపరోక్షజ్ఞానమును గలిగింపఁజాలదనెడి పూర్వపక్షివాక్యము నంగీకరించుచు, విశేషవాక్యము అపరోక్షజ్ఞానమును గలిగించునని సిద్ధాంతి చెప్పుచున్నారు:—

మూ. సత్యమేవ మనాత్మార్థవాక్యాత్పారోక్ష్యబోధనమ్,
ప్రత్యగాత్మని న త్వేవం సంఖ్యాప్రాప్తివదధ్రువమ్. ౨౦౨

తా. ఔను, నిజమే. ఆప్తేతరవాక్యములందు పరోక్షజ్ఞానమే కలుగునుగాని దశమునియందువలెనే ప్రత్యగాత్మయందు అపరోక్షజ్ఞానము సందియములేక కలుగును. తొమ్మండ్రను లెక్కపెట్టిన గణకుఁడగు పదియవవాఁడు నీవేకద అట్లే జడజాతమును దెలిసికొను జీవుఁడవగు నీవే తత్త్వమసి మహావాక్యమువలన పరమాత్మవని అపరోక్షానుభవమును బొందుము. ౨౦౨

అవ. ఇక్కడమాత్ర మిట్లు చెప్పనేల యనిన, స్వతోఽపరోక్షప్రత్యగాత్మయే పరమాత్మయని ఉపదేశించుటవలన నిట్లు తెలియవలెనని చెప్పుచున్నారు:—

మూ. స్వయంవేద్యత్వపర్యాయః స్వప్రమాణక ఇష్యతామ్,
నివృత్తావగమ స్సిద్ధిః స్వాత్మనోఽనుభవశ్చ నః. ౨౦౩

తా. స్వయంవేద్యము స్వప్రకాశమునగు ఆత్మ ప్రమాణాంతరముచే సాధింపఁదగినది కాదు. మహావాక్యశ్రవణమువలన అహంకారము తొలఁగఁగా, అనఁగా అహమునకును బ్రహ్మమునకును అభేదవృత్తి కలుగఁగా, స్వాత్మానుభవసిద్ధి కలుగును. గణకుఁడగు తానే దశముఁడైనట్లు పరోక్షముగ నెంచఁబడు ప్రత్యగాత్మ తానే యగును. ౨౦౩

అవ. ఆగంతుకమై పోవుచుండుటవలన దుఃఖము ఆత్మధర్మము కాదు. ఇష్టవస్తునాశమువలనను, అనిష్టవస్తుప్రాప్తివలనను గలిగెడి దుఃఖము విషయధర్మమే యని చెప్పుచున్నారు:—

మూ. బుద్ధీనాం విషయో దుఃఖం నాయస్య విషయా మతాః,
కుతోఽస్య దుఃఖసంబంధో దృశేః స్యాత్ప్రత్యగాత్మనః.

తా. 'నేను దుఃఖితుఁడను' అను జ్ఞానము బుద్ధివృత్త్యాశ్రయాహం కర్తృత్వమువలన విషయభూతమగునుగాని, ఆయహంకారమునకు సాక్షి యగు ఆత్మధర్మము కాదు. ౨౦౪

అవ. ప్రత్యగాత్మ సకలధర్మరహిత మగునెడల, నా ప్రత్యగాత్మ ఎటుల ననుభవగోచరమగునను శంకకుత్తరము:—

మూ. దృశిరేవానుభూయేత స్వేనైవానుభవాత్మనా,
తదాభాసతయా జన్మ ధియోఽస్యానుభవః స్మృతః.

తా. అనుభవస్వరూపమగు దృక్కు (ఆత్మ) తనచేతనేకాని యితరముచేత ననుభవింపఁబడదు. చిదాభాసవ్యాప్తమగు బుద్ధివృత్తియే ఆత్మకు ఆగంతుకమగునని పెద్దలు నుడువుదురు. ౨౦౫

అవ. ప్రసంఖ్యానప్రాప్తిని ప్రకారాంతరముచే నిరాకరించుచున్నారు:—

మూ. అశనాయాదినిర్ముక్తః సిద్ధో మోక్షస్త్వమేవ సః,
శ్రోతవ్యాది తవేత్యేతద్విరుద్ధం కథముచ్యతే. ౨౦౬

తా. అశనాయ యన ఆఁకలి. ఈ అశనాయాపిపాసలు ప్రాణధర్మములు. శోకమోహములు మనోధర్మములు. జననమరణములు దేహధర్మములు. ఈయారుధర్మములును ఆత్మకు లేవు. "క్షుత్పిపాసే ప్రాణధర్మౌ శోకమోహౌ తు మానసౌ, జన్మమృత్యూ దేహధర్మౌ షడూర్మిరహితశ్శివః" అని ఆచార్యులు నుడివిరి.

సర్వసంస్కారవినిర్ముక్తము నిత్యసిద్ధమునగు బ్రహ్మము నీవేయని ఆచార్యుఁడు చెప్పఁగా ముక్తుఁడ వగునీకు శ్రవణమననక్రియలు కర్తవ్యముగ

మిగిలినవని విరుద్ధముగ నెట్లు చెప్పఁదగును? వికారరహితమగు బ్రహ్మము కర్తయుం గాదు. కర్తృత్వ ముండెనేని భోక్తృత్వదుఃఖిత్వాదికమంతయు నుండవలసివచ్చును గనుక ఆత్మకు క్రియావత్త్వము విరుద్ధమగునని యాక్షేపము. ౨౦౬

తత్త్వనిరూపణము.

అవ. తత్త్వ మెద్దియనః—

మూ. నేత్యతీత్యేవ చేత్తత్స్యాచ్ఛ్రవణాది తదా భవేత్,
మోక్షస్యానిత్యతైవం స్యాద్విరోధే నాన్యథా వచః.

తా. బ్రహ్మము స్వతస్సిద్ధమగునని చెప్పియుంటిమి. తదర్థమై శ్రవణాదిసాధనములను జెప్పినపుడుగద మోక్షము=బ్రహ్మము, సాధ్యము = అనిత్యము అగును. కావున ఉపదేశవాక్యమునకు అన్యథావిపరిణామము చేయవలనుపడదు. ౨౦౭

అవ. దీనింబట్టియు ప్రసంఖ్యానవాదము తగదను శంకకుత్తరముః—

మూ. శ్రోతృశ్రోతవ్యయోర్భేదో యదీష్టః స్యాద్భవేదిదమ్,
ఇష్టార్థకోప ఏవం స్యాన్న యుక్తం సర్వథా వచః.

తా. ఇది శ్రోతవ్యము (వినఁదగినది), ఇతఁడు శ్రోత (వినువాఁడు) అనెడి భేదముండునేని యపుడు ప్రసంఖ్యానము ఉండవచ్చును. కర్తృకర్మభేదము లేనపుడు కార్యమేమియు నుండదు. భేదముండిన నేమి హాని వచ్చునను శంకపైనిఁ జెప్పుచున్నాఁడు—'ఇష్టార్థేతి' జీవుఁడు బ్రహ్మమే

యని బోధించుట యిట నిష్ఫార్థము. భేదగ్రహణ మున్నప్పుడు ఒకనితో వే ఱొకనికి అభేదము పొసఁగదు కనుక జీవబ్రహ్మైక్యము దుస్సంపాదమగునని భావము. ౨౦౮

అవ 'న యుక్తం వచః' అను మాటను స్పష్టపరుచుచున్నారు:—

మూ. సిద్ధో మోక్షోఽహమిత్యేవ జ్ఞాత్వాఽఽత్మానం భవేద్యది,
చికీర్షుర్యః స మూఢాత్మా శాస్త్రం చోద్ఘాటయత్యపి.

తా. మోక్షము (బ్రహ్మము) సిద్ధపదార్థము కాని సాధ్యము కాదని తెలిసియుం పనిచేయఁ గోరువాఁడు మూఢుఁడు. శాస్త్రమునుగూడ వ్యర్థము జేసినవాఁడే యగును. ౨౦౯

అవ. మూఢాత్మత్వమును బ్రకటించుచున్నారు:—

మూ. నహి సిద్ధస్య కర్తవ్యం సకార్యస్య న సిద్ధతా,
ఉభయాలంబనం కుర్వన్నాత్మానం వంచయత్యపి ౨౧౦

తా. సిద్ధవస్తువునకుఁ జేయఁదగిన పనిలేదు. చేయఁబడినది సాధ్యమే కాని సిద్ధము కాదు. ఈ విరుద్ధధర్మములు రెండు నొకపదార్థమునకు సంభవింపవు. ౨౧౦

అవ. మాయభిప్రాయమును గ్రహింపక నిందింపఁదగదని పూర్వపక్షి తన యభిప్రాయమును జెప్పుచున్నాఁడు:—

మూ. సిద్ధో మోక్షస్త్వమిత్యేతద్వస్తుమాత్రం ప్రదర్శయేత్,
శ్రోతుస్తథాత్వవిజ్ఞానే ప్రవృత్తిః స్యాత్కథం త్వితి.

తా. సిద్ధమగు మోక్షము నీవయని చెప్పుటచేత, మోక్షమును గోరువాఁడు ఆత్మజ్ఞానమును సంపాదించుటకుఁ బ్రయత్నింపవలయుననియే చెప్పఁబడెనుగాని, యిది తత్త్వార్థమును బోధింపనేరదు. ౨౧౧

అవ. ఉక్తార్థమును బూర్వవాది వివరించుచున్నాఁడు:—

మూ. కర్తా దుఃఖ్యహమస్మీతి ప్రత్యక్షేణానుభూయతే,
కర్తా దుఃఖీ చ మా భూవమితి యత్నో భవేత్తతః.

తా. నేను కర్తను దుఃఖవంతుఁడను అని ప్రత్యక్షముగ ననుభవింపఁబడుచున్నది కనుక, నేను అకర్తననియు దుఃఖములేనివాఁడననియుఁ దెలియుటకై యత్నింపవలెను. ౨౧౨

అవ. మఱియు, 'తత్త్వమసి' మహావాక్యమును వినినపిమ్మట 'మంతవ్యః'—వినినయర్థమును యుక్తిపూర్వకముగ విమర్శింపవలయునను వేదవిధివలనను నిట్లే యొప్పవలయునని చెప్పుచున్నాఁడు:—

మూ. తద్విజ్ఞానాయ యుక్త్యాది కర్తవ్యం శ్రుతిరబ్రవీత్,
కర్తృత్వాద్యనువాదేన సిద్ధత్వానుభవాయ తు. ౨౧౩

తా. 'జీవుఁడవగు నీవు ప్రజ్ఞానస్వరూపసిద్ధబ్రహ్మమవు' అని గురువాక్యమును యుక్తిపూర్వకముగ మననముచేయవలయునని, తల్లివలె సాదరముగ శ్రుతి బోధించెను. కావున ప్రయత్నరూపకర్తవ్యము మిగిలియున్నది అని పూర్వపక్షి యభిప్రాయము. ౨౧౩

అవ. ఈ కల్పన శ్రుతి (సిద్ధాంత) సమ్మతము కాదని సిద్ధాంతి దూషించుచున్నాఁడు:—

మూ. నిర్దుఃఖో నిష్క్రియోఽకామః సిద్ధో మోక్షోఽహమి
త్యపి, గృహీత్వైవ విరుద్ధార్థమాదధ్యాత్కథమేవసః.

తా. చిన్మాత్రస్వరూపుఁడన 'వ్యాపారముగాని దుఃఖముగాని వాస్త వముకావు. ఇవి అంతఃకరణధర్మములు. నేను సిద్ధమోక్షస్వరూపుఁడను' అని యిట్లు తెలిసియు నేతద్విరుద్ధార్థము నెట్లు గ్రహింపనగును? వాక్యార్థజ్ఞాన ము వాక్యమువలన గలుగదనుట శాస్త్రమునకును అనుభవమునకును విరుద్ధము కావున జ్ఞానముకలిగినపిమ్మట కర్తవ్యము కలదని విలక్షణవిపక్ష చేయఁదగదు.

అవ. వాక్యమువలననే నిర్దుఃఖాదిలక్షణమోక్షాత్మసా క్షాత్కారము కలుగునెడల, అహందుఃఖీత్యాది తద్విరుద్ధాకా రానుభవ మెటులఁ గలుగుచున్నదియని శంక:—

మూ. సకామః సక్రియోఽసిద్ధ ఇతి మేఽనుభవః కథమ్,
అతో మే విపరీతస్య తద్భవాన్వక్తు మర్హతి. ౨౧౫

తా. ఈవస్తువు నాకుఁగావలెను. కనుక నేనీపనిని జేసెదను. ఇంకను నాకాపని నెరవేరలేదు. అను నీమొదలగు విపరీతవృత్తులు బ్రహ్మభూతుఁడ నగు నాకు నేల కలుగవలెనో చెప్పుఁడు. ౨౧౫

అవ. 'నేను దుఃఖిత్వకర్తృత్వాదిధర్మసహితుఁడనై యుండఁగా సుఖిని అకర్తను ఎట్లగుదునని గురువువలన నొకసారి మహావాక్యశ్రవణము జేసినవాఁ డడుగవచ్చును గాని, శ్రవణమననాదులచే నిర్దుఃఖాదిరూప లక్ష్యమం దారూ ఢుఁడైనజ్ఞానికి నీప్రశ్నము తగదని విభజించి చెప్పుచున్నారు:—

మూ. ఇహైవ ఘటతే ప్రశ్నో న ముక్తత్వానుభూతయే,
ప్రమాణేన విరోధీ యః సోఽత్రార్థః ప్రశ్నమర్హతి.

తా. సకృచ్ఛ్రవణము జేసినవాఁడు 'నేను దుఃఖిని, కర్తను, అకర్తనెట్లగుదును' అని యిట్లు శంకింపవచ్చును. కాని, ఆరూఢజ్ఞానముగలవాఁడు తన అనుభూతిని గుఱించి శంకింపఁదగదు. ౧౧౬

అవ. తెలియనిదానిని బోధించెడి ప్రమాణముచేత అపూర్వార్థము బోధింపఁబడినపుడు దానికి విరుద్ధమగు మఱియొక ప్రమాణాభాసముచే గ్రహింపఁబడిన అర్థమును శంకింపఁదగునని పైశ్లోకములోఁ జెప్పఁబడిన అర్థమును వివరించుచున్నారు:—

మూ. అహం నిర్ముక్త ఇత్యేవ సదసీత్యన్యమానజః,
ప్రత్యక్షాభాసజన్యత్వాద్దుఃఖిత్వం ప్రశ్నమర్హతి.

తా. 'నేను మోక్షస్వరూపుఁడ'నను అర్థము 'సదసి' యను ప్రమాణవాక్యమువలన నిష్పన్నమైనది. కాని ప్రత్యక్షాభాసమువలనఁ గలిగిన దుఃఖమెటులఁ గలుగకఁ బోవునని ప్రశ్నచేయవచ్చును.

ఆభాసమనఁగా, అది కాకున్నను దానివలె తోఁచుట. ఎట్లన-'చంద్రుఁడు మూఁడితెడు' అనెడి ప్రత్యక్షము శాస్త్రప్రమాణమువలన ఆభాసమై మహాప్రమాణము గలదిగనే యుండును. ఇట్లే శరీరోపాధివశమునఁ గలిగిన దుఃఖిత్వము శరీరేంద్రియోపాధికి సాక్షియగు ఆత్మకులేదని భావము. ౧౧౭

అవ. ఇపుడు శిష్యుని శంకనుబట్టియైనను కార్యకల్పనము కలుగనేరదని చెప్పుచున్నారు:—

మూ. పృష్టమాకాంక్షితం వాచ్యం దుఃఖాభావమభీప్సితమ్.

తా. శిష్యుఁడు కోరిన యంశమును గురువు దయతో బోధింపవలెను. దుఃఖరహితమగు బ్రహ్మరూపమోక్షము కోరఁబడెను. కనుక ౧౧౨-వ శ్లోకమునందలి ప్రశ్నమున కవకాశము లేదు. ౧౧౮

అవ. ప్రశ్నానురూపమగు ఉత్తరమును జెప్పి విరమించుచున్నారు:—

మూ. కథం హీదం నివర్తేత దుఃఖం సర్వాత్మనా మమ,
ఇతి ప్రశ్నానురూపం యద్వాచ్యం దుఃఖనివర్తకమ్.

తా. నాకీదుఃఖము పూర్తిగ నెట్లు పోవునని శిష్యుఁ డడుగఁగా, నీ ప్రశ్నకుఁ దగిన దుఃఖనివారకవాక్యమును గురువు బోధింపవలెను. ౧౧౯

అవ. ప్రసంఖ్యానముచే నడిగినదానికే ఉత్తరముచెప్పు శ్రుతి అడుగఁబడని దుఃఖము నెట్లు తొలఁగించునను శంకను, ప్రమాణము తన ప్రమేయమునే బోధించునుగాని అన్యమును బోధింపదని, పరిహరించుచున్నారు:—

మూ. శ్రుతేః స్వాత్మని నాశంకా ప్రామాణ్యే సతి విద్యతే,
తస్మాదాత్మవిముక్తత్వం ప్రత్యాయయతి తద్వచః,
వక్తవ్యం తత్తథార్థం స్యాద్విరోధేఽసతి కేనచిత్.

తా. స్వతఃప్రమాణమగు వేదము ఆత్మను బోధింపఁగలదా లేదా యని సంశయింపఁ బనిలేదు. కనుక నా శ్రుతి ముక్తిని బోధించును. దేనితోనైనను విరోధము కలుగఁగా, తత్పరిహారమునకై శ్రుతి బోధించును. ౧౨౦

అవ. మహావాక్యము ఉక్తార్థానుభవమునకుఁ గారణమగునుగాని శ్రుతివిరోధమువలన మఱి దేనిని బోధింపదని చెప్పుచున్నారు:—

మూ. ఇతోఽన్యోఽనుభవః కశ్చిదాత్మనో నోపపద్యతే,
అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాతారమితి శ్రుతేః. ౨౨౧.

తా. బ్రహ్మాత్మైక్యజ్ఞానము కలుగుటకు ననుభవముకంటె నన్యోపాయము లేదు. బ్రహ్మము ఎఱుఁగఁబడినదనువారికిఁ దెలియఁబడదనియు, నన్నిటియుఁ దెలిసెడివానిని నీచే నెఱుఁగఁదగుననియు శ్రుతులు ఘోషించుచున్నవి.

అవ. ఆత్మతత్త్వము నొకమాఱు వినినంతమాత్రాన విహితకర్మములను మానినయెడల సన్న్యాసాశ్రమవిధులను బోధించెడిశాస్త్రము వ్యర్థమగుటయేకాక ఆశ్రమకర్మపరిత్యాగమువలన నారూఢపతితత్వరూపదోషముకూడ ప్రాప్తించునుగనుక తత్త్వమస్యాదివాక్యశ్రవణమాత్రాన యతి విహితకర్మముల మానరాదని యీప్రకరణమున 16-వ శ్లోకములోఁ జేసిన పూర్వపక్షము సాధకులకేయగుటచేత పూర్ణజ్ఞానముగల యతి విధికి విధేయుఁడు కాఁడనియిప్పుడు చెప్పుచున్నాఁడు:—

మూ. త్వంపదార్థవివేకాయ సన్న్యాసస్సర్వకర్మణామ్,
సాధనత్వం వ్రజత్యేవ శాంతోదాంతానుశాసనాత్.

తా. 'శాంతో దాంత ఉపరత స్తితిక్షుః సమాహితో భూత్వాఽఽత్మన్యేవాత్మానం పశ్యతీ'త్యాదిక (బృహ. ౬. ౪) శ్రుతివలన ఉపరతిశబ్దమున కర్థమగు సంన్యాసము ఆత్మజ్ఞానమునుగూర్చి సాధనమని తెలియఁబడుచున్నది

కావున సంన్యాసము శాస్త్రవేద్యము కాదేని మా సంన్యాసాశ్రమవిధులు నిష్ప్రమాణము లగును. అట్లేని యత్యాశ్రమాచారములను విడుచుటవలన ఆరూఢపతితత్వరూపదోషము కలుగును. పదార్థజ్ఞానము లేక వాక్యార్థము తెలియఁబడదు కనుక నా పదార్థజ్ఞానము తెలియుటకే ఆశ్రమధర్మము లవశ్యము నాచరింపఁదగినవి. పదార్థశోధనపూర్వకముగ బ్రహ్మాత్మతత్త్వము తెలియఁబడఁగా 'దీనినిమిత్తము నేనీపనినిఁ జేయవలయు'నను ప్రయోజనబుద్ధి ఉదయింపనందున విధిప్రవృత్తిలేదని నివారింపఁబడినవి. కాని సాధకావస్థయందు అభ్యసింపఁబడినట్టియు, జ్ఞానమునకు విరోధి కానట్టియు నివృత్తిరూపాశ్రమధర్మము సంస్కారరూపముగ అనువర్తించును. దాని చే యథేష్టచేష్టకు వీలుండదు. అని వేదాంతమతమందు సర్వము సమంజసము. ౨౨

## మహావాక్యార్థజ్ఞానవివరణము.

అవ. దీనినే వివరించుటకై వేదాంతవాక్యోత్పత్తి ప్రకారమును వక్కాణించుచున్నారు:—

మూ. త్వమర్థం ప్రత్యగాత్మానం పశ్యేదాత్మానమాత్మని,
వాక్యార్థం తత ఆత్మానం సర్వం పశ్యతి కేవలమ్. ౨౩

తా. శాంత్యాదిసాధనసంపత్తిగలవాఁడై చిదాభాసవ్యాప్తాంతఃకరణమందు త్వంపదలక్ష్యార్థమగుచు, సర్వజడమును స్వస్వకార్యములందుఁ బ్రవర్తింపఁజేయు ప్రత్యగాత్మను సాక్షాత్కరింపఁజేయవలయును. ఇట్లు శోధితమగు ప్రత్యగాత్మను సర్వవ్యాపకబ్రహ్మముగఁ దెలియవలెను. ౨౩

అవ. ఇట్లు మహావాక్యార్థము నెఱిఁగినవానికి విధిగోచరత్వ మేమియు సంభవింపదని చెప్పుచున్నారు:—

మూ. సర్వమాత్మేతి వాక్యార్థే విజ్ఞాతేఽస్య ప్రమాణతః,
అసత్త్వే హ్యన్యమానస్య విధిస్తం యోజయేత్కథమ్.

తా. వాక్యార్థప్రమాణమువలన సర్వమును శుద్ధచిన్మాత్రబ్రహ్మస్వరూపముగఁ దెలిసికొనిన జ్ఞానికి వేదచోదితవిధినిషేధము లెటుల వర్తించును? (వర్తింపవని భావము). ౨౨౮

అవ. మహావాక్యార్థవిజ్ఞానము కలుగకమును నేకాని కలిగినంతట నట్టిజ్ఞానికి వేదచోదితవిధులు చెల్లవని చెప్పి విరమించుచున్నారు:—

మూ. తస్మాద్వాక్యార్థవిజ్ఞానాన్నోర్ధ్వం కర్మవిధిర్భవేత్,
నహి బ్రహ్మాస్మి కర్తేతి విరుద్ధే భవతో ధియౌ. ౨౨౯

తా. 'అహం బ్రహ్మాస్మి, అహం కర్తాఽస్మి' యను నీజ్ఞానములు రెండును పరస్పరవిరుద్ధములగుచు నేకకాలమం దొకనియందు వర్తింపవు కనుక, మహావాక్యార్థవిజ్ఞానానంతరము కర్మవిధి కవకాశము లేదు. ౨౨౯

అవ. జీవపరమాత్మలకైక్యజ్ఞానము ప్రత్యక్షభేదజ్ఞానముచే నేల బాధింపఁబడదను శంకకు సమాధానము:—

మూ. బ్రహ్మాస్మీతి చ విద్యేయం నైవ కర్తేతి బాధ్యతే,
సకామో బద్ధ ఇత్యేవం ప్రమాణాభాసజాతయా.

తా. చంద్రుఁడు ప్రాదేశమాత్ర (లొడితెడు) ప్రమాణము కలవాఁడను ప్రత్యక్షము శాస్త్రప్రమాణముచే బాధింపఁబడుచు ప్రత్యక్షాభాసమగుచున్నది. ఆదర్శప్రతిబింబిత మగుముఖము కంఠస్థముఖముకంటె వేఱుకా

పన్నను అది ఆభాసమాత్రమై మిథ్యయగును. ఇటులనే 'యద్దృశ్యం, తన్న శ్యం' దృశ్యవస్తువు నశించునదే. ఈప్రకారము అంతఃకరణప్రతిబింబిత చిదాభాసుఁడగుజీవాత్మ చిదాత్మకంటె వేఱుకాక చిన్మాత్రము, ఏకము, అద్వితీయము నని మహావాక్యతాత్పర్యము. సద్గురుకటాక్షమున సంశయ విపర్యయరహితముగ నీయర్థము ను గ్రహించినంతట, భేదప్రత్యక్షము, చంద్ర ప్రాదేశప్రమాణప్రత్యక్షమువలె ఆభాసమేకాని వాస్తవము కాదు.

ఆభాసమన లేనిది యున్నట్లు కనిపించినను విమర్శించునపుడు లేనిది.

ఉదాహరణము:— ఆదర్శప్రతిబింబము ముఖాభాస మనఁబడును, ఈప్రతిబింబము ముఖలక్షణములు కలదైయున్నను విమర్శింపఁగా నది సత్యము కాదు.

అవ. స్వభావప్రవృత్తమగుబుద్ధి ప్రమాణజన్యమగు బుద్ధివలన బాధింపఁబడుననుటను సదృష్టాంతముగ నుపపా దించుచున్నారు:—

మూ. శాస్త్రాద్బ్రహ్మాస్మి నాన్యోఽహామితి బుద్ధిర్భవేద్దృఢా,
యదా యుక్తా తదైవం ధీర్యథా దేహాత్మధీరితి. ౨౨౭

తా. మహావాక్యార్థవిచారమువలన 'బ్రహ్మోహమస్మి' యను బుద్ధి దృఢమగునపుడు కర్తృత్వబుద్ధి బాధింపఁబడును. శాస్త్రమువలన 'నేను స్వర్గాదిఫలభోక్త'ననుజ్ఞానము కలిగినపుడు దేహబుద్ధితో 'నేను మనుష్యుఁడను, బ్రాహ్మణుఁడను, సోమయాజిని' ఇత్యాదిదేహాభ్రాంతి కలుగనియట్లు, బ్రహ్మత్మజ్ఞానము విమర్శజాతవిద్యాబలముచే దృఢమగునపుడు కర్తృత్వబుద్ధియుం దొలఁగును. ౨౨౭

అవ. ఆత్మజ్ఞానికి కర్తృత్వాభిమానము లేదనుటకు మఱియొక దృష్టాంతము:—

మూ. సభయా దభయం ప్రాప్తస్తదర్థం యతతే చ యః,
స పునః సభయం గన్తుం స్వతంత్రశ్చేన్న గచ్ఛతి. ౨౨౮

తా. లోకములో ఉపద్రవయుక్తమగు స్థలమును విడిచి, నిర్బాధ స్థలముం జేరినవాఁడు మఱల నా యుపద్రవయుక్తస్థలప్రాప్తికై యత్నించునా? యత్నింపఁడు. మఱియు, తాను స్వతంత్రుఁడైనయెడల నా యుపద్రవస్థలమునకు పోనేపోవఁడు. ఇది లోక దృష్టాంతము.

దార్ష్టాంతికా (ప్రకృతా)ర్థ మెట్లనిన:—

సభయ మన జననమరణాదిదుఃఖభూయిష్ఠమగు సంసారము. అభయ మనఁగ భయకారణమగు భేదబుద్ధిలేని ఆత్మజ్ఞానము. జనకచక్రవర్తివలె నభయమును బొందినట్టి వివేకి దుఃఖభూయిష్ఠమగు సంసారసాగరమున మఱల మునుంగుటకు బ్రయత్నించునా? పుణ్యాతిరేకమువలనఁ బ్రతిబంధకము నివర్తింపఁగా స్వతంత్రుఁ డగునేని యట్టి వివేకి మఱల సంసారనిమగ్నుఁడు కాఁడు. ౨౨౮

౨౨. నియోజకమగు విధి లేనియెడల జ్ఞాని స్వేచ్ఛాచారి యగునని చెప్పిన యాక్షేపమునకు సమాధానము:—

మూ. యథేష్టాచరణప్రాప్తిః సంన్యాసాదివిధౌ కుతః ?
పదార్థ జ్ఞానబుద్ధస్య వాక్యార్థానుభవార్థినః. ౨౨౯

తా. సంన్యసించి శ్రవణమననాదులను ఆచరించుచుండఁగా, పదార్థజ్ఞానమును బాగుగ గ్రహించి వాక్యార్థముయొక్క అనుభవము నపేక్షించు వానికి స్వేచ్ఛాచారము కలుగదు. పదార్థజ్ఞానమన అనృతజడదుఃఖాత్మకములగు దేహేంద్రియాదులకంటె త్వంపదలక్ష్యార్థమగు చిదాత్మ (తాను) వేఱను

కొనుట. తాను వాక్యార్థమును దెలిసికొని యాయర్థము ననుభవింపఁగోరు సుజ్ఞానికి స్వేచ్ఛాచారప్రసక్తి లేదు. స్వేచ్ఛాచారమును గలిగించెడి బాహ్య ప్రవృత్తియే యీ జ్ఞానికిఁ గలుగదు. నిమిత్తములేనికాలమున కార్యమును గలుగనేరదు, అని 'నిమిత్తాపాయే నైమిత్తకస్యాప్యపాయః' యను ఆర్య వచనము బోధించుచున్నది. కనుక భక్తిశ్రద్ధలవలన ప్రతిబంధరహితముగ వాక్యార్థానుభవముగలవానికి మిథ్యాజ్ఞాన మించుకేనియు నుండనందున మిథ్యాజ్ఞానజన్యమగు స్వేచ్ఛాచారము కలుగుట కవకాశము లేదు. ౨౨౯

అవ. ప్రకరణార్థము నుపసంహారించుచున్నారు:—

మూ. అతః సర్వమిదం సిద్ధం యత్ప్రాగస్మాభిరీరితమ్. ౨౩౦

తా. కావున మేమింతవరకుఁ జెప్పినదంతయుఁ సత్యము. సంశయింపఁ బనిలేదు. ౨౩౦

అవ. యథేష్టచేష్ట ముముక్షువునకే లేదు ఇఁక ముక్తున కెటులఁ గలుగునని కైముతికన్యాయమును జెప్పుచున్నారు:—

మూ. యో హి యస్మాద్విరక్తః స్యాన్నాసౌ తస్మై ప్రవర్తతే,
లోకత్రయాద్విరక్తత్వా న్ముముక్షుః కిమితీహతే. ౨౩౧

తా. ఒకవస్తువునందు విరక్తిఁజెందినవాఁడు దానికై మఱల యత్నింపఁడు. కనుక ఐహికాముష్మికఫలభోగవిరాగియగు ముముక్షువు దేనినిఁ గోరఁడు. ౨౩౧

అవ. విద్వాంసుఁడు విధికి పరతంత్రుఁడు కాకపోయినను

భిక్షాటనమునకువలె విషయాంతరమునకై యేల యత్నింపఁ గూడదు? అను శంక కుత్తరము:—

యథా క్షుధయా పీడ్యమానోఽపి న విషం హ్యాత్తుమిచ్ఛతి,
మృష్టాన్నధ్వస్తతృడ్ జానన్నామూఢస్తజ్జిఘత్సతి.

తా. ఎంత క్షుద్బాధగలిగియున్నను విషము దినుటకు నెవ్వఁడును ఒప్పుకొనఁడు. విషయములు విషమువలె దుఃఖప్రదములని ముముక్షువుచే విడువఁబడినందున, జ్ఞాని వానినిఁ గోరఁడు. భిక్షాటనము జ్ఞానమునకు విరోధి కాదు. ఇది శరీరస్థితిమాత్రమునకై యపేక్షింపఁబడుచు, అపూర్వసంగ్రహమునకుఁ గారణము కానందున సంస్కారవశమున శరీరస్థితిమాత్రమునకగు భిక్షానువృత్తి బాధకము కాదని తెలియవలెను.

ప్ర. అపూర్వ మన నేమి?

ఉ. శబ్దము, బుద్ధి, కర్మము ననునివి క్షణత్రయముకంటె నుండవని తార్కికసిద్ధాంతము. యాగాదిపుణ్యకర్మములు, జీవహింసాదిపాపకర్మములును క్షణత్రయపర్యంతము మాత్రముండునవే కనుక నివి కాలాంతరమున సుఖదుఃఖముల నెట్టుల నీయంజాలునని శంకింపవలదు. ఈపుణ్యపాపకర్మములు 'అపూర్వ'మనెడి ధర్మమునుగలిగించి తాము నశించుననియు, నీయపూర్వము కాలాంతరమందు సుఖదుఃఖరూపఫలము కలుగుపర్యంతము నుండుననియు మీమాంసకులు చెప్పెదరు. పుణ్యపాపకర్మములనుండి కలిగిన అపూర్వము తిరిగి సుఖదుఃఖరూపఫలప్రదమగుచు జ్ఞానమునకు బాధకమగును కాని సద్యస్కాలమున మాత్రము తృప్తిఁగలిగించెడి భిక్షానువృత్తి బాధకము కాదనిభావము.



౭౮. తత్త్వజ్ఞానము కలిగినవానికిఁ జేయఁదగినదెద్ది

యును లేదు. ఐనప్పటికి శాస్త్రమును గురువును పూజనీయులే, శిష్యులకు బోధించుటకై గురుప్రణామమును జేయుచున్నారు:—

మూ. వేదాంతవాక్యపుష్పేభ్యో జ్ఞానామృతమధూత్తమమ్,
ఉజ్జహారాళివ ద్యో న_స్తస్మై సద్గురవే నమః. ౨౩

తా. వేదాంతవాక్యములనెడి పుష్పములనుండి, జ్ఞానామృతమనెడి మకరందమును దీసి మనకొసంగిన భ్రమరమువంటి సద్గురువులకు నమస్కారము. ౨౩

ఓం తత్ సత్.

ఇది తత్త్వమసిప్రకరణము.

శ్రీః

# ఉపదేశసాహస్రి

(శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్య ప్రణీతము.)

## శ్లోకప్రబంధము-ఏకోనవింశతిప్రకరణము.

---

### ౧౯. ఆత్మమనస్సంవాద ప్రకరణము.

అవ. ఇట్లు సంక్షేపముగను విస్తరముగను తత్త్వం పదార్థ పరిశోధనపూర్వకముగ బ్రహ్మాత్మైక్యలక్షణవాక్యార్థ జ్ఞానము ప్రమాణయుక్తులచేత నిత్యానందరూపఫలసహిత ముగ నిరూపింపఁబడెను. నిత్యశుద్ధబుద్ధముక్తసత్యజ్ఞానా నంతానందస్వభావముగల ప్రత్యగాత్మకు భేదవిపర్యాసాద్య నేకానర్థకారణము అహంకారమనోబుద్ధిచిత్తపదవాచ్యమగు అంతఃకరణమే యని అక్కడక్కడ చెప్పఁబడెను. ఇపుడు ఆత్మకు సంసారకారణము ముఖ్యముగ చిత్తాధ్యాసమే కనుక మనఃస్వరూపమును తచ్చేష్టలను గనిపెట్టి, మనోలయమునకై ప్రయత్నింపవలయునను నభిప్రాయముతో, 'ఆత్మమనస్సంవాద' రూప ప్రకరణమును ఆరంభించుచు భాష్యకారులగు

శ్రీమచ్ఛంకరాచార్యులు ప్రకరణప్రయోజనమును జెప్పుచున్నారు. ఈ ప్రకరణమునకు 'భేషజప్రయోగప్రకరణ' మనియు నామాంతరము:—

మూ. ప్రయుజ్య తృష్ణాజ్వరనాశకారణం
చికిత్సితం జ్ఞానవిరాగభేషజమ్,
న యాతి కామజ్వరసంనిపాతజాం
శరీరమాలాశతయోగదుఃఖతామ్. ౧

తా. చికిత్సితమనఁగ వైద్యము, జ్ఞానమన ఆత్మానాత్మవివేకము, వైరాగ్యమనఁగా చిత్తవృత్తికి స్థానములగుచు దుఃఖప్రదములగు విషయములందు ఆసక్తిలేకపోవుట. ఈ జ్ఞానవైరాగ్యములనెడి మందులచే ఆశయనెడి జ్వరమును బోఁగొట్టెడి వైద్యము నుపయోగించినవాఁడు, కామమనెడి జ్వరమువలనను, ఆత్మానాత్మవివేకశూన్యమనెడి మూర్ఛవలనను గలిగిన శరీరపరంపరాసంబంధముచేతనైన జననమరణరూపదుఃఖమును అనుభవింపఁడు. ఇట్లని యీ సంసారదుఃఖనివృత్తికై యీగ్రంథము సప్రమాణముగ వివరింపఁబడెను. ౧

అవ. భేషజప్రయోగపద్ధతిని ఆత్మమనస్సంవాదరూపముగ వివరించుచున్నారు:—

మూ. అహం మమేతి త్వమనర్థమీహసే
పరార్థ మిచ్ఛంతి తవాన్య ఈహితమ్,
న తేఽర్థబోధో న హి మేఽస్తి చార్థితా
తతశ్చ యుక్తః శమ ఏవ తే మనః. ౨

తా. ఆత్మకును మనస్సునకును సంవాదరూపమగు నీప్రకరణములో మొదట ఆత్మ మనస్సును అడుగుచున్నాఁడు.—

ఆత్మ—ఓమనస్సా! 'నేను, నాకు నిదికావలెను' అను అనర్థదాయకములగు కోరికలను వ్యర్థముగ నీవేల కోరుచున్నావు? నీకై (ఆత్మబోధమునకై) వ్యవహరించుచున్నాననియనెదవేని, పురుషుని భోగాపవర్గార్థము ప్రకృతి ప్రసరించును. పురుషుఁడు పుష్కరపలాశమువలె నిస్సంగుఁడు, అని సాంఖ్యులు చెప్పెదరుకాని వేదాంతసిద్ధాంతవేత్తలమగు మే మటులఁ జెప్పము. ఆలోచింపఁగా నీ యీకోరికయు వ్యర్థమే. ఏలయన, జడమగు నీకు నిట్టి అర్థజ్ఞానము లేదు. ఆత్మ తనకు భోగేచ్ఛ లేనందున భోగముల సమకూర్పుమని నిన్ను కోరదు. "ఆత్మానం చేద్విజానీయా దయమస్మీతి పూరుషః, కిమిచ్ఛన్కస్య కామాయ శరీర మనుసంజ్వరేత్."—"దేహాభిమానమునువిడిచి ఆత్మజ్ఞానముగలవాఁడు దేనినిఁగోరఁడు, తపింపఁడు" అని(బృహ. ౪-౪-౧౨)శ్రుతి చెప్పుచున్నది. మఱియు, "అస్య సంసారవృక్షస్య సర్వోపద్రవదాయినః, ఉపాయ ఏక ఏవాస్తి మనసః స్వస్య నిగ్రహః. మనసోఽభ్యుదయో నాశః మనోనాశో మనోదయః, జ్ఞ మనోనాశమభ్యేతి మనోఽజ్ఞస్య హి శృంఖలా."—(సకలబాధలనుకలిగించు సంసారమును నివర్తించెడి మహోపాయము స్వమనోనిగ్రహ మొకటియే. మనస్సు సంసారారణ్యమునఁదిరుగుట నాశహేతువు. మనోనిగ్రహము మహానందదాయకము. జ్ఞానియొక్క మనస్సు ఆత్మయందే లీనమగును. మనస్సు అజ్ఞుని సంకెలవలె బంధించును.) అని శ్రీ వసిష్ఠమహర్షి శ్రీరామున కుపదేశించెను. కావున మనసా! నీవు వర్తిల్లక ఉపశమింపుము. ౨

అవ. ఆత్మ భోగములను కోరదనుటను సాధించుచున్నారు:—

మూ. యతో న చాన్యః పరమాత్మనాతనా
త్వదైవ తృప్తోఽహమతో న మేఽర్థితా,
సదైవ తృప్తశ్చ న కామయే హితం
యతస్వ చేతః ప్రశమాయ తేఽధికమ్. ౩

తా. పూర్ణానందరూపుఁడును నిర్వికారుఁడునగు పరమాత్మకంటె నే నన్యుఁడను గానందున నిత్యతృప్తుఁడనగు నాకు నిన్నుఁ గోరవలసినది లేదు. తృప్తిలేనివానికే యేదేని కావలెనను కోరిక కలుగునుగాని నిత్యతృప్తుఁడు దేనినిం గోరఁడు. కనుక మనసా! నీవు విజృంభింపక తగ్గియుండుము.

ముముక్షువు మనోలయమునకై ప్రయత్నింపవలయును. ఇదియే అమనస్క-రాజయోగమని ఆర్యులు వచియింతురు. ౩

అవ. తాను పరమాత్మకంటె వేఱుకానందున తనకు అర్థిత్వము లేదని చెప్పఁబడిన మాయాభేదమును ధ్రువపరుచు చున్నారు:—

మూ. షడూర్మిమాలాభ్యతివృత్త ఏవ యః
స ఏవ చాత్మా జగతశ్చ నః శ్రుతేః,
ప్రమాణతశ్చాపి మయా ప్రవేద్యతే
ముధైవ తస్మాచ్చ మనస్తవేహితమ్. ౪

తా. ప్రాణధర్మములగు క్షుత్పిపాసలును, మనోధర్మములగు శోక మోహములును, దేహధర్మములగు జరామరణములును షడూర్ములనఁబడును. ఈ షడూర్ములు తరంగములవలె నుదయించి లయించుచుండును. వీనియొక్క అవిచ్ఛిన్నపరంపరలను దాటి ప్రపంచవాసనారహితుఁ డగువాఁడు సర్వజగ

దాత్మ. ఓ మనసా! నీకును నేనే ఆత్మను. ఇట, 'యత్సాక్షాదపరోక్షాద్బ్రహ్మ,' 'య ఆత్మా సర్వాంతరః' ఇత్యాది శ్రుతులును, 'అహమాత్మా గుడాకేశ సర్వ భూతాశయస్థితః' ఇత్యాది స్మృతులును ప్రమాణములు. మఱియు, కార్య కారణోపాధులు తక్క ఆత్మకు స్వతఃసిద్ధభేదములేదు. ఈ మొదలగు న్యాయములును విద్వదనుభవములును ప్రమాణములని చెప్పుచున్నాను గనుక మనసా! నీవు వ్యర్థపుకోరికలను గోరక యుపశమింపుము. ౪

అవ. ప్రత్యగాత్మకు పరమాత్మతో నభేదము ప్రమాణ సిద్ధమని నిరూపించి, యీభేదము మనస్సువలననే కల్పింపఁ బడెనని చెప్పుచున్నారు:—

మూ. త్వయి ప్రశాంతే న హి చాస్తి భేదధీ
ర్యతో జగన్మోహముపైతి మాయయా,
గ్రహో హి మాయాప్రభవస్య కారణం
గ్రహాద్విమోకే న హి సాఽస్తి కస్యచిత్. ౫

తా. జగత్తునందలి ప్రాణులను మోహపరవశులఁజేసి భేదబుద్ధినిఁ గలి గించు మాయకును నీవే కారణము కనుక ఓ మనసా! నీవు శాంతింపఁగా నీ భేదబుద్ధి కలుగనేరదు. నీవులేని సుషుప్తి మూర్ఛాద్యవస్థలయందు నెవనికిని భేదబుద్ధికాని మాయకాని యుండవు. ౫

అవ. దీనినుండియు మనశ్చేష్ట వ్యర్థమేయని చెప్పు చున్నారు:—

మూ. న మేఽస్తి మోహస్తవ చేష్టితేన హి
ప్రబుద్ధతత్త్వస్త్వసితో హ్యవిక్రియః,

న పూర్వతత్త్వోత్తరభేదతా హి నో
వృథైవ తస్మాచ్చ మన స్తవేహితమ్. ౬

తా. మఱియు, ఓచిత్తమా! నీవ్యాపారముచేత నాకు మోహము లేదు. ఏమన, తత్త్వమెఱిఁగినపుడు బంధవికారము లుండవు. అసితః = బద్ధుఁడు కాఁడు. 'షిఞ్ బంధనే'యను ధాతువువలన, సితః+న = బద్ధుఁడు కాడని వ్యుత్పత్తి. సిద్ధమగు తత్త్వమునకు పూర్వోత్తరభేదము లేనందున మనసా! నీవ్యాపారము వ్యర్థము కావున శాంతింపుము. ౬

అవ. సర్వదృశ్యాతిపత్తిరై స్వతస్సిద్ధమగు ఆత్మకు ఆగంతుకాతిశయము కలుగదని చెప్పుచున్నారు:—

మూ. యతశ్చ నిత్యోఽహమతో న చాన్యథా
వికారయోగే హి భవేదనిత్యతా,
సదా ప్రభాతోఽహమతో హి చాద్వయో
వికల్పితం చాప్యసదిత్యవస్థితమ్. ౭

తా. నిత్యుఁడనగు నాకు (చిదాత్మకు) జననమరణాదివికారములు లేవు. వికారముకలిగిన నది యనిత్యమేయగును. నాకు పరిమాణపరిస్పందాది వికారములును లేవు. నేనెప్పుఁడును భాసించుచునే యుండుటచేత ప్రకాశము అప్రకాశమునను భేదమును నాకు లేదు. కనుక నేను అద్వితీయుఁడను. దృశ్యవస్తువు లనేకము లుండఁగ నద్వయ మెటుల సిద్ధించునందువేని కల్పింపఁబడిన దెల్ల అసత్తని నిశ్చయింపఁబడెను కనుక సిద్ధమగు ఆత్మ అద్వితీయము.

అవ. మనస్సుతోఁగూడి ఆత్మ సద్వితీయము కారాదా యనుశంకకు సమాధానము. భేదసంపాదకమగు మనస్సు

అభావస్వరూపము కనుక ఆత్మ అద్వితీయమే యని చెప్పుచున్నారు:—

మూ. అభావరూపం త్వమసీహ హే మనో
నిరీక్ష్యమాణే న హి యుక్తితోఽస్తితా,
సతో హ్యనాశాదసతోఽప్యజన్మతో
ద్వయం చ చేతస్తవ నాస్తితేష్యతే. ౧

తా. యుక్తులచే విమర్శింపఁగా, మనసా! నీకు అస్తిత్వము లేదు. ఏమన, సద్వస్తువు నశింపదు. అసత్తునకు స్థితిలేదు. ఈ జన్మనాశములు నీకే కలవు. కావున అభావస్వభావముగల నీకు పరమార్థసత్త్వము లేదు. ౧

అవ. బీజాభావమున ఫలము సిద్ధింపదను న్యాయము చేత ఆత్మ అద్వైతమని స్పష్టపరుచుచున్నారు:—

మూ. ద్రష్టా చ దృశ్యం చ తథా చ దర్శనం
భ్రమస్తు సర్వస్తవ కల్పితో హి సః,
దృశేశ్చ భిన్నం న హి దృశ్యమీక్ష్యతే
స్వపన్ప్రబోధేన తథా న భిద్యతే. ౨

తా. ఓ మనసా! ద్రష్టృదర్శనదృశ్యములనెడి త్రిపుటి నీచేతనే కల్పింపఁబడెను. జడమగుచు ఆత్మచేఁ బ్రకాశింపఁజేయఁబడు దృశ్యము దృక్కుకంటె వేఱుసత్తకలదికాదు. నిద్రించువాఁడు మేల్కొనినపుడు, వాఁడా నిద్రించినవానికంటె నన్యుఁడు కానేరడు. జ్ఞానియు స్వప్నావస్థనుండి మేల్కొనినవానివలె ప్రబోధసమయమున అద్వితీయుఁడే యగును. నీటి యందు: ప్రతిబింబించిన ద్రష్ట ఒక్కఁడేకాని యిద్దరు కారని చెప్పెడి

"సలిల ఏకో ద్రష్టాఽద్వైతో భవతి" యను (బృహ. ౬-౩-౨౩) శ్రుతి అద్వితీయత్వమునే బోధించుచున్నది. ౯

అవ. ఇట్లు వికల్పము లేకున్నను వేఱొకవిధమున సద్వస్తువునందు వికల్పనముండుటవలన అద్వైతము సిద్ధింపదనెడి శంక కుత్తరము:—

మూ. వికల్పనా వాఽపి తథాఽద్వయా భవే
దవస్తుయోగాత్తదలాతచక్రవత్,
న శక్తిభేదోఽస్తి యతో న చాత్మనాం
తతోఽద్వయత్వం శ్రుతితోఽవసీయతే. ౧౦

తా. కొఱవిని వేగముతోఁద్రిప్పఁగ చక్రాకారముగఁ గనుపించునే కాని యాచక్రము కొఱవికంటె భిన్నముగ లేదు. [1]భ్రమ తగ్గగనే అద్వితీయముగ కొఱవిమాత్రమే యుండును. ఇట్లు వాస్తవములుకాని పదార్థములు స్వప్నమందువలె భ్రమచేఁ దోఁచినను భ్రమ తగ్గఁగనే అద్వితీయాధిష్ఠానము కంటె అతిరిక్తములు కావు. భ్రమకలిగినపుడు చిదాత్మయే బహువికల్పములుగఁ దోఁచుచుండును. "నిరంతరం భాసమానే చైతన్యే జ్ఞప్తిరూపతః, తద్భాసాభాస్యమానేయం బుద్ధి ర్నృత్యత్యనేకధా." (చైతన్యము సర్వదా స్ఫూర్తిరూపముగఁ బ్రకాశించుచుండఁగా దాని కాంతిచే బుద్ధి పలుతెఱఁగులఁ దిరుగుచుండును) అని శ్రీవిద్యారణ్యులు. దర్శనశ్రవణమననాదిశక్తులు ఆయాయింద్రియోపాధులవలననే కలిగినవిగాని ఆత్మభేదమువలనఁ గలుగలేదు. ఇందుకు—'ఆకృత్స్నో హి సః ప్రాణన్నేవప్రాణో నామ భవతి వదన్వాక్ పశ్యంశ్చక్షుః శృణ్వన్ శ్రోత్రం మన్వానో మనస్తాన్యస్యైతాని కర్మ

---

1 భ్రమయనఁగా 'తిరుగుట, భ్రాంతి' యని రెండర్థములు.

నామాన్యేవ' అను (బృహ. 3-౪-౭) శ్రుతి ప్రమాణము. 'ఏకో దేవో బహుధా నివిష్టః' (తై. ఆ. 3-౧౪) 'ఏకం సన్తం బహుధా కల్పయన్తి,' ఋగ్వే. ౧౦-౧౧౪-౫) 'ఏకస్తథా సర్వభూతాంతరాత్మా' (కఠ. ౫-౯) ఇత్యాదిశ్రుతులు ఆత్మ ఏకమనియే ఘోషించుచున్నవి. ఆయా యింద్రియ సంబంధముననే ఆత్మ పలువిధములుగఁ దోఁచునుగాని యిది వాస్తవము కాదని శ్రుతితాత్పర్యము. ౧౦

అవ. వేదబాహ్యులు చెప్పెడి ఆత్మభేదకల్పనమును నిరాకరించుచున్నారు:—

మూ. మిథశ్చ భిన్నా యది తే హి చేతనాః
క్షయస్తు తేషాం పరిమాణయోగతః,
ధ్రువో భవేద్భేదవతాం హి దృష్టితో
జగత్క్షయశ్చాపి సమస్తమోక్షతః. ౧౧

తా. ఆత్మలు పరస్పరము భిన్నములగునేని పరిమితిగల మూలములు అంకురములు నశించునట్లు ఆయాత్మలును నశింపవలసియుండును. మఱియు, ఆత్మలు భిన్నములేయైనయెడల నొకకల్పములో నొక్కొకనికి ముక్తి కలిగి నను, అనంతములైన గతకల్పములందు అనంతజీవులకు ముక్తికలుగఁగా నిపుడు అందఱకును మోక్షము కలుగవలసివచ్చును.అట్లైనఁ,కర్మముననుభవించు భోక్తలు లేకపోవుటవలన జీవార్థములగు భోగ్యపదార్థములకు క్షయము కలుగవలసివచ్చును. కనుక ఆత్మలనేకమనుట యుక్తముకాదు. ౧౧

అవ. ఓ సిద్ధాంతీ! జగత్తు జీవుఁడు, ఈశ్వరుఁడు నను భేదము నంగీకరించిన నీదోష మెటులలేకపోవును. అను ప్రశ్న మున కుత్తరము:—

మూ. న మేఽస్తి కశ్చిన్న చ సోఽస్మి కస్యచి
ద్యతోఽద్వయోఽహం న హి చాస్తి కల్పితమ్,
అకల్పితశ్చాస్మి పురా ప్రసిద్ధితో
వికల్పనాయాద్వయమేవ కల్పితమ్. ౧౨

తా. నేను అద్వయుండను గనుక నాకు ద్వితీయుండు లేడు. నేను మఱియొకరికి సంబంధించినవాఁడను కాను. కల్పితమగు జగత్తుకూడ వాస్తవము కాదు. కావున జీవేశ్వరజగద్భేదము అఖండాద్వయాత్మయందుఁ గల్పితమగుటవలనఁ గల్పితవస్తువు ఏ ప్రమాణముచేతను వాస్తవముగాక తత్కాలాలంకార మగుటవలనను మా అభేదమతమున దోషమున కవకాశము లేదు. అయ్యా! ద్వైత మొకపదార్థమగునట్లు అద్వైతమును నొకపదార్థమే కద. పదార్థములన్నియుఁ గల్పితములైనపుడు అద్వైతమును గల్పితమేకనుక నిదియును అనిత్యమే యగునను శంకకు సమాధానము:—సర్వకల్పనమునకు నొక అధిష్ఠాన ముండవలెను. సర్వకల్పనాబాధకు సాక్షియునొకటి యుండవలెను. అధిష్ఠానమును సాక్షియును లేనికల్పన లేనందున సకలకల్పనకంటె పూర్వమే సిద్ధమై కల్పితపదార్థబాధకు సాక్షియగుటచేత కల్పితసకలపదార్థములును నశించినను శేషించుపదార్థము కల్పితముగాక స్వతస్సిద్ధమగు ఆత్మ అద్వయశబ్దముచేఁ (అతద్వ్యావృత్తిరూపముగఁ) జెప్పఁబడును. అనఁగా అద్వైత మనఁగా ద్వైతముకానిదని భావముకాని, అద్వైతమను పదార్థమని చెప్పుట కూడ యుక్తముకాదు. సకలకల్పనకంటె పూర్వముండుటవలన నేను కల్పితుఁడను గాను. చకారమువలన సకలపదార్థములు నశించినంతట తత్సాక్షినగుటవలనను, మధ్యమందును తత్సాక్షియు తదధిష్ఠానమునునగుటవలనను నేను కల్పితుఁడను గాను. ద్వైతమే కల్పితమని భావము. ౧౨

అవ. ఉక్తార్థమునే స్ఫుటపరచుటకు ఆత్మయందు వికల్పనాదివిషయములు లేవని చెప్పుచున్నారు:—

మూ. వికల్పనా చాప్యభవే న విద్యతే
సదస్త్యదిత్యేవ మతో న వాఽస్తితా,
యతః ప్రవృత్తా తవ చాపి కల్పనా
పురా ప్రసిద్ధేర్న చ తద్ధి కల్పితమ్. ౧౩

తా. ఉత్పత్తిలేని ఆత్మయందు అసత్తనెడి వికల్పనయుంలేదు. అనఁగా ఆత్మ నిత్యమనుట. కావున ఆత్మకు నాస్తిత్వమును లేదు. మఱియు. మనోఽతీతమగు ఆత్మకు కల్పనలేనందునను, ఆగంతుకమైన మనస్సునకు స్వరూపసత్తలేనందునను సకలవికల్పకారణమగునీమనస్సువియాత్మయందుఁ గల్పితమైనదో అట్టి ఆత్మ వికల్పనార్హాము కాదని భావము. ౧౩

అవ. ఏవస్తువు కనుపించునో యది యున్నదనియు, ఏది కనఁబడదో యది లేదనియుఁ జెప్పునట్టి ద్వైతము అద్వైతమెటులగును? అను శంకకు, వస్తుసత్తకు దర్శనమును వస్త్వసత్తకు అదర్శనమునుం గారణముకాదు. ఆవస్తుసత్తాసత్తలను నిర్ణయించునది అన్యమేయని దానికి నిశ్చయహేతువును జెప్పుచున్నారు:—

మూ. అసద్ద్వయం తేఽపి హి యద్యదీక్ష్యతే
న దృష్టమిత్యేవ న చైవ నాస్తితా,
యతః ప్రవృత్తా సదసద్వికల్పనా
విచారవద్వాఽపి తథాఽద్వయం చ సత్. ౧౪

తా. ఓమనస్సా! నీకు గోచరమగు ప్రతివస్తువును ద్వైతమే. ఇది దృష్టమైనను స్వప్నపదార్థమువలె దృష్టనష్టమగుటవలన అసత్తే యగును. మఱియు, కనుపింపలేదన్నంతమాత్రమున వస్తువు లేకపోలేదు. ఎట్లన, రూపరహితమగు వాయువు కంటికిఁ గనుపింపకున్నను లేదని యెవరనఁగలరు? వస్తువున్నప్పటికి ద్రష్టయొక్క అసామర్థ్యమువలననో దర్శనమునకుఁ బ్రతిబంధకమువలననో వస్తువు కనుపింపకపోవచ్చును. అంతమాత్రమున వస్తువు లేదనఁదగదు. మేఘాచ్ఛాదితుఁడగు సూర్యుఁడు లేడని యెంత వెఱ్ఱివాఁడైనను అనఁడుకద.

అయ్యా! కనుపింపని శశశృంగము లేనిదేకదా? ఔను, నిజమే.కనుపించునదే నిషేధింపఁబడును. విధిగలదానికే నిషేధము. విధిలేనిచోట నిషేధముకూడ సంభవింపదు. ఈగేదెకు కొమ్ములు లేవని చెప్పవచ్చునుగాని, యీపిల్లికిఁ గొమ్ములు లేవని చెప్పవలెనా? పూర్వము కొమ్ములుగల గేదెకు నిషేధము చెప్పఁదగునుగాని, కొమ్ములు సహజముగ నుండనిపిల్లికి నిషేధమెట్లు చెప్పనగును? కనుక ద్వైతము 'ఉన్నది,లేదు' అను వివాదమున కాస్పదమగు వస్తువు నొకదానిని ఒప్పుకొనవలయును. అధిష్ఠానవస్తువు లేనిదే 'అస్తి,నాస్తి' యను వికల్పములు సంభవింపవు, అను నభిప్రాయముతోఁ జెప్పుచున్నారు—'యత ఇతి' ద్వైతము 'కలదు, లేదు' అను వికల్పముల కాధారమగును. ఆద్వైతము కల్పింపఁబడక స్వతఃసిద్ధమైనదని భావము. అద్వైతబ్రహ్మపదార్థము వికల్పముల కాధారమే కాక విలయమున కవధియునగునని చెప్పుచున్నారు—విమర్శము నిర్ణయము లేనిదే ముగియదనునట్లు ద్వైతము అద్వయమందుఁగాని విశ్రమింపదు. కావున, ఇది సర్పమా? పూలమాలికా? యను విమర్శయందు అనుసరించియుండెడి వికల్పనాధిష్ఠానమగు రజ్జుజ్ఞానము అవికల్పమున కవధియగునట్లు సకలవస్తువులను జూచి, యిది కార్యమా? కారణమా? యను వికల్పముల కధిష్ఠానమగు అద్వైతబ్రహ్మవస్తువు తత్తద్వస్తు నిషేధావధిగ నేర్పడునని భావము. ౧౪

దని యంగీకరింపఁబడినది. ఈద్వైతము లేదేని యపుడు విచారము కలుగదు కనుక పరమార్థము నిర్ణయింపఁబడదు. దానిచే విచారింపఁబడక నిశ్చయింపఁబడని తత్త్వము లేకయేపోవును. తత్త్వము నిర్ణయింపఁబడనియెడల పురుషార్థమగు మోక్షము సిద్ధింపదు. అనిర్ణీతస్వభావము నొప్పుకుందువేని అదియే మాచే సత్తు అనఁబడును. విచారించి నిర్ణయింపఁగా సర్వమునకు సత్త్వమే (సత్తే)మిగులును. రెండవయంశములేక సంశయము కలుగదు. సంశయములేక విమర్శకలుగదు. విచారములేక వస్తుతత్త్వము నిర్ణయింపఁబడదు. వస్తుతత్త్వ నిర్ణయములేక పురుషార్థము ఘటింపదు. కావున ద్వైతము విమర్శనిమిత్తము గ్రహింపఁదగినదేకాని యది ప్రమాణసిద్ధముకాదు. ఎట్లన, భ్రాంతిచేత పామును త్రాడనుకొనువానికివలె అసత్యమగు జగత్తును ఆత్మగ భావించువానికి అనర్థములు తప్పవు. కనుక నాయనర్థనివారణకై యావశ్యకమగు విచారము చేయఁదగియుండఁగా, సకలవిశేషములయందును అస్తిత్వము అనుస్యూతమై యుండుటచేతను, విశేషాంశములు మిథ్యాభూతములై నివృత్తములగుటచేతను సన్మాత్రమే శేషించి, కల్పితద్వైతరూపవిశేషాంశము మిథ్యకాకపోదని భావము. ౧౫

అవ. విచారముచేయక సద్వస్తువు సిద్ధింపకపోవచ్చును. దానినిమిత్తము వ్యాపారముచేయునా ? చేయఁడా? చేసినపని క్షణికమగుచు నశ్వరమగును. అను నభిప్రాయముతో వ్యాపారములేని రెండవపక్షమునకు నరశృంగముకంటె భేదము లేదని బౌద్ధుఁడు శంకించుచున్నాఁడు:—

మూ. అసత్సమం చైవ సదిత్యపీతిచే
దనర్థవత్త్వా న్నరశృంగతుల్యతః,

అనర్థవత్త్వం త్వసతి హ్యకారణం
న చైవ తస్మాన్న విపర్యయేఽన్యథా. ౧౬

తా. శ్రుత్యుక్తమగు సత్తుసయితము అర్థక్రియలేనిదగుటవలన నరశృంగమువలె అసత్తే యగునని చూపించిన యనుమానమును దూషించుచున్నారు. అసత్తును సాధించునపుడు అర్థక్రియాభావము సాధనమగునటుల పాదన్యాసాద్యర్థక్రియను కలిగించుటచే కంటకాద్యభావము సత్త్వమును సాధించుటకు సాధనమగు ననెడియుక్తిచే మీవాదము నిరాకరింపఁబడును. ౧౬

అవ. ఈ హేతువు సిద్ధింపదని (సిద్ధాంతి) చెప్పుచున్నాఁడు:—

మూ. అసిద్ధితశ్చాపి విచారకారణా
ద్ద్వయం చ తస్మాత్ప్రసృతం చ మాయయా,
శ్రుతేః స్మృతేశ్చాపి తథా హి యుక్తితః
ప్రసిధ్యతీత్థం న తు యుజ్యతేఽన్యథా. ౧౭

తా. హేతువు విపక్షమం దుండుటవలననేకాక మామతమందు ఆత్మపక్షము సయితము కానందున నీయనుమాన మిచట సిద్ధింపదు. విచారకారణ ముండుటవలన మాయచేతనే సృష్టి కలిగినదని చెప్పెదము. ఇందుకు "మాయాంతు ప్రకృతిం విద్యాన్మాయినంతు మహేశ్వరం" అను(శ్వేతా.౪-౧౦) శ్రుతియు; "మయాఽధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరం" అను (గీత. ౯-౧౦) స్మృతియు, కార్యము వాచారంభణము, మిథ్య, కారణము సత్యము అను యుక్తియుం బ్రమాణములు. ఈవిధమున కూటస్థుఁడు మాయాసంబంధమువలన సృష్టికర్త కాఁదగును గనుక పూర్వపక్షి చెప్పిన హేతుసిద్ధాంతములు యుక్తములు కావు. (ఇచట శాస్త్రార్థము దురవగాహముగాన నింతటితో విరమించఁబడెను.) ౧౭

అవ. సర్వవికల్పకారణమగుటవలన అద్వయము సర్వవికల్పయుక్తము కాదా? యనుశంకకు సమాధానము:—

మూ. వికల్పనాచ్చాపి విధర్మకం శ్రుతేః
పురా ప్రసిద్ధేశ్చ వికల్పతోఽద్వయమ్,
న చేతి నేతీతి యథా వికల్పితం
నిషిధ్యతేఽత్రాప్యపి శేషసిద్ధయే. ౧౮

తా. అద్వయము వికల్పహేతువయినప్పటికిని విరుద్ధస్వభావముకలది కాదని 'నిష్కలం నిష్క్రియ' మిత్యాది శ్రుతులవలన పూర్వసే ప్రసిద్ధమైనది. శ్రుతి 'నేదం యదిదముపాసతే,'(కేన.४.) 'నేతి నేతీ'త్యాదివాక్యములవలన వికల్పితవస్తుజాతమును నిషేధించెనుగాని అద్వయాత్మతత్త్వమును నిషేధింపలేదు. ౧౮

అవ. యథోక్తమగు శ్రుత్యర్థమును వికల్పించువారలు అనర్థమును బొందెదరని చెప్పుచున్నారు:—

మూ. అకల్పితేఽప్యేవ మజేఽద్వయేఽక్షరే
వికల్పయన్తః సదసచ్చ జన్మభిః,
స్వచిత్తమాయాప్రభవం చ తే భవం
జరాం చ మృత్యుం చ నియాన్తి సంతతమ్. ౧౯

తా. భేదవికారసంసర్గరహితుఁడై, అజుఁడు (పుట్టుకలేనివాఁడు), అద్వయుఁడు, అక్షరుఁడు నగు కూటస్థబ్రహ్మమును సత్తు, అసత్తు, సవిశేషుఁడు, నిర్విశేషుఁడు నీ మొదలగు విశేషణములచేత స్వచిత్తమాయా

ప్రభావమున మూఢులై వికల్పించువారలు జరామరణయుతమగు తిర్య
ఙ్మనుష్యజన్మపరంపరలను బొందుచుందురుగాని ముక్తులు కాఁజాలరు. ౧౯

అవ. సద్వస్తువునకు కూటస్థత్వము, అద్వయత్వమును
శ్రుతిప్రమాణసిద్ధము. అటులకాదని అన్యథా వికల్పించుట
భ్రాంతిజన్యమును పురుషాపరాధమునగునని యుక్తిచే దృఢ
పరుచుచున్నారు:—

మూ. భవాభవత్వం తు న చేదవస్థితి
ర్న చాస్య చాన్యస్థితిజన్మ నాన్యథా,
సతో హ్యసత్త్వాదసతశ్చ సత్త్వతో
న చ క్రియాకారక మిత్యతో ఽప్యజమ్. ౨౦

తా. ద్వైతము పుట్టునదా? పుట్టనిదా? ఉభయస్వభావముగలదియా?
అనెడి వికల్పాంశము శుక్తిరజతమువలె మిథ్యయగుటచే పుట్టునది కాదు.
నిత్యమగునెడి ప్రసక్తివలన పుట్టనిదియుంగాదు. ఒకవస్తువునకు విరుద్ధధర్మ
ద్వయము సంభవింపదు కనుక ఉభయస్వభావముగలదియును గాదు. కనుక
నాల్గవదియగు భవాభవత్వము ద్వైతమునకు సంభవించునెదవేని పరస్పర
విరుద్ధములగు జననము అనుత్పత్తి యనునదియును సంభవింపదు. మఱియు,
ద్వైతమునకు ఉత్పత్తియుండునేని తననుండి తనజన్మము కలుగదు కనుక
అన్యవస్తువునుండి జగజ్జన్మమును జెప్పవలసియుండును. ఈయన్యవస్తువు సత్తా?
అసత్తా? అద్వయమునకు జన్మప్రసక్తిలేదు. అసత్తునకు జన్మములేదు. సత్తు
ఉపాదానకారణమగునేని వికారము కలుగఁగా నశించుచు అసత్తే యగును.
అసత్తు ఉపాదానకారణమగునేని ఉపాదానకారణ మున్నదనుటచేత నది
యును సత్తే యగును. కార్యములందు 'అస్తి' యనునదికూడ కలిసియుండును

గాని శూన్యము కార్యములందు అనువర్తించియుండనందున నీశూన్యము కారణము కాఁజాలదు. వస్తువునకు స్వభావవైపరీత్యము లేనందున సత్తు ద్వైత రూపముగఁ బరిణమింపదు. అసత్తు కారణమనుట తగదు. కనుక, ఉత్పత్తినిఁ జెప్ప వీలులేనందున కార్యకారణభావమును బ్రహ్మమునకుఁ జెప్పఁదగదు. ఈ యుక్తివలనను బ్రహ్మము జన్మరహితము అని తెలియవలెను. ౨౦

అవ. ఆత్మవస్తువునకు కార్యకారణభావము లేదనుటనే విశదపరుచుచు జన్మాభావమును సాధించుచున్నారు:—

మూ. అకుర్వదిష్టం యది వాఽస్య కారకం
న కించిదన్యన్నను నాస్త్యకారకమ్,
సతోఽవిశేషా దసతశ్చ సచ్చ్యుతా
తులాం తయో ర్యద్వదనిశ్చయా న్న హి. ౨౧

తా. ద్వైతోత్పత్తికి కారకము వ్యాపారసహితమా? వ్యాపారరహితమా? యని వికల్పించి, చేయనిది కారకమే కాదు. చేయునది కనుక కారకమని వైయాకరణమతము. అట్టి కారకము నిశ్చయముగ నంతటఁ గలదియే కాని లేకపోలేదు. నిష్క్రియబ్రహ్మమునకు కారకత్వము లేదు. ఉండిన యెడల నిత్యమును పనిచేయుచు నుండవలసివచ్చును. కారకమను నెడల నా బ్రహ్మము సత్తయి వ్యాపారమును జేయునా? అసత్తయి వ్యాపారమును జేయునా? ఉభయాత్మకముగఁ జేయునా? సత్తయి చేయునెడల విశేషము లేకపోవలయును. అసత్తై చేయునెడల విశేషము లుండవలెను. విశేషములు లేనియెడల సదా కార్యము కలుగునా? కలుగదా? ఇట్టివికల్పము నిశ్చయింపఁ దగనిదిగ నున్నయది. ౨౧

అవ. వస్తువునకు అవస్థాంతరాపత్తి పరిణామవాదమున నిట్లు చెప్పఁబడెను. ఆవస్తువు సత్తయినను అసత్తైనను అవస్థాంతరమును పొందరాదు కనుక నేదియు కార్యత్వమునుగాని కారణత్వమునుగాని పొందదని చెప్పుచున్నారు:—

మూ. న చేత్స ఇష్టః సదసద్విపర్యయః
కథం భవః స్యాత్సదసద్వ్యవస్థితౌ,
విభక్తమేతద్ద్వయమప్యవస్థితం
న జన్మ తస్మాచ్చ మనో హి కస్యచిత్. ౨౨

తా. సత్తు అసత్తుగ మాఱనియెడల సంసార మెటులఁగలుగును. సద్వస్తువు సద్వస్తువే, అసద్వస్తువు అసత్తే యని యేర్పాటున్నయెడల నీ రెండును పరస్పరముగ నుండవలసి యుండును. కావున నోమనసా! మఱి దేని యొక్కఁయు సృష్టి లేకపోవలసివచ్చును. ౨౨

అవ. ఔఁగాక, ఏవస్తువును పుట్టకపోనిమ్ము. బ్రహ్మాభూతుఁడనగు నాకు (ఆత్మకు) వృద్ధిక్షయములు లేవు. అనఁగా, మనోవ్యాపారములవలన ఆత్మకు లాభనష్టములు లేదని చెప్పుచున్నారు:—

మూ. అథాభ్యుపేత్యాపి భవం తవేచ్ఛతో
బ్రవీమి నార్థస్తవ చేష్టితేన మే,
న హానవృద్ధీ న యతః స్వతోఽసతో
భవోఽన్యతో వా యది వాఽస్తితా తయోః. ౨౩

తా. ఆత్మకు మనోవ్యాపారమువలన హానివృద్ధు లెవ్వియును లేవు. ఏలయన, హానివృద్ధిరహితమై అఖండాకారముగనుండు ఆత్మకు తననుండి కాని అన్యమునుండికాని హానివృద్ధులు కలుగఁజాలవు. ఆత్మయందు హానివృద్ధులుగలవనినను, ఉన్నవానిని మనస్సు చేయనేల? అనెడి యుక్తివలన ఆత్మకు మనశ్చేష్టలతో సంబంధములేదని భావము. ౨౩

అవ. ఆత్మకు హానివృద్ధులతో సంబంధము లేదనుటనే ధ్రువపరుచుచున్నారు:—

మూ. ధ్రువా హ్యనిత్యాశ్చ న చాన్యయోగినో
మిథశ్చ కార్యం న చ తేషు యుజ్యతే,
అతో న కస్యాపి హి కించిదిష్యతే
స్వయం చ తత్త్వం న నిరుక్తిగోచరమ్. ౨౪

తా. స్థిరమగు కూటస్థముగాని అనిత్యపదార్థములుగాని అన్యముతో సంబంధముగలవి కావు. ఏలయన, స్థిరములకు వికారములేదు. అస్థిరములు క్షణికములగుటచే నవి అన్యసంబంధపర్యంతము నుండనేరవు. ఈ స్థిరాస్థిరములు రెండింటికిని పరస్పరసంబంధము లేదు. కనుకనే యేకార్యమును గలుగ నేరదు. వేదాంతగోచరమగు ఆత్మకు దేనితోడను సంబంధములేదని చెప్పరాదందువేని, ఉపాధిసంబంధరహితమగు తత్త్వము ఏపదమునకును వాచ్యము కాదు. కాని, వేదాంతవాక్యములు ముఖ్యవృత్తిని విడిచి లక్షణావృత్తిచే ఆత్మను బోధించుననుట సర్వసమ్మతము. ౨౪

అవ. దుర్నిరూపద్వైతమునకు సాక్షియు, అసంగాద్వయానందరూపమును, స్వయంప్రకాశమానస్వరూపమునగు

ఆత్మను శ్రుతియుక్తులతో నిశ్చయించిన పురుషుఁడు కృత కృత్యుఁడగునని యిట్లు ద్వైతాభాసనిరాకరణఫలమును ఉప సంహరింపుతలంపుతో చెప్పుచున్నారు:—

మూ. సమం తు తస్మాత్సతతం విభాతవ
ద్ద్వయాద్విముక్తం సదసద్వికల్పితాత్,
నిరీక్ష్య యుక్త్యా శ్రుతితస్తు బుద్ధిమా
న శేషనిర్వాణ ముపైతి దీపవత్. ౨౫

తా. బ్రహ్మము వికల్పింపఁబడిన సదసత్తులకు సాక్షియై సదా భాసించు నది. ఇట్టి బ్రహ్మము సాక్షాత్కరించినక్షణమందే మోక్షసిద్ధి యగును. దీపము వెలుఁగునంతనే చీఁకటి పోవుటకు వ్యవధానము లేనట్లు బ్రహ్మసాక్షా త్కారమునకును మోక్షమునకును వ్యవధానములేదని భావము. ౨౫

అవ. ఇట్లు నిరూపింపఁబడిన ఆత్మతత్త్వనిరీక్షణము విష యముగ నగునా? అవిషయముగ నగునా? యను ప్రశ్నమునకు అవిషయముగనే యగునని చెప్పుచున్నారు:—

మూ. అవేద్యమేకం యదనన్యవేదినాం
కుతార్కికాణాం చ సువేద్య మన్యథా,
నిరీక్ష్య చేత్థం త్వగుణగ్రహోఽగుణం
న యాతి మోహం గ్రహదోషముక్తితః. ౨౬

తా. సర్వసాక్షియగు ప్రత్యగాత్మ అద్వయబ్రహ్మముకంటె నన్యముకాదనెడి ఎఱుకగలవారలకు అవిషయముగనే వేద్యమగును. భేద బుద్ధితో విషయముగను పరిచ్ఛిన్నముగను ఎంచు కుతార్కికులకు వేద్యము

కాదు. శాస్త్రయుక్తివిచారప్రయాసములేక స్వబుద్ధ్యనుసారముగఁ దెలియఁ దగినది. సత్త్వరజస్తమోగుణములందును వాని కార్యములగు దేహాదికార్య జాతమందును అభిమానములేని గురుపుత్త్రుఁడు గుణకార్యవిశేషరహితమగు ఆత్మతత్త్వమును అవేద్యముగ నాలోచించి, అపరోక్షానుభూతిగలవాఁడై భ్రమజెందఁడు. ఏలయన, మోహకారణమగు అజ్ఞానము తత్కార్యసహిత ముగ బాధింపఁబడుటవలన 'సాక్షాదపరోక్షాద్బ్రహ్మ' యను శ్రుత్యర్థమనన ముచేత నిత్యాపరోక్షప్రత్యగాత్మ పరమాత్మయే యని భావించుచు ఆనంద మగ్నుఁడగునని భావము. ౧౯

అవ. విషయము (గోచరము) కాని యీ బ్రహ్మమును మహాప్రయత్నముతో ఏల తెలియవలెను? అను ప్రశ్న కుత్తరము:—

మూ. అతోఽన్యథా న గ్రహనాశ ఇష్యతే
విమోహబుద్ధేర్గ్రహ ఏవ కారణమ్,
గ్రహోఽప్యహేతుస్త్వనలస్త్వనిన్ధనో
యథా ప్రశాంతిం పరమాం తథా వ్రజేత్.

తా. మిథ్యాజ్ఞానము ఆత్మజ్ఞానమువలననే కాని ప్రకారాంతరముగ తొలఁగదు, అని "నాన్యః పంథా విద్యతేఽయనాయ" యను శ్రుతి ఘోషిం చుచున్నది. పోనిమ్ము మిథ్యాజ్ఞానముండెనేని దానివలన హానియేమి? అనిన, విమోహబుద్ధికి మిథ్యాజ్ఞానమే కారణము. మిథ్యాజ్ఞాన ముండునంతవఱకు దేహమందు 'నేను' అనెడి అహంతయుఁ, గేహాదికమందు 'నాది' యనెడి మమతయు నుండకమానవు. కావున జ్ఞానప్రతిబంధకములగు నీఅహంకార మమకారము లుండఁగా మోక్షమెంతమాత్రమును సిద్ధింపదు. సరే, మిథ్యా

జ్ఞానము తొలఁగఁగా మోహమును తొలఁగవచ్చును. కాని, మిథ్యాజ్ఞానము బ్రహ్మాత్మజ్ఞానమునుండియే కలుగరాదా? యనిన, ఆమిథ్యాజ్ఞానము స్వవిరోధియగు జ్ఞానమునుండి కలుఁగుననరాదు. అజ్ఞానము మాత్రమే తొలఁగవలెనను నియమము లేదు. మఱియేమన అజ్ఞానకార్యమగుటవలన మిథ్యాజ్ఞానము సయితము తనకుఁ గారణమగు అజ్ఞానముతోడనే తొలఁగును. ఎట్టులన స్వకారణమగు అజ్ఞానము తొలంగఁగనే మిథ్యాజ్ఞానముసయితము కట్టెలులేని వహ్నివలె తనంతట ప్రశాంతినొందును. ఇదియే మోక్షము. ౨౭

అవ. ప్రకరణసమాప్తియందు గురునమస్కారపూర్వకముగ మంగళము నాచరించుచున్నారు:—

మూ. విమథ్య వేదోదధితః సముద్ధృతం
సురైర్మహాబ్ధేస్తు యథా మహాత్మభిః,
తథాఽమృతం జ్ఞానమిదం హి యైః పురా
నమో గురుభ్యః పరమీక్షితం చ యైః. ౨౮

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీగోవింద
భగవత్పూజ్యపాదశిష్యస్య శ్రీమచ్ఛంకరభగ
వతః కృతౌ ఉపదేశసాహస్ర్యాం
పద్యప్రబంధః సమాప్తః.
ఓం తత్సత్.



తా. పూర్వము దేవతలు క్షీరసాగరమును మథించి అమృతమును స్వీకరించినట్లు, మహానుభావుఁడగు నేగురుమూర్తి వేదమనెడి సముద్రమును మథించి (శోధించి) యీ ఉపదేశసాహస్రియను ప్రకరణగ్రంథప్రతిపాదిత జ్ఞానామృతము నుద్ధరించెనో, ఏమహాత్ములవలన పరమాత్మతత్త్వసాక్షాత్కారమును బొందితినో; అట్టి గురువర్యులకు నమస్కారము.

ఇది ఆత్మమనస్సంవాదప్రకరణము.

ఇది శ్రీకృష్ణతీర్థశిష్య శ్రీరామతీర్థవిరచిత పదయోజనికానామవ్యాఖ్యానము ననుసరించి వ్రాయఁబడిన ఆంధ్రతాత్పర్యము.

ఉపదేశసాహస్రి సమాప్తము.

---

ఏషోపదేశసాహస్ర్యాః కృపయాఽకారి సద్గురోః,
వివృతిః పేరివంశ్యేన సుబ్రహ్మణ్యవిపశ్చితా.

క్వాహం మందమతిః శ్రీమచ్ఛంకరాచార్యవాక్యవః?
గభీరార్థాఽత్ర ప్రాపత్తే కృపయా వివృతౌ గురోః.

అజ్ఞానానవధానాభ్యాం జాతా దోషా బుధైరిహ,
క్షమ్యంతాం సంస్క్రియంతాంచ వంద్యాయేస్యుస్సదాభువి.

గచ్ఛతః స్ఖలనం క్వాపి భవత్యేవ ప్రమాదతః,
హసంతి దుర్జనాస్తత్ర సమాదధతి సజ్జనాః.

ఓం తత్సత్.

సుజనవిధేయః,

సుబ్రహ్మణ్యనామధేయః.

శ్రీః

# ఉపదేశసాహస్రి

## పారిభాషికపదవివరణము.

### అ

అంజసా = యథార్థముగ

అకార్యశేషం = కర్తృత్వాభిమాన రహితము

అకృతం = సిద్ధబ్రహ్మము

అక్రియం = పనిచేయనిది

అక్షరం = కారణము (నశింపనిది)

అక్షరః = నశింపని

అఖండం = పరిపూర్ణము

అజ్ఞాసిషం = తెలిసికొంటిని

అంతర్ముఖః = సద్గురూక్తలక్ష్యదృష్టి గలవాఁడు

అచక్షుష్ట్వం = భౌతికదేహాదిరాహిత్యము

అచితిమత్ = జడము

అచక్షుష్కం = కన్నులులేనిది

అజం = పుట్టనిది

అజరః = ముదిమిలేనిది

అజః = పరమాత్మ (పుట్టుకలేని)

అద్ధా = సాక్షాత్తుగ

అధిగమః = ప్రాప్తి

అధిగతం = పొందఁబడినది

అధిదైవం = దిగ్వాతాదితద్దేవతలు

అధిభూతం=శబ్దస్పర్శాదితద్గుణములు

అధ్యస్తం = ఆరోపితము

అదేహః = దేహాభిమానరహితము

అదృశిః = జడము

అధిష్ఠితం = ఆరోపింపఁబడినది

అధ్యక్షః = సాక్షి

అధిష్ఠానం = పదార్థముల కాధారము

అద్వయః = ఏకము

అదేహత్వం = ముక్తి

అధ్యాత్మ=శ్రోత్రాదీంద్రియములు

అధ్యాసః =శుక్తియందురజతభ్రాంతి వలె ఆరోపణము కానిది యదా ననుకొనుట

అనతిశంక్యం = శంకింపఁదగనిది

అనధ్వగః= (అర్చిరాది) మార్గమును బొందనివాఁడు

అనన్వాగతం = వెంటరానిది
అనన్యత్వం = ఏకత్వము
అనవస్థా = హద్దులేమి
అనన్యదృక్ = ఆత్మేతరమును జూడ నివాఁడు
అనన్య వేదనః= ఇతరము చేఁ దెలియఁబడనిది
అనన్య వేదీ=ఐక్యజ్ఞానము గలవాఁడు' ఆత్మేతరవృత్తిలేనివాఁడు
అనన్యః = ఏకము
అనవస్థా = హద్దు లేకపోవుట
అననురూపం = అయుక్తము
అనవచ్ఛిన్నం = ఆవరణరహితము
అనుకృతిః = సామ్యము
అనుగతం = వెంబడించునది, వెంట వచ్చునది
అనుపపత్తిః = యుక్తిలేమి
అనువాదః = మఱల చెప్పుట
అనుమతిః = అంగీకారము
అనార్జవం = కుటిలమార్గము
అనామయః = బాధలేమి
అనాత్మతా = దేహాభిమానము
అనుపాధికః= సర్వవ్యవహారాతీతుఁడు
అనుమానం = ఊహ
అనుబంధము = విషయప్రయోజనాదుల కలిమి
అనుగతం = వెంబడించినది
అనువృత్తిః = అనుసరణము

అనుభావః = శక్తి
అనుభవః = సాక్షి
అనుభూతిః = అనుభవము
అనువిధాయిత్వం = అనుకారము, పోలిక
అనుపకారి = నిరర్థకము
అనేకత్వబుద్ధి = అవిద్య
అన్యార్థా = ఇతరార్థము
అన్యదృష్టిః = అవిద్య, అజ్ఞానము
అన్యదృష్టిసముద్భవః= పరాధీనముగఁ గలుగునది, అజ్ఞానమువలనఁబుట్టునది
అన్వయీ = అన్నియవస్థలందు నుండునది
అన్యతంత్రం = అన్యాధీనము
అన్యధీహ్నుతిః = ఆత్మేతరనిషేధము
అపరం = కారణముకానిది
అపాయః = నాశము
అప్రహాణం = విడువకుండుట
అపృథక్ = ఏకము
అపహతిః = భంగము
అపోఢం = తీసివేయఁబడినది
అపోహనం = నివారణము
అపూర్వం = కారణములేనిది
అభావరూపం = శూన్యము
అభావః = అసత్తు
అబద్ధచక్షుః = మాయావరణలేని చైతన్యము

అభియుక్తాః = ఆర్యులు
అభిన్నత్వం = ఏకత్వము
అభ్యుపేతం = అంగీకరింపఁబడినది
అభ్యుపగమః = ఒప్పుదల
అభ్యుపేయం = ఒప్పఁదగినది
అభ్యతివృత్తః = విభజించి వేఱుగనుం డువాఁడు
అభీప్సితం = కోరఁబడినది
అమనస్కః = మనఃసాక్షి
అమ్మయః = జలవికారము
అమూర్తం = ఆకారములేనిది
అమృదుత్వం = కఠినము
అమృతతాశా = మోక్షాశ
అయనం = ప్రాప్తి
అరాగద్వేషః = పక్షపాతము లేనివాఁడు
అర్థవత్త్వం = సార్థకము
అర్థశూన్యం = నిష్ఫలము
అలాతచక్రం= కొఱవిని వేగములో త్రిప్పఁగా కనుబడు అగ్నిచక్రము
అలుప్తం = లోపింపనిది
అలుప్తచిత్ = } అవస్థాత్రయసాక్షి
అలుప్తదృక్ = }
అవగతం = తెలియఁబడినది
అవగతిః = జ్ఞానము
అవభాసః = స్ఫురించుట
అవచ్ఛేదః = కూడిక [గుట
అవయవిత్వం = అవయవములు గలు
అవస్థాంతరం = మాఱుట
అవసానం = నిశ్చయము
అవభాసః = స్ఫూర్తి
అవికల్పః = సిద్ధబ్రహ్మము
అవికారిత్వం = వికారరహితము
అవిక్రియః = కూటస్థుఁడు
అవిద్య = అజ్ఞానము
అవేద్యం = గోచరముకానిది
అవ్యాకృతం = కారణమగుమాయ
అశ్రుతం = వేదవిహితముకానిది
అసత్ =దృగ్గోచరముకానిది (అమూర్తము)
అసత్త్వవాదిన్ = ఓ మిథ్యావాదీ
అసద్వయం = ద్వితీయములేనిది
అసదంతం = శూన్యము
అసంకీర్ణం = వేఱగునది
అసంగః = దేనిని నంటనిది [వాఁడు
అసద్ధాతా = జడమును నుపేక్షించు
అసమాధిః = బాహ్యదృష్టి
అసితః = ముక్తుఁడు
అస్థితా = స్థితి
అహంగ్రాహప్రతిపత్తిః = నేననెడి జ్ఞానము
అహంమానం = అభిమానము

ఆ

ఆత్మజ్ఞః = ఆత్మవిద్
ఆత్మనిష్ఠః = నిరంతరాత్మావలోకనము గలవాఁడు

ఆత్మప్రత్యాయకః = ఆత్మజ్ఞానమందు దృఢవిశ్వాసముగలవాఁడు

ఆత్మలాభః = జ్ఞానప్రాప్తి

ఆత్మహా = అజ్ఞాని (మహాపాతకి)

ఆత్మాభాసః = ఆత్మవలెఁ దోఁచునది

ఆత్మైక్యజ్ఞానం = జీవాత్మ, బింబభూతుఁడగు పరమాత్మకంటె నన్యుఁడు కాఁడని తెలియుట

ఆధిః = మనోవికారము

ఆనర్థక్యం = నిష్ఫలత్వము

ఆపరోక్ష్యం=ప్రత్యక్షముకాకుండుట

ఆప్యం = పొందఁదగినది

ఆభాసః =లేనిది యున్నట్టుతోఁచుట

ఆరూఢః = దృఢజ్ఞాని

ఆలోకః = ఆత్మజ్ఞానము

ఆస్తికః = పరమాత్మయందు నమ్మకముగలవాఁడు

ఇ

ఇతరః = జడము

ఇతరానపేక్షత్వం=అన్యమును గోరకుండుట

ఇతరేతరం = సదసత్తులకూడిక (పరస్పరము)

ఇతరేతరహేతుత్వం = పరస్పరము కారణమగుట

ఈ

ఈక్షితృత్వం = చూచుట

ఉ

ఉత్పన్నాత్మధీః = సత్యాత్మజ్ఞానము గలవాఁడు

ఉద్భూతిః = పుట్టుక

ఉన్మీలనం = వికాసము

ఉపకార్యోపకారకభావః = ఉపకారమును బొందుటయు, చేయుటయు

ఉపచారః = లక్షణావృత్తిచేఁ జెప్పుట

ఉపధానం = ఉపాధి

ఉపనిషత్ = బ్రహ్మము, బ్రహ్మబోధక వేదాంతవాక్యములు

ఉపపత్తిః = యుక్తి

ఉపపన్నం = యుక్తము

ఉపలంభః = అనుభవము

ఉపలంభకం = పొందించునది

ఉపలభ్యం = ప్రాప్తవ్యము

ఉపలబ్ధి = జ్ఞానము

ఉపసత్తి = ఆశ్రయించుట

ఉపస్కారః = యుక్తులతోఁ జెప్పుట

ఉపాదానం = ముఖ్యకారణము

ఉపాదేయం = గ్రాహ్యము

ఉపాధిః = ఆత్మప్రతిబింబాధారశరీరము

ఉల్ముకం = కొఱవి

ఏ

ఏకకాలతా= అనేకవస్తువులు ఒక్క కాలమందు గలుగుట

ఏకత్వాన్యధియా=ఏకత్వబుద్ధి (విద్య) అనేకత్వబుద్ధియు

ఏకనీడత్వం = రెండును ఒకచోటు ననే యుండుట

ఏకరసః = తన్మాత్రము (మాఱులేనిది)

ఐ

ఐకాగ్ర్యం = వేదాంతప్రోక్త పరమార్థమందు మననముచే మనస్సును నిలుపుట

క

కరణం = ఇంద్రియము

కర్త = చేయువాఁడు

కర్తృతంత్రం=సాధ్యమగు కార్యము

కర్మకర్తృత్వం=ఒకప్పుడు కర్మయు, మఱియొకప్పుడు కర్తయునగుట

కల్ప్యః = ఊహించి చెప్పఁబడునది

కాణాదాః = తార్కికులు

కూటస్థః = జననాది వికారరహిత పరబ్రహ్మము

కృష్ణలాః = సువర్ణఖండములు

కృతం = } జగత్తు<br>కృతకం = }

కృతకృత్యః = జ్ఞాని

కైవల్యం = ఏకత్వము (మోక్షము)

కౌటస్థ్యం = వికారములులేమి

క్రియాహేతుః } క్రియచేసాధింపఁదగిన దేహప్రాప్తి<br>దేహయోగః }

క్షణికం = శీఘ్రముగ నశించునది

క్షరం = నశించునది

క్షేత్రం = శరీరము

ఖ

ఖండం = వ్యక్తి

గ

గుణః = ముఖ్యముకానిది

గుణవత్ =గుణముగలది(ప్రధానము)

గుహా = కోశపంచకము

గోచరః = ఇంద్రియములచేఁ దెలియఁబడునది

గోప్యం = వివరింపఁదగనిది

గౌణార్థః = ముఖ్యముకానిది

గ్రహః = గ్రహించుట

గ్రహదోషముక్తిః = కార్యసహితమగు అజ్ఞానమునుండి తొలఁగుట

గ్రహణం = స్వీకారము

గ్రహనాశః = మిథ్యాజ్ఞాననివృత్తి

గ్రాహకః = గ్రహించెడివాఁడు

గ్రాహకాస్తిత్వం = గ్రహించెడివాఁడొకఁడుండుట

గ్రాహ్యం = గ్రహింపఁదగినది

చ

చలః = అనిత్యము

చాక్షుషాః = దృశ్యములు

చికిత్సితం = కుదర్చఁబడినది

చితిః = చైతన్యము

చిన్మాత్రః = జడసంపర్కములేని
చిన్మాత్రజ్యోతిః = నిరంతరప్రకాశ స్వరూపము
చేతా = ప్రవర్తకుఁడు
చోదితం = వేదవాక్యములచే విధింపఁబడినది
చైతన్యాభాసః = చిదాభాసుఁడు (జీవుఁడు)

జ

జన్యతా = ఉత్పత్తి
జలార్కవత్ = నీటిలో ప్రతిఫలించిన సూర్యునివలె
జిజ్ఞాసా=(ఆత్మను) తెలియఁగోరుట
జిజ్ఞాసుః = ఆత్మను తెలియఁగోరు ముముక్షువు
జ్ఞః = ఆత్మ (తెలియువాఁడు)
జ్ఞప్తిః = చైతన్యము
జ్ఞాతా = ధీసాక్షి
జ్ఞానైకార్థపరత్వం = తత్త్వబోధప్రధానముగనుండుట
జ్ఞేయం = ఇంద్రియములకు గోచరమగునది
జ్ఞేయాభ్యతీతం = ప్రకాశ్యములగు జడవస్తువులను మీఱినది

త

తటస్థలక్షణం= కార్యముచే నూహింపఁబడుచు నప్పటికిమాత్రమే కనిపించెడిగుర్తు
తన్నిభం = దానివంటిది
తత్పరత్వం } దానియందలి
తాత్పర్యం } ఆత్యాశ
తప్తాయోవిస్ఫులింగః =కాల్పఁబడిన యినుమునుండి వెడలు (అగ్నికిరణములు)
తమః = అజ్ఞానము
తాదాత్మ్యం = ఏకత్వము
తాదర్థ్యం = చిదాత్మను దెలియుటకై చేయు కృషి
తిఙ్వాచ్యః=ప్రత్యయముచేఁ జెప్పఁదగినయర్థము
తుల్యనీడత్వం = రెండుధర్మము లొకదానియం దుండుట
తృష్ణోద్భవక్రియః = ఆశవలన పనిచేయువాఁడు

ద

దగ్ధా = కాల్చెడివాఁడు
దధిభావః = పెరుగగుట
దర్శనం = చూపు
దార్ష్టాంతికం = ప్రకృతాంశము
దాహకం = కాల్చునది
దాహ్యం = కాల్పఁదగినది
దాహశక్తిః = కాల్చునట్టిశక్తి
దినకృచ్ఛార్వరమివ = సూర్యుఁడు చీఁకటిని పోఁగొట్టునట్లు
దుస్సంపాదః = కుదురనిది

దృశిః = ఆత్మ
దృశిస్వరూపం = సకలవికారసాక్షి
దృశిసంక్రాన్తిః = చిత్ప్రతిబింబము
దృశ్యం = చూడఁబడునది, లోకము
దృశ్యతః = కనుపించుటవలన
ద్రష్టా = చూచువాఁడు

ధ

ధీః = బుద్ధి
ధీప్రత్యగాత్మా = (బుద్ధి) ప్రతిబింబిత జీవుఁడు

న

నరశృంగః = కుందేటికొమ్మువలె లేనిది
నశ్వరం = నశించునది
నిఃశ్రేయసం = జననమరణాది దుఃఖరహితమగు ముక్తి
నిత్యదృష్టిః = చైతన్యప్రకాశము
నిత్యముక్తః = కూటస్థుఁడు
నిత్యావగతిః = సత్యజ్ఞానము
నిరుపాఖ్యః = నిర్వచింపరానిది
నిర్దుఃఖవాచి = పరమానందబోధకము

ప

పక్తిః = ఫలకాలము
పరః = అన్యము, వ్యాపకము
పరాపోహః = అన్యమును నిరాకరించుట
పరార్థప్రవృత్తిః = పరోపకారము చేయుట
పరిణామీ = మాఱునది
పరిమితం = ఖండము
పరిహారః = విడుచుట
పర్యవసన్నం } ఫలితము, సిద్ధము
పర్యవసానం }
పారగః = దాఁటినవాఁడు
పారమార్థికదృష్టిః=తత్త్వవిమర్శనము
పారార్థ్యం = అన్యులనిమిత్తము
పారివ్రాజ్యం = సంన్యాసము
పారోక్ష్యం = కంటికి దూరమైనది
ప్రకాశితా (బు) = సాక్షి
ప్రకాశ్యం = జడవస్తువు
ప్రచారః = ఆచరించుట
ప్రజ్ఞానైకరసః = కేవలచిదాత్మ
ప్రతిపత్తి = జ్ఞానము
ప్రతిలోమం = వ్యతిరేకము
ప్రతిషిద్ధః = నివారింపఁబడినది
ప్రతీతిః = జ్ఞానము
ప్రత్యక్ = దృశ్యవిలక్షణము
ప్రత్యయానన్వయినిష్ఠత్వం = వృత్తిమదహంకారస్థితి
ప్రత్యక్షం = ఎదుటనున్నది
ప్రత్యగ్దృశి = చైతన్యము
ప్రత్యభిజ్ఞః =ఇది యదేయనుకొనుట
ప్రత్యయః = జ్ఞానము
ప్రత్యయీ = అహంకారము
ప్రత్యాయనం = నమ్మించుట
ప్రబోధరూపం = జ్ఞానస్వరూపము
ప్రమా = సత్యబుద్ధి

ప్రమాతృత్వం = జ్ఞానము
ప్రసంఖ్యానం = వివిచ్యకథనం (ఏర్పఱిచి వివరించుట)
ప్రవేదనం = బోధ
ప్రసంచక్షీత = విభజింపవలయును
ప్రలోభనం = లోకవ్యవహారము, అత్యాశ
ప్రసృతం = సంసారము
ప్రసృతిః = సృష్టి
ప్రహాణం = విడుచుట
ప్రాగసత్త్వం = మునుపు లేకుండుట
ప్రేష్ఠః = మిగుల ప్రియము

బ

బంధః = జననమరణరూప సంసారబంధము
బద్ధాక్షః = మాయావృతమైన జ్ఞానముగలవాఁడు
బహిర్ముఖాః = దేహాత్మవాదులు
బోద్ధా = సకలవికారసాక్షి
బ్రహ్మ = పరిపూర్ణము

భ

భక్తిః = స్వస్వరూపానుసంధానము
భారూపః=నిత్యప్రకాశస్వరూపుఁడు
భావః = సత్త, స్థితి
భాసకం = ప్రకాశింపఁజేయునది (ఆత్మ)
భాస్యం = ప్రకాశింపఁజేయఁబడునది
భాస్వరం = ప్రకాశకము
భూతిః =ఉత్పత్తి
భూమా = పరిపూర్ణబ్రహ్మము
భ్రమః = తిరుగుట, భ్రాంతి
భ్రామకః = స్వసన్నిధిమాత్రమున నడిపించునది

మ

మమాహంతా = మమకారము (నాదియనుట), అహంకారమును (జడమగు దేహాదికము తానని తలఁచుట)
మానస్యం= చిత్తమునందుఁ గలుగునది
మిథః = పరస్పరము
ముముక్షుః = ముక్తినొందఁగోరువాఁడు
మూర్తం = ఆకారముగలది
మూషాసిక్తం = మూసలోఁబెట్టి కరిగినలోహము
మృషా = అసత్యము
మృష్టాన్నధ్వస్తతృట్ = మృష్టాన్నము దినుటవలన నాకలి తీరినవాఁడు

య

యదాభాసః= ఏయాత్మప్రతిబింబము
యావద్ధర్మః = అన్నిధర్మములుగల
యౌగపద్యం = ఒక్కసారిగ ననేకములగుట

ల

లక్ష్యార్థః = శబ్దముచేఁ జెప్పఁదగనిది

లింగం = హేతువు; సూక్ష్మశరీరము
లోకాయతికాః = వేదబాహ్యులు
లోహితాభాసః = ఎఱ్ఱదిగనున్నట్లు తోఁచునది

వ

వర్ణ్యం = ప్రకృతాంశము
వర్ణిత్వాదికం = కర్మములకు హేతువులగు బ్రహ్మచర్యాద్యాశ్రమములు
వస్తు = ఆత్మ
వస్త్వంతరాఽఽపత్తిః = మాఱురూపమును బొందుట
వహ్న్యుష్ణం = అగ్నిచేఁ గాల్పఁబడినది
వాంతః = బహిర్భూతము
వాక్యార్థః = పదసముదాయజన్యార్థము
వాక్యార్థప్రతిపత్తిః = అవాంతరవాక్యసహాయము
వాచారంభణం = వ్యవహారక్షమములగు జడానృతనామరూపములు
వాచ్యార్థః = ముఖ్యార్థము
వాసనా = పూర్వసంస్కారము
వికల్పనా = వివిధముగఁ గల్పింపఁబడెడిజగత్తు
వికారి = మాఱునది
విజ్ఞాతా = తెలిసికొనువాఁడు, ప్రత్యగాత్మ
విక్షేపః = బహిర్దృష్టి, బాహ్యవిషయములను గోరుట
విజ్ఞాతా = ఆత్మ
విజ్ఞాతిః = జ్ఞానము
విజ్ఞానం = విశిష్టజ్ఞానము
విద్యా = ఆత్మజ్ఞానము, నిర్వికారాత్మబుద్ధి
విద్వాన్ = ఆత్మజ్ఞాని
విధర్మతః = విరుద్ధాంశమువలన
విధీనాం ప్రయోజకః = విధులను ప్రవర్తింపఁజేయు నభిమానము
విపర్యయః = విపరీతగ్రహణము
విపర్యాసః = అదికానిదానిని అదియనుకొనుట
విభు = అంతటను నిండియున్నది
విమర్శనం = పూర్వోత్తర సంబంధమును పరిశీలించుట
విలక్షణం = విరుద్ధస్వభావముగలది
విలక్షణవివక్షా = విరుద్ధ విమర్శనము
వివక్షితం = చెప్పఁదలఁచినది
వివర్తకారణవాదః = వస్తువు మాఱకయే అన్యవస్తువుగ దోఁచుట
వివిక్తం = వేఱ్వేఱ గ్రహింపఁబడినది
వివిదిషా = తెలియవలెననెడి కోరిక
వివిదిషుః = తెలియఁగోరువాఁడు
విషమం = యుక్తముకానిది
విషయాః = దృశ్యములగు జడములు
విషయీ = ఆత్మ
విషయాంజనాః = దృశ్యాకారములు
విహితకర్మ = వేదచోదితకర్మ

వేదితా = తెలియువాఁడు
వైధర్మ్యం = విరుద్ధధర్మములు కలుగుట
వైశేషికాః = తార్కికులు
వైషమ్యం = హెచ్చుతగ్గులు
వ్యంగ్యం = ప్రకాశింపఁజేయఁబడునది
వ్యంజకః = ప్రకాశింపఁజేయునది
వ్యతికీర్ణః = కలిసియున్నది
వ్యభిచారిణః = మాఱునవి
వ్యాజం = మిష, నెపము
వ్యాపకం = అంతటనుండునది
వ్యాపారవత్ = పనిచేయునది
వ్యాపీ = అంతటను నిండియున్నది
వ్యాప్తం = కూడినది
వ్యావృత్తం = మఱలినది
వ్యావృత్తిః = తొలఁగుట

శ

శరీరమాలా = దేహపరంపర
శాబ్దం = శబ్దవాచ్యము
శుక్రం = ప్రకాశస్వభావము
శ్రుతత్యాగః = వేదవిహిత కృత్యమును విడుచుట
శ్రుతిస్మృత్యనుగృహీతం = శ్రుతిస్మృతులచే నుడువఁబడినది

ష

షడూర్మిమాలా = జననమరణక్షుత్పిపాసాశోకమోహములు

స

సంఘాతః = పాంచభౌతికశరీరము
సంచితం = గతజన్మములందు జేసిన కర్మసంఘము
సంతతభావః = ఎల్లప్పుడు నుండుట
సంన్యాసినః = చిత్తమును ఆత్మయందే నిలుపువారలు
సంభావితం = కల్పితము
సంవిత్ = చైతన్యము
సంసృతిః = జననమరణరూపసంసారము
సంహతం = కలిసియున్నది

స

సత్ = సత్యము
సత్యార్థీ = శాశ్వతబ్రహ్మపదాపేక్షి
సదావృతిః = నిత్యబోధాత్మ
సదాప్రభాతః = నిరంతరమును ప్రకాశించువాఁడు
సద్గ్రహః = తానా బ్రహ్మమే యని యెఱుఁగుట
సనాతనః = నిత్యసిద్ధము
సన్నద్ధాః = సిద్ధమగువారలు
సన్నిహితం = దగ్గఱనున్నది
సఫలవిజ్ఞానం = మోక్షమునిచ్చు దృఢజ్ఞానము
సబాహ్యాభ్యంతరం = లోపలను వెలుపలను తానై నిండియున్నది

సభయం = భయహేతువగు భేదబుద్ధిగలసంసారము
సమధిగమ్యం = తెలియఁదగినది
సమవేతం= ద్రవ్యమునందలి గుణక్రి[యలు
సమాధానం = ధ్రువపర్చుట
సమాధిః = అంతర్దృష్టి
సమ్యజ్జ్ఞప్తిః = సుజ్ఞానము
సర్వకృత్ = ఉపాధివశమున నన్నిఁటిని జేయుఆత్మ
సర్వకృత్త్వం = సూదంటుఱాయివలె స్వసన్నిధిమాత్రాన సకలవ్యాపారములను జేయించుట
సర్వగ్రాసి=అంతను మ్రింగునది [పము
సర్వదాదృశిః=అలుప్తప్రకాశస్వరూ
సర్వదైన్యోద్భవః = పూర్ణమగు ఆశ
సర్వవ్యాపి = అంతటనునిండినది
సర్వాంతరం= అన్నిటికంటెను లోనిది
సవికారబుద్ధిః = సంకల్పవికల్పములుగలబుద్ధి
సాపేక్షం= క్రియవలనఁగలిగిన జగత్తు
సామానాధికరణ్యం = రెండుధర్మములు ఒకవస్తువునందుండుట

సుషిః = రంధ్రము (ఆకాశము)
సూక్ష్మం = తెలియశక్యముకానిది
సైంధవఘనః = ఉప్పుగడ్డ (ఏకత్వమునకై ఉపమానము)
స్థితాలోకః = పూర్ణమగు వెలుఁగు
స్పృష్టిః = తాఁకుట
స్మృతిః = గడచినదానిని తలంచుట
స్వగతధర్మః=తనయందుండుధర్మము
స్వచ్ఛందః = ఒకనియధీనముకాకుండుట
స్వయంజ్యోతిః= } అన్యాపేక్షలేని
స్వయంప్రభః = } బ్రహ్మము
స్వయంలబ్ధస్వభావః = జన్మింపనిది.
స్వారాట్ = ఆత్మారాముఁడు
స్వరూపం } = ఆత్మ
స్వస్వరూపం }

హ

హీనవృద్ధీ = వృద్ధిక్షయములు
హితం = ఫలకాలమున క్షేమకరము
హేయం = విడువఁదగినది